

ఓం నమోభగవతే శ్రీమదుమామహేశ్వరాయ
శివాయ గురవే నమః

# శ్రీ శంకరానందగిరి గురువరచరిత్ర

రచయిత:

శ్రీ చంద్రశేఖరానందగిరి స్వామి

పరిష్కర్త:
విద్వచ్ఛిరోమణి, వేదవిద్యా వినీత
శ్రీ యం. బాలవిశ్వనాథశర్మ, బి.ఏ. సంస్కృత లెక్చరర్,
అనంతపురము

శ్రీ ఉమామహేశ్వర గురుపీఠము,
శ్రీక్షేత్ర ఉమామహేశ్వరాశ్రమము,
లత్తవరము (వయా ఉరవకొండ)
(అనంతపురము జిల్లా)



4 వ ముద్రణ
1988

శ్రీ ఉమామహేశ్వరాశ్రమము
తిలక్ నగర్, గుంతకల్లు-2



ముద్రణ : పి. రామకృష్ణమూర్తి
వెల్కమ్ ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్
బ్రాడీపేట : గుంటూరు-2. ఫోన్ : 81086.

# విషయసూచిక

# అభిప్రాయములు

నెం. 2540/20-5-55

శ్రీజగద్గురు విశ్వారాధ్యః ప్రసీదతు

శ్రీమద్వేదాగమోపనిషత్పురాణేతిహాస ప్రసిద్ధవిమల వీరశైవ మహామత స్థాపనాచార్యవర్య సమస్త పవిత్ర క్షేత్ర మస్తకమణీభూత శ్రీమద్వారణాసీ మహాక్షేత్ర మధ్య విద్యోతమాన శ్రీమద్విశ్వేశ్వరలింగగర్భావిర్భూత శ్రీమజ్జగద్గురు విశ్వారాధ్య గురుపరంపరాగత హరికేశనందనవన విరాజమాన జంగమ వాటికా మహామఠాధిష్ఠిత జ్ఞానసింహాసనాధీశ్వర

## శ్రీ౧౦౮ జగద్గురు విశ్వేశ్వర శివాచార్య మహాస్వామినాం దివ్యసన్నిధానేన-

శ్రీగురువర చరణ నఖ చంద్రసాంద్ర రుచిరుంద్ర చంద్రికా చంచచ్చకోరాయ మాణులగు కుందనగుర్తి శివలింగాశ్రమ భక్తులకు అనేక శుభాశీర్వాద పూర్వకముగ సెలవిచ్చున దేమనగా :

మీ రందఱు ఆత్మోద్ధారమునకై పరశివ తత్త్వ చింతన జేయుచు శ్రీశంకరానందగిరిస్వాములవారి సదాచార సత్యనిష్ఠ జీవన చరిత్రమును ప్రకటించు విషయము విదితమై మహదానందమయ్యెను. శ్రీశంకరానందగిరిస్వాములవారు నైష్ఠికబ్రహ్మచారులై బాల్యకాలము నుండియు శివజీవైక్యరూపమగు ఆధ్యాత్మిక జీవనము నంగీకరించినారు.

అశాంతిమయ వాతావరణముతో కూడిన భౌతిక మార్గమున జిక్కి కింకర్తవ్యతా మూఢులైన సాధారణ జనులకు "ధర్మోరక్షతి రక్షితః" "సర్వం ఖల్విదం బ్రహ్మ" "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ" అను మొదలగు ఉపనిషద్వాక్యములతో శాంతిసందేశము నందజేయుచు శ్రీశంకరానందగిరిస్వాములవారు ఆధ్యాత్మిక తత్త్వము నుపదేశించుచుండుట సుప్రసిద్ధమై యున్నది. ఇట్టి సదసద్వివేక సంపన్నుల జీవనచరిత్రము జనులకు సన్మార్గదర్శక మగుగాక ! శ్రీశంకరానందగిరి

స్వాములవారి ఆధ్యాత్మిక కార్యక్షేత్రము విశాలాంధ్రమున వ్యాపించు గాక !! సత్యసనాతన తత్త్వచింతనతో స్వతంత్ర భారత జనాంగము నిత్యసుఖి యగుగాక !!!

ఇతి శివం భూయాత్

మకాం:- జంగమవాడి మఠము.
శ్రీక్షేత్రకాశి

ఇత్యాశిషః



శ్రీజగద్గురు పండితారాధ్యో విజయతే

శ్రీగిరిరాజ సూర్యసింహాసనాధీశ్వర

# శ్రీజగద్గురు వాగీశ పండితారాధ్య శివాచార్య మహాస్వాములవారు

శ్రీ జగద్గురు శ్రీశైల సూర్యసింహాసనమఠము

నెం 7190　　　　మకాం గుంతకల్లు　　　　తే. 4-5-55

సదయులు, స్వార్థత్యాగులు, తత్త్వజ్ఞానులునై మానవకళ్యాణమును గోరుచున్న మహాత్ముల జీవనచరిత్రలు ప్రకాశము లగుట సత్కార్యములలో ముఖ్యమైనది.

గురుకుల సంజాతులు, ఆత్మీయులు విశాలాంతఃకరణులు వయస్సుచే చిన్నవారైనను శుకమునివలె మాయసంసారమునుండి వెలువడి పరమవైరాగ్యముతో సకలమానవహితమును గోరుచున్నవారును నగు శ్రీశంకరానందగిరిస్వాములవారి జీవన చరిత్రము ప్రకాశితమగుచుండుట మాకు మిక్కలి ఆనందము గల్గించినది.

శ్రీశైలమల్లినాథుడు, జగద్గురు పండితారాధ్యులును వారికి శివోపాసనాసిద్ధిని, దీర్ఘాయురారోగ్యములను నొసంగి రక్షించుగాక యని కోరుచున్నాము.

ఇత్యాశిషః.

శ్రీస్వామి శంకరానందజీ
అధ్యక్షులు
శ్రీశంకరానందాశ్రమము

ఆళ్ళగడ్డ
మకాం సదము
తే. 14-5-'55

సాధారణముగా మహాపురుషుల జీవనచరిత్రము సాధకుల కాదర్శప్రాయముగా నుండవలెను. అట్లు లేనిచో దానిని జీవనచరిత్ర యని యనరాదు. మరియు నది యితరుల కుపయోగము కాజాలదు. ఇట్టి ఒరిపిడిఱాతితో రుద్ది శ్రీశంకరానందగిరి స్వామి వారను సువర్ణ మును పరీక్షింప వచ్చును. ఈమహాపురుషులు మాకు చిరపరిచితులు. మాకు సంబంధించిన మైసూరు ప్రాంతము హొంగరేఖాన్‌గిరి శ్రీశివా నందసేవాశ్రమమందు వీరు కొంతకాలము నివసించి తపోనిష్ఠులై సిద్ధిని పొందిరి. అచ్చటివారి కాదర్శప్రాయులై వారి యాదరణను పొంది యున్నారు. మఱియు పవిత్రవారణాశిక్షేత్రమున కొన్ని సంవత్సర ములు నివసించి అధ్యయనము చేసి వేదాంతశాస్త్రపారంగతులైరి. అక్కడ సత్సంగముచేసి పెక్కు ఆధ్యాత్మిక రహస్యముల నెఱింగి యున్నారు.

ప్రపంచమున మహాపురుషు లెందరో గలరు. కాని వారిలో కొందఱు భక్తమాత్రులై యుందురు; మఱికొందరు కేవల వైరాగ్య సంపన్నులై యుందురు; వేఱుకొందఱు కేవల జ్ఞానులై యుందురు. తక్కిన కొందఱు తపోనిష్ఠులై యుందురు. కాని ఈ మహాపురుషులు భక్తి జ్ఞాన వైరాగ్య తపస్సంపదల నన్నిటియందును పారంగతులై యున్నారు. సారాంశముగా చెప్పినచో వీరి ద్వారా ఆశ్రయించి యున్న శ్రీఉమామహేశ్వర గురుపీఠమున కొక మహత్తరమైన కళ గల్గిన దన్నచో నతిశయోక్తి కానేరదు. వీరిలోగల మఱొక లక్షణ మేమనగా వీరిబోధనావిధానము విశిష్టమైనది. వీరు అధికృత ప్రబోధ కులై యున్నారు. వీరివలన పండితులకు పామరులకుకూడ ప్రయోజన

మగును. వీరికి సర్వాంతర్యామి యగు భగవంతుడు చిరాయురారో
గ్యముల నొసంగి వీరి యుపాధినుండి పెక్కు జనులకు తమ జీవనము
సార్థకపఱచుకొను నవకాశ మగుగాకయని కోరుచున్నాను.

ఇతి,

(సం) శంకరానంద

ఓం తత్ సత్

(శ్రీశ్రీశ్రీ శంకరానందగిరి స్వాములవారు గుంటకల్) కుందన
గుత్తి-శివలింగాశ్రమ నివాసులు, ఈ మహాపురుషులతో నాకు చిర
కాలమునుండి పరిచయము గలదు. వీరియొక్క వంశ పరంపరాచార్య
త్వముకూడ కొంతవరకు నాకు తెలియును. శ్రీస్వాములవారు చిన్న
వయస్సుననే పూర్ణవిరక్తితో స్వగ్రామమును విడచి అనంతపురం
జిల్లా గుత్తితాలూకా గంజిగుంట గ్రామమున శ్రీప్రణవానందాశ్రమ
మున బ్రహ్మనిష్ఠులగు శ్రీసదానందసద్గురు స్వాములవారి సన్నిధిని
బ్రహ్మజిజ్ఞాసచేయుచుండగా నేను ఆ ఆశ్రమమునకు వెళ్ళితిని. ఈ
మహాదేదీప్యమానమైన వ్యక్తి నా దృక్పథమున పడెను. అప్పుడు
నా హృత్పటలమున ఈ వ్యక్తి అవతారకుడను భావనగల్గెను. వెం
టనే నావిశ్వాసపాత్రులైన శ్రీసదానందస్వాములవారితో, ఈయనకు
తగిన బోధ చేయవలసినదని మనవి జేసితిని. మరియు అక్కడనున్న
సద్భక్తశిఖామణి గురుసేవా నిరతులు నైన వెలనాటి వెంకటప్ప
గారితోకూడ పై విషయమును సూచించి "వీరికి తగిన సర్వసౌకర్య
ముల గావింపుము నీ జన్మ ధన్యమగునని చెప్పితిని, వీరినుండి లోకోప
కారమగుననియు దెల్పితిని.

నిజముగాఆజన్మబ్రహ్మచర్యము విరక్తిమైత్ర్యాది సద్గుణములు
కలవా రగుటవలన వీరిప్రారబ్ధము శుకులవంటి దను భావము నాకు
గల్గెను. ఇట్టి మహాపురుషులయొక్క జీవన చరిత్రము ప్రకటన మగుట

చూడ నాకు మహదానందమయ్యెను. దీనిలో అతిశయోక్తియేమియు లేక ఉన్న విషయము యథార్థముగా వ్రాయబడినది ఇట్టి జీవనచరిత్ర విషయములు సాధకులకు విశేషమైన సహాయముకల్గించునని నావిశ్వాసము. శివం ఇతి.. తే. 2-3-1955 బ్రి॥ శ్రీ॥ శంకరానందస్వామి
మకాం: బ్రహ్మవిద్యాశ్రమము బెంగుళూరు సురపురము

శ్రీ కేశవతీర్థస్వాములవారు
సంపాదకులు
"నామదర్శనము"

శ్రీ రామతీర్థసేవాశ్రమము
పిడుగురాల
తే. 17-:-'55

## మహాత్ముల చరిత్రలు

మహాత్ముల చరిత్రలు అవశ్యం అధ్యయనీయాలు. మానవుడు తన సంకుచితావరణాలను అతిక్రమించి విశ్వాత్మతో, మహాత్మతో శ్రుతికలపడానికి మహాత్ముల జీవనచరితల అధ్యయనం అత్యంతోపయోగకరం. ఎవరు మహాత్ములు? ఆకాశంమీద నడచేవాండ్లా? కాదు. నిత్యబ్రహ్మాకాశంలో విహరించే వాండ్లు దర్శించేవాండ్లు విషయ భూవాసనలకు అటంక సంతతాత్మాకాశంలో విహరించే వాండ్లు మహాత్ములు మట్టిని బంగారంగా చేసేవాండ్లా? కాదు. ప్రపంచాన్ని పరమాత్మగా దర్శించేవాండ్లు మహాత్ములు ఎవరిలో పశువాసనలు నిర్జితములైనవో, ఎవరిలో ఆత్మతేజం ప్రబుద్ధమై ప్రదీపించిందో, ఎవరి ఆత్మవిశ్వాత్మతో, భగవంతునితో మిళితమైందో, వాండ్లే మహాత్ములు. అట్టి మహాపురుషుల అడుగుజాడల్లో నడవడంవల్ల మానవులు శాంతి స్థానాన్ని చేరుకుంటారు జీవితాన్ని నిజమైన జీవితంగా. ఈశ్వరారాధనారూపకంగా, గడప గలగడమే సత్యమైన జీవితకళ. ఇట్టి కళావేత్తలే ఋషులు సంఘర్షణాతీతమైన, ఈజీవితకళను, ఈ ఋషిత్వాన్ని పొందడమే జీవిత కృతార్థత. జీవన సంకులమంతా, జీవితకళను. ఉత్కృష్ట సంస్కృతిని పొందకపోవడమే.

శ్రీరామతీర్థస్వామివా రన్నట్లు వివేకంతో పఠిస్తే ఒక ఋషి జీవితం ఎంత మేలుచేస్తుందో, ఒక పామరుని జీవితము అదే మేలు చేస్తుంది ఋషిజీవితంలో—సత్యాభిముఖత్వంచేత పొందే శ్రేయస్సును మనం పఠిస్తాము. దుర్జనుని జీవితంలో—సత్య విముఖత్వంచేత కలిగే అనర్థాన్నిమనం పఠిస్తాము, ఒకే విషయమును, రెండురూపాలలో గ్రహిస్తాము. ఋషిజీవితం—సత్యమును, సక్రమంగా త్రిప్పట లేకుండా, మనకు బోధిస్తుంది.

అనాదికాలాలనుండి నేటివరకు భారతవర్షం ఋషిభూమి! ఆర్యావర్తము! ఈ పఠించబోతున్న ఈ ఒకానొక ఆధునిక ఋషిజీవితం, మానవ జీవన సంస్కృతికి, దివ్యశాంతికి, అవసరమైన సందేశంతో ఆవిర్భవించింది. సర్వులు పఠింప ప్రార్థన.

(సం) కేశవతీర్థస్వామి

ప్రేమకుసుమం

గీతావాణి సంపాదకులు శ్రీరామకృష్ణానందస్వామివారు

సత్పురుషులు జనాంగంలో విటమిన్లవంటివారు వారిజీవిత కథలు సాధకలోకానికి కరదీపికల్లాంటివి. వారి బోధాచరణప్రచారాలు మానవ సమాజానికి చైతన్యాన్ని చేడపోస్తాయి.

వైరాగ్యంలో, త్యాగంలోనే కాదు; ప్రేమలో సౌజన్యంలో కూడ శ్రీశంకరానందగిరి స్వామివారు కొండంతటివారు. వారి ఆదర్శ జీవితం గంథరూపంగా మూర్తీభవించుట యెంతైనా సంతసింపదగిన విషయం. ఈగ్రంథం ముముక్షువులకు చక్కని పాథేయమై వైరాగ్య బలాన్ని చేకూర్చుగాక. ఓం.

మకాం—అగరం శ్రీరామకృష్ణ
కోలారుజిల్లా 9-3-55

ఓమ్

# శ్రీసాధు లక్ష్మీనరసింహ శర్మగారు
## కృష్ణమాచారి కాంపౌండ్
## బళ్ళారి.

..."గ్రంథరచనకు ప్రచురణమునకు ఈనాడున్న స్వాతంత్ర్య సౌకర్యములం మున్నెన్నడును లేవు...

"నావిరతో దుశ్చరితాత్. నాశాంతో నా సమాహితః।
నాశాంతమనసో వాపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్॥"

అనునట్లు ఆచారహీనుడైనవా డెంత పండితుడైనను పరతత్త్వమును బడయజాలడు. నేడు బుద్ధిని బలమును నమ్మిన పాశ్చాత్యసంస్కృతి మానవజాతినే ముంచి వేయుచున్నది. ఇట్టి తరుణమున రజస్తమోమయమగు నాగరికతా ప్రవాహమునుండి బయటపడి తాము తీర్ణులై తోడి సోదరుల నుద్ధరింపగల ప్రశాంత సుందర గంభీర పవిత్ర వాతావరణము గల మహర్షులు సాధువులు, యోగులు నేటికిని అచ్చటచ్చట వెలయుచున్నారు. అట్టి మహనీయుల కోటికి జెందిన శ్రీ శ్రీ శ్రీ శంకరానందగిరి స్వాములవారును మనోవాక్కాయకర్మలందు చిరంతన సత్యసౌందర్యమును అనుభవించి అనుభవింప జేయుచున్నారు. ఇట్టి శ్రీవారి ఆదర్శచరిత్రము ముముక్షువులకు ముకురము వంటిది. అద్దానికి వాగ్రూపము నొసగి సాధకుల ముందుంచుచున్న వారి ప్రయత్నము పరమశ్లాఘనీయమైనది. ఇక్కార్యము భగవత్కైంకర్యమే యగును. ఇట్టి భగవదారాధనకు పవిత్ర సామగ్రులుగా సంసిద్ధులైన సత్పురుషులకు నా ధన్యవాదములు భగవదాశీరనుగ్రహములు.

"శంకరానందగిరి గురువరచరిత్ర
శంకరానంద గిరి నెక్కు శక్తి యుక్తి
నొసగి శంకరభక్తుల కూత యగుచు,
వెలయుగావుత సజ్జన వినుత మగుచు॥"

మన్మథ వైశాఖ
బ॥ ఏకాదశి

(సం) సాధు లక్ష్మీనరసింహశర్మ

## గీ తా వా ణి

**15-8-1955**

సుప్రసిద్ధమగు శ్రీమదుమామహేశ్వర పీఠాధిపతులును, విద్యాతపస్సంపన్నులును, ఆదర్శవంతము లగు ఆచారవిచారములతో ఆర్ష విద్యాప్రచారమును నేటికిని విజయోపేతముగ నొనర్చుచున్న యువక పరివ్రాడ్వర్యులును, అస్మదీయ పవిత్ర మిత్రులును నగు శ్రీ శ్రీ శ్రీ పూజ్యపాద శ్రీ శంకరానందగిరి స్వాములవారి జీవిత చరిత్రను ఉన్న దున్నట్లు వ్రాసి భక్తలోకమున కందజేసిన గురుభక్తి పరాయణులగు శ్రీతత్త్వానందస్వామి వారెంతయు ధన్యులు. అట్టి గ్రంథము తత్త్వవిదుల పండితులు సజ్జనులగు విద్వాన్ శ్రీయస్. రాజగుప్తగారిచే చక్కగా పరిష్కరింపబడి భాహ్యాంతరముల సర్వాంగసుందరమై శోభిల్లినది ఇందలి విషయములు అతిశయోక్తియేమాత్రములేక శ్రీవారి సత్యాదర్శజీవనమును తెల్పుచున్నవి. ప్రశ్నోత్తరముల రూపముగా ఇందు పెక్కు ఆధ్యాత్మిక రహస్య విషయములుకూడ బోధింపబడి యుండుటచే నియ్యది కేవల జీవనచరిత్రయే గాక బోధా గ్రంథమని చెప్పినను తప్పుగాదు. అచ్చటచ్చట శ్రీవారొసంగిన నైతికాధ్యాత్మికోపన్యాసములు ఉపదేశరూపములు, గురుభక్తి ప్రపూర్ణమగు గురుమహిమావర్ణనము హర్షరోమాంచముల గలిగించుటయేగాక సాధకుల కమృత ప్రాయమై యున్నది. మొత్తముమీద "గురుశుశ్రూషయా విద్యా" అనునట్లు సద్గురు సన్నిధానమునుండి శాశ్వతమైన విద్యను బడయవలె ననెడి ప్రాచీన భారతీయ సంస్కృతిని కార్యరూపమున చూపించియు, దానిని లోకమునకు ధారబోసియు సార్థక పఱచుకొన్న శ్రీవారి పవిత్రమగు జీవితము లోకమునకాదర్శప్రాయమై వెల్గొందగలదనుటలో సందియము లేదు.

# ప్రథమ ముద్రణము - తొలిపలుకు

"కిం దుర్లభమ్ సద్గురురస్తి లోకే సత్సంగతిః" అనునట్లు సజ్జనుల సహవాసము ముల్లోకములయందు కడుదుర్లభము. అనేక జన్మార్జిత పుణ్యధనక్రేయంబు రూపలావణ్య వయోవర్ణధన విద్యాయౌవనాది మదంబులచే నలభ్యంబు, పరమశ్రేయఃప్రాప్తి కేకైక సాధనంబు అవ్వారి సహవాసంబున నందని శ్రేయ బొకండు గలదే !

ఇకనట్టి పరమ సజ్జనుల జీవితంబులు లోకంబునకాదర్శంబులు. వారి ప్రతి వాక్కును నమృతప్రాయంబు హృదంతరాళ నిగూఢానాద్యవిద్యోన్మూలన పాటవంబు. వారి ప్రతిక్రియయు జగద్ధితకారిణియై యొప్పు. వారి ప్రతిసంకల్పమును లోక కల్యాణ దాయకంబు, వారిచరిత్రయన్ననో పరమప్రమాణంబగు శాస్త్రంబు, స్వస్వహృదయం బనెడి సువర్ణంబు బరీక్షింపదగు నికషోపలంబు, నాన వాసనాయుతంబగు మనంబున్ శుద్ధముగావించు పవిత్రభాగీరథి. అజ్ఞానాంధకారమునబడి దరిగానక పరితపించుచున్న జీవులకేకైక జ్యోతి. అపన్మార్గంబున జిక్కి శాంతినొందలేక వెతం బొగులుచున్న జ్ఞానబుభుక్షువుల కేకైక పాథేయంబు.

అట్టి మహనీయ గుణగణ సంపద్విశిష్టులును, పరమ కరుణాస్వరూపులును, వివేకోపేతభావ విరక్తి సంపన్నులును, విద్యా వినయాది సల్లక్షణ లక్షితులును, యతివరేణ్యులును. సర్వభూత మైత్రిలును, అస్మదీయ చిరసన్మిత్రులును, శ్రీమదుమామహేశ్వరపీఠాధిపతులును పరమహంస పరివ్రాజకాచార్యవర్యులును నగు పూజ్యపాద ౧౦౮ శ్రీశంకరానందగిరిస్వాములవారి యీ చరిత్రంబు నాలోకింప, నే కడుంగడు ధన్యుండ.

మొట్టమొదట నీ గ్రంథంబు బరిష్కరింప నన్నడిగిరి. ప్రస్తుతము సాధ్యంబుగాదని కొన్ని కారణంబుల పేర్కొనుచు, నాయశ

క్తతను విన్నవించితిని. కాని నాయందలి వాత్సల్యంబుననో నాపుణ్యంబుననో పరిష్కరించియే తీరవలెనని పెద్దల ముదల యయ్యెను. దానిం దిరస్కరింప నశక్తుండనై యంగీకరించితిని. అందరికి నందుబాటులో నుండుటకొఱకై భాషాశైలి సాధ్యమైనంత వఱకు సరళము గావింపబడెను చాలవఱకు సంధులు విడదీయబడెను. తగిన భాగములుగా విభజింపబడెను. శ్రీసద్గురు కటాక్ష రూపజ్యోతిలో గన్గొన్న యందలి యొప్పులన్నియు నతనివే. ఈ పరిష్కరణ వ్యాజంబున నెన్నియో విషయంబు లెఱుంగగల్గితి. ఇట్టి సదవకాశమును గల్గించిన పూజ్యపాదులకు నా జోహార్లు చరిత్రనాయకులగు శ్రీవారికి ననంత నమోవాకంబు లర్పించువాడ.

పెక్కు టంకంబులు గల్గుచున్న నీ ముద్రణకార్యమును మిక్కిలి ఓపికతో నిర్వహించి గ్రంథములను త్వరలో నందించిన అశోకా ప్రింటర్స్ యజమానులును, శ్రద్ధావంతులును, శాంతస్వరూపులును, ఆస్తికులు నగు శ్రీ యం. నారాయణస్వామి మరియు సోదరులను దయామయుడగు శ్రీశైలేశుండు కరుణ బ్రోచుగాత!

కరుణామయుడగు నుమానాథుడు భక్తజగతిని క్రీగంటి చూపులతో వీక్షించుగాక!

చైతన్య విహారము
135, వీరపిళ్ళైవీధి
బెంగుళూరు-1

ఇట్లు
సుజన పాదధూళి
యస్. రాజగుప్త
18.5.1955

ఓమ్

ఓం నమో భగవతే శ్రీమదుమామహేశ్వరాయ

విద్వచ్ఛిరోమణి, వేదవిద్యావినీత
యం. బాలవిశ్వనాథశర్మ బి.ఏ.
సంస్కృత లెక్చరర్

అనంతపురము,
3-1-77.

శ్రీమద్వేదాగమోపనిషత్ప్రసిద్ధము, అధీతి. బోధా, చరణ, ప్రచారశీలము నయిన శ్రీమదుమామహేశ్వర గురుపీఠ మనాదివేద శాస్త్రములకు పరమతాత్పర్య భూతమైన పరమాద్వైత సిద్ధాంతమీ పీఠమునకు పరమధ్యేయము. అవిద్యా తిమిర పతితము, వైరాగ్య విదూరము నయిన జగత్తునకొక విద్యామధుర గంధ విలసితమగు త్రోవ చూపుటయు ఈ పీఠము తన ధర్మముగ నెంచుకొనినది. ఇట్టి పరమ పూజ్యమయిన శ్రీమదుమామహేశ్వర గురుపీఠమున కీనాడు శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులైన పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శంకరానందగిరి గురుస్వాములవారు పీఠాధిపతులై యున్నారు. ఉరవకొండ తాలూక లత్తవరము శ్రీక్షేత్రములోని శ్రీమదుమామహేశ్వరాశ్రమ మీపీఠమునకు కేంద్రము.వీరు శ్రీశ్రీశ్రీ సదానందసద్గురు చరణ కరకమల నంజాతులు. శ్రీవారి పరమ గురువులు శ్రీశ్రీశ్రీ సద్గురు ప్రణవానంద యతీంద్రులు, జీవన్ముక్తులు, ధన్యులు.

1969 నుండి నాకు శ్రీవారితో పరిచయము, కారణమేమో గాని ఆనాటి నుండి శ్రీవారికి నాయందొక వాత్సల్య భావమేర్పడినది. అది అంకురితత్వ. పల్లవితత్వ, పుష్పితత్వావస్థల దాటినది. ఫలితత్వ దశనందుకొనుటకు నాచిత్త సంస్కారము కూడ తోడుకావలెనేమో! ఏదెట్లున్నను సత్పురుష శిరోమణులైన శ్రీవారికి సమకాలీనులమై యుండుటయే మన భాగ్యమని నేనప్పుడప్పుడు తలంచుచుందును. వీరి సౌజన్య సౌశీల్యములు సదాసంస్మరణీయములు.మరపునకు రమ్మన్నను రానివి. వేదాంత శాస్త్రమున తాము పరాకాష్ఠనందుకొన్నను. ప్రబో

ధనమయమున శిష్యులస్థాయికి దిగివచ్చి, వారి హృదయస్థితి నాకళింపు చేసుకొని, తరతమ భావముల నెఱిగి, చక్కని ఉపమానోపమేయము లతో ప్రవచనము చేయుచుందురు. పట్టుదారమునుండి జారిన ముత్యములవలె వీరి కంఠసీమనుండి శ్రుతిసమ్మతమగు కమ్మని మాటలు జాలువారుచుండును. ఈ దృశ్యము రిపువును సైతమాకర్షింపగలదు. సహృదయ హృదయంగమమగు వాగ్వ్యాపారమును లక్షించి నివేదించుటలో చక్కని ఓర్పు నేర్పు వీరికి కలవు. వీరు ఋషితుల్యులు.

వీరి ధోరణి యందొకచోట సూత్రశైలి, ఒకచోట భాష్యపద్ధతి, మరొకచోట పూర్వపక్షసిద్ధాంతమర్యాద, అహమహమికతో వ్యక్తమగుచుండును. అద్వైత సిద్ధాంత ప్రచారకుల కుండవలసిన జ్ఞానిత్వము, తత్త్వదర్శిత అను రెండు గుణములు వీరిలో పెనవేసుకొని యుండుట పరమ విశేషము. కంఠహారములు, కరకంకణములు, పాదాభరణములు సముల్లసనహేతువులయినట్లే వేదాంత వాక్యములకును, లింగ, ప్రకరణ, స్థాన, సమాఖ్యలు శోభాసంధాయకములగు మర్మము నెఱిగినవారు వీరు. బ్రహ్మానుభూతిలోని సుఖము నెఱుగని వారి మాటలలో నేదో ప్రియప్రాయమైనది, లావణ్యమయినది, రూపాలంకారసౌష్టవమును సముద్దీపింప జేయునదియు నయిన జీవత్కళ కొఱవడినట్లు మాత్రము తెలియుచుండును. తత్త్వానుభూతి కలవారు కనుక, ఆ లుప్తత ఇక్కడ బొత్తుగ కానరాదు. శబ్దవ్యవసాయమయిన సాహిత్యముకంటె, నాదవ్యాకోచనాత్మకములయిన వేదసంగీతములకంటె విలక్షణమయినది రసానందము. ఇదియే బ్రహ్మనిష్ఠ "రసో వై సః" అని కదా శ్రుతి. దీని ననుభవించుటకుగాని, అందించుటకుగాని, శీలముఅత్యంతమపేక్షితము. ఇదియే ప్రధానమైన యోగ్యత. శ్రీవారి శీలము మేలిమి బంగారము వంటిది. ఎట్టి పరీక్షకైనను నిలువగలదు. అందులకే వారి సౌశీల్యమునకు మార్కు లెక్కువ. అట్టి సచ్ఛీలురు కనుకనే వీరికి దేశము నందంతట వైదిక, బ్రహ్మమార్గముల ప్రచారముచేయు

టకు వలయు సాహసము కల్గినది ఇది సామాన్యుల కలవిగాని పని. అనన్యభక్తి విశ్వాస సాధ్యమయిన తత్త్వబోధ సచ్ఛీల మూలము. అసలు సమ్యక్ శీలములేని వేదాంతవేది వాదము, భిన్నభాండము మీది చిత్రలేఖనము, కపాలములోని కమ్మతేనియవలె, చర్మభస్త్రిక లోని నిమలవిభూతివలె, నేత్రోత్సవమునుగాని, జిహ్వాప్యాయమును గాని, పూజాభావమునుగాని పొందింపలేదు. దర్శనము నేత్రోత్సవ ముగ, మాటలు మంత్రములుగ, నడచిన స్థలము ప్రయాగతుల్యముగ ఉపదేశవాక్యములు పూజార్హములుగ, మూర్తి ఆరాధ్యముగ పొడ సూపు ప్రకృతియే వీరి సచ్ఛీలమును వేనోళ్ళ చాటుచున్నది. శ్రీవారు సత్పురుషులు, వీరి చరిత్రయే ఒక మహాత్మ, సామాన్యుడు మహా త్ముల చరిత్ర పఠించుటచేత హృదయస్థమయిన సంకుచితావరణము భేదించుకొని విశ్వాత్మలో లీనము కాగలడు.

శ్రీవారు తమ చరిత్ర వ్రాతప్రతిని పరిష్కరింపుమని నన్నా దేశించిరి. వారిమాటకు బదులుచెప్పుట నాకలవాటులేదు. యోగ్యత చిన్నదయినను ఒప్పుకొనక తప్పలేదు. పెద్దలు చెప్పినది చేయుటయే పరిపాటి. యథామతి పరిష్కరించితిని. అందరికిని అర్థముకావలయునని సులభమైన భాష నెన్నిక చేసిరి. ఈగ్రంథమున శ్రీవారి బాల్యలీలల న్నియు భావిభాగ్యోదయ స్ఫోరకములుగ నున్నవి. విద్యాభ్యాసనమ యమున నేర్పిన విద్యకంటె, తాను నేర్వవలసిన విద్యనెక్కువశ్రద్ధతో శ్రీవారు పఠించినట్లున్నది. సహజ వైరాగ్య సంపద ముందుకురాగా తురీయాశ్రమ స్వీకారమొనర్చి, విరక్తులకు మార్గదర్శకులైరి. వీరికి గల సద్గురు పూజాభావమమేయము. ఆయాక్షేత్రముల దర్శించుట, వెంటనున్న శిష్యపరివారములకు తత్తత్సందర్భోచిత వాక్యములు వినిపించుట. మున్నగు విషయము లాయా దృశ్యములను సాక్షాత్క రింపజేయుచున్నవి. విధివిహిత చాతుర్మాస్య మహావ్రత సమాచరణ కార్యము లకుంఠితముగ జరుగుట, ఆ ఉత్సవములు విజయాంతములై

సమాప్తినొందుటలను అపూర్వదిగ్విజయమునుచాటుచున్నది. గుర్వారాధన సమయమందు, శివపూజాకాలమునందు శ్రీవారు పొందుచున్న తన్మయీ భావము సమీపస్థితులైన శిష్యుల అనేక భక్తులను సైత మాస్థితికి తీసుకొనిపోవుచుండును. సహజమగు వారి అంతర్ముఖత కింతకుమించిన దృష్టాంత మనావశ్యకమను కొందును. ఈ గ్రంథ పరిష్కరణ వ్యాజమున నేనెన్నియో వేదాంత మర్మముల తెలిసికొంటిని. ఈయవకాశమిచ్చిన పరమపూజనీయ శ్రీవారి కనంత సాష్టాంగ పాతసవినయ ప్రణామములు.

పూజ్యశ్రీవారి దివ్య సన్నిధానమున వసించు విద్యాబుద్ధిగల శ్రీబ్రహ్మచారి సత్యానందస్వామివారు నిజముగ ధన్యులు వీరు శ్రీ శంకరానందగిరి గురువర చరిత్రను ఉన్నదున్నట్లుగ రచించి లోకమునకు మహోపకారము చేసిరి. వీరి వ్రాతయందు అతిశయోక్తి కావంతయు చోటులేదు. సత్యమును మఱుగు పరచక సత్యార్థ ప్రకాశనము చేసిరి. చరిత్రయంతయు సహజత్వముచే నిండినదిగాని సంభావ్యత సోకలేదు ఇట్లు వ్రాయుట అందరికి అలవిగానిపని చిత్తశుద్ధికి మాత్రమే సాధ్యము. శ్రీబ్రహ్మచారి సత్యానందస్వామివారి సత్కార్యము వారిని చరితార్థుల జేసినది.

ఓం శాంతిః

బ్రహ్మశ్రీ కంబంపాటి రామచంద్రమూర్తిగారు

సంస్కృత పండితులు

యం. హెచ్. స్కూలు, ఆదోని.

శ్రీశ్రీశ్రీమదుమామహేశ్వర పీఠాధిపతులును యమ, నియమాసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన సమాధిగ్రస్థులును, అధ్య

యనాధ్యాపన, నిత్యకర్మానుష్ఠానపరులును, శిష్యవత్సలులునగు శ్రీ ఉమామహేశ్వర గురుపీఠాచార్యులు శ్రీ|శ్రీ|శ్రీ శంకరానందగిరి గురుస్వాములవారి పవిత్ర జీవిత చరిత్ర తిలకించుట మాకుమహాభాగ్యము

అనేక జన్మాంతర పుణ్యాలబ్ధమైనదీ నరజన్మ, అందునను సద్గురువుల అనుగ్రహపాత్రులగుట అంతకంటే విశేషము "గురోరనుగ్రహేణైవ పుమాన్ పూర్ణః ప్రశాన్తయే" భా॥ ద॥ అనగా మనుష్యుడు గురువుయొక్క అనుగ్రహము వలననే పరిపూర్ణ శాంతిని పొందగల్గును. లేకున్న ఎంత పండితుడైనను, ఎన్నివిన్నను, ఎన్నికన్నను ఆత్మతత్త్వమును తెలుసుకొనుట సాధ్యపడదు. ఆ పాండిత్యము కేవల అనుభవ రహితమగు పాండిత్యముగానే నిల్చిపోవును. అందులకే 'గురుశుశ్రూషాణాం నామ సర్వ ధర్మోత్త మోత్తమం" అన్నారు.

శ్రీవారు ఆదర్శమూర్తి అపారగురు భక్తి తత్పరులు. శ్రీవారు ఈ సంసార సాగరాన్ని తరించిన మహామనీషి. తాన వారు శిష్యకోటిని తరింప జేయగల సమర్థులు. "స్వయం తీర్ణాః పరాన్ తారయతి" అని శాస్త్రము చెప్పుచున్నది. అందులకే "మోక్షమూలం గురోః కృపా" అని పెద్దలు చెప్పుదురు. అట్టి సద్గురువుల నాశ్రయించి తరించుట శిష్యధర్మము. శ్రీ వారి చరిత్రను పరిశీలించిన ఆ ధ ర్మ ము లు మనకు కానవచ్చును. అట్టి దివ్యచరిత్రను ప్రచురించు మహాత్ములు వారు తరించుటయేగాక ఇతరులకు మార్గదర్శకులగు చున్నారు.

శ్రీవారికిని, శ్రీవారి దివ్యచరిత్రను ప్రచురించు శిష్యకోటికిని మా నమోవాకములు.

ఓం తత్ సత్

# ఓం నమో భగవతే శ్రీమదుమామహేశ్వరాయ

## మూడవముద్రిణ పీఠిక

"అవిద్యాభేదనేశక్తం అసక్తం తం నతోస్మ్యహమ్।
శమాదిగుణ సంయుక్తం యుక్తం బ్రహ్మోక్తిభిస్సదా॥"
"అభియుక్తం మహాభక్తం విరక్తం ముక్తమేవచ।
వందే శ్రీశంకరానంద గిర్యాఖ్యం సద్గురుం ముహుః॥"

"జన్మకర్మచమే దివ్యమేవం యోవేత్తితత్త్వతఃత్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున" ఓ అర్జునా! దివ్యమగు నాజన్మను కర్మను ఎవడిట్లు తత్త్వతః తెలియునో అతడు దేహపాతానంతరము మఱల జన్మనొందడు, నన్నే పొందును. అను భగవద్గీతోక్తరీతి అస్మద్గురువరేణ్యుల జన్మకర్మలు దివ్యములు, అలౌకికములు, విశిష్టములు. లోకోపకారములు, ముముక్షుజనోత్తారకములు "బ్రహ్మైవాచార్యరూపేణావతిష్ఠతే" అన్నట్లు అవ్యక్తాక్షరశబ్దవాచ్యుడగు పరమాత్మయే శ్రీగురురూపమున అవతరించెను. శ్రీగురుదేవులు శుద్ధసత్త్వ గుణోపేతులు, వరపుణ్యశరీరులు, సములు, బ్రహ్మానుభవులు, నిత్యప్రసాద గుణసంపన్నులు. ఆశ్రితులకు కల్పవృక్షము వంటివారు అందువలన "ఆత్మజ్ఞం హ్యర్చయేద్భూతి కామః" యని ఉపనిషత్తున్నది. నారాయణ స్వరూపులై యుండియు భ్రాంతిచే నరునిగా భావించుచున్న మానవులను తమ నిజజ్ఞాన ప్రబోధచే మాధవులుగా జేయుదురు. శ్రీగురుదేవులు నిష్కాములు, ఆత్మకాములు, ఆప్తకాములు, పూర్ణకాములు, "ఆచార్యవాన్ పురుషో వేద" "తద్విద్ధిప్రణిపాతేన—తత్త్వదర్శినః" యను వాక్యానుసారము మనోవాక్కులకందని తాత్త్విక విషయమును సద్భక్తులగు ముముక్షువులకు కరతలామలకముగ దెలుపు బ్రహ్మబోధనా కళాకోవిదులు. ఏ యితర సాధనలచే నివృత్తిగాని

హృదయము నాశ్రయించిన అనాద్యజ్ఞానాంధకారమును జ్ఞానజ్యోతిని వెలిగించి పారద్రోలిన మహాత్ములు శ్రీగురుదేవులు, సుఖమునకై ఈలోకము మొదలు బ్రహ్మలోక పర్యంతము పర్యటించుచున్న మానవునకు కంఠగత చామీకర న్యాయమువలె రస (ఆనంద) స్వరూపమైన తమ నిజ స్వరూపమును జూపి ఆనంద స్వరూపులుగా అనుభవింప జేయువారు శ్రీవారు. అందుకే శ్రీ శంకరాచార్యులు శ్రీగురుదేవునకు పోలిక ఏదియును లేదని "దృష్టాంతో నైవదృష్టః త్రిభువన జఠరే సద్గురోర్జ్ఞానదాతుః" అన్నారు. దృష్టానుశ్రావిక విషయవిగత తృష్ణులై లోకమున వసంతఋతువువలె లోకహితమై చరించు శ్రీగురుదేవులదే ఈదివ్యచరిత్ర ఈదివ్యచరిత్రే శ్రీగురుదేవులు. "ఆచార్యా దేవా విద్యావిదితా సాధిష్ఠం ప్రాపతు" అన్నట్లు సంసారసాగరమున మునిగితేలు మానవులపాలిట ఈదివ్యచరిత్ర కైవర్తకుని వంటిది. శ్రీగురుదేవుల సన్నిధియుండి పూజించి సేవించి భావించి వారి వాక్యామృతమును గ్రోలి జీవన చరమలక్ష్యమగు ప్రత్యగాత్మ పరమాత్మయే యను యథార్థ జ్ఞానమునొంది కృతార్థులమైతిమి. పాఠకులగు సుజనులు ఈ పవిత్ర గ్రంథరాజమగు దివ్యచరిత్రను భక్తి ప్రపత్తులతో జదివిన తప్పక సాక్షాత్ శ్రీగురుదేవుల సాన్నిధ్యానుభూతి నొంది పరమశాంతిని మరియు ఆత్మజ్ఞానమను మోక్షరూప పరమ పురుషార్థమును బడయగలరు. అస్మద్గురు వరేణ్యుల దివ్యచరిత్ర ద్వితీయముద్రణ ప్రతులు పూర్ణమయినందున "శ్రీశంకరానందగిరి గురువరచరిత్ర" మొత్తము నొకటిగాజేసి ఈనూతన సంస్కరణమున పూజ్య శ్రీ గురుదేవుల ౯౮వ. జయంత్యుత్సవము వరకు గల పరమ మంగళమయమును భవభయహరమునగు శ్రీగురుచరిత్రను రచించు మహాభాగ్యమునాకు కలిగినందులకు నేధన్యుడను. శ్రీగురుదేవుల కనంత ప్రణామములు,

అనంతపురము భక్తమండలి మాన్యశ్రీ మేడాసుబ్బయ్యగారు శ్రీమేడా రామయ్యగారు, శ్రీమచ్చా నారాయణస్వామిగారు.

శ్రీకోపూరు రామయ్యగారు, శ్రీబయనగారి నాగయ్యగారు. గుత్తి శ్రీ డి.వి. నాగమాణిక్యంగారు, శ్రీశెట్టి కొండయ్యగారు, శ్రీ ఎ.జి. నాగిరెడ్డిగారు, శ్రీ బయనగారి కొండయ్యగారు, శ్రీ యన్. లక్ష్మి దేవమ్మ రిటైర్డు డి.ఇ.ఓ.గారు, శ్రీకర్నాటకము రత్నయ్య సోదరులు, శ్రీ యన్. రామారావు, శ్రీ ఆర్. రంగస్వామిఅయ్యంగారు వీరందరు ఈపవిత్రమగు శ్రీగురు చరిత్రను అచ్చొత్తింపజేసి భక్తుల కర కమలములకందజేసిన అనంతపురము భక్తమండలివారందరు శ్రీఉమా మహేశ్వరులు తమ కృపామయ దృష్టిచే అనంత శుభప్రదులగుదురుగాక !

విన్నవించుకొన్నదే తడవుగా గ్రంథమంతయు పరమ శ్రద్ధచే పరిశీలించి పరిష్కరించి తమ అమూల్యమగు అభిప్రాయము నొసగిన "విద్వచ్ఛిరోమణి" "వేద విద్యావినీత" ఇత్యాది బిరుదాంకితులైన బ్రహ్మశ్రీ యం. బాలవిశ్వనాథశర్మ పండిత మహోదయులకు మా సద్భక్తికమగు ప్రణామములు.

అపూర్వమగు తమ సందేశమును పంపిన "సాహిత్యశిరోమణి" "వేదాంతాచార్య" ఇత్యాది బిరుదాంకితులైన ఆదవాని బ్రహ్మశ్రీ రామచంద్రమూర్తి పండిత మహోదయులకు మానమస్కారములు మరియు మొదటి భాగమునకు తమ దివ్యసందేశములు బంపిన మహాత్ములందరికి మా అనంత ప్రణామములు.

అత్యంత శ్రద్ధతో అచిరకాలమున ఈగ్రంథముద్రణ కార్యము లను సర్వాంగసుందరమొనర్చి యొసగిన గుంటూరు శ్రీ వెల్‌కమ్‌ప్రెస్ (ప్రయివేటు) లిమిటెడ్ వారికి మావందనములు.

ఓం తత్ సత్

శ్రీగురుపాద రేణువు

బ్రహ్మచారి సత్యానందస్వామి

# 4.వ ముద్రణ - పరిచయము

శ్రీ గురువరచరిత్ర 3. వ ముద్రణ గ్రంథము లెల్లయు ముగిసినందున శ్రీవారి 43వ శ్రీచాతుర్మాస్య మహావ్రతాచరణ సుసందర్భమునందు భక్తాదులు పరమ భక్తిపూర్వకముగ నీ 4.వ. ముద్రణ గావింపజేసిరి. ఇందు శ్రీవారి 35.వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము నుండి నేటివరకు 43.వ.శ్రీచాతుర్మాస్య మహావ్రతాచరణ వరకుగల విషయములు పొందుపరుపబడినవి.

తెలుగుపండిట్ శ్రీ ప్రణవానంతస్వామి శ్రీ పి మల్లనగౌడు, శ్రీ జ్ఞానానందస్వామి, శ్రీ ఎ. శాంతారాం ఇంజినీరు మొదలగువారు ఈశుద్ధప్రతి పునరపి సిద్ధపరచుట యందు సహకరించిరి.

గ్రంథముద్రణ కార్యము గుంటూరు వెల్‌కంప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్ యజమానులు బ్రహ్మశ్రీ పి. రామకృష్ణమూర్తిగారు,భక్తరత్న శ్రీ ఎ. శాంతారాం పుణ్యదంపతులు శ్రద్ధతో చూచుకొనిరి. శ్రీ ఉమామహేశ్వరులనంత శుభముల నిచ్చి యెల్లరను సంరక్షించునుగాక యని భజించుచున్నవాడ.

శ్రీచంద్రశేఖరానందగిరిస్వామి

ఓం నమో భగవతే శ్రీమదుమామహేశ్వరాయ



జగతఃపితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ

## శ్రీ ఉమామహేశ్వర గురుపీఠ పరంపర సంగ్రహ చరిత్ర

శుద్ధస్ఫటిక సంకాశం, శుద్ధవిద్యా ప్రదాయకమ్।
శుద్ధం పూర్ణచిదానందం సదాశివ మహంభజే॥
నమశ్శివాయ సాంబాయ సగణాయ ససూనవే।
ప్రధాన పురుషేశాయ సర్గస్థిత్యంత హేతవే॥

(కైలాస సంహిత)

ఇహఖలు పరమకారుణికో విరాడ్రూపః పరంజ్యోతి ర్నిర్వికారో నిరాకారః పరశివః స్వాంశభూతాన్ బ్రహ్మవిష్ణు మహేశ్వరాదీన్ సమ్యగుత్పాద్య తత్ర పరమాప్తతమమ్ సదాశివ మాకార్యతం ప్రతిష్ఠం సకల వేదార్థ ముపాదిశత్ (శివాగమము)

ఈలోకమున పరమ కరుణామయుడును విరాడ్రూపుడును పరంజ్యోతి స్వరూపుడును నిర్వికారుడును నిరాకారుడునగు పరశివుడు స్వాంశభూతులగు బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివులను సృష్టించి వారియందు అత్యంతాప్తుడగు సదాశివుని చేరంబిలిచి ఆ సదాశివునకు ఇట్లు సకల వేదార్థము నుపదేశించెను. ఆసదాశివుడే కార్యరుద్రుడగు శ్రీఉమామహేశ్వరుడు. అతడు జీవుల అభ్యుదయ నిశ్శ్రేయససాధన భూతంబయిన ఆ వేదార్థమునే బోధించెను

"నమశ్శివాయ సోమాయ సాక్షిణే ప్రత్యగాత్మనే"

(సూత సంహిత)

వేదమునందు వేదాంత మనబడు ఉపనిషత్తులలో పరమ పురుషార్థమగు మోక్షసాధనమైన ఆత్మజ్ఞానము ఉపదేశింపబడియున్నది




శ్రీ ఉమామహేశ్వర గురుపీఠము

జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ.

యీ ఉపదేశములను గురుముఖమున చక్కగ దెలిసి అనుష్ఠించి అను భవము నొంది ధన్యులగువారు ఎపుడునూ యేకొందరు మాత్రమే ఉందురు. అందుచేత ఆత్మజ్ఞాన గురుపరంపర కేవల వేదాధ్యయన గురుపరంపర కంటె విలక్షణమై యుండును.అట్టి ఆత్మజ్ఞాన గురుపరం పరాను సంధాన మొనర్చునపుడు 'సదాశివ సమారంభాం' ఉమా మహేశ్వరారంభాం'నారాయణ సమారంభాం'అనియును చెప్పుదురు పరమార్థదృష్ట్యా శివకేశవులందు స్వరూపభేదము లేదు. "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్" అని శ్రుతి భగవంతుడొ క్కడే ఉన్నాడు అని చెప్పుచున్నది. అతడు జ్ఞానానంద స్వరూపుడు "శ్రుతి స్మృతిర్మమై వాజ్ఞే" అతని నుండి కలిగినవే వేదములు, అపౌ రుషేయములు. అతనికి మరొక గురుడు లేడు. సదా గురుస్వరూపుడు. సాక్షాత్ పరమాత్మయే సదాశివుడగు ఉమామహేశ్వరుడు జగద్భర్త యగు అతని నుండి గురుశిష్యక్రమమున గురుపరంపరాయాతముగ వచ్చినదే శ్రీఉమామహేశ్వర గురుపీఠ పరంపర. దీనినే కైలాస పీఠ మనియు అందురు.

శ్రీమత్కైలాసశిఖరే భాసమానం నిరామయమ్ ।
రత్నసింహాసనే సమ్యగాసూఢం చ సదాశివమ్ ॥
త్రిలోచనం చతుర్బాహుం తటిత్కోటి సమప్రభమ్ ।
అమితాదిత్య సంకాశం శుద్ధస్ఫటిక సన్నిభమ్ ॥
నీలగ్రీవం శశాంకాంకం ఖడ్గఖట్వాంగ ధారిణమ్ ।
నాగయజ్ఞోప వీతంచ వ్యాఘ్రచర్మోత్తరీయకమ్ ॥
కమండలుధరం దేవ మక్షమాలా విభూషితమ్ ।
వరదాభయహస్తం చ నమజ్జన ఫలప్రదమ్ ॥
వృషోపరి సమారూఢ ముమాదేహార్ధ ధారిణమ్ ।
దుర్దాన్తం కపిలజటం శిఖామధ్యేతు ధారిణమ్ ॥

అమృతేనార్పితం హృష్టం దివ్యభోగ సమన్వితమ్।
దిగ్దేవతా సమాయుక్తం సురాసుర నమస్కృతమ్॥
నిత్యంచ శాశ్వతం శుద్ధం ధృవ మక్షర మవ్యయమ్।
సర్వవ్యాపిన మీశానం రుద్రం వై విశ్వరూపిణమ్॥
నమస్సోమాయ రుద్రాయ శంకరాయ మహాత్మనే।
బ్రహ్మ విష్ణు సురేంద్రాణాం ధ్యానగమ్యాయ శూలినే॥
భక్తిగమ్యాయ భక్తానాం విదుషా మాత్మరూపిణే।
స్వానుభూతి ప్రసిద్ధాయ నమస్తే సర్వసాక్షిణే॥
పంచాక్షరీ విద్యా శతరుద్రీయ మధ్యగా।
పంచాక్షరే మహాదేవః సర్వదా సుప్రతిష్ఠితః॥

(సూత సంహిత)

ఇట్లు కైలాసాధిపుడగు ఉమామహేశ్వరుడు వారి శిష్యులు నందీశ్వరుఁడు, తచ్ఛిష్యులు, సనత్కుమారులు, వారి శిష్యులు సూత ఋషి వీరందరు పురాణప్రసిద్ధులు. ఈ క్రమమున భగవన్నాథులు, కరూర్ సిద్ధులు, వారిశిష్యులు ఆరుల్ మునివరులు, వారిశిష్యులు కభూర్ మునివరులు, పరమునివరులు, తిరుప్పణాతళర్, మధురపుంజ మునివరులు, తిరునటరాజర్, శివప్రకాశస్వామి, స్వరూపానందస్వామి తత్త్వరాజస్వామి శాంతలింగస్వామి, కుమారదేవస్వామి, చిదంబర స్వామి, నారాయణదేశికస్వామి, తాండవరాయస్వామి, తాతప్ప మెయి జ్ఞానపరదేశి, తిల్లినాయస్వామి, వేంకటరంగదేశికస్వామి, ప్రణవానందస్వామి, సదానందస్వామి, శంకరానందగిరి గురుస్వామి. ఈవిధముగ శిష్యపరంపర సముల్లసితమై యున్నది. ప్రస్తుత గురు పీఠాచార్యులు 1954 వ. జయసంవత్సర జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమ సుము హూర్తమున విధ్యుక్తముగ శ్రీ ఉమామహేశ్వర గురుపీఠాచార్యు లైరి. ఈవిషయము శ్రీ శంకరానందగిరిగురువర చరిత్రయందు వివ

రింపబడినది. ఇట్లు గురుశిష్య క్రమమున వచ్చిన గురుపరంపర ఇది యని తెలుపుచు ప్రణవపంచాక్షర మహామంత్రమును అజపా గాయత్రి మహామంత్రమును విధ్యుక్తముగ నుపదేశించి మంత్రార్థమును తదనుష్ఠాన విధానమును దెలిపి 'ప్రజ్ఞానం బ్రహ్మ' 'అహం బ్రహ్మాస్మి' 'తత్త్వమసి' 'అయమాత్మా బ్రహ్మ' యను వేదాంత మహావాక్యములను బోధించి ప్రత్యగాత్మపరమాత్మయేనని అనుగ్రహించుచువచ్చిన గురుపరంపర అద్వైతాత్మజ్ఞాన గురుపరంపర. ఇట్లుఒకరినుండి ఒకరికి గురుశిష్య క్రమమున పరంపరగ బోధింపబడుచువచ్చినందున బ్రహ్మవిద్య పరావిద్యయనియు చెప్పబడును.

ఈ గురుపీఠ పరంపరాచార్యులు స్థాపించిన మఠములు ఆశ్రమములు విద్యాసంస్థలు ఆంధ్రకర్నాటక తమిళ దేశములందు అనేకములు గలవు ఈవిషయమున మాగురువులు పరమగురువులు తెలుపుచుండినదియు మేము స్వయముగ వెళ్ళి విచారించి తెలిసికొని చూచినది. ఈ శ్రీ ఉమామహేశ్వర గురుపీఠ పరంపరలో శ్రీశివప్రకాశానందస్వామి గురువరేణ్యులు ఉద్దండ మహాపండితులు అనేక గ్రంథ రచయితలు జ్ఞానసిద్ధులగు మహానుభావులు. వీరి అల్లుడుగారైన శ్రీ శాంతలింగస్వామి యను తపోధనులు ఈ విషయము "శరణ చరితామృతము" అను కర్ణాటక (కన్నడ) గ్రంథమున తెలుపబడినది. ఈ గురుపీఠమున గురుపీఠాచార్యులై వెలసిన మహర్షి పుంగవులు.వీరు తంజావూరుకు సమీపమున పేరూరు పట్టణమునందు శ్రీశాంతలింగస్వామివారి మహామఠము గొప్పవిద్యాసంస్థయును గలదు. ఇచట వీరి అధిష్ఠానము ను గలదు.

మఱియు ఈ గురుపీఠమున తాండవరాయస్వామియను ఆచార్యులు ఘన విద్వాంసులుజ్ఞానైక సిద్ధులునగు మహానుభావులు. వీరు "కైవల్య నవనీతము" అను వేదాంత గ్రంథమును ద్రవిడ (తమిళ) భాషయందు రచించినవారు. వీరి శిష్యప్రశిష్య శిష్యశిష్యులై ఈ

గురుపీఠమున వచ్చిన మహాపురుషులు శ్రీసద్గురు ప్రణవానంద స్వాములవారు. వీరు ఇంగ్లీషు, తమిళము తెలుగు కన్నడభాషల నెఱిగిన వారు. పైగ్రంథమును "కైవల్య నవనీత సారసంగ్రహము" అను పేర తమ శిష్యులకు ఆంధ్రభాషయందు ఆరుప్రకరణములచే ప్రశ్నోత్తరరూపముగ రచించి అనుగ్రహించిరి శ్రీ కాశీక్షేత్రమున హరిశ్చంద్ర ఘాట్ నందు కుమారదేవస్వామి మఠసంస్థ గలదు. తమిళదేశమున తిరుచునాపల్లి, ఈరోడ్ జంక్షన్ల మధ్య కరూర్ సిద్ధుల మఠముగలదు. తంజావూరు సమీపమున శ్రీ తిరుప్పన దాళ్ గురుమఠము వెలిసియున్నది. చిదంబరమునకు 25 మైళ్ళదూరములో నుండు ఎరంబూరునందు తత్త్వరాజస్వామి విరక్తాశ్రమము వెలయుచున్నది చిదంబరమునకు సమీపమున విరుత్తాచ్చలము నందు కుమారదేవ స్వామి విరక్తాశ్రమము గలదు. మద్రాసునకు 40 మైళ్ళలో తిరుపేరూరు క్షేత్రమున చిదంబర గురు మఠమున్నది.

మఱియు శ్రీ ఉమామహేశ్వర గురుపీఠ పరంపరలో 24 వ. ఆచార్యులు మహాతపస్సంపన్నులును, సిద్ధపురుషులును, సర్వజ్ఞులు గు బ్రహ్మనిష్ఠాగరిష్ఠులైన శ్రీమద్వేంకటరంగ దేశికులను మహర్షి పుంగవులు. వీరు పరివ్రజించుచు తిరునల్వేలిపట్టణమునకు వేంచేసి ఒక జీర్ణ శివాలయమున విడిదిచేసిరి. అచ్చట విద్యాబుద్ధులుగల వివేకవైరాగ్య సంపన్నులును ఆధ్యాత్మిక తత్త్వజిజ్ఞాసాపరులును మఱియు అనేక గ్రంథముల పరిశీలించినవారు ఇకముందు ఉద్యోగమునకు వెళ్ళవలసిన ఇంగ్లీషు చదివిన యువకులగు శ్రీ పి. నారాయణస్వామి యనువారుండిరి. వీరియందుండు బ్రహ్మజ్ఞానపిపాస, నా గురువు ఎవరా! యను చింతచే రేయింబవలుపరితపింపజేయుచుండెను. ఇట్లుండుతఱి సాక్షాత్ పరమేశ్వరుడే ఈ శ్రీమద్వేంకటరంగ దేశికుల రూపమున వారి పట్టణమునకు వచ్చి ఈ జీర్ణశివాలయమునందుండిన వార్త నుకర్ణాకర్ణిగ విని వారికడకు "తద్విజ్ఞానార్థం సగురు మేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః

శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్" అను శ్రుతిరీతి శిష్యవృత్తిచే శరణాగతుడై వచ్చి గురువుల అనుగ్రహమునకు పాత్రుడై వారి సేవ చేయుచు తత్త్వమసి ఇత్యాది మహావాక్యార్థ పరిజ్ఞానమును వడసి అపరోక్ష ఆత్మజ్ఞానము నొందిరి.

ఇట్లు గురుసాన్నిధ్యమున అహర్నిశములు గడపుచు గురుసేవా తత్పరుడై యుండుట ఇంటిలో తమ తల్లికి ఇష్టము లేదు. కావున ఒక దినము తల్లి ఆలయమునకు వచ్చి శ్రీ వేంకటరంగ దేశికులను జూచి 'ఓ అయ్యా! మాఅబ్బాయిని చెడబెట్టితిరా. మేమేదో గొప్పగా ఖర్చు పెట్టి అబ్బాయిని చదివించి ఇతడు మంచి ఉద్యోగియై సంసారము జేయుచు కీర్తినొందుగాక యని చేసిన మాపనిసంతయు పాడు చేసితిరా స్వామీ అనునిత్యాదిగ మందలించి గట్టిగా దండించెను. అంతమాత్రమున యామాటలు విన్న దేశికుల శిష్యుడు నా గురువు నీవిధముగ నాతల్లి దూషించెనుగదాయని విసుగుజెంది ఇంక నాకేమియు వలదని మహావిరక్తిచే నాడే అదృశ్యమై అడవులబడి వెడలిపోయెను. కారడవులనడచి నడచి ఒకచోట గుహాయందు ప్రవేశించెను. ఆ గుహలో వెళ్ళినకొలది నది విశాలమగు బయలుచే నొప్పుచు అతి నిర్మలముగ నుండెను. అంత మరికొంతదూరము పోగా విశేష ప్రకాశవంతమయిన సువిశాలమగు బయలును అందు మూడు ఆసనములు మరి యోగదండములు కమండలములు గొప్పవగు తాళపత్ర గ్రంథములుండెను.

వాటిని చూచి ఈస్థానము మహాత్ముల ఉనికి పట్టయియున్నది. నేనిచటనే యుండిన వారు కొంతతడవునకు వచ్చెదరు. వారిని సందర్శింతును గదా యను నదిచ్ఛచే దేశికుల శిష్యుడు అచటనే కూర్చుండెను. కాని మూడుదినములాయెను ఎవరునురాలేదు. నేను వచ్చుట వలన నాకగపడరాదని ఆ మహర్షులు రాలేదేమో! ఈతాళపత్ర గ్రంథములనైనను చూచి వెళ్లుద మని నిరుత్సాహముచే యా సింహా

సనముల వద్దకు వెళ్ళి తాళపత్ర గ్రంథములను శ్రీవారు తెఱచి చూచిరి. అంతలో 'అయే వత్సా! అను శబ్దము వచ్చెను. ఆవైపు ననే శ్రీవారు భక్తిచే అంజలి బద్ధులై వీక్షించుచుండ ముగ్గురు పరమఋషులు జటావల్కలధారులై భస్మోద్ధూళితగాత్రులై ఆజాను బాహువులతోనొప్పు మహాపురుషులై దర్శన మొసగిరి. అంత వారు "వత్సా! మూర్తిత్రయమగు మా యంశభూతులే యీ పట్టణమున వసించు శ్రీ వేంకటరంగదేశిక ఋషి పుంగవులు. నీవాతని కడకుం జని యతడుచెప్పినచొప్పున వర్తించుము" అని పలుకుచు అదృశ్యులయిరి.

పిదప శ్రీవారు పులకాంకిత గాత్రులయి ఆశ్చర్యమును ఆనందమును పొందుచు దేశికుల కడకు మరలివచ్చి సాష్టాంగ దండ ప్రణామము లాచరించిరి. శ్రీగురువులు "అయ్యా! త్రిమూర్తులను దర్శించితివా? వారిచటికి పొమ్మని చెప్పిరా?" యని పలికిరి. ఈ మాటలను విని శిష్యుడు మహాశ్చర్యమునొందుచు వీరు సర్వజ్ఞులగు మహర్షులని భావించి ప్రదక్షిణ నమస్కారము లాచరించిరి. ఆ పిదప శ్రీ వేంకటరంగదేశికులు నాయనా! నా యాదేశానుసారము నీతల్లి ప్రీతికొఱకై కొంతకాలము గార్హస్థాశ్రమమున నుండుచు ఉద్యోగము సలుపుము. అనతికాలమున దానినుండి నీవు విముక్తుడ వగుదువు. కించిత్ శేషప్రారబ్ధము నీకీవిధముగ గడచిపోవ నీవు ముందు శ్రీప్రణవానందాచార్యులను తురీయాశ్రమ నామము యోగపట్టము వడసి శ్రీమదుమామహేశ్వర గురుపీఠ పరంపరాచార్యుడవై గురుపీఠ ప్రభను సువ్యాప్తి జేతువని యాశీర్వదించిరి. ఇట్లు గురువాక్యానుసారము కొంతకాలము ఉద్యోగము సలిపి తదుపరి తురీయాశ్రమమును స్వీకరించిరి. పరమహంస పరివ్రాజకాచార్యులై శ్రీమత్పూజ్యపాద శ్రీశ్రీశ్రీసద్గురు ప్రణవానందస్వాములవారు శ్రీమదుమామహేశ్వర గురుపీఠమున 25వ. ఈగురుపీఠాచార్య సింహాసనాధిష్ఠితులయిరి. శ్రీ గురుపీఠసంప్రదాయ ధర్మమును సువ్యాప్తి జేయుచు కర్నూలు

జిల్లా నందిమండలమున నంద్యాల మహానంది క్షేత్రమార్గ మధ్యమున బుక్కాపురము సమీపమున శ్రీ నిర్వాణమఠ మను పేర శ్రీ ఉమామహేశ్వర గురుపీఠ సంస్థను మఠమును (ఆశ్రమమును) స్థాపించిరి. ఆధ్యాత్మికతత్త్వప్రచార మొనర్చుచు అనేక మహనీయుల సమాగమము, సదస్సులు సభలు జరుపుచు అఖండ భగవన్నామ భజన, సప్తాహాది కార్యములు, పూజా పారాయణాదివైదిక కార్యక్రమములు గురుపీఠ సర్వలాంఛనములచే నొప్పు మహోత్సవములు శిష్యభక్తజన పరివేష్టితులై గావింపజేసిరి. 'తత్త్వమసి' మహావాక్యార్థ శ్రవణ మననాదులచే ముముక్షు జనోద్ధరణ మొనర్చుచు, చక్కగా యమ నియమాద్యనుష్టానాది సర్వప్రక్రియలను ఉత్తమభక్త శిష్యజనాళికి విధ్యుక్తముగ తెలిపిరి. వైరాగ్య ప్రకరణము, ముముక్షు ప్రకరణము, ఉత్పత్తిప్రకరణము, స్థితిప్రకరణము, ఉపశాంతిప్రకరణము, నిర్వాణ ప్రకరణమను ఆరు ప్రకరణములచే నొప్పు "కైవల్య నవనీత సారసంగ్రహము" అను గురుశిష్య సంవాదాత్మక మయిన ఉత్తమ వేదాంతగ్రంథమును రచించి ముముక్షువులకు ప్రసాదించిరి.

అయ్యది 1908వ. సంవత్సరము అనంతపురము బి. మునిస్వామి నాయుడు అండ్ సన్స్ - స్వామి విలాస ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది. అందులో శ్రీ ఉమామహేశ్వర గురుపీఠ పరంపర తెలుపబడినది. దానినే ఆమూలమునే ఛందోబద్ధముగావించితిరి. ఇకను ఆంధ్ర కర్నాటక భాషలందు శ్రీగురుపీఠముయొక్క పాటలు పద్యములు పెక్కు గలవు. భక్తాదులనుదినము పాడుచుందురు.

1913వ. సంవత్సరము శ్రీ ఉమామహేశ్వర గురుపీఠము గురుపీఠాచార్యపట్టభద్రులను నిత్యాది రిజిస్టర్డ్ డాక్యుమెంట్సును గలవు. శ్రీప్రణవానంద సద్గురుదేవులు శ్రీసదానంద స్వామివారికి తమ గురువుల చరిత్ర జెప్పుచు, పాదుకలు ఒక బిల్వమణిమాలా గుచ్ఛము, ఒక పంచలోహాత్మకమగు అంగుళి (ఉంగరము) ఒక తాళపత్రము

నందుగల ఈ మూలమును ఇచ్చియుండిరట. ఆ పాదుకలు నేడు గంజి గుంట మఠమున యథాగురుస్థానమునందు పూజింపబడుచున్నవి. అంగుళి బిల్వమణి మాలయు నున్నవి. మఱియు ప్రాతగిలిమూలబడిన ఆ తాళపత్రమును బాగుగా కడిగి పరిశీలించి చూడగాఅందు నాగర లిపి యందిట్లున్నది.

"శ్రీమత్కైలాససంస్థాస్థిరతర పరమానందసామ్రాజ్యప్రోద్య న్నందిస్కంద ప్రముఖ ప్రమథాచార్య వంశక్రమాత్ సద్భక్తానీ కావనేచ్ఛా ప్రవిమలతరబోధ స్వస్వవిజ్ఞాన సంపద్దీవ్యత్స్వర ముమా మహేశ్వరయుతం రారాజతే భారతే॥" అని యున్నది. ఇట్లుండు ఈ పద్యమే వృత్తము ఛందస్సేమి యను నిత్యాదిగ అనుభవజ్ఞులగు పండి తులతో విచారించి సంప్రదించగా వారు పరిశీలించి ఉపలబ్ధ మయిన కొన్ని తాళపత్ర గ్రంథాల్లో ఈలాటి ప్రయోగములు అర్థవంతములయి ఏ ఛందస్సుకు పొందక ఉండేవికూడా ఉన్నవి. ఇవి అర్థవంతములు కావున పూజ్యముగా ఉండినవి ఉండినట్లే ఉంచుట మంచిదనిరి. అందుచే భక్తిచే దీనిని శిలాఫలకము నందు చెక్కించిఆశ్రమములందు "శాసనస్తుతిః"అను పేర్లతో ఉంచబడెను. ఇందు గురుపరంపరానుక్రమముగ మరికొన్ని శ్లోకములు లిఖింప జేయుటయినది. పరమపూజ్య శ్రీశ్రీశ్రీ ప్రణవానందసద్గురు మహా స్వాములవారు తమ శేషప్రారబ్ధమును కేవల నివృత్తిపరముగా గడ పుచు అయిదు ఆరవభూమికల నధిరోహించి శ్రీ శుభకృతు నామసంవ త్సర జ్యేష్ఠ బహుళ ఏకాదశి తమ యవతార లీలలు ముగించిరి. శ్రీవారి అధిష్ఠానము (సమాధి) ఇచటనే శ్రీనిర్వాణమఠమునందు గలదు. అందు యథాశాస్త్రము శివలింగ ప్రతిష్ఠ, శ్రీస్వాములవారి ప్రతిమ (మూర్తి) ప్రతిష్ఠ, శ్రీగణపతి, పార్వతి, నంది, ధ్వజ - ప్రతిష్ఠలు గావింపబడి నిత్యపూజాదులచే శోభిల్లుచున్నది. పూజ్యశ్రీ ప్రణవానంద సద్గురుస్వాములవారి శిష్యులు ప్రముఖులు శ్రీ నిజానంద

స్వామి, శ్రీఆత్మానందస్వామి శ్రీసదానందస్వామి, మఱియు శ్రీ చిదానందస్వామి. శ్రీ ముఖ్యానందస్వామి, శ్రీవిద్యానందస్వామి, శ్రీభక్తానందస్వామి, శ్రీశాంతానందస్వామి ప్రభృతుల గురుపీఠాశ్రమములు రాగులపాడు గుంతకల్లు, గంజిగుంట, బళ్ళారి, గురిజాల, జొహరాపురం, కొత్తపల్లె, ముండ్లపాడు, ఉరవకొండ మున్నగు పలుతావుల యందు గలవు. ఈ గురుపీఠము తరపున 'సుబోధిని' యను మాస పత్రిక కొంతకాలము నడచినది.

ఇట్టి పరమపూజ్య శ్రీశ్రీశ్రీ సద్గురు ప్రణవానందస్వాముల వారి కరకమల సంజాతులు, ఈ శ్రీఉమామహేశ్వర గురుపీఠ పరంపరమున 26వ. ఆచార్యులు సదాచార సంపన్నులు. సహజ సౌమ్య స్వరూప శోభితులు, శైవసాహిత్యాకాశమున చిదాకాశ రూపులై విలసిల్లి జగద్విఖ్యాత మొందిన బసవాది ప్రమథల సద్వంశమునకు జెందిన వీరశైవులు, వీరప్పస్వామి యను పూర్వాశ్రమాభిధులు, అనంతపురంజిల్లా గంజిగుంట గ్రామవాసులైన సద్గృహస్థులు. శ్రీసద్గురు ప్రణవానందాశ్రమ స్థాపకులు. వీరి చరిత్ర మగాధము. "శ్రోత్రియో బ్రహ్మనిష్ఠోయః ప్రశాంతస్సమదర్శినః నిర్మమో నిరహంకారో నిర్ద్వంద్వో నిష్పరిగ్రహః అనపేక్షః శుచిః దక్షః కరుణామృతసాగరః ఏవమ్ లక్షణసంపన్నః సగురుర్బ్రహ్మవిత్తమః" అను వాక్యానుసారము శ్రీ వారియందిట్టి గురులక్షణము లుండెను. వీరియందుండు ఆ బ్రహ్మానుభవశక్తి తెరచాటుననుండు సూత్రధారిపగిది గుప్తముగ నుండుచు ఒక్క పెట్టున బహిర్గతమై బహిర్ముఖులగు శిష్యుల భక్తుల చిత్తములను చిదాత్మాభిముఖ మొనర్చెడి శక్తిపాత దృష్టి గలిగి యుండెను. శ్రీవారు సంతతము గురుభక్త జనులకు భక్తిజ్ఞాన వైరాగ్యోపేత బ్రహ్మజ్ఞాన తత్త్వమును తెలుపుచు మాండూక్యాద్యుపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత, వేదాంతపంచదశి, విచార

సాగరము, నైష్కర్మ్యసిద్ధి, ఉపదేశ సాహస్రి, వివేక చూడామణి, శ్రీమన్నిజగుణ శివయోగుల షట్ప్రాస్త్రము మున్నగు వేదాంత ప్రకరణ గ్రంథములను చక్కగ ఔపనిషదనుభవ దృష్ట్యా వివరించి బోధించుచు ధన్యులుజేసిన బ్రహ్మనిష్ఠాపరులగు మునీశ్వరులు.

వీరు సదాశిష్యులకు ప్రసాదించు ఉక్తగ్రంథముల సారసంగ్రహమును తమ అనుభవమున పాకమొనర్చి 'శ్రీ ప్రణవానంద సద్గురు బోధామృతము'' అనెడి గాన ప్రధానమగు గ్రంథమును సులభమగు భాషయందు రచించిరి. మఱియు శ్రీ చిదానందావధూత స్వాముల వారు కన్నడభాషయందు రచించిన "జ్ఞానసింధు'' అను ఉత్తమ వేదాంత ప్రకరణగ్రంథమును ఆంధ్రీకరించిరి. ముముక్షుజనోపయుక్తమగు నీగ్రంథమును మద్రాసు వెస్టువార్డ్ కంపెనీవారు తాము ముద్రింపించుకొన గోరగా వారికి ముద్రణాధికారము సర్వహక్కుల నొసగిరి. ఆశ్రమమునకు అనేకమహాత్ముల శుభాగమనము ఆధ్యాత్మిక తత్త్వ ప్రబోధలు విరివిగ గావింపజేసిరి. 1934వ. సంవత్సరము శ్రీ ఉమామహేశ్వర గురుపీఠము శ్రీసద్గురు ప్రణవానందాశ్రమము (మఠము) రిజిస్టర్డ్ డాక్యుమెంట్సును గలవు. పూజ్యశ్రీవారు సహజనిష్ఠచే 5వ భూమిక నధిరోహించి కాషాయాంబరములనందుకొని శ్రీవిజయకార్తిక బహుళ ఏకాదశి (క్రీ శ. 1.12.1953) విదేహకైవల్యము నొందిరి. పూజ్య శ్రీసదానంద సద్గురుస్వాములవారి అధిష్ఠానము (సమాధి) గంజిగుంట శ్రీమఠమునందు గలదు. అందు శాస్త్రోక్తముగ శివలింగ ప్రతిష్ఠ శ్రీగురుదేవులమూర్తి ప్రతిష్ఠగావింపబడి నిత్య పూజాపారాయణ శాస్త్రప్రవచనాది కార్యములు యథావిధి జరుపబడుచున్నవి.

(కైవల్య నవనీతసారసంగ్రహమునుండి సంగ్రహము)



# శ్రీ ఉమామహేశ్వర పీఠ
# గురుపరంపరా స్తోత్రము

కైలాసేశ ముమానాథం తథా నందీశ్వరం గురుమ్
సనత్కుమారం సూతర్షిం సర్వదా తం నమామ్యహం ॥ ౧
నమామి భగవన్నాథం కరూర్‌సిద్ధ మరుళ్ మునిం ।
తచ్ఛిష్యంచ కళూర్ మౌనిం పరమౌనిం భజామ్యహం ॥ ౨
తిరుప్పనందాళగురుం తథా మధురపుంజకం ।
యోగీశ్వరం తిరునటరాజం భక్త్యాస్మరామ్యహమ్ ॥ ౩
శివప్రకాశం యోగీశం స్వరూపానంద ముత్తమం ।
తత్త్వరాజస్వామినం తం శాంతలింగార్యకం తథా ॥ ౪
కుమారదేవం తచ్ఛిష్యం చిదంబరగురుం విభుం ।
నారాయణాచార్య గురుం భూమాతాండవ రాయకమ్ ॥ ౫
తాతార్యం తిల్లినాథంచ తథా వేంకటరంగకం ।
ప్రణవానంద మౌనీశం జ్ఞానినం తత్సుశిష్యకౌ ॥ ౬
ఆత్మానంద సదానంద యోగినౌ పరమౌ గురూ ।
తచ్ఛిష్యంచ తపోనిష్ఠం శ్రోత్రియం శాంతరూపిణం ॥ ౭
శ్రీ శంకరానందగిరిం ప్రణమామి ముహుర్ముహుః ॥
అన్యానస్మద్గురూన్ వన్దే సత్త్వశుద్ధ్యై నతోస్మ్యహం ॥ ౮
శ్రేయోస్తూమామహేశాఖ్య పీఠస్థేభ్యో సదాపరం ।
తచ్ఛిష్యేభ్యః ప్రశిష్యేభ్యః సర్వేభ్యశ్చాస్తు మంగళం ॥ ౯
ముముక్షుభ్యః సాధకేభ్యః సర్వదాస్తు సుమంగళం ॥
సచ్చిదానందరూపస్య ప్రసాదాత్సర్వ మంగళం ॥ ౧౦
ఓం మంగళం ప్రణవానంద సదానంద చిదాత్మనే ।
గురవే శంకరానందగిరయే శుభమంగళమ్ ॥ ౧౧

ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో
వంశ ఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః
ఓం నారాయణం పద్మభువం వశిష్ఠం శక్తించ
తత్పుత్ర పరాశరంచ,
వ్యాసం శుకం గౌడపదం మహాంతం,
గోవిందయోగీంద్ర మథాస్య శిష్యమ్,
శ్రీ శంకరాచార్య మథాస్య పద్మపాదంచ
హస్తామలకంచ శిష్యమ్
తం త్రోటకం వార్తికకారమన్యా
నస్మద్గురూన్ సంతత మానతోస్మి.

ఓం హరలీలావతారాయ శంకరాయ పరౌజసే,
కైవల్య కలనా కల్ప-తరవే గురవే నమః
శుద్ధ స్ఫటిక సంకాశం శుద్ధవిద్యా ప్రదాయకం,
శుద్ధం పూర్ణచిదానందం సదాశివ మహంభజే.



ఓం

ఓం నమోభగవతే శ్రీమదుమామహేశ్వరాయ
శివాయ గురవేనమః

# శ్రీ శంకరానందగిరి గురువరచరిత్ర

శ్లో॥ శాన్తం పద్మాసనస్థం శశిధరమకుటం పంచవక్త్రం త్రినేత్రం
శూలం వజ్రంచఖడ్గం పరశుమభయదం దక్షభాగేవహన్తం
నాగం పాశంచ ఘంటాం ప్రళయహుతవహం సాంకుశం
వామభాగే నానాలంకారయుక్తం స్ఫటికమణి నిభం పార్వతీశం
నమామి ॥

— ఓం నమో భగవతే శ్రీమదుమామహేశ్వరాయ —



శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీమత్పూజ్యపాద

శ్రీశ్రీశ్రీ శంకరానందగిరి గురుస్వాములవారు

చరిత్రనాయకులు



ఓం నమోభగవతే శ్రీమదుమామహేశ్వరాయ
శివాయ గురవే నమః

# శ్రీ శంకరానందగిరి గురువర చరిత్ర

## జననము

పుణ్యపురుషులవతరించిన పవిత్రక్షేత్రము మన భారతభూమి. వేయేల ? భగవానుడు శ్రీకృష్ణపరమాత్మ తన బాలలీలలం దొకప్పుడు భారతభూమిమట్టిని మహాప్రసాదమని యెంచి భుజించిన పవిత్రభూమి. కాన ఇట్టి పావన భారతావనియం దెందరో మహాపురుషు లవతరించిరి. అట్టివారిలో మన మండల మహనీయులగు పూజ్య శ్రీశంకరానందగిరి గురుస్వాముల వారును నొకరు.

వీరు ఆంధ్రరాష్ట్రమున అనంతపురం జిల్లా ఉత్తవరము అను గ్రామమున పంచ మహాపీఠములం దొకటగు కాశీజ్ఞానసింహాసన మఠము శ్రీమజ్జగద్గురు విశ్వారాధ్య గురు పరంపరకు జెందిన స్కంద గోత్ర (పంచవర్ణకమ్) పంచవణ్ణిగిసూత్ర, వీరశైవ మహేశ్వర సదాచార సంపద్విశిష్టులు, వేదమూర్తులు నగు శ్రీ శివయ్యస్వామి గంగమాంబలను పుణ్యదంపతులకు స్వస్తిశ్రీ రౌద్రినామ సంవత్సర ఉత్తరాయణ, గ్రీష్మఋతు,జ్యేష్ఠబహుళ, త్రయోదశి సోమవారము రాత్రి 14-6-1920 తేదీన కుమారుడై జన్మించిరి. తండ్రి వీరికి "చన్నబసవస్వామి" అని నామకరణము గావించిరి.

శ్రీ ఉమామహేశ్వర గురుపీఠాచార్యులు శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమత్పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శంకరానంద గిరి గురువర స్వాములవారి దివ్యజాతకమును పరిశీలించగాయి ందం గ్గత ముగా నున్న వెసి, వాసి, ఉభయాచరి, హంస, బుధాదిత్య, లక్ష్మి, పాగ, సదాసంచార, అమరనాథ, సత్కథాశ్రవణ, నిష్కపట, బుద్ధి మాతుర్య, దాతృత్వ యిత్యాది అనేక యోగములు బలీయములై ప్రస్ఫుటముగా సంపూర్ణముగా యోగఫలమును పుణ్యజాతకునకు సిద్ధింపచేయుచున్నవి.

మన పుణ్యచరిత్ర నాయకుడు మేష లగ్నమందు జన్మించి,తల్ల గ్నాధిపతి కుజుడు లగ్నాత్ షష్ఠమమందుండుటచేతను లగ్నముకున యే యితర శుభ గ్రహదృష్టి లేకపోవుటచేతను లగ్నాధిపతి కుజుడు స్వంత నక్షత్రము చిత్త యందుండి లగ్నమునువీక్షించుటచేతను జాత కుడు జన్మించినది లగాయతు బలహీనముగ అనారోగ్యముగ పదునెని మిది వత్సరముల వరకు వుండి యుండవచ్చును. హంసయోగ ప్రభా వితుడగుటచేతను మరియు లగ్నమందు మోక్షకారకుడైన కేతువుండ డముచేతను జాతకుడు బ్రహ్మవిద్యాచార విచారప్రచార సంపన్న డయి పూజ్యుడై మోక్షస్వరూపుడై విరాజిల్లును. ఇందుకు ప్రమాణ ముగాజ్యోతిశ్శాస్త్రప్రపంచమునకు తెలిసినఉత్తమపంచమహాపురుష యోగములని ప్రసిద్ధివహించిన హంస, మాలవ్య, సాస, రుచక, భద్ర యోగములలో ప్రప్రథమముగా చెప్పకొనబడు హంసయోగము బహు ఉత్కృష్టముగా పూర్ణముగా జాతకచక్రమునందు గోచరించు చున్నది. వీరికి అనేక ధనయోగములు రాజయోగములు విద్యా యోగములు ఉన్నను గ్రంథవిస్తరణమగునని అతిప్రధానమైన కేవ లము హంసయోగమును మాత్రము ప్రకటించుచున్నాము.

హంసయోగము — బృహస్పతి స్వక్షేత్రమందుగాని లేక ఉచ్ఛ క్షేత్రమందుగాని కేంద్రస్థితిని పొందిన యెడల హంసయోగ జాతకు

## నిరయణగ్రహ స్ఫుటము

| లగ్నం గ్రహములు | స్ఫుటము రా. భా. లి. | నక్షత్రం | పాదం | అధిపతి రాశికి | నక్షత్రంకి | అ.నక్షత్రంకి |
|---|---|---|---|---|---|---|
| లగ్నం | 0_26_54 | కృత్తిక | 1 | కుజ | రవి | రవి |
| రవి | 2_0_52 | మృగశిర | 3 | బుధ | కుజ | బుధ |
| చంద్ర | 1_7_28 | కృత్తిక | 4 | శుక్ర | రవి | కేతు |
| కుజ | 5_29_52 | చిత్త | 2 | బుధ | కుజ | శని |
| బుధ | 2_21_12 | పునర్వసు | 1 | బుధ | గురు | గురు |
| గురు | 3_22_26 | ఆశ్లేష | 2 | చంద్ర | బుధ | చంద్ర |
| శుక్ర | 1_25_41 | మృగశిర | 1 | శుక్ర | కుజ | రాహు |
| శని | 4_13_29 | పుబ్బ | 1 | రవి | శుక్ర | శుక్ర |
| రాహు | 6_20_59 | విశాఖ | 1 | శుక్ర | గురు | గురు |
| కేతు | 0_20_59 | భరణి | 3 | కుజ | శుక్ర | గురు |
| ఇంద్ర | 10_12_57 | .... | . | శని | ... | .... |
| వరుణ | 3_16_59 | .... | . | చంద్ర | .... | .... |
| రుద్ర | 2_14_15 | .... | . | బుధ | ... | ... |

## నిరయణ భావ స్ఫుటము

| భావము పేరు | స్ఫుటము ప్రారంభము రా. భా. లి. | అంత్యము రా. భా. లి. | అధిపతి రాశికి | నక్షత్రంకి | అ.నక్షత్రంకి |
|---|---|---|---|---|---|
| తను | 0_26_54 | 1_24_57 | కుజ | రవి | రవి |
| ధన | 1_24_57 | 2_20_32 | శుక్ర | కుజ | రాహు |
| భాతృ | 2_20_32 | 3_17_04 | బుధ | గురు | గురు |
| మాతృ | 3_17_04 | 4_17_16 | చంద్ర | బుధ | బుధ |
| పుత్ర | 4_17_16 | 5_21_20 | రవి | శుక్ర | చంద్ర |
| శతృ | 5_21_20 | 6_26_54 | బుధ | చంద్ర | శుక్ర |
| కళత్ర | 6_26_54 | 7_24_57 | శుక్ర | గురు | శుక్ర |
| ఆయు | 7_24_57 | 8_20_32 | కుజ | బుధ | రాహు |
| భాగ్య | 8_20_32 | 9_17_04 | గురు | శుక్ర | గురు |
| రాజ్య | 9_17_04 | 10_17_16 | శని | చంద్ర | శని |
| లాభ | 10_17_16 | 11_21_40 | శని | రాహు | శుక్ర |
| వ్యయ | 11_21_40 | 0_26_54 | గురు | బుధ | రవి |

కృత్తిక 4 వ పాద. జననకాల మహాదశా శేష 1స.1నె. 20ది.

| | | | |
|---|---|---|---|
| | ల కే | చ శు | ం బు రు |
| ఇ | రాశి కుండలి | | గు వ |
| | | | శ |
| | | రా | కు |

| | | | |
|---|---|---|---|
| చ | బు రా | | కే |
| | నవాంశ కుండలి | | |
| గు | | శు శ | ఇ |
| ల | | ర కే | కు |

| | | | |
|---|---|---|---|
| ల చ | ర శు రు | బు వ | |
| | భావ కుండలి | | గు శ |
| | | | |
| | | | కు రా |

జనన తేదికాలము:14/15-6-1920.3-37A.M.I.S.T ల త్తవరం3X.17ని

నక్షత్రకాలము:20.48.35. Long : 77'.30" E LAT : 15,.8"N

ఆయనాంశ 22'.38"

డని పిలువబడును. ప్రత్యక్షప్రమాణములతో నిరూపించుటకు జాతకుని పాదములయందు శంఖ, పద్మ, మత్స్య, అంకుశ చిహ్నముల యందే దొకటైనను వుండును.* హంసయోగ జాతకులని శ్రీరామ, కపిలమహర్షి, శ్రీకృష్ణ, సీజర్, జీసస్ క్రైస్ట్, స్వామి విద్యారణ్య, అరవింద, ఆరవజార్జి ప్రభువు, మన పుణ్యచరిత్రనాయకులు శ్రీ శ్రీ శ్రీ శంకరానందగిరి గురువర స్వాములవారలను పేర్కొనవచ్చును. హంసయోగ జాతకులు సాంఖ్యశాస్త్ర జ్ఞానంతోను అపరోక్ష జ్ఞానానుభవముతోను కర్మబంధముల భేధించెదరు. అపారమైన ప్రేమ దయార్ద్రి హృదయము గలవారై ధర్మప్రతిష్ఠాపకులై సతతంతులయి విశ్వ మానవ శాంతి సౌభాగ్యమునకు తమజీవితమును అంకితము చేయుదురు. ప్రధానముగ ఈజాతకులుఅలలులేని సముద్రమువలె ప్రసన్న గంభీరమైన మనస్సు గలవారుగా నుండి జ్ఞానప్రబోధ మొనర్తురు.

## బాల్యము – విద్యాభ్యాసము

మాతాపితృలు భక్తితో కేదార గౌరీవ్రతము సలుప కలిగిన ఏకైక పుత్త్రుడగు నీస్వామి, కన్న తల్లిదండ్రుల కమితానందము

---

* శ్రీవారి పాదములయందు శంఖ, పద్మ, అంకుశ, చిహ్నములున్నవి.

గలుగజేయుచు, దినదినాభివృద్ధినొంది విద్యాభ్యాసమునకు దగు వయస్సు రాగానే స్వగ్రామముననే 4 - 5 తఱగతుల వఱకు తెనుగు జదివెను. ఆ పిమ్మట అచ్చటికి సమీపమున నుండు ఉరవకొండలోని "కరిబసవస్వామి-బోర్డు హైస్కూలు"లో జేరెను.

వీరికి బాల్యమునుండియు భగవద్భక్తి మిక్కుటము. ప్రతిదినము వేదోక్త విధులచే శివపూజ రెండుమూడు ఘంటలసేపు జేయుచు తన్మయులగుచుండెడివారు. వీరికి విష్ణువిగ్రహమన్న అత్యంత ప్రీతి. చేతియందు విగ్రహము నిడుకొని యాడుచు పాడుచుండెడివారు. ఈ స్థితి భావిజీవితమున కలుగు శివకేశవభేద ప్రతిపాదకమగు అద్వైత దర్శనమునకు మార్గదర్శకమేమో !

శ్రీవారి బాల్యలీలలుఅద్భుతములు. పండ్రెండు పదమూడేండ్ల వయసుననే "వీరికి నేను భగవంతుని కన్నులారా చూచి రావలెను"-అను నిచ్ఛ తీవ్రముగ పొడముచుండెడిదట. అందుచే నొకదినమున 'నేను దేవునిచూచుటకై యడవులకు వెళ్ళినాను. నన్ను గురించి మీరు చింతింపరాదు" అని ఒక కాగితముపై వ్రాసి యింటిలోతమ పుస్తకములపెట్టెపై బెట్టి తోడిమిత్రులగు బి. ఆంజనేయులు అను బాలునితో సహాబయలు వెడలి పెన్నా నదీతీరమున పెన్నహోబిళపు టడవుల ప్రవేశించిరి. అంత మరుసటిదినము ఇంటిలోని వారీ కాగితమును చూచుకొని దుఃఖాక్రాంతులైరి అడవులకు బయలుదేరిన వీరిద్దరును తమ తమ తలిదండ్రులకు ఏకైకపుత్త్రులు కాబట్టి వారిం గన్న కడుపులలో ఎంతటిదుఃఖాగ్ని బయల్వెడలెనో చెప్పశక్యమా? తోడనే ఎక్కడి వారక్కడ వెదకుటకై వెళ్ళిరి. వారిలో నొకరు పెన్నహోబిళ ప్రాంతమున వెదకుచు వచ్చి శ్రమదీర్చుకొనుటకై నదీతీరస్థమగు నొక అశ్వత్థవృక్షచ్ఛాయలో గూర్చుండి యుండిరి.

ఇంతలో నడవియందున్న ఈబాలురు ఒక విచిత్ర సన్నివేశము నెదుర్కొనిరి. ఎవరో ఒకవ్యక్తి ఈ బాలురనుచూచి,

"ఓ నాయనలారా! ఇటురండు మీా రెటకేగుచున్నారు ? అది మార్గముడాదే!" — అని యడిగెను

బా : అయ్యా, మేము దేవుని చూచుటకై కొండ లెక్కు చున్నాము.

ఆవ్యక్తి : (మహాసంతోషముతో) "నాయనా! మిమ్ముం గన్న తలిదండ్రు లెంతటి పుణ్యాత్ములోగదా! చిన్నతనముననే ఈ దొడ్డ బుద్ధి మీా కెట్లుబుట్టెనో ! నిజముగా మీారు పుణ్యాత్ములే! రారండు" అని చేరంబిలిచి, అయ్యలారా ! మీా యిచ్ఛ చాల మంచిదే గాని మీారింకను కొంతకాలమింటి యొద్దనుండుచు చక్కగా విద్య నభ్య సించి బుద్ధిమంతులై దైవభక్తి గలిగి మెలగుచుండుడు. ఆ దేవుడే మీాయొద్దకు వచ్చును నాయనలారా! ఇపుడశవులకు పోరాదన్నా!" అని లాలించి వెనుకకు మరల్చెను.

దైవయోగము నెవరెఱుంగుదురు? ఆ వ్యక్తి రూపమున భగ వంతుడే బాలురను గృహమార్గమునుపట్టించెను. లేకున్న కొండలలో కండ్లు మూసికొని, మరేమి చూడక కండ్లకు బంకనంటించుకొని భగవ న్నామ స్మరణ జేయుచు గూర్చుండవలెననియు, తమ యొద్దకు భగ వంతుడే వచ్చి కండ్లు విప్పవలెననియు, అంతవరకు కూర్చున్నవారు పైకి లేవకూడదనియు నిశ్చయించుకొని యుండిరట. అట్లే యగుచో పాప మాపట్టుపట్టిన యా పాప లేమయ్యేడివారోగదా ! భగవంతుడే వారికట్లు త్రోవచూపగా బాలురు మెల్లగా రోడ్డుపైకి వచ్చిరి.

అంతకు ముందు తమకై వెదకుచు వచ్చి విశ్రాంతికై రావి చెట్టుక్రింద కూర్చుండి యుండిన వారికంటికి వీరు గనబడగానే వారు పరుగెత్తుకొనివచ్చి కలిసికొని కోల్పోయిన పెన్నిధిని గన్న వారివలె మిక్కిలి సంతసించుచు, వారి స్థితిని జూచి కొంత వంతచే "ఎందరిని దుఃఖ పెట్టితిరి నాయనా! ఇట్లు పోవుట మీాకుతగునా ?" అని మంద లించి దోడ్కొనివచ్చుచు దారిలో ముస్టూరు గ్రామము రెడ్డి గారిచే

వీరిని వెదకుటకై పంపబడిన మనుష్యులను కలిసికొని అందరును రెడ్డి గారి ఇంటికి వచ్చిచేరిరి. అచ్చట స్నాన పూజ భోజనాదులు చేసిరి. ఈ బాలుర గొప్ప భావములకు అచటివారందరు మిక్కిలిసంతసించిరి అచ్చెరువు నందిరి. నేటికిని ఈ రెడ్డిగారు మన శ్రీవారిని చూడగా పరమప్రీతితో "అడవిస్వామి, అడవిస్వామి" అని పిలుచుట గలదు. మరుదినమందరు స్వస్థానము చేరిరి.

ఈ విధములగు భవిష్యజ్జీవిత శుభసూచక క్రియలు ఈస్వామి యందు చిన్నతనము ననే కాన్పించుచుండెను.

అయితే మామూలుగా తమ యున్నత పాఠశాలా విద్యా విధానమున పరమశ్రద్ధతో వర్తించుచు ప్రథమ శ్రేణియం దుత్తీర్ణు లగుచు బహుమాన గ్రంథముల వడసిరి. ఇట్లు భగవద్భక్తి దినదినాభి వృద్ధియగుచుండ భూమిలో దాగియున్న విత్తు అదను వచ్చినప్పు డంకురించునట్లు వీరి యాధ్యాత్మిక సంస్కారబీజము లంకురించుటకును సమయము వచ్చెను. అంత గొంతకాలమునకే శ్రీఆత్మానంద సద్గురు వరేణ్యుల సచ్ఛిష్యులును, ఆధ్యాత్మిక తత్త్వవేత్తలును నగు దోణే కల్లు వీరయ్యస్వామి యనువారు లత్తవరమున కధ్యాపకులుగ వచ్చి చేరిరి మన చన్నబసవస్వామికి వీరియెడ మిక్కిలి పూజ్యబుద్ధి గలిగెను. ప్రతిదినము బడినుండి వచ్చినపిదప వీరి యొద్దకువెళ్ళి భక్తి వినయము లతో మెలగుచుండెను. ఈస్వామి సంస్కారం గనుగొని వీరయ్యస్వామివారు పెక్కు ధార్మికాధ్యాత్మికాది విషయంబులను తెలుపుచు క్రమముగా వేదాంత పంచదశి, నైష్కర్మ్యసిద్ధి అను నీ గ్రంథము లందలి తత్త్వములను బోధింప నారంభించి ఈ స్వామి చిత్తవృత్తిని ఆధ్యాత్మిక తత్త్వాభిముఖ మొనర్చిరి. వీరే మన గురువరేణ్యులకు ప్రప్రథమ మార్గదర్శకులు.

ఇట్లుండ కొద్ది రోజులలో కాగులపాడులోని శ్రీ ప్రణవాత్మా నందాశ్రమమున జరుగు శ్రీ ఆత్మానంద సద్గురు స్వాముల వారి

పుణ్యారాధన మహోత్సవమునకు ఈ వీరయ్యస్వామివారు మనచన్న బసవస్వామిని వెంటబెట్టుకొని ఆశ్రమమునకు వెళ్ళిరి. ఆ సంవత్సరమా సమావేశమునకు అధ్యాత్మవిద్యావాచస్పతి, వేదాంతకేసరి, పౌరాణిక గజసింహ, కలియుగవ్యాస ఇత్యాది బిరుదాంకితులు సదాచార సంపన్నులు నగు శ్రీసంగమేశ్వరశాస్త్రిలవారు వచ్చియుండిరి. ఇంకను పెక్కు సాధు సత్పురుషులు వచ్చియుండిరి. నిండుసభలో శ్రీ శాస్త్రిగారు ఉపన్యసింప మొదలిడిరి అచ్చటనే కూర్చుండియున్న మన చన్నబసవస్వామి ఆ సభను చూచి పరమానంద మందిరి. తామును ఉపన్యసింపవలెనను కుతూహలముతో ఉవ్విళ్ళూరుచుండిరి ఉపన్యాసకులగు శ్రీ సంగమేశ్వర శాస్త్రిగారు వేదికపైనుండియే ఈ చన్నబసవస్వామి యొక్క ఉత్సాహ చిహ్నములను కనుగొని వెంటనే "అయ్యా! ఆ అబ్బాయి ఎవరో ఆయనయందున్న తేజస్సు ఉపన్యసింప నుప్పొంగి వచ్చుచున్నదే! ఇట్లు రానిండు. ఏ పుట్టలో ఏ పాముండునో!" యనుచు తమ ప్రవచనము నాపి ప్రియముగా పిలిచి తమచెంత నిలబెట్టుకొని ఊఁ, ఆరంభించు నాయనా!" అని పల్కిరి. అపుడీ బాలభానుడు ముద్దులొలుకు పలుకులతో సభను ముగ్ధము జేసెను. ఏమైననేమి? ఆ చిరుతప్రాయమున నిండు సభయందు ధైర్యముతో స్వాముల వారిచెంత నిలబడి పల్కినబాల భాషితముల కందరు అమందానంద మందిరి. ఆనాడే మన బాలగురు వచట జేరిన మహాత్ముల మనోవీధులలో సుప్రతిష్ఠితుడయ్యెను. ఇది వీరి భావి జీవితగురుకులవాస యశమున కొక కరదీపిక యయ్యెను. ఆనాటిసభలో శ్రీవారి గురువులగు పూజ్యపాద శ్రీశ్రీశ్రీ సదానంద సద్గురు స్వాములవారును ఉత్తమాసనమునలంకరించి భావి శిష్యుడగు మన చన్నబసవస్వామి పలుకులను ముదమలర వినుచుండిరి. కార్యము పూర్ణమైన పిమ్మట ఇద్దఱును లత్తవరము వచ్చిరి.

ఇట్లు చన్నబసవస్వామికి మోక్షేచ్ఛ అధిక మగుచుండ తమ హైస్కూలు విద్యయందు 9వ తరగతినుండి 10 వ తరగతికి వచ్చిరి.

శ్రద్ధతోనే చదువ నారంభించిరి. కాని యాసమయమున కొన్ని యిడుములల బడవలసి వచ్చెను. వీరికి ఆస్తిపాస్తు లేవియును లేకగాదు. కావలసి నంతగ స్థిర చరాస్తు లుండియు కష్టపడవలసి వచ్చెను. ఏలన పుత్రుడు చదువుకొనుట తల్లి కిష్టము లేదు. చదువు చాలించి ఉన్న ఆస్తి పాస్తుల జూచుకొనుచు ఇంటియొద్ద నే యుండవలెనని యామె కోరిక అట్లుకాకున్న డబ్బీయనని యామె పట్టుపట్టెను. ఇతనితండ్రియో దైవయోగమున పిచ్చివారైరి. ఈయనకో (శ్రీస్వామికి) చదువు మానుట ఇష్టములేదు. ఇక చదువు జరుగుటెట్లు? ఏమైన నగుగాక "క్షమా వీరస్య భూషణం" యన్నట్లు ఎన్నికష్టములకైననోర్చి చదివియే తీరవలెనని పట్టుపట్టి భిక్షావృత్తి నవలంబించి సంచరించుచు ఎట్టకేలకు గంజిగుంట శ్రీసద్గురు ప్రణవానందాశ్రమమునకు వచ్చిరి. ఇచ్చట ధనికులును ధార్మికులును నగు శ్రీమాన్ వెలనాటి వెంకటప్పగారి నర్థింప నచ్చి యుండిరి.

ఆ సమయమునందాశ్రమమున శ్రీసదానంద ద్గురు స్వాములవారు, ఆత్మానంద స్వామి వారి శిష్యులగు శ్రీసహజానందస్వామి మున్నగు భక్తాదులతో గూడి పరమగురు విరచితంబగు కైవల్యనవనీత సారసంగ్రహ గ్రంథప్రసంగము జరుపుచుండిరి. ఆనాడు శ్రీ ప్రణవాత్మానందాశ్రమమున జూచిన ఈ బాలుని స్మృతి గురువుల హృత్ఫలకము నందు ముద్రితమై యుండెను. ఈ బాలుడు వచ్చి, భక్తితో నమస్కరించెను. వారును సాదరముగ గూర్చుండబెట్టి ప్రియవచనములతో "వచ్చిన పనియేమి నాయనా?" అని విచారించుచుండగానే శ్రీ వెంకటప్పగారును అటకు వచ్చిరి. మన చన్నబసవస్వామి తమరాకను గూర్చి విన్నవించెను. అంతయు నాలకించి శ్రీ వెంకటప్పగారు చన్నబసవస్వామిని చూచుచు "స్వామీ! ఈ కుక్షింభరమగు విద్య మీ కెందుకు? మీరు జన్మతః గురుకుల సంజాతులగు మహేశ్వరులు మీరు మాస్వామి యొద్దనే యుండి బ్రహ్మవిద్య నభ్యసింపుడు మీకు వలసిన మొత్తము నేను భరింతు" నని మిక్కిలి ప్రేమాదరణములతో

జెప్పెను. ఈ మాటలు వినిన అక్కడి వారందరు పరమ సంతుష్టులైరి. అంత శ్రీగురుస్వామివారు కడుగారాబముతో "స్వామి, మీరువచ్చిన ముహూర్తము మంచిది. ఇదిచాల మంచి యవకాశము, దీనినిబోగొట్టు కొనక మీజన్మ సాఫల్యమునకు హేతువైన బ్రహ్మవిద్యనుసాధిం పుడు. ఇచ్చటనే ఆశ్రమమున వసింపుడనిరి. ఈ పలుకులను విన్న మన చన్నబసవస్వామి చిత్తము పరివర్తిత మయ్యెను. ఇనుము నయ స్కాంతము లాగినట్లు శ్రీగురుమహాసన్నిధి, స్వామి హృదయమును లాగి వేసెను. వెంటనే గురుసన్నిధికి వచ్చెదనని చెప్పి అతి ముదంబున వందనము లాచరించి ఉత్తరము వెళ్ళిరి.

పుణ్యమూర్తి యగు శ్రీవెంకటప్పగారి సంకల్పమెంత ఔదార్య పూర్ణమోకదా! ఈ చన్నబసవస్వామి యొక్క జన్మ ధన్యత కది పునాది యయ్యెను. మరుదినము సోమవారమునాడు హైస్కూలుకు వెళ్ళి తమ పుస్తకము లన్నియు మరొక బీద విద్యార్థి కుచితముగా నిచ్చి తమకు వచ్చుచున్న విద్యార్థి వేతనమును వేరొక బీదవిద్యార్థి కిండని ప్రధానోపాధ్యాయులతో సవినయముగ విన్నవించుకొనుచు "మహాశయా! నేనికబడికిరాను. గురుకులమున తపమాచరింపవెళ్ళెద" నని ధైర్యముగా బల్కిరి అందుల కాదయా నిధులు, సదాచార సంపన్నులగు ప్రధానోపుధ్యాయులు బ్రహ్మశ్రీ పి. రాఘవేంద్రా చార్యులు "ఆ, ఏమి ? ఇంత చిన్నవయస్సులోనే నీకింత గొప్పకోరికా! నీకిదెట్లు బొడమెనయ్యా ? నీ మాటలు విన్నచో పూర్వ ఋషులు తలంపునకు వచ్చుచున్నారే! ఆకాలమున బ్రహ్మచారులు గురుకులము నకు వెళ్ళి వేదవిద్య నధ్యయనము జేయుచు తపస్సు చేసుకొనుచుండి రని పురాణమునందు వినబడుచున్నది. ఇంత మంచిమాట ఈనాడు నీ నోటి నుండి వెలువడు చున్నదే! శెబాష్! చాల మంచిదే! కాని ఇంకను ఒక్క సంవత్సరము పాటు మెట్రిక్కు వరకు ఇచ్చటనే చదివి యుండిన నీ కన్నివిధముల అభ్యుదయమునకు అవకాశ ముండెడిది

కదా!" అని చెప్పిరి. అంతులకు బ్రహ్మవిద్యాభిలాషగల శ్రీచన్నబసవ స్వామి "అదియును చదువే గదా! దేవా! ఆ బ్రహ్మవిద్య నాకు బాగుగ వచ్చునట్లు ఆశీర్వదించండి" ఇత్యాది వినయ సంపన్నమగు వాక్యాలతో అధ్యాపకు లందరికి వందనము లాచరించి స్వగ్రామము నకు వచ్చెను.

ఇక్కడను ఈ విషయ మెల్లరికి దెలియ జేయగా నింటివారు సమ్మతించలేదు. తోటిమిత్రులు అడ్డుపడిరి. కాని యా తీవ్రమగు గురు సన్నిధి యనెడి అయస్కాంతము వీరి సంస్కృత చిత్తమనెడి యినుము నాకర్షించు చున్నది. ఎవరేమి చేయగలరు! వెంటనే ప్రయాణమును నిశ్చయించిరి. ఇదే శ్రీవారు తమ యిల్లు విడచి వెడలిన సుముహూ ర్తము. ఆనాడు శ్రీప్రమాది నామ సం॥ ఆషాఢ శుద్ధ ౬ స్కందషష్ఠి గురువారము, శా॥౧౮౬౧ (తే22.6.1939) సాయంత్రము4 గంటలకు శ్రీగురుసన్నిధి గంజిగుంట శ్రీసద్గురు ప్రణవానందాశ్రమము చేరుకొనిరి. ఆనాడు మొదలు శ్రీవారి గృహ నిర్వహణభారము అనగా వృద్ధులగు అవ్వ, తాత,తండ్రి, మేనత్త మున్నగువారిని పోషించు భారము సంపూ ర్ణముగ మామయగు బాపురమఠం శ్రీకరి బసవయ్యస్వామిపై బడెను. అయినను సద్గుణ సంపన్నులు కాబట్టి యా వేదమూర్తులు తన కుటుంబ ముగా నెంచి వీరి నందరిని జూచుకొనుచుండెను కరుణామయుడగు భగవంతుడా యన యొడనుండి మన చన్నబసవస్వామి యొక్క ఆధ్యా త్మిక చింతన కావంతయు నాటంకము కలిగించక చిరస్మరణీయ మగు మహోపకార మొనర్చెను.

## శ్రీ గురుసాన్నిధ్యము

శ్రీగురుసన్నిధిం జేరిన యాసాయంకాలము శ్రీగురుస్వాములు పీఠస్థులై విచారసాగర గ్రన్థ ప్రవచనము జరుపుచుండిరి. బ్రహ్మవిద్యా ర్థియై వచ్చుచున్న ఈ నూతన వటువును గాంచిరి. "ఓ, స్వామివచ్చి వేసెనే!" అని గురుపీఠము నుండి శబ్దము వెడలెను. అట నున్న

వారందరు మిక్కిలి సంతసిల్లిరి. అంత నీ వటువు గురు సన్నిధికి తక్కిన వారికి మ్రొక్కి గురు నాజ్ఞతో గూర్చుండిరి గురువులు "వీరెట్లు చదువగలరో చూతమని" తాము చదువుచున్న గ్రంథమును ఈ వటువు చేతికిచ్చిరి. భక్తితో గ్రంథము నందుకొని వటువు సుస్పష్ట ముగా శాంతముగా చదువుటనుగాంచి శ్రీ గురుస్వామి సంతసిల్లుచు 'పరవాలేదు బాగున్నది భయము లేదు' అని సాదరముగ పలికి ప్రవచనమును ముగించిరి.

ఇక శ్రీగురుసాన్నిధ్య సుఖము నేమని వర్ణించ గలము ! అనేక జన్మార్జిత పుణ్య పరిపాకముచే మన చన్న బసవస్వామికి అట్టి సుఖ మబ్బెను. మొట్ట మొదట ఈయనకు వివేకచూడామణి శ్లోకముల పాఠము చేయించి ఆ గ్రంథము నెత్తి వ్రాయించిరి. అనుదినము ఆ శ్రమమున రెండు పూటల శాస్త్ర శ్రవణము జరుగుచుండెను. ప్రత్యేక ముగా వీరికొరకై రాత్రి 7 గం. నుండి 8గంవరకు యోగవాసిష్ఠ సార మగు జ్ఞానవాసిష్ఠమును చదివించుచు అనేకాధ్యాత్మిక రహస్యములను దెలుపుచుండిరి. ఇట్లీ నూతన శిష్యుడు దినదినాభివృద్ధి నొందుచు ఒక్కొక్కప్పుడు హృదయ ముప్పొంగి భావావేశ పూరితులై గురువుల నడిగి అనేక విషయముల దెలిసికొనెడివారు. ఒకరోజు ఇట్లడిగెను.

"స్వామి! బ్రహ్మనిష్ఠయన నంతర్ముఖులై సర్వదా యచటనే స్వాత్మానంద స్వరూప స్థితి నుండుటయే గదా! అట్లైన ఆస్థితియందే ఉండక మరల వచ్చు టెందులకు ? ఈ బాహ్యాడంబర వ్యాపారముల యందేల మునుగవలెె? మరల దుఃఖ మెంమల కనుభవించవలెె?" అని యడిగెను.

అందులకు పరమేశ్వర స్వరూపుడగు నా శ్రీగురువు మందస్మిత వదనులై యిట్లు బలికిరి.

"అయ్యా ! నీచిత్తము పరమ పవిత్రమై లౌకిక విషయ దూర మైనది. గాన నట్టి స్వరూప నిష్ఠనే గోరుచున్నది ఎంతెంత నీచిత్తము

బ్రహ్మవిచారణచే తదాకార మగుచుండునో అంతంతగా నా స్థితి యందు అపూర్వమైన యొక సంతృప్తి గలిగి యటనుండి మరల నీస్థితి యేర్పడును ఇది నివృత్తి సుఖమును గూర్చిన ప్రసంగము. ఇక తత్త్వ జ్ఞాను లన్ననో సహజ స్థితి నొంది యుండుటచే వారికి లౌకిక పార మార్థికములనెడి భిన్న దృష్టియే లేదు. ప్రారబ్ధానుసారము వ్యవహార దశ యందుండినను వారి జ్ఞానమునకు బాధలేదు. ఉన్నదొకటే పార మార్థికసత్త అది వారి సహజ స్థితియై యుండును. వారి యందు ఒక వ్యవహారమున్నట్లు గోచరించినను అది కేవలము లోకానుగ్రహము కొరకే యని నిశ్చయించ వలెను. వారికై యేమియు నుండదు. అట్టి విధంబుగ మేమును ఆచోటనే నిలిచిపోయినచో నిపుడు నీకు తత్త్వమును తెలుపు వారెవరప్పా? కాన మీబోటి ముముక్షువుల, జన్మధన్యా ర్థమై బ్రహ్మవేత్తలు బహిర్ముఖులై యున్నను తమ బ్రహ్మదృష్టికి మాత్రముమార్పు లేదు. రెండు వస్తువులు లేవు. ఈ సత్యముల నెల్ల నీవు మున్ముందు నీలోనే గాంచగలవు. ఈ స్థితిని గాంచగల శక్తి శ్రీ గురుపరమాత్మ నీకు ప్రసాదించుగాత! — అని యిట్లు మిక్కిలి వాత్సల్యముతో బోధించిరి మఱొక రోజు పూజ్య గురువులిట్లు గురు నిష్ఠను గుఱించి చెప్పిరి.

*"స్వామి! ఏనిష్ఠయు గురునిష్ఠకు సాటిగాదు ఎన్ని మంత్రము లున్నను గురు మంత్రమున కెద్దియు సాటిగాదు. ఎవ్వని స్మరణ మాత్ర మున అధికారులు సర్వానర్థముల నుండి విముక్తులై పరమ శుభమగు బ్రహ్మతత్త్వమును బొంద సమర్థులగుదురో, అట్టిగురువు నందు దృఢ మైన భక్తి శ్రద్ధల నుంచి చక్కగా సేవించ వలయును శ్రీమన్నిజగుణ శివయోగులు కన్నడమున, "శ్రీగురు వచనుపదేశవ నాలసిదాగళ హుదు నరరిగె ముకుతి"—అని ఇట్టి ఉత్తమాధిగారిని గుఱించియే

*ఇట శిష్యుడగు చన్న బసవస్వామి గురు వంశమువారు గావున గురువు కూడ ప్రేమతో స్వామీ! యని శిష్యునట్టే పిలుచు చుండిరి.

"ఆలిసి దాగళె" అనగా విన్నతోడనే, సకృచ్ఛ్రవణ మాత్రముననే జ్ఞానము గలిగి ముక్తుడగునని చెప్పెను. కాని తక్కిన అన్ని పదార్థములను చూచిన దృష్టితో గురువను మహా పదార్థమును చూడరాదు. దానిని సర్వ విలక్షణమగు పరమ పూజ్యదృష్టితో జూచుచు భావించుచు సదా వారు చెప్పిన చొప్పున ప్రవర్తించుచుండవలెను. అప్పుడు హృదయమున జ్ఞాననేత్రము పూర్ణముగా వికసించి యెల్లెడల గురు తత్త్వము గనుగొను సమర్థత ఏర్పడును. అదియే భక్తి"-- ఇత్యాది అమృతంపు బలుకుల బలికిరి.

మరొకనాడు శ్రీగురు మహాశయుల నిట్లడిగిరి. "పూజనీయా! జ్ఞేయ బ్రహ్మము, ధ్యేయ బ్రహ్మము అని చెప్పెదరే! అట్లయిన బ్రహ్మ పదార్థము ద్వివిధమా? దీని అభిప్రాయమేమి? గురువు: "నాయనా! వస్తుతః బ్రహ్మలు రెండు లేవు. గుణ రహితమగు ఆత్మానుభవమునకు జ్ఞేయబ్రహ్మ మనియు, సగుణమునకు ధ్యేయ బ్రహ్మమనియు ఒక వస్తువునకే అధికారుల తారతమ్యమును బట్టి ఆయా ప్రసంగములందు బోధను గల్పించిరి. కాని నిజముగా వస్తువు సగుణమనియు చెప్పబడదు. నిర్గుణమనియు చెప్పబడదు. ఈ రెండును సాపేక్షిక పదములు. సర్వము అదియే. ఒకప్పుడు సర్వము అనునదియు ఉపచారమే "ఏకం సద్విప్రా బహుధా వదంతి" అను శ్రుతి వాక్యము ఈ భావమునే స్థిర పఱచు చున్నది"-అని బల్కిరి.

ఒకనాడు గురుదేవుడు భోజన సమయమున ఇట్లు చెప్పెను: "స్వామీ! మీరింకేమి అనుకొన వలదు. బాగుగా విమర్శించి చూడండి. ఉన్నవి రెండే పదార్థములు. "దృక్ దృశ్యౌ ద్వౌపదార్థౌ స్తః పరస్పర విలక్షణౌ। దృక్ బ్రహ్మ దృశ్యం మాయేతి సర్వ వేదాంత డిండిమః" అన్నట్లు దృశ్యమంతయు ననాత్మ హుళక్కి, ఆత్మ దృగ్రూపము, అదియే బ్రహ్మము. అనగా నితరాలంబనము లేక వికల్పములు విడిచి దృఢముగా సంభావించిన నితరన్య మగపడదు.

బ్రహ్మ మనగా వేరొక వస్తువుగా నెక్కడనో లేదు. అదియే నీవు.అట్టి నిన్ను నీలోనే-నీవే చూచుకొనుము.''

ఇట్లు గురు సాన్నిధ్యమున స్వామి వాక్యార్థ శ్రవణ మననాదుల చేతను, తపో ధ్యానాదుల వలనను, శ్రీగురుసేవ చేతను, ఆశ్రమసేవ చేతను, మనోవాక్కాయములు పుటపాక శోధిత సువర్ణంబు పగిది పరిశుద్ధములు కాగా గురుసన్నిధి యందు ఉపదేశసాహస్రి, జ్ఞానవాశిష్ఠము, విచారసాగరము, నైష్కర్మ్యసిద్ధి, వేదాంతపంచదశి ఈ మున్నగు గ్రంథముల శ్రవణంబు జేసెను. అంతియే గాదు. తాము బడిచదువు బడయు నప్పుడే వైదిక కర్మానుష్ఠానమునకై కొంత సంస్కృతమున పరిచయమునొందియుండుటచే నత్యాదరణతో ఇప్పుడు గీత ఉపనిషత్తుల పఠించుచు అర్థముల నన్వయించుచు సంస్కృత భాషాభివృద్ధి జేసికొనుచుండెను.అఖండముగా నిట్లు మూడు సంవత్సరములు గురుకులవాసము చేయుచుండగా స్వామికి కొన్ని యిడుములు వచ్చిపడెను."శ్రేయాంసి బహువిఘ్నాని'' అని ఉండనే ఉన్నదిగదా! ఒకటి ఇంటివారి పోరు, రెండవది మలేరియా జ్వరము, మూడవది "అచ్చుబాటు రాలేదు కానగురుకులవాసము చాలించి యింటికి పో'' మ్మనెడి కొందఱు లౌకికుల ఛాందసపుగోల.

ఈ రోజులలోనే ఒకనాడు శ్రీస్వామివారి జన్మస్థానమునుండి వృద్ధులగు రెడ్డి గారొకరు వచ్చి మన స్వామితో :

'ఏమిస్వామీ! ఇంతచిన్న వయస్సులోనే మీకు వేదాంతమా? ఎందు కొచ్చిన గొడవ ! పెద్ద ఆస్తి పెట్టుకొని మీరిట్లుండుటతగదు. ఇంటికి వెళ్ళి నాలుగెడ్లు పెట్టుకొని బంగారు వంటి పొలంపని--చూచుకొనుచు హాయిగా ఉండకూడదా ? ఈ వేదాంతము,ఆశ్రమవాసము, మీ కెందులకు? మీకేమంత వయస్సయి పోయిందా? యనిఅన్నారు అందులకు స్వామి.

"అయితే తాత! మరి వేదాంత మే వయస్సులో అలవఱచు కోవలె ?" నని యడుగగా,

"60-70 సంవత్సరాలైన పిమ్మట వేదాంతము గాని యిప్పుడెందుకు ?" అని పల్కగా, మన స్వామి :

"అలాగైతే ఆవయస్సు మీకు వచ్చే యున్నదికదా ? మీరిక్కడనే యుండండి ; నేనింటికి పోయెద" నని చెప్పగానే ఆ రెడ్డిగారు

"నిరుత్తరులై నీతో మాటలాడ లేను స్వామీ !" యనుచు వచ్చిన దారి పట్టిరి.

అయిననేమి ! గురువు గొప్పవాడు తత్త్వదర్శి గాన అన్నియిడుముల బాపదలచి యేకాంత వాసమగు కుందనగుర్తిలో గల శ్రీశివలింగాశ్రమ తపోభూమికి స్వామినంపిరి.

## ఆశ్రమ నివాసము

కుందనగుర్తిలో గల ఈ పునీతమైన ఆశ్రమము శ్రీశివలింగారాధ్య స్వామియొక్క పాదధూళిచేత పవిత్రమైన సుక్షేత్రము. తపస్సంపన్నమగుస్థానము. ఇది పెద్ద గిరియు కాదు. గిరి కాక పోలేదు. పెద్ద యడవియుకాదు. అడవికాకపోలేదు. ఊరికి దూరమునగసులేదు. దగ్గఱగను లేదు. ఇందు తపస్సున కనుకూలమగు మంచి గుహ యొకటి గలదు. ఇట్లు సర్వగుణాన్వితమైన సర్వవిధముల సాధకుల సాధనానుష్ఠానముల కనుకూలమై పవిత్ర వాతావరణముతో కూడియున్న యాశ్రమమిది. ఇచ్చట శివలింగారాధ్యస్వాములవారి శిష్యులగు శ్రీ శివానందస్వామి వారనువా రుందురు. ఈ గ్రామమున శ్రీ సదానంద సద్గురుస్వాముల వారి శిష్యు లనేకులు గలరు. వీరి ప్రార్థనల మన్నించియే శ్రీగురుస్వాములవారు మన చన్నబసవస్వామిని కుందనగుర్తికి పంపిరి. అయితే పంపునపుడు ఈకొన్ని హితముల బల్కిరి.

"స్వామీ ! ఇకమీదట గురుసన్నిధానమున చెప్పినట్లు నడచు

కొనుచు సదాచార పరాయణులై విహితకార్యముల ననుష్ఠించుచు నియమముగా శాస్త్ర శ్రవణముల ననుదినము జరుపుచుండవలెను గురు శాస్త్రముల యందనన్య భక్తి యుండవలెను. జీవిత పరమలక్ష్య మగు ఆత్మశాంతిని పొందవలెను. పరమ శ్రద్ధతో ప్రతిదినము హంసో పాసనను విడువక ఆచరించుచుండవలయును. పంచాక్షర మహామంత్ర మును భక్తిచే జపించవలెను. అదియే మీ కక్షయ సుఖమొసంగును." అని ఇట్లు ప్రబోధను జేసి ఆశీర్వదించి వచ్చిన భక్తులతోడ కుందన గుర్తికి పంపించిరి.

ఈ ఏకాంతస్థానమున స్వామి యథేచ్ఛగా తపోధ్యానాదులు సలుపు కొనుచు రెండుపూటలు వేదాంత విచారణ గావించుచుజ్ఞాన వాసిష్ఠము, విచారసాగరము; ఉపనిషద్భాష్యములను ఇట నున్న రెండు సంవత్సరములలో ప్రవచించిరి. అపుడపుడు అఖండ భగవ న్నామస్మరణ, భజనలు చేయించుచు ఉత్తమ భక్తబృందముతో సన్నియమ వ్రతంబు లనేకముల నాచరించిరి. ఆ యానంద దినములు మరువరానివి. అప్పటి ఒక ప్రసంగ సారము భావావేశముతో కూడిన ప్రార్థనమును నిట తెల్పుచున్నాను.

"పరాత్పరా! ప్రభో! గురుదేవా! నీ వొకప్పుడు ఉత్తమ పండితునివలెను మరొకప్పుడు జడుని వలెను, ఒక్కతటి సమాధినిష్ఠా గరిష్ఠుడవయ్యు మరొకప్పుడు మహా వ్యవహారిగను, ఒకప్పుడు మహా రాజుకంటె గొప్ప సుఖము ననుభవించుచుండియు భిక్షుకుడుగను మరొ కప్పుడు పరమసాత్వికుడవయ్యు మహారాజసిగను, చివఱకు మహాతమమున సర్వరూపముల నీవై తాండవించు వేళ ఆ ఉగ్రప్రచండ ప్రకృతి బాహ్య రూపములగని తత్సత్యమును గనుగొనలేక మోసపోయి అహంకార కామాది శత్రువర్గమున జిక్కి యనర్థముల పాలుగాకుండ, కుదృష్టిని బాపి, యాత్మారాముడవగు నిన్ను నీస్వరూపమును నేనేయని జూచి, సమాధానము నొంది శాంతించి పవిత్రదృష్టిని, లోచూపును, మాకు

ప్రసాదించు తండ్రీ! అన్ని రూపముల నీవేకదా ! నీకన్యము వేఱొండు లేనపుడు మమ్ము నీకంటె నన్యులుగా నెందుకు జేసెదవు ? అట్లుగాక నిన్ను జూచు కన్నొసగి నన్ను నిన్నుగా జేసికొనుటకై నీయందవిచ్యుత భక్తిప్రపత్తులు గలిగి ప్రవర్తించునట్లు జేయుము. నిన్ను భజించు నేను నీకంటె అన్యముగాను నీవేయను అద్వితీయదృష్టి నొసగుము.

"తేషాం సతత యుక్తానాంభజతాం ప్రీతి పూర్వకమ్ ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే ॥
తేషా మేవానుకమ్పార్థ మహమజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥

(గీ.త.అ. 0 శ్లో. 0.11)

అనగా నన్నే నమ్మి సతతము నన్నే భజించు భక్తులపై దయ దలచి నన్ను పొందదగిన బుద్ధియోగము ననుగ్రహించి యజ్ఞానరూప మైన చీకటిని జ్ఞానమనెడిదీపముచే నశింపజేయుచు నాయందు ప్రబోధ మొందునట్లు చేసికొందు" నని నీ శ్రీముఖమునుండియే బయల్వెడలెను గదా! మమ్ము గాచుమయ్యా ! మా భక్తివిశ్వాసములలో నెట్టి లోప మున్నను సంస్కరింపుము, శిక్షింపుము చేయూత నొసం గుము ఓం"

ఈ రూపమగు ప్రార్థనను శ్రీనారప్పడప్పుడు శ్రవణ సమయ మున భావావేశముతో జెప్పుచుండెడినారు ఒకనాటి సంభాషణము

ప్ర. పూజ్యస్వామీ ! "క్షురస్యధారా నిశితా దురత్యయా, దుర్గంపథ స్తత్క వయోవద న్తి"-అని శ్రుతి చెప్పుచున్నదే! అటు లైనచో మోక్షమార్గ మంతటి కష్టమైనదా ? అని యడిగిరి.

ఉ. అట్లేమియు లేదు. శ్రుతిమాత వస్తువుయొక్క అపూర్వ తను దెల్పుటకై యట్లుభయానకముగా శ్రద్ధోత్పాదనార్థమైపలికినది. వస్తుతః అట్లు లేదు. నిజమగు నుత్తను శ్రద్ధచే తత్త్వమును గను గొన్నచో జెప్పినంత కష్టము లేకయే ముక్తిలభించును. అదిదూరము గాదు. సమీపమును గాదు. నీవే అయి యున్నావు. నోటియందు

మృదువైన హల్వానుంచినచో మ్రింగుటెంత సులభమో ఇయ్యది అంతకంటెను సులభము. స్వసంవేద్యము. పరమశాంతము. జ్ఞాన స్వరూపము. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్" ఓం అశ్రద్ధాళువునకు దురత్యయమని అర్థము.

ఈ గ్రామమున శ్రీసదానంద సద్గురుస్వాములవారి శిష్యులలో నిద్దఱు బ్రహ్మచారులు పేర్కొనదగినవారు. ఒకరు శివలింగప్ప, బ్రహ్మచారి వీరిని ఆంజనేయుకు ఆదర్శభక్తుడు అని పిల్చుచుండిరి. ఇక రెండవవారు నల్లనయ్య బ్రహ్మచారిగారు. అమాయికమగు ఉత్తమ వ్యక్తి వీరు శ్రీస్వామివారి సేవలగావించుచు అధికకాలమాశ్రమమున వసించువారు. వీరిద్దరేకాక ఇట్టి సుహృదయులగు గృహస్థశిష్యులెందఱో గలరు. గాని యెక్కువ అవకాశము గలవారు వీరిద్దరు-తక్కిన వారు ఆయా నియమిత కాలములయందు వచ్చుట పోవుట గలదు.

ఇక శ్రీవారికి ప్రతిదినము శుచిర్భూతులై భక్తి పూర్వకముగ వే॥ పంపయ్యస్వామి, శ్రీ చాబాల హనుమప్ప వీరి పుత్రుడు భిక్ష తెచ్చిపెట్టిపోవుచుండిరి. నేటికిని స్వామివారికి వీరి గృహములనుండియే ప్రసాద మంపబడుచుండును. "తస్మాద్బ్రహ్మవిదే దేయం న దేయం బ్రహ్మఘాతినే" కుక్షౌ తిష్ఠతి యస్యాన్నం బ్రహ్మజ్ఞానేన జీర్యతే. సనిస్తరతి దాతారం దశపూర్వాన్ దశాపరాన్."

అన్నట్లు ఏ పుణ్యాత్ముల కిచ్చిన యన్నోదకములు వేరుశక్తులుగా పరిణమించక, అలౌకికాగ్నిచే జీర్ణమై బ్రహ్మతత్త్వము నెఱుంగదగిన పరమ సాత్విక బుద్ధిగ పరిణమించునో అట్టితపోనుష్ఠానవంతులైన శ్రీస్వామియను సత్పాత్రయందు భిక్షయొసంగిన యావంశీయులెంతటి పుణ్యాత్ములోకదా! వారి తరతరములవారును ధన్యులని ప్రమాణము లున్నవి.

"యతిర్యస్యగృహే భుంక్తే తస్య భుంక్తే హరిఃస్వయం।
హరిర్యస్య గృహే భుంక్తే తస్య భుంక్తే జగత్త్రియం॥

శివయోగిని సంతృప్తే తృప్తో భవతిశంకరః।
తత్తృప్త్వా తన్మయం విశ్వం తృప్తమేవ చరాచరం॥

అనునట్లు మా ఈ స్వామికి భిక్షపెట్టిన యా సద్గృహస్థు లేమి నోము నోచి యుండిరో గదా! వీరి జన్మధన్యము. ఇట్లు అన్న విధముల యోగ్యమైన ఈస్థలము నందు అత్యుత్తమ భక్తులతో స్వామివారు పరమ సుఖంబుండిరి.

## అరుణాచల రమణ దర్శనము

శ్రీవారికి చాలాకాలముగ భగవాన్ శ్రీరమణ మహర్షులను దర్శించి వారితో సంభాషించి వారి శ్రీముఖమునుండి వెలువడుకృపామయమగు మాటలను వినవలెననెడి తీవ్రేచ్ఛ యుండెను. దానికి తోడుగా కుందనగుర్తి ఆశ్రమ భక్తులగు శ్రీజి. తిప్పయ్య. సుబ్బయ్య తిమ్మరాయప్పగార్లకును నిట్టి సత్సంకల్పమేయుదయింప వారందఱితో గలసి శ్రీవారు ప్రయాణమై తిరువణ్ణామలై అరుణాచలం వెళ్ళి పరమ భక్తితో భగవానులగు శ్రీరమణ మహర్షుల సందర్శించి చరణ కమలముల తమ శిరమునుంచి నమస్కరించిరి. మహర్షుల పాదముల నెవరి చేతను తాకనీయరు. కాని మన స్వామివారికట్టి యాటంకము లేమియు లేకపోయెను. మరునాడుదయమున మహర్షి సన్నిధిని మౌనసభాసాగరమున వినమ్రులై తామొక బిందువుగా నందుగూర్చుండి రమణుల వీక్షించుచు కొంతసేపటికి పైకి లేచి దండవత్ప్రణామము లాచరించి సమీపించి ఇట్లు ప్రశ్నించిరి.

"భగవాన్! ఆత్మ సచ్చిదానంద స్వరూపుడందురే! అందులో సత్తు చిత్తులు మాత్రము గోచరించుచున్నవిగాని యానంద మెల్లకాలము భానము గాదుగదా! ఇందులకు కారణమేమి? అనుగ్రహింప ప్రార్థన." యనియడుగగా చల్లని చూపులుగల యా మహర్షి పుంగవు లిట్లు బల్కిరి.

"ఆ! సత్తుచిత్తులకు వేరుగా ఆనందమొకటున్నదా? లేదే? సర్వసంకల్పముల సంపూర్ణ నాశనమే సర్వదా ఆనందానుభవము. అది సత్తు చిత్తులకు వేరుగా లేదు. ఆ చోట నిలిచిచూడుము. నీ స్వరూపము సదానందమే"— అను నమృతంపు బలుకుల నుపదేశించిరి ఆ పరావాణిని విని భృంగము తామరపూవునాశ్రయించి యందలి మధువును గ్రోలుచు మైమఱచునట్లు మనస్వామి చిత్తభృంగము రమణ ముఖారవిందమునుండి బయలుదేరిన యుపదేశమకరందమును గ్రోలి అనుసంధానము జేయుచు తదాకారమయ్యెను. మరల సాష్టాంగవందనము లాచరించి మహర్షులతో భాషణభాగ్యము నబ్బెననియు, ధన్యుడ ధన్యుడ ననుకొనుచు స్వస్థానమున గూర్చుండిరి.

ఆ నాడచ్చటనే యుండి మరుదినము ప్రయాణమై శ్రీ అరుణాచలేశ్వర దేవాలయము మున్నగు చూడవలసిన స్థలముల జూచి యట నుండి తిరుపతి, వ్యాసాశ్రమము, శ్రీకాళహస్తి క్షేత్రములను సందర్శించి స్వర్ణముఖియందు స్నానమొనర్చి శ్రీ కాళహస్తీశ్వరుని సందర్శించి అచటినుండి బయలుదేరి నేరుగా గుడివాడ శ్రీప్రణవాశ్రమమునకు వచ్చిరి. అచ్చట శ్రీశంకరజయంతి మహోత్సవము జరుగుచుండెను. ఆశ్రమాధిపతులును, బ్రహ్మజ్ఞాన సంపన్నులునగు సాధు శ్రీప్రణవానంద స్వాములవారినిదర్శించి యెదురోజు లచ్చటనేయుండి, ఆనస్తాహామునకు విచ్చేసియున్న సాధువులు, పండితులు మున్నగువారి ప్రవచనముల విని పరమసంతోషము నొందిరి. అటనుండి నేరుగా శ్రీశివలింగాశ్రమము వచ్చిచేరిరి.

స్వామివారు రాతియుప్పును మాత్రము కొద్దిగావాడుచుందురు. చప్పని పప్పుకట్టు అన్నము వీరి యనుదినాహారము. నాటి యా యలవాటు నేడు సహజమై యున్నది. ఇక దేహబలమన్ననో "బలం బలవతాంచాహం కామరాగవివర్జితం" అన్నట్లు కామరాగములచ్చట వసించుటకు తావులేక యెటకో పరుగెత్తుకొనిపోయెను. కాన కేవ

లము ఆధ్యాత్మిక విషయావలంబనమునకు మాత్రము వలసిన పవిత్ర సాత్వికమగు నోజశ్శక్తి శ్రీవారియందున్నది.అంతే! ఇట్టి నిరోగ్మహామైన శరీరేంద్రియ సంపత్తి స్వామివారియందుండుట జన్మాంతర నిష్కామ పుణ్యవిశేషము.

## నంద్యాల - త్యాగకుటీర స్థాపనము

శ్రీశివలింగాశ్రమమున నీప్రకారము స్వాతికానుష్ఠానాధ్యయన శ్రవణ మననాదులతో బ్రహ్మానందముగ దాదాపు రెండు సంవత్సరములు ముగిసిపోయెను. పిమ్మట శ్రీగురునానతి చొప్పున గంజిగుంటకు వచ్చి శ్రీగురుసన్నిధిలో వాక్యార్థ శ్రవణము జేయుచు కొంతకాలము అచ్చటనే వసించుచు శ్రీసద్గురునాజ్ఞ మేరకు నంద్యాల-బుక్కాపురం శ్రీనిర్వాణాశ్రమము (నిర్వాణమఠము)నకు బయలుదేరిరి. శిష్యుడు బయలుదేరు సమయమున గురుమూర్తి యివ్విధంబున ప్రబోధించి పంపిరి, స్వామీ! ఆత్మానుభవమున నఖండ సుఖమందుటకు అతిసులభమైన యుపాయము ప్రాణమును (అంతఃకరణమును) సదా చూచు చుండుటయే. అట్లు చూచుచుండినచో మనస్సు ఆత్మను తెలియుట కర్త్రమై (సాధనమై) తత్త్వమును దెలిపి తానశించును.అపుడు నీవాత్మ స్వరూప మాత్రుడవై యఖండ సుఖమనుభవి తువు. ఈనిష్ఠను మరువరాదు. నాయనా! మరియు నంద్యాల కపుడపుడు వచ్చుచు మనసంఘము వారితో కలియుచుండుము ఓం''అని యిట్లు ఆదేశించి హితబోధల సల్పి యాశీర్వదించి పంపగా మనస్వామివారు నేరుగా శ్రీనిర్వాణాశ్రమమునకు విచ్చేసిరి. ఇదే నంద్యాలకు మహానందికి మధ్యనుండు బుక్కాపురం శ్రీనిర్వాణమఠము.

ఈయాశ్రమము-నవనందులకు మధ్య శ్రీశైలపర్వతప్రాంతమై యలరారు రమ్యమగు నేకాంత ప్రదేశము. శ్రీమదుమామహేశ్వర గురుపీఠ పరంపరాచార్యులు శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య వర్యులు బ్రహ్మవిద్వద్వరిష్ఠులునగు ౧౦౮ శ్రీ శ్రీ శ్రీ ప్రణవానంద

సద్గురు మహాస్వాములవారిచే స్థాపింపబడినది. ఇచటనే ఈమహానీయుల (అధిష్ఠానము) సమాధియు యున్నది. వీరే మన శ్రీవారికి పరమ గురువులు. తపోధనులు ఇట్టి పరమ పూజ్యంబగు స్థానమును జేయుటచే పరమసంతోషమున తాపసారణ్యమగు నయ్యాశ్రమమున బ్రహ్మనిష్ఠతోను సద్గ్రంథ వ్యాసంగములతోను మన స్వామి చిరసుఖంబుండిరి. అప్పుడచ్చట శ్రీ యం. కోనప్పశ్రేష్ఠి (శ్రీశాంతానందస్వామి యనువారు) ఆశ్రమ ధర్మకర్తలై యుండిరి. స్వామివారిని సర్వవిధముల క్షేమతో జూచుచు సర్వవ్యవస్థల గావించి స్వామి తాపస వృత్తికి తోడ్పైరి.

కొంతకాలమునకు నంద్యాలభక్తులు మనశ్రీవారి సోదరశిష్యులగు సాధుశ్రీశివారెడ్డిగారు స్వామిని క్షేమతో నంద్యాలకు దోడ్కొనివచ్చి కీ.శే పగిడి నారాయణశ్రేష్ఠిగారి ధర్మపత్ని గుణవతియగు శ్రీపగిడి శాయమ్మగారి మేడలో విడిదిచేసిరి. ఆదినుండియు నేటివఱకు వీరి యింటియందు ఎందఱో మహాత్ములు ఆధ్యాత్మిక ప్రసంగములు జరుపుచుండుట యలవాటు. శ్రీఉమామహేశ్వర గురుపీఠస్థులగు శ్రీఆత్మానంద స్వాములవారి శిష్యులు ఈ దంపతులు. కాన నీపవిత్ర గృహమునందు సదా వేదాంత వాక్యార్థ శ్రవణములు జరుగుచుండును. ఇక వీరి స్వీకృత పుత్త్రుడగు చి. సుబ్బారావును నిట్టి సద్భావమే కలవాడై పెద్దల త్రోవనే నడచుచుండెను.

మఱియు నింతలో శ్రీసదానందసద్గురు స్వాములవారి శిష్యురాలగు శ్రీమతి యోగిని సుబ్బమ్మగారు శ్రీత్యాగరాజు కుటీరము నొకటి తారణ సంవత్సరము శ్రావణ బహుళ ఏకాదశి శుభముహూర్తమున (తే. 14-8-1944 సోమవారము) మన శ్రీస్వామివారి అమృత హస్తములతో స్థాపింప జేసిరి. ఇయ్యది శ్రీమతి యోగిని సుబ్బమ్మగారి ధ్యానానుష్ఠానముల కనుకూలముగా నుండునట్లు నిర్మింపబడెను. (నేడిది దివ్యభవనమై త్యాగమూర్తి విగ్రహప్రతిష్ఠతో నల

రారుచున్నది. ఆ వివరములు తరువాత పేజీలలో చూడనగును.)

పిమ్మట మన శ్రీవారు నేరుగా గంజిగుంటకు వచ్చి సద్గురుదర్శ సంబంధి శ్రవణ మననాదు లొనర్చుచు ఆప్త అంగ భావాది చతుర్విధ శుశ్రూషల చేయుచు నిత్యానందముతో నుండిరి. ఈసమయమున గుడివాడనుండి శ్రీప్రణవానంద స్వాముల వారిచటికిదయచేసిరి. వీరు అపూర్వమగు నాధ్యాత్మిక విషయములను శ్రీశంకరసిద్ధాంతాను సారము హృదయంగమగునట్లు బోధించువారు. ఈఆశ్రమమున 7,8 రోజులుండి ఉపన్యాసముల గావించిరి. ఆప్రసంగములలోని కొన్ని మంచిమాటలను మన స్వామివారు దినచర్యయందు వ్రాసియుంచిరి. వానిలో కొన్నింటి నిట సంగ్రహాముగా దెల్పుచున్నాను.

"అనేకమును ఏకముగా జూచుట సమదృష్టియే గాని యద్వితీయదృష్టి గాదు. విడిచి విడువని దృష్టిచే ననుభవింపబడునది అద్వితీయదృష్టి."

"ఆత్మ యందనాత్మ ధర్మము లారోపింపబడుటకు కారణమేదియో దానిని నివారించుటయందే వేదాంతము ప్రమాణము."

"అనుభవము అవస్థలుగా నుండుటకు కారణము అనుభవము ఏకమని తెలియకపోవుటయను నజ్ఞానమే."

"ప్రత్యగాత్మ దృష్టియందు జ్ఞానానుభవము. దేహాత్మ దృష్టి యందు కర్మాచరణము."

"సందేహమును. కల్గించునది వేదముకాదు. సందేహమును నివృత్తి చేయునది వేదము. దేహమును గుఱించిగాని లోకమును గుఱించి గాని సందేహ మెవరికిని లేదు. వేదము కర్మ జ్ఞానములని రెండు విధములుగా నున్నది గాన అందేది యాచరణీయమో అనిమాత్రమే సందేహము."

"తనకంటె చిన్నవారియందు దయ, తోటివారియందు

స్నేహము, పెద్దవారియెడ భక్తియు నెవరి హృదయములోనుండదో వారు మానవులుగారు."

"ఫలాసక్తిగలవాని నుద్దేశించి కర్మయోగము, ప్రత్యగాత్మ దృష్టిగలవాని నుద్దేశించి సర్వకర్మసన్న్యాసముద్వారా శాస్త్రశ్రవణ మననాదిరూపమైన జ్ఞానయోగము చెప్పబడినది."

"వస్తులక్షణమును బోధించునది "తత్త్వమసి" మహావాక్యము" దాటించునది ప్రణవానుసంధానము."

"సన్న్యాసమనగా రాగద్వేష జయమే. తపస్సన దేహాత్మ బుద్ధి దహనమే"

"అహంపద శోధన యనగా అహంకారమున కివ్వలనుండు దేహాదులనుండి విడివడుట."త్వం"పద శోధన యనగా నహంకారము నకును సాక్షికినిగల గ్రంథివిమర్శనము."

"చచ్చిపోవుదునను భయము (శోకము), చంపుదునను కర్తృత్వము (మోహము), ఈరెండును "దేహోహం" బుద్ధిచేతనే కల్గినవి. కాన అర్జునుని ప్రవర్తన కృష్ణునకథర్మముగా దోచినది.

"ఆశ్చర్యవత్పశ్యతి-పూర్వము పరిచయములేని దానినిగూర్చి ఆశ్చర్యము గలుగవచ్చును. అనుభవము ఆత్మస్వభావము గనుక ఈ శ్రుతిలో జెప్పిన ఆశ్చర్యముగల వారెవరును ఆత్మను తెలియువారు కారు. ఆత్మను గురించి చెప్పుటయే చాల అరుదు. వినుట విచారించుట అంతకంటె అరుదు. ఏల? ఆత్మ, వేదము, దైవము, గురువుల అనుగ్రహము లేనిది వినిపించుటగాని వినుటగాని బహుకష్టము దుర్లభము. ఈయనుగ్రహము లేని శాస్త్రపాఠకులకు ఆశ్చర్యము తోచవచ్చును."

"ప్రమాతకు ప్రమేయము ననుభవింప జేయునదిప్రమాణము. ప్రమేయానుభవమునందు ప్రమాణమెక్కడ నిలుచును? అశ్లేవేదము

పరమాత్మను దెలుప ప్రయాణమైనను పరమ ప్రమాణమాత్మయని తెలిపి తన ప్రామాణ్యము వదలును."

## కాశీయాత్ర - తపస్సు

ఇట్లు గురుసన్నిధియందు మన శ్రీవారు గురుసేవాదురంధరులై కొంతకాలముండిరి. కాని యాసమయమున కొంతమంది గృహస్థులు చేరి శ్రీవారి విషయకమగు ఇల్లువాకిలి ఆస్తి-పాస్తి మున్నగులౌకిక విషయములనుగూర్చి చర్చించుచు శ్రీవారి చిత్తమును నానా ప్రలోభములచే విషయాభిముఖ మొనర్ప యత్నించు చుండిరి. ఇదిచూచి యిక నిట నిలుచుట తగదని తలంచి యెవరికైనను తెలియజేసినచో ప్రయాణమున కాటంకపఱతురని తలంచి తమ పూజ్య సద్గురువులును శ్రీప్రణవానందస్వాములవారును పరుండివిశ్రమించుచుండగా మధ్యాహ్నమున వారికి వెలుపలనుండియే వందనములాచరించి శైవసాహిత్యమున ప్రసిద్ధురాలై చిదాకాశ స్వరూపము నందిన వీర విరాగిణి అక్కమహాదేవివలె తీవ్రవైరాగ్యముతో కాశీయాత్ర వెడలిరి. పావన గంగాతోయముల గ్రుంకులిడి తనివితీర త్రాగి విష్ణ్వాది సకల సురాసురేశ్వరార్చిత పాదారవింద యుగళుని; విశ్వేశ్వరుని సందర్శించి పరమ ఋషులు, ఆచార్యులు తపమాచరించి ధన్యులైన యాపుణ్యక్షేత్రమున గూర్చుండి కొంతకాలము తపమొనర్పవలెనని మన శ్రీవారికి బహుకాలముగానున్న తీవ్రేచ్ఛ నేడుకార్యరూపమై వైరాగ్యభానుప్రభలు విరజిమ్మ పాదచారులై కంచుకవిముక్తమైన సర్పంబు పగిది పరుగెత్తుచు 10 మైళ్ళకుపైగానున్న బంటనహాళ్ స్టేషన్‌కు సాయంకాలము 5 గంటలకు వచ్చిచేరిరి.

ఆనాడడవులయందు పాండవులు పాంచాలితో సహా భుజించి కడిగిపెట్టిన పాత్రయందు అంటుకొనియున్న యొక యాకే అక్షయమై భిక్షుకై తమయొద్దకువచ్చిన దుర్వాసుని తృప్తిపఱచినట్లు మనస్వామివారి చేతిలో నున్న గీతాపుస్తకపు టట్టలో దాగియున్న అణాన్నర

మాత్రమే కాశి చేరువఱకును అక్షయమై రక్షించెను. పాపమీస్వామివనమూర్తి యింతవఱకెప్పుడును స్వతంత్రముగా టిక్కెట్టులేక బండియెక్కినవారుగారు. అయిననేమి ? వైరాగ్యాస్త్రముగలవారికి భయమెందులకు? భగవదాయత్తచిత్తులై శివపంచాక్షర స్మరణజేయుచు హంసనిష్ఠతో స్టేషన్‌లో గూర్చుండిరి. అంతలో రాత్రి 7 గం. లకు గుంతకల్లునుండి బండివచ్చెను. వెంటనే హృత్పూర్వకముగా "ఓకాశీవిశ్వేశ్వరా! నన్నేరీతి నీసన్నిధి జేర్చుకొందువో ? నాకేమియు తెలియదు. అనాథనాథా ! నీవే శరణ్యమనుచు ఆనందబాష్పావృతనేత్రులై "శివశివా" యనుచు బండినెక్కిరి.

సత్యసంశోభితమగు పవిత్ర సంకల్పము వజ్రసన్నిభముగదా ! అదెట్లు రిత్తయగును ? స్వామి హుబ్బళ్ళిలోదిగి పూనాబండి నెక్కిరి. అటునుండి కల్యాణ్, పిమ్మట (అలహాబాద్) ప్రయాగక్షేత్రమును నాలుగు రోజులకు జేరిరి. బండ్లన్నియు స్వామివారివేనా యన్నట్లు ఎవరును టికెట్టడుగలేదు.

ప్రయాగనుండి కాశీక్షేత్రము రమారమి 40మైళ్ళ దూరముండనోపు; ఆరాత్రి బండియెక్కినచో నుదయము సోమవారము కాశీక్షేత్రము చేరి విశ్వేశ్వరుని సందర్శించగలననియు గంగాజలముల తనివిదీర త్రాగవచ్చుననియు ఆనంద తరంగములు పొంగిపొరలు చుండెను. ఇంతలో చీకటిపడెను. చివరి ప్లాట్ ఫారంపై నిలువబడి బండివచ్చెను. కాని నిలువలేదు. తటాలున కమ్మీ పట్టుకొని చేయిజారి గభాలున క్రిందపడిపోయిరి, బండిముందుకు వెళ్లెను. వెంటనేలేచి "శివశివా ! రేపు శ్రీ క్షేత్రముజేరు యోగములేదేమో!" యని క్రింద దృష్టిసారించిచూడ నాస్థలము పెక్కురాళ్లురప్పలతో నిండి ప్రమాదకరమైయుండెను. శరణాగతభక్త రక్షచింతామణియగు భగవంతుడేనాడు ప్రహ్లాదుని పర్వతమునుండి బడద్రోయ రక్షించినట్లే మనస్వామి కెట్టిదెబ్బయు సోకకుండునట్లుగురుస్వామిరక్షించెను.అఘటనఘటనా సమర్థ

డగు విశ్వేశ్వరుడు సర్వరూపమున నున్నాడు సరి! బండి రెండుమూడు ఫర్లాంగుల దూరము బోయి నిలిచిపోయెను. అరగంట వరకు కదల లేదు. పడిపోయినందున తన్నుపట్టుకొనుటకై వచ్చుచున్నారేమో యనితలంచి భయముచే శ్రీవారు ప్రక్కన దాగుకొనిరి. బండి కదల కుండుటను గని విచారింపగా బండి చెడిపోయినదని తెలిసెను. పిదప నచటనుండి నెమ్మదిగ వెళ్ళి స్వస్థులై బండిలో గూర్చుండిరి. అదేమి చిత్రమో ! శ్రీవారు కూర్చున్న కొంతసేపటికే బండి కదిలెను. తమ సంకల్పానుసారము సోమవారనే కాశీక్షేత్రము జేరిరి. పరమపావన మగు గంగాతీరమును సమీపించుచు దూరమునుండియే దర్శించి పుల కాంకితులైరి.

"శైలేంద్రాదవతారిణీ నిజజలే మజ్జజ్జనోత్తారిణీ,
పారావార విహారిణీ భవభయశ్రేణీ సముత్సారిణీ॥
శేషాహేరనుకారిణీ హరశిరోవల్లీ దలాకారిణీ ।
కాశీప్రాంతవిహారిణీ విజయతే గంగా మనోహారిణీ ॥"

అను శ్రీశంకరాచార్యస్వామి విరచితంబగు స్తోత్రమును ముక్త కంఠమున ఆనందపరవశులై పాడుకొనుచు తీరమును సమీపింప నది దశాశ్వమేధఘాట్ అని తెలిసెను. (పూర్వము బ్రహ్మదేవుడు ఈ స్థలమునందు పది అశ్వమేధములను చేసినందున ఆపేరు వచ్చినదం దురు) గంగామాత సన్నిధికివెళ్ళి చేతులు మోడ్చి ప్రదక్షిణమాచ రించి భక్తితో పావనగంగను అనామికచే స్పృశించి కండ్లకద్దుకొని, శిరమున ప్రోక్షించుకొని తల్లియొడిలో బిడ్డ దాగుకొనునట్లు గంగా మాతయొడిలో దాగిరి. అనగా గంగలో మునిగిరి. తనివిదీర జలక మాడి "తల్లీ ! నీబిడ్డను పునీతునిగాజేసి అవిచ్యుతమగు భక్తిజ్ఞాన వైరాగ్యము లిచ్చి రక్షించు మమ్మా! నినుజూడ నింతదూర మరుదెంచి తిని. అనాయాసముగా నీయొడిలో జేర్చుకొంటివిగదమ్మా! నా తప్పు లెన్నున్నను క్షమింపుము. "కుపుత్రోజాయేత క్వచిదపి కుమాతా నభవతి" అన్నట్లు చెడ్డ బిడ్డయైన నుండవచ్చునుగాని చెడ్డతల్లిమాత్ర

ముండనేరదు. కాన రక్షించుము. 'బ్రహ్మాత్మనా సంస్థితిరూప అభేద జ్ఞాననిష్ఠ నొసగుము తల్లీ! అని యిట్లు పెక్కువిధముల దేవీస్తోత్రమును జేయుచు సంకల్పించి ఆచమనమొనర్చి ప్రణవోచ్చారణపూర్వకముగ గట్టెక్కిరి.

అటునుండి నేరుగా విశ్వేశ్వరుని దర్శింపగోరి "పత్రం పుష్పం ఫలం తోయం" అన్నట్లు చివరకు జలమును గొంపోవుదమన్న నుపాత్ర లేదాయెను. అక్షయపాత్రలో మిగిలియున్న కాలణాతో చిన్నమట్టి పాత్ర నొకటికొని గంగాతీర్థమును దెచ్చి విశ్వంభరుడగు శ్రీవిశ్వనాథునకు తమచేతులార అభిషేకము జేసి కన్నులపండువుగా స్వామిని ఘంటలకొలది చూచుచు భావావేశమున మైమఱచి కొంతసేపటికి గర్భాలయమునుండి వెలుపలికివచ్చిరి. ఆకలితోచెను. ఐదురోజులుగా కడుపార ఆహారము లేదాయెను. విశ్వేశ్వరుడు తప్ప మరెవ్వరును పరిచయములేదు. గావున మరల ఆతనినేనమ్మి ప్రదక్షిణమొనర్చుచుండ గర్భాలయమునుండి సోమసూత్రముద్వారాశుద్ధమగు అభిషేకక్షీరము వచ్చుచుండెను. కాలణాకు తాము కొన్న మృణ్మయపాత్రచే మహానందమున తనివిదీర నాక్షీరమును త్రాగిరి. కొంత క్షుద్బాధ యుపశమించగా సచేతనులై యేకమూాల మహామంత్రము జపించుచు ఆలయముననే గూర్చుండిరి. కొందఱుభక్తులు కొంతసేపటికే కొన్నిపండ్లు మిఠాయీలు భక్తితో సమర్పించిరి. ఈవిధముగనే ఆలయమునమూడు రోజులు గడపిరి.

నాలుగవరోజు సాయంకాలము ఆత్మానందస్వాములవారను నొకరువచ్చి స్వామిని యోగక్షేమాదుల నాంగ్లభాషలో విచారించిరి ఆంగ్లభాషలోనే ఆంధ్రదేశమనియు ఆంధ్రకర్ణాటకములు తెలియుననియు చెప్పిరి. (హిందీభాష చక్కగారాదు గాన కాశీయాత్రలో ఇంగ్లీషే స్వామికి తోడైనది). వెంటనే వారు కర్ణాటకభాషగల శ్రీ జంగమవాడీ మఠమునకు తెచ్చివిడిచిరి.

ఆమఠమును జూడగా నయ్యది మనస్వామి పూర్వాశ్రమవంశ పరంపరామూలస్థానమగు శ్రీజగద్గురు విశ్వారాధ్యజ్ఞానసింహాసనమఠ మని తెలిసెను. జన్మధన్యమాయెనని తలంచి పరమానందము నొందిరి. అపుడాస్థానమున ఆచార్యులై యున్న వారుఅపరబృహస్పతియా యన నొప్పు విద్యామూర్తులు ౧౦౦౦ల శ్రీజగద్గురు వీరభద్రశివాచార్య మహాస్వాములవారు గురుపీఠము నధిష్ఠించియుండిరి. అట్టి జగద్గురు మహాసన్నిధిని దర్శింప సెలవుగైకొని లోపలికివెళ్ళి సింహాసనాసీనులై యున్న స్వామిని దర్శించినవెంటనే సాక్షాత్కైలాసాధిపతియగు శ్రీ శంకరుడా యని తోచెను.ఆదివ్యభవనము కైలాసమేయనిపించెను. వెంటనే మహాసన్నిధిని దండవత్ప్రణామములాచరించి కూర్చుండిరి.అప్పుడా శ్రీజగద్గురుస్వాములవారు "మీరెవరు? ఎచ్చటివారు ? ఎందులకై వచ్చితిరి" అనిప్రశ్నించిరి. అందులకు స్వామి తమ యానచ్చరిత్రను తామచ్చటికివచ్చిన పరమోద్దేశమును భక్తివినయములతో విన్న వించుకొనిరి. మరియు "ఈ బాలునిపై దయయుంచి కొన్ని నెలలిచట వసించుట కవకాశమిప్పింప ప్రార్థన" యని మనస్వామి అడిగిరి.

ఈమాటలువిన్న శ్రీజగద్గురుస్వాములవారు కొంతసేపాలోచించి ప్రసన్నవదనమున సౌమ్యమగు మాటలతో "నాయనా! ఇంత చిన్నతనముననే నీకింత వైరాగ్యమా? అట్లు కష్టించి నిష్ఠను సాధించ గలవా?" యని యడిగిరి. అందులకు స్వామి "పూజ్యగురువర్యా! ఏదైనను చిన్నతనమున వినిర్మలహృదయమున హత్తుకొన్నదే చివరి దాక యుండగలదని తమబోటి మహనీయులుచెప్పుదురుగదా! ఇక "ఆ నిష్ఠనుకష్టించి సాధించగలవా?" యనుమాటకు నేను బదులు చెప్ప జాలను పూజ్యగురువుల యనుగ్రహముండినచో నది యొక అసాధ్య మైనపని గాదని నాయంతరాత్మ పలుకుచున్నదనిరి."

ఈ బాలుని ముఖారవిందమునుండి వెలువడు భద్రవాక్యములను విని శ్రీజగద్గురుస్వామివారు "అట్టిసునిశ్చితమగు వృత్తియున్నచో

మంచిదే. నీదృఢనిశ్చయమే నిన్నురక్షించు'' నని పల్కి యటనున్న మేనేజరుగారిని పిలిచి "అయ్యా! వీరికి మేడపై భాగమున నొకగదిని చూపించుమని చెప్పుచు బాలుడగు ఈస్వామినాశీర్వదించిరి. అపుడు మేనేజరుగారు చూపిన శుభ్రమగు నాగదిలో స్వామి ప్రవేశించిరి. ఆపవిత్ర వాతావరణము సర్వానుకూలతచేనొప్పు ఆస్థలమునుచూచి స్వామికి పట్టరాని ఆనందమాయెను. వెంటనే గంజిగుంట శ్రీగురు సన్నిధికి భక్తిచే తన యావచ్చరిత్రను విన్నవించుకొనుచు నొక జాబు వ్రాసిరి. శ్రీక్షేత్రమున మనస్వామియొక్క నిత్యకార్యక్రమము 'బ్రాహ్మీముహూర్తే బుద్ధ్యేత' అన్నట్లు ఉషఃకాలమున లేచి గంగా నదికివెళ్ళి స్నానమాచరించి గంగాతీరముననే కొంత జనసమ్మర్దములేని త్రిపురాఘాట్ నందు గంగాతీరమునగల వేదికపై కూర్చుండిఉదయము 9.30 గం॥వఱకు మహామంత్రజపముచేయుట పిదప విశ్వేశ్వరుని సందర్శించి 10 గంటలకు జంగమవాడీ మఠమునకు వచ్చుట, అట 11గంటలకు తక్కిన విద్యార్థులతో కూడ ప్రసాదమును స్వీకరించుట. పిదప సాయంకాలము 3 గంటలవరకు తమ యేకాంత ప్రదేశమున గ్రంథ వ్యాసంగముచేయుట, 4 గంటలనుండి 5.30 గంటలవరకు గురుకుల వాసులును, సద్గుణవంతులునగు పండిత సిద్ధరామశివాచార్యులను వీరివద్ద లఘుకౌముది (వ్యాకరణ)సూత్రపాఠములను జెప్పించుకొనుచు అనేక సూక్ష్మవిషయముల దెలిసికొనుచుండెడివారు. పిమ్మట 6 మొ. 9 గం,వఱకు యేకాంతమందిరమున అనుష్ఠానము తరువాత ప్రసాద స్వీకారము - ఇది మన శ్రీవారి నిత్యకార్యక్రమము.

ఇట్లు నియమముగా చక్కని శీలసంపదతో "విద్యాతపోభ్యాం పూతాత్మా'' అన్నట్లు విద్యాతపస్సులను గావించుచుండిరి. ఒకనాడుద యమున మామూలుగా గంగయొద్దున నిష్ఠలో నుండిరి. అపుడు 7గంట లుండవచ్చును. గంగయందు దేలియాడుచు కొన్ని మామిడియాకులు దర్భలతో కూడిన యొకయల తమయొద్దకే వచ్చెను. సహజముగా

నర్ధోన్మీలిత నేత్రులై యుండినస్వామి యా శబ్దమును విని కను విప్పి చూచిరి. ఎదుట దర్భలమధ్య యొక పుస్తకముండెను. శ్రీవారా పుస్తకమును భక్తితో నందుకొనిరి. శ్రీ విశ్వనాథునిలీల శ్రీ గంగా మాతయొక్క అనుగ్రహమాయన్నట్లు విష్ణుసహస్రనామయుక్తమగు శ్రీమద్భగవద్గీతా గ్రంథము కుంకుమాంకితమై పవిత్రగంగాజలముచే తడిసిముడుచుకొనియుండెను. చూచికన్నులకద్దుకొనిరి. స్రవించుచున్న యానందాశ్రువులచే పొత్తము మరల తడిసెను. ఆనందముచే స్వామి భావసమాధినందిరి. తమ మామూలు అనుష్ఠాన క్రమమును ముగించు కొని విశ్వేశ్వరుని దర్శించి మఠమునకు వచ్చిరి.

తమ ఆప్తులగు పండితసిద్ధరామశివాచార్యులకు శ్రీగంగామాత యొసంగిన యాగీతా పుస్తకమునుచూపగావారుమిక్కిలిహర్షముతో, "స్వామిజీ! ఇదే మీజీవితధ్యేయమగు సత్యసంపదతక్కిన సంపదలు గంగలో మునుగును. ఇదియో మునుగక మీ యొద్దకే వచ్చినది. దీనిని చూడ ప్రపంచమను (సంసారమను) సముద్రమునుండి పైకి దేల్చగల విద్య ఇందున్నదని అర్థమగుచున్నది. గంగామాత యనుగ్రహించిన వరమిది. మీరు "ధన్యులు" అని వాక్రుచ్చిరి. పుస్తకమును చక్కగా ఎండబెట్టిరి. అందులో నొకశ్లోకముకూడ పోలేదు. ఈపొత్తము మన శ్రీవారియొద్ద నేటికిని సాదరమున పూజింపబడుచున్నది.

ఇట్లు శ్రీకాశీక్షేత్రమున నియమనిష్ఠలతో నుండగా కొంతకాల మునకు శ్రీస్వామివారి భక్తులును, సోదర శిష్యులునునగు నంద్యాల శ్రీ నెరవాటి బాలసుబ్బయ్య శ్రేష్ఠిగారినుండి 'శ్రీత్యాగరాజస్వామి వారి యారాధన సమీపించుచున్నది, కావున తాముతప్పక విచ్చేయ వలె" నని వినయపూర్వకమగు ప్రార్థనతో 40 రూపాయలు మని యార్డరు వచ్చెను. భక్తిభావముతో పంపబడిన ధనమును గైకొని అందులో 10 రూపాయలను శ్రీ జగద్గురు మహాసన్నిధిలో నర్పించు కొనిరి. కాని శ్రీగురువులవారు వీరిసభ్యతను గాంచి "వలదునాయనా!"

యని వారించిరి. కాని బలవంతముగ భక్తితో నమ్మహాసన్నిధి యందుంచి సాష్టాంగవందనములాచరించి 2-50 రూపాయలకు వేదాంత పరిభాష యను సంస్కృతగ్రంథము నొకటికొని తక్కినడబ్బును రైలు టికెట్టుకై యుంచుకొనిరి. ఈ యనివార్య ప్రయాణముచే తమప్రథమ కాశీనివాసము అప్పటికి ముగిసెననుకొనిరి. నాడు మామూలుగా నను స్నానము తీర్చుకొని విశ్వేశ్వరుని మనసార సేవించి పరమఋషుల శ్రీ శంకరాచార్యుల స్తుతించి, అన్నపూర్ణా మహాప్రసాదమంది మరమఃన సాయంకాలము 4గంటలకే శ్రీ జగద్గురువుల యాశీర్వాదమును బడసి అచ్చటి తమ మిత్రులు మున్నగువారందరికి దెలిపి రాత్రి 7గంటలకు బండినెక్కి ఉదయం శ్రీప్రయాగ (అలహాబాద్) క్షేత్రమును జేరిరి. అనగా దారాగంజ్ స్టేషన్‌లో దిగిరి.

ఇచ్చట గంగా యమున సరస్వతీ నదుల సంగమంబగు పవిత్ర త్రివేణీతీర్థమున స్నానమాడి ధన్యులై యటనుండి 4-5 మైళ్ళ దూర మున నున్న అలహాబాద్ స్టేషన్‌కు బయలుదేరి నడచిపోవుచుండగా మధ్యమార్గమున కుంభవర్షము కురియనారంభించెను. 'శ్రీ రామతీర్థ స్వాములవారు ఇల్లు వెడలిపోవునపుడు ఇట్టికష్టమునే యనుభవించిరి గదా!" యని మనంబున దలపోయుచు భరింపరాని చలికి శ్రీస్వామి చిక్కిరి. ఎంతోత్వరయయ్యును కడకు కష్టపడి స్టేషన్ చేరిరి. కాని చలిబాధఎక్కువై వణకుచునొకమూలగూర్చుండియుండగాస్వామివారి కాసమయమున ప్రాణములు వెడలిపోవునాయన్నట్లు తోచెనట. కాని ఆపద్బాంధవుడగు భగవంతుడార్తభక్తుల యాపదలదీర్పడా? ప్రక్క నున్న యెవరో సత్పురుషులు తమపెద్దకంబళి నొకదానిని నాలుగుమడ తలుగ మడచి మన స్వామిపై గప్పి "అబ్ గరమ్‌హువా హైనా"! అనగా "ఇప్పుడు వెచ్చగానున్నదిగదా! యని పలుకుచు దయజూపిరి. స్వామి స్వస్థముగా వెచ్చగానుండిరి. రాత్రి9గం॥వఱకు వారుదానినడుగ లేదు. సమయముకాగా కంబళి ఆసత్పురుషునకిచ్చి నమస్కరించి9-30

గం బండినెక్కి సుఖముగా 4రోజులకు శ్రీవారు నంద్యాలచేరిరి. కంబళి నొసగిన సత్పురుషునిగూర్చి "ఆ సమయమున నతడు నాకు ప్రాణదాత" యని మనస్వామి సోదరశిష్యులతో చెప్పచుందురు.

నంద్యాలత్యాగకుటీరమునకు శ్రీవారిగురువరేణ్యులగు పూజ్య పాద శ్రీశ్రీశ్రీ సదానందసద్గురుస్వాములవారు దయచేసియుండిరి. మన శ్రీవారు త్యాగరాజకుటీరమును ప్రవేశింపగానే ఎల్లరు అమందానం దమునొందిరి. సిదపస్వామితమపూజ్యగురువులకు సాష్టాంగదండప్రణా మములొనర్చి తాము కాశీ క్షేత్రమునుండి తెచ్చిన పావన గంగా తోయంబులతో శ్రీగురుపాదాభిషేకంబుజేసి యథావిధి పూజించిరి. ఎల్లరు తీర్థము ప స్వీకరించిరి. నాడు సాయంకాలము శ్రవణమునకై శ్రోతలేతె చిరి. ఆనాడు శ్రీసద్గురుస్వాములవారు మన శ్రీవారినే ప్రవ చింపుమని యాజ్ఞాపించిరి. నైష్కర్మ్యసిద్ధి మూడవ ప్రకరణమున ముప్పదియారవవాక్యమును ఆముందరిశ్లోకములనువ్యాఖ్యానముచేయు డని గ్రంథమును దీసియిచ్చిరి. భక్తితో దానిం గైకొని గురుస్తోత్ర ములోత త్త్వంపదములయఖండార్థబోధకమగు "తత్త్వమసి" మహావా క్యార్థ నిరూపణమును సమానాధికరణసంబంధమునపదములకు విశేషణ విశేష్య స్వభావములతోను సమగ్రముగా శాస్త్రోక్తముగా చక్కని యనుభవములతోను ఒకగంటసేపు శ్రోతల మనంబులు తన్మయత్వము నొంద నుపన్యసించిరి. అందఱు పరమసంతసమందిరి. మంగళముతో నాటి కార్యక్రమము పూర్ణమాయెను.

మరుదినమే శ్రీత్యాగరాజస్వామి యారాధన, పూజ, పారా యణము, ప్రవచనము, సంగీతము ఇత్యాది కార్యక్రమములతో వైభ వముగాజరిగి మహోత్సవము సాంగమంగళప్రదమాయెను.

మరుదినము మనశ్రీ స్వామివారినిగురించి అచ్చటచేరినకొందరు గలసి శ్రీస్వామివారు తమతల్లిదండ్రులకు ఏకైక పుత్రులనియు, వే

యేల ఆవంశమునకు వీరొక్కరే సంతానమనియు, ఇకవీరికుండు ఆస్తి పాస్తులన్ననో గొప్పగనున్నవి వీరో ఇట్లు విరక్తిగ నున్నారుగదా! ఎట్లయిననుజేసి వివాహాది సంబంధములను కల్పించి సాంసారిక జీవనులుగా చేయవలయునను నిత్యాది లౌకికప్రసంగములను వివిధరీతులచే స్వామివారికి జెప్పనారంభించిరి. ఈ మాటలనువిని వైరాగ్యమూర్తియగు శ్రీ స్వామి చిత్తము విక్షుబ్ధమై మరింత తీవ్ర వైరాగ్యముతో నిండెను. శ్రీగురుసన్నిధిగాన మారాడక యూరకుండిరి. "ఈ సమయముననే, అప్రమత్తుడనుగా లేకున్నచో గొప్ప ప్రమాదమొదవును" "యదహరేవవిరజేత్ తదహరేవప్రవజేత్" అనెడి నుపనిషదుపదేశము ననుస్మరించుచు "నేనిపుడే యిచటినుండి బయలుదేరి ప్రేషోచ్చారణమంత్రపూర్వకముగా శిఖాయజ్ఞోపవీతముల త్యాగమొనర్చి సన్న్యస్తుడనై కాషాయాంబరములధరించి ఈ లోకముకంటె విలక్షణుడుగా నుండవలెను. లేనిచో వీరి ఉపద్రవము నాకుతప్పదు" అని నిశ్చయించుకొనిన వెంటనే గుంటూరు శ్రీగురునాథాశ్రమము మనసుకు వచ్చెను. ఇక ఆలసించుట తగదని నాటిరాత్రికే "క్షిప్ర బుద్ధేః పలాయనమ్"అనుజంబుకమంత్రమును పఠించుచుసిద్ధసంకల్పులై యూపగలంతయు ఎట్లో కాలముగడపిరి. అందరికిని నాటిరాత్రిభిక్ష శ్రీ పగిడిశాయమ్మగారియింటనేర్పాటై యుండెను. అదే ప్రకారము రాత్రి 7 గంటలకు అందరు ఆ తల్లి యింటికివెళ్ళిరి యథావిధి పూజచేసి వచ్చినవారందరికి భిక్షపెట్టిరి. ఇంకనూ అందరూ భోజనాదులు చేయుచుండగనే మనస్వామివారు లేచి చేయిగడుగుకొని మానసికముగానే వారికి వందనమాచరించిరి. ముందుగనే సిద్ధపఱచి యింటివెలుపలి గూటిలో నుంచిన యొక గోనెపట్టను మాత్రము తీసికొని సర్వార్థసిద్ధుడు బుద్ధుడగుటకై నడిరేయి అంతఃపురమునువీడి యడవులకు వెడలినట్లు మనస్వామి తురీయాశ్రమమును స్వీకరించుటకై తనుగురువులకు మనసా నమస్కరించి యారాత్రి సర్వసంగపరిత్యాగులై యడవులబడి

వెడలిరి.

భోజనానంతరము, అచటివారందఱు వెలుపల వచ్చిచూడ మనస్వామి కనబడలేదు కుటీరమునకు వెళ్ళియుండవచ్చు ననుకొనిరి. చూడగా నచటకూడ నగపడలేదు. "శివశివా ! ఎంతపనియైనది ! ఉదయము మనము మాట్లాడుకొన్న మాటలపరిణామమా? పాపమా పావనమూర్తి యీరాత్రి సమయమున నెక్కడికో పోవలసివచ్చినది" ...అను నిత్యాదిగా అందరు పరిపరివిధముల పరితపించుచు వెదకుచు 4,5 రోజుల వఱకుండి పిదప తమతమ స్థానములకు వెళ్ళిరి.

## సన్న్యాసాశ్రమ స్వీకారము

మన శ్రీవాక్ఘట్టమన పెక్కు భగవన్నిదర్శనములంగనిరి అందు శ్రీవారిముఖమునుండి విన్న కొన్నివిషయముల నిట తెలియ బరచెద. ఆరాత్రివేళ బయలు వెడలిన యామహానుభావుని వర్ణించినచో నిరాలంబుడగు సాక్షాత్తు శంభు వనవచ్చును. చేతిలో నొకకానిడబైస నను లేదు. కట్టుటకు మాఱువస్త్రమైనను లేదు. పట్టుటకు బిక్షాపాత్ర మైనను లేదు ఉన్నది గోనెపట్టమాత్రమే ఆస్తి. అయితే యిట్టివేష మున ఆనాడు రేయినడచి యేలపోవలసి వచ్చె ? నని నేను స్వామి నడుగగా వారుఅయ్యా! పరమపూజ్యంబగు యత్యాశ్రమమును స్వీక రింపబోవునపుడు పాదచారిగనే వెడలవలయును అదిగాక ఆ ఘోరా రణ్య (శ్రీశైలపర్వతశ్రేణిలో) మున గానబడు మహాసౌందర్యము లచే నలరారు ప్రకృతిమాతను గాంచుచు భగవన్నామము నుచ్చ రించుచు నిట్టివేషమున వెడలినచో ప్రకృతిమాత నన్నేవిధముగా, చూడగలదో ? ఏమియిడుముల బెట్టునో? ఆభగంతుడే గురురూపుడై ఎట్లు వానిని బాపునో! చూచెదముగాక యను పరమోత్సాహము తోనే బయలు వెడలితిమి. మఱియు నొకవేళ నీదేహేంద్రియములు భగవత్సేవ కొఱకై యుపయోగముకానిచో నవి యేమైననగుగాక!

యను నిశ్చయముతోనే "శివాయనమః" యనుచు వెడలితిమి అని శ్రీ వారు తమ ఆంతరభావము లనంతముగ దెలిపిరి......"

ఇట్టి నిశ్చయముతో బయలుదేరిన స్వామి యారాత్రి కొంత దూరము నడచి యొకచోట పరుండి వేకువనేలేచి గాజులపల్లె మీదుగా రైలుపట్టాలవెంబడి నడువనారంభించి సాయంకాలమేడు గంటలకు చలమస్టేషన్ చేరిరి. (అరణ్యమధ్యమునగల చిన్నస్టేషన్) అచ్చట నొక విచిత్రసంఘటన జరిగెను. గతరాత్రి ఆస్థలమున దొంగ తనమై యున్నందున స్టేషన్‌మాష్టరు మున్నగువారు మిక్కిలి భ్రాంతులై యున్న పరిస్థితిలో సాయంసమయమున గోనెపట్టతో వచ్చిన స్వామినిచూచి వారు పట్టుకొని యొక గదిలోనుంచి తాళము వేసిరి. అన్నియు మంచికొరకేగదా! అంతవరకు చలిగాలిలోవచ్చిన శ్రీవారు మారుమాటడక గదిలోపల వెచ్చగ ప్రశాంతమున గురుస్మరణచేయు చుండిరి. రమారమి రాత్రి 9 గంటలుండవచ్చును. ఆ స్టేషనుమాష్టరు మున్నగువారు భోజనములు చేసికొని కులాసాగా నొకరితోనొకరు మాట్లాడుకొనుచు చివరికిట్లు వారిలో నొకరు ప్రశ్నించిరి.

"అయ్యా! ధర్మము ధర్మము అందురే! ఏకపుత్ర సంతానమైన పిదప భార్యను తల్లిగా జూడవలెనందురే! అట్లైనచో కుచేలునకంత బుద్ధి లేకపోయెనా? 27 గురుబిడ్డల నేలకనవలె?" అనియడుగ తక్కిన వారు దానికేమేమో విపరీతముగా నర్థరహిత ప్రలాపముల జెప్పు కొనుచుండిరట. ఈప్రశ్నోత్తరములనెల్ల వెచ్చగా గదిలోనున్న మన స్వామి వినియోర్వలేక "అయ్యలారా! ఆప్రశ్నకు మీరిట్టి విరుద్ధార్థములను చెప్పుకొనరాదు. ఆస్తికుడై ధార్మికబుద్ధిచే వినువానికాధర్మ రహస్యములు తెలియును. "నతుగుహ్యాః ప్రతీయన్తేపురాణే స్వల్ప చేతసామ్" అన్నట్లు పురాణముల సత్యార్థము లల్పబుద్ధులకు బోధ పడవు" అని లోపలనుండియే పలికిరి. ఆమాటలు విన్న వెంటనే స్టేషన్‌మాష్టరుగారు గాభరాతో తలుపులుదీసి బ్యాటరీవేసి చూడగా

"అయ్యో! మనముపాపముచేసితిమిరా! ఈయనెవరోమంచిసాధువుగా నున్నారు. చదువు కొన్నవారుగా గనబడుచున్నారు. నారాయణ! నారాయణ!" యనుచు నమస్కరించిరి. మన శ్రీవారు 'శివాయనమః' యని బదులుపల్కిరి.

పిదప శ్రీవారిని వెలుపలికి దోడ్కొనివచ్చి గతరాత్రి యచట జరిగిన సంగతులన్నియు దెలిపి "స్వామీ! ఇంతవరకు తామెవరో తెలియక తప్పుచేసితిమనిపల్కుచు సర్వవిషయములను భక్తిశ్రద్ధలతో విచారించి తెలిసికొని, "స్వామి! స్నానముచేసెదరా" యనియడిగి చల్లనినీటి బిందెను దోడిదెచ్చి చక్కెరకలిపిన చిక్కనిపాలు, నాలుగుఅరటిపండ్లు ముందుబెట్టిరి. "ఇదంతయును శివలీల" యనుచు వానిని భుజించి స్వామి హాయిగాపరుండిరి. ఉదయముననే లేచి ముందు ప్రయాణమునుసాగింప బయలుదేరిరి. ఈమాస్టర్లు, "స్వామి! తామెచటికి వెళ్ళదలంచెదరో చెప్పండి. అంతవఱకు తిమకెట్టి యడ్డులేకుండ గార్డుకు చెప్పి బండి నెక్కించెదము. సాయంకాలము ౪గం.వఱకు నిచ్చటనే యుండవలె" నని ప్రార్థించిరి. కాని స్వామి నాయనలారా! భగవదైశ్వర్య విలాసమగు నీఘోరారణ్యమందలి ప్రకృతిసౌందర్యముల గాంచుచు పాదచారిగ వెళ్ళదలంచినాము. ఇంతటిసద్భావముగల మీకుభగవంతుడు అనంత శుభము లొసంగుగాక" యని యాశీర్వదించి ముందు వెడలిరి.

ఆవిపినవీధి మ్రోగు భృంగముల ఝుంకారముతో కలకలలాడుచు నానావిధ శుకపికాదిపక్షి ధ్వానముతోను దూరమునుండి వినవచ్చు మృగముల గర్జనలతోను నిండిన యాయరణ్యమున భగవదాయత్తచిత్తులుగాన శ్రీవారు నిర్భయులై మహామంత్రంబు ననుస్మరించుచు "నాకేల ఈవిచారము ? ఏకంబగు దానినందిన, శ్రీకంఠఉమామహేశ్వరాఖ్య గురుపరంపర యుండగ"-అను గురుపరంపరాస్తోత్ర పాఠము నుత్కంఠమున పాడుకొనుచు నాదినమంతయు నడచి మరుదినము సాయంకాలము ఇంచుమించు ౩గంటలవఱకు నడచిరి. కాని

యా సుకుమార దేహము యిట్టియిడుముల నెప్పుడు బడియుండ లేదు గదా! ఆహారమా లేదు! ఇనుపకమ్ముల ప్రక్కన నడచినందున పాదములు వాచెను. అడుగిడుటకు కష్టమాయెను. ఇక నెనిమిదిమైళ్ళు నడచిన అడవులుదాటి దిగువమెట్ట (స్టేషను) చేరవచ్చును. కాని దానికైనను శక్తి కావలయుగదా? ఇట్టియెడ ఆహారమొసగి రక్షించవలెనన్నచో నాభగవంతుడు తప్ప మరెవ్వడీ అరణ్యామధ్యమున దిక్కు?

క. "రక్షకులులేనివారల, రక్షించెదననుచు చక్రి రాజై యుండన్
రక్షింపుమనుచు నొకనరు, నక్షము ప్రార్థింప నేల నాత్మజ్ఞులకున్"

అని శ్రీస్వామివారు శాస్త్రప్రవచనమున నీభాగవతపద్యము నుదహరించు చుండెడివారు. దాని యర్థము నిట ననుభవముచే గనిరి. "ఆనాడు తల్లిగర్భమున కిష్కంధమగు స్థానమున నుండుతఱి నేదేవదేవుడు అన్నపానాదులొసగి రక్షించెనో యాపరమాత్మ వెలుపల లేడా? సర్వాంతర్యామి సర్వరక్షకుడునగు నాతని నమ్మి చెడినవారు లేరు నమ్మక ధన్యులైనవారునులేరు" అని శ్రీవారిచే స్మరింపబడుచున్న యాదేవదేవుడే యా యడవిమధ్య బహువిచిత్రముగా స్వామికి ప్రసాదమొసగి రక్షించెను.

ఎట్లన నాయడవిలో నీరీతిగా నడువలేక నడచుచుండగా గుంతకల్లునుండి రైలు వచ్చు శబ్దమువిని ప్రక్కన దూరముగానే స్వామి నడచుచుండిరి. బండి ముందు వెడలిపోయెను. కొంతదూరము వెళ్ళిన పిమ్మట బండిలోనుండి యేదోయొక చిన్నమూట కిటికీగుండా పడెను. ముందుకుపోయి సమీపింపగా పొట్టపగిలినమూట మట్టసముగా పడియున్నట్లు చూచిరి. విప్పిచూడ శుభ్రమైన కొన్నిలడ్డుముద్దలు మరికొన్ని తినుబండారములు నుండెను. ఈదృశ్యమును చూచి యానందాశ్రువులేరులై పారకరుణామయుని మనంబున దలంచుచు భావసమాధినిగనిరి. కొంతసేపటికి తెప్పరిల్లి "భో! పరమేశా! గురుదేవా! వివేకానందులకు శ్రీరామకృష్ణ గురుడు పంపినట్లు నీబిడ్డకీరూపమున ప్రసాదమును బంపితివా తండ్రీ!

ఓం నమః పురస్తాదథపృష్ఠత స్తే
నమోస్తుతే సర్వతఏవసర్వ..."

(గీత 11-4)

అను గీతాశ్లోకమును పఠించుచు భగవంతుడగు శ్రీగురుస్వామికి నమోవాకములర్పించి, దైవసంపిన యా మహాప్రసాదమును తీసికొని ముందునడచుచు సుఖముగ దిగువమెట్ట కెనిమిదిగంటలకు జేరుకొనిరి అప్పటికి అరణ్యప్రయాణము ముగిసెను. తిన్నగ గ్రామగ్రామాంతరముల మీదుగా నడచినడచి గుంటూరు శ్రీగురునాథాశ్రమముజేరిరి.

శ్రీ గురునాథాశ్రమమున వేదమూర్తి పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ వేదానంద స్వాములవారును, బ్రహ్మనిష్ఠ శ్రీపూర్ణచంద్రరావు(పూర్ణానంద) గారునుండిరి. వీరు గుడివాడ వాస్తవ్యులు, తటవర్తివారు. బ్రహ్మచర్యమునుండియే గొప్పవిరక్తులు. శ్రీ శుద్ధచైతన్య స్వాములు వారు శ్రీ రాజగుప్తాది శిష్యులతో గుడివాడ శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవాలయమునందుండగా వీరు శ్రీవారియొద్ద చక్కగా శ్రవణముజేసి బ్రహ్మనిష్ఠసలుపుచున్నవారు. వీరిని మన శ్రీవారు గుడివాడ శ్రీప్రణవాశ్రమమున నెరిగియుండినందున, వచ్చినవెంటనే ప్రేమాదరణములతో లోనికి పిల్చుకొనిపోయి యుచితసత్కారముల సలిపిరి. ఆశ్రమ పోషకులగు శ్రీమాన్ చక్కా సుబ్బారావుగారికి జాబు వ్రాసిపంపిరి. వారు నిండుముదంబున "ఈవచ్చిన నంద్యాలస్వామిని సదా ఇచటనే యుంచుకొనవలె"నని బదులు చీటి వ్రాసి పంపి, ఆసాయంకాలమునకు వారే శ్రీవారి పాదచికిత్సకొఱకై మందును దీసుకొనివచ్చి శ్రీ వారిని దర్శించి వారితో నేరుగా సంభాషించి సర్వ విషయములను గ్రహించి సంతసమొంది యింటికి వెళ్ళిరి.

ఆ పవిత్రమైన యేకాంత స్థలంబున బ్రహ్మనిష్ఠతోను ఆ మహాత్ములతోడి యాత్మవిషయకచర్చలతోను పరమసుఖముండిరి. ఒకనాడు పూజ్యశ్రీ వేదానందస్వాములవారితో తమ రాకకు కారణములనువివరముగా దెలియబఱచిరి.

"స్వామీ! మా పూర్వాశ్రమము ఉత్తమమగుగురుపీఠమునకు చెందిన వీరశైవ (మాహేశ్వర)వంశము, ఆస్తిపాస్తులునుపుష్కలము గా గలవు. ఆవంశమునకు మేమొక్కరమే! ఏకైకసంతానము , మాకో ఆవిషయముల పొత్తు నలదని తీవ్రమగు అనాసక్తి. మాగురు స్వామి పూజ్యపాద శ్రీశ్రీశ్రీ సదానంద సద్గురు స్వాములవారన్నో శ్రోత్రి యబ్రహ్మనిష్ఠులగు అంతర్ముఖ వృత్తిగలమహానుభావులుకావున పై పూర్వాశ్రమమువారు నచ్చి మమ్మియింటికి పిలుచుకొనిపోవు ప్రయ త్నముల చేయుచున్నారు. మా గురువులు మౌనఘనులు. నాకో తత్ క్షణమే ఈలౌకికుల నుండిదూరముగ అనగా నారికులజాతులకు కట్టుపడక శిఖా యజ్ఞోపవీత త్యాగపూర్వకముగసన్న్యసించిన ఇకవారునాజోలికి రారు భయముండదనితలచి వచ్చితిని. కాషాయాంబరములను ధరించి, సన్న్యసినై పోయినచో నాకా పూర్వాశ్రమము వారి తొందరయుం డదు. నన్నువిడిచిపెట్టెదరు. శ్రీ మనుమహేశ్వర గురుపీఠ పరంపరా దివ్యశక్తి కాపాడును. నేనుధన్యుడనయ్యెదను. నాడుపూర్ణానదియందు జగదాచార్యులగు శ్రీ శంకరులను మొసలి మ్రింగనుంకించి అయ్యా ! నీవు సన్న్యసించిన విడుతు ననియు లేకున్న మ్రింగుదు ననియు తెలిపి నట్లు నేనును సన్న్యసించినచో తురీయాశ్రమినైనచో మిగులుదును ; లేకున్న సంసారమను మకరము నన్ను పట్టునుస్వామీ !" అనునిత్యాది విషయలను శ్రీవారు తెలిపిరి. దానికి పూజ్య వేదానందస్వామి, "బాబూ ! ఈ కాలమున సన్న్యాసము బహుకష్టతరము. ఈ కలికాల మున కలిమలమునంటక గట్టెక్కుట దుస్తరము. వివేక వైరాగ్యముల దృఢతగలచోట సన్న్యాసము ఫలించును. ప్రకాశించును పైగా పూర్ణమగు ఈశ్వరానుగ్రహము లేనిచో దానిని రక్షించుకొనజాలడు. నిజముగా యత్యాశ్రమము లోకమునేదిద్దగల త్యాగాదర్శశీలయు తము. ప్రకృతికంటెపరము సర్వశ్రేష్ఠము. కాంతాకనకములపూర్తిగా జయించి పొందెడి స్వాత్మస్వారాజ్య సుఖానుభవమే సన్న్యాసనము.

కాని యనుష్ఠానపరుడగు ప్రయత్నశీలునకదేమి కష్టమైనదికాదు. బ్రహ్మనిష్ఠాపరులగు మీాసదిచ్ఛయుత్తమమైనదే ! మీా యాచరణ మాకు మిక్కిలి యానందదాయకము. ఆరక్షణోపాయపటిమ మీా యందు గలదనియే మావిశ్వాసము, మంచిదే. కొంతకాల మిచటనే యుండుడు." అని సెలవిచ్చిరి. అంత వారికి వందనము లాచరించి తను యేకాంత ప్రదేశమునకువచ్చిరి.

మనస్వామివారీస్థానమున భగవద్గీతాపరమార్థచంద్రిక (అనగా తొమ్మండ్రుగుర భాష్యముల యనువాదమును) శ్రద్ధగా నవలోకించిరి. మొత్తము పొత్తము ఆరుభాగములు. ముముక్షువులత్యావశ్యకముగా జూడదగినది. ఇట్లు దాదాపు రెండు మాసములు గడచినవి. అంతనొక దినమున శ్రీవేదానందస్వాములవారు ఆశ్రమాధిపతులగు శ్రీ చక్కా సుబ్బారావుగారికి ఒకజాబు వ్రాయుచు, "నూతనవస్త్రములు, విరజా హోమద్రవ్యములు మున్నగువస్తువులు కావలెను. మనయాశ్రమము నకు వచ్చిన నంద్యాలశ్రీవారు రేపుపూర్ణిమా-సోమవారం సన్న్యాసా శ్రమముస్వీకరించెదరు" అని చీటివ్రాసి కోటయ్యఅనుభక్తునిద్వారా పంపుచుండ ఆయనపోవునపుడాచీటిని అతడు మన స్వామికి చూపించి వెళ్ళెను. ఆశ్రీముఖమును చూచినది మొదలు మనస్వామి హృదయ కమలము వికసించెను. "ఎప్పుడెప్పుడు పవిత్ర కాషాయాంబరములు ధరింతునా ! సన్న్యాసినై లోకులనుండి యెప్పుడు దూరమాదునా?" యని మహాతీవ్రతతో, ఆనాడు రుక్మిణీ కల్యాణమున అగ్నిద్యోతను డను పురోహితుడువచ్చి రుక్మిణితో "అమ్మా ! మెచ్చెను వచ్చును నిన్ను కృష్ణుడు స్వీకరించును." అని చెప్పినను ఆయమ "ఆ ! ఎప్పుడు వచ్చును? నన్నెప్పుడు చేబట్టును ? అని అఖండవృత్తితో తహతహ పడినట్లు,ఆవేశముతో పరితప్తమానసులై "నే నఖండ సన్న్యాసిని, సర్వ సంగపరిత్యాగిని, ఎల్లబంధములు వీడిపోయె" ననుకొనుచు నాశుభ ముహూర్తమునకై యెదురుచూచుచుండిరి.

నాడు శ్రీతారణనామసం॥ ఫాల్గుణ పౌర్ణమి సోమవారం శా. శకం ౧౮౬౬ (తే26-2-1945) కామదహన పర్వదినము పవిత్రమగు అమరావతీక్షేత్రము, కృష్ణానదీతీరము శ్రాద్ధయుతముగ పూర్వభాగ మగు క్రియాకలాపములు శాస్త్రీయముగ జరుపబడిముగిసెను. శ్రీమదు మామహేశ్వర గురుపీఠ పరంపరా స్తోత్రానుస్మరణ పూర్వకముగ స్వగురు నమస్కార మొనర్చి ఆచార్య సంప్రదాయానుసారము ప్రేషోచ్చారణమంత్రమునుముమ్మారుచ్చరించి సన్న్యస్తులై "శ్రీశ్రీశ్రీ శంకరానందగిరిస్వామి 'యను యోగపట్టమును వడసిరి. చెప్పవలసిన ధర్మములను పూజ్యశ్రీవేదానందస్వాములు తెలియజేసిరి. శ్రీశంకరా నందగిరిస్వామియై మంత్రపూతమగు పవిత్ర కాషాయాంబరములను ధరించినంతనే చేతననంతమగు దివ్యతేజ మొకటి పరమశాంతమై మహాప్రభలతో దేహమాపాదమస్తకము శ్రీవారిని వ్యాపించినట్ల య్యెను. "అభయం సర్వ భూతేభ్యః" యనుచు భావసమాధినందిరి. అనంతరము భిక్షాచర్యవగైరా కార్యక్రమము లయినపిదప శ్రీగురు నాథాశ్రమమునకు విచ్చేసిరి.

ఈశుభవార్తను తమ పూజ్యగురువరేణ్యులగు శ్రీసదానంద సద్గురుస్వాములవారికి అత్యంత భక్తిపూర్వకముగా జరిగిన శుభసమా చారమునంతయు తెలియజేయుచు 'ఇదంతయు తమ యనుగ్రహమే' యని విన్నవించుకొనిరి. మరియు తక్కిన యాప్తులగు సర్వులకును తెలియజేసిరి. ఈసమాచారము కొందరి కమితానంద మొందజేసెను. కొందరిని దుఃఖాబ్ధిలో ముంచివేసెను. మరి కొందరు ప్రేమానందము లుప్పొంగ భక్తితో భావావేశపూరితులై పరమసంతోషమున శుభ సందేశములను దెలుపుకొనిరి. వ్రాసిపంపిన యాప్రసంగములలోఒకటి రెండు పద్యముల నిట కనబఱచెద.

పూజ్యపాదశ్రీచిదానందస్వాములవారినుండి(కన్నడభాషలో)

శా. "ఎందోగైద సుకర్మ మిందు పరిపక్వావస్థెయం పొంది తా
నెందెందు కెడ దాత్మ సౌఖ్య మతియోళ్ తందిత్తుదం కండు ఆ

నందం పొందువ భాగ్య నిన్న హృదయక్కెదిర్కు హే శంకరా
నందా ! ధన్యను ధన్య నీను భువియొళ్ బందొమ్మెనింకాణ్బుదై"

కాశీ క్షేత్రమునుండిపండితశ్రీసిద్ధరామశివాచార్యులవారు,(కన్నడము)

భా॥ష॥ శంకరాద్వగరమల యతిగళ
టొంక కట్టిరువవరు హమ్మిన
బింక మురిదలెదాడు తిర్పరు లోకసంగ్రహకె ॥
మంకుమనుజరసంఖ్యశంకెగ
శంకురవ కిత్తొగెదు నిజసుఖ॥
మంకుడువ తత్వబోధక భవసద్గురువు॥
అరివు విరతి సుకర్మభక్తియు
కరిగి మెరెదిహమూర్తియో ! శం
కరను తానవతరసి బందిహనేనొ యెంబంతె॥
గురుగళెనిసి శంకరానంద
గిరి సునామధె తోరుతిశె జన!
కరుహి తత్త్వవ ధన్యరాగిసి మెరెదరికె యొళగె॥

అనంతర మిచటనే కొన్ని దినములుండి మహోపకారమొనర్చిన పూజ్యశ్రీవేదానందస్వాములవారిని

వేదాంతే ప్రతిపాదితం సువిమలం తత్త్వం యదాత్మేతియః
శాస్త్రాచార్య నిషేవణాదనుదినం నిశ్చిత్య యుక్త్యా స్వయం
శిష్యాణా మపవర్గ మార్గమనిశం సందర్శయన్ రాజతే
వేదానంద యతీశ్వరః కరుణయా పాయాదపాయాత్సనః॥"

అని స్తోత్రముజేసి, పిదప బ్రహ్మనిష్ఠులగు శ్రీపూర్ణచంద్రరావు గారిని (పూర్ణానందులను ఆలింగనమొనర్చుకొని, ఆశ్రమ యజమానులకు దెలిపి యచటనుండి బయలుదేరి గుడివాడ శ్రీప్రణవాశ్రమమునకువచ్చిరి.

ఆశ్రమాధిపతులగు శ్రీప్రణవానందస్వాములవారు ఆసమయమున స్థానాంతరమునకు వెడలియుండిరి. వారికి నైష్ఠికబ్రహ్మచారులును చక్కని ఆధ్యాత్మిక సంస్కారముగల శ్రీ ఆదిరాజు సీతా

రామయ్యగారను వారొకరు శిష్యులుగ నుండిరి. మనస్వామిని చూచిన వెంటనే మహానందముతో నెదుర్కొని పరస్పర కుశలముల విచారించుచు తురీయాశ్రమ స్వీకారమును గురించిన సంతోష సల్లాపములతో స్వామి నత్యంత ప్రేమానురాగములచే జూచిరి. ఆశ్రమమున సంతత మాధ్యాత్మిక విషయములంగూర్చి చర్చించుకొనుచు గంటలకొలది మైమఱచుచుండిరి.

ఈసమయముననే స్వామికత్యంత ప్రియులగుసహజశాంతిస్వభావులును, బ్రహ్మవిద్యా విభూషితులును, నిజమైన పండితులును పరమహంస పరివ్రాజకాచార్యులునగు పూజ్యపాదశ్రీశ్రీశ్రీశుద్ధచైతన్య స్వాములవారును అచ్చటికి విచ్చేసిరి. వీరి శిష్యులలో నొకరు శ్రీపూర్ణచంద్రరావుగారును శ్రీగురునాథాశ్రమమునుండి మరుదినమే ఇచటికరుదెంచిరి. ఇక నాసమావేశము బ్రహ్మలోకమై యుండెను. నిరంతరము వేదాంతవిషయక చర్చలే.

"తచ్చింతనం తత్కథనం అన్యోన్యం తత్ప్రబోధనం।
ఏకదేశ పరత్వంచ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః"
"తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః।"
(గీత. 5-17)

అన్నట్లు సదా తద్భావభావిత చిత్తములతో నిరంతర బ్రహ్మవిచారాయత్తచిత్తులయి దేహ జగంబుల మఱచిరి. శ్రీదక్షిణామూర్తి స్తోత్రము మానసోల్లాసిని వ్యాఖ్యాన వ్రాతప్రతిని చక్కగ పరిశీలించి అందుమూలమున కొన్ని అపూర్వవిషయముల నెఱిగిరి.

## సిద్ధగీత - సద్గోష్ఠి

ఒకనాడు పూజ్యపాదులగు వీ ర ం ద ఱు ఆశ్రమము వెనుక తోటలో చేరిరి. శ్రీశుద్ధచైతన్య స్వాములవారిట్లనిరి.

"స్వామీ! అందర మొకచోట నీ యుద్యాన వనమున చేరి యున్నాము. ఇప్పుడు మనమందరము సిద్ధులము. యోగవాశిష్ఠమున

సిద్ధగీత యని యున్నది. కొందరు సిద్ధులొక ఉద్యానవనమునచేరి మాట్లాడుకొన్న తమ తమ బ్రహ్మానుభవములనే యట సిద్ధ గీత యనిరి, అట్లనే మనమును మన యనుభవములను చెప్పకొందుముగాక నవియును సిద్ధగీతలే కానిండు, మీమీ యనుభవములను గానము చేయండి" యనిరి. దానికందఱును "స్వామీజీ! తాము మొదట పాడి నచో పిదప మేము పాడెద" మనిచెప్పిరి అప్పడు--

పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శుద్ధచైతన్య సిద్ధులు :

"రెండవది లేని ఉనికి నేను"

శ్రీసీతారామసిద్ధులు :

"ఆత్మనేనని అనదు. అట్టి యనుభవమును సర్వత్ర దర్శించు టయే తత్త్వదృష్టి"

శ్రీ పూర్ణచంద్ర సిద్ధులు :

"క్షేత్రము క్షేత్రజ్ఞుడు అను భేధము బాధించిన అఖండస్థితియే నేను."

మన శ్రీశంకరానందగిరిస్వామి సిద్ధులు :

"అది ఇది యనెడి బుద్ధివృత్తులు లేని యఖండ సంవిత్తే నేను. ముముక్షువు లభ్యాసమును విడువకుండిన ఈతత్త్వమును సత్వరము సర్వత్ర కాంతురు. ఇది గురుకృపాలబ్ధము స్వసంవేద్యము"

ఇట్లే నలువురు సిద్ధులు తమ తమ అనుభవముల గానముజేసిన పిదప, శ్రీశుద్ధచైతన్యసిద్ధులు, శ్రీసీతారామయ్యసిద్ధులును ఇట్లుపలికిరి. "ఈసిద్ధగీతా గానములలో శ్రీశంకరానందగిరి సిద్ధులగానము ఋషి సంప్రదాయమును పోషించు సదనుభవమై యున్నది" అని మహా సంతోషముతో మాట్లాడుకొనుచు చర్చ ముగించిరి.

ఈసుదినములలోనే పూజ్యపాదశ్రీశ్రీశ్రీశుద్ధచైతన్యస్వాముల వారు మన స్వామివారికి అష్టోత్తరశతోపనిషత్తుల మూలగ్రంథమునతి ప్రేమతో ప్రసాదించిరి. ఇవ్విధంబగు సజ్జనసాంగత్యంబున రెండు మాసము లనతి కాలమున ముగిసిపోయెను.

ఇంతలో మనశ్రీవారి పూర్వాశ్రమమందలి జనకులు పరమ పదించినట్లు గుడివాడ ఆశ్రమమునకొకజాబువచ్చెను. కాని యానాడే స్వశ్రాద్ధము బెట్టినవారేమి జేయగలరు ? అయినను వైరాగ్య చక్ర వర్తులగు శ్రీశంకరులంతటి మహానుభావులుకూడ మాతృభక్తిని ప్రక టించిరిగదా! యని మదిదలపోసి హృత్పూర్వకముగ జ్ఞానానుభవము నొందపాత్రుడగు నన్నుగన్న ఈ జన్మదాతయైన తండ్రి ఎంతయు ధన్యుడని భక్తిచే 'ఓంనమో నారాయణాయ, ఓం నమశ్శివాయ' యని శ్రద్ధాంజలి నొసగిరి.

పిదప ఒకటిరెండుదినములలోనే ఆళ్ళగడ్డ పూజ్యపాదశ్రీశ్రీశ్రీ శంకరానందస్వాములవారినుండి"శ్రీశంకరజయంతి మహోత్సవమునకు తాము తప్పక దయచేయవలెను" అని మన శ్రీవారికొక లేఖవచ్చెను. అందువలన మనస్వామివారు అచటినుండి సెలవు బుచ్చుకొని పార్థివ వైశాఖశుద్ధ చవితి (15-5-1945) మంగళవారమునకు ఆళ్ళగడ్డ శ్రీశంకరానందాశ్రమముజేరిరి.ఇచ్చటపూజ్య శ్రీశంకరానందస్వాముల వారితో తమ సన్న్యాసాశ్రమ స్వీకారవిషయము మున్నగు యావ ద్విషయములను పరస్పరము ముచ్చటించుకొనిరి. ఈఅపూర్వవిషయ మును విని వారు చాల సంతసించిరి.ఆనాడు శ్రీగురునాథాశ్రమమునకు ఈశ్రీవారుకూడా తమ ప్రేమమయలేఖను బంపియుండిరి. పరమ దయామూర్తులు, సర్వకార్యాదక్షులు, ఉత్తమప్రవక్తలు.

మరుదినమే (16-5-1945 బుధవారము) శ్రీశంకరజయంతి మహోత్సవము. ఈయాశ్రమమున నూతనముగా సంవత్సరమేదీని నాచ రించుట. ఒక్కరోజు కార్యక్రమము మట్టసముగా నుండెను. మన స్వామివారే శ్రీజగద్గురు శంకరాచార్యపూజనుశాస్త్రోక్తముగాసంగ్ర హముగా శ్రీశంకరవిజయపురాణకాలక్షేపముగావించిరి. సాయంసమ యమున శ్రోత్రియబ్రహ్మనిష్ఠులగు హైదరాబాద్ శ్రీనివాసశాస్త్రిల వారి యధ్యక్షతలో ఉపన్యాస కార్యక్రమమును ప్రారంభింపబడెను.

ఆశ్రమాధిపతులగు శ్రీశంకరానందస్వాములవారి యుపన్యాసము జరిగెను. పిమ్మట అధ్యక్షోపన్యాసముతో కార్యక్రమము సమాప్తమయ్యెను. శాంతి మంగళము జరిగెను.

రెండుమూడు రోజులపిమ్మట శ్రీ శంకరానందస్వాములవారితో మన గిరిస్వాములిట్లువిన్నవించుకొనిరి. "స్వామిజీ! తమయాశ్రమము లలో శ్రీ గిర్యాశ్రమక్షేత్రము అత్యుత్తమమగు ఏకాంతస్థానముగా చెప్పుచుంటిరిగదా! అట్టి పవిత్రక్షేత్రమున నే గొంతకాలము వసింప గోరుచున్నాను. అది సాధ్యమా?" అనియడిగిరి. అందులకా స్వామి వారు పరమప్రీతితో, స్వామిజీ! తమబోటి యనుష్ఠానపరులగు ఆదర్శపురుషులదే ఆయాశ్రమము. తమకెట్టి యభ్యంతరమునులేదు తప్పక వెళ్ళవచ్చును. ఈ విషయమున అచ్చట తమకు వలసిన సకల సౌకర్యములను గావించెదము" అనిచెప్పుచు వెంటనే యచ్చటి తమ శిష్యులకొక జాబు వ్రాసిరి.

మరుదినమే మనస్వామివారు అచటినుండి సెలవుగైకొని నేరుగా నంద్యాల శ్రీత్యాగరాజస్వామి కుటీరమునకువచ్చి తమసంఘమువారి నందరినిగాంచి నాటిశాస్త్రప్రవచన సమయమున తాను సన్న్యసించిన సంతోషవార్తను, మరి యానాడు నంద్యాల విడచి యడవులబడి పోవునపుడు దారిలోగన్న భగవల్లీలా విచిత్రములను దెలియజేసిరి. అది విని యచటి భక్తులందరును, "స్వామి! తమరిట్లు సన్న్యసింపవలెనని యే మాకోరిక యుండెను. మాకు చాలసంతసమయ్యెను." అని చెప్పుచు మరిమరి సర్వులు దండవత్ప్రణామములాచరించిరి. స్వామిని వివిధరీతుల స్తోత్రముజేసిరి.

## గిరిక్షేత్రవాసము - చాతుర్మాస్య వ్రతాచరణము

పిమ్మటనంద్యాలలో స్వామిప్రియులగు అందరి భక్తులతోసహా వీడ్కోలునొంది శ్రీవారు బాబాబుడన్ గిరి ప్రాంతమునకుప్రయాణమై

పార్థివ వైశాఖ బహుళచవితి (31.5.1945గురువారము)నకు శ్రీదత్తాత్రేయ ఆదిపీఠము లేక శ్రీసిద్ధేశ్వరక్షేత్రము హోగరేఖాన్‌గిరిశ్రీశివానందాశ్రమము విచ్చేసిరి. (కరూరుజిల్లా బీరూరునకు సమీపమున గలదు. మైసూరుస్టేట్) ఇది రమణీయంబగు ప్రకృతిసౌందర్యములచే నొప్పు మహాపర్వతశ్రేణి. అనేకవనస్పతులతోను, ఉన్నతవృక్షముల తోను, పచ్చికబయళ్ళతోను, పెద్దపెద్ద కాఫీతోటలతోను, నానావిధ మృగ ఖగములతో నిండి ఘోరాటవియై మనస్సును హరింపజేయు అనంత సౌందర్యములతో నలరారు పర్వతరాజమిది. ఇందు అన్నిటి కంటెను ఉపరిభాగమున ఈ శ్రీ శివానంద సేవాశ్రమము గలదు. ఇది కైలాసాధిపతియగు శివుడు సింహాసనమున గూర్చుండి శివసభ జరుపు చున్నాడా ఏమి? యనునట్లు గంభీరమగు శోభతో నొప్పుచుండుఉచ్చ స్థానము. మరి ఈ ఆశ్రమమునకు క్రిందిభాగముననే పవిత్రమగు పెద్ద సెలయేఱు. ప్రక్కన దత్తాత్రేయపీఠమగు శ్రీసిద్ధేశ్వరాలయము. ఇట్టి ఉత్తమ పవిత్రవాతావరణమగు నీక్షేత్రమునుగాంచి మనస్వామిమైమ అచి పరవశులైరి. పరమఋషులిట్టి స్థలములయందే నివసించుచుండిరి గదా! యని హృదయమున స్మరించి సందర్శించిరి.

"వాసో గిరివనే నిత్యం గీతాధ్యయన తత్పరః।
గంభీరాచల బుద్ధిశ్చ గిరినామాస ఉచ్యతే॥"

అనునట్లు తమ యాశ్రమనామమున కన్వర్థమై యొప్పుచున్నదనియు తలంచుకొనుచు, గీతాధ్యయన తత్పరులై తీవ్రమగు నియమనిష్ఠలచే తపమాచరించిరి.

క్రిందిపల్లెనుండి మూడుమైళ్ళు పర్వతమెక్కి యాశ్రమమునకు చేరవలసియుండును. అచటి కాఫీతోటల యజమానుల యిండ్లుకొన్ని యాగిరిపైననే కలవు. ఇది చిన్నపల్లెగా నుండును. ఆళ్ళగడ్డ స్వాముల వారి శిష్యులు పెక్కండ్రు ఇచ్చట గలరు. మంచిభక్తులు. వారిలో వేదమూర్తి బసవలింగయ్యయను సద్గృహస్థులు స్వామికి నిత్యము భిక్ష

నొసంగుచు పరమభక్తితో వచ్చి స్వామిబోధల వినుచు సర్వవిధంబుల సేవజేయుచుండిరి. అనుదినమును భక్తాదులందఱు కలసి భజన పారాయణ శాస్త్ర శ్రవణాదులజేయుచు పరమానందముగానుండిరి. ఇట్లుండ కొందఱు భక్తులు శ్రీవారితో కొన్ని ప్రశ్నలనడిగి తమ సందేహముల దీర్చుకొనిరి.

ప్ర. స్వామీ! ఇంద్రియముల నిగ్రహించుటకై నేనెంత ప్రయత్నించినను అది సాధ్యముకాకున్నదే! దీనికేమి చేయవలెను?

ఉ. నేను అనెడి అహంకారమువిడిచి యిచ్చట నాయొద్దనేయుండుము అట్లయినచో నది సాధ్యమగును. అనగా మహాత్ముల సన్నిధిలోనున్నచో ఆ యింద్రియము లుపశమించును.

ప్ర. పూజ్యస్వామీ! ఎట్లుండినచో నాకు శాంతి లభించును. దానికేమి చేయవలెను?

ఉ. నీ గురుడు చెప్పినట్లు శ్రుతిసమ్మతంబగు మార్గములో నడచును ఆ త్రోవలో అటు ఇటు అగపడు చిత్రవిచిత్ర వ్యామోహ పదార్థములకు లోబడక మోసపోక గురుస్మరణతో వాక్యార్థమును సదా విచారించు చుండుము. తప్పక శాంతి లభించును.

ప్ర. దుఃఖమే లేదని చెప్పెదరే! అట్లయినచో దుఃఖమెచ్చటనుండి వచ్చినది?

ఉ. దుఃఖమెచ్చటినుండియు రాదు. చక్కని విచారదృష్టిలేని నీ మనోదౌర్బల్యమే దుఃఖరూపమున పరిణమించును. నిజముగా దుఃఖమునకు జగత్తున తావులేదు. కశ్మలమగు మనస్సే దుఃఖరూపము. గురుశరణాగతిచే మానసిక మలము బాయును. వివేకోదయమగును. దుఃఖముండదు. సుఖమే మానవుని సహజ స్వరూపము.

ఇట్లు మహదానందముతో తపంబాచరించుచుండ కొన్ని దినంబులకు ఆళ్ళగడ్డ శ్రీశంకరానందస్వాములవారు మన శ్రీగిరిస్వామివారికి ప్రేమతో నొకలేఖను వ్రాసిరి.

"స్వామీ !...బ్రహ్మమే అయియుండి బ్రహ్మమగుట మిక్కిలి యాశ్చర్యకరము."విముక్తశ్చ విముచ్యతే"యన్న శ్రుతి భంగితాము నిత్యముక్తులే యయ్యు, సదాచార విచారములతో వర్తించుచుండు మీయాదర్శ జీవనము కడుంగడు ధన్యము, లోకకళ్యాణదాయకము, సన్మార్గదర్శకము..."ఈమాటలు తమ సోదరశిష్యులు మున్నగువారు విని లేఖను కని సంతసించిరి.

## 1.వ. శ్రీచాతుర్మాస్యమహావ్రతము-1945 సం॥

ఇంతలో చాతుర్మాస్య వ్రతారంభకాలము సమీపించెను. ఈ వత్సరమునుండియే మనస్వామివారీమహావ్రతమును దీక్షగా బూనిరి. అన్నివిధములైన యేర్పాట్లు సిద్ధములయ్యెను. శ్రీ పార్థివ సంవత్సరము ఆషాఢ శుద్ధ ఏకాదశి (20_7_1945) శుక్రవారం బ్రహ్మముహూర్తమున శుభసంకల్పముతో విధ్యుక్తముగా శ్రీఉమామహేశ్వర గురుపీఠస్తోత్రముజేసి సమస్త వైదికవిధులచే ఈ మహాకార్యము ప్రారంభింపబడెను. ఈ వ్రతకాలమున (నాలుగు మాసములు) సంపూర్ణ మౌనము, అపక్వాహారము, నిరంతరము బ్రహ్మనిష్ఠ, ఉపనిషత్సూత్ర గీతాద్యవలోకనాదులచే సంయమశీలురై దీక్షను సలుపుచుండిరి. ఆ పుణ్యతపోభూమియందు క్షేత్రమహిమచే పెక్కుదైవాదేశములను మహిమలనుగనిరి. పరమ ఋషులను సందర్శించిరి. ఆత్మస్థైర్యముచే కొన్ని స్థిరానుభవముల బడసిరి. కష్టించి తపమాచరించిరి. లక్ష గాయిత్రీ మహామంత్రజపము చేసి పూర్ణాహుతి గావించిరి. మంత్రాధిదేవతను నిష్ఠయందుగనిరి. అందువలన నాస్థానమున శ్రీచక్ర యంత్రరాజమును వేధ్యుక్త విధులతో ప్రతిష్ఠింపజేసి యఖండభజన పూజాపారాయణాది విధ్యుక్తధర్మములతో సప్తాహము జరిపించిరి. అన్న సంతర్పణాది మహాకార్యములతో పూర్ణాహుతి ఊరేగింపు మహోత్సవాదులు అత్యంతవైభవముగ నడచి పూర్ణమాయెను.

అనంతర మొకప్పుడు ఆళ్ళగడ్డ శ్రీశంకరానందస్వాములవార చటికి వచ్చి యా వాతావరణమును గని పరమసంతోషమునొందుచు రెండుమూడు దినములుండి గీతాప్రవచనాదులు గావించి. వెళ్ళిరి. తాపసవృత్తి కనుకూలమగు నాపరమశీతల వాతావరణమున శ్రీ స్వామివారు పరమైకాంతమగు నా సదవకాశమున భగవద్గీత, బ్రహ్మ సూత్రములు, ఛాందోగ్యోపనిషత్తు, ఉపదేశసాహస్రి ఈ అపూర్వ మగు వేదాంతగ్రంథములను చక్కగ పరిశీలించిరి ఇట్టి సదవకాశ మును కల్పించియిచ్చిన పూజ్య (ఆళ్ళగడ్డ) శ్రీశంకరానందస్వాముల వారికి అనంతప్రణామములని మాటిమాటికి మన శ్రీవారు తమసోదర శిష్యులతో చెప్పుచుందురు.

## శృంగేరి జగద్గురు పీఠ దర్శనము

ఇంతలో బీరూరు R.M.S. ఆఫీసరుగారగు భక్తులు శ్రీ వేంకట స్వామి నాయుడుగారు వచ్చి శృంగేరి జగద్గురుస్వాములవారిని దర్శించి వచ్చెదమని విన్నవించి మనస్వామివారిని బీరూరునకు దోడ్కొనివచ్చి తమయింట భిక్షనొసంగి యొకదినమచటనే యుంచుకొని గిరిభక్తులు శ్రీబసవలింగయ్య మున్నగువారితో కలసి శృంగేరి వెళ్ళిరి.

ఇయ్యది జగద్గురు శ్రీశంకరాచార్యస్వాములవారి చతురా మ్నాయ పీఠములలో శారదాపీఠమని ప్రసిద్ధిగాంచిన దీశృంగేరిమహా క్షేత్రము.అరణ్యములమధ్య తుంగానదీప్రవాహ పరిసర పుణ్యభూమి "గంగాస్నానం తుంగాపానం" అనియు ప్రసిద్ధి,ఈమహాస్థలము విభాం డకమునికుదయించిన ఋష్యశృంగుడు మల్లికార్జున మహాలింగము నంధైక్యమందిన పుణ్యక్షేత్రమని పురాణప్రసిద్ధి. ఈపవిత్రస్థలమున పరస్పర విరుద్ధములగు (పాము-కప్ప) ప్రాణులుకూడ తమ వైరభావ ములనువీడి పరస్పర ప్రేమసౌహార్దములతో మెలగుచుండుటను తిల కించియే ఇయ్యది పుణ్యక్షేత్రమని నిశ్చయించి ఆదిశంకరులీచోట ప్రసిద్ధమగు నామ్నాయ (శారదా) పీఠమును స్థాపించిరని స్థలపురా

ణము. ఇట్టి యాచార్య పదస్పర్శగల పావన క్షేత్రమునుజూచిపరమా నందభరితులై మన శ్రీవారు తుంగాజలముల జలకమాడి శ్రీశారదా దేవి సన్నిధికివచ్చి పరమభక్తితో వాగ్దేవిని పూజించి సేవించి,యుప నిషత్సూక్తులతో స్తుతించి ప్రసాదమును బడసి ధన్యులైరి.

మరుసటిదినము సాయంసమయమున నదికావలియొడ్డుననుండు మఠమునకు (నరసింహావనమునకు) పోయిరి. అచ్చట సాక్షాత్ పర మేశ్వరుడాయనునట్లు దివ్యతేజస్సుతో వెల్గుచున్న ౧౦౮ శ్రీశ్రీశ్రీ జగద్గురు శ్రీచంద్రశేఖరభారతీమహాస్వాములవారు అప్పుడు మౌన వ్రతముతో నున్నందున దూరమునుండియే సందర్శించి యనంత ప్రణామము లాచరించు కొనిరి. పిమ్మట ఉపస్వాములవారగు జగ ద్గురు శ్రీమదభినవవిద్యాతీర్థ మహాస్వాములవారిని సందర్శించిరి. వారును మనస్వామిని గూర్చి "ఎక్కడివారు ? ఎవరు? అనుమున్నగు ప్రశ్నలడిగి అన్నివిషయముల దెలిసికొని ప్రశాంతముగా తమ యాధి కారిక వాణితో కొన్ని మంచిమాటల జెప్పుచు చివరకీవిధముగా మహోపదేశము గావించిరి.

"లోకమున నేమిజేసినను ఎంతటి ఘనకార్యముల కొనసాగించి నను, ఇంకను కొంచెము మిగిలియే యుండును.అది పరిపూర్ణముగాదు అనంతరం,ఆపిదప-యను నాకాంక్షలచే సర్వదా అపరిపూర్ణమేఅయి యుండును. కాని మానవుడెపుడు ఆత్మసాక్షాత్కారమున నఖండా ద్వితీయ బ్రహానుభవమును పొందునో యప్పుడిక చేయవలసినదిగాని, పొందవలసినదిగాని మిగిలియుండదు. సర్వశ్రుతుల తాత్పర్యము నిదియే. కనుకనే శ్రీశంకరభగవత్పాదాచార్యులవారు గుర్వష్టకమున అదేదృష్టితో "తతఃకిం తతఃకిం" అనిచెప్పిరి. అది నిరతిశయము వ్యాపకము, పరిపూర్ణము, ఇట్టి బ్రహ్మాత్మనాసంస్థితియే జీవన పరమ లాభము, తదితరము రజ్జుసర్పము వంటిది" అని ఇట్లు పరమోత్తమ తత్త్వమును దెలిపి శ్రీశారదా శంకర ప్రసాదము ప్రసాదించిరి.

మరియొక దినమచటనే యుండి చూడవలసిన స్థానములన్నియు చూచినాలుగవ దినమచటినుండిబయలుదేరి బీరూరునకురాగా అచ్చట వేంకటస్వామి మున్నగువారు శ్రీస్వామివారి సెలవు పుచ్చుకొనిరి. పూజ్యస్వామివారు మాత్రము నేరుగా శ్రీసిద్ధగంగా శివగంగా క్షేత్రములను సందర్శించి చివరకు గురుస్థానమునకు గంజిగుంట శ్రీమఠమునకు శ్రీగురుమహాసన్నిధికి వచ్చిరి. సర్వవిషయములను శ్రీ గురు స్వామికడ సవినయముగా విన్నవించుకొనిరి. శ్రీగురుమూర్తి సంతసిల్లుచు శిష్యునిట్లు ప్రశ్నించుచు ఊరడిల్లజేసిరి.

ప్ర. "స్వామీ! నీవు జన్మతః నిత్యసన్న్యాసివై స్వామివయ్యే యుంటివే. ఇక మఱల యీసన్న్యాసమంటే అర్థమేమి ?

ఉ. పూజ్యమహాశయా గురుదేవా! వస్తుతః సన్న్యాసియేయై యుండినను నాగురుతులు వెలుపల కనబడుచుండలేదు. కానన నీ లోకులనబడు కాకులు మఱల నన్నెప్పుడు తాకకుండుటకై యీవేషమనబడు కంచెకోటను తమ యాశీస్సులచే కట్టుకొంటినంతే! నిజముగా కాషాయాంబరములు త్యాగాదర్శ చిహ్నములు గదా! గురుదేవా! నేనీవేషమున నుండుటచే త్యాగులయొద్ద భోగులు మరెప్పుడు తమ భోగలాలస విషయములను గుఱించి మాట్లాడరుకదా ! అట్లున్నచో ఆజన్మ సన్న్యాసినగు నాకా విషయవాసనలెక్కువుకదా! అప్పుడు చిత్తమునశుద్ధత్వమధిక మగుటచే సత్వరముగాజ్ఞానదార్ఢ్యమేర్పడునుగదా! జ్ఞానానుభవమున వాసనలు సజీవములుగా నుండజాలవు; ఆభాసములు జీవచ్ఛవములై భాసిల్లును, వాటినుండి నాకనర్థముగాని ఆదాయమును గాని యుండవు. అందుచే సర్వ విలక్షణంబగు సత్యాత్మానుభవమునకు సాంగముగా జీవిత ప్రతిబంధముల దరిజేరనీయక దూరీకరించుగురుతుగా నీవేషమునొసగి నన్ను ధన్యుని జేసితిరని వివిధ రీతుల గురుస్తోత్రమును జేయుచు విన్నవించుకొనిరి. మరియు "జ్ఞేయః స నిత్య సన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి" (గీత5అ.3శ్లో) యన్నట్లు ఫలసన్న్యాసము నుద్దేశించి తాము సెలవిచ్చినమాట పరమసత్యమే! గురుదేవా! 'సన్న్యాస్య

శ్రవణం కుర్యాత్" అను శ్రుతి ప్రత్యగాత్మదృష్టితో వర్తించునధి కారికి శ్రవణమననాదులద్వారా బ్రహ్మాత్మనా సంస్థితికొఱకు కర్మ సన్న్యాసమును విహితమేగదా! సంస్కారమును బట్టి అంగీకరింపబడు చుండుననియు గురుమహాసన్నిధివారు చెప్పుచున్న సంగతియేగదా! కాన తమ యనుగ్రహామే నా సన్న్యాసము. నిజముగా సన్న్యాసమనునది యిచ్చునదియు పుచ్చుకొనునదియు కాదు. తమయనుగ్రహామున స్వాయ ముగాగలుగునదియే. "సన్న్యాసో నిర్మలం జ్ఞానమ్" అను శాస్త్రోక్తి ననుసరించి అయినను సన్న్యాసము లోకాదర్శము సంప్రదాయ సిద్ధ ము" అను నిత్యాదిగా మరిమరివినయముతో విన్నవించుకొనిరి. ఇట్లు శిష్యుని ముఖారవిందమునుండి. వెలునడు సశాస్త్రీయమగు సమాధాన మును విని శ్రీసద్గురుమూర్తి యమందానంద సందోహంబు నందిరి. శివమస్తు.

## విచిత్ర సంఘటనలు

ఇట్లు గురుసన్నిధానమున కొన్ని దినములున్న పిదప గురుస్వామి వారి ఆజ్ఞ మేరకు కుందనగుర్తి శ్రీ శివలింగాశ్రమమునకు వచ్చిరి. శ్రీవారిరాక యచటివారందరికి మహదానందమును కలుగజేసినది. అదేమి ధర్మకర్మసంయోగమో అంతవఱకీ గ్రామమున వర్షములేక ప్రజలు చాల బాధపడుచుండిరి. శ్రీస్వామివారాయూరికి వచ్చినరోజే కొంతసేపటికి కుంభవర్షము కురిసివాతావరణము చల్లబడి యందరికిని శాంతి ఆనందముల గల్గజేసెను. కాని యజమాను లందఱును "మన స్వామివారు మనగ్రామమునకువచ్చినందునేవర్షమువచ్చెను. సాక్షాత్ శృంగి మహాముని వచ్చినట్లాయెను" - అని పొగడ దొడగిరి. కాని పెద్దవారు లౌకికుల యిట్టి స్తుతినిందాదుల కెన్నటికి నుబ్బితబ్బిబ్బులు కారుగదా! ఈ జనులమాటలువిని మనస్వామి "అయ్యా! అట్లన రాదు. వర్షము వచ్చుటపోవుట మాయోపాధికుడగు భగవంతుని యిచ్ఛయేగాని అందు కెవరునూ కారణముగాదు. "తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ" అని భగవద్వాక్యము కావున మీ

రీలాంటి కల్పనలు చేయరాదు. ఈశ్వరేచ్ఛ.

"ఉత్పత్తిం ప్రళయంచైవ భూతానామాగతిం గతిం
వేత్తి విద్యామవిద్యాం చ స వాచ్యో భగవానితి॥"

అను వచనానుసారము ఉత్పత్తి ప్రళయములను, భూతముల రాకపోకలును, విద్యావిద్యలను - ఈ యాఱింటిని ఎవడెఱుంగునో అతడే భగవంతుడు. వర్షరూపముననే ప్రాణులరాకగాననాతత్త్వము నెఱిగినవాడు భగవంతుడొక్కడే. ఆవర్షముయొక్కరాకయు కర్మాను సారమే. భగవంతుని యిచ్ఛకధీనమై వచ్చును. అంతియేగాని యెవరో యిచ్చటకు వచ్చినందున వర్షము వచ్చెనని చెప్పకొనరాదు" —అని బుద్ధివాదముల జెప్పిరి.

పిమ్మట ప్రతిరోజు మామూలుగా ఆశ్రమమున శాస్త్రశ్రవణాదులచేతను తమయనుష్ఠానాది సన్నియమములచేతను సంతృప్తిగ నానందముగా నుండగ కొలదిరోజులకే చాతుర్మాస్యమహావ్రతారంభ కాలము సమీపించెను.

## 2.వ. శ్రీచాతుర్మాస్యమహావ్రతము - 1946 సం॥

శ్రీ వ్యయనామ సంవత్సరము ఆషాఢశుద్ధఏకాదశి బుధవారము (తే 10-7-1946) శుభదినమున సశాస్త్రీయముగా గతసంవత్సరము వలె పూర్ణమౌనము, అపక్వాహారము, బ్రహ్మనిష్ఠ మున్నగు సన్నియమములతో విధ్యుక్తముగ నుత్తమరీతి ప్రశస్తముగు మహావ్రతమారంభింపబడి నడచుచుండెను.

ఇంతలో భాద్రపద ఆశ్వయుజమాసముల మధ్యదైవయోగమున వర్షము సకాలమునకు రాకపోయెను. పాపమా తెలియని మనుజుల యజ్ఞతనేమందుము? ఆనాడు వర్షము వచ్చినపుడు పొగడిన యా మనుజులు నేడు వర్షము రానందుచే శ్రీస్వామిని నిందించుటకు మొదలుపెట్టిరి.

"స్వామివారు అన్నము నీళ్ళు విడిచి ఏమో చేయుచున్నారు. అందువలన వర్షము రాలేదు. గాన రేపు కొండకువెళ్ళి వారివ్రతము

విడిపించి క్రిందికి దింపుదము:" అని మాట్లాడుకొని సంసిద్ధులై యుండగా నాటి రాత్రికే విశేషముగా వర్షముగురిసెను. ఆవర్షము ఎనిమిదిరోజుల వఱకు విడువలేదు. అమాయకభక్తులగు నా జనులు మరల వెంటనే తమలో తాము "చూచితిరా! మనమందరము ఆనాడు మనస్వామిని గూర్చి యేమేమో తప్పుగా ననుకొంటిమి. పెద్దయపరాధమయ్యెను. పట్టినవర్షము విడువక కొంపలు గూల్చుచున్నది. వెళ్ళిస్వామిపాదాలు పట్టుకొందము"అను నిత్యాదిగా అందరు కృతనిశ్చయులై రేపు స్వామి దగ్గరికి వెళ్ళుదమని అనుకొనిరట, అదేమి చిత్రమో! నాటిరాత్రికే వర్షమాగిపోయెను. స్వామివారికీ విషయమున ఎట్టి కల్పనలు లేక పోయినను కాకతాళీయముగా భగవల్లీలారూపముగా జరిగిన యీ విచిత్రసంఘటనల గాంచి యమాయకమగు నాప్రజలు వివిధకల్పనలు చేసికొనుచు మరలవారు ఓహోహో!ఓ రే!మనస్వామివారుగొప్పవారు వీరిలో నేమో మహిమగలదు. మనమేమి భావించినను తప్పై యా దెబ్బ మనకే వచ్చితగులుచున్నది.వారుపెద్దలు. మంత్రం త్రిప్పినారు. అంతా వారి చేతిలో వుంది. మనకువారు స్వామి" అని ఇట్లు మిక్కిలి భక్తివినయంబులతో నాటినుండి నేటివరకును విశ్వాసముతో స్వామియందు మహాభయభక్తులు గలిగిమెలగుచున్నారు.ఈవిషయము లన్నియు వ్రతానంతరము కొందఱుభక్తులు స్వామివారికి విన్నవించగా స్వామివారు నవ్వుచు. "పాపము! వారికి తెలియదు; బాలురు! భగవంతుడు వారికి సద్బుద్ధి నొసగిరక్షించుగాత" యనిపలికిరి. ఆవత్సరము మహామానముచే వ్రతమహాకార్యము సాంగమంగళప్రదమై నిర్విఘ్నముగా జరిగి చివరి రోజులలో నఖండభగవన్నామభజనలు పూజాపారాయణ మున్నగు సర్వవైదిక విధానములతో విజృంభణముగా జరిగి యన్నదానాది శాంతితో ఊరేగింపు మహోత్సవమై కార్యము పరిపూర్ణమయ్యెను.

వ్రత సమాప్తియైనపిదప కొందఱుత్తమభక్తులువచ్చి స్వామి

నడిగి తమ సందేహముల దీర్చుకొనిరి. అందు కొన్ని ఇచటని రూపింప బడుచున్నవి.

ప్ర. మహాత్మా! మౌనమనగా నేమి? దాని ప్రయోజనమెట్టిది? అప క్వాహారముచే గలుగు లాభమేమి ?

ఉ. మౌనమనగా నెట్టిమనోవృత్తులు లేకయుండుట అందువలన గలుగు ప్రయోజనము ఆత్మలాభము. శాంతి సుఖము. శ్రీశంకర భగవత్పా దులవారు "మోక్షస్య ప్రథమం ద్వారం వాఙ్నిరోధోఽపరిగ్రహః" అనిచెప్పిరి. అనగా మోక్షకవాటము తెరువబడవలెనన్నచో మొదట సంయమముచే వాగ్రూపమైన యీకవాటమును మూయవలెను. అప్పుడు మనస్సు వైఖరీ స్థానమును వీడి మధ్యమవాక్కున లీనమగును. వెలుపలరాను ప్రయత్నించును. వచ్చుటకు వాకిలి మూయబడి యున్నందున నచ్చటనే గొణుగుకొనుచు గొంతకాలముండి యాపిదప దానిపై నుండు పశ్యంతికివెళ్ళి యాత్మప్రతిఫలన మంది చూచుచుం డును. అప్పుడు మనస్సు చూచునదయ్యే యుండునుగాని చూడబడు స్థానమునకురాదు. అంత గొంతకాలమునకు ఈ స్థానమునువిడిచి కేవ లము పరావాణి యనబరగు ఆత్మస్థానమును జేరును. ఇక నీమనస్సున కావల గమనము లేనందున నాచోట నిలిచిచూడ సర్వమును తాను గనే భాసిల్లును. ఆవాక్కు మరల వైఖరికివచ్చినను వైఖరియని చెప్ప బడదు. పరారూపముననే యాత్మమాత్రముగనేయుండి పలుకును. మనోవృత్తులు బ్రాహ్మీస్థితిచే బాధింపబడి సహజనిష్ఠ యలవడును. ఈ మూలమున ప్రథమమున వాఙ్నిరోధ మనునది యెంతటి పరమ సాహా య్యమో పరతత్త్వసాధనమో యనుష్ఠించి చూచిన నిది తెలియ గలదు. అంతియేగాక మౌనముండుటచే సామాన్యముగా అసత్యాది దోషములు వాక్కున కాపాదింపవు. ఆ సంస్కారములు చేరవు.అధిక ముగా గ్రంథావలోకనకవకాశము లభించును బ్రహ్మనిష్ఠకది సహాయ మగును వేయేల! "మౌనేన కలహం నాస్తి" యను నీతివాక్యమును ఈ విషయమునే తెలుపుచున్నది. ఇక అపక్వాహారమనగా వికార మొద

వింపని యాహార పదార్థముల భుజించుటచే నిర్వికారమగు నాత్మ సం దర్శనమునకు (అనుభవమునకు) వలసిన బుద్ధికుశలత పవిత్రత శ్రుతి యుక్తనుభవములచే చక్కగ తెలిపిరి.

## హంపి క్షేత్ర యాత్ర

ఇట్లు వ్రతానంతరము యాత్రార్థమై సుమారిరువది మందిభక్తు లతో కలిసి శ్రీపంపాక్షేత్రమునకు వెళ్ళిరి. పూజ్యస్వామివారి వెంట వెళ్ళిన యాయాత్రానందమును ఏమని వర్ణించగలము? జతలో వెళ్ళిన వారు సద్భక్తులగు యువకులు. అందరును హొసపేటనుండి నడచిసుఖ ముగా పంపాక్షేత్రమును జేరిరి. ఆనాడు ఉదయం మొదలు వర్షము గురుయుటచే చలికి జంకితుంగభద్రాతీరమును సమీపించియు స్నానము చేయుటకు ముందు వెనుకలు జూచుచు నొడ్డున గూర్చుండి భక్తి పూర్వకముగా ఓవిరూపాక్షేశ్వరా! లేక లేక ఈనాడు నిన్ను దర్శించు టకు వచ్చియుండ ఈనీభక్తుల కుత్సాహముప్పొంగ నదియందుస్వేచ్ఛగ మునిగి నిను దర్శించు భాగ్యమును మాకివ్వవా? భగవంతుడగుశ్రీరామ చంద్రునికార్యమున రాయిరప్పలును పశుపక్షిరూపముల ప్రకృతియు కూడ సహకరించినట్లు వినబడుచున్నదే ? అట్లు ఈనీయాత్మ రామ భక్తులపై దయగలిగి యీకొంత సేపైనను సూర్యభగవంతుని దర్శింప జేసి సహాయమొసగి సంతోషమును కలుగజేయరాదా దేవా" అను నిత్యాదిగా భక్త్యుత్సాహములతో చిందులువేయుచుండ న దే మి చిత్రమో! మరుక్షణముననే, యానాడు జయద్రథుని వధసమయమున భగవన్మాయచే మాయబడిన భానువు మరల ప్రకాశించి అర్జునుని సందేహమును బాపినట్లు ఈభక్తుల భక్తికి భగవంతుడు మెచ్చెనాయను నట్లు వెంటనే మేఘాచ్ఛన్నుడై యుండిన సూర్యుడు దర్శనంబిచ్చితన వేడికిరణములచే భక్తులను బాధించుచున్న చలిని బాపి భక్తులకానంద మును గలిగించెను. అప్పుడు కలిగిన ఆయానందోత్సాహములకు మేరయే లేదు. వెంటనే అందరును పవిత్రభావమున "ఓ భాగీరథీ! పావన

గంగామతల్లీ! మాకందరికిని భక్తిజ్ఞానవైరాగ్యముల ప్రసాదించుకావు మమ్మా!" యని సంకల్పించి కైవల్యోపనిషత్పఠన మొనర్చుచు గంగ యందు దూకి తనివిదీర స్నానముచేసి, భగవంతుని గుణగాన మొన ర్చుచు శ్రీవిరూపాక్షేశ్వరాలయమునకు వచ్చి యచట స్వామిని పూజించి గీతాపారాయణ భజన శ్రవణాదుల గావించి ధన్యులైరి. రాత్రి శ్రీశివరామావధూతస్వామియను వైరాగ్యశిఖామణుల యా పుణ్యాశ్రమమందు విశ్రమించి యుదయమున తమతమ నియమనిష్ఠల ముగించుకొని యచ్చట ముఖ్యముగ దర్శింపవలసిన అన్ని స్థలములను దర్శించిరి.

## హుబ్బళ్ళి శ్రీసిద్ధారూఢాశ్రమము

అటనుండి యందఱును ప్రసిద్ధమగు హుబ్బళ్ళి శ్రీసిద్ధారూఢా శ్రమమునకు వచ్చిరి. అపర శివుడోయనునట్లు వెలిగి వేదాంతభేరిని దిగ్విజయముగా మ్రోగించిన శ్రీసిద్ధారూఢస్వామివారిచే నది స్థాపింప బడినది. వేదాంతప్రచారమునకు ప్రధానకేంద్రము. వీరి సమాధియు నిచట నేగలదు. ఇట్టి పరమపావనమైన సుహోమఠమునకు వెళ్ళి సమాధి దర్శనమంది భగవద్గీతా పారాయణానుష్ఠానాది తమ ఆహ్నికములు దీర్చుకొనిరి. శ్రీసిద్ధారూఢస్వాములవారి సన్నిధికి వెళ్ళి దర్శనమందిరి. అప్పుడచ్చట పెక్కుమంది సాధువులు, స్వాములు, శ్రోతలు భక్తులు మొదలగు వారందరు చేరియుండిరి. వేదాంత శాస్త్రశ్రవణము జరుగు చుండెను. మనశ్రీవారు తమ పరివారముతోగూడ అందరు కూర్చుండి శ్రవణముజేసిరి. వీరినిగూర్చి "మీరెవరు ? ఎచటివారు?" అను నిత్యాది వివరములడిగి దెలిసికొని సంతసించి ఆనాడు సాయంకాలము శాస్త్రప్రవచనము మనశ్రీవారిచేతనే జరుగవలెనని యచటివారందరు కోరిరి. ఆప్రాంతమున కన్నడవేదాంతసాహిత్యమునందుసుప్రసిద్ధమైన సర్వశాస్త్రసారరూపమగు శ్రీమన్నిజగుణశివయోగులచేవిరచితంబగు షట్ఛాస్త్రములు లేదా పంచరత్నములు అను గ్రంథమునందు వీనిలో

నొకటగు అనుభవసారము అను ప్రకరణమునందలి "చిత్తిన వివర్త వెందెనలేకె జగవిదం మత్తె మాయామాత్ర వెనలాగదె?" అను నీ ప్రశ్నాత్మకమైన అయిదవ సూత్రమును దీసియిచ్చి ప్రవచింప వలసినదిగా నచటివారు మనస్వామిని గోరిరి.

పూజ్యస్వామివారు గురుస్మరణ పూర్వకముగ గ్రంథమును చేబట్టి యిట్లారంభించిరి. సూత్రార్థమేమన :

జగత్తును మాయామాత్రమే యని చెప్పక చిద్వివర్తమని యేందుకనవలె?" అని ప్రశ్న: "నాఽసతో విద్యతేభావఃనాఽభావో విద్యతే సతః""అసత్తునకు (అనాత్మకు) ఉనికి లేదు.ఆత్మకు లేమి లేదు" ఇది నియమముగాన జగత్తనునది ప్రత్యేకముగా నపృథక్సిద్ధి లక్షణాత్మక స్వయంశక్తిచే నున్నదిగాదు. ఆబ్రహ్మమే ఇదిగా గోచరించుచున్నది.అందుచేజగత్తన వివర్తోపాదానమేగాని మాయోపాదానమన రాదు. వివర్తమన "అప్రచుత్య పూర్వస్వరూపస్య అసత్య నానా ప్రకారావభాసః వివర్తః" అనగా పూర్వరూపము చెడకయే చెడిన దానివలె యగపడుట రజ్జువు చెడకయే సర్పముగా నెట్లుభాసించునో, మరియు నాభాసించు సర్పమొకటి అన్యోపాదానమున రజ్జువుకంటె భిన్నమై సత్యముగా నెట్లులేదో, ఉన్నరజ్జువే భ్రమచే సర్పముగా నెట్లుదోచినదోమరియు అధిష్ఠానజ్ఞానమున బాధనొందునదై యున్నదో, అటువలె నిజముగాలేని జగమునకు అనిర్వచనీయమగు మాయ ఉపాదానముగాదు. ఉన్నచిత్తే వివర్తోపాదానమున బాధాయోగ్యమై జగము భాసిల్లుచున్నది. అను నీమొదలగు విషయముల నతి సష్టముగ హేతుదృష్టాంతానుభవములతో నాసూత్రాధారమున శ్రోతల మనమొప్ప రెండుదినము లుపన్యసించిరి. అచటి సర్వశ్రోతలు అమితానందము నొంది పరమప్రేమతో మరికొంతకాలముండవలసినదిగా మన స్వామిని కోరిరి. కాని శ్రీవారు "నాయనా! మంచిదే. మీ ప్రేమకు చాల సంతసము. మరొకసారివచ్చెద" మని సెలవు గైకొని అందరుప్రయాణమై శ్రీశివలింగాశ్రమమునకు విచ్చేసిరి.

## శ్రీ శంభులింగ పర్వతము

శ్రీస్వామివారు కొంతకాలమిచటనే గీతాభాష్యప్రవచనములు జరుపుచుండి యాపిదప మైసూరు ప్రాంతమందలి "శ్రీశంభులింగన బెట్ట" యనుస్థలమునకు బయలుదేరిరి. అది బ్రహ్మజ్ఞాన సంపన్నులగు శ్రీమన్నిజగుణ శివయోగులు తపమాచరించి బ్రహ్మసాక్షాత్కార మందినపుణ్యభూమి. మైసూరునుండినంజనగూడుమీదుగాకొళ్ళేగాలం వెళ్ళు త్రోవలో మూగూరునకారుమైళ్ళ దూరమున "చిలకవాడి బెట్ట" (కొండ)యని ప్రసిద్ధిజెందిన తపోభూమి ఇది. ఈపవిత్రస్థలమున మనశ్రీవారు కొంతకాలము ధ్యానమగ్నులై యుండుచు షట్శాస్త్ర గ్రంథము నవలోకించిరి. అనంతరమా ప్రాంతమందలి విశేషములన్నియు తిలకించి మైసూరు రాదలచినవారై యాఱుమైళ్ళ దూరమున నున్న మూగూరువఱకు పాదచారులై వచ్చిరి. అట్లు నడచివచ్చునపుడు శ్రీవారియొద్దనున్న అయిదురూప్యముల కాగితము (నోటు) దారిలో ఎచ్చటనో పడిపోయెను. శ్రీవారియొద్ద మరిడబ్బు లేదాయె! అచటి నుండి మైసూరునగరము దాదాపు 60,70 మైళ్ళదూరము, దగ్గరడబ్బు లేదు. ఇక పరిచయము లేని యాస్థలమున కరుణామయుడగు శ్రీగురు పరమాత్మ తప్ప వేరెవ్వరీకష్టము బాపుదురు? అప్పుడేమియుదోచక శివశివా! సచ్చిదానందమూర్తీ! గురుపరమాత్మా! నేను నేడిట్టికష్ట మనుభవించుట నీకిష్టమా? తండ్రీ" అని తలచుకొనుచు వెళ్ళి బస్సు వారితో వినయముగా, "అయ్యా! నాయొద్దనున్న అయిదురూపాయలు దారిలో నెచటనో పడిపోయెను, కాననన్ను మైసూరువఱకునెక్కించు కొనిపోగలరా" అనియడిగిరి. కాని పరమ లౌకికులగు వారికి వీరుసాధు వులనిగాని మహాత్ములనిగాని తెలియుటెట్లు, వారినెట్లు జూడవలయునో వారితో నెట్లు మాట్లాడవలయునో ఏమాత్రము తెలియకపోవుటచేత నాజనులు మనస్వామియెడ తిరస్కారభావముతో "అయ్యా! సాధూ! స్వామీ! ఈ వేషము ధరించిన మీకిదే గతి దేవుడు దేవుడని దేబ

రింతురే, దైవధ్యానపరులకు కష్టములేమియు నుండవుగదా ! చూచితివా? అసలు దేవుడే ఉన్నచో మీ అయిదురూపాయల నెట్లుపోగొట్టును? మీ సన్యాసులకథ మాకు తెలుసునులే చూచినాము; పో పొమ్ము" అని కసరుకొనిరి.

క్షమాశీలురగు మనస్వామివారు అంతమాత్రమున కేవిధముగను విసుగుచెందక "కాని ఈనాటి దైవలీల యీ స్థలమున నిట్లు కావలసి యున్నది. తనలీలార్థమై యా పరమేశ్వరుడే (గురుదేవుడే) వారిముఖమున నిట్లుపలుకుచున్నాడు ; నాద్వారా వారి నడుగునట్లు ప్రేరణ యొనర్చి యున్నాడు ; కసిరినపిదప కలిగిన వ్యథయందును అతడే యున్నాడు; ఊహాతీతాత్మ నేనని దెలిసి ఉపాధికృత వ్యత్యాసములను మిథ్యయని తెలిసి సంతసింతునుగాత! కానిమ్ము మంచిదే,ఓం తత్సత్ !" అని యొకచోట గూర్చుండిరి. ఇంతలో నొకపెద్దమనిషి చేతిలోకొన్ని పూలుపండ్లు పట్టుకొని శ్రీవారియెదుటనే నడువీధిలో పోవుచుండెను.ఆ గృహస్థునియొద్ద అయిదురూపాయలు అప్పుగానడిగి మరలపంపెదమని మైసూరు భక్తులు శ్రీగోవిందప్పగారి యడ్రసు నీయవచ్చుగదా ! యనెడి సంకల్పము శ్రీవారికుదయించినది. వెంటనే ఆవ్యక్తియొద్దకు వెళ్ళి యున్నవిషయము తెల్పి డబ్బునడిగిరి. ఆసద్గృహస్థుడు వెంటనే యానడువీధిలో శ్రీవారిపాదములకు నమస్కరించి "స్వామీ ! నేనింత వఱకు పెక్కుచిక్కులకు చిక్కి క్రుస్సుచుంటిని. భగవంతుని యనుగ్రహముచేత నేడాచిక్కులన్నియు దీరిపోయెను.కనుకనే యిపుడు కరుణామయుడగు నా భగవంతునకభిషేక పూజాదులద్వారా నా కృతజ్ఞతను తెల్పుకొనుటకై ఫలపుష్పాదులగొని శివాలయము వెళ్ళుచున్నాను ఇట్టి నాయొద్దకు నాడు సాక్షాద్భగవంతుడే వామనరూపుడుగా బలిచక్రవర్తిని చేయిజాపి యడిగినట్లు వచ్చి యడుగుచుండ నా భాగ్యమేమని చెప్పగలను! ధన్యుడను ! ఇంతకంటె పుణ్యము వేరెద్దియుండును ? సాక్షాత్పరమేశ్వరుడే మీరు ! ఎంతకావలెనో తమరడుగవచ్చును

మహాత్మా! అని భక్తిప్రపత్తులతో విన్నవించుకొనెను. అంత మన శ్రీవారు, నాయనా! నాకు కావలసినది మైసూరువఱకు టిక్కెట్టు; అందుకు మూడురూపాయలు చాలును మైసూరు వెళ్ళగానే పంప గలను" అనిరి. కాని యాయుదారవ్యక్తి వెంటనే పదిరూపాయల నోటొకటి ఫలతాంబూలములతో స్వామి కరపాత్రయందు సమర్పించి మహాత్మా మరల నాకీ డబ్బు పంపవలసిన అగత్యములేదని భక్తిచే విన్నవించుకొనెను మఱలమనస్వామి "ఇంతడబ్బవసరము లేదు"అని యెంత చెప్పినను బలాత్కారముగా సమర్పించి మ్రొక్కి సెలవు గైకొని వారాలయమునకు వెళ్ళిరి.

శివశివా! నీలీల లనూహ్యములు! నీవు కర్తు మకర్తు మన్యథా కర్తుం. సర్వశక్తిసంపన్నుడవయ్యా! పరాత్పరా! ఈ రథముయొక్క సారథ్యము నీచేతిలో నున్నది. నిన్నే నమ్మి సారథ్యమును నీకర్పించి నిరహంకృతిచే వర్తించిన నీబిడ్డల నే ప్రయాస యనునది లేక అనా యాసముగ గమ్యస్థానమును జేర్చగలవుగదా! అయితే ఓగురుదేవా! విశ్వంభరమూర్తీ! ఇట్టి క్లిష్టసమయములందును నీస్మరణ తప్పకుండు నట్లాశీర్వదింపుము. నిన్ను నాస్వరూపమున దెలిసి నిజనిష్ఠ నూరకుండు నట్లనుగ్రహింపుము. ఎల్లరూపములచే నీవే భాసిల్లుచున్నావు. రూప ములు వేరైనను చూపులకు చూపైనవాడవు నీవొక్కడ వేగదా! అన్నిటియందును నిన్నుగాంచగల దృష్టి నొసంగుము. శ్రుతిసమ్మతమైన సద్బుద్ధి నొసంగుము. ప్రభో! ఈప్రకృతి లీలారంగమున నీచిత్ర విచిత్ర బహిర్విడంబనాత్మకమగు రూపముల జూచి మోసమొందని నిర్మోహమును నిర్ద్వంద్వమునునగు చిత్తస్థైర్యమును, ఆంతరంగికమగు ప్రజ్ఞాచక్షుస్సును ప్రసాదింపుము. "ఓంతత్ సత్" అని భక్తితో దయామయుడగు శ్రీగురుపరమాత్మ ననుస్మరించిరి. (ఈవిషయమును సోదరశిష్యులతో భక్తిపరవశులై శ్రీస్వామిచెప్పుచుందురు.)

అచటినుండి మనస్వామివారు ఆ బస్సుకడకేవచ్చిరి. పాపమా

నాడు బస్సువారికి పాసింజర్లు రానందున సంతవలకు వెళ్ళక నిలిచియే యుండెను. శ్రీవారు నేరుగావెళ్ళి బస్సులో గూర్చుండిరి. అంత కొంతసేపటికే బస్సు కదలెను. బస్సువారికి స్వామి డబ్బియబోయిరి. అప్పుడా బస్సువారు, "ఓస్వామీ! మొదట మమ్ము క్షమింపుడు. "ఏపుట్టలో నేపాముండునో" యన్నట్లుతమ విషయము తెలియక ఆడ రాని మాటలాడితిమి; పరిహాసమొనర్చితిమి. అట్లుచేసినందులకు ఫల మాయనునట్లు మామనస్సుల ఏలకో అశాంతి నాటిల్లెను. రూపాయలు రాకపోయెను; జనులులేక బండిపని చేటాయెను. కాబట్టి స్వామీ! మీడబ్బులువద్దు. మీయాశీర్వాదము లుండినచాలును. ఎట్టి కష్టము లేక నడువీధిలో నాకవ్యక్తి భక్తితో మ్రొక్కి డబ్బులు సమర్పించు కొనగా మేము జూచుచుంటిమి" అని చెప్పుచు రొక్కమును తీసికొనక వారందరు స్వామికి నమస్కరించిరి. స్వామి శివశివా యని సుఖముగా గూర్చుండిరి. భగవదేకదీక్ష గలిగి వర్తించువారి కిడుమ లెన్నటికిని రావు. ఒకవేళవచ్చినను నిరపాయముగా నివృత్తము లగుచుండును. ఇది ముమ్మాటికి సత్యము. పెద్దలయనుభవము.

## మైసూరు నివాసము

బస్సులో గూర్చున్న మనస్వామి సుఖముగా మైసూరు చేరి భక్తులగు శ్రీగోవిందప్పగారి యింటికి వెళ్ళిరి. స్వామినిచూచినవెంటనే మహదానందముతో పరమభక్తితో వారు స్వామిని సత్కరించిరి.తమ మేడమీదనే చక్కనివసతులతో బస నేర్పరచిరి. ఈ గోవిందప్పగారి కుటుంబమున పిల్లలుమొదలు పెద్దలవఱకు నందఱు సజ్జన విధేయులు, పుణ్యాత్ములు. ఇట్టి భక్తుల ఇంటిలో అనుదినము పూజానుష్ఠాన గీతా పారాయణప్రవచనాది నిత్యకార్యక్రమములను యథావిధిగాజరుపుచు అందరు పరమ తృప్తినుండిరి.

ఇట్లుండ కొన్నిదినములకు శ్రీస్వామివారు వెళ్ళివచ్చినశ్రీశంభు లింగని కొండనుండి పూజ్యశ్రీ చిదానందస్వాములవారు, బదనేహాళు

శ్రీ తమ్మిరెడ్డి యనువారును మైసూరువచ్చి శ్రీగోవిందప్పగారియింటనే భిక్షను స్వీకరించి యొకదినమున నందరుకలసి (మైసూరు) అగ్రహారమునసుండు శ్రీమన్మహారాజుల గురువులు శ్రీసిద్ధలింగ శివాచార్యస్వాములను దర్శించుటకై వెళ్ళి యాజ్ఞ వడసి లోపలజని వారిని దర్శించిరి. అనంతరము పరస్పర సంభాషణము జరిగెను. పిమ్మట సంతోషముతో మనస్వామివారినిగూర్చి రాజగురువులు విచారించిరి. అప్పుడు మన శ్రీవారిని గురించిన సర్వవిషయములను వారు విశదముగ తెలిపిరి. "ఈ స్వామివారు చాతుర్మాస్యవ్రతము నీ మైసూరు ప్రాంతముననే చేయదలచి యున్నారు." అనియు విశదపఱచిరి. అది విని యాగురువులు పరమ సంతోషమున, "చాలమంచిది; ఇట్టి విద్యాబుద్ధులు గలిగి వైరాగ్యసంపన్నులైన ఈలాటి యనుష్ఠానపరులకు వారియనుష్ఠానాది సర్వకార్యములకు తగిన యనుకూలమును కల్పించి యిచ్చుట లోకకల్యాణప్రదము. నిజమైన సన్న్యాసులు అనుష్ఠానపరులు లోకమున పదుగురున్నను ప్రజానీకము బాగుపడుట కెట్టిసందేహమును లేదు. చాల మంచిది. అట్లయినచో స్థానాంతరమునకై తాము వెదకనేల ? మన ఈమహాసంస్థానముననే మంచి యేకాంతమగు నొక యుద్యానవనమును చూపెదము. అన్ని యేర్పాట్లు చేయబడును. హాయిగనటనుండవచ్చు" నని పరమప్రేమతో వారు పలికిరి.

ఈమాటవిని సంతసించి మన శ్రీవారినచటనే విడచి వారు వెళ్ళిరి. అనంతర మా రాజగురువులు రాజమర్యాదతో నొప్ప తమ గురువుల సమాధిగల యేకాంత వనమున నొకప్రక్క చక్కని గది నొసంగి యందు సర్వసౌకర్యములను కల్పించిరి. అది పట్టణమునకు నాతిదూరమై నాతిసమీపమై చాముండేశ్వరీ పర్వతశ్రేణుల నానుకొని చక్కని ప్రకృతిసౌందర్యములతో నలరారు తోట, వృక్షలతాదులచే సుశోభితంబై యానందదాయకమై యుండెను. ఇట్టి ఉత్తమ స్థలమున మామూలుగా స్వామి తమ పూజానుష్ఠానాధ్యయనముల

గావించుకొనుచు నియమముతో పరమసుఖముండిరి. అపుడపుడు శ్రీ సిద్ధలింగస్వాములవారిసన్నిధికి వచ్చుచుబోవుచు పరస్పరము భగవద్విష యముల చర్చించుకొనుచుండిరి. పరమప్రీతితో గౌరవించుచుండిరి.

ఒకనాడు ఆరాజగురువులు మనశ్రీవారితో, "స్వామీ! సిద్ధాంత శిఖామణి అను గ్రంథము మీకు తెలియునా? అందలి మంగళా చర ణాత్మకమగు నీశ్లోకమును వ్యాఖ్యానము చేయండి." యని గ్రంథమున నాశ్లోకమును దీసియిచ్చిరి. అపుడు మనస్వామివారు పరమప్రీతితో గ్రంథమునందుకొని మనమున శ్రీగురుస్మరణ జేసికొని మొదట శ్లోక మును జదివిరి.

"త్రైలోక్య సంపదా లేఖ్య సముల్లేఖన భిత్తయే,
సచ్చిదానంద రూపాయ శివాయ బ్రహ్మణే నమః॥"

అనగా త్రిలోకములను సంపద్రూప చిత్రలేఖనకు భిత్తి (గోడ) వలె నాధారముగా నున్న సచ్చిదానంద స్వరూపుడు, పర బ్రహ్మస్వరూపుడు నయిన శివునకు నమస్కారము-అనియందలి తాత్ప ర్యమును జెప్పి యనంతర ముత్తమరీతి చక్కని యనుభవములతోను కేవలమద్వైతపరముగను, పంచదశి చిత్రదీపిక యందలి యుపమానో పమేయములతోను, సర్వసమన్వయముగా మృదుమధురభాషతో నిరూ పించిరి. అంతయును విన్న యారాజగురువులు పరమసంతోషముతో నిట్లనిరి. "స్వామిజీ! తమబోటివిద్యావంతులు, బుద్ధిమంతులు జన్మతః ఉత్తమమైన వీరశైవ (మాహేశ్వర) సత్కుల సంజాతులయి యుండి యును మత విశ్వాసమునువీడి శిఖాయజ్ఞోపవీతములు విసర్జించి యుం డుట మాకెంతయు నిష్టములేదు. మేము చెప్పుమాటను వినండి. మరల మీకు శాస్త్రోక్తముగా శిఖాయజ్ఞోపవీత లింగధారణముల గావించె దము. అవిమాత్రము మీకుబరువా? వీరశైవమహామతమున వాటిని విసర్జింపకయే ఆచార్యులై సన్న్యాసులై యుండలేదా? అట్లుండిన నీస్థలములో మీకన్నివిధముల గౌరవప్రతిష్ఠలు బాగుండును" అని

చెప్పిరి.

అందులకు మనపూజ్యస్వామివారు వినయముతో "పూజ్య మహాశయా! మతములన్నియు మనోభావములే, ఈ మ నో భా వ ము లన్నియు నుడిగినచోటే యందరి మహామతము. అదియే నాస్వరూపము, సర్వస్వరూపమునై యున్నది. మానవునకు తన జీవితలక్ష్య మగు నీస్థితిని బొందుటకు మత మనునది విశ్వాసపాత్రమైన ప ర మ సాధనముగా నున్నది. తాము జెప్పినవిషయము పరమపూజ్యంబే, కాని మహాత్మా! విహితమైనను యేమతమైనను సరియేకదా! ఏదోనొక దానిని నాశ్రయించి జీవన పరమలాభమగు మోక్షమును బొ ం ద వచ్చును. ఒకసారి మనఃపూర్వకముగా సన్న్యసించిన విషయమును మరల గైకొనుట ఆదర్శహీనముగదా! అదియు వారివారి సంస్కారా ధీనము. శ్రుతిసమ్మతమగు నేమంచి మతమైనను మహానీయులు జ్ఞానులు మన్నింతురు.గదా!యనివిన్నవించుకొనువాడ"నని వినయసంపన్నమగు వాక్కులతో నాటి ప్రసంగమును ముగించి సంతోషమున అచటినుండి సేవలంది తమ యేకాంతవాసమునకు వచ్చిరి. విశ్వవ్యాప్తమగు మన స్వామి మతమును (హృదయమును) వేఱొకమతముగా విభజించు వారెవరు ? అన్నిమతములు తనస్వరూపమే యనెడి నిశ్చయముగల మహానుభావులు మర్యాదలకు స్థానమాయరుగదా!

అంత మరుదినమే గు ం టూ రు శ్రీగురునాథాశ్రమమునుండి స్వామికొక యుత్తరము వచ్చెను. అదేకారణముగా నారాజగురువుల యొద్దకుపోయి, "మహానుభావా! ఇట్లు నాకుత్తరము వచ్చినది. వెళ్ళు చున్నాడ సన్నిధివారు సెలవీయవలెనని" కోరిరి. ఆగురుస్వాములువల దని నివారించిరి. అయినను స్వామి సవినయముగా మఱల వచ్చెదనని చెప్పి తమయాప్తులగు శ్రీగోవిందప్పగారి యింటికి వచ్చిరి. గుంటూరు వెళ్ళవలసిన విషయము దెలుపగా గోవిందప్పగారు బలాత్కారముగ వలదని ప్రయాణము నాపిరి. సుమారెనిమిది రోజులు వారియింటిలో

శాస్త్ర శ్రవణములు గావించిరి. ఇంతలో నంజనగూడునుండిగోవిందప్ప గారి మిత్రులొకరు శ్రీపుట్టస్వామియనువారు వచ్చిరి. వారితో మాట్లాడుచు ప్రసంగవశమున నంజనగూడులో నేదేనియేకాంత ప్రదేశమున్నదా? యని విచారింప నారు "కపిలా నదీతీరమున ఒక శివాలయమున్నది అది చాల విజనమై ప్రత్యేకముగానుండును. ఆస్థలముకూడ పవిత్రమైన క్షేత్రము" అని తెలుపగా గోవిందప్పగారు వెళ్ళిచూచి యాస్థలమున నన్నియేర్పాట్లు గావించి స్వామికిభిక్షయొసగుట మున్నగు వసతులను గావింప వలసినదిగా శ్రీపుట్టస్వామిగారికి చెప్పి నియమించి వచ్చి పూజ్యస్వామి వారితో ఈవిషయములన్నియు తెలియజేసి గుంటూరు ప్రయాణమునాపి నంజనగూడు శివక్షేత్రమందే శ్రీచాతుర్మాస్యము జరుప నిర్ధరించిరి.

## కపిలాతీరము-నంజుండేశ్వర క్షేత్రము

### 3.వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము - 1947 సం॥

ఇంతలో వ్రతారంభదినములు సమీపించెను. స్వామికపిలానదీ తీరమునగల నంజనగూడు పట్టణమందలి శివాలయమునకు విచ్చేసిరి. ఇయ్యది విజనప్రదేశమైన యొక పురాతనదేవాలయము ప్రక్కనే కపిలానదీ ప్రవాహము. ఇట్టి నదీతీరస్థమగు నేకాంతప్రదేశమును గని పరమానందభరితులై, తమ పరమేష్ఠిగురువు పాడుదేవాలయమున వసించుచు బ్రహ్మానుభూతినందిన సమాధిపరులగు దేశికులని చరిత్ర వినియుండిరి. కాని నద్దానిని స్మరించి తానును నేడాయాపమున నీశిథిలమగు శివాలయమునందు నేనును పరదేశినై వసించెదనుగాక యని సద్భావనాభావితులై శుభసంకల్పముతో, వ్రతమారంభించి బ్రహ్మనిష్ఠతోను, గ్రంథవ్యాసంగముతోను, అవసరమైన ప్రసంగమున నియమితకాలములో మితముగ మాటలాడుచు బ్రహ్మానందముగ సువిశాలంబగు శ్రీశివాలయంబున వ్రతదీక్షాపరులై పరమ సుఖంబుండిరి.

ఈ సమయమున స్వామియొద్దకు గొందరు యోగ్యులగు పెద్ద మనుష్యులు, మధ్యములు, సామాన్యులుకూడ వచ్చి తమకు గలిగెడి సందేహములను ప్రశ్నలమూలముగా నివారించుకొనుచుండిరి. ఆ ఉత్తర ప్రత్యుత్తరములు శ్రీవారి దినచర్య (డైరి) నుండి ఇచ్చట పొందు పఱచు చున్నాను. ఒకనాడు కొందరు పెద్దమనుష్యులు వచ్చి భక్తి యుతముగ జిజ్ఞాసతో నిట్లడిగిరి !

ప్ర. స్వామీ ! అద్వైత మతస్థులు సర్వము మిథ్యయందురే ! అట్ల యిన ప్రమాణములగు శ్రుతులుకూడ వారికి మిథ్యయేనా ? అట్లు శ్రుతులే మిథ్యయైనచో నద్వైతమునకు ప్రమాణమే లేక పోయెను గదా ! కాన నద్వైతమతము ప్రమాణరహితమా ఏమి ? దయతో తెలుప ప్రార్థన.

ఉ. ఔను అద్వైత మతమున సర్వమును మిథ్యయే అనిన అర్థమేమి. సర్వప్రమాణములకు ప్రమాణమగు అద్వైతజ్ఞానమునకు మరొక ప్రమాణము అవసరములేదు. అది స్వయంప్రమాణమే.

ప్ర. స్వామీ ! ఈ యర్థమును మరింత విశాలముగా వివరింప గోరు చున్నాము.

ఉ. ప్రశాంతముగా పూజ్యశ్రీ స్వామివారు "అయ్యలారా! ఈవిష యమును మరికొంత వివరముగా సమన్వయించవలెనన్నచో : సత్యము తెలియనంతవఱకు భేదము నిలిచియే యుండును. అపుడు శ్రుతులు ప్రమాణము లనియే చెప్పబడును. కానిపరమార్థసత్యమగు నద్వైతా నుభవమున ప్రమాణము ప్రవర్తింపజాలదు. ఆవరణభంగ మొనర్చు పర్యంతమే ప్రమాణములకు ప్రామాణ్యము చెల్లును. "యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ (తై.ఉ)"అని శ్రుతియే ఆచోటున తన ప్రామాణ్యమును వదలెను. ఆవల నేను వెళ్ళజాలనని ఆగెను. మూకీభావమునొందెను ! వస్త్వనుభవ సమకాలమున ప్రమాణము లతో పని లేదు. వడ్డనయగువఱకే పంక్తియందు ప్రక్కచూపులు మరి

మాటలు, కోటలు, భోజనకాలమున నవియుండవు. మరియు నద్వైత మనునది యీ వ్యావహారికదృష్టిచే నిర్ణయింపబడు సత్యమిథ్యల కోటి లో జేరినదిగాదు. సత్యమిథ్యలను నీ విమర్శ యేచోటునుండి బయలు దేరునో యాపరమగు స్థానమే అద్వైతము. అచ్చటేమియును లేదు. ఉన్నదొకటే యఖండ వస్తువు. స్వసంవేద్యము. "నేహ నానాస్తి కించన," "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" "ననిరోధో నచోత్పత్తిర్నబద్ధో నచసాధకః న ముముక్షుర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా" అను నీ మొదలగు శ్రుతివాక్యములను విమర్శించుచు విపులముగ బోధించిరి. అంత నా యజమానులు మహదానందముతో సాష్టాంగ ప్రణామము లాచరించి వెళ్ళిరి. మరొకరోజు వేరొక పెద్దమనిషి శ్రీ స్వామివారికి అపుడపుడు పండ్లు తెచ్చి సమర్పించుచుండిరి. ఇతడును నొక ఏదో సంస్థకు యజమానియై యుండనోపు. వీరు స్వామి నిట్లడిగిరి.

ప్ర. బుద్ధీ! మీ రెందుకీ సన్న్యాసమును స్వీకరించి లోకులందరికంటె వేరుగ నిట్లున్నారు? మిమ్ముజూచిన చాల సంతోషమగుచున్నది. మీ యాచార విచారములంటే అపురూపము. చాలబాగున్నది నే నొక మాటచెప్పెద వినండి. మాకును మఠమొకటి యున్నది. దానికి మంచి యాస్తిపాస్తులున్నవి. ఆగ్రామమిచటికి దగ్గరనేయున్నది. మిమ్మచటికి పిలుచుకొనిపోయి మీకు గాయత్రి యజ్ఞోపవీతము వేసి మీకే పట్టము కట్టి సర్వముసమర్పించి మఠానికి స్వామిగా యజమానిగా చేయుదుము. కాన దయతో మా మఠానికి దయచేయండి. తమబోటి సదాచార సంపన్నులగు శీలవంతులు దొరకుట దుర్లభము, అని పలికెరి.

ఉ. (స్వామి నవ్వుచు) పెద్దయ్యా! మీ మఠానికి వచ్చి గాయత్రి వేసుకొని యజమానియైయుంటే కలిగే గొప్పతన మేమి? ఇంతకంటె ఏదైనా పెద్దమోక్షమువచ్చునా?

ప్ర. ఆ! రాకేమి? మావారంతా మిమ్ము పెద్దగా చూచెదరు. గౌరవించెదరు. మీకు కావలసిన సౌకర్యములు చేయుదురు. మీమాటలు

జవదాటక విందురు.

స్వామి : అంతేనయ్యా ఆధిక్యం ఇకచాలు. ఈ అశాశ్వతమగు గౌరవములు, ఆధిపత్యములు మాకవసరములేదు అవి యానాడే విడనాడితిమి, వాటిని గుఱించిన ప్రసంగము లవసరములేదు. మానవజీవిత ధ్యేయమదిగాదు, అందులకై మానవుడు పుట్టలేదు. ఈ యనాత్మ విషయవాసనలచే గలిగిన యాశాపాశములతో మీజీవితము నెందుల కిట్లు బంధించుకొందురు? శాంతముగా భగవన్నిష్ఠచే భవ్యమగు చిర సుఖమును పొందగోరుడు. మహారాజు సుఖము మొదలు హిరణ్యాగర్భుని వరకుండు సమస్తసుఖములు మాముంగిట మేము పొందు సుఖమున శతతమాంశములు గావు నాయనా! సుఖమన్న ఆత్మనే బాబూ! సుఖభ్రాంతిని వీడి నిజాత్మ నిష్ఠనుండుము. మంచిది." అను నిత్యాదిగా బుద్ధివాదమును గఱపిరి. ఈ మాటలు విన్న యా పెద్ద మనిషి ఆ సమాధానముతో ఆహా వీరెంతటివారు, వారెంతటివారు అని యేమేమో గొణుగుకొనుచు వెడలిపోయెను. నాటినుండి పండ్లను తెచ్చి సమర్పించు భక్తియు నిలచిపోయెను.

ఈయన విషయముననే మనశ్రీవారు సోదరశిష్యులతో చెప్పచు నవ్వుచుండెడివారు. ఏమన "అయ్యా! నీవు పండ్లనెందులకు దెచ్చెదవు? దినదినము నీకిది యొక కర్చుగాదా?" యని స్వామివారడుగగా ఆయన కన్నడమున,

స్వామీ! నీరుకోళి నీరినల్లి ముళుగిబిట్టరె, తనగెస్నాన ఆయితు; తిన్నోదక్కె మీను సిక్కితు. హాగె తమగె హణ్ణు కొట్టరె నమగె పాపహోయితు; నిమ్మదు పుణ్యాబంతు. స్వామీ! ఇదు ఒళ్ళేదు" అనుచుండెడి వారట. అనగా తెలుగులో

స్వామీ! నీటికోడి నీటిలో మునిగితే తనకు స్నానమాయె; తినుటకు చేపయు చిక్కె. అటువలెనే తనుకు పండ్లు ఇచ్చిన మా పాపము పోయె; మీ పుణ్యము మాకు వచ్చె. — అని

మరొకరోజు యస్. చంద్రశేఖరయ్యా అను వివేకులొకరు వచ్చి భక్తివిశ్వాసములతో నిట్లు కొన్ని విషయము లడిగిరి. వీరు స్థలీయులగు యోగ్య గృహస్థులు.

ప్ర. పూజ్యస్వామీ! ఆత్మచిదాకాశ స్వరూపమందురే ! అది అనుభవమున నెట్లు దర్శింపనగును ? (అనగా తదనుభవమెట్లు)

ఉ. నాయనా! వృత్తికిని వృత్తికిని మధ్యనుండు అనుభవము చిదాకాశము. మరియు "దేశదేశాంతర ప్రాప్తౌ సంవిదో మధ్యమేవయత్ ! నిమేషేణ చిదాకాశం తద్విద్ధి వరవర్ణిని !"- పూర్వవృత్తేర్విలయః, ఉత్తరవృత్తే రనుదయః - ఈ మధ్యకాలం "అవలంబ్య నిరాలంబం। మధ్యే మధ్యే స్థిరో భవ" యన్నట్లు ఉభయ కల్పనలు లేని సమాహిత స్థితియే చిదాకాశానుభవము. స్థూలమైన దృశ్యమగు సమస్త పదార్థములు ఉండునది భూతాకాశము. సమస్త పదార్థములకు సంబంధించిన భావనలకు స్థానమిచ్చునది చిత్తాకాశము.

ప్ర. గురువర్యా! జ్ఞాన కర్మోపాసనల సంగ్రహార్థమేమి ?

ఉ. వస్తు యాథార్థ్యమును దెలుపునది (బోధించునది) జ్ఞానము; భావనను కలిగించునది ఉపాసన ; కర్తృత్వమును కలిగించునది కర్మ.

ప్ర. మహాస్వామీ ! ఎట్లుండినచో నాకు జ్ఞానదార్ఢ్యమగును ?

ఉ. ద్రవ్యమునుండి ధర్మమును కుశలమంత్రినుండి రాజ్యమును. పతివ్రతయగు గృహిణినుండి గృహమును ఎట్లు చక్కబడునో అటువలె విడువని సాధనానుష్ఠానములతో సంతత వాక్యార్థశ్రవణ మననాదులు జేయుచుండినచో నీకు జ్ఞానదార్ఢ్యమలవడును.

ప్ర. పూజ్యా ! అనుష్ఠాన మనగా నేమి ?

ఉ. మనస్సును వృత్తిరూప మొందింపక అటు ఇటు పోనివ్వక ఒకే చోటు నందుంచుట అనుష్ఠాన మనబడును.

ప్ర. పూజ్యచరణా ! తమ యీ కార్యములకు సహాయమై చూచు

కొనువారెవరు ?

ఉ. సుహృదాత్మా! తల్లి లేనిపిల్లలను అన్యులేవిధముగా జూతురో, అట్లే కర్తృత్వములేని మహాత్ముల, భక్తుల కార్యమును సచ్చిదానంద మూర్తి యగు ఈశ్వరుడే చూచుకొనును. వాడు సర్వాంతర్యామి సర్వాధిష్ఠాన నిత్యపూర్ణుడు. అదియే మేముకావున ఆమూలమున మా కే కొఱతయును లేదు. అర్థాత్ కొందరుత్తమ గురుభక్తులీ గురు కార్యములను చూచుకొనుచున్నారప్పా! ఓం.

ఇట్టి సత్యవాక్యమును విన్న యాసభ్యులు వినమ్రభావమున, "స్వామీ! తమకేమి కావలసినను చెప్పి పంపండి. నే తప్పక తమసేవ యొనర్చెద" నని చెప్పి నమస్కరించిరి.

మరొకనాడు లౌకికులొకరు వచ్చి స్వామి నిట్లు అడిగిరి. "స్వామీ! నిగ్రహమంటే ఏమి? మీరేమి నిగ్రహించినారు ? అన్నము నీళ్ళు విడిచినారా !" అని ప్రశ్నింప దానికి స్వామి మౌనముద్రతో జవాబిచ్చిరి. అనగా మారు మాటాడక యూరకుండిరి. ఆయన కొంత సేపుచూచి అదే సమాధానముగా దలంచి వెడలిపోయెను.

ఈస్థానమున కొందరు యువకులు కొంటెచేష్టలతో నల్లరిచేయు చుండిరి. స్వామినిష్ఠకు భంగము కలిగించుచుండిరి. ఒకనాడు స్వామి మీద రాళ్ళురువ్వుటకై యొకడు ఆదేవాలయ ప్రాకారపు పెద్దగోడ నెక్కి మరొకనిని లాగుకొను సమయమున నిద్దఱు జారి క్రిందపడిరి. పెద్దదెబ్బలు తగిలినవి. కడకు వారు తమతప్పులను గుర్తించి స్వామి యెడ తామొనర్చిన యపరాధమునకు ప్రాయశ్చిత్తమని తలంచి స్వామికి శరణాగతులై చివరకు వారు శ్రీవారి బంటులైరి. నాటినుండి వారు శ్రీవారికి వలసిన వస్తువులు తెచ్చియిచ్చుచుండిరి. భగవదా యత్తచిత్తులకు గలిగెడి ప్రతిబంధములను భగవంతుడు చిరకాలమున బాపునుగదా!

ఒకరోజు ప్రసంగము జరుగుచుండగా కొందఱు భక్తులు గుమి

గూడి ఇట్లు ప్రశ్నించిరి.

ప్ర. స్వామీ! ఈజగత్తులో నెట్లుండినను కష్టమే యున్నదిగదా ! నే నెట్లు జీవించవలె ? నాకు చాలయిబ్బందు లున్నవి స్వామీ !

ఉ. అయ్యా! ఇట్టి కల్పనల మనసున తెచ్చుకొనక మీ గురువులు చెప్పిన నిష్ఠను తద్విషయకమగు విచారములను మనసున సంస్మరించు కొనుచు నెమ్మదిగ నుండుము నిజముగ ఇబ్బందులు లేవే! లేనిపోని కలతల బెట్టుకొని బుద్ధిని పాడుచేసికొన్నచో అశాంతియగు అగ్ని బయలుదేరును. కాని మనస్సును స్వాధీనమున నుంచుకొని గురుచర ణాంకితము చేయుము. మొన్ననే ఆవిషయమును చెప్పితిమిగదా! శాంతము వహింపుము. అన్నియు చక్కబడును.

ప్ర. స్వామీ! మనస్సు నావిధముగా వశపఱచుకొనుటకు శక్తి చాల కున్నదే! ఏమి చేయవలెను ?

ఉ. విశేషముగా సత్పురుషుల సాంగత్యమున వర్తించుచు మరిమరి నన్నే శరణుబొందుచు నాయందుంచిన మానసేంద్రియములు గల వాడవై అనగా బ్రహ్మమయ దైవమయ భావనలుగలిగి యుండిన మనస్సుయొక్క దాడి ఉపశాంతి యగును. ఆత్మచింతన యుండిన మనస్సు చచ్చును.

ప్ర. అట్లు విరామముగ వచ్చి తత్వమును వినుటకు నాకు దీరికలేదు స్వామీ !

ఉ. అట్లయినచో ఆయష్ట కష్టములను బాధలనుగురించి నీలోని భగ వంతునితో మొరబెట్టుకొని యేడ్చుచుండుము. ఇతరులతో నెప్పుడును వాటిని చెప్పకొనవద్దు. అప్పుడు నీహృదయేశుడు దయదలచి నీకు సమాధానమిచ్చును. క్రమముగా శాంతి లభించును—గురుడు గురు వాక్యముతప్ప విపత్కాలమున ఆశ్రయము వేరులేదు అని నచ్చ జెప్పిరి.

ప్ర. (మరొకరు) ఈబ్రహ్మవిద్య (వేదాంతము) ఈచిన్న వయస్సు

నుండియే నేర్చుకొనవలసిన యావశ్యకతయేమి? పెద్దవయస్సైనపిదప నేర్చుకొన్నచో రాదాస్వామీ?

ఉ. పెద్దవయస్సు వచ్చువఱకు బ్రదుకుదునని నీకు నమ్మకమేమి? నాయనా! ముందేమగునో తెలియదు. "నహి ప్రమాణం జంతూనా ముత్తర క్షణ జీవనే" "ఆయుః పరిస్రవతి భిన్నఘటాదివాంభః" అన్నట్లు ఉత్తరక్షణము జీవించి యుండు ననుటకు ప్రమాణమే లేదు. రంధ్ర ముండిన కుండ యందలి నీరు క్రమముగా గారిపోవునట్లు క్షణక్షణము ఆయుస్సు క్షీణించుచున్నది ముందుగతులు తెలియవు. కాన అన్నివిధ ములచే బాగున్నపుడే బాల్యముననే బ్రహ్మవిద్య పట్టుపడవలెను. బాల్యమునందలవడిన విద్యయే విద్య, సర్వేంద్రియ బలము లుడిగిన పిదప బ్రహ్మవిద్య బాగుగా పట్టునడదు. అనుభవము కలుగుటకష్టము. ప్రాతగుడ్డకు రంగుబాగుగా అంటదుకదా!

ప్ర. అయితే గీతలో "స్థిత్వాస్యామంతకాలేపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి" (గీత 2-72) అని భగవంతుడు చెప్పినాడు గద స్వామీ!

ఉ. అచ్చట చెప్పినది నీఅభిప్రాయానుసారముగాదు. స్థితప్రజ్ఞుడగు జ్ఞానియొక్క మహిమను వర్ణించుచు నీస్థితి యంత్యకాలమున నైనను బడసి ముక్తులుకావచ్చును. ఇక ఆరంభము నుండియు సంతతము అట్టి సంస్కారముచే నుండు నాతనికి యంతిమ స్మృతి తప్పక గలుగును గాని యెప్పుడో తీరిక గలిగి మరల విషయభోగము లుపభోగించుట కసమర్థులై పనికిరాని బుద్ధీంద్రియములతో విగతవయస్కులై ముసలి తనమున ఈబ్రహ్మ తత్త్వమును తెలియగోరిన,నది తెలియబడదు. సంతతాభ్యాస వశమున నిది లభించును. "నాయమాత్మా బలహీనేన లభ్యః" అని ఉపనిషత్తు పలుకుచున్నది. ఈ యాత్మ బలహీనునకు ఇంద్రియవిషయలాలసునకు లభించదు. దురవగాహమని తాత్పర్యము.

ప్ర. (ధనికులొకరు) స్వామీ! పుత్త్రులు లేని వారికి గతులు లేవని చెప్పెదరే! దీని యర్థమేమి?

ఉ. అయ్యా! గతులు లేకేమి ? అనేక బ్రహ్మాచారులు సన్యాసులు వీరి కే పుత్రులు కలరు ? ఎందరో గృహస్థులు కూడ పుత్రులు లేక పోయినను వారు పరమగతి యనబడుముక్తి నొందునట్లు వినబడు చున్నది. ఇందలి ముఖ్యార్థము తత్త్వజ్ఞానోదయమే సుపుత్త్రిసంతా నము. "అపుత్రస్యగతిర్నాస్తి" యను మాట గౌణము. దాని తాత్ప ర్యమేమనగా స్వార్థమును విడిపించుచు అంమ విరక్తిని బుట్టించు నుపా యమున మోక్షార్థమయ్యె పుత్త్రిలు గావలెనని చెప్పినదే గాని కేవల మాంసమయ పుత్రుని పొందినమాత్రమున ముక్తి గలుగునని యెన్న టికి నమ్మనలదు. విషయాసక్తి మూలమున తత్త్వజ్ఞానమును పొందు లే పుత్రుల (సంతానము) నపేక్షించుట యనుదాని కర్థము.

ఈస్థానమున నిట్లు పెక్కండ్రు మంచివారు, పండితులు,సామా న్యులు మున్నగు భక్తులెందరో వచ్చిపోవుచు స్వామి కన్నివిధముల తోడైయుండి పెక్కు విషయములను శ్రీముఖము నుండి వినగలిగిరి. సర్వవిధముల శివ శంకరమై యొప్పుచు ఆప్రాంతముల వివిధాచార సంస్కారయుతులం గాంచుచు మేరదప్పక తమ యనుష్ఠానాధ్యయనాది కార్యముల సక్రమముగా నాచరించుకొనుచు పరమతృప్తిగానాయేటి చాతుర్మాస్య మహావ్రతమును ఆ నదీతీరస్థమగు జీర్ణ శివక్షేత్రమున జయప్రదముగా జరిపి కార్యమును సాంగముంగళ మొనర్చిరి. "దేశం చూడాలి, కోశంచదువాలి" అనుసామెతను చక్కగా ఈ స్థానమున స్వామి కార్యముచే గనిరి.

పిదప నంజనగూడు భక్తాదులకు ధన్యవాద శుభాశీస్సు లొసంగి యటనుండి బయలుదేరి మైసూరు గోవిందప్పగారి గృహమునకువచ్చిరి. వారి యాతిథ్యమును స్వీకరించిరి. "శివంభూయాత్" అని శుభాశీ స్సులు పల్కి వారి కృతజ్ఞత ననుస్మరించుచు నచ్చటి సుప్రసిద్ధ గీతా ప్రచారిణీసభా సంచాలకులునుపండితులును మహనీయులునగుపూజ్య పాద శ్రీశ్రీశ్రీ శంకరానందభారతీ స్వాములవారిని దర్శించివారి

యాశ్రమమున నే కతిపయ దినంబులు వసించుచు సనాతన సదాచార పరులగు నాపండితవర్యుల బోధలందుకొని యటనుండి నంద్యాల భక్తుల ప్రార్థనానుసారము శ్రీత్యాగరాజస్వామి యారాధనకువచ్చిరి. నంద్యాల బట్టణమునకు శ్రీవారు వేంచేసిరి.

## శ్రీశైల సందర్శనము

నంద్యాల త్యాగరాజు కుటీరమునందలి యారాధన జరిగిన పిమ్మట కొంతకాలమిట నైష్కర్మ్యసిద్ధి గ్రంథప్రవచనములు గావించిరి. పిదప శ్రీనెరవాటి బాలసుబ్బయ్యశ్రేష్ఠిగారి యుత్తమ ప్రేరణానుసారమువారి సహాయమున తమయిష్టదైవంబగు శ్రీశైలమల్లికార్జున మహాలింగమును దర్శింప శ్రీశైలపర్వతము నెక్కి స్వామిని దర్శించి శ్రీరుద్ర పురుషసూక్తంబులచే మనసార పూజించి,

"శార్దూలాజినచేల పూర్ణకరుణాఽఽశ్రిత్యాతిభక్త్యా మహత్
స్థానం త్వాం బసవాదయో యయురియాఅక్కాఖ్యదేవీపరం।
ఆచార్య త్వ మవాప శంకరయతి ర్జిత్వా ఖిదావాదినో
భావ త్కం కిము పేక్షసే ముకగిరిం శ్రీగిర్యగారేశ్వర॥"

అని భక్తిభావమున నైమఱచి స్వామిని ముక్తకంఠముచే వివిధభంగుల నుతించి ధ్యానించి ధన్యులైరి. మరియు సూర్యసింహాసనాధీశ్వరులగు శ్రీశైలగంట శ్రీశ్రీశ్రీజగద్గురునాగీశపండితారాధ్య శివాచార్య స్వాముల వారిని సందర్శించి విద్యానిధులగు నమ్మహా సన్నిధిప్రేమకు పాత్రులై వారియుపదేశములంది యాశీర్వాదమునుబడసి బయలుదేరి నంద్యాలలో శ్రీబాలసుబ్బయ్యశ్రేష్ఠి మున్నగువారికితీర్థప్రసాదంబు లొసంగిరి. శ్రీశైలమల్లికార్జున మహాక్షేత్రమును గురించిన మాహాత్మ్యమును అందరికి శ్రుతపఱచిరి.

## శ్రీశివలింగాశ్రమము

## శంకర జయంతీ మహోత్సవము

ఇచ్చటి భక్తులందరును పరమభక్తితో శ్రీస్వామివారినుండి యాత్రా విశేషములన్నియును విని సంతసిల్లిరి. శ్రీవారు తమపద్ధతి ననుసరించి శాస్త్రప్రవచనాది కార్యములను జరుపుచుండిరి. ఆపిదప కొన్ని దినములకు చింతలాంపల్లె పి. నరసింహప్ప.చిన్నకదిరెమ్మ అను పుణ్యదంపతులకు శ్రీ శంకరానుగ్రహమున పుత్రుడుదయించెనను సంతసమున వారు మన శ్రీవారిసన్నిధికివచ్చి, "స్వామీ! తమ యను గ్రహమున మగశిశువు గలిగెను. ఈవత్సరము తామిచటనే యుండి శ్రీశంకరజయంతి మహోత్సవమును జరుపవలె"నని కోరుచు అయిదు వందల (500) రూపాయలను శ్రీపాదములకడ సమర్పించి నమస్క రించిరి.

ఇదిచూచి మనస్వామి యాదంపతుల సద్భావమునకు సంత సించి మంచిదని యీవిషయమును తమపూజ్యగురువులతో నివేదించు కొనగా "మంచిది అట్లేయగుగాక" యని గురువులంగీకరించి తాము ముందుగనే యాశ్రమమునకు విచ్చేసిరి. అన్ని వ్యవస్థలు సక్రమముగా వ్యవస్థాబద్ధమై యేర్పాటులు గావింపబడెను.ఈందనగుర్తి యావద్భక్త మండలివారు సర్వప్రకారములచే తనుమనధనములచే సహకరించిరి. సకాలమునకు రావలసినవారందరు వచ్చిచేరిరి. పూజ్యులగు గుడివాడ శ్రీప్రణవానందస్వాములు మున్నగు పెద్దలందరు విచ్చేసిరి. నంద్యాల, గుంతకల్లు, ఉరవకొండ, రాగులపాడు మున్నగు ప్రాంతముల నుం డియు మరియు ఆపరిసర ప్రాంతముల భక్తులు ముముక్షువులు మొద లగు వారందరు గలసిరి. శ్రీశంకరజయంతి మహాకార్యక్రమము సంభ్ర మమున శ్రీసర్వధారినామసంవత్సరం వైశాఖ శుద్ధపాడ్యమి ఆది వారం (తే 9.5.1948) మొదలు (13.5.1948) గురువారం వఱకు సర్వజనానందకరమై విధ్యుక్తముగా శ్రీఆచార్యస్వామిపూజ,ఉపనిష

ద్గీతా పారాయణములు, శ్రీశంకరవిజయ పురాణశ్రవణము మరియు వచ్చిన మహాత్ములచే రెండుపూటల ఆధ్యాత్మిక మహోపన్యాసములు 5 దినములుజరిగి ఇమ్మహాకార్యక్రమము సాంగమంగళప్రదమైనసమాప్త మయ్యెను.

## మంగళము

జయతు మంగళ శ్రీజగద్గురు శంకరాచార్యప్రభో!
జయతుజయ షణ్మతోద్ధారక భయవిదూరమహాప్రభో ॥౧॥
బేడె భిక్షెయ నెల్లికాయియ నీడలవళ దరిద్రమం।
దూడి హేమామలక వర్షవ నాడె సురిసిది హేప్రభో ॥౨॥
బాల్యదోళ్ సంన్యాసవనుకై కొళ్ళుతాగమ వేదదోళ్!
ఉళ్ళ ప్రౌఢార్థగళందు నిజ మెల్ల లోకక్కరుహిదెయ్ ॥౩॥
శ్రుతి విరుద్ధ మెనిప్పనాస్తిక మతవదు స్తర్కంగళ।
అతిగళెదు బ్రహ్మాత్మ సంస్థితి । క్షితియొళెల్లర్గుసిరిదెయ్ ॥౪॥
సుకర వేదాంతాబ్ధిగతమా । దఖిలజ్ఞాన సురత్నవ।
నకుటిలర్గొలిదిత్తు సంసృతి । వికళతెయ పరిహరిసిదెయ్ ॥౫॥
మతియశుద్ధిగె కర్మ; నిశ్చల । స్థితిగె ధ్యాన; పవర్గకె।
శ్రుతివిదితసుజ్ఞాన; వెందతి । హితదెసారిదెలోకదోళ్ ॥౬॥
మూరుసల భరతావనియసం । చారగెయ్దద్వైతవ।
సారివేదాంతార్థనిశ్చయ । భేరిబారిసిది శెయొళు ॥౭॥
అర్ధశ్లోకదె బ్రహ్మవిద్యయ । శుద్ధమతిగళిగుసిరిదెయ్!
మధ్యమందర్గఖిలగ్రంథగ । ళాద్యుపకృతియ నెసగిదెయ్. ॥౮॥
కర్మధర్మద రూపదెంబువ । కర్మిమండనమిశ్రగె
కర్మసంన్యాసత్వదిం నై। ష్కర్మ్యసిద్ధియనిత్తెయె ॥౯॥
సూత్రమొదలాగిర్ప ప్రస్థా । నత్రయప్రామాణ్యదిం!
ధాత్రియొళగద్వైతమతవను । చిత్రపిరువె జగద్గురో। ॥౧౦॥
దిట్టతరనాల్కాశ్రమగళను । కట్టినార్దెర దిక్కనోళ్,
శ్రేష్ఠసంన్యాస గళిగల్లియె । పట్టికట్టిదె హేప్రభో। ॥౧౧॥
విన్నచరితెయనోది తిళియువ । మాన్యనవనేధన్యను।
విన్నచరణాబ్జవనునంబిరు । వెన్నరక్షిసు శంకరా। ॥౧౨॥

## 4.వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1948 సం॥

శ్రీవారు ఈసంవత్సరము ఇచ్చటనే శ్రీచాతుర్మాస్య వ్రతమును సలుపుచు గీతాభాష్య శ్రవణమును గావించి యందరిని పరమ తృప్తి నొందించిరి. వ్రతము యథారీతి శివప్రదమై పూర్ణమాయెను. అంత నొకనాడు భక్తులొకరిట్లు స్వామిని ప్రశ్నించిరి :

ప్ర. స్వామీ! మంత్రమును సర్వకాలములయందును జపించుచుండు మని మీరు చెప్పుచుందురే ! అట్లయిన దానికి స్నానశౌచాది నియమము లవసరము లేదా ?

ఉ. ఆ నియమము లుండుట విధ్యుక్తము. అత్యవసరముకాని అనివార్యమై లేకుండినంత మాత్రమున దోషమేమియును లేదు. నిష్కామమగు నిష్ఠకు సత్యమగు ఫలము తప్పదు. మంత్రమునకు మైలలేదు. "నాస్య విధిరితి సర్వదా శుచిరశుచిర్వాపఠన్ బ్రహ్మణః సలోకతాం సమీపతాం సరూపతాం సాయుజ్యతామేతి" అన్నట్లు భగవన్నామమును సదాజపించుట కాకట్టుబాట్లేమియు లేవు. సంతతము జపించుచుండిన ఈప్రశ్నయే పుట్టదు. ఏతన్మహిమ స్వసం వేద్యమగును. ఆ ఘనతను గన్నవానికికశ్మలమగపడదు నీనాలుక నీయందేయుండుచుఎంతయు మ్మిచే యుక్తమై యుండినను అయ్యది అశుచిగానేరదు. ఆఉమ్మిచే వెలువడిన యాచోటు అశుచియగును. అటువలె భగవన్నామమును నీ వాక్కు నందిడుకొని నెమరువేయుచుండిన నది యెన్నటికిని నెంగిలిగాదు. అశుచిగాదు. ఆనామమును విడచి నీవు వర్తించినచో నశుచి వగుదువు. భగవన్నామము నిత్యశుద్ధము. సదా జపించుచుండినచో నీవత్యంత శుచిర్భూతుడవగుదువు. ఆభాగ్య మబ్బిన ఇంకేమి కావలెనని తెలిపిరి.

పిమ్మట నంద్యాల భక్తుల ప్రార్థనానుసారము శ్రీవారు నంద్యాలకు వచ్చి శ్రీపగిడి శాయమ్మగారి మేడయందు గొన్నిదిన

ములు నైష్కర్మ్యసిద్ధి మహాగ్రంథ ప్రసంగమును నడపిరి. అంత నొక నాడు స్వామితో నుత్తమ భక్తులొకరిట్లు ప్రశ్నించిరి.

ప్ర. "శివోహం" -అనుట సిద్ధలక్షణమేనా స్వామీ ?

ఉ సిద్ధుడు శివోహం.అనిగాని రామోహం అనిగాని యనడు. సర్వాహమ్మలు తానేయై యుండగ విడిగ నింకే యహము నే మ ను ను. సర్వము తానే కావున నేమియు ననడు. మూగవాని నోటిలో మిఠాయిబెట్టి రుచి నడిగినట్లు మౌనఘనానందాబ్ధియతడుండును, ఇది హృదయవిద్య. శివోహంబను దివ్య సంభావన ముఖ్యముగా ముముక్షు జన సంసేవ్యమే కాని "అహం బ్రహ్మేతి సంభావ్యాహంభావం పరిత్యజ ... ..."

ప్ర. స్వామీ ! ముక్తికి మంచి మార్గమెద్ది ?

ఉ. తత్వజ్ఞానమే, ఇక దానిని వివరించవలె నన్నచో నిర్మమత్వమే నిరహంకారమే ముక్తికి మార్గము. అహం మమాభిమానములే బంధములు.

## శ్రీరమణమహర్షి దర్శనము

పిదప నంద్యాలనుండి స్వామివారు శ్రీతిరుపతిక్షేత్రము వెళ్ళి అచటినుండి అరుణాచల భగవాన్ శ్రీరమణఋషిని దర్శించి ప్రశాంత వాతావరణమగు నాయాశ్రమమున మూడురోజులుండి మఱలి వచ్చు దినము హృదయముప్పొంగ, జిజ్ఞాసతో స్వామి భగవానుల నిట్లడిగిరి- "భగవాన్! నేనుసదాఆత్మతృప్తి ఆత్మరతి యనదగు బ్రహ్మనిష్ఠయందే యుండవలెనను తీవ్రేచ్ఛచే ప్రయత్నించినను మఱల వృత్తియంతరాయమును పొందుచున్నదే ! ఇందులకేమి చేయవలె, అనుగ్రహింప వేడుచున్నాడ" నని హృదయవేదనతో నడిగిరి.కరుణానిధియగు రమణ భగవాను డనుగ్రహదృష్టితో మనస్వామివారిని వీక్షించుచు "ఆ! అట్టి స్థితిని పొందగోరు చున్నావా? ఇది యంతరాయమని నీయంతరాత్మకు దెలియుచున్నదిగదా! అదేవృత్తిని పదేపదే ఆవృత్తి చేయుచుండి

నచో అంతరాయము లణగిపోవును. అపుడే "ఆత్మన్యే వాత్మనాతుష్టః" అనుస్థితి గలుగును. అనిచెప్పి మౌనమును వహించిరి. "ఔను గాదనక యూరకుండె నత్తెఱంగు గని సంతసిల్లి రారమణులెల్ల" యను సాహితికారుని వాక్యమును మనమున దలంచి మహాతృప్తితో నిట్టి స్థితియే నీవని చివఱకు మౌనముద్వారా భగవానులు దెలిపిరని యానందించుచుతన్నిష్ఠావంతులై సాష్టాంగ వందనము లాచరించి యచటినుండి నంద్యాల వచ్చి చేరిరి.

ఇచ్చట శ్రీ త్యాగరాజస్వామి యారాధన యింకను 5-6 దినము లుండెను. ఇంతలో నొకనాడు మనస్వామి తమ కుటీరమునందు శుభమైన భావము నొకటి గనిరి. "తాము శ్రీ కాశీక్షేత్రమునకు వెళ్ళినట్లును, పావనగంగయందు స్నానమాచరించి నిష్ఠలో గూర్చుండి నట్లును అచ్చట నున్నత పాఠశాలలయందు బ్రహ్మసూత్రభాష్యము శ్రవణము చేయుచున్నట్లును, సంస్కృతభాష నభివృద్ధిజేసికొనుచున్నట్లును" గ్గాంచిరి. ఇదేకారణమున స్వామికి మరల కాశికి వెళ్ళవలెనను సంకల్పము గలిగెను. మరియు నొక సంవత్సరకాల మచటనే యుండి శ్రీ చాతుర్మాస్య మహావ్రతమునుకూడా నచటనే జరుపవలయునను తీవ్రేచ్ఛ పొడమెను. కాని ఈవిషయమును వెలిబుచ్చినచో ప్రయాణము నాటంకపఱచు వారడుగడుగునను కలరుగాన గుప్తముగా నుండి ప్రయాణ సన్నాహముల సిద్ధపఱచుకొనిరి.

గురుభక్తులగు శ్రీఅయ్యపుశెట్టి పుల్లయ్య అనువారికి మాత్ర మీవిషయమును తెలియబఱచిరి. విన్నవెంటనే యాభక్తులు పరమ సంతోషముతో శ్రీవారి ప్రయాణ కర్చులకై నలుబది రూపాయలను తెచ్చి యప్పుడే వినమ్రభావమున భక్తితో సమర్పించిరి. స్వామివారి ఉన్నతోద్యమమునకు తోడై గుప్తముగా నుండిరి. ఈసమయమున నిండుప్రేమతో గుప్తదాన మొసంగిన యాతనిదాతృత్వమెంత మంచిదో గదా! మరల కాశికి వెళ్ళి విద్యావ్యాసంగముతో బాటు తపమాచ

రించి వచ్చు మహాపుణ్యమాదాన గర్భము నందుండెను.

ఇంతలో శ్రీత్యాగరాజస్వామి యారాధన మహోత్సవము సమీపించెను. గురుపూజ్యవరేణ్యులగు శ్రీసదానందసద్గురుస్వాములవారును, ఆళ్ళగడ్డ శ్రీశంకరానందస్వాములవారును శ్రీచిదానందస్వాములు మున్నగువారు సకాలమునకు విచ్చేసిరి. ఆరాధనమహోత్సవము సక్రమముగా ప్రారంభమై మహాత్ముల ఉపన్యాసములు జరుపబడి కార్యముపూర్ణమాయెను. శ్రీవారు ఆరాత్రికే ప్రయాణము నిశ్చయించి సిద్ధపడుచుకొనియుండిరిగాన అందఱు పరుండిన పిదప "శివశివా! శ్రీగురవేనమఃఅనుచు గురుచరణసన్నిధిని గొంతసేపునిలుచుండి ధ్యానముచేయుచు దూరమునుండి సాష్టాంగముగ నమస్కరించి, విద్యావ్యాసంగముగోరి శ్రీకాళీక్షేత్రమునకు వెళ్ళదలంచి నంద్యాల స్టేషనుకు వచ్చియచ్చటినుండి నేరుగా రైలుటిక్కెట్టునొకటి కొని బండినెక్కిరి.

ఇచ్చట ఉదయమున కుటీరమునందు జూడ శ్రీశంకరానందగిరిస్వాములవారు కనుపించలేదు. దిగులుపడి యెక్కడయని యాలోచించుచు వెదకుచుండగా గుప్తదాన మొసంగిన శ్రీపుల్లయ్యశెట్టిగారు వచ్చి ఉన్నసంగతిని విశదపఱచుచు "మేము వెళ్లువఱకు ఎవరికిని చెప్పగూడదని స్వామివారాజ్ఞ జేసియున్నందుననే జెప్పలేదు"-అని వినయముతో పల్కిరి.

ఈమాటలు విని శ్రీ గురుదేవుడు మున్నగు మహాత్ములందఱును తమలో, "వీరి ప్రారబ్ధము శ్రీశుకులవంటిది, ఒకరికి చిక్కువారు కారు. దేశాటనముజేసి పెక్కుదేశికుల సందర్శించి తమ భావి జీవితమునకు కావలసిన విద్యాతపస్సుల నార్జించుచున్నారు మంచిదే! వారియుద్యమమునకు శ్రీమదుమామహేశ్వర గురుపీఠపరంపరామహాశక్తితోడ్పడుగాక!" యని అందరు మాటలాడుకొనుచు మంగళమయమగు శుభాశంసనములు గావించిరి.

## కాశీవిశ్వారాధ్య గురుకులవాసము

మన శ్రీవారు నంద్యాలలో బండినెక్కి నాలుగు రోజులలో సుఖముగా కాశీమహాక్షేత్రము శ్రీ జగద్గురు విశ్వారాధ్య గురుకులము శ్రీజంగమవాడి మఠమును జేరుకొనిరి. ఇప్పుడిచ్చట జగద్గురువులై యుండిన శ్రీస్వాములవారు ముందున్నవారుకారు. ముందున్న వారు పరమపదించి యుండిరి. ఇప్పుడున్నవారో అట్టి శక్తిసంపద్విశిష్టులును పరమశాంతిస్వరూపులును,విద్యావంతులు నగు ౧౦౮ శ్రీశ్రీశ్రీ విశ్వేశ్వర శివాచార్య మహాస్వాములు జగద్గురుపీఠము నలంకరించియుండిరి. ఇట్టి ప్రసన్నమూర్తులగు శ్రీజగద్గురుస్వామిని దర్శించుటకై పూర్వమచట తమమిత్రులగు పండిత శ్రీసిద్ధరామశివాచార్యులతో గూడుకొని మహాసన్నిధికి వెళ్ళి దండవత్ప్రణామము లాచరించిరి.

అనంతరము శ్రీజగద్గురువులు వచ్చిన మనస్వామినిగురించి అన్ని సంగతులు విశదముగ తెలిసికొని ముదమున మందహాస మొనర్చి "మంచిదే! కష్టించి విద్యాతపస్సుల నార్జించండి.గురుకుల నియమముల ననుసరించండి". ఆగురుకులవాస నియమములను జెప్పి వసించుటకు గురుకుల విద్యార్థుల వాసస్థానమగు కైలాసమంటపం పైయంతస్థున నొక ప్రశాంతమగు గదిలో నుండ నియమించిరి.

ఆగదియో మహాప్రశాంతమైనది. ప్రక్కనే శ్రీశైలజగద్గురు స్వామివారి సోదరులగు పండిత శ్రీగురుసిద్ధస్వామి విద్యార్థులగది; మూడవది పండిత శ్రీసిద్ధరామ శివాచార్యులవారిదే; ఇక చుట్టుప్రక్కలను గురుకులవాసుల నివాసములే. ఇట్టి పవిత్రమగు ఏకాంతస్థానము· ఉత్తమవిద్వజ్జన విద్యార్థుల సంసర్గమున కనుకూలమైన యాగనె నిప్పించి నందులకు శ్రీస్వామివారపారమగు ఆనందమునొంది జగదీశా ! విశ్వేశా! ఇదంతయు నీకృపామహిమ" యనినుతించిరి.

ఏకాంతస్థానమున నిట్లు వసించుచు తమ నిత్యకార్యక్రమముల నీవిధముగ పరిపాలించుకొనుచుండిరి ; గంగాస్నానము, విశ్వేశ్వర

సందర్శనము, రెండుపూటల నియమితకాలము లందనుష్ఠానము, గురుకులమున శ్రీపండిత సిద్ధరామశివాచార్యులు, శ్రీగంగాధరశర్మవీరియొద్ద ఉ. 10గంటలవఱకు కావ్యవ్యాకరణ వేదాంత సాహిత్యము లభ్యసించుట; పిదప 11గంటలకు భోజనము అనంతరము విద్యాలయములకు *వెళ్ళి యున్నతాధ్యాపకులు విద్యార్థులకు దెలుపు నుపనిషత్సూత్ర భాష్యపాఠముల శ్రద్ధతో వినుచు విషయముల గ్రహించుట; సాయంకాలము పట్టణమున నచ్చటచ్చట జరుగు సభలకు వెళ్ళి మహాత్ముల పండితుల యుపన్యాసముల వినుట; (తఱచుగా శ్రవణమునకై శ్రీగీతామందిరమునకు పోవుచుండిరి).7-30 గం॥లకు మఠమును జేరి తమ నిత్యానుష్ఠానమును ముగించుకొని 9 గం॥లకు ప్రసాదమును స్వీకరించుట; పిమ్మట 10-30 గం. వఱకు ముందు పాఠముల నవలోకించుట అను నిత్యాది శ్రీవారి నిత్యప్రణాళిక అపుడపుడు శ్రీరామకృష్ణ మఠమునకు వెళ్ళి యా మహామైదానమున జమువుకొనుచు హాయిగానుండెడివారు.

ఇట్లు తమ కాశీ వాసమును గురించి విద్యానిధులగు గంగ శ్రీజగద్గురు వాగీశపండితారాధ్యమహాస్వాములవారికిని, తమ గురువరేణ్యులగు పూజ్యపాద శ్రీసదానంద సద్గురుస్వాములవారికిని భక్తిపూర్వకముగా పత్రముద్వారా తెలుపుకొనిరి. నంద్యాల కుందనగుర్తి మున్నగు స్థలములలోగల తమయాప్తులకును ఈ విషయమును తెలిపిరి. శ్రీవారి శుభసంకల్పము నభినందించుచు తమమిత్రులనుండి జాబులు వచ్చెను. హితైషులనుండి శుభసందేశములును వచ్చినవి. మరికొందరు పెద్దలనుండి ఆశీర్వాదరూపములైన పత్రము లందినవి. తమ గురువుల నుండి ఘనమైన ఆశీస్సులను వడసిరి. తాము పూనిన మహాకార్యమున సర్వవిధముల ప్రోత్సాహము కలుగుచున్నందులకు శ్రీవారు మిక్కిలి

* ఇచ్చట ఉత్తమ సంస్కృత విద్యాలయములు పెక్కులు గలవు. మంచి వారెవరైనను అక్కడకు వెళ్ళి పాఠముల వినవచ్చును. ఎట్టి యభ్యంతరము లేదు. అనుభవులగు వృద్ధులు అధ్యాపకులుగా నుందురు. భాష్యముల నత్యుత్తమరీతిని బోధించుచుందురు.

సంతసించిరి. తమ కర్తవ్యనిష్ఠయందు మగ్నులై చక్కగా కర్తవ్యమును నిర్వహించుచుండిరి. అంత కొన్ని దినములకు శ్రీశైల శ్రీ జగద్గురు మహాస్వాములవారు మన శ్రీవారికిట్టియర్థముగల కన్నడ శుభాశీర్వాద లేఖ నొకటి పంపిరి.

శ్రీజగద్గురు పండితారాధ్యో విజయతే
శ్రీశైల జగద్గురు వాగీశపండితారాధ్య మహాస్వాములవారు
శ్రీజగద్గురు శ్రీశైల సూర్యసింహాసన మఠము

తే. 12.2.49

గుంతకల్లు;

"స్వస్తి! తమ 27-1-49 వ జాబువలన సర్వము తెలిసి పరమ సంతోషమయ్యెను. శ్రీజగద్గురు విశ్వారాధ్యులఆశ్రయమునందు తమ సాత్వికానుష్ఠానము జరుగుచుండుట మిక్కిలి ఆనందము. శ్రీవిశ్వ నాథుడు మీ సదిచ్ఛను సఫలము జేయుగాక. మీఅధ్యయన అనుష్ఠా నములు జగద్ధితకరములగుగాక..."

అనునిట్టి శ్రీముఖము ఇచ్చటి శ్రీజగద్గురుమహాసన్నిధికివచ్చెను. వెంటనే మహాసన్నిధివారు మన శ్రీవారిని పిలిపించి చిరునవ్వుతో 'శ్రీ శైలమహాసన్నిధియవరింద నిమిగె ఆశీర్వాద పత్రబందిదె' (అనగా శ్రీ శైలమహాసన్నిధివారినుండి మీ కాశీర్వాద పత్రము వచ్చినది) అని చెప్పి జాబు నిచ్చిరి

ఈ శ్రీముఖమునుగాంచి శ్రీవారును పరమానంద భరితులైరి. మరి యాయుత్తరమునుజూచి తమమిత్రులెల్లరు మిక్కిలి మక్కువతో జదివి సంతసించిరి మనస్వామి యాలేఖ నద్దమునందు భద్రముగనుంచి నారు.పిమ్మటకొన్ని దినములకు స్వామియందు విశ్వాసముగల నంద్యాల, బళ్లారి, కుందనగుర్తి, మైసూరు, పెద్దబళ్లాపురం ఈ స్థలముల యందలి భక్తులనుండి సుమారు 500 రూపాయల వఱకు వచ్చెను. ఈధనమున చాలవఱకు సంస్కృతహిందీ పుస్తకములు, వ్రతసమయమున వలసిన

పూజాద్రవ్యములు మున్నగు వీని కొఱకుపయోగింపబడి యాధనము సత్పాత్రయందు సమర్పితంబై యక్షయ మందెను ఈక్షేత్రమున శ్రీ స్వామి మొట్టమొదటకొన్న గ్రంథము బ్రహ్మసూత్రశాంకరభాష్యము -3భాగములు 15 రూపాయలు, ప్రథమభాగమున శ్రీ సిద్ధరామశివా చార్య పండితులే తమస్వహస్తములతో ఈ శ్లోకమును వ్రాసిరి.

"శ్రీశంకరానంద యతీశ్వరస్య శ్రీశంకరాసక్త సుధీశ్వరస్య
శ్రీబ్రహ్మసూత్రస్య సుభాష్యమేతత్ కాశ్యాం గృహీతం శివదం
సదాస్తు"

ఈ పండితులప్పుడు వేదాంతాచార్య పరీక్షకై చదువుచుం డెడివారు. కావ్యతీర్థసాహిత్యశాస్త్రి మున్నగు పరీక్షలయందు తీర్ణులైన పరమ సజ్జనులు. వీరు మనస్వామివారికి మిక్కిలి సహాయమొసర్చిరి. బ్రహ్మసూత్ర భాష్యపాఠము జరిగెడి విన్సకాలేజి మున్నగు మంచి స్థలములజూపి యాపండితులతో మంచి పరిచయము గావించిరి.

ఆ మహాసన్నిధి గురుకులమున విద్యార్థులందరుకలసి యప్పుడ పుడు నైతికధార్మికాధ్యాత్మికాది విషయములంగూర్చియుపన్యాసము లేర్పఱచుట పద్ధతి. ఒకసారి యా విద్వత్సంఘసభ యొకటి జరిగెను. కొందరుత్తము లుపన్యసించిన పిమ్మట మన శ్రీవారినికూడ మాట్లాడ వలయునని కోరగా మనశ్రీవారు గురుస్మరణచేసి "గురుకులవాసము" అను శీర్షికపై ఈ విధముగా ననుభవవిషయములతో మృదుమధుర భాషతో ఒక గంటసేపు ఉపన్యసించిరి. దాని సారమిది.

ఏ చోటు ప్రశాంతమయ వాతావరణమున ప్రకృతిసౌందర్య ముతో విద్యార్థుల విద్యాతపస్సునకు సాధనభూతమై యుండునో ఆ స్థలము గురుకులము. విద్యార్థులు బ్రహ్మచర్యదీక్షతో గురుసమీపము నందు వసించుచు సేవాదులచే నాతని యాదర్శజీవితమును గడుపు కొనుచు గురువు చెప్పినట్లు తపః స్వాధ్యాయములను దప్పక ఆచరించు చుండుటచే నది గురుకులవాసము అని చెప్పబడెను.

మన భారతభూమి గురుకుల సంస్కృతికిపరమ కేంద్రము. పుట్టినిల్లు, మానవాభ్యుదయ సభ్యతకు సత్క్రియాచారవిచారములకు నిదిమూలస్థానము. ఈ మూలము నుండియే జనజీవితవృక్షము శోభావంతమై యభివృద్ధినొంది శాంతిసుఖములనుపూలుపూచి, యఖండసుఖమనదగు ముక్తిఫలమునిచ్చును. ఇట్టి యుత్తమ భారతీయుల సుసాంస్కృతిక విద్యావినయాది గుణపాఠముల గరపు కేంద్రములనే గురుకులమని పిలుతురు. ఇవి ఉపనిషత్కాలమునుండియు సుప్రసిద్ధములు. ప్రతిబ్రహ్మచారియు 12ఏండ్ల వయస్సయినపిదప గురుకులమునకు వెళ్ళి 24 సంవత్సరముల వయస్సు వచ్చువఱకు వేదాదివిద్యలభ్యసించి గురునాజ్ఞ వడిసి గృహస్థుడుగనో సన్న్యాసిగనో సంస్కారమును బట్టియగుచుండెడివారు. శ్వేతకేతువు, సత్యకాముడు, అరుణి మున్నగువారు ఉపనిషత్తులలో ప్రసిద్ధులైయుండివారివిషయము వేరుగా చెప్పనక్కరలేదు. చక్కని గురుకులములు విద్యాపీఠములు ఎన్నియో యుండెనని తెలియవచ్చుచున్నవి. వానిలో తక్షశిల, విక్రమశిల, శాంతిపురి, నలంద మరియు మహాక్షేత్రమగు వారణాసి ఇటువలె మరికొన్నియు ముఖ్యములు. వానిలో ప్రస్తుతము మనమీ వారణాసి (కాశి) శ్రీజగద్గురు విశ్వారాధ్య గురుకులమందనే యున్నామనుట మిక్కిలి యానందదాయకము.

కాని నేడు నవనాగరికతతో నుండిన పాశ్చాత్యభూముల గాలి సోకి పూర్వాచార విచారము లడుగంటినవి. అయినను మన గురుకులమున నట్టి దుస్థితిలేక శ్రీగుర్వనుగ్రహమున నైతికాధ్యాత్మిక విధానములచే శిక్షణ యొసగబడుచున్నందులకు మనము పరమసంతోషమునందవలసినదే! అయినను ప్రచండప్రకృతి వికటతాండవమాడుచున్న యీకాలమున ఎంతటిమంచివారమేయైనను ప్రమత్తులముగాక జాగ్రత్త గలిగి యుండవలెను. నేటి విశ్వవిద్యాలయముల కాలేజీల చట్టముల నతిగ వాడుకొనక ప్రాచీన అర్వాచీన పద్ధతులనాలోచించి దేశకా

లానుసారము ధర్మవిరుద్ధముగాని యట్లు చూచుకొని యథోచితముగ చరింపవలెను. ఈగురుకుల విద్యావిధానములచే మనము భావిజీవిత పూర్ణవికసన మొందవలసియున్నది. ఇట్టి యుత్తమ గురుకులమున వసించు మనమెట్టి నీతినియమముల వర్తించవలెనో, ఆవిషయములు మీకు సువిదితిములే. అయినను గురువులు బోధించిన ఆమాటలనే మరల కొన్నింటిని చెప్పుచు ప్రస్తుత విషయము నుపసంహరించెదను.

"బ్రహ్మణి చరతీతి బ్రహ్మచారీ" అన్నట్లు బ్రహ్మ విషయక మగు బుద్ధివృత్తిచే వర్తించుచు అనాత్మ విషయిక వృత్తులు లేకజీవన చరమ లక్ష్యమగు పరమ పురుషార్థమునకై పోరాడు పోరాటమే బ్రహ్మచర్యము. తప్పిపోని సత్యమగు బ్రహ్మచర్యమున తపమాచరించుచు సద్విద్యనార్జించు విధానమే నైష్ఠిక బ్రహ్మచర్యము, గురుకుల వాసానంతరము గుర్వాజ్ఞ వడసి సద్గృహస్థుడగుట ఉపకుర్వాణ మనియు చెప్పబడును. గురుకులమున పొందబడువిద్యను పూర్ణవిశ్వాసమునపరిశ్రమించి ఆపోశనము జేసికొన్నచో తప్పక మనము విజేతలమై పరతత్త్వమునుగాంచి జీవించి యుండగనే యఖండ సుఖమందగలము. "బ్రహ్మచర్యేణ తపసాదేవ మృత్యుముపఘ్నత" "బ్రహ్మచర్యేణ విద్యా విద్యయాబ్రహ్మలోకమ్" – అనగా బ్రహ్మచర్యమనెడి తపస్సుచే మృత్యువును జయింపగలరు. బ్రహ్మచర్యముచే జ్ఞానము, జ్ఞానముచే బ్రహ్మప్రాప్తియు గలుగును. అట్టివారు భయమందరు."

మన పూర్వాచార్యులందరునుఅంత ప్రతిభావంతులైన ధైర్యముతో లోకసేవ యొనర్చుటకు వారికున్న బలమేమి ? గురుకులవాసమున పొందిన నైతిక ధార్మికాధ్యాత్మిక శిక్షణలే కదా! ఇచ్చట సంపాదింపబడిన ఆత్మబలమే; బ్రహ్మచర్య ప్రభావమే. నేడు మన మీస్థానమున సంపాదించిన తపః స్వాధ్యాయ శక్తులే మన భావిజీవితమునకు భద్రమైన పునాదులు. అట్లులేక ఈసుదినములలో అవినీతి పరులమై యాంతరంగిక సద్భావములు లేక కాలము వ్యర్థపుచ్చినచో, నిక

ముందు అడుగడుగునకు అనర్థములు, నష్టకష్టములు దప్పవు. అపుడు వాని నెదురించు పటిమ మనకుండదు. ఓడిపోదుము. ప్రకృతి శాస -నము లతి కఠోరములు కాన ఇప్పుడే మనమది తెలిసి చక్కని కృషి చేసినచో ప్రకృతియే మాతయైబలమొసగును కనుకనే ఆర్యసంస్కృతి గురుకులమని పిలిచెను.

"యదా వై బలీ భవతి। అథ ఉత్థితా భవతి। ఉత్తిష్ఠన్ పరి చరితా భవతి। పరిచరన్ ఉపసత్తా భవతి। ఉపసీదన్ ద్రష్టాభవతి। శ్రోతాభవతి। మంతా భవతి। బోద్ధా భవతి। కర్తా భవతి। విజ్ఞాతా భవతి।" అనగా మనుజుడెప్పుడు (బ్రహ్మచర్యాది రక్షణోపాయము లచే) బలవంతుడగునో, అపుడు లేచి స్వతంత్రముగా నిలుచును. గురు సేవ చేయగల్గును. గురుని సమీపించి ఆకీలకమును అనగా శ్రోత్రియ బ్రహ్మనిష్ఠాపరిపూరితంబగు సదాచారసంపదను గని అతని బోధలందు కొనును. వినిన అర్థములను సాధక బాధక యుక్తులచే మననమొనరించి నిశ్చయించుకొని జ్ఞాని యగును. జ్ఞానాంతరమున కర్మ బంధకముగాదు తన్మూలమున విజ్ఞానము ఆత్మచే స్వధర్మ కర్మల యథారీతి నొనర్చుచు నిరంకుశ తృప్తిరూప కైవల్యము నొందును. ఇది ఉపనిషత్కాలమం దలి విద్యాభ్యాసము. మన మనస్సు వాక్కు చూపు వినికిడి చేయు కర్మ వేషము ఆహారము ఈ అన్ని విషయముల యందును నిర్మలులై నిరాడంబరులై యుండవలెను. ఉన్నతవిద్యనభ్యసించి యుత్తమోత్తమ మగు స్థితినొంది వర్ధిల్లజగద్వంద్యుడగు గురుపరమాత్మ అనుగ్రహించు నుగాక. అవిచ్యుత శ్రద్ధను మనయందరికిచ్చి గాచుగాత యని జగ ద్గురు శ్రీవిశ్వారాధ్య గురుచరణోపాంతము న శరణులిడువాడు. అకించి త్కరమగు నీమతి శ్రీగురుమహాసన్నిధి మాటలాడ నసమర్థమైనది. అయినను తత్కృపాలేశమున నేమో బలికితి. అందేమైన త్రుటు లున్నచో నుత్తమ పండితులగు తాము క్షమింతురుగాక యని నమో వాకములతో విరమించువాడ. ఓంతత్సత్."

ఈవిధముగా అనర్గళవాగ్ధారతో నుత్తమవిషయములెన్నియో ఒకగంటసేపు ఉపన్యసించిరి. విద్యార్థులందరు పరమానంద మందిరి. వెంటనే ఆసభలో నిట్లు తీర్మానించిరి.

"శ్రీశంకరానందగిరి స్వాములవారు ఇకమీదట మా విద్వత్సంఘమున నొక సదస్యులైరి. మరియు శ్రీవారు ఈ గురుకులమునుండి వెలువడు "విపంచి"యను మాసపత్రికకు వ్యాసములు వ్రాయవలసినదిగా మేము గోరుచున్నాము" ఇట్లు తీర్మానించి శ్రీవారిని విద్వత్సంఘమున నొక మెంబరుగా యెన్నుకొనిరి. విద్యార్థులందరు నాటినుండి స్వామియందు విశిష్టమగు పరస్పర ప్రేమాదరణలతో అందరు అప్పుడప్పుడు ఇట్టి సమావేశముల నేర్పఱచుచు నుత్తమతత్త్వప్రసంగముల ముచ్చటించుకొనుచుండిరి. శ్రీవారు 'విపంచి' మాసపత్రికకు వ్యాసములను రచించి యొసగిరి. విద్వత్సంఘపు తరపున జబల్‌పూర్ పండిత సమావేశమునకు వెళ్ళివచ్చిరి.

మనశ్రీవారు అమూల్యమగు నీసమయమున కొంచమైనను వృథాచేయక దేహమలసి సొమ్మసిలునంతవఱకు పరిశ్రమించిరి. అప్పుడప్పుడు తమలోతాము తమ మనస్సునకిట్లు చెప్పుకొనుచుండెడివారట;

"ఓమనసా! ఇచ్చట నిన్నెవరును దండించువారు లేరని సోమరివై ఏవిధముగను కాలమువృథాచేయకుము; వేసటనొందకుము. నీ సమయమును సార్థక పఱచుకొనుము. జీవితమున సమయ మపూర్వమైనది. గడచిపోయినది రాదు. రాబోవునది తెలియదు. వచ్చినది అటులనే యుండదు. ఇది ప్రకృతి స్వభావము, అనిత్యము, మాయాలక్షణము. అయినను గురునిష్ఠచేత నీమాయనే యూతగాగొని నీవు మాయాతీతుడవు గావలెను. "అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వమాం" అన్నట్లు నీవేమరుపాటు జెందవద్దు. ఇట్లు లేకున్నచో నీవు ఋణియగుదువు. జీవనమున ఋణము మహాభారముసుమా! కోరినట్లుత్తమ స్థలములభించెను. గుర్వనుగ్రహమున సర్వసౌకర్యము లొద

వెను. కాన నో మనసా! నీవేమాత్రము ప్రమత్తత నొందరాదు. "స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యం" అను శ్రుతిసూక్తి ననుస్మరించుచుండుము. మనసా! ప్రమత్తతవలన నీకెన్ని నష్టములు సంభవించునో తెలుసా! మొదటిది సమయనష్టము; రెండవది గురు సాన్నిధ్యసేవానష్టము, మూడవది ద్రవ్యనష్టము, నాల్గవది ఆయు ర్నష్టము; అయిదవది మానసష్టము; భద్రముసుమా!" యని తమలో తాముజెప్పుకొనుచు శ్రీగురుకృప ననుస్మరించుచు, ఆనందాశ్రుధారా పూరితులై భావసమాధి నందుచుండెడివారట.

ఈవిధముగ మనస్వామివారు యచటి మిత్రులు మొదలగువారి కందరికి అతి ప్రియులై సన్నియమ నిష్ఠలతో నొప్పుచు తమ యధ్య యనము లందు మగ్నులగుచు మౌనముగా నుండుచుండిరి. ఇట్లుండ ఒక నాడు క్విన్సకాలేజిలో బ్రహ్మసూత్ర భాష్యపాఠమునకువెళ్ళి యందరి కంటెను చివరగూర్చుండి వినుచుండిరి. అధ్యాపకులు పాఠప్రసంగమున అధ్యాస విషయమై చెప్పుచుండిరి. అంతనొక విద్యార్థి "మహారాజ్ అధ్యాసఅధ్యాస యని చెప్పెదరే! శ్రుతులయందు అధ్యాసయను మాట యెక్కడను వినబడలేదే!" యని యడిగిరి. అందులకా పండి తులు "జీభాయి! శ్రుతులయందధ్యాస యని రాకపోయినను తదర్థ వంతములగు ననేక శబ్దప్రయోగము లున్నవి. అధ్యాస యనగా ఒకటిని మరొకటిగా దలంచుట. ఇట్టి అర్థమునందే అవిద్య, అజ్ఞా నము - అనుశబ్దములచే శ్రుతులయందు భాష్యముల చెప్పబడినవి. ఆలాటి శబ్దప్రయోగములువచ్చు ఏదైన యొక ఉపనిషన్మంత్రమును జెప్పు" డని యడిగిరి. అంత విద్యార్థులింకను ఆలోచించుచుండగనే చివరనున్న మనస్వామివారు కఠోపనిషద్ ప్రథమాధ్యాయము ద్వితీ యవల్లి నాల్గవమంత్రమగు,

"దూరమేతే విపరీతే విషూచీ అవిద్యాయాచ విద్యేతి జ్ఞాతా
విద్యాభీప్సినం నచికేతసం మన్యే నత్వా కామాబహవో లోలుపన్త"

(క. 1.2.4)

అను దానినిధైర్యముగా తటాలున చెప్పిరి. ఇట్లు జెప్పగానే విద్యార్థి బృందములోనివారుగాక వేరుగా చివరగూర్చున్న యొకయతి చెప్పినందున, విద్యార్థులు, ఉపాధ్యాయులు-వీరందరి దృష్టియు మన స్వామిమీద పడెను. ఎవరాయన? యని చూపుసారించి చూచు చుండిరి. ఇంతలో నుపాధ్యాయులు ప్రేమతో మనస్వామిని గూర్చి "మహారాజ్! ఆప్ కహాం రహానేవాలేహై? ఆప్ కౌన్ హై? క్యా పఢేహువాహై?" అనగా తమరెక్కడ నివసించుచున్నారు? తమరెవరు? తమరేమి చదివినారు? — అని యడిగిరి. స్వామివా రేదో కొన్నిమాటలతో సంగ్రహముగా విషయముం జెప్పిరి. అప్పుడు వారు "తమకు శాస్త్రసంస్కారము సుశిక్షణము ఉన్నట్లు కాన్పించు చున్నది. అనుదినము పాఠమునకు వచ్చుచున్నారు. పరమ సంతో షము. ఇచట మీకే యభ్యంతరమునులేదు. జంకులేక లోపలికివచ్చి కూర్చుండి వినివెళ్లవచ్చును"అని నిండు ప్రేమాదరణలతో బలికిరి. ఈ పరిచయకారణముననే తరువాత ఉన్నత విద్యార్థులతో గీతాపోటీపరన సంఘమున శ్రీస్వామివారికిగూడ స్థానము లభించెను. పోటీలోప్రథమ శ్రేణియుదు విజేతలై గీతా శంకరభాష్య గ్రంథమును వెండిపతక మును బహుమానముగా పొందిరి.

ఇంకొకమారు కాశీ సన్న్యాసికాలేజీయొక్క వాగ్వర్థినీ సభ యందు తమకొసంగబడిన నియమితమగు నల్పసమయమున సంగ్రహ ముగా సంస్కృతభాషయందు పండితులు సంతసిల్ల, తోడివిద్యార్థులు ముదమలర శ్రీవారిట్లుపన్యసించిరి.

నాటివిషయము: కా నామ నీతిః ? నీతియనగా నేమి ?

ఓం తత్సత్ - "అయి అధ్యక్ష మహోదయాః" చిదంశ భూతాః "సదశ్యాశ్చ! కా నామ నీతిః?" ఇత్యస్మిన్ విషయే కించి ద్వివక్షు రహం। ఆశాసేహం తత్ర భవన్తో మహాన్తః శాంతాంత రంగాః శృణ్వంత్వితి।

కా నామ నీతిః నీయతే అనయా సర్వలోకః సౌఖ్యస్థానమితి నీతి ; అర్థాత్ దుఃఖ సంసారసాగరాత్ మానవజీవనం యద్ధి వచః నియమో వా సముద్ధరతి సైవ నీతిరితి అస్మాభిః ఉద్ఘోష్యతే। పరం ఏతావతా నీతి నిర్ధారణా అతీవసులభా ఇతినకైరపి సంభావనీయమ్। యతః 'కింకర్మ కిమికర్మేతి కవయోప్యత్రమోహితాః "తయాహి। లోకే ఏకత్రయా నీతిః సైవ అన్యత్ర అనీతిః। అతఏవ గహనా నీతే ర్గతిరితి మే మతిః। తథా చ సాంఘికదృష్ట్యా యా అనీతిః సైవవ్యక్తి దృష్ట్యానీతిః యా హి వ్యక్తి దృష్ట్యాఅనీతిః సైవ చ సాంఘికరీత్యా నీతి తాం ఆపద్యతే। అస్యోదాహరణం మహాభారతయుద్ధమేవ।

అర్జునస్య దృష్ట్యా బాంధవాదీనాం హననం అనీతిరాసీత్। అత ఏవ స మహాన్ కథమహం జానన్నపి అనీతి వర్త్మనిపాదక్షేపం కుర్యా మితి శోకాకులో బభూవ। జగదుద్ధరణార్థం అవతీర్ణస్య శ్రీకృష్ణస్య దృష్ట్యాతు యేన యేన లోక రక్షణం ధర్మాభ్యుదయశ్చ స్యాత్ తత్సర్వం నీతా వంతర్భవతిస్మ। అతః తద్దృష్ట్యా ఖలానాం కౌరవాణాం హననం శాస్త్ర సజ్జన సమ్మతా నీతిరేవాసీత్ ఏవంస్థితే నీతి రహస్యే పండితా భవన్తః స్వనీతి పథం యథాతథం నిర్ధారయన్తు, యయాఖిలు సమాజస్య లోకస్య అభ్యుదయ నిఃశ్రేయసిద్ధిఃస్యాత్। తామేవసమష్టి దృష్ట్యా నీతిం మన్వానాః జీవన పథే అగ్రేసరా భవన్తు। వ్యష్టిదృష్టిం పరిత్యజ్య విశాల భావనాభావితం నీతిమార్గ మాశ్రయన్తు। ఏవంచేత్ విజయలక్ష్మీః యుష్మాన్ వృణోతి శీఘ్రమితి శం। ఓం తత్ సత్."

అనగా (తెలుగులో)

ఓ అధ్యక్షమహాశయా! చిదంశభూతులగు సదస్యులారా! "నీతి యనగా నేమి" — అనెడి విషయమున కొంత చెప్పదలంచితిని. పెద్దలగు తమరందరును శాన్తాత్ములై విందురని ఆశించుచున్నాను.

నీతి యనగా నేమి? ఏవాక్కు లేదా నియమము దుఃఖరూప సంసార సాగరమునుండి యుద్ధరింపజేసి మానవుని శాశ్వత సౌఖ్యస్థాన

మును జేర్పగలదో అదియే నీతియని ఘోషింపబడుచున్నది నీతియిట్టి దని నిర్ధరించుట మిక్కిలి సులభమని తలంచరాదు. ఎందుకనగా: కర్మ యనగానేమి? అకర్మయనగానేమి? అనెడివిషయమున పండితులు కూడ మోహితులగు చున్నారు. కనుకనే లోకమున ఒకరి కెద్ది నీతి యో అదియే మరొకరి కనీతియై యున్నది. అందువలననే నీతి యొక్క స్వరూపనిర్ణయము అతి కఠినమని అభిప్రాయము. అటులనే సాంఘిక దృష్టిచే నేది యనీతియో అదియే వ్యక్తిదృష్టిచే నీతియై యున్నది. వ్యక్తిదృష్టిచే నెద్ది అనీతియో అదియే సాంఘిక దృష్టితో నీతియగుచున్నది దీనికి దృష్టాంతము మహాభారత యుద్ధమే.

అర్జునుని దృష్టికి బాంధవాదులను చంపుట అనీతి యయ్యెను. కనుకనే ఆనుహానుభావుడు ఎఱింగియు అనీతి మార్గమున నేనెట్లు అడు గిడుదునని శోకాకులు డయ్యెను. జగదుద్ధరణకొఱకు అవతరించిన శ్రీకృష్ణపరమాత్మదృష్టిచే దేనిచే లోకరక్షణము, ధర్మాభివృద్ధి కలు గునో అదంతయు నీతి యందంతర్భవించును. కనుక అతని దృష్టిచే దుష్టులగు కౌరవులను చంపుట శాస్త్రసజ్జన సమ్మతమగునీతియయ్యెను పరిస్థితి యిట్లుండ నీతిశాస్త్రమునందు పండితులగు తమరు తమతమ నీతి మార్గమును నిర్ధరింతురుగాక. దేనిచేతనైతే సమాజమునకు లోక మునకు అభ్యుదయ నిఃశ్రేయ సిద్ధిగలుగునో దానినే సమష్టి దృష్టితో నీతియని తలంచుచు జీవన మార్గమున ముందడుగు వేయుదురుగాక. వ్యష్టిదృష్టిని వదలి విశాలభావముతో గూడిన నీతిమార్గము నాశ్రయిం తురు గాక. ఇట్లైనచో విజయలక్ష్మి మిమ్ము శీఘ్రముగ వరించగలదు

ఓంతత్సత్." ఇట్లు సంగ్రహముగ నుపన్యసింప యా సభికులెల్లరు మహదానందముచే కరతాలన మొనర్చుచు సంతసించిరి. మరి మరీ ఇచ్చటికి రావలెనని కోరిరి. తఱచు శ్రీవారచటికి వెళ్ళుచుండిరి.

ఎప్పటి యట్లే ఒకనాటి సాయంకాలము గీతామందిరమునకు శ్రీవారువెళ్ళిరి. ఆనాడచట సుప్రసిద్ధ మహామండలేశ్వరులు, మహా

నీయ నిష్ఠాగరిష్ఠులునగు పూజ్యపాద ౧౦౮ శ్రీశ్రీశ్రీ విద్యానంద స్వాములవారు నచ్చియుండిరి. వీరిబోధ సులలితమై చక్కని ఉపమానోపమేయములతో నొప్పుచు శ్రోతృజనచిత్తాకర్షణీయమైయుండెను. ఇచ్చట వీరు మూడురోజు లుండిరి. ఒకనాడు ప్రత్యేక సమయమున వారిని మనశ్రీవారు దర్శించి వినయముతో నిట్లడిగిరి.

"మహరాజ్ ! ఉత్తమ సాధకుడగు అధికారిపురుషుడు బ్రహ్మసాక్షాత్కారమును బడయుటకు ఎట్టిసాధనల జేయవలెను ?"

ఈప్రశ్నవిని మండలేశ్వరులు పరమ కరుణతో నిట్లనిరి: "ఆహా! ఇంతపెద్ద ప్రశ్న నడుగుచున్నారే! చాలసంతసము. ఉత్తమ సాధకుడు —అను మీప్రశ్నయందే జవాబున్నది. బ్రహ్మసాక్షాత్కారమునకు అఖండాత్మ విచారణతప్ప మరేసాధనము లవసరములేదు. తద్బుద్ధయస్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః... (గీత5.17) అన్నట్లు ఉత్తమాధికారి కిదియే పరాయణముగాని, యట్టి గాఢనిశ్చయములేనిచో సక్రమముగా జపతపధ్యానాదులచే నధికారియగుటకై బాగుగా పరిశ్రమించవలెను. నిజమైన శ్రద్ధగలిగినచో తక్కిన సాధనములన్నియు నందే యడగియుండును. అయితే "బ్రహ్మ సత్యం జగన్మిథ్య" యను నిశ్చయమున బ్రహ్మమాత్రావలంబనమగు ప్రత్యగాత్మదృష్టియే పూర్ణశ్రద్ధయనబడును. ఉత్తమాధికారులకిది సర్వసంశయములదీర్చి బ్రహ్మానుభవము నొసగునుగాన "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను సూత్రరీతి నిజమైన యట్టియధికారి యయిన పిదప బ్రహ్మవిచారణయొక్కటియే కర్తవ్యము. దేహాత్మవత్ బ్రహ్మాత్మనా సంస్థితియే విచారపర్యవసానము." ఇట్లు తృప్తికరమైన యీసమాధానమంది వందనమాచరించి మనస్వామి విచ్చేసిరి. మరొకప్పుడు కాశీటౌనుహాలువద్ద సుప్రసిద్ధ ధార్మిక ప్రచారకులగు ౧౦౮ శ్రీశ్రీశ్రీ కరపత్రస్వాములవారు 3దినము లుపన్యసించిరి. ఆసభ లక్షలకొలది జనులచే క్రిక్కిరిసియుండెను. హంసగమనమువలె వీరి సంభాషణలు గంభీరమై సభ

నుద్ఘాతలూగించెను. వీరి ఉపన్యాసములకు మనశ్రీవారు శ్రద్ధగా వెళ్ళివినిరి. వానిలోని ఒకటి రెండంశముల తెలియజేసెద.

"ఆ సనాతన పరతత్త్వమే జీవరూపమున వ్యవహరింప బడు చున్నదిగాని వేరుగాదు. మన ఆత్మయే పరబ్రహ్మము. దానియందే సర్వజగత్తు కల్పింపబడుచున్నది. ఇదియే సర్వశ్రుతుల తాత్పర్యము సద్రూపమైన బ్రహ్మమొక్కటే సజాతీయ విజాతీయ స్వగత భేదరహితమై యుండెనని ఉపక్రమించి, చివరకది యేసత్యమైనది. ఆయాత్మ నీవనియు, అదియే అద్వితీయ పరబ్రహ్మమనియు ఆ శ్రుతులుపసంహరించుచున్నవి."

"ఒకప్పుడు తెలియని అజ్ఞులెవరైనా వేదమతము సనాతన సిద్ధాంతముగాదని దూషించి కలతపఱచుటకు ప్రయత్నించినచో నవి కేవలము బాలుర ప్రలాపములే. ఇది భారతీయుల జన్మహక్కు. అట్టి మాటలకు చెవియొగ్గి ఐహిక భోగలాలసచే మన మనార్యులము గారాదు."

"భారతీయ మహిళలు తొల్లింటి సతీమతల్లులగు సీత,సావిత్రి, అనసూయ, మీరాబాయిమున్నగు వారిని మనసున తెచ్చుకొనవలెను" అను నిత్యాదిగా వారివాక్యములు.

శ్రీవారపుడపుడు దశాశ్వమేధ ఘాట్‌నందు జరుగుచుండిన శ్రీ తులసీదాస రామాయణమును వినుచుండిరి.

మరియు కేదార్ ఘాట్‌నందు నివసించు యోగుల వద్దకు వెళ్ళి పాతంజల యోగసూత్రాభిప్రాయములను తెలిసికొనుచుండిరి.

చౌషష్ఠి ఘాట్‌నందు ఒక పండితులయొద్ద కొన్ని భాష్యగ్రంథముల శ్రవణము జేయుచుండిరి.

గోఘాట్‌నందున్న హిందీపండితుల వలన విచారసాగర గ్రంథ ప్రసంగముల వినుచుండిరి. వీరే మనస్వామివారికి "భారతీయ దర్శ

నము" అనునొక హిందీపుస్తకమును ప్రేమతో సమర్పించిరి. ఇదియొక దార్శనిక గ్రంథము. అన్ని దర్శనములిందు సంగ్రహముగా జెప్ప బడియుండును.

ఈసమయమున కాళహస్తి శ్రీకైలాసాశ్రమము పూజ్యపాద శ్రీనిత్యానందస్వాములవారు శిష్యసమేతులై బదరీయాత్రకై వచ్చి మనస్వామివారితో కలిసికొని శ్రీజగద్గురుస్వాములవారిని సందర్శించి సంభాషించి, మనస్వామివారితో, 'స్వామీజీ! ఇక చాలించి మన దేశ మునకు రండి. ఇంకను ఇక్కడుండి తమరు తెలిసికొనవలసిన క్రొత్త వేదాంతమేమియును లేదు" అను నీవిధములైన కొన్నిమాటలను ఛలోక్తిగాను ప్రియముగను బలికి దర్శనంబిచ్చి వెళ్ళిరి.

## 5.వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1949 సం॥

ఇక చాతుర్మాస్య మహావ్రతమును శ్రీవారు దీక్షాబద్ధులై శ్రీ గురుమంత్రార్థ నిష్ఠాపరులై నియమము దప్పక యనుష్ఠించుచు పరమ శాంతముగా తమ యేకాంతపు గదియందు కొన్నివేళల గంటలకొలది పరవశులై యుండెడివారు. ఇంతకు పూర్వము గంగామాత తమకు ప్రసాదించిన యా భగవద్గీతాగ్రంథముచేతనే అష్టోత్తర శతవారములు (108సార్లు) గీతాపురశ్చరణము గావించిరి. ఈవ్రత మధ్యముననే విరోధి శ్రావణ బహుళ ఏకాదశీ (తే. 20.8.49) శనివారం నాడు మామూలుగా చేయుచున్న గీతాపారాయణమున ఐదవ అధ్యాయ మున 27-28వ శ్లోకములు "స్పర్శాన్ కృత్వా ... ముక్త ఏవసః" చదువుచుండగా తమలో నేదోయొక విధమైన అనిర్వచనీయమగు పరమతుష్టిసుఖశాంతి లోలోన కలిగి వృత్తి స్వస్థితి నందెను. ఇట్లు నాటి యుదయం 8గంటల కంతర్ముఖమైన వృత్తి మరుదిన ముదయముదాక బహిర్ముఖము గాకుండెను. ఆనాడు స్వామి భిక్షకు వెళ్ళలేదుగదా! గది తలుపులు మూయబడియే యున్నవి. శ్రీగిరిస్వామివారు ఎచటికో

వెళ్ళియుండవచ్చునని విద్యార్థులనుకొనిరి. పాలవాడు నెలుపల గూటిలో పెట్టిపోయిన పాలట్లే గడ్డకట్టుకొనెను. మరు రోజుదయము పూజామందిరము నందలి నగారా మరియు గంటలు మ్రోతచే బహిర్ముఖులై చూడ పరమాశ్చర్యమయ్యెను. బిగములేనందున గడియార మాగిపోయినది. కాని దేహము నందెట్టి యలసటగాని యనారోగ్యముగాని తోచలేదు. మహోల్లాసముగానే యుండెను. ఇయ్యది స్వీయ సంస్కారముగాదనియు, శ్రీసద్గురు పరమాత్మానుగ్రహమనియు విశ్వేశ్వర మహాప్రసాదమే యనియు నిశ్చయించి పరమానంద మందిరి. ఈ విషయమును కొందరు తత్త్వవిదులకు తెలుపగా వారు, "చాలమంచిది: నిష్కామ మహాపుణ్యఫలము భావిజీవిత శుభోదయచిహ్నము" అని పరమసంతోషముతో పల్కిరి. నాటినుండి స్వామివారు గట్టిగ తలంచినంత మాత్రమున నట్టిస్థితిలో నుండగల్గుదునని స్థిరానుభవముతో పలుకు చుండెడివారు. అపుడపుడట్టి గంభీర సుఖసాగరమున మునిగి తేలుచుండిరి. (స్వరూప స్థితి ననుభవించు చుందురు) మౌనమును వహింతురు. ఇదంతయు సంపూర్ణమగు శ్రీగురుకృపా విశేషమే యని యానందించు చుండిరి.

ఇట్లు తమ కాశీవాసమున అపూర్వమగు నీకాలమును బ్రహ్మనిష్ఠాభ్యాసముచేతను, విద్యా వ్యాసంగముచేతను, మహాత్ములతోడి దర్శన స్పర్శన సంభాషణములచేతను గడుపుచు ధన్యులై వలసినంత విద్యాతపస్సుల నార్జించి అందరికి ప్రియులైరి. వ్రతము సాంగమంగళప్రదమయ్యెను. అంత కొంతకాలమునకు శ్రీగురుదర్శనార్థము గంజిగుంట, నంద్యాలకు రా పయనమైరి. ఈవిషయము మహాసన్నిధి శ్రీ జగద్గురువులకు విన్నవించిరి అది తెలిసి విద్వత్సంఘు విద్యార్థులందరును ఒక ఆదివారము మఠమున శ్రీవారి గౌరవార్థమై విందుచేసి జ్ఞాన మందిరమున సభ నేర్పాటుజేసిరి. శ్రీజగద్గురు స్వాములవారు పీఠము నలంకరించి యుండిరి. మంగళాచరణముతో సభ ప్రారంభమయ్యెను.

అంత విద్యార్థి లోకరొకరును మన శ్రీవారిని గురించి ప్రియ మగు ప్రశంసా వాక్యములను పలుకుచు పెక్కు ధన్యవాదము లర్పించుచు తమ హృద్గతమగు శ్రీవారియందలి గౌరవాదరములను వెలి బుచ్చుచు ఉపన్యసించిరి. పిదప అధ్యక్షపీఠమున సింహాసనాసీనులై విరాజిల్లుచున్న ౧౦౮ శ్రీజగద్గురువిశ్వేశ్వర శివాచార్య మహాస్వాములవారు విద్యయొక్క ఘనతను గూర్చి ప్రవచించుచు మిక్కిలిప్రేమాదరములతో కన్నడ భాషలో "ఈదిన నమ్మ గురుకులద విద్వత్సంఘ సదస్యర లొబ్బరాద శ్రీశంకరానందగిరిస్వామిగళు నమ్మను బిట్టు తమ్మ దేశక్కె హోగుత్తిద్దారెంబుదాగి ఒందు కొఱతె. ఇవరు పునః పునః మహాసన్నిధిగె బందు దర్శిసుత్తిర బేకాగి అప్పణె కొడిసిద్దేవె" అనగా "నేడు మన గురుకుల విద్వత్సంఘ సదస్సులలో నొకరగు శ్రీశంకరానందగిరి స్వాములవారు మమ్ము వీడి తమ దేశమునకు వెళ్లుచున్నారని కొఱతగా నున్నది. వీరు మఱల మఱల మహాసన్నిధికి వచ్చిదర్శించుచుండవలెనని సెలవిచ్చుచున్నాము." అని శ్రీజగద్గురు స్థానోచితములగు నమృత వాక్యముల బలుకుచు తమ యమృత హస్తములతోనే మన శ్రీవారి కంఠమును పుష్పహారముతో నలంకరింపజేసి యాశీర్వదించిరి. పిమ్మట మనస్వామి భక్తి వినయపూర్వక మార్దవవాణితో, "శ్రీమహాసన్నిధివారు విద్వత్సంఘమువారును పలికిన స్వాగతులకును, చూపిన గౌరవమునకును భృత్యుడగునే నర్హుడనుగాను. అన్ని విధముల గౌరవార్హులు పూజార్హులు ౧౦౮ శ్రీజగద్గురు విశ్వేశ్వరశివాచార్య మహాస్వామి పాదులే. అచంచల భక్తిజ్ఞానవైరాగ్యములు సదాయుండునట్లు మహాసన్నిధివారి యమోఘాశీర్వాద మొక్కటి నా కుండిన చాలునని సాష్టాంగప్రణామము లర్పించువాడను. నామిత్ర వరేణ్యు లందరికిని హృత్పూర్వక నమస్కృతంబులు. ఓంతత్సత్" అని నుడివిరి. వెంటనే మహాసంతోషముతో నందరును శ్రీజగద్గురు మహాసన్నిధికి మంగళ మాచరించిరి. సభ పూర్ణమాయెను. వేదఘోషతోను జయజయ

ధ్యానములతోను శ్రీజగద్గురు మహాస్వాములను లోపలికి తోడ్కొని వెళ్ళిరి.

ఆపిదప కొన్నిదినములకు మన శ్రీవారు మహాసన్నిధి యాశీర్వాదమంది విద్యార్థులకు కృతజ్ఞత లర్పించి శ్రీవిశ్వేశ్వరుని సందర్శించి కాశీక్షేత్రమునుండి బయలు దేరిరి. "హరిద్వార్ కా కంకర్ సభీ శంకర్" అన్నట్లు రాళ్ళు రప్పలు కూడ నచట శివస్వరూపమై యుండ ఇకసచేతనుల విషయము చెప్పనేల ? అనబడు పవిత్ర క్షేత్రమగు హరిద్వారమునకు విచ్చేసిరి. అచట ఖనకల్ హరిహరానందాశ్రమమునందుండి పిదప హృషీకేశము పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శివానందసరస్వతీ స్వాములవారి ఆనందకుటీర్ నందు వసించుచు పవిత్ర క్షేత్రములన్నింటిని సందర్శించి నేరుగా నంద్యాలకు విచ్చేసిరి.

## శ్రీ ఉమామహేశ్వర గురుపీఠము
## శ్రీనిర్వాణాశ్రమ వాసము

మనస్వామి పిమ్మట గురుదర్శనార్థమై గంజిగుంట శ్రీమఠమునకు వచ్చిశ్రీసద్గురువునకు సాష్టాంగవందనము లాచరించిరి. అచటివారందరికిని పరమానందము గల్గెను. కాశీవిశేషములను క్షేమసమాచారములను గురించి శ్రీగురుస్వామివారు విచారించి పరమ సంతోషము నొందిరి. పిమ్మట మన స్వామితో "స్వామీ ! మీరు చూడవలసిన స్థలములన్నియు జూచితిరి. ఎఱుంగ వలసిన వెఱింగితిరి. ఇకమీదట మన మూలస్థానమగు శ్రీనిర్వాణాశ్రమమునకు వెళ్ళి అక్కడనే యుండుడు. మీకన్ని సౌకర్యములను నంద్యాల భక్తులొసగెదరు. కాబట్టి మీరు మనశివారెడ్డి, శివలింగప్ప; నల్లనయ్య, రంగావధూత కలసి అచ్చటనే నివసించుచు నియమ పూర్వకముగ గురుదైవపూజ; ఆత్మనిష్ఠ, శాస్త్రశ్రవణము జరుపుకొనుచు ఆశ్రమమును సువ్యవస్థ గావించుచు నిర్వహింపుడు"--అని యాజ్ఞాపించిరి.

శ్రీగురునాజ్ఞను మన స్వామి శిరసావహించి యంగీకరించిరి.

పిదప 4-5దినము లచటనే యుండి శ్రవణాదుల జేయుచుండిరి. ఒక నాడు గురుదేవుడు మనస్వామి కీవిధముగ నుపదేశించిరి.

“స్వామీ! ఆత్మవిషయకమగు ధీవృత్తిగల మీబోటివారు బ్రహ్మవిద్యా ప్రసంగముజేయుచు నొకేచోట ఉండినచో మీవృత్తి సత్వరముగా స్వస్థానమున నిలుకడ జెందును. ఒకవేళ వృత్తి బహిర్ముఖమైనను తొందరలేదు. దృష్టి చిన్మయమై యుండును. అది సహజస్థితి యగును. ఇక భయములేదు. మరుదినము ప్రసంగ వశాత్ శ్రీగురువు లిట్లు నుడివిరి.

ఒకసంఘము వృద్ధికావలెనన్నచో దానికి “క్రియాసిద్ధిః సత్త్వే భవతి మహతాం నోప కరణే” అన్నట్లు సాత్వికమగు శక్తి అత్యావశ్యకము. అట్టిశక్తి నార్జించినపిదప శాంతిస్థాపనకై పోరాడవలెను. కాని ఒక్కొక్కప్పుడు తనచేతులే తనకు వైరమైనట్లు తన్నుతానే మోదుకొన్నటుల సంఘము తనలోతాను ఐకమత్యము లేక కలతజెంది స్వీయ గౌరవమును నష్టము జేసికొనుచు, తనబలమును తానే పోగొట్టుకొనుచుండును. ఇట్టియెడ సత్త్వశక్తి అత్యావశ్యకము అట్టి శక్తి సంపద్విశిష్టత లేనందుననే సంఘము లట్లగుచుండును. బుద్ధిమంతుడీప్రకృతి లక్షణమును గ్రహించి చక్కని శీలముతో సాత్వికానుష్ఠాన బలముచే శాంతిని కోల్పోక సంచాలకుడై యుండవలెను” అనునిత్యాదిగా తెలిపిరి. పిమ్మట రెండుమూడు దినములకు శ్రీ సద్గురు నాజ్ఞ గైకొని శ్రీశివలింగాశ్రమమునకు వెళ్ళి తమ సద్గురునాజ్ఞను అచటి భక్తమండలికి దెలిపి బ్రహ్మచారులతోసహా సంధ్యాలచేరిరి. అక్కడగున్న శ్రీశివారెడ్డి గారితో కలిసి అందరును శ్రీనిర్వాణాశ్రమముచేరిరి. నిరంతరము బ్రహ్మనిష్ఠ, శాస్త్రశ్రవణాదులచే పరమసుఖంబుండిరి. ఆశ్రమ వ్యవహారములను శ్రీశివారెడ్డిగారు గాఢవిశ్వాసముతోను ధైర్యముతోను నిర్వహించుచుండిరి. శ్రీవారీసమయమున ప్రస్థానత్రయ భాష్యమును చక్కగా పరిశీలించిరి. పెక్కుప్రకరణగ్రంథములను పఠించిరి. ఈయ

న్నిటి యందునుగల శ్రుతిసారరూపములగు దాదాపు వేయిశ్లోకము లను ఏరికూర్చిరి. "శ్రుతిసార"మనియాగ్రంథమునకు నామముంచిరి.

ఈనిర్వాణాశ్రమమన్ననో నంద్యాల భక్తాదులకు పరమ ప్రీతి. పైగా శ్రీవారిట నివసించుటచే ఈ భక్తులు తఱచుగా ఆశ్రమమునకు వెళ్ళుచు శ్రీవారిని దర్శించి వారియొద్ద శాస్త్రశ్రవణము గావించు చుండిరి. ఇంతలో శ్రీశివరాత్రి మహోత్సవము సమీపించెను. కార్య క్రమము విధ్యుక్తముగా పూజపారాయణము, అఖండభజన, మహా త్ములచే వేదాంతోపన్యాసములు మున్నగు కార్యములతో జరుపబడి మహావైభవముగా మంగళాంతమయ్యెను.

## 6.వ. చాతుర్మాస్య మహావ్రతము-1950సం॥

వికృతినామ సంవత్సర ఆషాఢ శుద్ధ ఏకాదశి సోమవారంనాడు శ్రీచాతుర్మాస్య మహావ్రతమును శ్రీవారీ తాపసారణ్య పుణ్యాశ్రమ ముననే సన్నియమ నిష్ఠలతో ప్రారంభించిరి. ఆశ్రమభక్తాదు లనేకులు వచ్చి శాస్త్రశ్రవణముజేయుచు ఆనందముగ కొన్ని దినములుండి వెళ్ళు చుండిరి. అన్ని విధముల ఆశ్రమము శివ మయమై శోభావంతముగ కైలాసమా యన నొప్పి యుండెను. మహావ్రతము కార్తిక శు॥౧౨॥ పూర్ణమాయెను. మరల శ్రీశివరాత్రి మహోత్సవము సమీపించెను. పూజ్యపాద శ్రీశ్రీశ్రీ సదానంద సద్గురు స్వాములవారు గంజిగుంట శ్రీమఠమునుండి విచ్చేసిరి. రాదగిన శ్రీఉమామహేశ్వర గురుపీఠ పరంపర యావత్తు శిష్యకోటియు భక్తబృందమును పెక్కుస్థలముల నుండి వచ్చిచేరిరి. శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులగు సురపురం బ్రహ్మశ్రీ శంకరానందస్వాములవారును విచ్చేసిరి. ఈస్వామివారు శ్రీ ఉమా మహేశ్వర గురుపీఠసంఘమువారందరికిని చిరపరిచితులు. సుహృదా త్ములగు పండితులు. శ్రీసదానందసద్గురుస్వాములవారికి పరమ ప్రియు లు. మన శ్రీవారు గంజిగుంటయందు శ్రీసన్నిధిలోనుండగా ఈ సుర పురం స్వాములవారు తఱచుగా వచ్చుచుండిరి ఒకమారు వీరు

శ్రీసదానందస్వాములవారితో మనశ్రీవారినిగురించి "స్వామీ! ఈచిన్న మూర్తి పెద్దవాడగును. వీరి ప్రారబ్ధము శుకులవంటిది ముందు మంచి అభివృద్ధికి వచ్చెదరు. వీరిని చాల జాగరూకతతో చూచుకొనవలయు నని ఆశీర్వదించుచు తెలిపిరి.

ఇట్టి ఉత్తమ మహనీయులందరుచేరగా శాస్త్రోక్తముగా పూజ, భజన, మహాత్ముల ఉపన్యాసములు, అన్నదానము మున్నగు కార్యక్రమములతో మంగళప్రదమై మిక్కిలి వైభవముగా ఉత్సవము సమాప్తినొందెను. సురపురం శ్రీశాస్త్రులవారు(స్వామివారు)స్వస్థానమునకు బయలుదేరిరి. శ్రీసదానంద సద్గురు స్వాములవారు ఆసంవత్సర మచటనే విశ్రాంతిగా నుండగోరి నిలిచిరి. వీరు నిలుచుటచే కొందరు త్తమభక్తులుకూడ శాస్త్రశ్రవణాపేక్షచే అచ్చటనే ఆగిరి. శ్రీగిరు మహాసన్నిధివారిచే నొప్పు ఆపుణ్యాశ్రమమున అందరును వ్రతశీలురై నియమము తప్పక జపతప ధ్యానానుష్ఠానములతో శాస్త్రశ్రవణము గావించుచుండిరి. అచ్చటి యనుదిన కార్యక్రమమేమన :

బ్రహ్మముహూర్తము 4 గం.నుండి 6 గం. వరకు అనుష్ఠానము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదయము | 6 | ,, | 8 | ,, | పరమగురు మహాసమాధిపూజ గీతాపారాయణాదులు |
| ఉదయము | 8 | ,, | 10 | ,, | పాతంజల యోగసూత్రముల గూర్చి శ్రవణము. |
| మధ్యాహ్నం | 1 | ,, | 3 | ,, | మౌననిష్ఠ, గ్రంథావలోకనము. |
| సాయంసమయము | 4 | ,, | 6 | ,, | యోగసూత్రములు, నైష్కర్మ్యసిద్ధి శ్రవణము. |

సాయంసమయము 6.30 గం. రా॥8.30 గం. అనుష్ఠానము
రాత్రి 8.30 9 " భజన.

మన పూజ్యపాద శ్రీశంకరానందగిరి స్వాములవారే మృదు మధుర శైలితో గంభీరార్థవంతములగు యోగసూత్రములను నైష్కర్మ్యసిద్ధి గ్రంథప్రసంగములను విపులముగా వ్యాఖ్యాన మొనర్చుచు శ్రోతల నానంద సాగరమున ముంచుచుండిరి. పూజ్యపాద శ్రీసద్గురు స్వాములవారు పీఠము నలంకరించి మౌననిష్ఠతో తృప్తిగ శిష్యుని దృష్టి బోధన కళాపటిమను ప్రజ్ఞా విశేషమును గాంచుచు మనమున సంతసించుచుండిరి. ఇట్టి బ్రహ్మయజ్ఞమును గుర్వనుగ్రహముచే భక్తులందరు తు.చ.తప్పక అఖండముగా మూడుమాసములు నియమముగా జరుపుకొనుచు యోగసూత్రములను సంపూర్ణముగా శ్రవణముజేసిరి. ఇక గురుదేవుడన్నచో విశ్రాంతిగా నపుడపుడు అపూర్వమగు భావములను అహేతుక ప్రేమతో నవ్యాజకరుణతో అనుభవ విషయములను తెలుపుచుండిరి. వాటిలో కొన్నింటినిమాత్రము శ్రీవారిపొత్తము నుండి యిట పొందుపఱచెదను. "అప్పా! మాకు కాషాయాంబరమును కప్పుము" అని శిష్యుడగు మన శ్రీవారికి చెప్పగా పరమభక్తితో తమ గురువులకు కాంచనచేలము- కాషాయాంబరమును ధరించి పూజించిరి.

"నాయనా! అజ్ఞానమనగా ఆత్మ నెరుగకుండుట. నేను నేనని బలుకుచు నేనను తత్వార్థము నెరుగకుండుట. దేవతలజన్మకంటె నరజన్మ ముత్తమము. ఏలయనగా అజ్ఞాన నివృత్త్యుపాయమును సాధించుటకీజన్మయందే సాధ్యము. ఇచ్చట దుఃఖానుభవమున్నది. దేవతల జన్మయందది లేదు. ఈ యుత్తమ మానవజన్మ నొందినందులకు దుఃఖ నివృత్తిమార్గమున నడువవలెను. స్వర్గమందలి సుఖానుభవములు గూడ ఈలోకమందు ఇట్టి మానవజన్మలో నున్నపుడు గావింపబడిన పుణ్యవిశేషఫలమే గదా! కనుక అట్టి పుణ్యకర్మ ఫలప్రాప్తి

యే స్వర్గానుభవము. అయితే అదియు "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి"యన్నట్లు పుణ్యము దీరినపిదప మరల మర్త్యలోకమును తప్పక గల్గించును. అనిత్యమై పతనదోష భూయిష్టమైన ఈ క్షణిక సుఖంబును ముముక్షువులు గోరరాదు. ఈ జన్మయున్నపుడే "న స పునరావర్తతే"అను శ్రుతివాక్యానుసారము మరలమరల జనన మరణముల ఆవృత్తి లేని అజ్ఞాననివృత్తిపూర్వక శాశ్వతానందప్రాప్తిరూప మోక్షము నొందుటకై ప్రయత్నించవలెను. ఈ జన్మ యున్నపుడే జ్ఞానమునొంది మఱల జన్మలులేనిస్థితి నందవచ్చును. అట్లుగానిచో అజ్ఞానము అనంతకోటి జన్మలకు కారణమగును. కాబట్టి మానవ జన్మయొక్క పరమోద్దేశ్యము శాశ్వత కైవల్యప్రాప్తియేగాని జన్మ జరా మరణ దుఃఖప్రాప్తి గాదు. నిజమైన ముముక్షువులదృష్టికి ఐహికాముష్మిక విషయము లెట్టివైనను ప్రియములుగా దోచవు.

మఱొకనాడు శ్రీస్వామివారిట్లు ప్రబోధించిరి. (ముముక్షువులనుద్దేశించి)అనంతకోటి జన్మసుకృత పరిపాకమే ముముక్షు జన్మముగాన నిట్టి పరమపుణ్యమయ జన్మకు ప్రారబ్ధములేదు. అనగా అందు చెడ్డ యుండదన్నమాట."

హంసయొక్క తల అంతఃకరణము, పాదములు ఇంద్రియములు; రెక్కలు ఉచ్ఛ్వాస నిశ్వాసములు; దేహముపంజరము."

"పొట్ట యనగా పుట్ట. అందలి ప్రాణ స్పందనమే సర్పముదాని. నిరోధమే అనగా ప్రాణము నెదురు చూచుచుండుటయే, అద్దాని నాశనము ; పరమసుఖానుభవము."

ఇట్టి అనేక విషయములను విశ్రాంతిగా కూర్చుండి శ్రీగురుస్వామివారు సమాధి భాషలో తెలుపుచుండెడివారు. ఈ ప్రకారము బ్రహ్మయజ్ఞము మిక్కిలి జయప్రదముగా గురుకృపచే జరిగిపోయెను. పిదపపూజ్యపాద శ్రీగురుస్వాములవారుగంజిగుంట మఠమునకు దయ చేసిరి. తక్కిన భక్తాదులును తమ తమ స్వస్థానములకు జనిరి. మన శ్రీ

వారు మాత్రము కొంతకాల మచటనే యుండి పిదప భక్తులగు శ్రీ గోవిందప్పగారి ప్రార్థనల మన్నించి శ్రీగురునాజ్ఞ వడసి మైసూరు ప్రయాణమైరి నంద్యాలనుండి బండి గుంతకల్లు చేరినది స్వామి వారున్న పెట్టెలో నొక పెద్దమనిషి ఎక్కెను. పెద్దవేషముతో నుండెను. బండి కదలిన సిమ్మట ఆవ్యక్తి మనస్వామివారిని జూచి స్వామీ! ఈ కాలమున సన్న్యాసులంటే ఏపనీపాటులేక ఇదొక వేషము వేసుకొని ఏవోవో మాటలు చెప్పుచు ఊరూరు తిరుగునారే గదా! ఈ యెఱ్ఱగుడ్డలు వేసికొని తిరిగితే వీరినుండిలోకానికి గలిగే లాభమేమి ?" యని తిరస్కార భావముతోను ఎగతాళిగాను అడిగిరి. అది విని మనస్వామి సౌమ్యభావమున శాంతములగు పలుకులతో నిట్లనిరి :

"అయ్యా! సన్న్యాసమంటే మీదృష్టికంత చులకనగ అగపడుచున్నదా ? అనుష్ఠానపరులగు మహాత్ములయిన సన్న్యాసుల నెపుడైనా దర్శించెడి భాగ్యము మీకు కలుగలేదేమో ! మీకు తెలిసినట్లు పలుకుచున్నారు. పాప మాకల్లకంప సంసారమునబడి దేలుచున్న మీకే విధముగ మంచి సన్న్యాసులగు మహాత్ముల సాంగత్యమబ్బును? అందులకు విశ్రాంతిలేదు కాబోలు, అట్లుగాక గృహస్థాశ్రమ మందలి తీపిని బాయనీయక వాని యందత్యధికమగు అభిరుచి యున్నందున ఈవిరాగ చిహ్నములైన కాషాయాంబరములు మీ కన్నులకట్లు అవహేళనగ నగపడుచున్నవేమో? ఒకవేళ ఎక్కడైనా చూచియుండినచో కేవలము వేషధారి సన్న్యాసులను చూచి మోసపోయి యుంటిరేమో ! పాప మందుచేతనే సన్న్యాసమంటే కాషాయ వస్త్రములంటే మీరంతగా నులికి పడుచు బెదరుచున్నారు కాబోలు!

కాని నాయనా ! ఎప్పటికిని ఎల్లవారిని అట్లనుకొనరాదు. సన్న్యాసమనగాస్వార్థరహితమగుభగవదర్పితమైన లోక శివంకరమగు పరహిత జీవితము, ఆగురుతులే ఈకాషాయాంబరములుగానిఇయ్యది సోమరులుగా నుండు దేశద్రిమ్మరుల వేషముగాదు. సన్న్యాసమంటే

"న్యాసమితి జ్ఞానం" యను భాష్యపాఠానుసారము జ్ఞానమని అర్థము. మరియు నిర్వక్రమగు ఆచార విచారములతో ఆదర్శజీవనులై సదో్బధ లొసంగుచు తమయాత్మ శక్తులను పంచిపెట్టుచుండు పురుషోత్తములని అర్థము. వారి చూపుచే మానవ హృదయముల కొన్నింటిని, మాట లచే కొన్నింటిని మరి సంకల్పమాత్రముచేతనే కొన్నింటిని సత్పథము నకు త్రిప్పి పవిత్రములుగ జేయువారు. ఆధ్యాత్మిక బలమొసగి కార్య రంగమున కర్తవ్య కర్మల నాచరింప జేయువారు. భారతీయుల వైరా గ్య ధీరోద్యమ చిహ్నములే ఈకాషాయాంబరములు. "కాషాయ దండ మాత్రేణ యతిః పూజ్యో నసంశయః" అను పెద్దలవాక్యమును మీరు వినలేదా? భారతీయులకు సన్న్యాసమంటే పరమ పూజ్యము. అసలు విషయమిట్లుండ సర్వాశ్రమములకు తలకట్టువంటిదగు ఉత్తమ గృహస్థాశ్రమమున నుండు మీబోటి గొప్ప గృహమేధులు ఈవిధ ముగా పూర్వాపరములు దెలియకమహాత్ముల నిట్లుని ర్లక్ష్యముజేయుట ఐహికాముష్మిక శుభఫలములకు సైతము తీరని యడ్డునాయనా! "ఆత్మ జ్ఞంహ్యర్చయేద్భూతి కామః" అనగా సంపద గోరువాడు ఆత్మ జ్ఞానిని పూజించవలెను --అని శ్రుతి పలుకుచున్నది..." అను నిత్యా దిగా శ్రీవారు ఈవిషయముల నెంతో ముచ్చటగ తెలిపిరి. ఈమాటలు విన్నవెంటనే ఆపెద్దమనిషి కేమాయెనో మరి ఎట్లుతోచెనో గాని వెంటనే చెంపలు వేసికొనుచు "తెలియక మాట్లాడితిని; స్వామీ!నా తప్పు క్షమింపుడు" అనిస్వామిపాదములు తాకి నమస్కరించిరి. పిమ్మట నాపెట్టెలోనున్న తక్కిన వారును పరమ సంతోషములో, "స్వామీ! ఆయననుగూర్చి చెప్పినమాటలు అతనికేగాక మాకుకూడ బుద్ధివచ్చు నట్లు చేసినవి"అని పలుకుచు శ్రీవారియెడ భక్తి గౌరవములనుజూపిరి. ఇట్లు స్వామి సుఖముగా ప్రయాణము చేయుచు రాత్రి 9 గంటలకు మైసూరు చేరి భక్తులగు శ్రీగోవిందప్పగారి యింటికి వెళ్ళి దర్శన మొసగిరి. యథాప్రకారము పూజానుష్ఠానములు జరిగెను.

## మైసూరు గీతా ప్రచారిణీ సభ

శ్రీవారు భక్తవరులగు శ్రీగోవిందప్పగారి ఇష్టానుసారముగా వ్రతరూపమున వారి గృహమునందు 8 దినములు శ్రీశంకర గురుచరిత్రను శాస్త్రీయముగా బోధించిరి. పిమ్మట అచ్చట అఖండ గీతా ప్రచారము గావించుచున్న పరమహంస పరివ్రాజకులగు శ్రీశ్రీశ్రీ శంకరానంద భారతీ స్వాములవారిచే స్థాపింపబడిన శ్రీగీతాప్రచారిణీ సభకు వెళ్ళిరి. అచట శ్రీభారతీస్వాములవారు మనశ్రీవారిని ప్రీతితో గాంచి వసతికి ఒక ప్రత్యేకమైన గది నిచ్చిరి. అందు నివసించుచు తమ నిత్యనియమానుష్ఠానములను చక్కగా జరుపుకొను చుండిరి. కొన్నాళ్ళు ఆ స్వాములవారి సాంగత్యమున ఆధ్యాత్మిక విషయచర్చలతో ఆనందముగ నుండిరి. సుప్రసిద్ధులగు ఈ భారతీయస్వామి యొద్దకు పెక్కు మందిగొప్పగొప్ప విద్వాంసులు, స్వాములు, సాధువులు వచ్చి పోవు చుండిరి. నిరంతరము ఇచ్చట శాస్త్రప్రవచనాదులు జరుగుచుండెను. ఇట్టిపవిత్ర క్షేత్రమున మన స్వామివారు రమారమి రెండు మాసము లుండిరి.

అనుదినము రాత్రి 7 మొ, 8 గంటల వఱకు ప్రవచనముజరుగు చుండెను. వందల కొలది శ్రోత లేతెంచు చుండిరి. శ్రీభారతీస్వాముల వారు తమ ప్రవచన సమయమున అప్పుడప్పుడు మన శ్రీగిరిస్వాములను ప్రవచింప వలసినదిగా చెప్పుచుండెడివారు. వారి ఆజ్ఞానుసారము మన శ్రీవారు సభికులెల్ల సంతసిల్లగా గీతా తత్వమును గురించి బోధించు చుండిరి.

శ్రీభారతీ స్వాములవారు మన స్వామివారితో పెక్కు ధార్మికాధ్యాత్మికాది విషయము లెన్నియో తెలుపుచుండిరి. ఆవిషయములు కొన్ని ఇట నిరూపింపబడుచున్నవి.

"స్వామీ! అద్వైతము మాటలలో లేదు. అది ఆచరణీయమై భాసిల్లవలెను. హృదయ మాస్థితినొందినపుడు అచరణ తనంతటతానే

కలుగును శుష్కమగు వేయి మాటలకంటె అగ్రగ్రిమగు ఆచారయుత మైన ఒక్కమాట చాలును."

"భక్తిమతము ఉపాయముగా విరోధములేక అపాయమును దూరము జేయును. జ్ఞానమతము అపాయము నెదిరించి విమర్శించి మరి అపాయ మనుదాని జాడలే కాన్పించకుండ నశింపజేయును. అయితే ఇది మహాకష్టతరము. దీనికి గొప్పసాధన తీవ్ర వివేక వైరాగ్యము లుండవలయును."

"స్వామిజీ! లోకమున ఆచారభ్రష్టుల సాంగత్య మెన్నటికిని చేయరాదు. అట్లు చేసిన ఆ కొందరు మనుజులు అద్వైతమును తమ ఆచార విచారములతో సవరించుకొను పాకమున (పద్ధతితో) బోధల కల్పింతురు. ఇట్టి మాటలనే సారెసారెకు వినుటచే సాంగత్య బలమున అలవాటై ఒక మొండి ధైర్యమువచ్చును.కాని అయ్యది సమయమున పనికిరాదు. జీవితమున శ్రుతి ప్రోక్తమగు నిత్యశాంతిని కల్గునీయ వావిషయములు. "జీవితమున ఎదిరించి యుద్ధముచేసి విజయము గడించవలసినవి పాపములను, పాపాసక్తిని."

"స్వామిజీ! సత్యవస్తువుయొక్క సత్యానుభవము నందిన వ్యక్తి ఎట్టి సమయము నందైనను ప్రసన్న వదనముతో నుండును. ఎంతటి వాదోపవాద ప్రసంగములైనను అతడు తన చిత్తశాంతిని కోల్పోడు. ఒకప్పుడు తానోడిపోయినను సత్యదృష్టితో శాంతముగా నుండును. ఉద్విగ్నుడుకాడు. మనఃకమలము వాడదు. ఇదియే సత్య సందర్శియొక్క ఘనత."

"స్వామిజీ! శాస్త్ర ప్రవచన సమయమున ప్రవక్త ఏదియో ఆరంభించి ఎచటికోవెళ్ళి ఏదియోచెప్పి ముగించు ప్రసంగములుకూడ కలవు. తానారంభించిన విషయమును మరచుటయే దీనికి కారణము. కాన వక్తయగువాడు మిక్కిలి జాగరూకుడై యుండవలెను.అంతియే గాదు. జ్ఞానము వస్త్వధీనము. శుద్ధమైన చల్లని మనస్సుతో; అహం

స్ఫూర్తి రహితులై భాషించునపుడు ప్రయత్నములేకయే చక్కని భావములు బయలువెడలుచుండును. అట్టి భాషణములు మిక్కిలి తేజోవంతములై వినువారి హృదయములను ఆర్ద్రిపఱచును. కాబట్టి ఏ కార్యమునుగాని ఉపన్యాసమునుగాని ప్రారభించునపుడు శ్రద్ధతో మంగళాచరణ మొనర్చి ప్రశాంతముగ ప్రారంభించవలెను.''

"స్వామిజీ! సామాన్యముగా మానవుల నాలుక ఇతరుల దోషముల నుగ్గడించి పలుకునపుడు చాలపొడవగును. కాని తన దోష ములను గురించి చెప్పవలెనన్నచో మిక్కిలి కుఱచయగును. ఒకరిని మనము నిందించినచో అవతలివారు మనల నిందింతురా? లేదా? అను విచారణయే చేయబూనరు. కాబట్టి మానవులయందు ఇదొక చెడ్డ యలవాటు గలదు.

లోకవార్తానుగమనే జీహ్వైకా సహస్రధా
ఈశ వార్తాను గమనే ద్వాత్రింశద్దంత కీలితా.

అనగా లౌకిక విషయములను గూర్చి పలుకునపుడు నాలుక ఒక టియే అయినను వేయి ముఖములుగా విజృంభించును. భగవంతుని వార్తలను పలుకవలెనన్నచో 32 పండ్ల మధ్య దాగుకొనును. కాన వివేకులు తమనాలుకను పొడగించు నలవాటును మానవలెను. మౌన ముతో ఆత్మనిష్ఠ నభ్యసించవలెను. అను నీ మొదలగు పెక్కు విషయ ములను మాటిమాటికి చెప్పచుండెడివారు.

ఇట్లు పూజ్య భారతీస్వాములవారి దివ్యసన్నిధిలో మహానంద ముతో తమ నియమ నిష్ఠలందును గ్రంథవ్యాసంగమునందును నిరతులై యుండిరి. ఇంతలో పెనకచర్ల శ్రీచిదంబరాశ్రమస్థులగు శ్రీనారప్ప స్వాములవారినుండి"ఈవత్సరము చాతుర్మాస్యమహావ్రతమునుసలుప శ్రీచిదంబరాశ్రమమునకు తాము తప్పక విచ్చేయవలె'' నను ప్రేమ పూర్వకమైన లేఖవచ్చెను. మన శ్రీవారికి పై ఆశ్రమము విషయమై శ్రీచిదంబరస్వామియనువారు మహాసిద్ధపురుషులని వినియుండిరి. కాన

మిక్కిలిప్రీతి,పూజ్యభావము గలదు. కాన పూజ్యశ్రీ శంకరానంద భారతీస్వాములవారి సెలవుకోరగా వారపుడు ప్రేమసంభరితములగు మృదుమధురవాక్కులతో అప్పుడప్పుడు వచ్చుచుండవలెనని పరమ ప్రేమచే చెప్పి పంపిరి. పిమ్మట భక్తులగు శ్రీగోవిందప్పగారికి తమ ప్రయాణవిషయమును దెలిపి బయలుదేరి సుఖముగా శ్రీచిదంబరాశ్రమము చేరిరి.

## శ్రీచిదంబరాశ్రమ నివాసము

ఈ ఆశ్రమము మహాసిద్ధి సంపన్నులగు బ్రహ్మనిష్ఠాగరిష్ఠులైన శ్రీచిదంబరస్వాములవారి సమాధిగల గొప్ప పుణ్యస్థలము. వీరుచరిత్ర ప్రసిద్ధిగల మహనీయులు. ఈ ఆశ్రమధర్మకర్తలు శ్రీ పోసిన వేంకట రెడ్డిగారు. ఇక ఆశ్రమజీర్ణోద్ధారమొనర్చి సర్వవిధములవ్యవస్థాపకులై శ్రీనారప్పస్వామివారు సదా యిచ్చటనే యుందురు. వీరు చిదంబర స్వాములవారి సాకార సాక్షాత్కారమొందినవారు. పరమశ్రద్ధాళువులు. మఱియు ధర్మకర్తగారి పెద్ద తండ్రిగారగు శ్రీచిదంబరరెడ్డి గారును యోగ్యులగు పెద్దమనుష్యులు. వీరికి పురాణగాథలు, వేదాంత శాస్త్రముల యందును పరిచయము గలదు, ఇట్టి సజ్జనాన్వితమగు శ్రీచిదంబరాశ్రమమున చాతుర్మాస్యమహావ్రత మాచరించుట మన శ్రీవారికి మిక్కిలి ఆనందమయ్యెను. (ఈఆశ్రమ సిద్ధపురుషులగుఱించి శ్రీవారికి తమగురుదేవులు పెక్కుమారులు తెల్పుచుండెడివారు.)

## 7. వ. చాతుర్మాస్యమహావ్రితము-1951 సం॥

స్వస్తిశ్రీఖరనామ సంవత్సర ఆషాఢ శుద్ధఏకాదశి ఆదివారము (తే.15-7-1951) నాడు బ్రహ్మముహూర్తమున పినాకినీ గంగాతోయముల జలకమాడి శుచిస్నాతులై అబాధ్యమగు శివసంకల్పముతో విధ్యుక్తముగ శ్రీచాతుర్మాస్య వ్రతమారంభించిరి. వాక్సంయమము నియమిత కాలమున మాత్రము శాస్త్రశ్రవణము, బ్రహ్మనిష్ఠ, అష్టో

త్తర శతవార గీతాపురశ్చరణ, ఉపనిషద్గీతా భాష్యావలోకనము మున్నగు నియములచే ప్రశాంత మనస్కులై వ్రతము సలుపు చుండిరి. ఈస్థలమహిమచే నిద్రయందును; ప్రత్యక్షముగను, మహాపురుషుల అభయాదేశములను స్వామిగాంచిరి. భాద్రపద శుద్ధపాడ్యమి (2.8.1951) నాడు ఆజానుబాహువును జటాధారియునగు యోగిపుంగవు నొక్కని దర్శించి వందనమాచరించగా ఆ యోగిపుంగవుడు "సంగము వీడవచ్చు, సంగనివృత్తిస్వరూపుడవే నీవు" అనుమాటలు పలికి అంతర్ధానమాయెను.

మరొకనాడు అనగా ఆశ్వీయుజశుద్ధపాడ్యమీ మంగళవారము (2.10.1951) మధ్యాహ్నము 1.30 గంటల సమయమున మనస్వామి తలవంచి గ్రంథము చూచుచుండగా భగవాన్ రమణ మహర్షులవారు తలయూచుచు ముందు నిలబడి "అచ్చట నెవరును లేరే! నీలో నీవుండుము" అని పలుకుచు దర్శనమిచ్చి అంతర్ధానమైరి. వెంటనే ఇది మహాశ్చర్యముగ దోచెను. ఈపవిత్ర స్థల మహిమవలన ఇట్టి పవిత్ర సందర్శనములగుచున్నవని సంతసించి మహాప్రసాదముని భావించి ప్రణతులొనర్చి పై యుపదేశమును వెంటనే తమ హృదయమునను పుస్తకమునను వ్రాసియుంచిరి. ఈవిషయములను అచ్చటనున్న తమ ఆప్తులగు శ్రీనారప్పస్వామి, శ్రీచిదంబరరెడ్డి వీరలకు దెలిపిరి. అంత వారును శ్రీచిదంబర స్వామివారు గొప్ప సిద్ధపురుషులని దెల్పి వారి చరిత్రను వినిపించిరి.

ప్రతిదినము ఇచ్చటి స్థలీయులు చుట్టుప్రక్కలవారును వచ్చి గీతాభాష్య శ్రవణము చేయుచుండిరి. శ్రీచిదంబరరెడ్డిగారును కొప్పల గొండనుండి వచ్చి కొన్ని దినములచటనే యుండి శ్రవణాదుల జేయు చుండిరి. స్వామివారితో పెక్కు ఆధ్యాత్మిక తత్త్వప్రసంగములను అనేకులు భక్తిచే వచ్చి శ్రవణ సమకాలమున అడిగితెలుసు కొను చుండిరి. మహావ్రతము శివప్రదముగ సాంగమంగళ మాయెను. మహా

త్సులనుండి శుభాశంసనములు వచ్చెను. ఉత్సవమూరేగింపు ఆనంద ముగ జరిగి భూరి అన్నసంతర్పణాదులచే కార్యము పూర్ణమాయెను.

ఆపిదప శ్రీవారు నేరుగా మైసూరు శ్రీగీతాప్రచారిణీ సభకు వెళ్ళిరి. అచ్చట పూజ్యశ్రీ శంకరానంద భారతీస్వాములవారిఉత్తమ సాంగత్యమున బ్రహ్మనిష్ఠలో నుండిరి. ఈసమయమున మన శ్రీవారు "శ్రీజగద్గురు శంకరచరిత్ర" అను పేర శ్రీశంకరాచార్యుల వారి చరిత్రను తెలుగుభాషలో రచించిరి. మరియు శ్రీశంకర విరచితంబగు ప్రశ్నోత్తరీమణిరత్నమాలను కర్నాటక భాషయందనువదించిరి.

ఇట్లు శ్రీవారు శ్రీగీతాప్రచారిణీ సభయందు వేసవికాలమంతయు ప్రశాంతముగ గడిపిరి.పిమ్మట శ్రీచాతుర్మాస్య వ్రతాచరణము నకై శ్రీశివలింగాశ్రమ భక్తుల ప్రార్థనానుసారము కుందనగుర్తి రాదలంచి శ్రీభారతీస్వాముల సెలవు గైకొని భక్తులగు గోవిందప్ప గారితో కలసి ప్రయాణమై గుంతకల్లు చేరిరి.

## శ్రీశైల జగద్గురు మహాసన్నిధి

ఆసమయమున అచట శ్రీగిరిరాజ సూర్యసింహాసనాధీశ్వరులగు ౧౦౮ శ్రీజగద్గురు వాగీశ పండితారాధ్య శివాచార్య స్వాములవారి ద్వాదశ వార్షికోత్సవ సందర్భము. స్టేషనులోదిగి వెళ్ళుచుండ శ్రీజగద్గురు స్వాములవారి సోదరులును మనశ్రీవారికి శ్రీ కాశీక్షేత్ర విద్యావ్యాసంగమున ఉత్తమ మిత్రులుగ నుండిన వేదమూర్తి పండిత శ్రీగురుసిద్ధస్వామివారు శ్రీవారిని గాంచి పరమానందముతో ప్రేమాలింగన మొనర్చి మహోత్సవ విషయము తెల్పి శ్రీజగద్గురు మహాసన్నిధికి (గుంతకల్లు మఠమునకు) తోడ్కొని వెళ్ళిరి.

శ్రీవారచటికి వెళ్ళి భక్తిప్రపత్తులతో మహాసన్నిధికి సాష్టాంగ దండప్రమాణామము లాచరించిరి. శ్రీజగద్గురు స్వాముల వారు పరమ సంతోషముతో "తగిన సమయమునకు సన్నిధికి విచ్చేసితిరి. మహాసన్నిధి హృదయమున మీరు మఱపురాక యున్నారు. శ్రీమల్లి

నాథుని కృపచే మీరు సుఖంబుగ నున్నారని మేమప్పుడపుడు తెలుసుకొనుచున్నాము" అను నిత్యాది అవ్యాజ ప్రేమమయ భాషణములతో నాశ్వాసించిరి. మన శ్రీవారు శ్రీజగద్గురువులతో తమ పర్యటనాది సర్వవిషయములను విన్నవించిరి.

మహాసన్నిధికి మహాక్తికోత్సవమునకై నానా ప్రాంతములనుండి భక్తాదులు, పండితులు విచ్చేసియుండిరి. మఠమున స్థలాభావ కారణముచే శ్రీజగద్గురు స్వాములవారు మన శ్రీవారిని భక్తురాలగు శ్రీ మెట్టుపల్లి మల్లమ్మగారి నూతన భవనమున నుండ ఏర్పాటు చేసిరి. ఆతల్లియో గంజిగుంట శ్రీసద్గురు స్వాములవారికి శిష్యురాలు. కావున ఆభక్తురాలి నూతన భవనమున విడిది యొసర్చి నిత్యానుష్ఠాన పూజాదులను సల్పుకొనుచు యథారీతి ప్రవచనాది కార్యక్రమములను జరుపుచు ప్రత్యేకముగనుండి పై మహాకార్యక్రమమునకు ఆయా సమయములందు వెళ్ళి పాల్గొనుచుండిరి.

శ్రీ జగద్గురు మహాసన్నిధిని మూడురోజు లఖండముగా మహాసభ జరిగెను. వేలకొలది గొప్పపండితులు, పట్టభద్రులు, అధికారులు సాధుపుంగవులు, మహనీయులు నెందరో చేరియుండిరి. మహోపన్యాసములు గావింపబడెను. అచ్చట గుమిగూడిన మహనీయులు తమతమ సందేశములను శ్రీ జగద్గురువుల సన్నిధి సమర్పించుకొనిరి. మన శ్రీవారును "భక్తిపుష్పాంజలి" యనుపేర నొక సందేశమును చదివి వినిపించి "గురుతత్త్వము" అను శీర్షికపై కొంత తడవుపన్యసించి యథాశక్తి కానుక లర్పించిరి.

అనుదినము శ్రీజగద్గురుస్వాములవారు చివరనొకగంట సేపుపన్యసించుచుండిరి. వీరిబోధ మృదుమధుర భావాన్వితమై వైదుషీ ప్రపూర్ణమైన ధారాప్రవాహము. మహాసన్నిధివారి కొన్ని ప్రసాద కబళములు. "గుంతకల్లు ఆంధ్ర కర్ణాటకముల సంధిపీఠము సూర్యసింహాసనము. ఎల్లదేశభాషలకును మతాచారములకును జనాంగములకును

సంధిస్థానము. స్వయంప్రకాశమానుడై పక్షపాత రహితుడై సూర్య భగవానుడెట్లు సర్వులకు సమానముగా ప్రకాశము నొసంగునో అటు వలె శ్రీశైలజగద్గురు సంస్థానము సర్వమాన్యమై ఎల్లజనులకు చక్కని క్రియాచార విచార విజ్ఞానముల ప్రసాదించుచున్నది."

"దైవబలము తెరచాటున నుండు సూత్రధారుని పగిది గోప్య ముగానుండి అద్భుత కార్యముల జేయించి లోకమునకు మహదాశ్చర్య మును గొలుపును. సర్వాధారమగునాదైవమును గాంచుకన్నులు గలిగి మనము వర్తించవలెను. దానికొఱకే ఈయద్భుత ప్రదర్శనలు, కార్య కలాపములు......"

"ఈశ్వరానుగ్రహమువలన నున్నతి నొందుచుండు ఏవ్యక్తిని గూడ దూరీకరించరాదు; ఏవగించుకొనరాదు. అతని ఉన్నతాభ్యు దయమును ఎవరును ఆపలేరు. అట్లు అంతరాయములు గల్గింప జూచు వారికే యాదెబ్బలు తగులును"

"ఈజగముల అజాతశత్రు వనిపించుకొనిన యే మహనీయుడును జనించినట్లగపడలేదు. ఇయ్యది మాయామయమగు జగద్విధానము. కావున మనుజుడు ఈమాయాకార్యమున భ్రమనొందక దీని స్వభావ మును దెలిసి తన స్వధర్మమును భగవద్బుద్ధితో ఆచరించుచుండిన చాలును. తక్కినవిషయమును శ్రీశైలమల్లినాథుడే చూచుకొనును. అతనికృపయున్నంతవఱకు సురక్షితములై యన్నికార్యములు సఫలము లగును. అతని కృపలేనిచో నెవరును రక్షకులుకారు. అట్టి సమర్థు లెవ రును లేరు. అందుచే దయాఘనుడైన పరమాత్మను స్మరించుచు మన కర్తవ్య కర్మల పాలించుకొనుచుండవలెను.

"భక్తుల సుఖమే మాపీఠముయొక్క సుఖము, ఐశ్వర్యమునై యున్నది. మీయందరి ప్రేమయే ఈజగద్గురుస్వాములు. మీరందరు మేమైయున్నారు. మేమో యందరి స్వరూపమున నున్నాము. అన్న పుడు ఉన్నది ఒక పరమార్థవస్తువే నని పర్యవసితమగును.

"గురు శిష్యులసంబంధమే హృదయాంతరాళములనిట్లు ప్రేమచే వేధించుచుండగా, నిక రక్తసంబంధముచే జగత్తు మహామోహాంధ కారమున మునుగుచుండుటలో నాశ్చర్యమేమి? లీలామయుడగు పరమాత్మ తన వినోదముకొఱకై ప్రేమలత నొకటిని వ్యక్తివృక్షాంతర్గత మగునట్లు చలనమొందింప జేయుచున్నాడు. అట్టి సంచాలకసూత్ర ధారియొక్క అనుగ్రహముగోరి ప్రవర్తించుటయే మానవుని మానవత్వము."

"బోధకుల మెందెంతటి అపూర్వ విషయములున్నను, విను వారి యందొకవేళ పాక్షికబుద్ధి యుండినచో పాక్షిక(భేద)దృష్టితోనే అర్థమగును. అక్షయమగు శాంతి సుఖముల నీయజాలవు. సల్లక్షణ వంతులై పవిత్రదృష్టితో పరమాత్మ విషయమును వినుచుండవలెను. ఇది సంప్రదాయము."

"సద్భక్తుల హృదయకమలములు సూర్యసింహాన తరుణభాను కిరణావళిచే వికసించి భగవదంకిత మగుగాక; శుభం భవతు; శ్రీరస్తు; శివమస్తు."

ఈవిధముగా ఉత్తమ భక్తి జ్ఞానవైరాగ్య సంభరితంబులగు మాటలతో శ్రోతల మనమొప్ప తన్మయులగావించుచు పెక్కువిషయ ముల నుపన్యసించిరి.

మరుదినము మహాసంభ్రమముగ సంస్థాన మర్యాదలతో శ్రీజగ ద్గురు స్వాములవారు సుభాషిత రజతాందోళికలో సుఖాసీనులై యుండ గ్రామోత్సవము (ఊరేగింపు) జరిగెను. వేలకొలది బీదసాదల కన్న దానము గావింపబడెను. కార్యమంతయు నిర్విఘ్నముగా పరిసమాప్తి నొందెను. అట్లుపిమ్మట మనశ్రీవారు మహాసన్నిధి సెలవుబడసి ఆశీ ర్వాదములంది శ్రీశివలింగాశ్రమమునకు విచ్చేసిరి.

## స్వస్థాన వాసము

## 8.వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1952 సం॥

తమకత్యంత ప్రీతిపాత్రమై యున్న ఈ యాశ్రమమున భక్తు లెల్లరు సంతోషముతో నలర శాస్త్రప్రవచనము గావించుచు సన్ని యమ నిష్ఠలతో యథారీతి ప్రతి సంవత్సరమువలె శ్రీచాతుర్మాస్య వ్రతమును జయప్రదముగా నడపిరి.

వ్రతానంతరము భక్తులందరుకలసి అచ్చటికి కొన్నిమైళ్ళదూర ముననున్న శ్రీ సంగమేశ్వర క్షేత్రయాత్రకు వెళ్ళివచ్చి ఆశ్రమమున శాస్త్రవ్యాసంగము జేయుచు సోదరశిష్యులతో సుఖముండిరి.

## బెంగుళూరు బ్రహ్మవిద్యాశ్రమ నివాసము

ఇట్లుండ నొకనాడు బెంగుళూరుబ్రహ్మవిద్యాశ్రమాధ్యక్షులగు పూజ్యపాద శ్రోత్రియబ్రహ్మనిష్ఠ సురపురం శ్రీశంకరశాస్త్రిలవారు "శాస్త్రజ్ఞులును అనుష్ఠానపరులునైనపరమహంస పరివ్రాజకాచార్యు లగు శ్రీశ్రీశ్రీ శంకరానందగిరి స్వాములవారిని పిలిపించుకొని వారి ద్వారా చక్కగా శాస్త్రశ్రవణము చేయండి" అని తమ యాశ్రమ కార్యకర్తల కాదేశించగా వారునున్నట్లే మిక్కిలి భక్తివినయములతో మనశ్రీవారికిలేఖవ్రాసి బెంగుళూరునకు దయచేయవలసినదిగాప్రార్థిం చిరి. పూజ్యపాద శ్రీశంకరశాస్త్రిలవారియాజ్ఞతో కూడిన ఆ జాబును చూచి శిరసావహించి బెంగుళూరు వెళ్ళ నిశ్చయించిరి. ముందుగా అచటివారికి తెలియజేసి 14-11-52 వ తేది సాయంకాలము బెంగు ళూరు చేరిరి. అంతకు ముందే స్టేషన్‌లో ఆశ్రమ ప్రముఖవ్యక్తులందరు వేచియుండి శ్రీవారినెంతో భక్తిగౌరవములచే తోడ్కొని వెళ్ళిరి. ఆశ్రమవాసులందఱును శ్రీస్వామివారినిసందర్శించి ప్రేమమయసంభా షణములతో పరస్పరము ఒకరొకరు పరిచయము గావింపబడిరి. శ్రీ వారికి ఈయాశ్రమముతో ఇదే ప్రథమ పరిచయము.

ఈయాశ్రమము షుమారు ఇరువది వత్సరముల క్రింద శ్రీ॥బ్ర॥ శ్రీశ్రీశ్రీ కబీర్ నాథ్ స్వాములవారిచే స్థాపింపబడి అనుదిన బ్రహ్మ విచారణలతో నలరారుచు సార్థక నామధేయమై నగర మధ్యమున నున్న దివ్యభవనము నాడు మొదలు నేటివఱకును వేదాంతశాస్త్ర శ్రవణము రెండుపూటలు ఆశ్రమమున జరుపబడుచుండును. వందల కొలది శ్రద్ధాళువులగు శ్రోతలు విచ్చేయుచుందురు. ఇట్లు సర్వవిధ ముల నియమ నిష్ఠలకు అనుకూలమగు ఈ స్థానమును చూచి స్వామి సంతోషమందిరి. శ్రీస్వామివారు నివసించుటకు ఏకాంతమగు పై అంతస్తుగది నేర్పాటుచేసిరి. ఈ ఉన్నతస్థానమును శ్రీవారున్నందున కైలాసగిరి యందురు.

మరురోజునుండియే శ్రీస్వామివారు ప్రాతఃకాలము వేదాంత పంచదశి, సాయంకాలము శ్రీశాంకర గీతాభాష్యమును ప్రవచింప నారంభించిరి. ఇచ్చట శ్రీవారి ప్రవచనములు కన్నడభాషయందు జరుపబడెను. మిక్కిలి శ్రద్ధాభక్తులతో వందలాదిగ అచ్చట చేరునట్టి భక్తుల గంభీర సభాసాగరమునుతిలకించి తన్మయులై పరమోత్సాహ ముతో స్వామి ఉపన్యసించుచుండెడివారు. భక్తాదులు శ్రీస్వామి వారి నతి ప్రేమాదరములతో సేవించుచుండిరి.

తామిచ్చటనున్న ఈకాలమున నైష్కర్మ్యసిద్ధి కఠోపనిష చ్ఛాంకరభాష్యము, మాండూక్యోపనిషద్భాష్యము గీతాభాష్యము-9 అధ్యాయముల వఱకును ప్రబోధించిరి.

పెక్కు సత్కర్మలను తామాదర్శప్రాయులై ఆచరించి భక్తుల ద్వారా ఆచరింపజేసిరి. ఇట్లుండ కొందఱుత్తమ భక్తులపుడపుడు ఈవిధమున ప్రశ్నించి తమ సందేహముల బాపుకొనుచుండిరి.

ప్ర. బ్రహ్మయజ్ఞ మనగా నేమి ?

ఉ. మన మిప్పుడు చేయుచున్న వేదాంత విచారణయే బ్రహ్మయజ్ఞ ము. మరియు వేదోపనిషత్తు లధ్యయనముచేసి ఆవిషయముల చక్కగా

తెలిసికొని ఇతరులకు బోధించుటయే బ్రహ్మయజ్ఞము. "స్వాధ్యాయ ప్రవచనేన" స్వాధ్యాయ మనగా తాచదువుట. ప్రవచనమనగా ఇతరులకు బోధించుట యని విస్పష్టముగా చెప్పబడినది.

ప్ర. అయితే అన్ని యజ్ఞములలో గొప్పదేద్ది ?

ఉ. శ్రేయాన్ ద్రవ్యమయాత్ యజ్ఞాత్ జ్ఞాన యజ్ఞః పరంతప," "సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే" --అన్నట్లు ఈజ్ఞాన యజ్ఞమే అన్నిటికంటెను శ్రేష్ఠమైనది. బ్రహ్మావిద్యా ప్రబోధమనెడి ఈదానము అన్ని దానముల కంటెను శ్రేష్ఠమైనది. ఒకప్పుడు బ్రహ్మవిద్యా ప్రదాతయగు యాజ్ఞవల్క్యునకు జనకుడు సంపదను దానమీయబోయెను. కాని తన సమస్తమును దానముగా నొసంగినను యాజ్ఞవల్క్యులు గావించిన మహాదానముతో తులదూగదని యెఱింగి జనకుడు మహాశ్చర్యమునొందెను. జ్ఞానదాత ఘనతనుకనుగొనెను. భక్తితో నమస్కరించెను. జ్ఞానయజ్ఞము దొడ్డది.

ప్ర. స్వామీ ! శూద్రు డనువాడున్నాడా? సర్వమును బ్రహ్మమై యుండ శూద్రత్వ మెక్కడిది ?

ఉ. ఔను; ఒకప్పుడున్నాడనియే చెప్పవలసి వచ్చును. వేదవిరుద్ధమగు జీవితము గడపు నపుడాతని కామాట అన్వర్థమే. ఎందుకనగా ఏవేదములు సర్వము బ్రహ్మరూపమని చెప్పెనో ఆవేదములే శూద్రుడను మాటనుకూడ చెప్పినవి. అనగా వేదధర్మ విరహితములైన స్వేచ్ఛాచార విచారకర్మలను జేయువారందఱును శూద్రులే. ఇక వేదచోదిత ఋజుమార్గ ప్రవర్తకులందఱును బ్రాహ్మణులే. బ్రహ్మస్వరూపులే. మరియు ఆ జన్మకర్మలే సంపూజ్యములు.

ప్ర. అయితే అట్లు శూద్రులు బ్రాహ్మణులైన వారెవరైనను కలరా?

ఉ. లేకేమి ? రైక్వుడు, సత్యకాముడు, ధర్మవ్యాధుడు మున్నగువారు ఉపనిషత్ప్రసిద్ధులై యున్నారు వేయేల ? సూతమహామునులు శౌనకాది మహామునులగు బ్రాహ్మణులకు తత్త్వమును బోధించినట్లు

వినుచున్నాము. ఎందరో రాజులు వైశ్యులు కూడ బ్రాహ్మణులకు తత్వోపదేశమును చేసినట్లు కనపడుచున్నది. అట్టిసత్య శౌచదయా ధర్మాది గుణసంపద్విశిష్టతగల వాడవై, తత్త్వజ్ఞానముతో నీవును బ్రాహ్మణుడవు గావచ్చును. వస్తుతః సర్వమును బ్రహ్మమే కాదను టెట్లు? వ్యాపక బ్రహ్మము నెఱుగుటకుతగు దృష్టిగలవారే బ్రహ్మ ణ్యులు లేదా బ్రాహ్మణులు. ఇక జన్మయే అదియై బ్రహ్మదృష్టి యుండిన అంతకంటె కావలసిన దేమున్నది ?

ప్ర. స్వామీ! తాము విశేషముగ ఏకాంతముగ నుందురే! ఆ సుఖ మెట్లుండును ?

ఉ. ఏకాంతమందలి నైర్మల్య సుఖానుభవము నెదుట ఇంద్రాది త్రిలోకసుఖాదులును తృణప్రాయములై రసవిహీనములుగాతోచును. ఏకాంతమనగా స్వస్వరూపమగు వస్తుదృష్టియే ! అది మాటలచే తెలుపుటకురాదు. మానసేంద్రియాదు లచటలేవు. స్వసంవేద్యము.

ప్ర. స్వామీ ! విగ్రహ పూజలను చేయుదురుగదా ! ఈరాళ్ళను పూజించిన లాభమేమి ?

ఉ. ఆ విగ్రహము మీబుద్ధికి రాయిగా తోచినందున మీరట్లడుగు చున్నారు. రక్త మాంసాదులతో నిండి,నానావికారాన్వితమై అసహ్య మై, రోగభూయిష్ఠమైయున్న ఈదేహేంద్రియములను వ్యామోహ బుద్ధిచే సుఖరూపములని సత్యములని భావించి ప్రేమించి అభిమానించి సేవించుటకంటె నిర్వికారమగు శిలయందు భగవద్బుద్ధినుంచి భజిం చుట చాలమంచిదే. రాయి యనుబుద్ధితో ఎవరును పూజింపరు. భగవద్భావనతో పూజించినచో తనబుద్ధి శుద్ధమై బ్రహ్మానందాను భవమునకు సాధన మగుచున్నది !

ప్ర. అయితే రక్తమాంసాది యుక్తమై యుండునని గురుదేహమును కూడ పూజింపరాదా ?

ఉ. శివశివా ! ఆప్రశ్న యడుగ రాదు. గురుడుజగద్వంద్యుడు, అతని

కంటె గొప్ప పూజార్హమైన వస్తు వీలోకమున లేదు. "న గురోర ధికం న గురోరధికం" — అన్నారు. శిష్యుల అజ్ఞానాంధకారమును తొలగించగల జ్ఞానజ్యోతి వెల్గొందెడు పరమ పుణ్యమయము, చిన్మాత్రము ఆదేహము. ఇట్టి ప్రశ్నయే తగదు. నిన్ను దేహమాత్రు నిగా చూచుకొన్నంతవరకు గురుడు నీకు దైవముగ నగపడడు.

ప్ర. స్వామీ! తపస్సు చేయవలె నందురే! తపస్సనగా నేమి? అది మాకు సాధ్యమా? దయతో తెల్పుడు.

ఉ. తపస్సనగా ఒకానొక విషయమునుగూర్చి చిత్తము చింతించుచు తదాకారమగుట. జగత్తులో తపస్సు చేయని వారెవరును లేరు. ప్రతి వాడును ఏదోయొక తపస్సును చేయుచునేయున్నాడు. కాని అనాత్మ విషయ చింతనారూపమైన తపస్సు వలన దుఃఖము, బంధము కలుగు చున్నవి. చైతన్యాత్మ చింతనవలన చిత్తము తనరూపమును వీడి చిత్తే యగును. అర్థాత్ భగవదనుభవమును పొందునని అర్థము. ఈతపస్సు సాత్త్విక రాజస తామసములని మూడు విధములు. గీతలో 17వ అధ్యాయము 11-16 శ్లోకములయందు ఈత్రివిధ తపస్సులను గుఱించి చక్కగా నిరూపింపబడెను. కాని శ్రద్ధకలిగి గీతను చక్కగా పరిశీలించి విషయమును తెలిసికొనుడు. ప్రయత్నశీలుర కసాధ్యమెద్దియు లేదు.

ప్ర. నిష్ఠ యనగా నేమి స్వామీ?

ఉ. వృత్తిని ఒకే స్థాన మందుంచుట. అదియే ఆత్మ; బ్రహ్మము, అదియే నీవు. ఆ స్థితియే నిష్ఠ, అనగా వృత్తియుకూడా బాధింపబడును. ఆ స్థితియే నిజనిష్ఠ "నిష్ఠా జ్ఞానస్య యా పరా"

ప్ర. స్వామీ! గురువులు లేకపోయినను వారి ఛాయాచిత్రమును (ఫొటోను) పూజింతురు! ఇది సరియేనా?

ఉ. చాలమంచిదే! గురువనగా సాక్షాత్ పరబ్రహ్మము. ఆదిమధ్యాంత రహితమగు పదార్థము. అది పోవునదిగాదు. వచ్చునదియుగాదు. తత్ప

తీకమగు గురుదేవుని భావచిత్రమును పూజించుట శిష్యుల ఆముష్మిక సాధన కత్యంతోపయోగకారి. శ్రీవివేకానందస్వామి యంతటిఘనుడే సద్గురువగు శ్రీరామకృష్ణుని మహిమ నత్యద్భుతముగా పొగడుచు, "శ్రీరామకృష్ణ సద్గురువుయొక్క పటముగల ఆయిల్లు నాకు పుణ్య క్షేత్రము. వారిచిత్రమును పూజించువారు పరమధన్యులు. వారి సేవ చేయుటకు నేను సదా సిద్ధుడను"--అని యిట్లు గురుభక్తి పరవశులై పలికిరి. కావున నీగురుని చిత్రపటము నుంచుకొని వారుపదేశించిన మహామంత్రమును అర్థయుక్తముగ దృష్టి గలిగి అనుష్ఠించుచు పూజించు చుండుము మంచిదే.

ప్ర. స్వామీ ! ఈసంసారములో నుంటూ బ్రహ్మవిద్య నభ్యసించవలెనంటే సాధ్యమగుట లేదు. మీవలె అన్నిటిని విడిచినప్పుడే అది సాధ్యము గదా !

ఉ. ఔను. మీరిట్లెంత కాలము నుండి అనుకొనుచున్నారు ? ఈ మాటలు హృదయపూర్వకములై వివేకవైరాగ్యములచే గూడి యుండినచో ఈవేళకు విడిచి యుందురు. అవకాశము కావలసినంతయున్నది. చక్కని నియమ నిష్ఠలచే పట్టువదలక గురువాక్యమును పరిశీలించుము. అది నీకు సాధ్యమే !

ప్ర. స్వామీ ! ఈలోకమందలి శబ్దస్పర్శాది విషయములెంత వలదన్నను చూచినపుడు మరల మనస్సును లాగివేయుచున్నవిగదా! ఏల?

ఉ ఔను. కసవును జూచి పశువు పరుగెత్తునట్లు నీమనస్సు విషయములజూచి పరుగెత్తుచున్న దంటే మీరు పశుసమానులై యున్నారనుటయేగదా ! "అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః"—అన్నట్లు నిజమైన వివేకవైరాగ్యములతో విషయరూప తృణమును అసత్యమని తలంచి మనస్సును మహాదేవుని యందుంచినచో ఇక నది తనపశువృత్తిని మానును. అఖండముగా భగవన్నామము జపించుము. సరిపోవును.

ప్ర. అనుష్ఠాన సమయమున మనస్సు నిలువదుగదా ! స్వామీ !

ఉ. అలవాటు చేయుకొలది తప్పక నిలుచును.

ప్ర. స్వామీ ! నాకు యథామతి శాస్త్రపరిచయము గలదు. కాని ఆత్మవిషయకమగు దార్ఢ్యము ఇంతవఱకును కలుగలేదే ! కారణ మేమి ?

ఉ. నాయనా ! ఆత్మయందు నిలుకడ, దృఢత అనునది పుస్తకముల విద్యగాదు; అది హృదయవిద్య. శాస్త్రములు దానిని చూపు సాంకేతికములు మాత్రమే. శాస్త్రపరిచయమంది నిన్ను నీవు చక్కగా చిత్తైకాగ్రతతో గురుముఖమున విని తెలుసుకొనుము. సంతతమాత్మ సంభావనా భావితుడవై యుండుము. అందలి దృఢమగుస్థితియే నిష్ఠ. అది నీవే.

ప్ర. బుద్ధీ ! ఈజగత్తు దయాధర్మవిహీనమై అజ్ఞానముతో నిండి ఎంత ఘోరమైయున్నది ! ఇదెట్లు చక్కబడును !

ఉ. (స్వామివారు తటాలున) అట్లనకుము. నేలనున్న రాతిని నెత్తి నెత్తుకొన్నట్లు జగద్భర్తయగు విశ్వంభరమూర్తి యుండగా మీకెందుల కీఆలోచన? ఈ యాథార్థ్యము నెఱింగి మీకు మీరు దయాధర్మ బుద్ధిగలిగి అజ్ఞానవిదూరులై మీప్రస్తుత విధానమును మార్చుకొనినచో పిమ్మట సర్వము సుగమమే యగును. అప్పుడంతయు శివమయముగా శివలీలగా తోచును. తమ దృష్టి చక్కగా నున్నచో లోకమున దుష్టత్వ మగపడదు. వస్తుతః నీస్వరూపదృష్టి యందవి అలీకములు. ఉన్నదొకటే పరమార్థ సత్త అదియే నీవు. గత అనాగత విషయ చింతలు మాని బ్రహ్మబుద్ధిగలిగి యుండుము.

ప్ర. స్వామీ ! వేదాంత సిద్ధాంతమున అజాతవాదము, దృష్టిసృష్టి వాదము, సృష్టిదృష్టివాదము అని పారిభాషిక శబ్దముల జెప్పుదురు గదా ! వాటి యర్థమేమి ? దయతో తెలుపగోరెద.

ఉ. విద్వదనుభవమున ఏచోట దృశ్యసత్తలేని ఒకే పరమార్థసత్త అంగీకృతమగునో అది అజాతవాదమని చెప్పబడును. ఇక పారమార్థికము, ప్రాతిభాసికమనెడి సత్తాద్విత్వము ఎచ్చట అంగీకరింపబడునో దానిని దృష్టిసృష్టివాద మందురు. మరియు పారమార్థిక, ప్రాతిభాసిక, వ్యవహారములనెడి సత్తాత్రయ మెచట అంగీకరింపబడునో అది సృష్టిదృష్టివాద మనబడును.

అజాతవాదమున ఆరోపవాదములుగాని, వాచ్యలక్ష్యములుగాని, అంగీకరింపబడనందున ఈకల్పనలేవియు లేనందున ఉన్నది అజమగు ఒకే పరమార్థ సత్తయే.

"న నిరోధో న చోత్పత్తి ర్న బద్ధో న చసాధకః
న ముముక్షు ర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా॥

అనగా అట్టి స్థితియందు నిరోధము ఉత్పత్తి బద్ధుడు సాధకుడు ముముక్షువు ముక్తుడు ఏవియును లేవు. ఉన్నదానికి పుట్టుకయనునది, లేనిది పుట్టుట అసంభవము. ఇక దృష్టిసృష్టివాద మనగా స్వప్నకల్పితుడగు చక్రవర్తివలెజీవకల్పితుడగు ఈశుడుతత్ పదమునకు వాచ్యార్థము. అవిద్యావృతుడై తెలియబడని బ్రహ్మస్వరూపుడైన జీవుడు త్వంపదమునకు వాచ్యార్థము. ఈరెండు పదములకును శుద్ధబ్రహ్మమే లక్ష్యార్థము. కాని దృష్టియే సృష్టి. "దృష్టి రేవ సృష్టిః" అని ఈ వాదముయొక్క లక్షణము. పిదప వ్యావహారికమగు సృష్టిదృష్టివాద పక్షమున బింబప్రతిబింబవాదము, కార్యకారణోపాధివాదము, అవచ్ఛిన్న అనవచ్ఛిన్నవాదము, అవచ్ఛేదవాదము, ఆభాసవాదమని ౫ ప్రకారములు గలవు.

(వీని స్వరూప విమర్శను గుఱించి శ్రీ వారు సవిస్తరముగా బోధించిరిగాని గ్రంథవిస్తర భీతిచే నేనిచ్చట అద్దానిని తెలుపలేదు. విచారసాగరము తత్త్వానుసంధానము మున్నగు గ్రంథములయందు ఈ విషయము చక్కగా వర్ణింపబడియున్నది. అందు తిలకించవచ్చును.)

## 9.వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1953 సం॥

శ్రీవారు విజయసంవత్సర శ్రీచాతుర్మాస్య మహావ్రతమును సదాచార విచారములతో కేవల బ్రహ్మనిష్ఠాయుక్తులై అఫక్వాహార నియమముతోను రెండుపూటల నియమిత సమయమునందు మాత్రము వేదాంతశాస్త్రప్రవచనము సలుపుచు తక్కిన కాలమున మౌననిష్ఠతో నుండి పరమైకాంతిక సుఖమనుభవించు చుండిరి.

ప్ర. పూజస్వామీ ! అజ్ఞాన మనునది భావపదార్థమా ? అభావ పదార్థమా ?

ఉ. మీరధ్యాస నొప్పుకొందురా? లేదా ? "ఒప్పుకొందుము"

అట్లైనచో అజ్ఞానము అభావపదార్థమే. బ్రహ్మజ్ఞానముచేతొలగి పోవునట్టిఏఅజ్ఞానమును శక్తి యనియు మాయయనియుఅవిద్యయనియు వచింతురో అది భావపదార్థమే. అదియే అధ్యాసమూలము అట్టి అధ్యాసయే "అహమజ్ఞః" అని కనబడుచున్నందున అధ్యాసిక జీవనానుభవమునుబట్టి (ఆధ్యాసికదృష్టితో) అజ్ఞానము భావపదార్థ మని చెప్పనచ్చును. సర్పజ్ఞానము సర్పము భ్రమజ్ఞానము తద్విష యము ఈరెండును అధ్యాసికములేకాని అజ్ఞాన మనునది అనాది, ఈ అజ్ఞానముయొక్క జ్ఞానము సాక్షిరూపమున నిత్యమై యున్నందువలన ఇదియును అజమే (పుట్టుకలేనిది) అయితే అజ్ఞానమనునది అధిష్ఠానము నందు అనిర్వచనీయమై భావపదార్థ రూపమున విలసిల్లి తత్త్వజ్ఞాన ముచే నివర్తించునదై యున్నది. లేనిది ఉన్నదన్నను, లేదన్నను, లేని దనే అర్థము. బ్రహ్మమే నేను ఉన్నది.

ప్ర. జీవేశ్వరులను కల్పించునది బ్రహ్మమా ?

ఉ. జగదుపాదాన కారణమగు మాయ పరమాత్మాభాసమును బడసి శుద్ధమాయా ప్రతిబింబమున ఈశ్వరుడుగను, మలినా విద్యా ప్రతిబిం బమున జీవునిగను కల్పిత మగుచున్నది.

ప్ర. సృష్టింపబడిన జీవేశ్వరాది భూతముల యందు పరమాత్మ ప్రవే

శించెనని చెప్పుదురే! సర్వరూపములు తానయై వ్యాపకముగా నుండునది ప్రవేశించెననుట ఎట్లుపొసగును స్వామీ!

ఉ. ఔను; వ్యాపకుడగు తాను ప్రవేశించెననుట సరిగాదు. కాని తాను ప్రతిబింబించె ననుటయే ఈ ప్రవేశ శ్రుతితాత్పర్యము.

ప్ర. స్వామీ! వృత్తివలన ప్రయోజనమేమి?

ఉ. ఆవరణమును భంగపరచుట ముఖ్యప్రయోజనము. అజ్ఞానావరణముల భగ్న మొనర్చి ఆత్మను అఖండాద్వితీయ బ్రహ్మముగ అనుభవింపజేయుట కిది పరమసాధనము. నిరావరణవృత్తి.

ప్ర. స్వామీ! గురుకృప గురుకృపయని విశేషముగా తాము చెప్పుచుందురే! దాని అర్థమేమి?

ఉ. సమయమునకు ఆత్మవిషయకమగు వృత్తి గలుగుటయే. తత్స్మృతి వచ్చుటయే. ఆ వెంటనే తాపములు చల్లారి ఆత్మశాంతిగల్గును. ఆత్మశాంతియే శ్రీగురుకృప--ఓం.

శ్రీవారీ సమయమున సామవేదాంతర్గతమగు మహోపనిషత్తును తెలుగు భాషకనువదించిరి. మరియు "స్వరూపసాక్షాత్కార" మను కన్నడగ్రంథమును ఆంధ్రభాషలోనికి తర్జుమాచేసిరి.

ఈచాతుర్మాస్య మహావ్రత విరమణోత్సవము విధ్యుక్తముగ జరిగి పెక్కు మహాత్ముల ఉపన్యాసములతోను ద్వాదశి ఉత్సవము అన్నసంతర్పణాదులతోను అత్యంత వైభవముగా నడచి పూర్ణమాయెను.

ఆ సమయముననే "తాత్త్విక కవితావిశారద" శ్రీసహజానంద స్వామిగారు శ్రీవారికి భక్తిపూర్వకముగా ఈ క్రింది పద్య పంచరత్నమాలను సమర్పించిరి:

సీ॥ ఆబాల్యబ్రహ్మచర్యాశ్రమపాలన
బ్రహ్మవిద్యాభ్యాసపటిమ దనరి
సంగపరిత్యాగసంన్యాస మొనరించి
కాశినివాసంబు కాంక్షజేసి

జ్ఞానయోగాభ్యాసగరిమ బ్రహ్మానంద
మొంది జిజ్ఞాసులు నొందుముక్తి
దగినట్టి శ్రుతియుక్తి తత్త్వార్థ మెఱిగించి
జన్మసార్థక మగు జాడ దెలుపు

గీ॥ చవని విహరించు పరమహంసార్యవర్య !
శంకరానందగిరిదేవ సన్మనమున
ప్రణుతిశతముల జేసెద భవము బాయ
సాధుసంస్తవ మగు శాంతిసాధ్య మంచు.

సీ॥ కామంబు గెల్చి యోగంబున మది నిల్పి
బ్రహ్మానుభూతిచే బరగువారు
అపరశంకరరూపులా సుకదేవులా
యన నొప్పుమూర్తులై యలరువారు
శృంగారమోహ సినిమాప్రపంచాన
గెఱ గీచి మాయను గెలిచినారు
బ్రహ్మచర్యంబును పరగ సంన్యాసంబు
బాలించి కీర్తిని బడసినారు

గీ॥ ఇట్టి మీమూర్తి నపు డపు డెంచి మదిని
కన్గవల నొత్తికొని చూతు కాంక్ష దీర
నియమశీలనిబద్ధచిన్నిష్ఠ నొప్పు
మీదుచరితంబు జెప్పెద మిగుల వేడ్క.

క॥ పండితులు శాస్త్రవేత్తలు
దండిగగల రీధరిత్రిదమ శమసహితా
ఖండబ్రహ్మజ్ఞానులు
నుండుట యపరూపమార్య ! యుర్వీస్థలిలో

గీ॥ కోటి కొక్కరు మీవలె కోర్కె దీర
నాశ్రమంబుల బాలించి యాత్మశుద్ధి
గాలమున్ బ్రహ్మచింతన గడపువారు
కలియుగంబున నిక్కంబు జ్ఞానరూప !

గీ॥ పద్యపంచకరత్నాలభవ్యమాల
నాయెదుట మీరు నిలువంగ నట్టె దలచి
మీకు ధరియింపజేసి కృపను గొనుమ !
శంకరానందగిరివర ! సద్విహార !
ఓం తత్సత్

## శ్రీత్యాగరాజస్వామిమూర్తి ప్రతిష్ఠ

ఈవ్రతానంతరము నంద్యాల భక్తుల ప్రార్థనానుసారము శ్రీ త్యాగరాజస్వామిమూర్తి ప్రతిష్ఠాపన కార్యార్థమై శ్రీవారు బెంగుళూరునుండి నంద్యాలకు విచ్చేసిరి.

ఇచ్చటశ్రీత్యాగరాజస్వామి కుటీరము దివ్యభవ్యమగుమందిరముగా తయారైనది. స్వస్తిశ్రీ విజయనామ సం॥ మార్గశిర శుద్ధపంచమి (తే. 11-12-53) శుక్రవారము శుభముహూర్తమున శ్రీ త్యాగరాజస్వామియొక్క అమృతశిలావిగ్రహము శ్రీవారిఅమృతహస్తములచే వేదోక్తవిధులతో ప్రతిష్ఠింపబడెను. ఆలయము విద్యుద్దీపములచే అలంకరింపబడి మహాశోభాయమానమై వెల్గొందుచు శబ్దవిస్తారక యంత్రముతోకూడి మహావైభవముగా ఉపన్యాసాది కార్యక్రమములతో మూడురోజులు ఈమహాకార్యము సాంగమంగళముగ జరిగెను. ఈసమావేశమున గీతావాణీ సంపాదకులును, ప్రవక్త పూజ్యపాద శ్రీశ్రీశ్రీ రామకృష్ణానందస్వాములవారు, బ్రహ్మశ్రీ బలభద్రుని హనుమంతరావు పండితులు,శ్రీసాధు శివారెడ్డిగారు మున్నగువారు ఉపన్యసించిరి. భూరి అన్నదానాదులతో కార్యము మంగళప్రదమయ్యెను.

## శ్రీగురునిర్యాణము

ఇంతలో గంజిగుంట ఆశ్రమమునుండి 15-12-53 తేదీన ఒక లేఖ వచ్చెను. చరిత్రనాయకులగు మనశ్రీవారి సద్గురువరేణ్యులు పూజ్యపాద శ్రీశ్రీశ్రీ సదానందస్వాములవారు కార్తిక బహుళఏకా

దశి (తే. 1-12-1953) మంగళవారము మహాసమాధి నొందినట్లును విజ్ఞులగు బ్రశో॥ బ్రబ॥ సురపురము శ్రీశంకరానంద స్వాముల వారిచే శాస్త్రోయుక్తముగా మహాసమాధి కార్యము జరిగెననియు, ఆ సమయమున సకాలమునకు తమకు తెల్పుటకు వీలుకాలేదనియు, ముందు మార్గశిర శుద్ధ పూర్ణిమకు గురు మహారాధనాకార్యము బెట్టుకొన్నామనియు, అచటి సర్వభక్తులతో కూడి తాము సకాలమునకు గంజిగుంట మఠము విచ్చేయవలెననియు ఆజాబులో తెలుపబడి యుండెను. ఈజాబును చూడగనే సూర్యుడస్తమింపగా అంధకార మావృతమైనట్లు శ్రీవారి హృదయము దుఃఖావృతమై పోయెను. అశ్రుధారలఖండముగ తమంతట తామే ప్రవహింపసాగెను. ఏమిచేయుటకును తోపక స్తబ్ధులై భావసమాధినందిరి. అంత నొకగంటసేపునకు తెప్పరిల్లి:

"గురు డింతవఱకు ఒకరూపమున నుండె. ఇప్పుడనంతరూపులై సర్వమయులై భాసిల్లుచున్నారు. అయినను ఆ మహనీయ మూర్తి యొక్క నామరూపములు అవ్యక్తములాయెను. గురుస్వరూపము అఖండాద్వితీయమై వెల్గొందుచున్నది."

ఓంతత్ సత్ — అని స్మరించుచు ధ్యానించుచు తూష్ణీంస్థితి నొందిరి. మఱునటిదినము సాయంకాలము ఉపన్యాసమున ఈ క్రింది విధముగా "గురుగీత" నుదహరించుచు భక్త్యావేశపూరితులై గురు మహోపకార స్మరణజేసిరి. నాటి ఉపన్యాస మిదియే. యావత్తు భక్త మండలి వారందరు వచ్చియుండిరి.

"మన్నాథః శ్రీజగన్నాథో శ్రీ మద్గురుః జగద్గురుః ।
స్వాత్మైవ సర్వభూతాత్మ తస్మై శ్రీగురువేనమః ॥
పతిహీన యథా నారీ మాతృహీనో యథా శిశుః ।
గురుహీన స్తథా ప్రాణీ తస్య జన్మ నిరర్థకమ్ ॥

అన్నటుల పతిలేని సతి, తల్లిలేని బిడ్డ గురువులేని మనుజుని జన్మయు నిరర్థకములు. కాన ఆత్మోన్నతి నొందగోరు ముముక్షువుల

పాలిట గురువు కన్నతల్లి యనవచ్చును. తల్లియొక్క పాలులేనిచో శిశువునకు బలము గలుగజాలదు. అట్లే గురువులేని మనుజుని ఆత్మ వికసింపదు. హృదయగ్రంథులు వీడవు. నిజసుఖ మబ్బదు. ఉత్తమ మగు ఆదర్శ జీవన మలవడదు. అజరామరత్వస్థితియు గలుగజాలదు. ఇందువలన అన్నివిధముల ప్రతిప్రాణికిని గురునత్యావసరము. నాగురు దేవుడే సమస్త జగదాధారుడు. శ్రీజగద్గురు వాత్మరూపమున వెలయు చున్నాడు. అట్టి గురుపరమాత్మ కనంత ప్రణామములు.

"దుర్లభో విషయత్యాగః దుర్లభం తత్త్వదర్శనం।
దుర్లభం సహజావస్థా సద్గురోః కరుణాం వినా॥

అనగా గురు కరుణామృతధారలు లేనిచో విషయత్యాగము గాని, తత్త్వదర్శనముగాని, జీవిత చరమలక్ష్యమగు సహజావస్థగాని కలుగజాలవు.కనుకగురుడు మొదట తల్లియై ఆధ్యాత్మిక బలమొసగును.

ఆపిమ్మట "నగురోః సదృశః పితా" అనునట్లు గురువుతో సమానుడైన తండ్రిలేడు. కనుకనే "తండ్రి హరి జేరుమనియెడు తండ్రి తండ్రి" అని భాగవతోత్తముడగు ప్రహ్లాదుడనెను. కనుక మొదట తల్లిగానుండి బలమొసంగి పిమ్మట తండ్రిగానుండి చక్కని ఆచార విచారములను గఱపును. తండ్రియగువాడు తానాచరించిన పద్ధతుల యందు పుత్రు నెట్లు నియమించునో అట్లే గురువు తానాచరించి అనుభ వించిన విషయములను శిష్యులకు బోధించి ఆచరింపజేయును. కనుకనే

"ఆచినోతి హి శాస్త్రాణి ఆచారే స్థాపయ త్యపి।
స్వయ మాచరతే యస్మా త్తస్మా దాచార్య ఉచ్యతే॥"

అనగా "శాస్త్రము లభ్యసించి తత్ప్రకార మాచరించి ఇతరు లనుకూడ ఆచరింపజేయువాడే ఆచార్యు డనబడును." శిష్యునకు ఆత్మా భ్యుదయ శక్తిద్వారా ధైర్యస్థైర్య సామర్థ్యములనిచ్చి, సదా తన శిష్యుడు చక్కగా పరిశ్రమించి ఉన్నతానుభవముల నొంది ఆత్మధన మును సముపార్జించి దానిని లోకమునకు పంచిపెట్టెడి త్యాగశీలుడు

కావలెనని యే గురుడు సదా సంకల్పించుచు శిష్యుని హితమును గోరు చుండును.

"కులం ధనం బలం శాస్త్రం బాంధవాః సోదరా ఇమే ।
మరణే నోపయుజ్యంతే గురు రేకో హి తారకః ॥"

అనునట్లు ఐహికములగు కులము ధనము బలము శాస్త్రము బంధువులు సోదరులు మున్నగు నవేవియును మరణ సమయమున పనికి రావు. కాని "అహేతుక దయాసిన్ధు బంధు రానమతాం సతాం"-అన్న వాక్యానుసారముగా గురువు పరమబంధువై భవబంధముల నే ద్రుంచుచున్నారు. అనిత్యమగు సంసార విషయకూపమున బడి తెన్నుగానక తికమక పడియున్న సమయమున లౌకిక విషయములు అనిత్యములని హేతుదృష్టాంతములతో తెలియజేసి విషయాసక్తిని విడిపించి వైరాగ్యమును గల్గించు హితైషియగు ముఖ్యబంధువు గురువు. అజ్ఞానాంధకారమునబడి దారి దప్పినప్పుడు జ్ఞానదీపము నొసంగి దారిజూపును. ఆచారరహితులై అసభ్యజీవనముతో చరించు వేళ ఆదర్శజీవన విధానముల దెలిపి అవివేకమును బాపి దివ్యజీవనము నొసంగును. అనాత్మ భావములచే దరిద్రులై బాధలనుభవించుతరి తన సన్నిధి మాత్రము చేతనే దరిద్రకల్పనల దూరముజేసి బ్రహ్మభావ సంపద నొసగి రక్షించును. ఇంతకంటెను తన హితమునుగోరు మహాబంధువు ముల్లోకమున లేడు.

"శివక్రోధా ద్గురు స్త్రాతా గురుక్రోధాచ్ఛివో న హి ।
తస్మా త్సర్వప్రయత్నేన గురోరాజ్ఞాం న లంఘయేత్ ॥"

అనగా భగవంతుడొక వేళ కోపగించినచో గురుడు రక్షించగలడు. కాని గురుడు కుపితుడైనచో హరుడును రక్షింపజాలడు. కనుకనే "నగురోరధికం" అని చెప్పబడెను. పరమశివుడు నిరాకారుడు. అప్రత్యక్షుడు. గురుదేవుడన్నచో సాకారుడు; ప్రత్యక్షమైన సదాశివుడు. ఇట్టి ప్రత్యక్ష పరమేశ్వరుని కన్నులార చూడవచ్చును. చెవులార తనివి

దీర అతని ఉపదేశవాక్యముల వినవచ్చును. అతని సన్నిధిని మన మొప్పనడచుకొనవచ్చును. తృప్తిగా సేవింపవచ్చును. సాకారుడగు మనగురుని మహిమ అపారము. కాన గురుదేవు డాదిదేవుడు. దేవ దేవుడై యున్నాడు.

గురుశబ్దముననే నిజముగా ఒక గరిమ గలదు. అన్నిటికంటెను పెద్దదని అర్థము. అట్లుపెద్దపదార్థమేది యన భూమయే (బ్రహ్మమే) గాన గురునికంటె బ్రహ్మము వేరులేదు. ఇదియే ఆత్మ. ఇదియే పర మాత్మ; ఇదియే మనయందరి స్వరూపము. భక్తితో సదానిష్ఠసలుపుటే మనకర్తవ్యమని తలంచి మాతాపితృ బంధు దైవాత్మ స్వరూపుడగు ఏగురు మహానుభావుడు భక్తుల భజనార్థమై "గురుడె తల్లియు తండ్రి దైవము గురుడె సర్వము గురుడె యాత్మయనుచు సుస్థిర భక్తిసల్పు ము" అను తత్త్వమును రచించెనో అట్టి నాగురుస్వామి ఈనాడు అవ్యక్తరూపమున సర్వమయుడై భాసిల్లుచున్నాడు. అమ్మహనీయ మూర్తికి అనంత ప్రణామములు.

"చిత్తయక్షదృఢాక్రాంతం న శాస్త్రాణి న బాంధవాః।
శక్నువంతి పరిత్రాతుం గురవో న చ మానవాః॥"

అను వాసిష్ఠ వాక్యానుసారముగా కేవలమభ్యాసముచే కల్పింపబడిన చిత్తమనెడి బేతాళుని (మహామాయ) బారినుండి శాస్త్రములుగాని బంధువులు గాని మానవులుగాని రక్షింపజాలరు. కాని పరమేశ్వర స్వరూపుడగు గురుడన్నచో మాటమాత్రమున పారద్రోలి జన్మజరా మరణ బంధమూలమగు ఆధ్యాసికబుద్ధిని నిర్మూలించి పరమశాంతమగు ముక్తిసుఖమును కలుగజేసెను. అట్టి మహనీయమూర్తియగు నాగురు దేవుడీనాడు అవ్యక్తరూపమున సర్వమయుడై భాసిల్లుచున్నాడు.

బిడ్డ మరొకదాని ఆశ్రయమున పైకిలేచి నిలువబడి నడవ గలిగి నట్లు ఏగురు మహాశయుని పాదాశ్రయమున ఈ శిష్యుడు లేచి నిలువ గలిగెనో, ఇట్టి పీనిని నడపుటకై బ్రహ్మనిష్ఠుడగు ఏస్వామి తన కవ

సరము లేకపోయినను బ్రహ్మముహూర్తమున 4 గంటలకు ఘణఘణ ఘంటలు మ్రోగించి ఈ చిన్నస్వామిని శిష్యుని లేపి నిష్ఠ సలుపుకొనుమయ్యా యని తమ ఎదుట గూర్చుండబెట్టుకొనుచుండెనో అట్టి నా గురు స్వరూపము నేడు అవ్యక్తరూపమున సర్వవ్యాపకమై భాసిల్లుచున్నది.

ఏగురు మహానుభావుడు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడై శ్రోత్రియత్వముచే ప్రమాణగత సందేహముల, నివర్తింప జేయుచు బ్రహ్మనిష్ఠచే ప్రమేయగత సందేహముల దీర్చుచు, జ్ఞేయమగు బ్రహ్మము నీ ఆత్మయే, స్వస్వరూపమే-నిజరూపమేయని శిష్యులకు పరమకరుణ బోధించి అనుభవింపజేసెనో అట్టి శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడగు నా గురు దేవుడీనాడవ్యక్తరూపమున సర్వమయుడై భాసిల్లుచున్నాడు.

కం॥ "గురుముఖమున బడయక దు
ష్కరతపమున జేసి పడయగాబడువిద్యల్,
పరమార్థము పడసును మ
త్సరమును గావించునెట్టి సాధులకైనన్."

అను స్మృతి వాక్యానుసారము గురుముఖమున రానివిద్య, తద్జ్ఞానమును సాగరజలములు పానయోగ్యములు గానియట్లు అహంకార కామాది విశిష్టములయి యుండును. గురుముఖమున సంపాదింపబడిన విద్య మేఘముఖమునుండివచ్చినపావనగంగవలెపానయోగ్యమై అహంకార కామాదుల నివర్తింపజేయును. వేయేల! సంప్రదాయసిద్ధముగా గురుకృపాలబ్ధముగాని విద్య సాధువుగాదు.నిజశాంతి నివ్వదు.శ్రీ గురు కృపాలబ్ధమైన విద్య అనగా జ్ఞానము తన్నుతరింపజేసి తన్నాశ్రయించిన వారినికూడ తరింపజేయ సమర్థమై యుండును. "నావికుడు నావ యందుగూర్చున్నవారును ఎట్లు సుఖముగా ఆవలియొడ్డు జేరుదురో" అనునిట్టి సులభోపమానములచే బోధజేయుచుండిన శ్రీ ఉమామహేశ్వరగురుపీఠ సుసంపన్న సంప్రదాయ సిద్ధ సద్గురువగు కర్ణధారు

డవ్యక్తరూపమున సర్వమయుడై భాసిల్లుచున్నాడు.

గురుడు సంసార మహారోగైక హారకుడు. అందుచేతనే అతనికి భవరోగ వైద్యుడను బిరుదముగలదు. లోకమున వాత పిత్త శ్లేష్మాదుల వ్యత్యాసముచే గలిగెడి రోగముల బాపుటకు పెక్కు వైద్యులు గలరు గాని రోగములకెల్ల మూలమనదగిన గొప్పభవరోగము గలవానినాడి ఈవైద్యులకు దొరకదు. వీరి ఔషధము లచట పనికిరావు. కాన "భిషజే భవరోగిణామ్" పరిపక్వ మనస్సా అపరిపక్వ మనస్సా యని తెలియు భవరోగ వైద్యుడు శ్రీగురుడు. ఔషధము గురుపాదరసము. అట్టి గురుపాదరసము నొసగి భవబంధముల బాపిన నాగురుపరమాత్మ నేడవ్యక్తరూపమున సర్వమయుడై భాసిల్లుచున్నాడు.

"అద్వైతం భావయే న్నిత్యం సర్వావస్థాసు సర్వదా।
కదాచిదపి నో కుర్యాత్ అద్వైతం గురుసన్నిధౌ ॥"

అన్నట్లు హృదయ తాప నివారకము, భవసాగర తారకమునగు శ్రీ గురుచరణ సాన్నిధ్యముచే బడసిన మహోపకారము మరువరానిది. ఆ ఋణము తీర్పరానిది. కనుక సదాభక్తి భావమున వర్తించుచు గురుని పూజించవలెను. అద్వైతమును సర్వకాల సర్వావస్థలయందును సర్వము నందును భావించుచుండినను కేవలము గురుసన్నిధియందు మాత్రము తగదు. తత్త్వజ్ఞానమునకై మన మాతని శరణుజొచ్చి వారికృపచే తత్త్వమునుఎఱింగినను గురుసన్నిధిని కృతజ్ఞులమై పరమ పూజ్యబుద్ధిచే వర్తించుచుండవలెను. ఈ దేహమున్నంతవఱకు గురుఋణముతీరదు. అవిభాజ్యమగు అతని కరుణామయదృష్టి పాతములు మఱపునకురావు "యావదాయు స్త్రయో వన్ద్యా వేదాన్తో గురు రీశ్వరః" యను శ్రీశంకరాచార్యస్వామి వాక్యానుసారము జీవిత పర్యంతము గురు, వేదాంతము (ఉపనిషత్తులు), ఈశ్వరుడు వందనార్హులు. పూజనీయులు. ఈనిష్ఠను గురుభక్తులు వదలరాదు. అట్టి పరపూజ్యుడగు నా గురుదేవుడీనాడు అవ్యక్తరూపమున సర్వమయుడై భాసిల్లుచున్నాడు.

ఈక్షణధ్యానసంస్పర్శైః మత్స్యకూర్మవిహంగమాః।
పోషయంతి స్వకాన్ పుత్రాన్ తద్వ త్పండితవృత్తయః॥

అనగా చూపుచే చేపయు, స్మరణచే తాబేలును, స్పర్శచే పక్షియు తమతమ బిడ్డలను పోషించునట్లు తత్త్వజ్ఞానియగు గురుడు కూడ చూపుచేకొందరిని. తలంచికొందరిని, స్పర్శచేకొందరినిముక్తులజేయును. ఇంతియేగాక సూర్య చంద్రాగ్న్యాది మండలములచేతను, నశింప జేయశక్యముగాని నాహృదయాంధకారమును తత్త్వమసీత్యాది మహా వాక్యప్రబోధయనెడి వెలుగుచే బాపిన చిజ్జ్యోతి గురుదేవుడు.మరియు వేదములకు తెలియరాని యోగులకందని, తపస్సులకు దొరకని ఆ పర తత్త్వమును అనాయాసముగ అది నీవయియున్నావని కరుణచే సారె సారెకు తెలుపుచు నన్ను ధన్యునిజేసిన మహాసమర్థుడగు దక్షిణా మూర్తి నాగురుదేవు డీనాడు అవ్యక్తరూపమున సర్వమయుడై భాసి ల్లుచున్నాడు.

భాగవతమున పోతనామాత్యుడు భగవంతుని సేవించిన (కమ లాక్షు నర్చించు కరములు కరములు ఇత్యాది) దేహేంద్రియములే యోగ్యములని చెప్పిన పగిది శ్రీగురుపరమాత్మను దర్శించిన కన్నులే కన్నులు, అతని వచనములు విన్న చెవులే చెవులు, అమ్మహనీయ మూర్తిని స్తుతించిన జిహ్వయే జిహ్వ, అతనిని సేవించిన కరములే కర ములు, అతడొసంగిన మహామంత్రమును తత్త్వమును అనుసంధాన మొనర్చిన మనస్సే మనస్సు. ఆ పరమపూజ్యుని పాదములపై నుంచి నతులొనర్చిన శిరమే శిరము.అట్టి భక్తజనవంద్యుడై సదా సంసేవ్యు డయిన నాగురుదేవు డీనాడు అవ్యక్తరూపమున సర్వమయుడై భాసిల్లుచున్నాడు.

"కాశీక్షేత్రం నివాసశ్చ జాహ్నవీ చరణోదకమ్ ।
గురు ర్విశ్వేశ్వరః సాక్షాత్ తారకం బ్రహ్మ నిశ్చయమ్॥"

శ్రీగురుస్వామి నివసించుస్థానమే కాశీక్షేత్రము; అతని చరణోదకమే పవిత్రగంగ; అతడే సాక్షాద్విశ్వేశ్వరుడు; బ్రహ్మాత్మబుద్ధియే తార

కము. కనుక గురుమహాత్ముడు అడుగులిడిన స్థలములే పుణ్యక్షేత్రములు అతడు తాకిన వస్తువులే పరమ పవిత్రములు అతని దృష్టిప్రసారమొందిన ప్రాణులెల్ల ధన్యులే. సూర్యకిరణము లంతట వ్యాపించియుండినను తలుపులు తెరువబడి యుండిన గృహమున మాత్రమే కిరణములు ప్రసరించునట్లు, గురుకటాక్ష వీక్షణమను కిరణములు అంతట వ్యాపించియున్నను, శ్రద్ధా, భక్తిప్రపత్తులతో నీతినియమ సదాచార సన్నిష్ఠలతో కూడి ఎవని మనోద్వార కవాటము తెరువబడియుండునో అట్టి ఉత్తమభక్తులగు ముముక్షువుల హృదయములందెల్ల గురుకృపా కటాక్ష వీక్షణ కిరణ ప్రసారము కలుగగలదు. తోడనే అజ్ఞానాంధకారము భగ్నమై అఖండ సుఖమనెడి జ్యోతి వెలుగును. మరియు గురుకృపయనునది ధర్మమేఘము వంటిది. నిర్మలాంతఃకరణమను క్షేత్రమున అనగా అదనుజేసి విత్తనములుంచబడిన భూములందీవర్షధారలు పడిన చక్కనిఫలము పండును" అను నిట్టి ఉపమానోపమేయములతో సదాశిష్యకోటికి తెలుపుచుండిన అనుపముడగు నాగురుదేవుడీనాడు అవ్యక్తరూపమున సర్వమయుడై భాసిల్లుచున్నాడు.

"ధ్యానమూలం గురోర్మూర్తిః పూజామూలం గురోఃపదం ।
మంత్రమూలం గురోర్వాక్యం ముక్తిమూలం గురోఃకృపా॥

అనునట్లు సర్వము గురుడే అన్నిధ్యానములకంటెను గురుధ్యానమే శ్రేష్ఠము. అన్నిపూజలకంటెను శ్రీగురుపాదపూజయే అధికము. సర్వమంత్రములకంటెను గురువాక్యమే శ్రేష్ఠము. శ్రీగురుకృపయే ముక్తికి మూలము.

అనునీమున్నగు అనేకవిషయములను మైమఱచి భక్తిపరవశులై శ్రీవారు సెలవిచ్చిరి. శ్రీసద్గురు కృపామహిమను దలచి తలచి సొమ్మసిల్లి సభికులను దుఃఖ సమ్మిశ్రితమగు ఆనందాశ్రుధారల ముంచి తేల్చిరి. పావుగంట సేపందరును అంజలిబద్ధులై శాంతముగా మౌనము వహించి గురు నెదతలంచి శ్రద్ధాంజలి యొసగి ఇట్లు మంగళమును పాడిరి.

శంకరాభరణము — ఆటతాళము.

మంగళం శ్రీసదానందార్య ప్రజ్ఞానధుర్య ।
సంగరహితాత్మైకధీచర్య । సద్గురువర్య । ॥ప॥

మంగళాంగ । కృపాంగ । దురితవిభంగ । త్రిగుణాసంగ
పరమప్రసంగ। ఆత్మసుసంగబుధనుత । మంగళం భక్తాంతరంగ ॥అను॥

వాసనా త్రినాశక సదయ। నిర్మలహృదయ। దోషతిమిరహరాయ। తత్త్వమయ। పరచింతనాయ। పోషితాఖిలసుజనగణ। భవపాశనాశ। సుయోగనిద్రావేశ। నిరతనిమీలితాక్ష। శాశ్వతానందప్రకాశ॥ ౧.

తలప నష్టాదశశతాబ్దములన్ మఱి డెబ్బదైదౌ శాలివాహనశకమునందునను। లలి విజయకార్తిక బహుళఏకాదశీతిథియందున్। విలసితంబుగ భౌమవారంబలవడగ నిర్వాణమొందియు। మలరహిత బ్రహ్మంబవైకడు వెలయు సచ్చిత్సుఖ స్వరూప ౨

మోదయుత గంజిగుంటనివాస। సదమలవికాస। భేదరహిత। విరక్తసువిలాస ప్రజ్ఞానభాషా। ఆదిసంవిద్బోధచే శ్రీస్వామిశంకరానందగిరివరు। సాదరంబునబ్రోచితివి శ్రీపాదనారాయణ కవినుత॥ 3

ఓం రాజాధిరాజాయ ప్రసహ్య సాహినే । నమో వయం వై శ్రవణాయ కుర్మహే । సమేకామాన్‌కామకామాయమహ్యమ్ । కామేశ్వరో వై శ్రవణోదదాతు । కుబేరాయ వై శ్రవణాయ మహారాజాయ నమః॥

ఓం శాంతిః శాంతిః శాంతిః.

## శ్రీగురు మహారాధన

అనంతరము మార్గశిర శుద్ధపూర్ణిమ (తే. 20.12.1953) ఆదివారమునాటికి శ్రీవారు నంద్యాల భక్తాదులతోగూడి గంజిగుంట మఠమునకు విచ్చేసిరి. శ్రీఉమామహేశ్వర గురుపీఠ పరంపరా సంప్రదాయ భక్తులెల్లరు చేరిరి. శ్రీవారు తమ చేతులార మహాసమాధికి కాశీగంగాభిషేకాదులచే విధ్యుక్తముగా పూజగావించిరి. యావచ్ఛిష్యమండలియుగురుపరంపరా స్తోత్రపాఠములతో మంత్రపుష్పము మంగళహారతుల సమర్పించిరి. పిదప జయ జయ ఘోషములతో

మంగళాచరణ పూర్వకముగ సభ ప్రారంభమయ్యెను ప్రశాంతముగ శాస్త్రప్రవచనములు జరిగెను. ఈసమయమున శ్రీవారు గురువాక్యమునందలి శ్రద్ధ అను శీర్షికపై అపూర్వముగ ఉపన్యసించిరి. గ్రంథ విస్తర భీతిచే ఇచట ఆవిషయమును చేర్చలేదు.

పిదప అన్నసంతర్పణాదులతో శ్రీగురుస్వామి పుణ్యారాధన పూర్ణమాయెను. మరియు అప్పుడచ్చట చేరియున్న గురుభక్తులందఱును శ్రీమన్మహాసమాధిపై స్వర్ణచిహ్నములచే నొప్పు సచ్ఛిలను స్థాపించి అందు నర్మదాబాణము, కాశీశివలింగ ప్రతిష్ఠ జేయించవలెనని పునరపి సభజేసి నిర్ధరించిరి. ఆ వెనువెంటనే రెండువేల రూపాయలకు పైగా వాగ్దానములు జరిగెను. ఇట్లు ముందు కార్యము నిర్ణయింపబడిన పిదప శ్రీవారు వెంటనే బెంగుళూరులో శిలను తయారు చేయించుటకై కొంతధనమును తీసుకొని తాము బెంగుళూరుకు దయచేసిరి. తక్కినవారు తమతమ నెలవులకేగిరి.

## శ్రీమళయాళ మహర్షి సందర్శనము

శ్రీస్వామివారు గంజిగుంట శ్రీమఠమునుండి బయలుదేరి బెంగుళూరు బ్రహ్మవిద్యాశ్రమము జేరి ఈశిలల విషయమై విచారించి చివఱకు నచ్చిన ఒక గొప్ప కార్ఖానాలో శిలను తయారుచేయుటకు ఆర్డరొసగిరి. మామూలుగా స్వామి శ్రీబ్రహ్మవిద్యాశ్రమమున పూజానుష్ఠానశాస్త్ర ప్రవచనాది నిత్య కార్యక్రమములను నియమముగా జరుపుకొనుచు సుఖముగా నుండిరి. అంత కొన్నిదినములకు ఆంధ్రదేశమున ఆదర్శమైన శ్రీవ్యాసాశ్రమ స్థాపనాచార్యులగు సర్వజన హితైషులు, పరోపకారపరాయణులు, సంసార మహారోగైకశామకులు, శుష్కవేదాంత తమోభాస్కరాది బ్రహ్మగ్రంథ రచయితలును ఋషిసంప్రదాయ కర్తలును ప్రవర్తలును ముముక్షువులగు నరనారీమణుల నుద్ధరించిన వారునగు శ్రీఅసంగానందగిరి యతివర్యులును అన్వర్థనామ

ములచే విలసిల్లుచున్న పూజ్యపాద మహర్షి మలయాళస్వాములవారు (29.4.54) బెంగుళూరుకు దయచేసిరి.

ఈసమయమున మన చరిత్రనాయకులగు శ్రీస్వామివారు ప్రతి దినము శ్రీమహర్షిసన్నిధికి గీతాప్రచారమందలి బెంగుళూరు—1. వెళ్ళుచు వారిబోధల వినుచుండిరి. మహర్షిగారిని తమ బ్రహ్మవిద్యాశ్రమమునకు దోడ్కొని రావలయునని తమ ప్రియులగు శ్రీపండితరాజ గుప్తగారితో కలసి మహర్షిసన్నిధికి వెళ్ళి తమ యభిప్రాయమును సవినయముగా తెలియజేసిరి. అందుల కమ్మహాత్ములు చల్లనిచూపులతో శాంతిమయ వాక్కులతో, "మంచిది, పూర్వము శ్రీరామచంద్రుడు అడవిలో పర్యటించు సమయమున అచ్చటచ్చటగల పుణ్యాశ్రమములకు వెళ్లుచు అందలి పవిత్రవాతావరణములను పరిశీలించి సంతసించుచుండెనట ! అటువలె మీఆశ్రమమునకు రేపు ఉదయము 9గంటలకు వచ్చెద"మని సెలవిచ్చిరి. పిదప వందనము లాచరించి స్వామి తమ ఆశ్రమమునకు విచ్చేసి తగు నేర్పాట్లు గావించిరి.

నిజముగా మహర్షిగారి వాక్కు పవిత్రము,సార్థకము. శ్రీరామచంద్రమూర్తి లోకశాంతికొఱకై పర్యటించుచు రావణాది రాక్షసుల దునుమాడి లోకహితమెట్లొనర్చెనో, అటులనే పూజ్యశ్రీమలయాళ మహర్షివారు భక్తుల కామరాగాది శత్రువులను నివృత్తిపఱచిశాశ్వత శాంతిని గల్గించుటకై పర్యటించుచు సాక్షాత్ రామచంద్ర మూర్తియోఅనునట్లు శ్రీబ్రహ్మవిద్యాశ్రమమునకు విచ్చేసిరి. మహర్షివారిని మిక్కిలి వైభవమగు మర్యాదలతో తోడ్కొని వచ్చి తగువిధముల సత్కరించి ద్రాక్షాపాకమనదగు శ్రీవారి బోధనలను విని ముముక్షువులు పరమానందము నొందిరి. మనశ్రీవారి విద్యా వినయ సౌజన్యాదుల నెంతయు నుతించుచు సంతసించిరి. ఆశ్రమ దివ్యభవనమును భక్తుల భక్తిప్రపత్తులను గని మహర్షి అమందానందము నొందిరి.

మరల మనశ్రీవారు గీతామందిరమున మహర్షిసన్నిధికి వెళ్ళి

ఏకాంతముగా దర్శించిరి. అప్పుడు శ్రీమలయాళ యతీంద్రులవారు నిర్హేతుక ప్రేమతో నిట్లు పదేశించిరి. "మిమ్ము జూచిన మాకు పరమ సంతోషము. సంతతము బ్రహ్మనిష్ఠ నలుపుచుండుడు. పాతంజల యోగ సూత్రముల చక్కగా అధ్యయన మొనర్చుడు. సూత్రములు కంఠస్థము గావించినచో మిక్కిలి మంచిది. మీ ఆచార విచారములు ఆదర్శ ప్రాయములు ఇంకను అభివృద్ధిగాంచుడు. లోకమున కొన్ని విషయములు తనకు తెలియకనే వచ్చి దాపరించును. మొదట మహాభక్తియా యనితోచును. ఆపిదప భక్తిపోయి విపరీత రూపమున పరిణమించి ప్రకృతియై ఎదుట నిలుచును. భయంకరమై దుఃఖదాయకమై మోసగించును. అట్టివానియెడ ప్రమత్తతలేక ఒళ్ళంతయు కళ్ళుగలిగి చూచుకొను చుండవలెను. ఒకప్పుడు ప్రకృతి గుణములచే చలింపని స్థితి మీయందున్నను ప్రమత్తతో నుండరాదు. అప్రమత్తులై ఆత్మారాములై మీయందు మీరుండవలెను. ఈ మీ ఆకృతిచేనుండు ఇంజను చాలామంచిది. ఎక్కువగా పెట్టెలను లాగుకొనిపోవును భయము లేదు. గమ్యస్థానము చేర్చును. ఓం.

ఇంతియేగాక మన శ్రీవారియెడ మిక్కిలి వాత్సల్యము గలవారై మహర్షిగారు తమ "యధార్థ భారతి" అను వేదాంత మాస పత్రికను పరమకరుణతో ఆశ్రమమునకు పంపెదమని సెలవొసంగిరి. అవ్యాజ ప్రేమాంబునిధులగు శ్రీమహర్షి పూజ్యపాదులు బెంగుళూరు నుండి బయలుదేరి వెళ్లునపుడు "మలయాళయతీంద్రగీత" అను గ్రంథమును ఆశీఃపురస్సరముగా అత్యంత ప్రేమాదరములచే శ్రీవారికి ప్రసాదించిరి. శ్రీవారిని తమముందు కూర్చుండబెట్టుకొని ప్రవచనము ప్రారంభించుచుండిరి. శ్రీమహర్షులు మహావాత్సల్య స్వరూపులు.

## శ్రీగురుమహాసమాధి శివలింగస్థాపన

ఆపిదప కొన్ని నెలలకే సమాధి శిలలు తయారయ్యెను. వానిని గంజిగుంట మఠమునకు సాగించుకొని వెళ్లుటకై తగిన ఏర్పాట్లుచేసి

23.5.54 వ తేది పూజ్యస్వామివారు ప్రయాణమై గంజిగుంట మఠమునకు విచ్చేసిరి. నాటిరాత్రియే శివలింగప్ప, నరసింహయ్య శిలలను లారీద్వారా సాగించుకొని ఉదయము 10 గంటలకు గంజిగుంటకు వచ్చిరి. ఈసందర్భమున బ్రహ్మవిద్యాశ్రమముయొక్క కొందఱుత్తమ భక్తులు గావించిన గొప్పసహాయము చిరస్మరణీయము. దాదాపు 180 మణుగుల బరువుగల ఆ శిలలను గర్భాలయమున స్వస్థానమందు చేర్చుట మిక్కిలిదుస్తరమయ్యెను. తగిన పరికరములేవియును ఇచట లేవు. కాని శ్రీగురుపరమాత్మ దొడ్డవాడు గాన,

"మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిం,
యత్కృపా తమహం వందే పరమానందమాధవమ్॥

అన్నట్లు, తగిన శక్తిచాలని అచ్చట నున్న ఆ కొందరికే శక్తినొసంగి వారిద్వారా ఆ శిలలను ఉపాయమున నిరపాయముగా తన స్వస్థానమున చేర్చుకొనియె. మఠమును మిక్కిలి శోభిల్లజేసె. అతడుకర్తుమకర్తుమన్యథాకర్తుం సర్వశక్తి సంపన్నుడుగదా ! ఇట్టి గురుపరమాత్మ భక్తులయండనుండ భయమేమి ? తనకార్యముల తానే అనాయాసముగ చేయించుకొనును. అతనిని నమ్మినవారికెట్టి విఘ్నములురావు.

పిదప శ్రీవారు ఆశ్రమముననే వసించుచు ముందు గురుకార్యమునకు వలసిన తగిన ఏర్పాటులు గావించుచు శ్రీజయసంవత్సర జ్యేష్ఠ పూర్ణిమా (తే. 16.6.54) బుధవారము ప్రతిష్ఠామహోత్సవమని ముహూర్తము నిర్ధరించిరి. పత్రికల ముద్రింపించి అందరికిని పంపిరి. కార్యక్రమమున కాహూతులగు శ్రో॥బ్ర॥ శ్రీశంకరానంద స్వాములవారు (శ్రీశంకరశాస్త్రి స్వాములవారు సురపురం) పూజ్యపాదశ్రీశ్రీ శ్రీ శుద్ధచైతన్య స్వాములవారు మున్నగు పెక్కు మహాత్ములు, భక్తులు, శ్రీఉమామహేశ్వర పీఠముయొక్క యావచ్ఛిష్య మండలియు సకాలమున విచ్చేసిరి. ఈపూజ్య మహాత్ముల అమృతహస్తముల ద్వారా నిర్ణీత ముహూర్తమున వైదిక విధానములతో సక్రమ

ముగ మహా సమాధిపై శివలింగ ప్రతిష్ఠ గావింపబడెను. ఈవైదిక కార్యక్రమము లన్నియు బెంగుళూరు బ్రహ్మశ్రీ విద్వాన్ ఎస్. రాజగుప్తగారిచేతను, మరియు వజ్రకరూరు వే॥మూ॥ ఎం.గాదిలింగశాస్త్రి గారిచేతను యథావిధిగా నిర్వహింపబడెను.

వెంటనే జయజయధ్వానములతో అఖండ శివపంచాక్షరి మహామంత్రభజన ప్రారంభమై రెండుదినములు జరిగెను. ప్రతిదినము భగవద్గీతా పారాయణము, శ్రీరుద్రాభిషేకము, సహస్రనామార్చన, సర్వోపచార పూజాదులు సకాలమున జరుపబడెను. వచ్చిన పూజ్యపాదులగు మహాత్ములు మున్నగువారిచే ఇరుపూటలు వేదాంతోపన్యాసములు, అఖండముగ జరుపబడెను. గురుభక్తి, వేదాంతతత్త్వనిష్ఠయును...నిత్యాది విషయములు విపులముగ శ్రోతృజనానందకరమై జరుపబడెను. వేలాదిగా భక్తులు చేరియుండిరి.

## గురుపీఠ సమారోహణము

ఈజయసం॥ జ్యేష్ఠశుద్ధ పవిత్రమైన పౌర్ణమినాడు మహనీయుల ఉపన్యాసానంతరము బ్రహ్మనిష్ఠులగు పూజ్యశ్రీ శంకరశాస్త్రిస్వాముల వారు మన చరిత్రనాయకులగు శ్రీశంకరానందగిరి స్వాములవారితో,

"స్వామీ! ఇంతవఱకు తమ గురువులుండిరి. ఇక తమరు అన్ని విధముల యోగ్యమైన విద్యావినయ తపశ్శమదమాది శక్తి సంపద్విశిష్టులగు యతివర్యులు. కావున సంప్రదాయానుసారముగా, నేడుగురుపీఠము నధిష్ఠించి భక్తులగు ముముక్షువులకు గురు సంప్రదాయకముగ వచ్చిన మహామంత్రమును ఉపదేశించి శ్రీగురుసంప్రదాయ ప్రవర్తకాచార్యులుగ నుండవలయునని మా సదిచ్ఛ" అని పలికి స్వామిని గాఢాలింగన మొనర్చుకొనిరి. పూజ్యపాద శ్రీశుద్ధచైతన్యస్వాముల వారును,

"స్వామీ! ఇందులకు తమరంగీకరించియే తీరవలెను. తమయందా గురుత్వ మున్నది. నిజముగా శ్రీశంకరానందగిరి గురువరులే

తమరు ఓంతత్సత్" అంగీకరించియే తీరవలయునని పలికిరి.

వెంటనే అచటనున్న తక్కినవారును పైమాటలే చెప్పనారంభించిరి. అప్పుడు మనస్వామివారు వినీతభావమున,

"ఇంత పెద్దపనియా! అనిరి. అంతలోనే స్వాములు మున్నగువారందరును,

"ఔను, పెద్దవారికి పెద్దపనియే" — అని శాసించిరి.

ఇట్లు అనుల్లంఘనీయములైన మహాత్ముల వాక్యములను విని, "ఇది శ్రీ గురునాజ్ఞ" — అని తలంచి "కార్యకర్తగురుడే" అని నిశ్చయించి, ఓంతత్సదనుచు, మహాత్ములకు సాష్టాంగ దండవత్ప్రణామములాచరించిరి. ముందు సంసిద్ధము కావలసిన వైదిక కార్యములన్నియు చూచుకొని సిద్ధపఱచిరి. శ్రీవారు మంగళస్నానమాచరించి, మఠమున మహాసమాధికి ప్రదక్షిణ నమస్కారములు గావించి, సర్వోపచార పూజాది ద్రవ్యములచే అలంకరింపబడియున్న పీఠమునధిష్ఠించిరి. శ్రీమదుమామహేశ్వర గురుపరంపరాస్తోత్రమునుజేసి శాస్త్రోక్తమగు విధులచే మహాత్ములసన్నిధిలో శ్రీవారిపై పుష్పవృష్టి గురుపించిరి. పూజ్యపాద "శ్రీ శ్రీ శ్రీ శంకరానందగిరి గురుస్వామి బహుపరాక్" అని జయజయధ్వానములచే మహామంగళమాయెను. గురుసంప్రదాయముగా వచ్చిన శ్రీగురు మహామంత్రమును కొందఱుత్తమ భక్తులకు స్వామి ఉపదేశించిరి. కార్యక్రమములన్నియు మంగళప్రదముగ నడచెను. నేటినుండియు శ్రీస్వామివారిని శ్రీశంకరానందగిరి గురుస్వాముల వారని బిలుచుచుందురు.

గంజిగుంట శ్రీమఠమున మహాసమాధి పూజావగైరా కార్యములను నిర్వహించుటకై తగిన ఏర్పాట్లు గావించిరి. అనుదినము శ్రీ సదానంద సద్గురుస్వాములవారి శిష్యులగు కె. వీరప్ప అను సద్గుణవంతులను శాస్త్రప్రవచనము చేయులాగునను, తక్కిన సర్వవ్యవస్థలను శ్రీ వెంకటప్ప, కె.నాగప్ప, శివలింగప్ప మున్నగు భక్తాదులు నిర్వహించు

కొనునట్లు ఏర్పఱచిరి.

పిమ్మట తమ సంప్రదాయ ముఖ్యస్థలమగు రెందుమైళ్ళ సమీపమున నుండు రాగులపాడు అను గ్రామమున గల శ్రీప్రణవాత్మానందాశ్రమమునకు వెళ్ళి దర్శనమొంది ఆనాడే (18-6-54) మహాత్ములందరితో కలిసి కుందనగుర్తి శ్రీ శివలింగాశ్రమము చేరిరి. అచటి వాతావరణమును ఏకాంతవాసమునుగని ఈ వచ్చిన మహాత్ములందరును మిక్కిలి సంతసిల్లిరి. పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శుద్ధచైతన్యస్వాములవారి అమోఘోపన్యాసమును జరిగెను. మరునాడు అందరు తమ తమ స్థానములకు చేరుకొనిరి. మన పూజ్యపాదులగు శ్రీశ్రీశ్రీ శంకరానందగిరి గురుస్వాములవారు ఈ పవిత్రస్థానముననే నివసించుచు నియమముగా శాస్త్రప్రవచనాదుల గావించుచు పరమసుఖముగా బ్రహ్మనిష్ఠతో నున్నారు.

శ్రీమదుమామహేశ్వరగురుపీఠ పరంపరాగతపూజ్యాభిపూజ్య శ్రీమత్సదానంద సద్గురుస్వామి కరకమల సంజాత శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీమత్పూజ్యపాద శ్రీమచ్ఛంకరానందగిరి గురుస్వామి వరేణ్యులు, సనక సనత్కుమారాదులవలె ఆ జన్మ సిద్ధమైన నిర్మోహ జ్ఞానైశ్వర్య సంపన్నులగు మహాపురుషులు. వీరికి కాంతా కనకములయందు వైరాగ్య మనునది సాధన యోగము కాదు; సహజ సిద్ధము. శ్రీవారి ప్రబోధలలో ప్రతిమాటయు ఆత్మజ్ఞాన సంపుటీకరణమై యుండును. స్వామి జీవనమును తిలకించు సజ్జనులు జ్ఞానులు కాకతప్పదు. స్వామి విధ్యుక్తముగ గురుసన్నిధి గురుశిక్షణనొంది త్రికరణములచే సేవ యొనర్చి గురుకృపకు పాత్రులయిన వారు. శ్రీకాశీ క్షేత్రమున ప్రస్థానత్రయ భాష్యశాంతి నొందినవారు. శ్రీమదుమా మహేశ్వర గురుపీఠ పరంపరా భక్తుల భక్తి భావనానుసారము గురుపీఠ సమారోహణ మొనర్చినవారు. శ్రీవారు ఇపుడు ప్రబోధరూపమున గురుసేవ చేయుచున్నారు. ఆనాడు శ్రీవారి పూర్వాశ్రమమున బాల్యము నందు ఉపనయన సంస్కారానంతరము ఉపదేష్టలగు కుల

గురువులు మన శ్రీవారిని వీక్షించుచు "నాయనా! నీముఖ ముద్రను జూడ ముందు నీవు గొప్ప గురుపీఠమునధిష్ఠించు స్వామివౌదువయ్యా" యని పలికిన పలుకులు నేడు సార్థకమాయెను.

శ్రీవారు ఆంధ్ర కర్ణాటక సంస్కృత హిందీభాషల యందు ప్రమాణగ్రంథముల ననేకములు చక్కగ పరిశీలించినారు. వినిర్మల సాహిత్యరసప్రియులు. ఇట్టి పూజ్యశ్రీవారు శ్రీశివలింగాశ్రమముననే యాసంవత్సరము శ్రీచాతుర్మాస్య మహావ్రత మాచరింప భక్తుల ప్రార్థనానుసార మంగీకరించి నిర్ధరించిరి. అచ్చటిభక్తుల కెనలేని ఆనంద మాయెను. మున్ముందే అన్ని వ్యవస్థల నేర్పఱచుకొన యత్నించిరి.

లత్తవరమునుండి కె. బండెయ్య యను వటువు (ఇతడే ముందు శివానందస్వామి) బ్రహ్మచారి శ్రీవారిని దోడ్కొని వెళ్లుటకుగాను కుందనగుర్తికి వచ్చి వినయమున గురువులు లత్తవరమునకు విజయం చేయ ప్రార్థన యని విన్నవించుకొనెను. ముదమలర శ్రీవారు మంచి దని అంగీకరించి 21-6-54 దయచేసిరి. శ్రీవారాగ్రామము వెళ్ళక బహు కాలమై యుండెను. పురజనులెల్లరు ఎంతో భక్తితో స్వామికి స్వాగత మొసగి శివాలయమున సన్నిధి గావింపచేసిరి. కె. ఈశ్వరగౌడు, వి. హనుమప్ప, బి. ఆంజనేయలు (ఇతడే చిన్నతనమున స్వామివెంబడి అడవికి వెళ్ళినవారు) బి. చంద్రప్ప, బి. నాగప్ప, డి. వీరభద్రయ్య, పాటిల్ రామనగౌడు బి.ఏ. మున్నగువారందరు శ్రద్ధచే అన్ని కార్య ములను చూచుకొనిరి. సర్వులు స్వామి సందర్శనముచే సంతసిల్లిరి.

శ్రీవారు తమ నిత్యనియమ పూజానుష్ఠానాది వైదిక విధానము లతో ఉదయము సాయంకాలములయందు భజగోవింద స్తోత్రార్థ వివరణ, గీతాప్రవచనములు గావించిరి. భక్తిజ్ఞానవైరాగ్యోపేతమగు ఆప్రబోధ మెంతయు ద్రాక్షాపాకమువలె సులలితమై ఆప్యాయమాన ముగ నుండెను.

(శ్రీవారు ప్రవచనానంతరము గురుభక్తులతో ప్రత్యేకముగ

ముచ్చటించిన విషయములను ఇచ్చట కొన్నిటి నుల్లేఖించెద. ఇటువలె స్వామి ఆయాస్థానములయందు శ్రవణానంతరము ప్రత్యేకముగ భక్తులతో ప్రసంగించిన విషయములు ఆ యా ఘట్టములయందు ఉదహరింపబడి యుండునని పాఠకులు గ్రహించవలయును.)

పరమేశ్వరుని శరణు జొచ్చినవారి నడవడియం దెప్పుడును తొట్రుబాటుండదు.

వైరాగ్యము కొఱవడిన మానవులయందు విషయానందములు చవిజూపి ఆధ్యాత్మికశక్తిని నిర్బల మొనర్చును.

అభ్యాసముచేతనే నీమంచి, చెడ్డలు అలవాటైనవి. అందులో మంచి నభ్యసించుట, మానవులధర్మముకదా! తెలిసివర్తించుడు.

వివేకియగువాడు ఇతరులనుండి తనకు గలిగిన యుపకారము నెప్పుడునుమరువడు.అపకారము నొకప్పుడును స్మరింపడని తెలియుము.

అపరోక్షాత్మానుభవము లభించునంతవరకు విచారణ అత్యంతావశ్యకము.

ముముక్షువులగు వారెప్పుడును లోకుల స్తుతి, నిందలకు లోబడరాదు. వారెంత సులభముగా స్తుతింతురో, అంత చులకనగ నిందజేతురు. మీ మనఃస్సాక్షి యొప్ప సత్య శీలములు గలవారై మెలగవలయును.

సాధకులగు ముముక్షువులెంత తక్కువగ మాట్లాడిన నంత యాధ్యాత్మిక బలమును చేకూర్చుకొన్న వారలగుదురు.

అగ్ని నరమరలేక వాడిన నంతటిని భస్మము చేయునట్లు అజ్ఞుల చిరసాంగత్యమున ఆదర్శజీవనము కలుషితమగును. గాన జాగ్రతగలిగి వర్తించవలెను.

నిండుగ తల్లిపాలుద్రావి యరమరలేక నిద్రించుబాలుని భంగి, బ్రహ్మానంద ప్రపూర్ణులగు బ్రహ్మావిదుల హృదయమున, వాదోపవాదములకు, రాగద్వేషములకు తావుండదు.

మానసిక వృత్తులు కలుగకయు, మనస్సు లయింపకయు నుండు మహాస్థితియే నిజమైన మౌనము, లేక సమయమునకు తగినంత హితము గను, సత్యముగను మాటలాడుటయు మౌనమే.

బ్రహ్మమున్నదని తెలియుట పరోక్షజ్ఞానము, నేనే బ్రహ్మమని తెలియుట అపరోక్షజ్ఞానము.

శ్రీగురుదేవు లిచ్చట శ్రీఉమామహేశ్వర పాఠశాల యని శ్రీ గురుపీఠనామముచే నొక పాఠశాలను స్థాపించి శ్రీతత్వానందులను అధ్యాపకులుగ నియమించిరి. ప్రతిదినము శాస్త్రశ్రవణము జరుపు కొనుచుండవలయునని శ్రీవారాదేశించిరి. పిదప శ్రీవారు కుందనగుర్తి శ్రీశివలింగాశ్రమమునకు దయచేసిరి.

## ప్రబోధ షట్టము

## 10.వ శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1954 సం॥

శ్రీజయనామ సంవత్సర ఆషాఢ శుద్ధ ౧౧ ఆదివారము (11.7.54) బ్రహ్మముహూర్తమున భక్తులందరుచేరి ప్రభాతసేవ యొనర్చి మంగళవాద్యములచే పావనగంగాకలశమును దెచ్చిరి. పిదప వేద మంత్రపఠనచే విధ్యుక్తముగ కలశస్థాపన, శ్రీగురుపూజ, శ్రీచంద్ర మౌళీశ్వరపూజ, శ్రీవ్యాసపూజ మహాన్యాసపూర్వక శ్రీరుద్ర పురుష సూక్తాది వైదికవిధులు నడచెను. ఆపిదప భగవద్గీత అష్టాదశాధ్యాయ ముల పారాయణము, ప్రత్యేకముగ ఉపనిషద్బ్రహ్మ సూత్రముల పారా యణము జరిగెను. శ్రీగురుస్వాములు కొంత తడవు మంగళాచరణాత్మక ముగ ఉపనిషత్ప్రవచన మారంభించి నాటి ప్రాతఃకాల కార్యక్రమ మును మంత్రపుష్ప మహామంగళములచే పూర్ణముగావించిరి.

సాయంకాలము 4 గంటలనుండి 5.30 గంటలవరకు శాంకర భాష్యము శ్రీమద్భగవద్గీతా ప్రవచనము గావించిరి. మహామంగ ళము, ప్రసాద వినియోగమాయెను.

అనుదినము శాస్త్రశ్రవణాదులకు వందలాది జనులు చిప్పగిరి నేమకల్లు, బెళడోణ, నగరుడోణ, నంద్యాల, గుంతకల్లు మున్నగు స్థలములనుండి వచ్చి శ్రవణముచేసి వెళ్ళుచుండెడివారు. ఏతద్వ్రత మధ్యకాలమున పూజ్యపాదులగు ఆళ్ళగడ్డ శ్రీశ్రీశ్రీ శంకరానంద స్వామి, గండిక్షేత్రం శ్రీరామకృష్ణానందస్వామివారు దయచేసి తమ ఉపన్యాసములు సలిపిరి. కొందరు దూరప్రదేశమునుండి వచ్చిన భక్తాదులు అచ్చటనే కొన్ని దినములుండి వెళ్లుచుండెడివారు. 4మాసములు 4 ఘడియలవలె నయ్యెనని యచ్చటి పరిసర ప్రాంతముల భక్తాదులనుకొనుచు బరమసంతోషము నొందుచుండెడివారు.

దీక్షా విరమణమునకై శ్రీవారు భక్తులతో గూడి 10-11-54 పూర్ణిమ బుధవారము అచ్చటికి సమీపమున నుండు సంగమేశ్వర క్షేత్రమునకు వెళ్ళి పూర్ణముగావించిరి. ఆపిదప శ్రీవారి శిష్యులగు గుంతకల్లు శ్రీకోదండరామస్వామి ఆలయ నిర్మాతలు శ్రీమాన్ ఎ. రామప్ప, కుంllసౌll గౌరమ్మ వీరు శ్రీస్వామివారిని పరమ భక్తిశ్రద్ధలతో "గురుదేవా! మాప్రార్థనను మన్నించి తాము గుంతకల్లుకు దయచేసి శ్రీరామాలయమున కొన్ని దినములు ఉపన్యాసములు జరుపవేడుకొనుచున్నా"మని విన్నవించుకొనిరి.

అందులకు శ్రీస్వామివారు అంగీకరించి 13.11.54 ఉదయము గుంతకల్లు శ్రీ ఎ. రామప్పగారి ఇంటికి దయచేసిరి. శ్రీవారి పూజానుష్ఠానాదులకు బ్రహ్మశ్రీ ఖద్దరు కృష్ణరావుగారి మేడలో వసతి నొసగిరి.

ఆనాడు రాత్రి 8 గంllనుండి 10.30 వరకు పూజ్యపాద శ్రీ స్వాములవారి ప్రవచనము శ్రీకోదండరామస్వామివారి ఆలయమున పందిరివేయబడిన ప్రాంగణమునందు జరుపబడెను. శ్రీవారు సభాస్థలి పీఠమునధిరోహించి వేలాది జనులచే నలంకృతమగు నాసభను వీక్షించి ముదమలర "అయ్యలారా! నేడు ఏవిషయమును గురించి మాటలాడ

వలయు'' నని ముంగిట కూర్చుండియుండిన పుర ప్రముఖులనడిగిరి.

అందులో నొకరు భక్తులును భావావేశపూరితులునగు బ్రహ్మ వెంకోబరావుగారను బ్రహ్మణ్యులు "పూజ్యశ్రీ స్వామీ! భక్తి ప్రధానమైన శ్రీమద్రామాయణ తత్త్వార్థమును దెలుపు''డని సభలోనడిగిరి.

అందులకు శ్రీస్వామి సంతసించి 'తథాస్తు' అని మంగళాచరణ పూర్వకముగా శ్రీరామాయణ తత్త్వార్థమును "ఆదౌ రామ తపోవనాదిగమనం హత్వా మృగం కాంచనం, వైదేహీ హరణం జటాయు మరణం సుగ్రీవ సంభాషణమ్, వాలీ నిగ్రహణం సముద్రతరణం లంకాపురీ దహనమ్, పశ్చాద్రావణ కుంభకర్ణ హననమ్ ఏతద్ధి రామాయణమ్'' అను ఏకశ్లోకి మూలమున శ్రీవారు సర్వజనానందకరముగ పులకాంకితుల గావించుచు అనేక నైతిక ధార్మిక తత్త్వజ్ఞాన సంపుటీకరణాత్మకంబైన దివ్య ప్రబోధములతో ఉత్తమమగు ఉపమానోపమేయములచే శ్రీరామచరిత విషయమును కూలంకషముగా తెలుపుచు 2.30 గంటలు అఖండముగా ప్రవచించిరి. సర్వులు మహాసంతోషమున జయజయ ధ్వానముల జేసిరి. మంగళమైె నాటికార్యక్రమము పూర్ణమాయెను. అందరు భక్తిచే శ్రీవారు మరికొన్ని దినములు యిచటనే సన్నిధి చేయుచు రామాయణ తత్త్వార్థముల బోధింపవలెనని విన్నవించుకొనిరి. ప్రేమమీర వారుకోరగా క్రమముగా ముందు రామాయణప్రవచనములు సాగించిరి.

శ్రీమద్రామాయణాదికావ్యము, తత్ప్రతిపాద్యుడగు శ్రీరామభద్రుడు మీయందరి హృదయేశుడగు ప్రత్యగాత్మయే. రామాయణము సర్వుల ఇచ్ఛకు విషయమైన ఆనందమే. అయ్యానందమునే బ్రహ్మమని ఉపనిషత్తులు తెలుపుచున్నవి. 'రా' తత్పదార్థము. 'మ' త్వంపదార్థము. "రామ'' అసి పదము ..." మంద మధ్యమాధికారులకు ఆత్మతత్త్వము నరయ చురవగాహముగాన ఆ యాత్మయే అర్థాత్

సాక్షాద్విశ్వంభరమూర్తియగు పరమేశ్వరుడే శ్రీరామ యను నామమున దశరథాత్మజుడై యవతరించి లోకమున లుప్తమయిన ధర్మము నుద్ధరించెను.

నారదోపదేశముచే బ్రహ్మదేవుని యాజ్ఞచొప్పన శ్రీవాల్మీకి మహర్షి రామాయణమును రచించెను..."లోకమున రామాయణములనేకములు గలవు. కాని మొదటిది వాల్మీకిరామాయణమే, ప్రాయశః భారతీయులలో రామాయణ, భారత, భాగవతముల నెరుగని వారుండరు. తెలిసినను, ఇది కథయయినను ఇందు భగవదనుకథన పూర్వకమైన నైతిక ధార్మిక ఆధ్యాత్మికాది ఉత్తమ ప్రబోధలసంఖ్యాకములయియున్నందున ఎన్నిసారులు విన్నను మధురమే. అనునిత్యాదిగా ఉపక్రమించి సంక్షిప్తముగ శ్రీరామాయణము నందలి ఒక్కొక్క ఘట్టమును చక్కని ఉపమానోపమేయములచేనవరసములచే నొప్ప రామాయణ తత్త్వార్థమును ఆ యా ఘట్టములయందు తత్తత్వ్రతలను చక్కగ పోషించుచు ఆయారసములు ఉట్టిపడునట్టుగ శాస్త్రీయమగు ప్రక్రియలచే శ్రుతిస్మృతుల నుదాహరించుచు శ్రీవారీప్రకారముగ రామచరితమును శ్రుతపఱచిరి......"

లోకమున రెండే వంశములు గలవు. సూర్యవంశము, చంద్రవంశము సూర్యచంద్రులను విడిచి వర్తించు వారెవరును లేరు. ఇందు సూర్యవంశపురాజుల కథయే ఈ రామాయణము. చంద్రవంశపురాజుల కథయే మహాభారతము. ప్రస్తుతమగు ఈసూర్యవంశాభి వర్ణనను గురించి మహాకవి కాళిదాసు రఘువంశ కావ్యారంభములో "క్వసూర్యప్రభవో వంశః, క్వచాల్ప విషయా మతిః,తితీర్షు ర్దుస్తరం మోహాదుడుపే నాస్మి సాగరమ్" అని తన నిరహంకృతిని చూపుకొనుచున్నారు.

ఉమామహేశ్వర సంవాదాత్మకమైయొప్పనది రామాయణము. రామపద తత్వార్థమే శివస్వరూపము. శివకేశవ భేదములేని అభేదార్థ

ప్రతిపాదన మిందలి ముఖ్యవిషయము.

"దుష్టుల భారమును భరింపలేక భూదేవి శ్రీమహావిష్ణువును నుతించుట ..."

ధర్మాత్ముడగు సూర్యవంశపు రాజైన దశరథుడు న్యాయముగ రాజ్యపాలన మొనర్చుచు ఋషుల ఆజ్ఞ వడువున పుత్రకామేష్టి యాగమొనర్చి తత్ప్రసాదరూపమగు పాయసము నొంది తన ముగ్గురు భార్యలు కౌసల్య, సుమిత్ర, కైకల కొసగ, కౌసల్యకు శ్రీరాముడు, సుమిత్రకు లక్ష్మణశత్రుఘ్నులు, కైకేయికి భరతుడును పుత్రులుగ జన్మించిరి. తమ శైశవ లీలలచే బాలురు తల్లిదండ్రుల నూరడిల్ల జేయుచు ఆనందడోలికల నూంచెత్తిరి. ఈఘట్టమున శ్రీవారు పుత్రులననేమి, వారి ప్రయోజనము, సంతానప్రాప్తి నెందుకు మానవులు గోరుదురు "అపుత్రస్య గతిర్నాస్తి" అనగా నేమి అను నిత్యాది విషయముల నెంతో హృదయంగమముగ వర్ణించిరి..."

విశ్వామిత్ర మహర్షి వచ్చి తన యజ్ఞ సంరక్షణార్థమై శ్రీరామ లక్ష్మణుల బిలుచుకొని వెళ్ళుట. వారి కాకలిదప్పులు, అలసటయు కలుగకుండు, విద్యను తెలుపుట, సంతత బలోపేతులుగనుంచుట, తాటకి యను రక్కసిని వధింపజేయుట, స్త్రీవధకదా యనుధర్మ సందేహమును విడువుమను విషయమును విశ్వామిత్రుడు సకారణముగ శ్రీరామునకు తెలుపుట, తాటకి వధానంతరము యజ్ఞభంగ కారకులయిన సుబాహుని వధింపజేసి మారీచుని దూరముగ త్రోసివేయించుట మున్నగు ఘట్టములందు శ్రీవారనంత ధర్మములను తెలిపిరి. అన్ని విషయములు వ్రాయవలయునన్న గ్రంథవిస్తర మగునను భీతిచే వదలుచు శ్రీవారి ముఖమునుండి వచ్చిన యాపలుకులను కొన్నిటిని మాత్ర మున్నవి యున్నట్లు వ్రాయుచున్నాను.

తదుపరి యాగ పూర్ణానంతరము శ్రీరామలక్ష్మణులతో గలసి విశ్వామిత్రమహర్షి మిథిలానగరమునకు పయనమై మార్గమధ్యమున

శిలయై పడియున్న అహల్య శ్రీరామపదస్పర్శచే శాపవిముక్తురా లగుట... ఈవిషయమును స్వామి ఎంతో అపూర్వముగ భక్తియుక్తయు మగు అంతరార్థములచే ప్రమాణ సమ్మతముగ నిరూపించిరి.

మిథిలానగరము వెళ్ళుట, శివధనుర్భంగము, సీతాకల్యాణము నయ్యెను. అహంకార నిర్ముక్తస్థానమున సీతయను స్వరూపానందానుభవ మగును. అను నిత్యాది ఆధ్యాత్మిక విషయము లను స్వామి తెలిపిరి. తక్కిన ముగ్గురు సోదరుల వివాహములు నయ్యెను..."వివాహితులై వచ్చు మార్గమధ్యమున పరశురాముని పరాజితుని జేసిరి.

అనంతరము వృద్ధుడయినందున దశరథ మహారాజు శ్రీరామ పట్టాభిషేక మహోత్సవ మహాసంభ్రమము నేర్పఱచుట, దేవతల ప్రార్థన, మంథరప్రబోధచే కైక మోహాగ్రస్తమగు దృష్టినొందుట. లోకానుగ్రహ మహాకార్యమున్నందున శ్రీరాముడడవులకు 14వత్సరము లేగవలయునని, భరతుడు రాజుకావలయునని కైక రెండు వరములు అడ్డమయి ముందుచరిత్రనంతయు మార్చివేసెను. అర్థాత్ రామ పట్టాభిషేక మహోత్సవమునకు బదులు రామవనవాస మేర్పడెను. పూజ్య గురుస్వామివారు ఈ ఘట్టమున మంథర యన నెవరు? కైక ఎవరు? నాటి దశరథుని మహాశోక కారణమేమి? రామావతార ఉద్దేశమేమి? అను నిత్యాది అనేక విషయముల నెంతయు గురుదైవ మాతాపితృ భక్తియుక్తమై జ్ఞానసాధనములగు అపూర్వవిషయ ప్రతిపాదనలతో శ్రోతృజనులను ఆనందాశ్రుపూరితుల జేసిరి.

శ్రీ సీతారామలక్ష్మణు లడవులకు పయనమగుటలో సీత మరియు లక్ష్మణులతో గూడ అడవులకు వెళ్లుటకు తగుకారణములను స్వామి హేతు దృష్టాంతములచే చక్కగ నిరూపించిరి. వినదగిన విషయములు ..."గంగానది యొడ్డున గుహుని పరమభక్తి గంగోత్తరణము..."ఇచ్చట భక్తిసిక్తములగు మధురమైన శ్రీవారి వాక్కులు విని మేమానందించితిమేగాని వ్రాయుటకు నలవిగాదు. అయోధ్యలో

పుత్రశోకమున తండ్రి దశరథుడు మరణించెను. శ్రావణుని పితృభక్తి.

భరతుడయోధ్యకువచ్చి భగవంతుడగు రాము డడవుల కేగి నందులకు పెన్నిధిం గోలుపోయిన పేద చందంబున విలపించుచు తన తల్లిని నిందించుట. ఇచ్చట భరతుని ముఖమునుండి వెలువడిన శ్రీరామ భక్తిగౌరవము లపూర్వములు. "నన్నా రాముడేమనిభావించునోకదా? అతడు సర్వాంతర్యామి" నన్ను తన తమ్మునిగనే భావించుగాత. యని వాపోవుచు గాఢమగు భక్తిచే అచటినుండి పరివారముతో సహా చిత్రకూట పర్వతమునకు శ్రీరామ సన్నిధికి వెళ్లుట. శ్రీరామభద్రునకు పరమభక్తిచే సర్వవిషయములను శ్రుతపఱచి అయోధ్యకు జనుదెంచ శ్రీరాముని ప్రార్థింప, వసిష్ఠాదులుభరతుని ఓదార్చి చివరకు శ్రీరామ చంద్రమూర్తి తన ప్రతీకముగ పాదుకల నొసగి భరతుని అయోధ్యకు పంపుట. పాదుకాపట్టాభిషేకము... ఈఘట్టమున పరమభక్తి పారవశ్యముగనుండిన శ్రీవారి వాఙ్మయము అమృతమై ఆబాలగోపాల మందరిని ఆనందాశ్రువు లేరులై పార విని పులకాంకితుల జేసిరి. భరతుని బంధుప్రేమ, స్వామిభక్తి మున్నగునవి హృదయమునకు సంబంధించిన పరాభక్తిసూచకములై యున్నవి.

అనంతరము శ్రీరామలక్ష్మణులు సీతతోసహా అత్రి ఆశ్రమ మును సందర్శించి వారి ఆజ్ఞానుసారము దండకారణ్యమునకు వచ్చి పంచవటిని జేరిరి. ఇది లోకకంటకులగు పరమ దుష్టులైన రాక్షసులచే నావృతమైన ప్రదేశము. విరాధుడను రక్కసుని రాముడు చంపెను. లక్ష్మణుడు శూర్పణఖ ముక్కుచెవుల గోసెను. రావణునకు సీతా రామలక్ష్మణుల వార్త తెలియ, నాతడు మారీచుని బంగారులేడిగ మారొందజెప్పి రామకుటీరము వద్దకు పంపుట. నిజసీత భూగర్భమున దాగుట, మాయాసీత బంగారులేడి నపేక్షింప దానిని పట్టితెచ్చుటకై శ్రీరాముడు వెళ్లుట. ఆ బంగారులేడిని రాముడు బాణముతో గొట్ట హాలక్ష్మణా ! సీతా ! యని అరచుచు అసువుల బాయుట. లక్ష్మణా!

మీ అన్న సంరక్షణార్థమైనీవు వెళ్ళుమని సీత తెలుప తల్లీ! రాము డజేయుడు, అక్షర శబ్ద వాచ్యుడు అమరుడు. ఇది రాక్షస మాయోపాయమని చెప్పినను సీత వినక నిష్ఠురములు బలుక లక్ష్మణుడు సీతను విడిచి వెళ్ళెను. అంతలో సన్న్యాసి వేషమున మాయావి యగు రావణుడు వచ్చి సీతను గొంపోవుట.. "ఈ విషయములను స్వామి అంతరార్థముగను, పూర్వాపర హేతు స్వరూప నిరూపణములచే చక్కగ తెలిపిరి.

రావణునకెదురై జటాయువు యుద్ధమొనర్చి సీతవార్తను రామునకు తెలిపి మరణించుట ... మున్నగు విషయములు ఆ పిదప శబరికి దర్శనమిచ్చి పండ్లారగించుట ఇత్యాది పరమభక్తిఘట్టములను ...పరవశులై స్వామి తెలిపిరి.

సీతాన్వేషణపరులైన శ్రీరామ లక్ష్మణులకు ఆంజనేయుడు భక్తుడగుట తద్వారా సుగ్రీవుని స్నేహము వాలివధ..."ఈ భాగమున స్వామి చక్కని దృష్టాంతములతో జ్ఞానముయొక్క గొప్పతనమును అవినీతి చర్యయొక్క అధఃపతనమును గురించిన ఉత్తమ ప్రబోధ లొసగిరి. సీత నెరుగుటకై భక్తుడగు ఆంజనేయుడు శ్రీరామాంగుళీయమును గైకొని సముద్రతరణ మొనర్చి లంకాపురిజేరి లంకిణియను రక్కసిని వధించి సీత కుంగరము జూపుట. రావణుని దుష్టచేష్టలు..." అశోకవన నాశకుడగు ఆంజనేయుని రావణు డధిక్షేపించుట రావణునకు ఆంజనేయస్వామి నీతియుక్తమగు రామభక్తి ప్రబోధజేసెను. విభీషణుని హితబోధయు నయ్యెను. అయినను దుష్టుడగు రావణునకు రాముడు నా హృదయేశుడగు వ్యాపక పరమాత్మయే; సీత జగన్మాత యను జ్ఞానముదయించ లేదు. ఇది నిజముగా రావణుని ర్వేదమే లేకున్న అతనికి చావురాదు. తదుపరి లంకాదహనము..."ఇచ్చట బహుచక్కనైన నైతిక ధార్మిక ఆధ్యాత్మిక ప్రబోధలు గలవు. అచ్చటినుండి సీతానుగ్రహమున ఆంజనేయుడు కిష్కింధలో రామసన్నిధి జేరి సీత

శిరోరత్నమును శ్రీరామున కిచ్చుట. దుష్టుని పొత్తువీడి వచ్చిన విభీష ణుని శరణాగతి శ్రీరామానుగ్రహము..."

తదుపరి...శ్రీరామ నామాంకితములైన రాళ్ళచే నలనీలురతో కూడి కపిసైన్యమెల్లజేరి సేతుబంధన మొనర్చుట....ఈఘట్టమందు స్వామివారెంతో అపూర్వమైన ఆధ్యాత్మిక తత్త్వరీతి అంతరార్థ మును దెలిపిరి. "అనంతరము అంగద రాయబారము, నిజముగా ఈ ఘట్టమునందలి ప్రసంగములు సర్వజనులు విని ఆచరింపదగినవి. ఇచ్చట తెలిపిన శ్రీరామభద్రుని ధార్మిక మహాప్రవృత్తి యెంతయును ఎల్లవా రికి చిరస్మరణీయము...కడకు దుష్టుడగు రావణుడు వినసందున యుద్ధ మారంభమాయెను. కుంభకర్ణుడు రామబాణమున చచ్చెను. పిదప నటువలె అందరును చచ్చిరి.... "లక్ష్మణ మూర్ఛ ఆంజనేయుడు ద్రోణాద్రిని తెచ్చుట, ఇంద్రజిత్తువధ...సులోచనా పాతివ్రత్యము ..." ఈసందర్భమున గురుస్వామి నాడు మహిళలకు వలయు మాన్య ములగు సమస్త గుణకర్మ ధర్మములను పతిభక్తిని గురించి అనేక ఉపమానోపమేయములచే నతి విపులముగ వివరించిరి. ... "అక్షయ కుమారాది సర్వులును పోయిరి. ఇకనైనను నామాట విని సీతను రాముని కప్పగించి భర్తుడవుకమ్ము. నీకు జయ మొదవును. పశుబలము పనికిరాదని వేనోళ్ళ మరల మరల మండోదరి తనపతి యగు రావణు నకు తెలుపుట. రావణునకు ఈ సద్బోధనలు రుచింపలేదు. చివర శ్రీరామ బాణమునకు గురియై మరణించెను. అభేదము నొందెను. శ్రీరామచంద్రమూర్తి సీతతోగూడి పుష్పకవిమానమున అయోధ్య జేరి, పట్టాభిషిక్తుడై నాలుగు చెరగుల నేకచ్ఛత్రాధిపతియై ఏలు చుండ యారామరాజ్యమున సర్వులు సుఖసామ్రాజ్యమున నోల లాడుచు ఆనందమందిరి.

ఇక ఉత్తర రామాయణములో ఈ రామాయణము నందలి పాత్రల పుట్టు పూర్వోత్తరముల గురించిన వివరములతో శ్రీరాముని

సర్వవిజయము అశ్వమేధయాగము... లవకుశుల సంజననము చివర అవతార సమాప్తి విధానము మున్నగు అనేక విషయములు గలవు. అను నిత్యాదిగా రామాయణ తత్త్వార్థవిషయములను కొలది దినములలో సంక్షిప్తముగ నిరూపించిరి.

ముందు గురుకార్యమున్నందున గుంతకల్ పురభక్తులతో వీడ్కోలునొంది శ్రీవారు గంజిగుంట శ్రీమఠమునకు జేరి విధ్యుక్తముగ గురుమఠమున శ్రీగురుస్వాములవారి పుణ్యారాధన మహోత్సవము మహద్వైభవముచే నిత్యానందప్రదమై మూడు దినములు జరిగెను.

ఈ కార్యక్రమమునకు పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శుద్ధచైతన్య స్వాములు, బ్రహ్మశ్రీ శేషయ్యస్వామి, శ్రీశివప్రకాశానందస్వామి మరికొందరు పెద్దలును వచ్చియుండిరి. ఇరుపూటలు వాక్యార్థ శ్రవణము శ్రోతృజనానందకరముగ వస్తు ప్రతిపాదనాత్మకంబగు దృష్టి యుక్తమైన ప్రసంగములచే ఆనందముగ జరుపబడినది. వేలాదిగ శ్రోతృజనులేతెంచి యుండిరి. ప్రత్యగ్దృష్టి గలుగ బ్రహ్మము తానె ..." "జీవో బ్రహ్మైవ నాపరః"యన్నట్లు ఇదంతయు ఉపాధి నిమిత్తమైన భేదాభాసమేగాని వస్తుతః భేదమనునది లేదు. సిద్ధవస్తువొక్కటే బుద్ధ్యుపాధివలన విభిన్నముగ నున్నట్లు భాసమగును. కావున ముముక్షువులు చక్కని సంస్కరణ నొంది సత్యాత్మ నేనను దివ్యానుభూతిచే భేదమును బాధించి నిజనిష్ఠ నొందవలయును.... భేదదృష్టి కెడమీయ రాదు.... "ఏకం సత్ విప్రా బహుధా వదంతి". ఒకే తత్త్వము దృష్టిభేదమున బహుప్రకారములనుండి దానివలె తోచుచున్నది. ప్రత్యగభిన్న పరబ్రహ్మ స్వరూపులే మీరు అను నిత్యాదిగా అనేక విషయములు ప్రవచింపబడెను. పిదప కార్యక్రమముయొక్క చివర వచ్చిన మహాత్ముల పూజా సత్కార సంసేవాదులచే తీర్థప్రసాద విని యోగపూర్వకముగ భూరి అన్నసంతర్పణాదులతో కార్యము పూర్ణ

మాయెను. ఉత్తమగుణ సంపన్నులును శ్రీవారిశిష్యులునగు శ్రీమాన్ దింటగుర్తి ఓబయ్యశ్రేష్ఠియను పరమభక్తులే స్వాములవారి సర్వ కార్యముల యందును (వంట) పాకయజ్ఞ మొనర్చు పరమ భక్తులు.

అనంతరము శ్రీవారు శ్రీబొగ్గరపు పుల్లయ్యశ్రేష్ఠి దంపతుల ప్రార్థనానుసారము సంధ్యాలకు దయచేసి వీరిమేడయందు అవిచ్ఛిన్నముగ 40 దినములు అనగా 6-12-54 గీతాజయంతి మొదలుకొని శ్రీమదుత్తరాయణ పుణ్యకాలము 14-1-55 వఱకు అనుదినము బ్రహ్మముహూర్తమున పూజాపారాయణ ధ్యానానుష్ఠానములచే తత్త్వమసి మహావాక్యార్థ శ్రవణము గావించిరి. నిత్యానందప్రదమై జరిగినది. ఈభవనమునే ఓంకారభవనమని పిలిచెదరు.

యథారీతి త్యాగరాజస్వామి మందిరమున శ్రీత్యాగబ్రహ్మ ఆరాధన మహోత్సవము విజయవంతముగ జరుపబడినది.

దృఢాపరోక్ష జ్ఞాననిష్ఠ గలుగు పర్యంతము దేశకాల స్థలముల యొక్క సానుకూల్యత సాధకుల కత్యవసరమైయుండును..."

మీ బ్రహ్మనిష్ఠ కడ్డమును ఆత్మవిస్మృతికి త్రోవయునగు ఎట్టి దైనను ముముక్షువు లాచరింపరాదు. అన్నప్పుడు ఇక ముముక్షువు పాపచింతన. తత్కర్మాదులను కలయందైనను సుతరాం ఆచరింపరాదు.

ప్ర. స్వామీ! తాము బింబ ప్రతిబింబ న్యాయమును దృష్టాంత మొసగెదరు గదా! అచ్చట బింబ ప్రతిబింబముల సంసర్గభేదముగలదా లేక అభేదమా ?

ఉ. అయ్యా! ఈభేదాభేద తాదాత్మ్యము అనిర్వచనీయమై యున్నది. తత్త్వతః విచారించి చూచిన ఉపాధికృతమగు భేదము అనుభవముచే జూడ అభావమై యున్నది. ఎట్లన తాను పూర్వాభిముఖుడై దర్పణమునందు జూడ అది పశ్చిమాభిముఖమై అగపడును. ఇట్లు సోపాధిక భేదప్రతీతియైనను అనుభవమున భేదములేదని ఎఱుగుటే ఇందలి తాత్పర్యము.

గురుముఖమున బడయని కేవల పాండిత్యము అభిమాన కారణమై అహంకార యుక్తమై జన్మకారణమగును. వేయేల బ్రహ్మానుభవ రహితమగు పాండిత్యము నిజశాంతి నివ్వదని యోగవాసిష్ఠము చెప్పు చున్నది. కావున విద్యచే బుద్ధిమంతుడై బుద్ధిసాక్షి యగు చిదాత్మ వ్యాపకమగు పరమాత్మయే యను అనుభవమునకు విద్యసాధన మైనచో దానిని సజ్జనాదరణీయమగు సద్విద్యయని బుధులు చెప్పు దురు. పిదప బెంగుళూరు భక్తుల ప్రార్థనానుసారము బ్రహ్మవిద్యాశ్రమ కార్యక్రమమునకు దయచేసి, మహాశివరాత్రికి లత్తవరం వచ్చి మంత్ర మంత్రార్థములను భక్తులకు బోధించి కొన్ని దినము లచటనే యుండి గంజిగుంట శ్రీమఠమునకు శ్రీగురుసన్నిధి చేరి, వాక్యార్థ ప్రసంగ పూజానుష్ఠానాదులచే నిత్యతృప్తి నుండిరి.

ఇంతలో పూజ్యపాద శ్రీగురుస్వాములవారి మాతృదేవి నిర్యాణము పొందినట్టుగ తెలిసెను. భక్తిచే స్వామి తల్లికి మనసార ప్రణామము లాచరించి "జననీ నీవొసగిన ఈ దేహము వలన మరల దేహేంద్రియములను పొందని, జన్మజరామరణ దుఃఖముల నొందని ఆత్మ జ్ఞానము నొందితి నమ్మా ! ఎంతటి నిష్కామ పుణ్యమయమగు దేహ మును నాకొసగితి వమ్మా! నన్నుగన్నతల్లివగు నీవు ధన్యురాలవు. నాకు జన్మలేదు. నీమహోపకారము జన్మావధి సంస్మరణార్హము" అని పలుకుచు శ్రీవారు అంతర్ముఖులైరి. స్వామి తన ఆస్తిపాస్తులను గురించి 'అది ఎట్లు? ఏమి ?' అను విషయమునే స్మరించలేదు. ఎంద రెన్నెన్నో విధముల స్వామికి జెప్పిరి. శ్రీవారు నిర్దాక్షిణ్యముగ అది మమకారస్థానము. దాని నేవిధముగ నభిమానించినను కట్టివేయును. ఆ ఆస్తులే మావి కావు. విశ్వ ప్రపంచమునందలి సర్వసంపదలు మాయవియే! అను నిత్యాదిగా తెలుపుచు నిస్పృహులయి మహదానందము నొందిరి.

లత్తవరము శ్రీఉమామహేశ్వరాశ్రమమున (శివాలమున)

శ్రీశంకరజయంతి మన్మథనామ సం॥ వైశాఖ శు॥౧ మొదలు శు॥౧౦ వరకు కార్యము విధ్యుక్తముగ అనుదినము బ్రహ్మముహూర్తమున గ్రామమునందు ప్రభాతసేవ మరల 5గం॥ నుండి 7గం॥ వరకు రుద్రి పురుషసూక్తాదులచే శ్రీశారదాచంద్రమౌళీశ్వర శ్రీజగద్గురు శంకరాచార్యస్వామి సర్వోపచార పూజాదివైదికకార్యములు శ్రీమద్భగవద్గీతా పారాయణము, మంత్రపుష్పము, 8-30 నుండి 10-30. వరకు ఉపనిషద్భాష్య ప్రవచనము మంగళము. సాయంకాలము ప్రదోష పూజా రాత్రి 8.30 గం॥ నుండి 10గం॥ వరకు మాధవీయ శ్రీశంకర విజయపురాణప్రసంగము. మంగళము. ఈప్రకారమగు ప్రతిదినకార్య క్రమములచే ఆనందముగ శ్రీజగద్గురు శంకరాచార్య స్వామిజయంతి జరిగెను. మరియు భక్తుడగు చిరంజీవి కె. బండెయ్యయను బ్రహ్మచారికి శ్రీవారు విధ్యుక్తముగ సన్న్యాసాశ్రమము ప్రసాదించి శ్రీ శివానందస్వామి యని నామమొసగిరి. అన్నసంతర్పణాదులు జరిగి దశమి ఆదివారము జగద్గురు శ్రీశంకరాచార్యస్వామి ఉత్సవము అత్యంత వైభవముగ నడచెను. అనేక ప్రాంతములనుండి భక్తాదులు వచ్చియుండిరి. ఇచటినుండి గుంతకల్లు దయచేసి శ్రీరామాలయమున 10 దినములు భాగవత తత్త్వార్థ శ్రవణము గావించిరి. శ్రీవారు శ్రీగురుపీఠ సమారోహణ సుదినము జ్యేష్ఠ శు ౧౫॥ పూర్ణిమకు గురుస్థానము నందుండుచు పూజానుష్ఠానాదులచే ఉపదేశసాహస్రి యను గ్రంథప్రవచనము జరిపిరి. ఆయా పరిసర ప్రాంతములనుండి జనులు వచ్చి శ్రవణముజేసి వెళ్లుచుండిరి.

ఈగ్రంథము శ్రీమచ్ఛంకర భగవత్పూజ్యపాదుల వారిచే రచింపబడినది. వివిధప్రకారములచే పూర్వపక్ష సిద్ధాన్తములతో ఇందు బ్రహ్మ సత్యం జగన్మిథ్య యను అద్వైత సిద్ధాన్తము చక్కగ ప్రతిపాదింప బడినది. వెయ్యి ఉపదేశములచే నొప్పుచున్నందున దీనికి ఉపదేశ సాహస్రి యని నామము.

మొత్తము గ్రంథమున 22 ప్రకరణములు గలవు. అందు 3 ప్రకరణములు గద్యాత్మకములై తక్కిన 19 పద్యరూపమున అనగా ఛందోబద్ధమగు శ్లోకములరూపముగ నున్నది. వేదాన్త ప్రక్రియ లెల్లయు ప్రశ్నోత్తరముల రూపమున నిరూపింపబడియున్నది. ముముక్షుజన సంసేవ్యమగు ఉత్తమ గ్రంథము.

తత్త్వతః నీస్వరూపమునందు అజ్ఞానము లేదు. అవిచారసిద్ధమై యున్నదివలె నున్నది. ప్రమాణజన్యజ్ఞానముచే ఆవరణము భంగము కాగా స్వతస్సిద్ధమగు పరమాత్మ తానను అనుభవము కలుగును.

నిత్యకర్మచే దురితక్షయము. కామ్యకర్మచే స్వర్గాదిఫలభోగానుభవము కలుగును. స్వరూపాజ్ఞానమును నివర్తింపజేసి ఆత్మానుభవము నొసగ నాకర్మలు శక్తివంతములు గావు. అవి నిష్కామములైనచో మనశ్శుద్ధి కారకములై శుభేచ్ఛాది జ్ఞానభూమికలలో ప్రవేశపెట్టును. "జ్ఞానాదేవతు కైవల్యమ్" అంధకారము ప్రకాశముచే వినా అన్యథా నివృత్తి కాదుగదా !

నిత్య నిర్దుఃఖమగు సుఖస్వరూపమే ఆత్మయని తెలియని దోషముచే దుఃఖనివృత్తి సుఖప్రాప్తిరూప ప్రయత్నము ఏర్పడుచున్నది. అగుగాక శ్రద్ధతో విచారించుము.

సంశయ నివృత్తుడై శ్రుతిజ్ఞానమునొంది దేహాత్మబుద్ధిని వీడి ఆధ్యాత్మిక దృష్టిచే నొప్పునతడు అనాత్మ విషయములను సత్యత్వబుద్ధిచే చూడడు. నిద్రనుండి మేల్కాంచినవాడు స్వప్నమును దలంచి దానియందు సత్యత్వబుద్ధిని పొందడుకదా ! నీవు అమృత స్వరూపుడవని తెలిసికొనుము. నిష్ఠ సలుపుము, అది అర్థమగును.

స్థాణువును పురుషుడనుకొనిన భ్రాంతుడు భయపడి పరువులిడును. అటువలె ఆత్మవిషయక విజ్ఞానమే లేనివాడు అధ్యాసమూలమున బుద్ధ్యాదుల యందు తాదాత్మ్యము నొంది అనాత్మ ధర్మములను అధ్యారోప మొనర్చుకొని వృథా చింతావిలాపముల నొందుచుండును.

అయ్యో! సూర్యునకు మబ్బు, అగ్నికి చలువ, నీటికి ఉష్ణత్వము ఎట్లులేవో తద్వత్ జ్ఞానమునకు కర్మ అంగముగాదని లెస్సగ విచారించి తెలియుము. సాధనచతుష్టయ సంపత్తి యనెడి ఉత్తమ సంస్కారము గల యధికారికి కర్మోపాసనాదులు విధికాదు. ఎందుకన దశమునిజ్ఞానమువలె వాక్యశ్రవణ మాత్రమున అయ్యధికారికి అహంబ్రహ్మాస్మీత్యా కారకమైన అఖండ జ్ఞానము గలుగ అతడు ధన్యుడగును. అధికారి తారతమ్యముచే నిష్కామ కర్మోపాసనాదులు విధాయకమ్ములై యున్నవని తెలియవలెను. అర్థాత్ పరంపరా సాధనములు.

అన్యత్ర సిద్ధములగు అనాత్మ పదార్థముల యందు విశ్వాసావిశ్వాసముల ప్రసక్తి యుండును. స్వతస్సిద్ధమగు ఆత్మయందు అది పొసగదు. విశ్వాస విహీనునకును అతడే ఆత్మ. అట్టి ఆత్మను బోధించుట వలననే శ్రుతి ప్రమాణమునకు ప్రామాణ్యము కలిగినదనివిచారించి, తెలిసి అది నీనై యుండుము. సంశయింపవలదు. ఇట్లుశ్రీవారు ముముక్షువులకు పరమార్థమును బోధించుచు కొన్నిదినము లచటనే యుండిరి. పిదప శ్రీనిర్వాణమఠమున పరమ గురు ఆరాధనకు బుక్కాపురము మఠము దయచేసి పరమగురువుల ఆరాధన కార్యము పూర్ణము గావించుకొని నంద్యాల ఓంకార భవనమునకు విచ్చేసిరి.

## 11.వ శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1955 సం॥

మన్మథనామ సం॥ ఆషాఢ శు౧౧ గురువారం 30.6.55 బ్రహ్మ ముహూర్తమున సర్వవైదిక విధులచే శ్రీచాతుర్మాస్య మహావ్రతము ఓంకార భవనమున ప్రారంభింప బడెను.

సాయంకాలము శ్రీమతి పగిడి చాయమ్మ కుమారులు శ్రీ సుబ్బారావుగారి మేడలో పూజ్యపాద శ్రీమచ్ఛంకరానందగిరి గురుస్వామివారి జీవితచరిత్ర ప్రథమభాగము గ్రంథావిష్కరణ బ్రహ్మశ్రీ యన్. రాజగుప్తగారిచే మంగళప్రదముగ జరిగెను. సద్భక్తాదులెల్లరికి శ్రీగురుచరిత్రలు ఇవ్వబడినవి. ఆళ్ళగడ్డ పూజ్యపాద శ్రీశ్రీశ్రీ

శంకరానంద స్వాములవారు శ్రీ యస్. రాజగుప్తగారు శ్రీగురుస్వామి చరిత్రను గురించి ప్రశంసించుచు ఉపన్యసించిరి. మహా మంగళ మాయెను.

ఇక మరుసటి దినమునుండి యథారీతి ఓంకార భవనమునఅను దినము ఉషఃకాలమున పూజాపారాయణ అనుష్ఠానాదులు తదుపరి ఉపనిషత్ప్రవచనము మొదలగు వ్రత నియమములు, సాయంకాలము 6.30 గం॥నుండి 8 గం వఱకు నంద్యాల పట్టణము మహానందీశ్వర దేవాలయములో శ్రీచాతుర్మాస్య మహావ్రతాంగముగ భగద్గీత శ్రీ శంకరభాష్యప్రవచనము "భాష్యం ప్రసన్న గంభీరం" అనువచనాను సారము అత్యుత్తమరీతి సర్వులు సంతసింప మృదు మధురమగు భాషలో శ్రుతియుక్త్యనుభవములచే ప్రవచనములు సలిపిరి. చివరి దినము మునిసిపల్ కౌన్సిలర్ శ్రీవర్ధంశెట్టి జంబులన్నగారు స్వామి యందుగల పూజ్యభావమును చూపిరి మరియు విద్యావంతులు మద్దుల పల్లి సుబ్రహ్మణ్య శాస్త్రులు శ్రీశంకరాచార్య భక్తులునగు బ్రహ్మ శ్రీ తోటపల్లి వెంకటసుబ్బయ్య అడ్వకేటుగారు అత్యంత ప్రేమా దరములతో శ్రీవారి ప్రవచన ప్రసంగమును ప్రశంసించుచు వందన సమర్పణ చేసిరి. కార్యక్రమము పూర్ణమై మహామంగళ మాయెను.

ఇక ఓంకార భవనములో ప్రవచనాది కార్యములు సాంగ మంగళముగ నడచి శ్రీచాతుర్మాస్య మహావ్రతము శివప్రదమై 25.11.55 అఖండ భజన గీతాపారాయణ ప్రవచనాది వైదిక కార్య క్రమములచే 26.11.55 కలశోద్వాసన పూర్వకముగ వ్రతము పూర్ణ మయ్యెను. పిదప 29.11.55 భక్తాదులందరితో గూడి శ్రీప్రథమనంది క్షేత్రమునకు వెళ్ళి దీక్షావిరమణ మొనర్చి సంపూర్ణము గావించిరి.

"జీవనము బ్రహ్మానుభవ పూర్ణత నొందనిచో జీవిత మంతయు దుఃఖభాజనమే. ఏమన, అవిద్యయొక్క తీవ్రమగు బాధ, తన్మూల మున స్థూలదేహేంద్రియాదుల బాధ, జనన మరణములు, కర్తృత్వ భోక్తృత్వములు, ఆధ్యాత్మికాది తాపములు,ఆకలిదప్పులు, సప్తవ్యస

షములు, కామక్రోధాదులు ఇట్లు అనంత ప్రకారములగు బాధలుండును గాన జ్ఞానమునొందుట మానవ జీవన పరమావధి పరమశ్రద్ధచే అది కలుగును. "శ్రద్ధావాన్ లభతే జ్ఞాన"మ్మని గదా సూక్తి.

నాయనా! మొట్టమొదట గురుకార్యము. ఆపిదప దైవకార్యము తదుపరి అతిథి అభ్యాగతులసేవ అనంతము నీ స్వీయ కార్యములనాచరించుకొనుము. అప్పుడు నీకు దైవ మానుష ఆసుర బలముల కంటె విలక్షణమైన గురుబల మేర్పడ శాంతి సుఖము లలవడును

నీవు ఎంతటి ఉన్నతస్థితి యందుండినను నీకంటె చిన్నస్థితి యందుండిన వారియెడ గర్వమును చూపక మక్కువ గలిగి మాటలాడుము ఓరీ! ఓసీ! యని బలుకక ఆత్మదృష్టిచే ప్రియ వచనములనే పలుకుము. నీకనంతమగు శుభమును పూర్ణయశస్సును చేకూరును.

గురుసాన్నిధ్యముచే నీకు ద్విజత్వమును, వాక్యవివేకముచే విప్రత్వమును, బ్రహ్మానుభూతిచే బ్రాహ్మణ్యమబ్బును. ఇది వేద మత సాంప్రదాయకుడగు మనుప్రజాపతి యొక్క వాక్యము.

విశ్వప్రపంచములో కర్తృత్వబుద్ధితో తాదాత్మ్యము గలిగి ఏమియు చేయబోకుము. అది బాధ. కన్న హేయోపాదేయములగు సర్వపదార్థములను చూచియు సర్వమునుండి అసంగమయి యుండునట్లు ఈజగచ్చిత్రమును అసంగుడవై చూచు సాక్షివై నీవుండుము. తాదాత్మ్యమొందవలదు. ఈజగల్లీలారంగము నీముంగిట అనాయాసముగ సాగిపోవును. అంతేగాని మనోరూపుడవై దానితో కలసి విషయములను చింతించిన అవి నిన్ను వృథా దుఃఖపంకిలమున ముంచి తేల్చును.

ఈలోకమునందు నీకిచ్ఛానుసారము చరించవలదు. గురుశాస్త్రములు చెప్పిన రీతి తదాజ్ఞానుసారము నడచుచు ధన్యుడ వగుము. ఇహపరముల యందు నీకు సుఖమబ్బును.

కామక్రోధములే జ్ఞాన ప్రతిబంధకములగు మహాశత్రువులని

దెలిసి వాటిని ఆత్మబుద్ధిచే దూరీకరింపుము. అవి జ్ఞానమను రత్నమును హరించు దొంగలు.

కష్టములు వచ్చి నిన్ను చుట్టుముట్టగా నీవు భయపడ వలదు. వచ్చినవి తప్పక వెడలిపోవును. కాని నీవు భీరుడవై వాటినే తలచు చుండిననిన్నవి లొంగదీయును. దృఢమగు ఆత్మవిశ్వాసముచే శివోహంబనిచైతన్యాత్మ దృష్టిగలిగి యుండుము ఆత్మబుద్ధిచే సహింపుము "మాభైషీః"

అసమ మయి అనుభవాంతమున తీరని దుఃఖము నొసగిపోవు సంసార సుఖములను స్వప్నతుల్యములని తెలియుము. సమ్మోహము నొంది వాటిలో మునిగిపోవకుము. ఓం.

అనంతరము గంజిగుంట శ్రీమఠమున గురుస్వామివారి పుణ్యారాధనకు శ్రీవారు 4.12.55 నంద్యాల నుండి నేరుగ గురు మఠమునకు వచ్చిరి. సర్వ భక్తమండలికి ఆహ్వానపత్రిక లపుడే పంపబడియుండెను. సువ్యవస్థాబద్ధముగ సర్వమును సమకూర్చబడి యుండెను. పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శుద్ధచైతన్యస్వామి మొదలగు మహాత్ములు దయచేసిరి. యావద్భక్తమండలివారును సకాలమున కరుదెంచిరి మూడు దినములు యథారీతి గురుకార్యము శివప్రదమై నడచెను. ఆత్మ తత్త్వోపదేశము లచే నొప్పచు ఉత్తమ ప్రసంగములు మహాత్ములచే ఉపన్యసింప బడెను. పుణ్యారాధన కార్యక్రమము సాంగ మంగళమాయెను.

అదే సమయమున గుంతకల్లు శ్రీ బుశెట్టి వన్నప్పగారు వచ్చి శ్రీవారు గుంతకల్లు మా హాస్టల్ భవనమున సన్నిధిచేసి అచటనే యుండి ఆధ్యాత్మిక తత్త్వ ప్రబోధనలు జేయుచు తమ అనుష్ఠాన పూజాదికార్యముల సలుపుకొొన ప్రార్థన యని భక్తిచే బిలుచుకొని వెళ్ళిరి

ఈవిద్యార్థి నిలయములో అన్ని విధముల శ్రీస్వామివారికి వసతి నేర్పరచి యిచ్చిరి. శ్రీవారు యథారీతి తమ పూజానుష్ఠాన ప్రస్థాన

త్రయపారాయణాది కార్యములచే ప్రాతఃకాలమున శ్రీశంకరకృతి యగు వివేకచూడామణియను గ్రంథ ప్రవచనమును, సాయంకాలము 6.30 నుండి 8 గం॥వఱకు 13వ అధ్యాయము (గీత) శాంకరభాష్య ప్రవచనమును జరిపిరి. వందలాదిగ హాస్టల్ క్రిక్కిరియ భక్తులనేకులు శ్రద్ధచే ప్రతిదినము ఇరుపూటలు వచ్చి శ్రవణము చేయుచుండిరి.

ఇట్లు 10 దినములు జరిగిన పిదప శ్రీగీతాజయంతి కార్యక్రమ మునకు శ్రీవారు లత్తవరము దయచేసి విధ్యుక్తముగ జయంత్యుత్స వము జరిపిరి. 28.12.55 శ్రీవారు చదివిన ఉరవకొండ శ్రీకరి బసవ స్వామి బోర్డుహైస్కూలు హెడ్మాస్టర్ శ్రీనారాయణరెడ్డిగారు మరియు తెలుగుపండితులగు బ్రహ్మశ్రీ యన్. వేరరాజు మహోద యులు, శ్రీచౌడప్ప టీచరుగారును మాస్కూలునందు చదివి మహా నీయుడై ఆధ్యాత్మిక రంగంలో సేవచేయు శ్రీశంకరానందగిరిస్వామి వారిని దర్శించి వచ్చెదముగాక' యను సద్భావనచే ముగ్వురు లత్త వరమునకు వచ్చి శ్రీవారితో గలసి చాలసేపు ప్రస్థానత్రయమును గురించి కొన్ని విషయములను ప్రసంగించిరి. శ్రీవారి ముఖమునుండి వెలువడిన అత్యుత్తమ ప్రసంగములను విని వారు సంతసించి ఉరవ కొండ హైస్కూలులో తమ ఉపన్యాసము ఒకపూట జరుపవలెనని కోరిరి. కాని స్వామివారికి ముందు కార్యక్రమము నిర్ణయింపబడి యున్నందున రాగులపాడు మఠమునకు వచ్చినపుడు అనగా 7.2.56 కు ఉరవకొండ వచ్చెదమని ఆవివరములను చెప్పి వారిని సంతోషముగ పంపిరి.

30.12.55 ఉదయం 8.20 ల సమయమున గీతాజయంతికార్య క్రమము జరుగుచున్న శ్రీశివాలయమునందు శ్రీస్వామివారి శిష్యు లును విద్యా వినయ వివేక సంపన్నులునగు య జ మా ను రా లు బ్రహ్మశ్రీ కరణం కృష్ణారావుగారి సతీమణి శ్రీజానమ్మవ్వ యనువారు స్వామి వద్దకు వచ్చి గురుదేవా! మీసుకీర్తిరూప బ్రహ్మవిద్యా

వ్యాప్తి మహాలత సర్వత్ర ప్రసరించుచున్నది. అది విశ్వమానవకోటికి నిత్యశాంతిని ప్రసాదించుగాత ! స్వామీ ! జన్మమాదిగా మీ రెట్లు పరమ శీలసంపద్విష్టులయి యున్నారో అది నేను చూచుచున్నాను. అటువలె ఉపాధి యున్నంతవరకు నా గురుస్వామిని ఈ శోభనా శోభనాత్మకంబగు జగద్రంగమున ఏవిధమగు స్త్రీమోహమనుకలిమల మంటకుండుగాక యని నేను సంతతము శ్రీఉమామహేశ్వర గురుపీఠ పరంపరా మహాశక్తికి వందనము లాచరించుచు ప్రార్థించు దానను. గురుసన్నిధి ఈవిషయములు విన్నవించుకొనుటకు నేనర్హురాలను గాక పోయినను నాస్వామి నాగురునికీర్తి ఆచంద్రార్కము అకుంఠితమై ఆదర్శముగ పరమశీల సంపద్విశిష్టమై యలరుగాక యను దివ్యావేశ సత్య సంభావనచే పలుకు ఈనాపలుకులను పాలించుచు క్షమింప ప్రార్థనయని ఎంతో ఆదరమున నాతల్లి దెలిపెను.

ఈ మాటలువిని శ్రీవారు సమాధి నిష్ఠనొంది,నన్నుగన్నతల్లీ ! నీయాన ఈఉపాధియందు ప్రాకృతమగు స్త్రీవిషయక మోహాది దుర్గుణములకు తావులేదమ్మా ! నేనెప్పు బుట్టితినో నేడును అటులనే యున్నాను.ప్రకృతి విషయములు నాముంగిట నాట్యమాడినను నన్ను మోహపరచవు ఇది నాశక్తిగాదు. సంపూర్ణమగు శ్రీగురుకృపా విశేషము, జన్మాంతర తపః ఫలము. వస్తుతః మాదేహేంద్రియాదుల యందు ప్రాకృత విషయ భోగసాధన సామగ్రులే లేవు. సహజముగ మాపుట్టుకయే అట్లున్నది. అది శివసంకల్పము. ఇందులకు సందియము లేదమ్మా !

పూజ్య మహాత్మాగాంధీగారు తనతల్లికి బాస ఇచ్చినపగిది (నేను విదేశములకు వెళ్ళిన, సురత్రాగను, మాంసముదినను, వ్యభిచరించను అని ప్రతినజేసి చెప్పినట్లు) మాయందవ్యాజమగు భక్తి ప్రేమలచే చెప్ప నీయమృత వాక్కులు మాహృదయ ఫలకమున వజ్రఖచితములై నిలచెను. తల్లీ ! మేమెప్పటికిని గురుకరుణచే దేహ

మున్నంతవరకు ఇటులనే యుండగలము. మమ్ము మాసర్వ వ్యవహార ములను శ్రీగురుస్వామి జూచుచు రక్షించును. ఈశంకను వీడుమమ్మా! యని బగులు తెలిపిరి. ఈయమ సద్బ్రాహ్మణియును గురుదైవ భక్తు రాలును చక్కని ఆధ్యాత్మిక సంస్కారముగల వృద్ధురాలు. శ్రీవారు చిన్నతనమునందు ఈఅమ్మగారి విశాలభవనంలో (ఇంటిలో) ఒకవైపు విశ్రాంతిగా నుండుచు తమ అనుష్ఠానాధ్యయనములను సలుపుకొను చుండెడివారు. అనంతరము గుంతకల్లు శ్రీవన్నప్పగారి ఛాత్ర నిలయ మునకు దయచేసి యథారీతి నిత్యకార్యక్రమములచే శాస్త్రార్థ ప్రసం గములచే నిష్ఠనుండిరి.

శ్రీగురుదైవభక్తి పరులగు శ్రీపోలా బాలసుబ్బయ్యశేష్ఠిగారు, 1.1.56 న వీరు ఆంధ్రరాష్ట్రమందలి ప్రముఖ వ్యక్తులందరికి శ్రీవారి జీవితచరిత్ర (శ్రీశంకరానందగిరి గురువర చరిత్ర) పంపించిరి.15.1.56 శ్రీమదుత్తరాయణ పుణ్యకాలమున గుంతకల్లు పురభక్తులనేకులకు మంత్రార్థమును గురించి వివరించుచు తదనుష్ఠాన విధానములతో సర్వవిషయములను బోధించిరి(శ్రుతపఱచిరి).అనుదినము ఇరుపూటలు శ్రద్ధచే భక్తులనేకులు శాస్త్ర శ్రవణమునకు వచ్చుచుండిరి. అందులో ఒకరు ఉత్తమ బ్రాహ్మణులగు గుంతకల్లు శ్రీజగద్గురు పండితారాధ్య హైస్కూలు హెడ్మాస్టర్ బ్రహ్మశ్రీ యం. రామచంద్రరావుగారును ప్రతిదినము స్వామి శ్రీముఖమునుండి వెలువడు ప్రవచనములు విని తన్మయులగుచు సంతోషము నొందుచుండిరి. పూజ్యస్వామీ ! తమ ప్రబోధ బోనఫైడ్ టీచర్ టీచింగ్ వలె వినువారికి తమ శక్తి నొసగి ఃనుపించుచు తద్రూపులుగ జేయుచున్నారు. సర్వకాలముల యందీ బ్రహ్మదృష్టి మాకు ఉండునో యుండదో తెలియదుగాని తమసన్నిధి 1½ గంటసేపు విన్నంతకాలమైనను ప్రత్యగభిన్న పరమాత్మ స్వరూపు డనను దివ్యమయ భావన శ్రద్ధావంతుడగు ప్రతివ్యక్తికిని తప్పక కల్గును, కొన్నిదినములు శ్రద్ధచే తమ వాక్యము లాలకించిన విషయ

మిది యని తెలిసి మరల నామానవుడు పొరబడడు. అట్టి స్పిర్చుపల్ పవర్‌తో కూడిన వాజ్మ్మాలము తమ ప్రబోధయని మహాసంతోష మున బలుకుచు శ్రీవారిని అత్యంత ప్రేమాదరములతో 20.1.56 తమ ఉన్నత పాఠశాలకు తోడ్కొని వెళ్ళిరి. శ్రీజగద్గురు పండితారాధ్య హైస్కూలులో విద్యార్థులును అధ్యాపకులు స్వామికెంతో ప్రేమతో స్వాగతముపల్కిరి. పిదప గురుస్వామివారు ఆదృశ్యమును గాంచి మహదానందముతో తైత్తరీయ శిక్షావల్లి వ్యాఖ్యయొనర్చిరి. విద్యార్థులు అధ్యాపకులును సముల్లసిత సంతుష్టాంతరంగులై కరతాళముల నొనర్చుచు స్వామి కనేకములైన జోహారు లొనర్చిరి.

శ్రీమాన్ బి. వన్నప్ప శ్రేష్ఠిగారి హాస్టల్‌లో ఏర్పరుపబడి నడచుచుండిన 1. అ. గీతాభాష్యప్రవచనము వివేకచూడామణి ప్రవచనము మంగళప్రదముగ పూర్ణమాయెను. సర్వభక్తులు ముముక్షువులు సంతసిల్లిరి.

చైతన్యాత్మ నేనను దృఢమతి కలుగనంతవఱకు మనస్సు స్వాస్థ్యమునొందక తిరుగుచు ఏవేవో నేనని భావించి ఆగంతుకమగు అనాత్మ విషయముల వెంబడి పరువు లిడుచుండును. నిజ శాంతి లభించదు.

గురుతత్త్వ మాత్మ యని ఎరుగనంతకాలము గురుమహిమ అర్థముగాదు. మానవుడు తరించలేడు.

భగవత్తత్త్వమున నిజనిష్ఠ నెలకొననంతవఱకు ప్రపంచము యొక్క అనిత్యత తెలియదు.

గురుశిష్యుల సంబంధము ఆధ్యాత్మిక జీవనమునకు సంబంధించినదియే కాని, లౌకికము కాదు. లౌకిక దృష్ట్యా గ్రహించు వారు నిజము గానక ఆత్మవిద్యనుండి దూర మగుదురు.

నిత్య శాంతిప్రదమగు నిజమైన ఆధ్యాత్మిక జీవన మలవడవలె నన్న నిష్కాపట్యము, నిర్మల వర్తన, నిజ గురుభక్తి, ఉత్కటమగు

శుభేచ్ఛ యుండినగాని సాధ్యముకాదు.

గురుస్థానమున నిష్కపటమగు భక్తి శ్రద్ధలు గలిగియుండినచో అట్టివాడు సత్వరమున పూర్ణానుభవము నొందును.

5.2.56 కు రాగులపాడు మఠమునకు శ్రీసద్గురు ఆత్మానంద స్వామి పుణ్యారాధనకై వచ్చి ఆకార్యక్రమము చూచుకొని ఉరవ కొండ హైస్కూలు అధ్యాపకులు కోరిన ప్రకారము అచటికి దయ చేసిరి. విద్యార్థులతో సహ హైస్కూలు అధ్యాపకులందరు ప్రేమచే స్వామిని స్వాగతపఱచిరి విశాలమగు ఈఛాత్ర నిలయము విద్యార్థులు అధ్యాపకులు, ఉన్నతోద్యోగులు మొదలగు పుర ప్రముఖులచే నొప్పుచు నిండియున్న ఆ గొప్ప సభయందు సాయంకాలము 4గం॥ నుండి 6 గం॥వరకు శ్రీవారు వేదవిద్య యను శీర్షికపై ఉపన్యసించిరి. సర్వులు మనసొప్పి మహాసంతోషము నొందిరి. తెలుగు పండితులు బ్రహ్మశ్రీ యన్. పేరరాజు మహోదయులు శ్రీవారి జీవితచరిత్ర ప్రసంగములను ముచ్చటించుచు "మాస్కూలునందు చదువుకొని ఎందరో పెద్దఉద్యోగములను సంపాదించుకొని యున్నారు. అయినను ఇవన్నియు అనిత్యమైన పొట్టకొఱకైన భౌతిక విద్యావిషయములు. ఈమన శ్రీవారైననో మన స్కూలునందే చదువుకొని సర్వాధార మగు భగవత్తత్వము నరసి నిత్యశాంతి సుఖములను తాము చూర గొనుచు, లోకమునకే తద్విషయములను ప్రబోధించు మహనీయులై సత్కీర్తిని గడించినారు. ఇది మా యున్నత పాఠశాలకెంతయు ఎన లేని కీర్తి. వీరు విద్యార్థిదశలో నుండి వెలువడి వైభవోపేతమగు స్వామిత్వమునుబడసి శాంతి తత్త్వమును ప్రచారము చేయువారగుట యనిన ఇది సర్వులకును సాధ్యమగునది కాదు. త్యాగాదర్శముచే నొప్పు జ్ఞానతత్త్వము కడుదుర్లభము. ఎందరో గొప్పపండితులుఉన్న తోద్యోగులుగ నుండవచ్చును. కాని ఈస్థితి అపూర్వము. శతకోటి జన్మసుకృతైః పుణ్యైర్వినాలభ్యతే" యన్నట్లు పుణ్యపుంజమే ఈ

మూర్తి త్వము. "చదువులలో మర్మమెల్ల జదివితి తండ్రీ" యను ప్రహ్లాదోక్తిరీతి శ్రీవారు బ్రహ్మవిద్యా శ్రీయుతులై యున్నారన్న మనమందరము గర్వింపదగిన విషయమని నే విశ్వసించుచున్నాను..." అనునిత్యాది విషయములను తెలిపిరి. ఇట్లు సర్వులు ముదమలర నందనసమర్పరణతో సభ విరమింప బడెను. తరువాత శ్రీవారు తమ పరమ గురుస్థానమగు (నంద్యాల) బుక్కాపురం శ్రీ నిర్వాణ మఠ మునకు దయచేసి నిష్ఠచే మహాశివరాత్రివరకు అచ్చటనే యుండిరి.

10.3.56 శ్రీశివరాత్రి మహోత్సవము విధ్యుక్తముగ ఉదయ సాయంకాలములయందు మహాత్ములచే ఆధ్యాత్మిక తత్త్వ ప్రవచనాదులు జరుపబడుచు శ్రీవారి ఆధ్వర్యమున కార్యక్రమము 3 దినములు జరిగెను. శ్రీపూజ్యపాద శ్రీశుద్ధచైతన్యస్వాములవారు, పూజ్యపాద శ్రీరామకృష్ణానందస్వాములవారును శ్రీశేషయ్యస్వామివారును దయచేసియుండిరి. నానాప్రాంతములనుండి వేలాదిగా భక్తులు వచ్చి యుండిరి. శ్రీ శివప్రకాశానంద స్వాములవారే ఆశ్రమ ధర్మకర్తగా నుండి సర్వము సువ్యవస్థముగ చూచుకొనిరి. అనంతరము గుంతకల్లు శ్రీకోదండరామాలయమున శ్రీరామనవమి కార్యక్రమమునకు వచ్చిరి ఆ సమయముననే అచటికి దయచేసి యున్న శ్రీ ఆచార్య వినోబా భావే గారిని దర్శించిరి.

2.5.56 తారీకున సూర్యసింహాసనాధీశ్వర ౧౦౮ శ్రీమజ్జగద్గురు వాగీశపండితారాధ్య శివాచార్య మహాస్వాములు ప్రేమచే మన శ్రీవారిని తమమఠమునకు (గుంటకల్) పిలిపించుకొని బృహద్రూపముగ కర్నాటక భాషయందున్న తమ జీవితచరిత్ర నిచ్చి తాము దీనిని తెలుగులో సంక్షిప్తముగ అనువదించి ఇవ్వవలయును, స్వామీ! యని ఎంతో గారాబముగ శ్రీజగద్గురువులు పుస్తకమును ప్రసాదించిరి. దానిని స్వామిభక్తితో గ్రహించి శ్రద్ధచే అనతి కాలముననే చక్కని మృదుమధురశైలిలో ఆంధ్రభాష యందనువదించి శ్రీ జగద్గురువుల

సన్నిధికి వెళ్ళి వినిపించి ఆంధ్రీకరింపబడిన యా గ్రంథమును సమర్పించిరి. శ్రీ జగద్గురు మహాస్వాములవారు ఆశ్చర్యముతో మహాసంతోషము నొంది ఎంతచక్కగా మరింత కొద్దికాలముననే రసవత్తరముగ రచించితిరికదా! యని సంతసించుచు స్వీకరించిరి. పిదప లత్తనరమున శ్రీ శంకర జయంతి యథాశాస్త్రముగ జరిగెను. త్రికాలానుష్ఠానము, ప్రస్థానత్రయ పారాయణ ప్రవచనాదులు విధ్యుక్తముగ నడచెను. ఆచార్యస్వామి ఉత్సవము 14.5.56 వైభవముగ జరిగెను.

యథార్థమగు స్వస్వరూపజ్ఞానలోపమే అజ్ఞానతత్కార్య కలాపములగు దుష్టలక్షణములకు మూలము. కావున సర్వప్రయత్నములచే భక్తిజ్ఞానములచే యథార్థాత్మానుభవమును గురుశాస్త్రయుక్త్యనుభవ మూలమున పొంది ధన్యుడవగుము.

మనఃస్వాస్థ్యము నొందిన ప్రాణము స్థిరత నొందును. స్వరూపవిషయక జ్ఞానమున కిది యొక సాధనము. లోవెలి సంచరించు ప్రాణమును పరికించుచుండుము. సర్వము శాంతి మయమగును.

నిత్యానుష్ఠానము ప్రారంభమున నిరుత్సాహముగ నుండినను పట్టువిడువక అత్యంతగురుభక్తి విశ్వాసములచే ననుష్ఠించుము. అదియే నిజసుఖ శాంతులనిచ్చును.

భద్రమగు బ్రహ్మచర్య వ్రతనిష్ఠ గలిగి యుండుము. అట్టి అనుష్ఠాన సంజనితమగు సుప్రసన్నమైన మనస్సే నీకు గురువై సర్వవిధముల నిన్ను గాచును.

తాను సచ్చిదానందాత్మయను ధృఢ విశ్వాసలోపమే మనుజుని నాస్తికతను తెలుపును. వృథా కల్పనాత్మకమగు దుఃఖములను మనోవ్యథలను తెచ్చిపెట్టును. విచారదృష్టిచే చూచిన అవి నిజముగా లేవు. నిష్ఠగలిగి యుండవలెను.

దురాచారములు మానవ జీవిత ధ్వంసకారకములు. ఎప్పటికిని శ్రేయోదాయకములు కావు. కావుననే ఆపాత రమణీయములగు విష

యములకు లోనుగాకుము. "నావిరతో దుశ్చరితాత్ "యన్నట్లు సర్వ ప్రయత్నములచేతను సాధకుడు దుష్టాచార విచారములకుదూరముండి శీలసంపదలతో నుండుట ముఖ్యకర్తవ్యము. తపస్సు అత్యవసరము.

అశుద్ధము, అయోగ్యమునగు మానసికప్రవృత్తులను, శుద్ధమును నిత్యమునగు ఆత్మసంభావనచే (వివేకముచే) నణచవలయును. "ఉత్థితా నుత్థితా నేతాన్ ఇంద్రియాహీన్పునః పునః హన్యా ద్వివేక దండేన వజ్రేణేవ హరి ర్గిరీన్."

పరిచ్ఛిన్నమును దుఃఖభాజనమగు సంపదను ప్రోగుచేయు బుద్ధిచే పూర్ణుడును నిత్యాపరోక్షుడునగు ఆత్మనుమరచిపోవలదయ్యా? జీవన పరమలాభము ఆత్మజ్ఞానము, విద్యా తపస్సు లత్యవసరములు.

దీపమును వెలిగించిన అది ఒకవస్తువును మాత్రమే ప్రకాశింప జేయదు. అచటనున్న సర్వమును ప్రకాశింప జేయునుకదా! అటువలె తన్ను చైతన్యాత్మ జ్యోతిగా నెరిగిన సర్వమును ప్రకాశించు సాక్షివి నీవు. సాక్షి భాస్యమే సర్వమని అర్థమగును.

వీధిబళ్ళలో చిన్నపిల్లలు అక్షరములు దిద్దునపుడు వారికి విసుగుగా నుండును. కాని పెద్దవారైన పిదప నదిమహోత్తమమగు అర్థమును కలుగజేయును. అటువలె సాధకునకు మొదట తన సాధనల యందు కొంతవిసుగు జనించినను పట్టువదలక సాధనసాగించినఅతడు పూర్ణానుభవము నొంది పెద్దవాడగును, తృప్తుడగును.

2.5.56 సోమవారము ఉత్తవరమునుండి శ్రీవారు గంజిగుంట శ్రీమఠమునకు దయచేసిరి. స్వామి పూర్వాశ్రమసంబంధములగుయావ దాస్తి పాస్తులు. లెక్కాచారము పత్రములు, దస్తావేజులు, రిజష్టరు పత్రములు మొదలుగాగల ఆదస్తరము నంతయు ఇంటినుండివైనముగ తెప్పించి ఇవి యుండినచో అందరికి కన్నే, ఈవిషయకమగు వృత్తులే ఎవరికి కలుగకుండుగాక! యని గురుసన్నిధి గంజిగుంట శ్రీమఠంలో ప్రాంగణమున పెద్దగా మంటవేయించి అందులోయాదస్తరమునుంచి

అగ్ని దేవుని కర్పించి మహదానందము నొందిరి. ఈదృశ్యమునుగాంచి భక్తాదులు ఆశ్చర్య చకితులయిరి. "నిస్పృహస్య తృణం జగత్" అన్నట్లు వైరాగ్య చక్రవర్తియగు శ్రీస్వామి కిదేమి విశేషముగాదు. వైశాఖ శు ౧౫ గురువారము 24.5.56 మొదలు 1.6.56 వరకు విధ్యుక్తముగ శ్రీమద్భగవద్గీత ౧౧౦౮ సార్లు యావద్భక్త మండలి వారందరు చేరి వ్రతరూపమున ఆశ్రమమున గీతాపురశ్చరణము జేసిరి. అనుదినము ఉదయము 8.30 నుండి 10 గం॥ వఱకు మంత్రార్థవివరణ, సాయంకాలము 4 నుండి 5.30 వఱలు నైష్కర్మ్యసిద్ధి గ్రంథప్రవచనము జరుపబడెను. గుంతకల్లు, గుత్తి, అనంతపురము, లత్తవరము, ఉరవకొండ, కుందనగుర్తి, నంద్యాల మున్నగు స్థలములనుండిఉత్తమ గురుభక్తులెందరో వచ్చియుండిరి ఈ సుసంధియందు గీతాపురశ్చరణ మహాయజ్ఞము, గురునిష్ఠ, వాక్యార్థశ్రవణము:అపూర్వముగానడచెను.

గంజిగుంట శ్రీమఠమునుండి స్వామివారు 4.6.56 గుంతకల్లు శ్రీవన్నప్పశ్రేష్ఠిగారి విద్యార్థినిలయమునకు వెళ్ళిరి. అచ్చట యథా రీతిని నియమ సంపదతో శాస్త్రప్రవచనాదులుజరుపుచుండగా6.6.56 తారీకున పురప్రముఖు లగు గురుభక్తులెల్లరు జేరి శ్రీస్వామివారికిఒక ఆశ్రమము కట్టించవలయునని శ్రీవారితో తెలుపుట — అందులకు స్వామివారు "బాబూ ! ఏనూతనమైన ఆశ్రమములు మాకు కట్టుట వలదు అది మహాప్రతిబంధము. మేమెచ్చట యుందుమో అదే అప్పటికి మాపాలిట కైలాసము మహాపవిత్రాశ్రమమై యుండును. మాకు గాను ఒక ప్రత్యేకాశ్రమమును మాటసుతరాంవలదు. ఆసంస్కారము మాకు లేదు. ఏదో నిర్మలముగ నుండిన స్థలములో కొంత కాలముండుట మరల ఎవరిది వారికి విడిచివెళ్లుటయేగాని దానితాదాత్మ్యము మాకు అక్కరలేదు. అన్ని ఆశ్రమములు మాయవియే. ఏవియును మావి కాదు." అను నిత్యాది విషయములను తెలిపి భక్తుల నూరడిల్ల జేసిరి. కాని ఆశ్రమము ఉండవలయుననియే భక్తుల భావము నిలిచియుండెను.

మరియు ఈవచ్చు 12.వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము శ్రీవారిచటనే సలుపవలయునని భక్తిచే అందరు విన్నవించుకొనిరి. అందులకు శ్రీవారు సమ్మతించుచు శ్రీగురు కరుణ యనిరి.

ఆపిదప శ్రీమాన్ కర్నూలు చిలుకూరు పాపయ్య, వీరణ్ణ శ్రేష్ఠి గార్ల ప్రార్థనానుసారము అచటికి దయచేసి ఉపనిషదర్థములను శ్రవణము గావించిరి. తమ నిత్యనియమానుష్ఠానాది కార్యములచే నచట భక్తులతో కూడి బ్రహ్మయజ్ఞము ఆనందప్రదముగ సాంగమంగళ మాయెను. పిదప పరమగురుస్థానము శ్రీనిర్వాణ మఠము దయచేసి ఆరాధనకార్యము శివప్రదము జరిపిరి.

గుంతకల్లు శ్రీకన్యకాపరమేశ్వరి దేవస్థానమునందు పూజ్యశ్రీ గురుదేవులు 12. వ. శ్రీచాతుర్మాస్య మహావ్రత కార్యక్రమము జరుపవలెనని ఈస్థలమే ఆమహాకార్యమునకు తగిన వసతి యని దేవాలయము అధ్యక్షులు శ్రీవంకదారు వెంకటరామయ్య శెట్టి మొదలగు దేవస్థానం సంఘమువారందరును మరియు పురప్రముఖ భక్తమండలి సర్వులు నిర్ధరించుకొని శ్రీవారిని దోడ్కొని వచ్చి అత్యంత భక్తిచే స్వాగతమొసగి శ్రీకన్యకాపరమేశ్వర దేవాలయమునందు సన్నిధి గావించిరి. వ్రత మహాకార్యక్రమ కమిటి నొకటి నిర్మించుకొని భక్తి శ్రద్ధలచే అన్నికార్యములను అందరు చక్కగ చూచుకొనిరి. నిర్వహించిరి.

## 12.వ శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1956 సం॥

శ్రీదుర్ముఖినామ సం॥ ఆషాఢ శు ౧౧ ఆదివారము 18.7 56 బ్రహ్మముహూర్తమున ప్రభాతసేవ, మంగళవాద్యములతో పావన గంగా కలశమును దెచ్చి వేదఘోషలచే విధ్యుక్తముగ ఉషఃకాలమున కలశస్థాపన మున్నగు కార్యములచే గురుపరంపరాస్తోత్రపూర్వకముగ వ్యాసపూజ, శ్రీచంద్రమౌళీశ్వర శారదా శ్రీగురుపూజలు, మహా

న్యాసపూర్వక శ్రీరుద్రాభిషేకము, ప్రస్థానత్రయ పారాయణము శివసహస్రనామ బిల్వార్చన, మొదలగు కార్యక్రమములన్నియు ఉదయము 9 గం. వరకు జరిగెను. ఆ పిదప పూజ్యశ్రీవారు ఈశావాస్యోపనిషద్భాష్యప్రవచనమారంభించిమంత్రపుష్ప మహామంగళము లతో ప్రాతఃకాలపు కార్యక్రమమును పూర్ణముగావించిరి. సాయంకాలము ప్రదోష పూజానంతరము 7 గం. నుండి 8-30 గం. వరకు శ్రీమద్భగవద్గీత శాంకరభాష్య ప్రవచనము మంగళము ఇత్యాదిగా ప్రతిదినము నిత్యనియమ వ్రతశీలసంపన్నమై 18-7-56 మొదలు కార్తిక శుద్ధ ౧౨ గురువారము 15-11-56 వఱకు అవిచ్ఛిన్నముగ ఏకధారయై నడచిన ఈ నాలుగుమాసములలో ఈశ, కేన, కఠ, ప్రశ్న ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తరీయ, ఛాందోగ్య, బృహదారణ్య కోపనిషత్తులు శ్రీమద్భగవద్గీతాభాష్య ప్రసంగములు యథోచితముగ చక్కని శ్రుతి యుక్త్యనుభవములచే సర్వజనానంద కరముగ ప్రతిపాదించుచు శ్రోతలకు పవిత్రమగు నొక ఆధ్యాత్మిక దివ్య సంస్కృతిని కలుగజేసిరి. 4 మాసములొక మహాపండుగయై జీవితమున అత్యంతసుదినములై గడచిపోయెనని సర్వులుఅమితానందమునొందిరి.

మరియు ఈమహావ్రత మధ్యకాలమున ఆహూతులై వచ్చిన స్వాములు పూజ్యపాద శ్రీ శుద్ధచైతన్యస్వాములవారు (గుంటూరు) పూజ్యపాద శ్రీ శంకరానందస్వాములవారు (ఆళ్ళగడ్డ) పూజ్యపాద శ్రీరామకృష్ణానంద స్వాములవారు (గండిక్షేత్రం) పూజ్యపాద శ్రీ భూమానంద స్వాములవారు (కొత్తచెరువు) పూజ్యపాద శ్రీకేశవతీర్థ స్వాములవారు (పిడుగురాల) పూజ్యపాద శ్రీ శ్రో॥ బ్ర॥ శంకరానంద స్వామి (సురపురం) మున్నగు మహాత్ములు ఈ ఆధ్యాత్మిక తత్త్వోపన్యాసములు జేసిరి. గుంతకల్లు పట్టణముననే మొమ్మొదట దీర్ఘకాలముగ నడచిన మహావైదిక కార్యము. వైభవోపేతమునగు ఆధ్యాత్మిక కార్యక్రమమునకై వచ్చిన మహాత్ములును మరి యావత్ప్రజలును

చెప్పుకొనుచు ఆనందించుచుండెడివారు.

ఈ ఆధ్యాత్మిక కార్యక్రమము కార్తీక శు॥ ౧౧॥అఖండషోడశ నామ భజనపూర్వకముగ 15-11-56 ద్వాదశి కలశోద్వాసనాది కార్యములచే పూర్ణమాయెను. చివరిదినము భూరి అన్నసంతర్పణ జరిగెను.

నాటి సాయంకాలపు సభ శ్రీవారిచే లత్తపరమున స్థాపింపబడిన శ్రీ ఉమామహేశ్వర పాఠశాల విద్యార్థిబృందము బాలబాలికలచే భగవద్గీత, ఆధ్యాత్మిక ప్రశ్నోత్తరముల పోటీపఠనముగ జరుపబడెను. ఆబాలగోపాలమెల్ల ప్రజలు చిన్నారి యాబిడ్డల ముఖారవిందములనుండి వెలువడు గీతాశ్లోకములు ఆధ్యాత్మిక ప్రశ్నోత్తర పాఠములను విని అమితానందము నొందిరి. పిదప శ్రీగురుస్వాములవారు తమ అమృతహస్తములచే బిడ్డలకు గీతాపుస్తకముల నిచ్చిరి. తదుపరి శ్రీవారు, గుంతకల్ పురవాసులగు యావద్భక్తమండలివారు తను, మన ధనాదులచే చేసిన సేవ ప్రశంసనీయమనియు, ఆత్మజ్ఞానప్రదమనియు దెలుపుచు, శ్రీమదుమామహేశ్వర గురుపీఠ పరంపరాశక్తి వీరికి సమస్తసన్మంగళములను ప్రసాదించును గాక! యని శుభాశీస్సులు తెలిపిరి.మరియు ఇది 12వ శ్రీచాతుర్మాస్యమహావ్రతము.ఇచ్చటికి ఒక పట్టా యయినది ఏకార్యమైనను సాంగమంగళముగ 12 వత్సరములు జరిగిన ఇక నాకార్యము సంపూర్ణసిద్ధి నొందినట్లని యందురు. దీనినే మాక్తికోత్సవమనియు బిలుతురు. యిట్లు పూర్ణమగు నీకార్యము గుంతకల్ పురముననే జరుగుట ఈపురవాసుల పుణ్యావిశేషము అను నిత్యాదిగా స్వామి సెలవిచ్చిరి. బుద్ధిమంతులగు కార్యదర్శి శ్రీమాన్ బుశెట్టి వీరభద్రయ్య శ్రేష్ఠిగారికి శ్రీవారు సన్నిధినుండి (సర్టిఫికెట్ ఆఫ్ మెరిట్) యోగ్యతాపత్రమునొసగి నాశీర్వదించిరి.

అనంతరము శ్రో॥ బ్ర॥ శ్రీశంకరశాస్త్రి స్వాములవారు గుంతకల్ శబ్దనిర్వచనముజేయుచు శ్రీవారిసాన్నిధ్యమున ఈమహాకార్యక్రమము నడపిన మీరెంత భాగ్యవంతులో, లక్షలాది ధనము విపరీత

మిగు పరిశ్రమ జరిగినను 4మాసములు (122దినములు)అవిచ్ఛిన్నముగ నిట్లు (బ్రహ్మయజ్ఞము) ప్రశాంతముగ జరుగుట మహా చమత్కారము. మీ రెంత నిష్కామ పుణ్యవంతులో యనియు శ్రీవారిని చిన్నతనము నుండి మేము చూచుచునే యున్నాము. వీరి తపఃప్రభావమున ఇంతటి మహాకార్యములు జరిగినవి. వీరు "శ్రీశుకయోగీంద్రులు" అని నిత్యా దిగా ఉపన్యసించిరి. పిదప మంత్రపుష్ప మహామంగళ జయజయ ధ్వానములతో మంగళవాద్యములు మ్రోగింపబడెను. కార్యము సమాప్తమాయెను.

దీక్షావిరమణకై శ్రీవారు హంపీమహాక్షేత్రమునకు భక్తులతో గూడి దయచేసిరి. 8-11-56 కార్తిక శు॥ పూర్ణిమ శ్రీచక్రతీర్థము నందు శ్రీవారు దీక్షావిరమణముగావించి సంకల్పముపూతముగ పావన భాగీరథియగు తుంగభద్రయందు జలకమాడి సర్వభక్తులకును సంకల్ప పూర్వకముగ పవిత్ర తుంగాజల సంప్రోక్షణ మొనర్చి పునీతమగు పరమైక భావనలచే సర్వులుఁగలసి శ్రీకోదండరామక్షేత్రమున శ్రీమద్భ గవద్గీతా పారాయణ పూజనార్చనాది కార్యములెల్లయు ముగించు కొని శ్రీవిరూపాక్షేశ్వర స్వామిని సందర్శించి మహాన్యాసపూర్వక శ్రీరుద్రాభిషేకాది పూజలు గావించిరి. సాయంకాలము ఆ మహా క్షేత్రమున సభ జరిగెను.

ఈసమయమున తాత్త్విక కవితావిశారద శ్రీ ఓ. నారాయణప్ప గారు ఇట్లు గాన మొనర్చిరి.

సీ॥ సాహిత్య సంస్కృత సలలిత మృదుపద
సాత్త్విక వాక్సుధా సారమగుచు
శమదమోపేతమై సచ్ఛీలసారమై
సంకల్పరహిత చిత్సదనమగుచు
సదసద్వివేకమై సమతకైవల్యమై
సంవిత్ప్రభావమై శాంతమగుచు

సత్యనిష్ఠాపర సర్వోపనిషదర్థ
సారమై జ్ఞాన ప్రచారమగుచు
గీ॥ సాధుకులపాలి మోక్ష ప్రసాదమయ్య
పదమలంబగు మీబోధ సాధుచర్య!
సల్పుచున్నాను వందన శతము జియ్య!
శంకరానందగిరి సద్విహార ॥

## ఆనందభైరవి - రూపక

ఉపనిషద్వీధులలో విహరించుచున్నావా! కృపసాక్షివై జీవకోటినున్నావా!
సనకాదిమునీబృందసానందనిలయుడై సచ్చిదానందుడై
స్వామివైనావా! నా! స్వామివైనావా! జనకాదిరాజర్షి సత్తముల
భాగ్యమవై కన నఖిల బ్రహ్మాండరూపుడైనావా! ॥ఉ॥
చిల్లిల నారద వశిష్ఠాది మౌనీంద్ర సల్లలిత హృదయాల చవిచూలగొన్నావా!
కల్లి జన్మాలెల్ల కడజేసి సన్ముక్తి మెల్లగా నొసగు చిన్మూర్తివైనావా ॥ఉ॥
మునిభక్త సురవర్గమునకు కల్పకమునై మొనసి ముల్లోకాలమునిగితేలెదవా!
అనరాని కనరాని ఘనచిన్మయానందమున నీవనీవై ప్రమోదమొందెదవా॥ఉ॥
కల్లోలమౌ మాయ కనుపించకున్నావా। చల్లగా శుద్ధసత్వాన వెల్గెదవా
తొల్లింటి నీరూపుతో నుండగా నన్ను తల్లివై బ్రోవంగ దయరాదదేవా ॥ఉ॥
సంకరమౌ త్రిగుణాల సంకటముల పౌరలుజీవ!
సంతతిన్ సముద్ధరింప సాగివచ్చితివా దేవా సాగివచ్చితివా ॥
శంకలెల్ల బాపి నిర్మలసత్యబోధ నెరుకపరచ!
శంకరానందగిరివర! స్వామివైయున్నావా! నా స్వామివై యున్నావా ॥
నారాయణాఖ్యుడన్!నర్మిలిన్ ననుబ్రోవ నారాయణా నిన్ను నమ్మియున్నాడా
అరయగనే నీవ యీవే ననుచుచాల!అలవేదచోదితమౌ ఆబోధనేవింటి. ॥ఉ॥

మరియు ఈద్వాదశచాతుర్మాస్య మహావ్రత సుసందర్భములో గంగవరం శ్రీభీమాచారియనువినయవిధేయ గుణసంపన్నుడగు బ్రహ్మచారి యొకరు వచ్చి శ్రీస్వామిసన్నిధి జేరిరి. మరియు గుంటకల్ శ్రీ గుండా పాపయ్య శ్రేష్ఠిగారి జ్యేష్ఠపుత్రుడు విద్యా వినయ వివేకాది గుణవంతుడగు శ్రీ వేంకటస్వామి యను బ్రహ్మచారి శ్రీవారిఅను

గ్రహము నొంది శ్రీసన్నిధి జిజ్ఞాసాపరుడై గురుకులవాస మొనర్చు చున్నాడు.

శ్రీవారి మృదు మధురమగు అనుభవముచే నొప్పు శ్రీమద్భగవద్గీతా ఉపనిషత్ప్రవచనము లెంతయు పూజ్యములు. ముముక్షు జనోత్తారకములు. శ్రీవారు ఈమహావ్రతారంభ దినములలో ప్రవచించిన విషయమును సంగ్రహముగానిందు కనబఱచెదను.

ప్రత్యగభిన్న పరమాత్మ స్వరూపులారా !

గుంతకల్ పట్టణమున 12వ శ్రీచాతుర్మాస్య మహావ్రతము శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ఆలయమునందు జరుగుటెంతయు మహా విశేషము. ఏకార్యము 12 వత్సరములు అకుంఠితముగ జరుగునో ఇక నది చిరసిద్ధిని గాంచినట్లే యని పెద్దలందురు. అటువలె మా వ్రత పరి పాలన ద్వాదశ వర్షము ఈపుణ్యక్షేత్రమున సాంగమంగళమై జరుగు చున్నదన్న పరమ ధన్యమని సంతసించుచు గురునమస్కార పూర్వక ముగ గీతాతత్త్వ శాస్త్రమునందు ప్రవేశింతము. ఈబ్రహ్మయజ్ఞ మును జరుప సర్వప్రకారములచే శ్రద్ధాభక్తి యుక్తులై మీరందరు సేవచేయుచు ఇందు పాల్గొని యున్నారన్న మీరు పవిత్రులు. పరమ సుకృతాత్ములనుట యందు సందియము లేదు.

శ్రీమద్భగవద్గీత మహాభారత మధ్యమున విద్యోతమానమగు మధువిద్య, లేక బ్రహ్మవిద్య యనబడును. చతుర్వేదముల సారసర్వ స్వమే ఉపనిషత్తులు. వాటిసమన్వయ సిద్ధాన్తమే బ్రహ్మసూత్రములు. పై రెండు ప్రస్థానముల అర్థమునకు దూరముగాక సర్వులు సులభముగ గ్రహించి, ధన్యులవుదురుగాత యను మహాసిద్ధి సంకల్పముచే నియ్యది (గీత) మహాభారతమను సుందరోద్యాన, కుసుమమున సుగంధోపాధి నొప్పుచు ముముక్షు జన మధుపములచే నాస్వాదింపబడుచుఅక్షయమై అఖండ సుఖము నొసగు సర్వోపనిషత్తుల సారసర్వస్వమే ఈశ్రీమ ద్భగవద్గీత,"తదిదంగీతాశాస్త్రం సమస్త వేదార్థసారసంగ్రహభూతం"

"తస్యాస్య గీతాశాస్త్రస్య సంక్షేపతః ప్రయోజనంపరంనిఃశ్రేయసం సహేతుకస్య సంసారస్య అత్యన్తోపరమలక్షణమ్" అని శ్రీశంకరభగవత్పాదుల భాష్యమునందు గలదు. ఈభగవద్గీతను అధికారియై అరసిన ఈఆత్మ వ్యాపకమగు అద్వితీయ బ్రహ్మమై యున్నదనుఅనుభవముచే అతడు అర్జునునివలె విగత మోహుడై కార్యసహిత కారణాజ్ఞాన నివృత్తి ద్వారా స్వస్వరూప స్థితి నొంది ముక్తుడగును. ముముక్షువుల పాలిట ఇదిపెన్నిధి, పెద్ద పాండిత్యమేమి అవసరము లేదు. కొద్దిగ సంస్కృత జ్ఞానముండినను చాలు. వివేక యుక్తమైన అవిచ్యుతమగు శ్రద్ధయొకటి భద్రమై యుండవలెను. అను నిత్యాదిగా పూర్వాపర సంబంధములను అతి విపులముగ ఆకర్షణీయమగు సాహిత్య సౌరభముచే నొప్ప అనేక విషయములను నిరూపించి క్రమముగ 4 మాసములలో 18 అధ్యాయములను సంక్షిప్తముగ భాష్యానుసారము "భాష్యం ప్రసన్న గంభీరం" అన్నట్లు నిత్య నూతనముగ తదభిరుచి బాయని విధమున అమరమగు భగవద్గీతా తత్త్వోపదేశములను చేసిరి.

మొదటి అధ్యాయము అర్జునవిషాదయోగము. భారతీయసమస్త దర్శనములు విషాదము నుండియే బయలుదేరి సర్వ దుఃఖోపరమగు బ్రహ్మాత్మనా సంస్థితిరూప నిజస్థితియందు పూర్ణమగును. దుఃఖము, దుఃఖకారణము అవివేకముచే యుక్తమైన నిజస్వరూప జ్ఞానములేక అహంకార మమకారమే యని భావము. ఈ రెండు విషయములను గురించిన వ్యాఖ్య అర్థాత్ పూర్వమీమాంసా శాస్త్ర ప్రక్రియ ఈ మొదటి అధ్యాయము-భారతకథ.

2వ. అధ్యాయమున గురూపసదనము 11వ. శ్లోకమునుండి గీతోపదేశ వివరణము. జ్ఞానము జ్ఞానసాధన (బుద్ధియోగము) ఏతన్మహిమ, అట్టిజ్ఞానాత్మ స్వరూపుడవే నీవను అమరోపదేశము. తదనుభవియగు స్థితప్రజ్ఞుని వర్ణన. సాధకునకవి సాధ్యములు. సిద్ధుడగు స్థితప్రజ్ఞునకు సహజము. ఇట్టి సహజస్థితి నొందుటయే సంపూర్ణమగు మానవత్వము

అనునిత్యాది అపూర్వ విషయములిందు ప్రతిపాదింపబడినవి.

3వ. అధ్యాయమున అజ్ఞదృష్టిచే అవిభాజ్యమగు సృష్టికర్మను గురించిన చక్కని వర్ణన జ్ఞానియొక్క అసంగానుభవము. అసంగాత్మ జ్ఞానముచే కర్తవ్యము నాచరించుట లోకహితము. దానికడ్డమగు రజో గుణ సముత్థితమైన కాముని ఆత్మ బుద్ధిగలవాడవై బరిమార్చుము. ధీసాక్షివగు చిదాత్మయే నీవని తెలియుము. ఇత్యాది విషయములు.

4వ. అధ్యాయమున బ్రహ్మవిద్యా గురుపరంపరాభి వర్ణనము. అవతారము, అవతారోద్దేశ్యము తత్కర్మధర్మాది నిమిత్తమాత్రమైన అకర్మతా దృష్టి పూర్వకమగు వ్యవహారము. 12 యజ్ఞములు. గురు సాన్నిధ్యము అచ్చట శ్రద్ధచేసంప్రాప్తమగు ఆత్మజ్ఞానముఏతన్మహిమ అసంగాత్మానుభవముచే కర్తవ్య కర్మ నాచరించుమను ఆదేశము మున్నగు విషయములు.

5వ. అధ్యాయమున రాగద్వేష రహితమైనజీవితమేసన్న్యాస మనియు, సన్న్యాసమనగా యథార్థజ్ఞానమనియు సాంఖ్యముయోగము అను నవి రెండుగాదనియు అవి ఏకమగు అధిష్ఠానజ్ఞాన బోధకములగు సాధనసిద్ధమగు సాధ్యము లంతియేగాని విభిన్నములు కావని తెలుపుచు జ్ఞానానుభవి యొక్క అసంగానుభవ రూపమగు పూర్ణదృష్టినిగురించి వర్ణించుచు సాధకుని అనుష్ఠాన పద్ధతిని వివరించుచు ఈ అధ్యాయము ముగియును.

6వ. అధ్యాయము ఇది ధ్యానయోగము. మనస్సంయమాత్మక మగు యోగప్రక్రియ ననుసరించిన ఆహార విహార పద్ధతులచే ఆసనా ద్యనుష్ఠాన నియమముల చెలిసి అపరోక్షానుభవి యగు జ్ఞానియొక్క దృష్టిని తెలుపుచు సకామియు మరియు నిష్కామియగు యోగ భ్రష్టుని ఉత్తరగతి వర్ణన పూర్వకముగ నిరావరణ వృత్తిసహితమగు బ్రహ్మ సంబధమైన పరమ శ్రద్ధను గురించి బోధించుచు అది పరమ శ్రేష్ఠమని తెలుపబడి యున్నది.

7వ. అధ్యాయము నాయందుంచబడిన మనోవాక్కాయకర్మలు గల నాభక్తుడు దుర్ఘటమగు అష్ట ప్రకృత్యాత్మకమైన నా మాయను దాటును. నేనే సర్వత్ర వ్యాపించియున్నాను. నాయందే ఈసర్వము ఓతప్రోత భావముతో గ్రుచ్చబడి యున్నది. అను నిత్యాదిగ బోధించి సంక్షిప్తముగ భగవద్విభూతులను వర్ణించి త్రిగుణాత్మకమును దాటన శక్యమగు నామాయను నన్ను తన్నుగా తెలిసి ఎవరనన్యశరణాగతు లగుదురో వారనాయాసముగ ఈ నామాయను దాటుదురనియు మోహమును నొందరనియు వర్ణితము. నన్నుగొలుచు భక్తులు నాలుగు విధములుగ నున్నారు. అందు జ్ఞానిభక్తుడు నేనే యనియు ఇట్టి దృఢా నుభవమునొందు మహాత్ములతి దుర్లభులు. అను నిత్యాది విషయము లను తెలుపుచు నా విషయకమైన అధిభూతలధిదైవ అక్షరాత్మకమగు జ్ఞానమునొందుట జన్మ జరామరణ నివృత్తిమార్గము. అను నీ ప్రశ్న బీజముచే ఈ అధ్యాయము పూర్ణమగును.

8వ. అధ్యాయము వెనుకటి అధ్యాయము నందలి ప్రశ్న బీజా ధారమున అర్జునుడు "కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం" అను నిత్యాదిగా 7 ప్రశ్నలడుగుట వాటికి క్రమముగా భగవంతుడు అక్షరమగు బ్రహ్మ ము నేనే ననియు అర్థాత్ పరమగు పరమాత్మయే అక్షరమనియు జీవ స్వభావమే అనగా బ్రహ్మత్వమే అధ్యాత్మమనియు, ఇట్లు ప్రతిప్రశ్నా ర్థము నందును పరబ్రహ్మతత్వ సంపుటీకరణ పూర్వకముగ ప్రతిపా దించుచు సంతతము తదనుస్మరణ గలవారు నన్నే పొందుదురనియు అన్యభావన లేక తద్భావనా భావితులు తప్పక నన్నే చేరుదురు. (నన్ను తన్నుగా తెలుసుకొందురని తెలపి) స్మరణార్హమగు జ్ఞేయ పర బ్రహ్మ స్వరూపమును వర్ణించుట. ఓంకారమే తదాలంబన మనియు తెలుపుట, కాలమునకు లోబడిన లోకలోకాంతర ప్రాప్తి అనిత్యతా నిరూపణ పూర్వకముగ శుక్లకృష్ణ గతులను ముచ్చటించి ఈ రెండు గతుల నరసిన నిష్కామ జ్ఞానయోగి వేదాధ్యయన యజ్ఞ దాన తపస్సు

లచే గలుగు పుణ్యమునుగూడ నతిక్రమించి పుణ్యపాపములు గాని మహాపుణ్యమగు ఆద్యమైన నాపరమపదవి అనగా మోక్షమును పొందుదునని తెలుపబడి యున్నది.

9వ. అధ్యాయము అపరోక్ష బోధకమై రాజవిద్యా రాజ గుహ్యయోగమను నామముచే నతిగోప్యమగు భూమావిద్య తెలుప బడియున్నది. అనగా ప్రత్యక్షాది ప్రమాణ వేద్యముకాని ఉపనిష త్ప్రమాణ ప్రతిపాదితంబగు వ్యాపక పరబ్రహ్మము మేయ పదార్థము గాదు, కావున ఇది అనుభవైక గమ్యమగు గుహ్యతమ యోగమని వక్కాణింపబడి యున్నది. అశ్రద్ధాళువులగు రాక్షస సంపదగల అసు తృప్తిపరులైన అనగా పొట్టనింపుకొనుటయే పనిగాగల ఆసురీసంపదచే నొప్పు జనసామాన్యుల కలభ్యమని, వారు నన్ను దేహ మాత్రావశి ష్టునిగ దర్శించి నానాభంగుల భావించి నానుండి జారుదురని తెలిపి జ్ఞాన మహిమను వర్ణించుచు శ్రద్ధాళువులకు స్వస్వరూప భూతమేనని నిర్ధరించి కొన్ని విభూతులను కూడ తెలిపియున్నారు. అనన్యమగు భక్తిచే నన్ను భజించువారి యోగక్షేమముల నేనే వహింతునని భగవ దాదేశము. ఇట్లు "స్త్రియో వైశ్యాస్తథా శూద్రా" అన్నట్లు అందరు భక్తిచే భజించి సేవించి అనగా తమ ఆత్మస్వరూపముగ దెలిసి ధన్యులు కావచ్చును. అన్నపుడు ఇక ఉత్తములకు చెప్పవలసిన దేమున్నదని కైముతిక న్యాయమున ప్రతిజ్ఞాపూర్వకముగ నీ అధ్యా యము పూర్ణమగును.

10వ. అధ్యాయమున పునరపి భక్తి పూర్వకమైన అర్జునుని ప్రార్థనను మన్నించి భగవన్మహిమ అభివర్ణితమైనది. నీవు ఏఏ రూప ముల నున్నావు నీ విభూతు లేవి ? అను నిత్యాదిగా అర్జునుని ప్రశ్నను పురస్కరించుకొనియే భగవంతుడా విభూతులాద్యంతరహితములయ్యా! అయినను తెలిపెదను వినుమని స్వామి 72 విభూతులను విస్తరించి చివ రకు నాయనా ! ఈ విభూతుల కాద్యంతములు లేవు. ఏకదేశీయముగ

కొన్నింటిని మాత్రము నీకు తెలిపితినంతే! ఈ సమస్తము నా యొక్క ఒక్క పాదమున స్థితి నొందియున్నదని ఎరుగుము. సంపత్కరమగు అభివృద్ధి అది నాయంశమే-అను నిత్యాదిబోధ ఇందు గలదు.

11వ. అధ్యాయము పరమేశ్వరా! నీఅనుగ్రహముచే నాభ్రమ దూరమాయెను. ఈ నీ అనంత విభూతులను సాక్షాత్తుగ నీయందు దర్శింపనిచ్ఛయించుచున్నాను.అందుకునే తగినవాడ నైనచో దయతో చూపగోరుచున్నానని అర్జునుడడుగుట. కరుణామయుడగు భగవంతుడు తన విభూతులనెల్ల నేకత్ర విశ్వరూపమున సందర్శింప సమర్థమగు తన యౌగిక దివ్యనేత్రమును అర్జునునకు ప్రసాదించి భూత భవిష్యద్వర్త మానములు అనగా జరిగిపోయిన జరుగుచున్న జరుగబోవు ఈసర్వకల్ప నలను నాయధిష్ఠానముననే ఉన్నవిగా చూచెదవు. చూడుమని దివ్య మును విస్మయాత్మకమునగు అపూర్వమైన విశ్వరూపమును ప్రదర్శిం చెను. ఆ మూలమున అర్జునుడు సర్వమును భగవంతునియందు గాంచి తనలో నుండిన ఆంతరంగికమగు కర్తృత్వ రూపమైన ఈ అజేయుల నెట్లు సంహరింతునను మొదలగు సర్వ సందేహముల వీడెను. సచ్చి దానందమూర్తియగు పరమేశ్వరుని ఇంతవఱకు వ్యక్తిమయ దృష్టితో జూచుచు తెలియక అజ్ఞతచే ఎన్నోసమయములందు చులకనగ నెంచి తిని కదా! ఆ నా తప్పులను క్షమించుమని ప్రార్థించుచు అనంత విధముల స్వామిని కీర్తించుట. మరియు అర్జునా! సందేహమును వీడి నిమిత్తమాత్రుడవై యుద్ధము చేయుము. నేనే కాలుడను. విజ యము నీదే యని తెలిపెను. అప్పుడు అర్జునుడు స్వామీ! నీమొదటి రూపమున నాకు నీవు ప్రసన్నుడ వగుమని కోరుట. స్వామి తన పూర్వరూపమున ప్రసన్నుడయి అర్జునుని ఊరడిల్లజేసి, అయ్యా! ఈ విశ్వరూపము పుణ్యపురుషుడవైన నీకు దప్ప మరెవరికిని సందర్శింప బడినదికాదు. అను నిత్యాది మాటలచే యీ సాకారమూర్తి యందలి భక్తి ప్రపత్తుల విషయమును వివరించుచు ఈ నన్ను చక్కగా తెలిసి

నొయనుభవము నొందవలయును అను నీ మొదలగు విషయములు గలవు.

12వ. అధ్యాయము అర్జునుడు ఓభగవంతుడా! ఈప్రకార మగు సగుణ నిర్గుణాత్మకమైన ఈ నీ స్వరూపోపాసకులలో ఎవరు శ్రేష్ఠులని ప్రశ్నించుట. భగవంతుడు నేనే గొప్ప. నాస్వరూపమే గొప్ప యని తెలుపుచు,అవ్యక్తాక్షర శబ్దవాచ్యుడనైన నన్ను దేహాత్మ బుద్ధిగలవారు తెలియుట కష్టము గావున నిష్కామమగు అద్వేష్టృ త్వాదిగుణసంపద్విశిష్టులయిన నాభక్తులు క్రమముగా నన్ను తన్నుగా తెలియుదురు. ఈగుణసంపద ముముక్షువున కభ్యాస పాటవమున అల వడును. ముక్తునకు సహజమై యుండును. కావున అమృత మనబరగు ఈపరమ ధర్మ్యామృతమును శ్రద్ధాయుక్తులై సేవించు ముముక్షువులు ధన్యులు. నాకు ప్రియులని తెలుపుట.

13వ. అధ్యాయము ఇది శిరోరత్నము వంటిది. రెండవ అధ్యా యము సంక్షిప్తగీతయైతే ఇది తదనుభవ స్థానీయమగు అపరోక్ష గీతయై యున్నది. క్షేత్రము క్షేత్రజ్ఞుడను ఉభయ పరికల్పనల తొల గించి ఉపహితమగు వ్యాపక చైతన్యమే నేనని తెలియుట. ఒకటి బాధసమానాధి కరణ సంబంధము మరొకటి ముఖ్యసమానాధికరణము అను నీ ప్రక్రియలచే అత్యంత విపులముగను యుక్త్యనుభవ సిద్ధాంత ముల చేతను ఇందు విషయము వివరింప బడియున్నది. అధికారులను బట్టి విషయములు గంభీరార్థ ద్యోతకములు.

దీనికి తగు అధికార సంపత్తి 20 గుణములు పరంపరా సాధన వివరింపబడి యున్నది.

జ్ఞేయమగు పరమాత్మ నేనయి యున్నానను విషయమునతటస్థ లక్షణముచే స్వరూపమును ప్రతిపాదించి పిదప ప్రతిపాద్యమగు పర బ్రహ్మము (తానె)యని స్వరూప లక్షణచే ఆ జ్ఞేయము క్షేత్రజ్ఞాభిన్న మగు పరబ్రహ్మమే నను చక్కని వ్యాఖ్య ఇందుగలదు. ఇచ్చట శ్రీ

శంకర భగవత్పూజ్యపాదుల భాష్యపాఠము లెంతయు అధికారులగు ముముక్షువుల చిత్తమును ప్రత్యగభిన్న పరమాత్మ చైతన్యాభిముఖ మొనర్చు అమృత పంక్తులయి యున్నవి. సావధానముగ విని విషయ గౌరవము నెరిగి స్వరూపానందము నొందుదురు గాత! క్రమముగా ఆ వివరణలను ముందు చెప్పకోనెదము.

మరియు చక్కని పురుష ప్రకృతి వివేచన పూర్వకముగమిధ్యా ప్రకృతి సంగ విముక్తి, పరమ పురుషుడే నీవను జ్ఞేయ తత్త్వస్వరూప ప్రతిపాదనము. అంతియేగాక ఈవిషయమున నన్ను అనేకులు ధ్యానాది నానా సాధనములచేతను తెలియ ప్రయత్నింతురు. కాని వినాశ శీలమగు ఇదం వృత్తి వేద్యమయిన సర్వపదార్థముల యందు నే నవినాశియై యున్నానని ఎవరు తమ్ము తాము తెలియుదురో వారు ధన్యులు నిరవయవమగు ఆకాశోపమము నొసగుచు ప్రబోధమయ చక్షుస్సు "శాస్త్రాచార్యోపదేశ జనితమ్ ఆత్మ ప్రత్యయికం జ్ఞానం చక్షుః॥" అనగా శాస్త్రాచార్యోపదేశము చేత కలిగిన అనుభవ జ్ఞానమను చక్షువు (దృష్టి) చేత భూత ప్రకృతుల నుండి విడువబడి ముక్తులగుదురు. అను నిత్యాది అపూర్వ విషయము లిందుగలవు.

14వ. అధ్యాయము అర్జును డడుగకనే మరల ఆదర బుద్ధిచే భగవంతుడు పై జెప్పబడిన బ్రహ్మానుభవము ప్రకృతి గుణ వివర్జితమైన పవిత్ర పాత్ర యందే, తురీయానుభవ మగు నని ఈ అధ్యాయమున చక్కగా సత్త్వ రజ స్తమోగుణ కార్యకారణ ధర్మ కర్మ వ్యవహారలక్షణములను తెలుపుచు తద్గుణాతీతుడగు మహాపురుషుని వర్ణించి, పరమ ధర్మమును సమస్త గుణగణ గరిష్ఠమును సర్వసుఖ సంప్రదాపమునగు బ్రహ్మాభివ్యక్తి స్థానము (ప్రతిష్ఠ) అహమే ననియు అనగా ప్రత్యగాత్మనైన నేనే (స్వయం) తానే పరమాత్మ యను నిత్యాది అనుభవ విషయములు వివరింపబడి యున్నవి.

15.వ అధ్యాయము ఇందు అశ్వత్థమనుపేర సంసార వృక్ష

వర్ణన,అనగా అనిత్యమగు సంసారమునకు ఆధార మధిష్ఠానము బ్రహ్మ తత్వమే ఊర్ధ్వమని తెలుపుచు సంసార విషయ అనాసక్తిని బోధించి తత్పద లక్ష్యమగు పరమాత్మానుభవము నొందుటే జీవన పరమలాభ మని తెలుపబడి యున్నది. మరియు సూర్య చంద్రాగ్ని మండల త్రయము ఏపర బ్రహ్మ చైతన్యమువలన ప్రకాశిత మగుచున్నదో ఆ పరమ ప్రకాశ స్వరూపమే నీయాత్మయని బోధించుచు ఔపాధికమగు జీవత్వ బుద్ధిని వీడిన ఈజీవుడు సచ్చిదానంద స్వరూపమగు పరమాత్మ యేనను తత్త్వము వివరింపబడి యున్నది.మరికొన్ని విభూతులను వివరించుచు క్షరాక్షర విలక్షణమగు పురుషోత్తమ తత్త్వమే ఆత్మయనియు, ఇది అనుభవరూపమైన గుహ్యతమ శాస్త్రమని ఇతి యను నిగమన వాక్యముచే అధ్యాయము పూర్ణము గావింప బడినది.

16వ. అధ్యాయము భగవంతుడు ఈఅధ్యాయమున అభయాది గుణ సంపద్యుక్తమగు దైవీ సంపదను,దంభ దర్పాద్యహంకారయుక్త మైన అజ్ఞాన గుణకర్మ ధర్మ వ్యవహారములగు ఆసురీ సంపదను వర్ణించుచు ముముక్షువు దైవీ సంపద్విభూషితుడై యుండవలయును. అది మోక్ష సాధనము. రాక్షసీ సంపద బంధప్రదము అను నిత్యాది విషయములను వివరించి మానవునకు కార్యాకార్య విచక్షణ జ్ఞానవిషయమున శాస్త్రమే ప్రమాణము అను నీయాదేశపూర్వక వాక్యములతో అధ్యాయము పూర్ణమైనది.

17వ. అధ్యాయము ఇందు మూడువిధములగు సత్వరజస్తమో గుణాత్మక మయిన శ్రద్ధను గురించియు, అటువలె గుణముల ననుసరించిన యజ్ఞ దాన తపః కర్మాదులను వివరించి సాత్వికమగు శ్రద్ధయజ్ఞ దాన తపః కర్మలు విహితము లనియు, ఓంతత్సత్ అను బ్రహ్మనిర్దేశ పదార్థములను తెలుపుచు, ఇట్టి పవిత్రానుస్మరణ పూర్వకముగ నాచరింపబడు యజ్ఞ దాన తపః కర్మలే సత్ అని చెప్పబడును. అట్లుగాక అశ్రద్ధచే నాచరింప బడునవి అసత్ అయోగ్యము లనబరగును.కాన

ముముక్షువు సత్వ సంశుద్ధుడై యుండవలయునను నీ విషయములు తెలుపబడి యున్నది.

18.వ అధ్యాయము ఈఅధ్యాయము సన్న్యాసము త్యాగము అనగా నేమి యను అర్జునుని ప్రశ్నతో ప్రారంభింపబడినదై దానికి తగు విధ్యుక్తమైన అర్థము భగవత్ శ్రీముఖము నుండి వివరింపబడినదై యున్నది.పూర్వాపర సందర్భములతో యుక్తమయిన వెనుకటి అధ్యాయము లందలి సర్వ విషయములు సంక్షిప్తముగ ఇందు వచ్చి యున్నవి. "చివర" సర్వధర్మాన్ పరిత్యజ్య ...యని పరమాద్వైత సిద్ధాన్తమగు చరమశ్లోకముచే పూర్ణమగుచు కథా సందర్భమైన సంజయని వాక్యములతో పరిశిష్టమనబరగు నీ అధ్యాయము సమాప్తమగును. ఈరీతిగా మొదటి దినమున పూజ్యపాద శ్రీస్వాములవారు సంక్షిప్తముగ నెంతో అపూర్వమైన గీత సంపూర్ణార్థమును ఇట్లు వివరించిరి. తదుపరి క్రమముగా భాష్యపాఠముల వివరించుచు 4మాసములలో సాంగముగ ప్రబోధించిరి.

శ్రీమదుమామహేశ్వర గురుపీఠమునకు, శ్రీగురుపీఠ పరంపరాచార్యులకు అనంత ప్రణామముల నాచరించి, శ్రీగురుస్మరణ పూర్వకముగ పవిత్రమగు ప్రాతఃకాలమున ఉత్తమోత్తమమగు మానవ జీవన పరమలక్ష్య ప్రబోధకంబైన ఉపనిషత్ప్రసంగమున ప్రవేశింతము.

"సదేర్ధాతో ర్విశరణ గత్యవసాదనార్థస్య ఉపని పూర్వకస్యక్విప్ ప్రత్యయాన్తస్య రూప మిదం ఉపనిషత్" "ఉప, ని" యను ఉపసర్గలు "షదల్" ధాతువుతో జేరి ఉపనిషత్తని యయినది. ఉప-ఉపగమ్య గురూపదేశమునుండి గ్రహించి; గ్రహించిన బ్రహ్మవిద్యను, ని-నిశ్చయము గలిగి నిష్ఠచే విచారించు ముముక్షువులయొక్క అవిద్యాది రూపమైన సంసార బీజమును; "షద్ల విశరణ గత్యవసాదనేషు" సద్-విశరణము అనగా శిథిలము చేయునది; అవసాదనము నాశనము చేయు

నది: ముముక్షువు గతి-బ్రహ్మమును చేర్చునట్టిది అనగా శ్రీగురు సన్నిధి చేర్చునది ఉపనిషత్తన బడును. వేదముల అంత్య భాగమగు వేదాంతమును అనగా ఉపనిషత్తులను భాష్య సమ్మతముగ శ్రద్ధచే శ్రవణముచేసి భాష్యశాంతి నొందిన వారికి తప్పక బ్రహ్మానుభవ మగును. వేయేల విన్నంత మాత్రముననే వారెంతయో ధన్యులనుటకు సందియము లేదు. ఇది అపూర్వము

ఉపనిషత్తులు 108 వాని సారసర్వస్వము 10 ఉపనిషత్తులు, నేను వాటి సంక్షిప్తార్థమును ముచ్చటించుకొని ముందుక్రమము ననుస రించి విపులముగ వివరించెదము.

(1) ఈశావాస్యోపనిషత్తు శుక్లయజుర్వేదాంతర్గత మయినది. ఈశయను పదముచే ప్రారంభ మైనందున ఈశోపనిషత్తనియు, సంహితోపనిషత్తనియు, వాజసనేయ సంహితోపనిషత్తనియు, నామములు. ఇందు కేవలము 18 మంత్రములు మాత్రముగలవు. ఆయా వేదాంత ర్గతమగు ఉపనిషత్తులకు ఆయా శాంతి మంత్రములు, నిర్విఘ్నసమా. ప్తికై ఆది అంత్యమున చెప్పుట పరిపాటి యని తెలియ వలయును. మొదటి ఈ ఉపనిషత్సంక్షిప్తార్థమే మన ఇదంవృత్తికి వేద్యమగు సమ స్తము సచ్చిదానంద స్వరూపమగు పరమాత్మచే (ఈశ్వరునిచే) వ్యా పింపబడి యున్నది. ఆతని వాస స్థానమే యిదంతయు అని తెలిసికొని ఇందు కర్తృత్వబుద్ధి మమత్వము లేక కలిగిన పదార్థములను భోగము లను ఈశప్రసాదమని ఎంచి భావించి భగవద్దృష్టి గలిగి అనుభవించ వలయును. కర్తృత్వము నొందరాదు. ఆసక్తి నొందరాదు. ఇట్లు కర్మ యందలి అసంగత్వమును ఆత్మ(ఈశ్వర)త్వముయొక్క అపరోక్షత్వ మును రెండు మంత్రములచే తెలిపి మూడవ మంత్రమున ఈ విధాన మును విడచి వర్తించిన అజ్ఞానమయమగు అంధకారలోకములనుపొంది జననమరణ ప్రవాహమున జిక్కుదురని తెలిపి, బ్రహ్మతత్త్వ నిరూపణ ద్వారా నిర్మోహమగు తన్నిష్ఠానుభవియొక్క దృష్టినివర్ణించి, జ్ఞానకర్మ

సముచ్చయమును పూర్వపక్ష మొనర్చిసూర్యాంతర్వర్తియగు ప్రత్యక్ చేతనమే నేనను (తానను) దృష్టినొసగు సూర్య ప్రార్థనతో ఈ ఉపనిషత్తు పూర్ణమయినది.

(2) కేనోపనిషత్తు ఇది సామవేదాంతర్గత మయినది. దీనికి తలవకారోపనిషత్తనియు కూడా నామము. మరియు ఈ ఉపనిషత్తులో "కేన" యని మొదటి మంత్ర మారంభింపబడి యున్నందుచే దీనికి కేనోపనిషత్తనియు పేరు."

ఇందు నాలుగు ఖండములు గలవు. మొదటి ఖండమున సర్వేంద్రియములు ఆ యా కర్మ ధర్మముల నాచరించుటకు ఎవని ప్రేరణచే ప్రేరేపింపబడి ప్రవర్తన శీలములగుచున్నవి అను ప్రశ్నాత్మకముగ ప్రారంభింపబడి సర్వాతీతమగు బ్రహ్మ చైతన్యాశ్రయముననే సర్వ వ్యవహారములు జరుగు నను విషయము తెలుపబడి యున్నది.

రెండవ ఖండమున నిరహంకృతి నిరభిమానముగల అధికారియగు ముముక్షువునకు మాత్రము బ్రహ్మానుభవ మగునను నీమొదలగు విషయములుగల గురుశిష్యసంవాదము సంక్షిప్తముగ తెలుపబడి యున్నది.

మూడవ ఖండమున నేనని అహంకరించుట కవకాశము లేని సర్వవ్యాపక చైతన్యాస్తిత్వమున అహంకరించుట అజ్ఞానము, అది అహంకారపు చేష్టయని తెలుపుటకై యక్షరూపమున ప్రత్యక్షమైన బ్రహ్మము యొక్క కథ నొకటి క్లుప్తముగ తెలిపి యున్నారు.

నాలుగవ ఖండమున ఉమారూపమై ఇంద్రునకు ప్రత్యక్షమైన జ్ఞాన స్వరూపిణి యగు పరదేవతయొక్క స్వరూపము. విజయ గర్వోపేతులైన వారి కగపడుట ఇత్యాది విషయములచే బ్రహ్మ తత్త్వోపదేశము చేయుట తత్సాధన మున్నగునవి గలవు. ఈ ఉపనిషన్మాలమును చక్కగ నవలోకించిన శ్రుతి షడ్లింగతాత్పర్యార్థ మవగాహన మగును.

(3) కఠోపనిషత్తు ఇది కృష్ణయజుర్వేదాంతర్గత మయినది.

యమనచికేతుల సంవాదాత్మకమై గురుశిష్యన్యాయమున ప్రశ్నోత్తరములచేనొప్పు అతిగంభీరమైన ఆధ్యాత్మికతత్త్వోపదేశములుగల అత్యుత్తమ మగు ఉపనిషత్తు. ఇందు మూడుఅధ్యాయములు ఆరువల్లులు (ప్రకరణములు) గలవు. వాజశ్రవస్సను నతని పుత్రుడు నచికేతుడు. "ఇతడు యముని కడకేగి మూడువరములను బడసెను. అందులోనొకటి ఆత్మవిద్యను గురించినదై యున్నది. చక్కని వివేక వైరాగ్యబ్రహ్మ తత్త్వప్రబోధక మహావాక్యములచే నొప్పుచు అధికారియగు నతనికి అపరోక్షబ్రహ్మసాక్షాత్కార సాధనమైన సారవంతమగు ఉపనిషత్తు. ఇందు ఉత్తమ మయిన ఉపమానోపమేయములు రూపాలంకార వర్ణనాత్మకమగు మహోపదేశములు గలవు. మంచి రోచకమైయుండును." శ్రీశంకరాచార్యులు ఈగురుశిష్యులకు నమస్కరించి భాష్యపాఠమారంభించుచున్నానని ఈ ఉపనిషద్భాష్యారంభమున టీకయందు తెలిపి యున్నారు. అనగా అంత నిర్దుష్టమైన పూజ్య గురుశిష్యులని తోచు చున్నది.

(4) ప్రశ్నోపనిషత్తు ఇది అథర్వణ వేదాంతర్గత మైనది.సుకేశాది ఆర్గురు ఋషులు పిప్పలాదముని కడకు సమిత్పాణులై వెళ్ళి తపస్సొనర్చి బ్రహ్మతత్త్వమును గురించి యడుగుట ఇందు 6ప్రశ్నలు వాటి ఉత్తరములుగలవు. అందు కొన్ని సృష్టికర్మ పరముగను కొన్ని ఔపాసన విషయకముగను జ్ఞానపరముగను బోధింపబడినవి.

(5) ముండకోపనిషత్తు ఇదియును అథర్వణ వేదాంతర్గతమయిన ఉపనిషత్తు. దీనిలో మూడు ముండక (భాగ)ములు 6ఖండములు (ప్రకరణములు) గలవు.పర అపరయను రెండు విద్యలు ఇందు తెలుపబడి యున్నవి. ముఖ్యముగ ముముక్షువులు వినదగిన అపూర్వ విషయము లిందు గలవు. సృష్టి విషయముదాని తాత్పర్యము. హృదయగ్రంథి భేదనము జ్ఞాననిష్ఠ-సాధన, ఉత్తమ ఉపమానోపమేయములు.

(6) మాండూక్యోపనిషత్తు ఇదియును అథర్వణవేదాంతర్గత

మయినదే. ఇందు పన్నెండు మంత్రములు మాత్రమే గలవు. మూర్తి చిన్నదైనను కీర్తిఘనమను భంగి "మాండూక్య మేక మే వాలం ముముక్షూణాం విముక్తయే" యని 108 ఉపనిషత్తులలో చివరిదగు ముక్తికోపనిషత్తునందు శ్రీరామచంద్రమూర్తి ఆంజనేయస్వామికి చెప్పినట్లు ముముక్షు జనులకు ముఖ్యోపాదేయమగు ముక్తికి ఈఒక్క మాండూక్యోపనిషత్తే చాలని చెప్పబడి యున్నది. అట్టి మహదర్థ స్వారస్యము గలిగి ఈఉపనిషత్తు మొదట ఓంకారమే ఈసర్వస్వరూప మని తెలుపుచు అదియే పరబ్రహ్మమనియు తదనుభవ స్థానము అవస్థాత్రయ సాక్షియగు తురీయమైన ఈ ఆత్మయే బ్రహ్మమని వివరణ పూర్వకముగ ఆత్మకును ప్రణవమునకును పాదములు కల్పించి లయ క్రమముచే తురీయమగు ఆత్మయందు పూర్ణమగును. ఈ యాత్మ బ్రహ్మమే నని "అయమాత్మా బ్రహ్మ" మను మహా వాక్యార్థమును అధికారి జనులకు సుసంవేద్య మగునట్లు అపరోక్షముగ ఇందు ప్రబోధింపబడి యున్నది. ఇది సాధన సాధ్య విషయ ప్రతిపాదనకాదు కేవల సిద్ధవస్తు ప్రబోధకమై యున్నది.

మరియు ఈఉపనిషత్తు అపూర్వార్థ వివరణ కొరకై శ్రీగౌడ పాదాచార్యులు 215 కారికలచే వ్యాఖ్య యొనర్చి 4ప్రకరణములుగ ఆగమ ప్రకరణము. వైతథ్య ప్రకరణము, అద్వైత ప్రకరణము, అలాతశాంతి ప్రకరణమని విభజించి వ్రాసియున్నారు. చక్కగ గురు ముఖమున వారంవార శ్రవణ మొనర్చి అనుభవము నొందవలసిన ఉపనిషద్రాజము.

(7) తైత్తరీయోపనిషత్తు ఇది కృష్ణయజుర్వేదాంతర్గతమైనది. ఇందు మూడు వల్లులు గలవు. శిక్షావల్లి, ఆనందవల్లి, భృగువల్లి యని ఒక్కొక్క వల్లియందును అనువాకములను పేర అనేక విషయములు తెలుప బడినవి. మొదట గురుకులమున ఆచార్య సన్నిధి విద్యార్థికి తగు శిక్షను గురించిన చక్కని నైతిక ధార్మికాది ప్రబోధలు

కలవు. (బ్రహ్మచర్యము, సుప్రణవవిషయము)

ఆనందవల్లి యందు పంచకోశముల విచార పూర్వకముగ ఆనందమయ కోశాంతర్గతమై భాసిలు బ్రహ్మ చైతన్యానుభవము యొక్క వ్యాఖ్య, మరియు నిష్కాముడగు బ్రహ్మానుభవి యొక్క ఆనందము నందు ఇతర సమస్తానందములు అణు మాత్రములు అను నీ మొదలగు అనేక విషయముల విస్తృత వివరణము కలదు.

ఇక భృగువల్లి యందు వరుణుడను తన తండ్రి (గురువు) కడ భృగువను పుత్రుడు (శిష్యుడు) క్రమముగా అన్నము, ప్రాణము, చక్షుశ్శ్రోత్రాదులు బ్రహ్మము నెరుగుటకు మార్గములనియు ఈసమస్తము దేనినుండి కలిగెనో ఆ మూలమగు తత్త్వమే జ్ఞేయమగు బ్రహ్మము అను నిత్యాది ఉపదేశము లతి విపులముగ ఇందు తెలుపబడియున్నవి. ముందు ఈవిషయముల నెల్ల మనము క్రమముగ తెలిసికొనెదముగాక. ఈతైత్తరీయము ఉపనిషత్ శిరోరత్నమని యందురు. సమగ్రముగ పూర్వార్థము ఉత్తరార్థములు యిందు ప్రతిపాదింపబడినవి. శ్రీశంకరానంద మునీశ్వరులు ఆత్మపురాణమున ఈ విషయమగు కథతో సహా మరి విపుల వ్యాఖ్య జేసియున్నారు.

(8) ఐతరేయోపనిషత్తు ఇది ఋగ్వేదాంతర్గత మయినది. ఈ ఉపనిషత్తునందు మూడు అధ్యాయములుగలవు. 1వ అధ్యాయమునందు 3 ఖండములు 2,3 అధ్యాయములందు ఒక్కొక్క ఖండమే కలదు. "ప్రజ్ఞానం బ్రహ్మ" యను మహావాక్యమిందు గలదు.సృష్టికి పూర్వము అద్వితీయమగు బ్రహ్మము (ఆత్మ) యుండెను. దానినుండి ఈ సృష్టియయ్యెను. మొదట గోవు పిదప అశ్వము అనంతరము మానవశరీరము.ఇందు ప్రవేశము అను నిత్యాది సృష్టిక్రమమును తెలిపి, ఈసర్వమును నేత్రాది ఇంద్రియముల ద్వారా ఎరుగు జ్ఞాత ప్రజ్ఞామాత్రుడు, ఆ ప్రజ్ఞానమే నిరుపాధికమగు బ్రహ్మమయి యున్నది. అను నీ మొదలగులక్షణ మహావాక్యములను ఈ ఉపనిషత్తు తెలుపుచున్నది.

(9) ఛాందోగ్యోపనిషత్తు ఇది సామ వేదాంతర్గత మయినది. ఈఉపనిషత్తులో ఎనిమిది ప్రపాఠకము లున్నవి. వానిలో ఖండము లను పేర ప్రకరణ విభాగము లనేకము లుండును. అందు మొదట 4,5 ప్రపాఠకముల యందు ప్రణవము ప్రణవోపాసన, ప్రాణము ప్రాణ మహిమ మున్నగు అనంతవిషయములు వర్ణింపబడుచు, అచ్చటచ్చట కొన్ని కథలుకూడ చెప్పబడియున్నవి. 6వ ప్రపాఠకమున "తత్త్వ మసి" మహావాక్యమును గురించిన యనగా శ్రుతి షడ్లింగ తాత్పర్య నిర్ణాయకమగు అద్వితీయ బ్రహ్మాత్మనా సంస్థితి రూప అభేధ జ్ఞాన ప్రబోధగలదు. ఇది గురువాక్యము. సృష్టి త్రివృత్కరణమును తెలు పుచు శ్వేతకేతు ఉద్దాలక సంవాదాత్మకమై నానా ఉపమానోపమే యములచే నొప్పుచు 9 సారులు ఉపదేశింప బడినదిగా నున్నది. ముముక్షువులకు ముఖ్యముగ విచారార్హమైన భాగము.

'తరతిశోకమాత్మవిత్' అని ఈ 7.వ. ప్రపాఠకము నారద సన త్కుమార సంవాదాత్మకమై క్రమక్రమముగ నామరూప, మనస్సు, చిత్తము, చింత, ఆశ ఇత్యాదిగ తెలిపి వాటిని వదలి అద్వితీయబ్రహ్మ తత్త్వోపదేశము తెలుపునదై వెలయుచున్నది.

ఎనిమిదవ ప్రపాఠకము నందు నిత్యసత్యమగు పరమ సూక్ష్మ మైన బ్రహ్మతత్త్వము బ్రహ్మపుర మనబరగు ఈ దేహమునందుదహ రాకాశమున బహిరంతరములను వ్యవధానములు లేక స్వయమై వెలుగుచున్నది: అను నిత్యాది ఉత్తమ విషయ వ్యాఖ్యలచేనొప్పుచు చివర బ్రహ్మచర్యముయొక్క మహిమాభివర్ణన పూర్వకముగ పూర్ణ మగును. ఇది గొప్ప ఉపనిషత్తు గావున క్రమానుసారము సాంగముగ ఈచాతుర్మాస్య మహావ్రతము సమాప్తమగు లోపలనే విచారింతము. శ్రీగురుపరమాత్మ అట్టి మహాశుభమును ప్రసాదించును గాక !

(10) బృహదారణ్యకోపనిషత్తు. ఇది శుక్ల యజుర్వేదాంతర్గత మయినది. దీనికి బ్రాహ్మణోపనిషత్తనియు నామము గలదు. ఇందు

మూలములో 8 అధ్యాయములు గలవు. అందు మొదటి రెండధ్యాయములు అశ్వమేధమును గురించిన ప్రసంగములై యున్నవి. ఆ విమర్శ మనకంత అవసరము లేదు. అశ్వమేధాశ్వము నిరాటంకముగ గమ్యస్థానమును విజయవంతముగ చేరునట్లు, ఈశరీరమను జీవాశ్వము పరమాత్మయను గమ్యమును యే కామాది శత్రువర్గాటంకములు లేక బ్రహ్మస్థితి నొందుట...నిత్యాదిగా...కావున మనము ఈఉపనిషత్తును ఆరు అధ్యాయములుగ పరిగణింతము. ఇందలి విభాగములకు బ్రాహ్మణములని పేరు. ఇందు అనేక కర్మోపాసనా విషయములు మరియు అత్యుత్తమమైన గుహ్యతమమగు బ్రహ్మతత్త్వ జ్ఞానము అతి విస్తారముగ వర్ణింపబడి ముముక్షుజన సంసేవ్యమైన ఉపనిషత్తయియున్నది.

యాజ్ఞవల్క్యుని సభా విజయ ప్రసంగములు, యాజ్ఞవల్క్య జనక సంవాదము, యాజ్ఞవల్క్య మైత్రేయి సంవాదము, దేవదానవ మానవులకు బ్రహ్మోపదేశము మున్నగు అనేక ముఖ్య విషయములున్నవి. క్రమముగా ఆయా విషయములను సావధానముగా విచారింతము. అని మొదటి దినము ప్రాతఃకాలమునందు శ్రీవారు ఉపన్యసించి అందరికి ఆనందము కలుగ జేసిరి. ఉపనిషత్తులంటే యిట్టి అర్థములు గలవియా అని ఆనందించిరి. ఇట్లు 12వ. శ్రీచాతుర్మాస్యమహావ్రతానంతరము శ్రీవారు గంజిగుంట శ్రీమఠమునకు తమ గురువుల పుణ్యారాధనకు 23.11.56 శుక్రవారము గుంతకల్లు నుండి గంజిగుంటకు వెళ్ళిరి. తా॥ 27,28,29 మూడు దినములు ఇచ్చట కార్యక్రమములు మునుపటివలె యథారీతిగ శివప్రదమై నడచెను. మహాత్ములు మరియు భక్తాదులందరు చేరి యుండిరి. అచట స్థలము తక్కువై నందున శ్రీగురుకృపచే ముందువచ్చు ఆరాధనకు అది పెద్ద భవనమయ్యెను.

గంజిగుంట శ్రీమఠమున గురుకార్యము ముగించుకొని స్వామివారు గుత్తివారి ప్రార్థనానుసారము గుత్తి శ్రీకన్యకాపరమేశ్వరి ఆల

యమునకు దయచేసిరి. అఖండముగ పూజానుష్ఠానాదులచే గీతా శాస్త్రశ్రవణము జరిగెను. పిదప బెంగుళూరు శ్రీబ్రహ్మవిద్యాశ్రమ కార్యక్రమమున కాహ్వానింపబడి శ్రీవారు అచటికి దయచేసి యథా రీతి బ్రహ్మవిద్యాశ్రమమున శ్రీశంకర విరచితంబగు ఆత్మబోధ ప్రకరణమును గురించి ప్రబోధించిరి. ఆకార్యక్రమానంతరము శ్రీనిర్వాణ మఠమున శివరాత్రి మహోత్సవంబున కేతెంచిరి. సురపురం శ్రో॥ బ్ర॥ శ్రీశంకరశాస్త్రి స్వామివారు, పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శుద్ధచైతన్య స్వామివారు ఈకార్యక్రమమునకు దయచేసి యుండిరి. 3 దినములు చక్కగ శాస్త్రశ్రవణాది కార్యక్రమములు పూజానుష్ఠానములు జరిగెను.

నంద్యాలకు సమీపమున పెద్దకొట్టాల వాసులగు భక్తులప్రార్థనను మన్నించి మనశ్రీవారును శ్రీసురపురంస్వామివారును, శ్రీశివప్రకాశానందస్వాములును మరికొందరు నంద్యాల భక్తులతో గూడి పెద్దకొట్టాల గ్రామమునకు దయచేసి నూతనముగ కట్టబడిన శ్రీరామాలయమున దుర్ముఖి సం॥ ఫాల్గుణ శు॥ ౨॥ 3.3.57 వేదోక్త విధులచే సీతారామలక్ష్మణ ఆంజనేయస్వామిమూర్తి ప్రతిష్ఠ,ధ్వజ ప్రతిష్ఠలు గావింపజేసిరి. శ్రీసీతారాముల మహోత్సవము అనేక వాద్య విశేషములచే ఊరేగింపు జరిగెను. భూరి అన్నదానములు గావింపబడెను. అనంతరము గురుస్వామివారు నంద్యాల నుండి కర్నూలుకు వెళ్ళి, అ పిదప ఆదవాని భక్తుల ప్రార్థనానుసారము ఆదవాని శ్రీకన్యకాపరమేశ్వరి దేవస్థానమున భాష్య ప్రవచనములు సలిపిరి. శ్రీవారి పూజానుష్ఠానాది వసతి శ్రీ ఆర్. హనుమంతరాయశ్రేష్ఠిగారి మహడియందు ఏర్పరచిరి. 13.3.57 నుండి ఆదవాని శ్రీనగరేశ్వరస్వామి దేవాలయమున ప్రవచన మారంభించిరి. ఉదయము 7 గం.నుండి 8.30 గం. వరకు ఉపనిషద్భాష్యము. సాయంకాలము 7 గం. నుండి 8.30 గం వరకు భగవద్గీతా శాంకరభాష్యము 13వ అధ్యాయ ప్రవచనము

జరుప బడెను. అనుదినము అత్యంతశ్రద్ధచే శ్రోతలువచ్చి భాష్య శ్రవణము జేసి అమితానందము నొందుచుండిరి. మరియు ఆదవాని పురప్రముఖులు శ్రీగౌరా కృష్ణయ్యగారు, శ్రీరాయచోటి సుబ్బయ్య గారు, టి.జి.యల్. కృష్ణమూర్తిగారు, తిమ్మయ్యగారు మరియు గౌరా శ్రీరామయ్యగారు పాడాగల్లు గిరెప్పగారు. జి. మల్లయ్యగారు, ఎ. ఆనందముగారు, అమృతలాల్ మొదలగు వారందరు భక్తిచే శ్రీసన్నిధి పూజ్యస్వామీ ! శ్రీవారు దయయుంచి ఈసంవత్సరము శ్రీచాతు ర్మాస్య మహావ్రతము ఇచ్చటనే సలిపి ఉపనిషద్రహస్యములను దెలుప ప్రార్థన యని భక్తిచే విన్నవించుకొనుచు కోరిరి. సభికులందరును ఆ నందముచే జయజయధ్వనులచే కరతాళ మొనర్చిరి. ఈజనుల భక్తి విశ్వాసములను జూచి పూజ్యశ్రీ వారంగీకరించక తప్పలేదు. ముద మలర మంచిదని అంగీకరించిరి. ఈమహా కార్యక్రమాచరణకు వసతిగా నుండు భవనము నొకటి యిచ్చెదమని శ్రీమంతులగు శ్రీ యలే. మల్లేశప్పగారు భక్తిచే తెలిపిరి. అందరు సంతసిల్లిరి. అనంతరము 13వ. శ్రీచాతుర్మాస్య మహావ్రత కార్యక్రమ కమిటీ నొకటి నిర్ధరించు కొనిరి. అన్ని కార్యములు ముందు చూచుకొనిరి.

ప్ర. ఋషులనగా అర్థమేమి స్వామీ ?

ఉ. వేదమంత్రముల నెరిగిన వారు "ఋషియః మంత్రద్రష్టారః"

ప్ర. స్వామీ! దేవపితృ మొదలగు ఋణము లందురే అవేవి ?వాటి నివృత్తి ఎట్లు ?

ఉ. ఋణములు నాలుగు ప్రకారములు ఋషిఋణము, దైవఋణము తల్లిదండ్రిఋణము, గురుఋణము, ఇందు బ్రహ్మచర్యవ్రతాచరణ పూర్వకముగ వేదశాస్త్రాధ్యయనములచే ఋషి ఋణవిముక్తియనియు యజ్ఞాది సత్కర్మలచే దైవఋణవిముక్తి యనియు, తల్లిదండ్రులను సేవించుచు సత్సంతతిని బడయుటచే పితృఋణ విముక్తి యనియు, ఇక గురుఋణ విముక్తి యనగా తన్ను ప్రత్యగభిన్న పరబ్రహ్మముగ

తెలియుటచే గురు ఋణ విముక్తి యగును. అర్థాత్ ఆత్మజ్ఞాన ప్రదమైన గురుఋణ విముక్తిచే సమస్త ఋణములు తీరునని చెప్పెదరు.

ప్ర. గృహస్థు లాచరింప వలసిన పంచ యజ్ఞము లేవి ?

ఉ. శ్లో॥ ఋషియజ్ఞం దేవయజ్ఞం భూతయజ్ఞం చ సర్వదా
నృయజ్ఞం పితృయజ్ఞంచ యథాశక్తి నహాపయేత్॥

ఇట్లు ఋషియజ్ఞము, దేవయజ్ఞము, భూతయజ్ఞము, మనుష్యయజ్ఞము, పితృయజ్ఞమని ఐదు ప్రకారములు.

(1) వేదపఠన పాఠనము మరియు సంధ్యోపాసనాది కర్మలు ఋషియజ్ఞ మనబడును.

(2) అగ్నిహోత్రాది కర్మలు దేవయజ్ఞ మనబడును.

(3) బలి వైశ్వదేవం (అనగా సమయమునకు ఆకస్మికముగ వచ్చిన అతిథిభోజనాది ప్రాణి సత్కారము) భూతయజ్ఞ మనబడును.

(4) ఇంటికి వచ్చిన అతిథికి అన్నపానాదు లొసగి యతని సంతోషపరచుట నృయజ్ఞము. (మనుష్యయజ్ఞము)

(5) శ్రాద్ధతర్పణాది కార్యములు పితృయజ్ఞ మని చెప్పబడును.

"తపోహి మహతాం ధనమ్" అన్నట్లు అనుష్ఠానపరులగు సాధకులకు తమ తపస్సే మహాధనము. వేయేల తపస్సంపన్నులయియుండిన నిర్మల బ్రహ్మానుసంధానపరులగువారికి ఏలాటికొరతలుండవు. అతిశయ సుఖస్వాంతులై యుందురు. ఇది అనుభవముచే గనుమప్పా! పునఃపునః వేదాంత శ్రవణాద్యావృత్తినే తపస్సందురు. నియమముగా నిష్ఠ సలుపుము. చాల మంచిది,

బాబూ ! "నానృతాత్పాతకం పరమ్" అను వేదవచనాను సారము అనృతము అనగా అసత్య మాడుటకంటెను పాతకము లేదని తెలిసి సత్యన్యాయ ధర్మరతుడవై యుండుము. "సత్యాన్నాస్తి పరో ధర్మః". బ్రహ్మనిష్ఠచే సంప్రాప్తమయిన దివ్యమగు మహాసంపద దృశ్యమును గాదు, భయావహమును గాదని తెలిసి తన్నిష్ఠుడవగుము.

"విద్వాన్నభిభేతి కుతశ్చన."

శ్లో॥ వపుః కృశత్వం వదనే ప్రసన్నతా నాద స్ఫుటత్వం నయనే సునిర్మలే
ఆరోగతా బిందు జయోగ్ని దీపనం నాడే విశుద్ధిర్హఠయోగ లక్షణమ్ ॥
అర్థమేమి స్వామీ అని యొకరు ప్రశ్నించిరి.

ఉ. అయ్యా! యోగాభ్యాసము చేయువానికి శరీరము సన్నగను ముఖము ప్రసన్నముగను, మాట ప్రస్ఫుటముగను, నేత్రములు ప్రకాశ వంతములై ఆరోగ్యము గలవాడై అస్ఖలిత బ్రహ్మచర్యము గలవాడై చక్కని జఠరాగ్నిచే నాడీ విశుద్ధి గలిగియుండునని యోగ ప్రక్రియ యందలి శ్లోక మిది యని తదర్థమును శ్రీవారు విపులముగ అభ్యాస కులకు వలయు చక్కని విధానములను తెలిపిరి.

అనంతరము ఆదవాని భక్తులు భక్తిచే శ్రీవారికి వీడ్కోలొసగిరి. శ్రీశంకర జయంతికి లత్తవరము దయచేసి 1.5.57 నుండి ప్రతిసంవత్స రమువలె యథారీతి అన్ని కార్యక్రమములచే ఉత్తమమగు వైదిక విధులచేవాక్యార్థ శ్రవణ మననాది మహా కార్యములతో శ్రీ జగ ద్గురు శంకర జయంత్యుత్సవము జరిగెను.

ఉరవకొండ భక్తులు కల్లూరు చిన్న వేంకటప్ప, జానప్ప, బి. కాశీపతప్ప మొదలగు వారందరు వచ్చి లత్తవరము నుండి శ్రీస్వామిని 10.5.57 ఉరవకొండకు బిలుచుకొని వెళ్ళి శ్రీకల్లూరు చిన్న వేంకటప్ప శ్రేష్ఠిగారి బాలికల పాఠశాలయందు పూజాద్యనుష్ఠానములకు వసతి నేర్పరచిరి. ఉదయ సాయంకాలముల యందు నియమపూర్వకముగ శ్రీవారు కర్మ భక్తి జ్ఞానోపన్యాసములు సలిపిరి. ఇచ్చట మన శ్రీవా రిని చిన్నతనమునుండి చూచినవారు చాలమంది గలరు కావున మన ప్రాంతపు మనస్వామి యిచ్చటికి వచ్చియున్నారని ఇతోధికాదరాభి మానములచే రెండువేళల తండోపతండములుగ భక్త జనాళి పూజాది కార్యములకు, మరి ఉపన్యాసమున కేతెంచుచు శ్రీవారిప్రసాద మయ మగు ప్రసంగములచే ఆబాల గోపాలము మహదానందము నొందిరి.

అనంతరము గంజిగుంట శ్రీమఠమునకు దయచేసిరి. అచ్చట కొంతకాలముండి తత్త్వానుసంధాన మను ప్రకరణ గ్రంథమునకు వ్యాఖ్య యొనర్చిరి. శ్రీగురుస్మరణ పూర్వకముగ తత్త్వానుసంధాన మహాగ్రంథమున ప్రవేశింతము. జిజ్ఞాసువుల కత్యంత పాథేయములౌ ముఖ్యవిషయములు ఇందుగలవు. కంఠస్థముజేసి స్మృతి యందుంచుకొన దగిన వేదాంత ప్రక్రియలు, ఈ ప్రకరణగ్రంథము శ్రీమహాదేవ సరస్వతీ స్వాములవారిచే ముముక్షుజనోపయోగార్థమై సంస్కృతభాషయందు వ్రాయబడినది. దానికి వేదాంత కౌస్తుభమను సంస్కృతవ్యాఖ్యయు గలదు. దీనిని చిద్గగనానందగిరిస్వామి యనువారు తత్త్వానుసంధాన మనుపేర హిందీభాషయందనువదించిరి. ఆహిందీ అనువాదముయొక్క ఆంధ్రీకరణమే ఈ గ్రంథము. ఇందు 4 పరిచ్ఛేదములు (ప్రకరణ ములు) గలవు.

మొదటి పరిచ్ఛేదమున ఆత్మ, ఇంద్రియాద్యవిషయమని విలక్ష ణత్వ నిరూపణ పూర్వకముగ తత్త్వం పదార్థముల విచారము, సమా నాధికరణ సంబంధాది అనేక ప్రక్రియలు చక్కగ ప్రతిపాదించబడి యున్నవి. వాటిని మనము క్రమముగా విచారింతము.

రెండవ పరిచ్ఛేదమున వృత్తి విషయకమగు వ్యాఖ్య ప్రమాణ విభాగము మున్నగునవి గలవు.

మూడవ పరిచ్ఛేదమున స్మృతి, అనుభవము, నిశ్చయము అను నిత్యాది అనేక విషయముల విమర్శ.

నాలుగవ పరిచ్ఛేదమున జీవన్ముక్తిని గురించిన సర్వప్రక్రియలు తెలుపబడి యున్నవి. అని తెలుపుచు శ్రీవారు గ్రంథారంభమును జేసి క్రమముగా ఒక్కొక్క ప్రక్రియ యందలి విషయములనుచక్కగా నిరూపించుచు శ్రోతలకు తద్విషయకమగు వివేక వృత్తిని కలిగించుచు ప్రబోధ మొనర్చిరి.

అనంతరము శ్రీనిర్వాణమఠమున బ్రహ్మనిష్ఠ నందుచు, శ్రీ

పరమ గురువుల పుణ్యారాధన చేసుకొని గుంతకల్లుకు వచ్చిరి.

1.7.57 న శ్రీవారి నాహ్వానించుటకై ఆదవాని నుండి శ్రీగట్టు మల్లయ్యశ్రేష్ఠి, శ్రీగారా శ్రీరాములుశ్రేష్ఠి, శ్రీ ఎ. ఆనందం మొదలగు వారు వచ్చి భక్తిచే ఆదవానికి పిలుచుకొని వెళ్ళి శ్రీచాతుర్మాస్య మహా వ్రతాశ్రమమున శ్రీ యలే. మల్లేశప్పగారి భవనమున సన్నిధి గావించిరి. ఈస్థలము వ్రతాచరణకు తగురీతి యోగ్యమై యుండెను.

## 13.వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1957 సం॥

శ్రీ హేవళంబి నామ సం॥రం ఆషాఢ శు॥౧౧ ఆదివారము 7.7.57 బ్రహ్మ ముహూర్తమున విధ్యుక్తముగ జరుగవలసిన వైదిక కార్య కలాపములచే కలశస్థాపన వ్యాసపూజ ప్రస్థానత్రయ పారాయణేత్యాది వ్రత నియమాచరణలతో ప్రాతఃకాలము ఈశావాస్యోపనిషత్ప్రవచనము ప్రారంభింప బడెను. పిదప సాయంకాలము ప్రదోష పూజానంతరము 7 గం॥నుండి 8.30 గం॥వఱకు శ్రీమద్భగవద్గీతాశాంకర భాష్య ప్రవచనము అనంతరము మహా మంగళ మంత్ర పుష్పము. ఇదే విధముగ నియమ శీల సంపన్నమయి అవిచ్యుతముగ 7.7.57 మొదలు 4.11.57 కార్తిక శు ౧౨ సోమవారము వఱకు శ్రీ గురుకృపచే అకుంఠితముగ పరమ మంగళప్రదమై జరిగెను. ఈవ్రత మధ్యకాలము నందు పూజ్యపాద శ్రీ శుద్ధచైతన్య స్వాములు, పూజ్యపాద శ్రీ శంకరానంద స్వాములు, మరియు పూజ్యపాద శ్రీ రామకృష్ణానంద స్వామి ప్రభృతులు దయచేసి యుండిరి. ఈమహావ్రత సమయమున ముముక్షువులగు బహుజనులు అనుష్ఠాన అధ్యయనాది నియమనిష్ఠలతో, ప్రత్యేకముగ శ్రీవారితో గలసి అపూర్వమగు ఆధ్యాత్మిక తత్త్వ రహస్యములను విపులముగ అడిగి తెలిసి కొనిరి. అనేక ప్రాంతముల నుండి భక్తాదులు వచ్చి శ్రవణము చేసి వెళ్ళుచుండిరి. ఇట్లు సర్వప్రకారములచే నిత్యానందప్రదమై కార్యము

లన్నియు సాంగమంగళముగ నడచెను. చివరి దినమున ల_త్తవరం శ్రీ ఉమామహేశ్వర పాఠశాలవిద్యార్థులతో గీతా పోటీపఠనముగావించి ముద్దులొలుకు చిన్ని బిడ్డల పలుకులచే సర్వులు ఆనందము నొందిరి. అఖండషోడశ నామ భజన జరిగి కలశోద్వాసనాది కార్యములతో ఉత్సవము వైభవముగ నడచెను. అన్నసంతర్పణచే పూర్ణమాయెను. శ్రీవారు దీక్షా విరమణకై భక్తులతో గూడి శ్రీహంపీ క్షేత్రమునకు వెళ్ళిరి. చక్రతీర్థమున దీక్షా విరమణ మయ్యెను. శ్రీవిరూపాక్షేశ్వరునకు మహాన్యాస పూర్వక రుద్రాభిషేకాది కార్యములు జరిగెను.

ఇదే సుసమయమున 7.11.57 కార్తిక శు ౧౫ గురువారము హంపీ పంపాక్షేత్రమునందు సంపన్నులును వివేకవంతులునగు శ్రీ పాడాగల్లు గిరెప్ప శ్రేష్ఠిగారి సుపుత్రులు శ్రీసత్యనారాయణశ్రేష్ఠి యను వారికి శ్రీగురుస్వామి శ్రీమదుమామహేశ్వర గురుపీఠ పరంపరానుగత సంప్రదాయ సిద్ధమగు గురుదీక్ష నొసగిరి. బుద్ధిమంతుడును శ్రద్ధావంతుడును విద్యాసంస్కారి యగు ఈవటు బ్రహ్మచారి గురుసాన్నిధ్యముననుండి గురుకులవాస మొనర్చుచున్నాడు. పిదప అందరు ఆదవాని వచ్చిరి. ప్రత్యేకముగ నాటి సాయంకాలము శ్రీవారాదేశించిన విషయములు.

గురుకులమున వేదోపనిషదధ్యయ నానంతరము శిష్యులు భో గురుదేవా! ఉపనిషత్తుల సారసర్వస్వమగు తాత్పర్యార్థము మాకు బోధింపుడని కోరి నట్లున్నది. అటువలె నిచటి ఈసభయు కూడ నేడు ఈ 13వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము సాంగమంగళ మొనర్చి శ్రీవారిచటినుండి ముందు దయచేయు సుసమయము గావున ఈసందర్భమున మీ యందరి సదిచ్ఛానుసారము సర్వోపనిష త్తాత్పర్యసంగ్రహార్థమును, ఈమహావ్రత ప్రారంభమున ఆరంభింపబడినదియు నగు ఈశావాస్యోపనిషత్తును గురించి ప్రసంగించెదము. ఉపనిషత్తులలో ఈ ఉపనిషత్తు మహత్వ యుక్తమైనది, చిన్నదైనను అపూర్వార్థములచే

నిండినదియై సర్వోపనిషద్ సమన్వయాత్మక జ్ఞానమై యున్నది చిత్తై కాగ్రతచే నాలకించి ఈ జ్ఞానానుభవము నొందెదముగాక యను దృఢ మగు నిశ్చయము గలవారై వినవలెను. మీకు పరమశుభముకలుగును.

ఈవిశ్వమునందుండు దృశ్యాదృశ్య (వ్యక్తావ్యక్త) పదార్థము లెల్లయు పరమాత్ముని వాస స్థానములై యున్నవి. ఆ పరబ్రహ్మ తత్వము సర్వత్ర ఒకటియేయై నిండి యున్నది. పరమాత్మ సర్వవ్యాప కుడు. అతడు మనకొసగిన అవసరములైన వస్తువులనుమాత్రము ఈశ్వర ప్రసాదమను పవిత్ర భావనచే స్వీకరించి అనుభవింప దగును. మనకు ఆవశ్యకము లైనవి మినహా తక్కిన అధికమగు వస్తుసులను లేక ఒరుల వస్తువులను మనము మనసుచే గూడ సంకల్పించరాదు. కోరరాదు. మానవునకు ఈలోకమున వంద సంవత్సరములు ఆయుస్సుకలదు. ఈ ఆయుస్సంతయును ఫలాపేక్షను వదలి సర్వలోకమునకు హితమగు కర్తవ్య కర్మల నాచరించు చుండవలెను. ఈలోకమున మన ఆయుస్సు సార్థకమగుటకు ఇదొక్కటే మార్గము. ఈయోగ్యమగు మార్గముచే నడచుట వలననే మానవుడు కర్మబంధముచే లిప్తుడుగాక కర్మ నాచ రింపశక్తుడగును. ఇట్లు ఫలాశను విడిచి స్వధర్మానుసారముగకర్తవ్య కర్మను అఖండముగ నాచరించు సామర్థ్యము మనయందు కలుగవలె నన్న మనకు తప్పక ఆత్మజ్ఞానము యథార్థతత్త్వజ్ఞానము అత్యావశ్యక ములు. ఆత్మ స్వరూప యదార్థ జ్ఞానము నెవరుపొందుట లేదో వారు అజ్ఞానముచె నావృతులై అంధకారమున సంచరించు వారేయగుదురు. ఆత్మయనగా సర్వవ్యాపియు ఏకమును ఏకకాలమున సర్వత్ర నుండు వాడును అత్యంత సూక్ష్మము ను లోవెలి, దూరము, సమీపము అను భేదములు లేనిదియు సర్వమునకు అనాదియు అనంతము సర్వాంత ర్యామియునై యున్నది.

ఎవడు ఆత్మ స్వరూపమును చక్కగా నెరిగి సర్వ భూతముల యందు ఆత్మను, ఆత్మయందు సర్వభూతము లున్నవనునది ఎరిగి

యుండునో అతడు భయరహితుడు జుగుప్సారహితుడు అగును. సమస్త్త మును ఆత్మ మయము ఆత్మేతరము ఎచ్చటను ఏమియును లేదని ఆత్మ బ్రహ్మమే యని అన్నిటికి అది ముందుగా వెళ్ళియే యున్నట్లు సర్వము బ్రహ్మమయము. ఆత్మమయమే అని ఏకాత్మ స్థితి నొందిన యాతనికి శోక మోహములు లెచ్చటివి? లేవు. ఏకమును, తేజోవంత మును, అశరీరియును, నిర్దోషమును శుద్ధమును, నిష్పాపమును, జ్ఞాన స్వరూపమును సర్వవ్యాపియు, స్వయంభూ అయిన ఆత్మ ఈచరా చర విశ్వవస్తు ఉత్పత్తి కారణుడు. ఆత డొనర్చిన యథా యోగ్య నియమములచే ఈ విశ్వము నిలిచి యున్నది. ఈవిశ్వము ఆత్మయొక్క అంశావిర్భావము. ఆ ఆత్మలేక బ్రహ్మము అదృశ్యుడును ఏకమును నియామకుడునునై యున్నాడు. అను యథార్థ ఆత్మజ్ఞానము అవసరము. తక్కిన అన్ని జ్ఞానములు అల్పములే పూర్ణ జ్ఞానమే ఇహపరములసుఖ దాయకము. పూర్ణజ్ఞానము నొందిఅటువలె నడువకున్న జీవులకు నిజ సుఖమెప్పుడును గలుగదు.

సత్యము, సత్యవస్తువు అత్యంత సూక్ష్మమైనందున మరియు వెలుపలి వస్తువులు మోహాత్మకమై ఆచ్ఛాదించు చున్నందు వలన దాని యథార్థ జ్ఞానముగుట కష్ట మనిపించును. స్వార్థము, కామ్యబుద్ధి, అహంకారము ద్వేషాసూయలు, ఇట్టి అనేక భావనలచే జీవుల బుద్ధి వ్యాపించినందువలన ఈసత్య స్థితి నెరుగుటకు శక్తి కుంటువడును. అందుచేత దానిని శుద్ధీ కరించుట యందు మొదట ఆహార శుద్ది నుండి ప్రారంభము కావలెను. చిత్తశుద్ధికి ఆహార శుద్ధియు కారణము అహం కారాది భావములను తప్పకవిడిచియే తీరవలెను. ఇంద్రియజయము మనోజయము సాధించియే తీరవలెను. సత్య అహింస అస్తేయబ్రహ్మ చర్యములు వీటిని తప్పక నాచరింపదగును. శ్రద్ధ ఏకాంతము తపస్సు అత్యావశ్యకములు. అనుభవుల సంగము అవశ్యము. అపుడు కర్త వ్యమును నిష్కామముగ నాచరింప శక్తి కలుగును. భావము పరిశుద్ధ

మగును. చిత్తము స్థిర మగును. సత్యానుభవము నొందు శక్తి గలుగును. ఒకసారి సత్యమగు బ్రహ్మానుదర్శనమైన ముందిక భయముండదు. ఇట్టి బ్రహ్మానుభవ దృష్టిగల యాతని వైభవము అవర్ణనీయము ఆత్మౌపమ్యత, సమదర్శిత్వములతో వెలుగును.

పరిపక్వ ఫలము గాలిసోకిన తోడనే చెట్టునుండి క్రిందబడు రీతి గురుభక్తి ప్రపత్తులచే వెలయుచు శ్రవణ మననాద్యనుష్ఠానములచే పరిపక్వమైన ముముక్షువగు నాతనికి గుర్వనుగ్రహముచే పాప విని ర్ముక్తుడై సంశయ రహితుడై సత్యమగు బ్రహ్మనిష్ఠ నొందును. అనినిత్యాదిగా చక్కని ఉపమానోపమేయములచే శ్రుత్యర్థము నుపదేశించిరి.

10.11.57 ఆదవాని నుండి భక్తులకు భక్తిభావ సంభరితమగు వీడ్కోలు నొంది గంజిగుంట శ్రీమఠమునకు దయచేసిరి. యథారీతి శ్రీ గురుదేవుల పుణ్యారాధన శివప్రదముగ వైభవోపేతమై నడచెను. మహాత్ములందరు వేంచేసి యుండిరి. అనంతరము శ్రీవారు నంద్యాల శ్రీనగరేశ్వరస్వామి ఆలయమున అచటి యాభక్తులకోర్కెపై ఉపనిషచ్ఛాస్త్ర శ్రవణము గావించిరి.

మరల శివరాత్రి యయిన పిదప ఆదవాని శ్రీచాతుర్మాస్య మహావ్రతాశ్రమంలో శ్రీవారు శ్రవణాదులు జరిపి అచట శ్రీఉమా మహేశ్వరపాఠశాలనొకటి నేర్పరచిరి. శ్రీ తత్వానందస్వామిని అధ్యాపకులుగ నుంచి వ్యవస్థ గావించిరి. పూజ్యపాద శ్రీశ్రీశ్రీ రామకృష్ణానందస్వాములవారి ఆహ్వానముచే కడపజిల్లా శ్రీగండి క్షేత్ర కార్యక్రమమునకు శ్రీవారు ఆదవానినుండి దయచేసిరి. అచటి యా మహాక్షేత్రమును, ఆసభను గాంచి మహదానందముగ నుండుచు ఆధ్యాత్మికోపన్యాసములు సలిపిరి. అచటినుండి ఉత్తవరం శ్రీశంకర జయంతి మహాకార్యమునకు వేంచేసి యథారీతి కార్యక్రమాదులు సలుపుచు వాక్యార్థ శ్రవణాదులచే నచట బ్రహ్మనిష్ఠ నుండిరి. గుంతకల్లు భక్తుల

ప్రార్థన మేరకు 14వ. శ్రీచాతుర్మాస్య మహా వ్రతము శ్రీవంకదారు రామకృష్ణయ్య గారి మహడి యందు జరుప నిర్ధరింప బడెను.

## 14.వ శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1958 సం॥

పవిత్రమైన చతుర్దశ శ్రీచాతుర్మాస్య మహావ్రతము 27.6.58 శ్రీవిళంబి నామ సం॥రం ఆసాఢ శు ౧౧ శుక్రవారము బ్రాహ్మ ముహూర్తమున యథాప్రకారము పూర్వ మహా వ్రతాచరణముల వలె అన్ని వైదిక విధులచే వ్రతమారంభింపబడెను. శ్రీవేదాంతపంచ దశి మహాగ్రంథ ప్రవచ నారంభ పూర్వకముగ ఉదయం 9 గం॥ కు మంత్రపుష్ప మహామంగళమై ప్రాతఃకాలము కార్యక్రమము పూర్ణ మాయెను. ఇక సాయంకాలము ప్రదోషపూజానంతరము 7గం॥ నుండి 8 గం.వఱకు క్రమముగా శ్రీమద్భగవద్గీతాభాష్య శ్రవణము, మంగళము. ఇట్లు శ్రీగురుకరుణచే అధికశ్రావణముతో సహ 5 మాసములు 27.6.58 మొదలు కార్తీక శు౧౨ శనివారము 22.11.58 వఱకు శివప్రదమై సాంగమంగళముగ మహాకార్యము నడచెను.

ఈవ్రత సమయమున అనగా రెండుమాసములు ప్రాతఃకాలము వేదాంత పంచదశి శాస్త్రశ్రవణము తక్కిన మూడు మాసములు మాండూక్యోపనిషద్భాష్యము, నైష్కర్మ్యసిద్ధి మహా గ్రంథ శ్రవణ ములు జరిగినవి. సాయంకాలము యథారీతి శ్రీమద్భగవద్గీత శాంకర భాష్య ప్రవచనములు జరుపబడినవి. ఈ సమయమున నేఆదవానిగారా శ్రీరామయ్యశ్రేష్ఠి పుణ్యదంపతులు సంపూర్ణ ఉత్తరయాత్రముగించు కొని గంగా పూర్ణకుంభముచే వచ్చి శ్రీ సన్నిధి సందర్శించి అందరికి తీర్థప్రసాదముల వినియోగించిరి. మరియు అధిక శ్రావణబ॥ ౧౧ సోమ వారము 11.8.58 నుండి ప్రాతఃకాలము శ్రవణానంతరము 9 గం మొదలు 11.30 గం॥ వఱకు వందలాదిగా భక్తులు జేరి వారము దినము లలో శ్రీ భగవద్గీత ౧౧౦౮ సార్లు 18 అధ్యాయములు పురశ్చరణ సామూహికముగ (పారాయణము) జేసిరి. ఇదే సమయమున శ్రీవారు

సంస్కృతకర్నాటకభాషచే నొప్పు జ్ఞానశతకమను ఉత్తమాధ్యాత్మిక తత్త్వజ్ఞాన గ్రంథమును మధురమగు శైలిలో ఆంధ్రమున అనువదించి జ్ఞానసుధ యను నామమున ముద్రింపించిరి.

ఈచాతుర్మాస్య మహావ్రతపూర్ణ సుసమయమున 21.11.58 అఖండ షోడశనామ భజన పూర్వకముగ ఉక్త గ్రంథావిష్కరణము జరిగెను గ్రంథముల నందరికి పంచిపెట్టిరి. పుణ్యాత్ములగు శ్రీవంక దారు రామకృష్ణయ్య శ్రేష్ఠిగారికి గురుస్వామివారు "సుధీవర"యను అన్వర్థబిరుదమును ప్రసాదించి మహాసన్నిధినుండి యోగ్యతాపత్రము (సర్టిఫికెట్ ఆఫ్ మెరిట్) నొసగిరి.మరియు పూజ్యపాద శ్రీశుద్ధచైతన్య స్వాములవారు ఇది చతుర్దశ చాతుర్మాస్య మహావ్రతము గావున చతుర్దశశ్లోకములచే సుధీవర శ్రీరామకృష్ణయ్యగారిని ప్రశంసించుచు వ్రాసిన ఛందోబద్ధమగు శ్లోకావళిని జదివి శ్రీరామకృష్ణయ్యగారి కొసగుట. ఆదవాని శ్రీఉమామహేశ్వర పాఠశాల విద్యార్థి బృంద ముచే గీతా పోటీపఠనము గావింపజేయుట. బిడ్డలకు బహుమానము లిచ్చుట అను నిత్యాది అనేక కార్యక్రమములచే వైభవముగ నడచి యథారీతి ద్వాదశి 22.11.58కి కలశోద్వాసనపూర్వకముగ పూర్ణమాయెను. ఈమహాకార్యమునకు పూజ్యపాద శ్రీశుద్ధచైతన్య స్వామి, శ్రీరామకృష్ణానందస్వామి, ఆళ్ళగడ్డ శ్రీశంకరానందస్వామి, సురపురం శ్రీశంకరానందస్వామి, శ్రీ శేషయ్యస్వామి దయచేసి యుండిరి.

ఈసారి దీక్షావిరమణకై శ్రీశైల మహాక్షేత్రమునకు అంద రితో సహా శ్రీవారు దయచేసిరి.

26.11.58 విళంబి కార్తీక శు౹౹౧౫ బుధవారము ప్రాతఃకాల మున పావనియగు పాతాళగంగకు వెళ్ళి అచ్చట దీక్షా విరమణాది కార్యములతో గంగయందు జలకమాడి ధన్యులై శ్రీమల్లినాథాను స్మరణపూర్వకముగ మెట్లెక్కుచువచ్చి ఆలయమున మల్లికార్జునజ్యోతి

ర్మహాలింగమును సందర్శించి మహాన్యాసపూర్వక శ్రీరుద్రాభిషేకాది పూజలు గావించి సాయంకాలమున శ్రీక్షేత్రమందు సభజేసిరి. గురువు, ద్వైవము, ఆత్మజ్ఞానము అనువిషయములపై భక్తులందరు ఉపన్యసించిరి.

ఈ చాతుర్మాస్య వ్రతారంభదినములలో శ్రీవారు తెలిపిన సంగ్రహమైన పంచదశి మహాగ్రంథ వివరణ ... శ్రీగురు స్మరణ పూర్వకముగ వేదాంతపంచదశి మహాగ్రంథ ప్రసంగమున ప్రవేశింతము, శ్రీమద్విద్యారణ్య మహాగురువు మంద మధ్యమాధి కారులు కూడ ఆత్మతత్త్వము నరసి ధన్యులగుదురుగాత! యను పరమకృపామయ దృష్టిచే స్వగురు శ్రీశంకరానంద మునీశ్వరుల నమస్కారరూప మంగళాచరణ పూర్వకముగ వేదాంతపంచదశి మహా గ్రంథమును రచించి యున్నారు. వీరు అవతారపురుషులు. అనంతగ్రంథ రచయితలు వీరి వైదుష్యము అపారమగుటచే వీరికి విద్యారణ్యస్వామియను నామమాయె నందురు. ప్రాయః వేదాంత ప్రక్రియలన్నియు ఈ గ్రంథమున కనం దగును. ముముక్షువుల కత్యంతోపకారి. శ్రీ గురు ముఖమున తప్పక శ్రవణము చేయదగిన మహాగ్రంథము.

ఇందు 15 ప్రకరణములు గలవు. అందువలననే దీనికి పంచదశి యను నామమేర్పడినది. మొదటి వివేక పంచకము. ఇందు ద్వైత వివేకము ప్రత్యక్తత్వ, వివేకము పంచభూత వివేకము. పంచకోశ వివేకము మహావాక్య వివేకము.(1) ప్రత్యగాత్మ సర్వ విలక్షణమగు సచ్చిదానంద స్వరూపమైన పరమాత్మయేనని తెలుపుట...(2) సర్వాధారమగు నిర్గుణమైన అద్వితీయ సచ్చిదానంద పరమార్థ తత్త్వమును తత్కార్యమగు పంచభూతములను ప్రపంచించి కారణమగు అనగా అధిష్ఠానమగు బ్రహ్మతత్త్వమును బోధించుట ... (3) "యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్" అనెడి తైత్తిరీయోపనిషత్ శ్రుత్యర్థమూలమున చక్కగా పంచకోశములను ఎంచివిభజించి సర్వ విలక్షణమగు సాక్షి ప్రత్యగాత్మను నిరూపించుట...(4) శ్వేతాశ్వతర

ఐతరేయాది ఉపనిషదర్థాధారమున సృష్టివిషయములను తెలుపుచు అందు జీవసృష్టియగు మానసిక ప్రపంచమును విడుచుటే ముక్తి,యను నిత్యాదివిషయములు చెప్పబడి యున్నవి. (5) ఇందు ఋగ్వేదాంత ర్గతమగు ఐతరేయ శ్రుతి "ప్రజ్ఞానంబ్రహ్మ" యను మహావాక్యార్థ మును, శుక్ల యజుర్వేదాంతర్గతమగు బృహదారణ్యక శ్రుతి "అహం బ్రహ్మాస్మి" యను మహా వాక్యార్థమును, సామ వేదాంతర్గతమగు ఛాందోగ్య శ్రుతి "తత్త్వమసి" యను మహావాక్యార్థ మును, అథర్వణ వేదాంతర్గత మగు మాండూక్య శ్రుతి "అయమాత్మాబ్రహ్మ" యనునీ మహా వాక్యముల యొక్క అర్థము సంక్షిప్తముగ వివరింపబడినది.

ఇక దీపికా పంచకములో (1) చిత్రదీపిక (2) తృప్తిదీపిక (3) కూటస్థదీపిక (4) ధ్యానదీపిక (5) నాటకదీపిక.

(1) చిత్రదీపికలో అధ్యారోపాపవాద దృష్టిచే నిష్ప్రపంచ మగు పరమార్థ తత్త్వమును చిత్రపటోదాహరణ పూర్వకముగచిత్తు చతుష్టయ వర్ణనము. మాయా,తత్కార్య సంబంధము లేని పరమాత్మ చిత్తనియు, మాయా విశిష్టుడు అంతర్యామి యనియు, సమిష్టి సూక్ష్మ శరీరోపాధిగల ఆత్మను సూత్రాత్మ యనియు, పంచీకృత పంచ మహా భూతకార్య సమష్టి స్థూల శరీరోపాధి సంబంధముగల పరమాత్మ విరా ట్టనియు, ఇట్లు ఏకమేవాద్వితీయ మగు పరబ్రహ్మము నందధ్యాస (అజ్ఞాన) మూలమున ఔపాధిక ధర్మములు ఏర్పడినవే గాని అన్యథా స్వయం సిద్ధములైనవి కావనియు, అట్టి అద్వితీయార్థ ప్రతిపాద నా ర్థమై వ్యవహార దశయందు దోచు చైతన్య విభేదమును, ఘటాకాశ మహాకాశ జలాకాశ మేఘాకాశములను ఉపమానములచే ఉపమేయ మగు ఉపహిత చైతన్యము ఏకమనియు, కూటస్థుడు బ్రహ్మము, జీవుడు ఈశ్వరుడు, అను నీప్రకారమగు విభాగము నందు కూటస్థ బ్రహ్మలకు ముఖ్యసమానాధి కరణ సంబంధము, జీవేశ్వరులకు బాధ సమానాధి కరణ సంబంధముచే నభేదమను నిత్యాది విషయములు,

మరియు అనేక మతాంతరుల అభిప్రాయములను తెలుపుచు ఒక చిత్తు నాలుగు ప్రకారములై ఉపాధి వశమున వస్త్రమున చిత్రము వలె చైతన్యాత్మయందు జగత్కల్పన మైనది అను నీ మొదలగు విషయములు గలవు.

(2) శ్లో. "ఆత్మానంచేద్విజానీయా దయమస్మీతి పూరుషః, కిమిచ్ఛన్ కస్య కామాయ శరీర మను సంజ్వరేత్" అను బృహదారణ్యక శ్రుతి మూలమున (ఆత్మ) సచ్చిదానంద నిత్య పరి పూర్ణాత్మ నేనని (తానని) అపరోక్షముగ నెరిగిన బ్రహ్మానుభవి తానేమియు చేయడు, చేయించడు, దేనిని గురించియు వ్యథ నొందడు అను నీవిషయమును ఆధారముగ గైకొని చిదాభాసునకు అజ్ఞానాది సప్తావస్థలను నిరూపించి వస్తుతః చైతన్యాత్మ యందవి లేవనియు కేవల మధ్యాస మాత్రమని సకారణముగ అనంత విషయములను తెలుపుచు శ్రీమద్విద్యారణ్య గురువులు పై ఒక్క మంత్రాధారముచే 298శ్లోకములను రచించి యున్నారు. ఇందలి విషయము లపూర్వములు దృఢాపరోక్ష జ్ఞానియొక్క వ్యవహార వర్ణనయు గలదు. ఈప్రక్రియకు అధికారులై శ్రద్ధగ పూర్వాపర సందర్భముల నెరిగి విషయమును సవ్యముగఅర్థము చేసికొన వలయును.

(3) కూటస్థదీపిక యందు బ్రహ్మాత్మాభేద జ్ఞానమునకు పరమ సాధనమైన త్వంపద శోధన అనగా ప్రత్యగాత్మ యొక్క నిజ స్వరూప ప్రబోధ గావింపబడి యున్నది. ఇందలి విషయము.పరిభాష కొంత జటిలమైయుండును. పరమైకాగ్ర చిత్త వృత్తిగలవారై విన వలెను.

(4) కేవల మందాధి కారులు గూడ ధన్యులు గావలయునను పరమ కృపామయ, దృష్టిచే శ్రీవిద్యారణ్య స్వాములు ఈధ్యానదీపిక యందు సంవాది, విసంవాది యనుఉపమానోపమేయములచే మోక్షోపాయములగు ఉపాసనలను తెలుపుచు నిర్గుణోపాసనయొక్క గొప్ప

తనమును చూపుచు ముముక్షువులు ముఖ్యముగ నిర్గుణోపాసన చేయ వలెనని వస్తు విధేయ విశేషణములను తెలిపి ఆమూలమున అమృతాత్మాను భవము నొంది జన్మజరామరణ రహితుడు కావలయునని ప్రబోధించును. జ్ఞానము వస్తుతంత్రము, ఉపాసన కర్తృతంత్రము అను నిత్యాది అనేక విషయములు ఇందు తెలుపబడి యున్నవి.

(5) ఆత్మయందు జగదధ్యారోపవాదమును సంక్షిప్తముగనిరూపించుచు ప్రపంచోపశమ మగు ఆత్మ తత్వమును చక్కని వివరణములతో వక్కాణించి సర్వులకు అర్థమగునట్లు రూపకాలంకారముచే ఇదొక నాటకముగ వర్ణించి అహంకారమే ప్రభువనియు, శబ్దాది విషయములే సభలోగల ప్రజలనియు, బుద్ధియే నాట్యము జేసెడి స్త్రీగను. శ్రోత్రాది ఇంద్రియములే తాళమేళములను మద్దెలను ధరించిన వారుగను మరియు సభారంగమున ఈ సమస్త భావాభావములను ప్రకాశించు దీపమే సాక్షియని చెప్పను. అర్థాత్ అహంకారాది సర్వేంద్రియ వ్యాపారములకు ఆత్మ దీపమువలె ప్రకాశకమై అసంగమై సాక్షియై యున్నది అను నిత్యాదిగా ప్రబోధింప బడి యున్నది.

(1) తక్కిన 5 అధ్యాయముల యందు అష్టవిధానందములను గురించిన చక్కని వ్యాఖ్యగలదు. అందు మొదట బ్రహ్మానందము, వాసనందము, యోగానందము అను నీ మూడింటిని ఒక ప్రకరణమునందు ప్రతిపాదించుచు ఛాందోగ్యశ్రుతి ననుసరించి సుషుప్త్యావస్థయందు తోచు సుఖము బ్రహ్మానందమనియు తదాదిఅంత్యముల యందు భావమగునది వాసనానంద మనియు, చిత్త చాంచల్యమును బాపునది యోగానందమనియు ఇట్లు బ్రహ్మానందాది యోగానందములు, ఈ ప్రకరణమున అనేక విషయములు వివరింపబడి యున్నవి.

(2) యాజ్ఞవల్క్య మైత్రేయి సంవాదాత్మకమైన బృహదారణ్యక శ్రుత్యాధారమున పరమ ప్రేమాస్పదుడు ఆత్మయే, తక్కినవి గౌణమని బ్రహ్మానంద మందు ఆత్మానందమను నీ ప్రకరణముచే

వివిధ విషయములు నిరూపింప బడినవి.

(3) ద్వైతభావము లేనిస్థితి అద్వైతానందమనినిరూపించి నానా మత మతాంతరులను ఖండించి విరివిగా ఘటోపమానము నొసగుచు వివర్తవాదమును గురించి చక్కగా వివరించుచు నామ రూపములను విడచి నిర్విషయమగు సచ్చిదానంద పరబ్రహ్మమే నేనై (తానై) యున్నానను నిరుపాధిక మగు సహజస్థితి నుండు టే నిజానందము అను నిత్యాదిగా ఈప్రకరణమున విస్తృత వ్యాఖ్య గలదు. నిజముగా ఈ అధ్యాయము నందలి విషయములు ఏకాగ్ర చిత్తముచే శ్రవణము చేసిన అద్వితీయ మగు దివ్యానుభూతి తన్నిష్ఠ ఏర్పడును.

(4) విద్యానందము శుద్ధమైన బుద్ధికి సుసంవేద్యము, సాక్షా న్మోక్షప్రదము. ఇది 4 విధములు. (1) దుఃఖాభావము (2) సర్వకామా వాప్తి (3) కృతకృత్యత (4) ప్రాప్తప్రాప్తవ్యము అను నీ జ్ఞానఫల విషయములను ఈ ప్రకరణము కూలంకషముగ చర్చించినది. మూర్తి చిన్నదయినను కీర్తి పెద్దది యన్నట్లు ఈప్రకరణము చిన్న దేయైనను శ్రద్ధగ శ్రవణము చేయు శ్రోతలకు ఆమహా ఫల వర్ణన అపూర్వమగు దృష్టిని ప్రసాదించును. ఈ గ్రంథకర్త యగు శ్రీవిద్యారణ్య గురు స్వామి అయ్యానందాతిశయమున అహో! గురు! అహో! శాస్త్రమని స్వరూపానందోద్గారముచే ఈ ప్రకరణాంత్యమున పాడియున్నాడు.

(5) స్వస్వరూప మగు బ్రహ్మానంద లవ లేశాంశమైనవిషయా నందమును గురించి ఈచివరి ప్రకరణమున వివరింప బడియున్నది. కేవల సాత్త్విక వృత్తి యందు ఆత్మయొక్క సచ్చిదానందములు భానమగు ననియు రాజసవృత్తి యందు సత్తుచిత్తులు మాత్రమనియు, తామస వృత్తి యందు (మృచ్ఛిలాదుల యందువలె) కేవల యునికి మాత్రము (సత్తు) గోచరించు ననియు నిరూపించ బడినది. ఇట్లు ఇంద్రియ విషయ సన్నికర్ష జన్య జ్ఞానముచే గలుగు ప్రియము, మోదము, ప్రమోదము నయినది విషయానందమన బడును. అను నిత్యాది విషయములుచెప్ప

బడినవి. ఈ ప్రకారముగ విషయ సంగ్రహమును తెలిపి క్రమముగ గ్రంథమును శ్రుతి యుక్త్యనుభవములచే శ్రోతృ జనానంద కరముగ ప్రవచించుచు బ్రహ్మ వృత్తి స్ఫూర్తిని కలుగ జేసిరి.

ఇట్లు మహావ్రత కార్య క్రమానంతరము శ్రీవారు గంజిగుంట శ్రీమఠమునకు గురుకార్యార్థమై గుంతకల్లు నుండి 1.12.58 దయ చేసిరి. అచ్చట ప్రతి సంవత్సరమువలె గురు పుణ్యారాధన మహోత్స వము డిశంబరు 6,7,8 తారీకులలో విధ్యుక్తముగ జరిగినది. ప్రతి సంవత్సరము వచ్చు పూజ్యపాద స్వాములు దయచేసి యుండిరి. సప్త ఋషుల వలె శ్రీవారితో గూడి సప్తఋషి నామములచే పూజింప బడిరి. ఈ సమావేశ మెంతయు మహదానందముగ నుండెను. బ్రహ్మ చారులు శ్రీ డి.పి. వీరభద్రస్వామికి శ్రీశాంతానందస్వామియని శ్రీ షణ్ముఖప్పస్వామికి శ్రీషణ్ముఖానందస్వామి యను తురీయాశ్రమ శుభనామము ప్రసాదించిరి.

శ్రీవారి శిష్యులు గురుభక్తి సంపన్నులగు హాలరివి కోగిల తోట జాగీర్ దార్ శ్రీసిద్ధమ్మ, భాగ్యమ్మ, శ్రీ టి. శివారెడ్డి యను వారు శ్రీగురుస్వామి వారిని అత్యంత భక్తిచే తమ గ్రామమునకు హాలరివికి దోడ్కొని వెళ్ళిరి. శ్రీగురువుల శుభాగమనముచే సర్వులకు మహదానంద మాయెను. శ్రీవారు తమ నిత్య నియమ పూజానుష్ఠా నాములచే నైతిక ధార్మికాధ్యాత్మికాది ఉత్తమ ప్రసంగములను ప్రవ చించిరి. ఎల్లవారును అత్యంత శ్రద్ధతో వచ్చి శ్రవణము చేయుచు దివ్యానందము నొందిరి. తదుపరి అచ్చటి నుండి మరల నంద్యాల హిందూ ధర్మప్రచారసంఘము వారి సదిచ్ఛానుసారము శ్రీమహానం దీశ్వర దేవాలయమున భక్తులు కోరిన ప్రకారము భగవద్గీత 9. వ అధ్యాయము శ్రీశాంకరభాష్యశ్రవణము 11 దినములు జరుపబడెను. ఆసమయమున శ్రీకాశీక్షేత్రమునుండి, అనగా శ్రీవారు మొదట కాశి యందు చదువుకొను నపుడు స్వామికి అధ్యాపకులుగా నుండి సర్వ

విధముల స్వామిని ప్రీతితో గాంచుచు ప్రస్థానత్రయ భాష్య పాఠ ములు జెప్పిన ఉత్తమాధ్యాపకులు పండితులగు బ్రహ్మశ్రీ విశ్వనాథ్ ప్రసాద్ ముఖర్జీయను వారి నుండి ప్రేమమయమగు లేఖ యొకటి మన శ్రీవారికి నంద్యాలకు వచ్చెను. "15.2.59 ఇచ్చట ప్రత్యేక ముగ పండిత సభ సదస్సొకటి 7 దినములు క్రమముగా జరుగును,మీ రిచ్చటికి వచ్చి చాల కాలమైనది; గావున ఈసమయములో తప్పక రావలయును" అను మొదలగు ప్రేమ సంభరిత వచనములతోగూడిన లేఖ (సంస్కృతమున) వ్రాయబడి యుండెను. అందుచేత శ్రీగురు దేవులు గుంతకల్లు వచ్చి అచ్చటినుండి 12.2.59 ప్రాతఃకాలము శ్రీ కాశీక్షేత్రమునకు పయనమై వెళ్ళి 14.2.59కి శ్రీక్షేత్రము చేరిరి.

శ్రీవిశ్వారాధ్య జ్ఞాన సింహాసన మఠములో తమ మొదటి వసతి యందుండుచు గంగాస్నాన పూజానుష్ఠానాది కార్యముల ముగించుకొని శ్రీజగద్గురువులను శ్రీవిశ్వేశ్వరుని సందర్శించి అనంత రము-శ్రీవిశ్వనాథప్రసాద్ ముఖర్జీ పండిత మహోదయుల ఇంటికి వెళ్ళి వారిని సందర్శించిరి. అత్యంతాదరమున పండితులు స్వామిని ప్రేమించి కుశల ప్రశ్నలడుగుచు ఆనాడు విద్యార్థిగా నున్నవారు నేడు స్వామి మఠాధీశులై వచ్చితిరా! యనుచు ఇంతకాలమునకు మరల మిమ్ముగాంచుట దశమ పరిజ్ఞానానంతర మానందావిర్భావమై నట్లు మిమ్ము జూచి మావృత్తి హృషిత మగుచున్నదని ఛలోక్తిగ పలుకుచు సంతసించిరి.

10 గం.కు ఇరువురు గలసి పండితసభకు సంస్కృత విద్యాలయ మునకు వెళ్ళిరి. అచ్చట ఉద్దండ మహా పండితులెందరో సమావేశమై యుండు నాసభ చూచుట కెంతయో వైభవముగ నుండెను. మన పండిత మహోదయులు శ్రీవారిని గురించి కొందరికి ముచ్చటగా పరి చయ మొనర్చిరి. తదుపరి మంగళాచరణ పూర్వకముగ సభ యారం భింపబడి, నాడు "విద్య" యను శీర్షికపై అనేక పండితులు తమతమ

అభిప్రాయములను వ్యక్త పఱచుచు సంభాషించిరి. మఱొకదినము "సంస్కృతము, సంస్కృతి" యనియు ఇట్లు ఒకొొక దినము ఒకొొక విష యముపై మీమాంసలు చర్చ జరుపబడెను. గీర్వాణ భాషామయి విద్యాధిదేవతయగు సరస్వతిని సాక్షాత్తుగ దర్శించి నట్లాయెను. శ్రీ వారీ విషయమును అపుడపుడు తెలుపుచుండిరి విద్యావైభవము అచ టనే జూడవలయునప్పా ! యనుచు సంతసించు చుందురు. ఇట్లు 21.2.59 వఱకు నాసభకు అనుదినము ప్రాతః కాలమున మన శ్రీవారు వెళ్ళుచుండిరి. చివరి దినమున మన శ్రీవారికి అచటి పండితు లెం తయు ప్రేమచే "పూజ్య మహోదయ్ ! మాన్య మహంత్ జీ!" యను సంబోధనలచే గౌరవముగ అష్టోత్తర శతోపనిషత్తులు గల నొక సంస్కృత మూల గ్రంథమును శ్రీవారికి సమర్పించిరి. ఇంతకు కార ణము శ్రీవిశ్వనాథ్ ప్రసాద్ ముఖర్జీ పండిత మహోదయుల పూర్ణా భిమానమే వారి ప్రేమయే ! యని శ్రీవారు చెప్పుచుందురు.

అనంతరము మన పండితులు స్వామిని గుఱించి స్వామీజీ ! తాము తమ దేశమునకు పోవునపుడు బొంబాయి మీదుగా వెళ్ళి అచ్చట మహామండలేశ్వరులగు శ్రీశ్రీశ్రీ మహేశ్వరానందస్వాముల వారిని సందర్శించి వెళ్ళండి, వారు విద్యాప్రపూర్ణులును బ్రహ్మాను భవముగల వృద్ధులని తెలిపిరి.అటులనే యగుగాక యని మన శ్రీవారు 26.2.59 అచటనుండి బయలుదేరి బొంబాయి పార్లాలో మహామండ లేశ్వరులను దర్శించి అచటినుండి 1.3.59 కి గుంతకల్లుకు వేంచేసిరి. భక్తాదులందరికి శ్రీకాశీ క్షేత్రమున జరిగిన పండిత సభా విశేషము లను తెలుపుచు మహాశివరాత్రి పర్వదినమున కాశీ తీర్థప్రసాదములను వినియోగ పరచి శివరాత్రి తత్త్వార్థమును బోధించిరి. తదుపరి కర్నూలు దయచేసిరి. అచటి భక్తులు కోరిన భగవద్గీత 2వ. అధ్యా యమును బోధించిరి.

ద్వైత వస్తువు అవిచార సిద్ధమే గాని తత్త్వతః విచారించిన

అదిలేదు. ప్రతీతి మాత్రమే ! ఆత్మ తత్త్వ విచార లోపము చే ద్వైతము, అధ్యాస, కర్మ, దేహము; దుఃఖ ప్రతీతి మొదలగునవి తోచును.

తత్త్వమసి మహావాక్యార్థ జన్యమగు ప్రత్యగభిన్న పరమాత్మ జ్ఞానమే సర్వానర్థ నిర్మూలన కారణము.

బుద్ధి సాక్షియగు ప్రత్యగాత్మ, వ్యాపకమగు బ్రహ్మమే యను సదాచార్య వచనము శ్రుత్యుక్తమగు ప్రమాణము. ఏతన్మూలముననే అఖండాద్వితీయ జ్ఞానము నొందవలయును. అన్యథా కాదు. శ్రద్ధ గలిగి గురు సాన్నిధ్యమున వాక్య శ్రవణము చేయవలయును. ఉత్తమ మగు శ్రద్ధ గురు దైవ భక్తి గలిగి యుండవలెను.

ఆకాశమునందు మేఘము లుత్పన్నమయి అడగినను ఆకాశము నిర్వికారమై యుండునట్లు బాబూ ! సచ్చిదానంద స్వరూపుడవగు నీయందు బుద్ధ్యాది ద్వైత భేద విస్తారము తోచినను వస్తుతః లేనిదని నీవసంగ చిన్మాత్రుడ వని తెలిసి భద్రమగు ఆత్మనిష్ఠ యందుండుము. ఈ సమస్తమును చైతన్య వివర్తము. పరమేశ్వరుడే !

మహావాక్యము నిన్ను బ్రహ్మముముగ బోధించు విషయమున అది రుచ్యుత్పాదకము గాదు, ఉపాసనా పరమును గాదు, స్తుతి పరముగాదు, గౌణమును గాదు, సంశయార్థమునుగాదు, విరుద్ధార్థ మును గాదు, జాతి వ్యక్తి పరమును గాను, అఖండాద్వితీయార్థమును. దెలుపును గావున చక్కగ విశ్వసింపుము. ఇందు సంశయమువలదు.

నిత్యాద్వితీయ బోధ రూపమగు ఆత్మవిషయమున దృష్టికలుగ లేదన్న అది శాస్త్రాచార్యుల లోపము గాదు. అధికార లోపమే. గ్రుడ్డివానికి రూప ప్రతి భావము గాలేదన్న అది సూర్యుని తప్పు గాదుగదా ! అటువలె జాగ్రతతో తత్త్వానుభవము నొందుము.

బ్రహ్మానుభవి యగు జ్ఞానియొక్క జీవితమును అతని ప్రారబ్ధ

రూపమగు సేవకుడు చూచుకొనును. అతడసంగానుభవి. నిత్యానంద స్వరూపుడు.

ఆపిదప ప్రతి సంవత్సరము వలె విధ్యుక్తముగ ఉత్తరము నంను శ్రీశంకర జయంత్యుత్సవము వైశాఖ శు॥ ౫॥ 8.5.59మొదలు దశమి సోమవారము 18.5.59 వఱకు వైభవముగ ఇరుపూటలుగీతో పనిషద్వ్యాఖ్యానములచే యథారీతి జరిపిరి. పూజ్యపాద శ్రీశుద్ధచైతన్య స్వాములవారు దయచేసి యుండిరి. శ్రీవారు ఉత్తరమునుండి మైసూరు రాష్ట్రము వేణివీరాపురం శ్రీమల్లంగి దొడ్డబసప్ప, శ్రీకందుల కుంట హనుమంతప్ప, శ్రీభీమరెడ్డి మున్నగు భక్తుల ప్రార్థనానుసారము అచ టికి వెళ్ళి సార్వజనిక తత్త్వోపదేశములను చేసిరి.

నంద్యాల భక్త మండలివారు ఈసంవత్సరము 15వ. శ్రీచాతు ర్మాస్య మహావ్రతము శ్రీగురువులు నంద్యాలలోనే జరుప ప్రార్థన యనియు,దీనికిగాను సర్వానుకూలములచే నొప్పు ఒక పెద్దభవనమును ఏర్పాటుచేసి యున్నాము. అదే శ్రీచాతుర్మాస్య మహావ్రతాశ్రమ మని తగు వ్యవస్థలు చేసియున్నాము. శ్రీవారు మాయందు దయ యుంచి దయచేయ ప్రార్థన యని భక్తులు వచ్చి విన్నవించుకొనిరి. శివమస్తు అని శ్రీవారు గంజిగుంట శ్రీమఠము నుండి 27.5.59నంద్యా లకు దయచేసి 1.6.59 సోమవారము నంద్యాల శ్రీచాతుర్మాస్యమహా వ్రతాశ్రమము ప్రవేశించి యథారీతి తమ నిత్య పూజానుష్ఠానశాస్త్ర శ్రవణాది కార్యములచే సుఖముండుచు శ్రీనిర్వాణ మఠమున గురు కార్యము నలుపుకొని వచ్చిరి. పిదప అచ్చటనే శ్రీవారి 40వ. సంవ త్సర జయంత్యుత్సవము (జన్మదినోత్సవము) భక్తిశ్రద్ధలచే విధ్యుక్త ముగ భక్తు లాచరించిరి.

## 15.వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము–1959 సం॥

శ్రీవికారి నామ సం॥రం॥ ఆషాఢ శు ౧౧ గురువారము16.7.59 బ్రహ్మ ముహూర్తమున ప్రభాత సేవానంతరము విధ్యుక్తముగ ప్రతి

సంవత్సరమువలె సర్వకార్యములు జరుపబడి ఈశావాస్యోపనిషత్ప్ర వచనారంభ పూర్వకముగ ఉదయము 9 గం॥కు మంత్రపుష్ప మహా మంగళమాయెను. ఇక సాయంకాలము 7 గం॥నుండి 8 గం॥వఱకు భగవద్గీతా శ్రీశాంకర భాష్యము 2వ అధ్యాయము 11వ శ్లోకము ఆరంభింపబడెను. ఇట్లు అవిచ్యుతములగు నియమములచే ఈ బ్రహ్మయజ్ఞము 16.7.59 మొదలు కార్తిక శు॥ ౧౨ గురువారం 12.11.59 వరకు జరిగి యథారీతి పూర్ణమాయెను. శ్రీమహానంది క్షేత్రమున దీక్షా విరమణాది కార్యములు జరిగెను.

ఈ వ్రత మధ్యకాలమున మహాకార్యము ప్రస్థానత్రయమహా గ్రంథ రచనాత్మకమైన అఖండ కృషి, మరియు జ్ఞానదర్పణ గ్రంథ రచన, తన్ముద్రణ కార్యము నయ్యెను. పూజ్యపాద శ్రీ శుద్ధ చైతన్య స్వామి, శ్రో॥బ్ర॥ శంకర శాస్త్రిస్వామి, పూజ్యపాద శ్రీనిత్యానంద స్వామి కాళహస్తి. (ఆళ్ళగడ్డ) పూజ్యపాద శ్రీ శంకరానందస్వామి, పూజ్యపాద శ్రీ రామకృష్ణానందస్వామి పూజ్యపాద శ్రీ విద్యానందస్వామి (హృషీకేశం) పూజ్యపాద శ్రీ యోగానంద స్వామి మున్నగు అనేక మహాత్ములువచ్చి ఆధ్యాత్మిక తత్త్వోపన్యాసముల జేసిరి. కాదలూరు శ్రీగీతానందుల గీతాభినయనమును జరుపబడెను.

ఉత్తరం చిరంజీవి దేశాయి వీరభద్రప్ప అను వటువునకు ఈ మహావ్రత పర్వకాలమున జ్ఞానానంద స్వామి యను నామమును ప్రసాదించిరి.

పంచదశ శ్రీ చాతుర్మాస్య మహా వ్రతానంత్యము యావద్భక్తమండలి వారి తరపున పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ శంకరానందగిరి గురుస్వాములవారికి సమర్పించిన నమోవాక్కుసుమములు.

ఆధ్యాత్మిక చక్రవర్తీ!

తాము మా నంద్యాల పౌరుల పూర్వజన్మ సుకృతముచే

నాలుగుమాసములు బ్రహ్మ యజ్ఞము జయప్రదముగా సలిపితిరి. శ్రీ మద్భగవద్గీత, ఉపనిషత్తులలోని పరమ రహస్యములను సవిమర్శగా తెలిపి మా అజ్ఞాన తిమిరమును పారద్రోలితిరి. చంద్రుడు వెన్నెల నెట్లు సమముగా కాయునో, అదే విధముగ ఆత్మాధారమున ఈ సమస్త భూతములు ధరింపబడి యున్నవనియు, కల, మెలకువ, నిద్రావస్థలను ఎరుగునట్టి త్రిగుణాతీతమైన వ్యాపక పరబ్రహ్మతత్త్వ స్వరూపులే మీరని శ్రోతలకు దృష్టి నొసగి వినిపించి దృగాత్మానుభవమును కలుగ జేసితిరి. అస్మదాదులు గ్రహించుట బహుక్లిష్టమైనను వానిని ద్రాక్షాపాకమున వడబోసి జ్ఞానసుధను కమ్మగా జుర్రుకొనునట్లు చేసి నిజతృప్తిని కలుగజేసిరి.

ఓ అపరశుకయోగీ!

పరీక్షిన్మహారాజు శాపగ్రస్తుడై యేడు రోజులలో తాను మరణింతునని దుఃఖ సముద్రమున మునిగి యుండ శుకయోగి యేతెంచి భాగవతమును సాంగోపాంగముగా వివరించి యారాజు "నేను చచ్చువాడను గాను" అను అనుభవము మొందునట్లు చేసెను. అటువలె తాము మొదటి ఏడురోజులు, (3 మాసములు) "అశోచ్యా నన్వశోచస్త్వం...నాను శోచన్తి పండితాః" అను నొక్క శ్లోకముచే అత్యద్భుతముగా అపూర్వమగు శ్రుత్యుక్త్యనుభవములచే వివరించుచు నిత్యముక్తమగు అమరాత్మ స్వరూపులు మీరను జ్ఞానము నొసగితిరి. ఆ ఒక్క శ్లోకాధారముననే మూడు మాసములు భాష్యార్థమును బోధించి తిరస్కృతమకంటె అన్యులగు శుకయోగులు వేరెచ్చటను లేరు. అసంగమగు జ్ఞానానుభవులైన తామే అపరశుకయోగులనుట అతిశయోక్తి గాదు! మీ మహోపకారమును మరువజాలము. అనంత నమోవాకములు.

జ్ఞానయోగీంద్రా!

ఈ నవ యుగమున సామాన్య మానవు డనుభవించు సుఖము

లను పూర్వపు రాజులు కూడ ననుభవింప లేదని చెప్పుటకు ఇప్పటి విజ్ఞానశాస్త్రమే తార్కాణము. ఇట్టి కలి పీడితమగుసమయమునఆనందము అన్య వస్తువులయందే యున్నదని ప్రాకులాడుచు రేయింబవలు శ్రమించు మాకు వానినుండి లభించు యానందము నశ్వరమనియు, దుఃఖభాజనమనియు, అనాత్మ విషయములను చక్క జేసికొనుట యను నది సాధ్యము గాదనియు సమమగు ఆత్మ తానని తెలియుటే ఇందలి తత్త్వార్థమనియు చక్కని ఉపమానోపమేయములచే నిరూపించుచు ఆత్మాభాస సుఖమును సుఖముగ భావించవలదనియు స్వరూపమే సుఖ నిలయమను అనుభవములచే పూసగ్రుచ్చినట్లు బోధించితిరి.

అద్వైతమతప్రబోధకా !

ఆత్మ సత్యము-అవినాశి-వ్యాపకము. దాని యందీ జగత్తు రజ్జు సర్పభ్రాంతివలె, ఇంద్రజాలమువలె, వ్యావహారిక దృష్టిగోచరమగు నిది వస్తుతః లేనిదనియు సువిచార లోప మాత్రాస్తిత్వము గల్గి నిన్ను మోసపుచ్చుచున్నదని జగన్మిథ్యాత్వ నిరూపణ పూర్వకముగ బ్రహ్మసత్యంబను మాటను అనుభవముచే తెలుపుచు అంతర్దృష్టి నొసంగితిరి.అంతియేగాక కులము, మతము, కర్మ, క్షేత్రము, అవతారము మొదలగునవి ఆత్మయందు కల్పితములనియు కర్మ భక్తి జ్ఞానములు వేర్వేఱు కావనియు, జ్ఞేయమగు పరబ్రహ్మమే నీవని ప్రబోధించుటకై ఏర్పడిన క్రమములే ఇవి యనియు శ్రుతి సమ్మతముగ బోధించి శ్రీ శంకరాచార్యుల అడుగు జాడల ననుసరించి అద్వైత మత తత్త్వ సిద్ధాన్త రహస్యములను మాకు బోధించితిరి. ఇవి బ్రహ్మాను భవము లేని వారికి మాటలాడుటకు రాని అపూర్వ విషయములు. మూర్తీభవించిన జ్ఞేయ పరబ్రహ్మ మూర్తి ! మీకు వందనములు.

గురుదేవా !

మీ ప్రబోధలు పండిత పామరు లందరికిని వలయు ఉత్తమో

త్తను తాత్త్విక ప్రసంగములు. మీ ఉపన్యాసముల నెవరు శ్రద్ధచే ఒకటి రెండు సారులు విందురో ఇక వా రనుదినము శ్రవణమునకు వచ్చుటను మానరు.తమ వాక్కులు సర్వజన సమ్మతములు నిష్కామ కర్మ భక్తి జ్ఞాన వైరాగ్య విషయములచే నొప్పుచు జ్ఞానమే పరమావధిగా గలిగి వెలయుచుండును. ఇట్టి మహానుభావులగు మీ కృపకు పాత్రులైన నంద్యాల పురభక్తులగు మేమెల్లరము ధన్యులమని విన్నవించు కొనుచు శ్రీచాతుర్మాస్య మహా వ్రత భక్తమండలి వారందరి తరపున ఈవాక్కుసుమములను శ్రీవారిపాద యుగళము నందర్పించు వాడ !

ఇట్లు పురపాలకోన్నత పాఠశాలాంధ్ర పండితుడు
(సం) ఎ. భోగిరెడ్డి.

శ్రీ గురుదేవులు నంద్యాల నుండి గంజిగుంట శ్రీమఠమున గురు పుణ్యారాధన కార్యక్రమమునకు దయచేసిరి.సర్వము శివప్రదముగ గురుకార్యము ప్రతి సంవత్సరమువలె చక్కగ నడచెను.స్వాములందరు దయచేసి యుండిరి.

ఇట్లు కార్యక్రమానంతరము ఆశ్రమమునందే నివసించుచు ప్రతిదినము ఉదయ సాయంకాలముల యందు నియమ పూర్వకముగ పాతంజలి యోగ శాస్త్రమును గురించి ప్రబోధించిరి.

"నాయనలారా ! ఈ పాతంజల యోగశాస్త్ర మెంతయు అభ్యాసకులగు ముముక్షువులకు చక్కని చిత్త సంస్కృతి యొసగును ఆదిశేషావతార మగు శ్రీపతంజలి మహర్షి లోక కల్యాణార్థమైన మానవుల మనో వాక్కాయముల పరిశుద్ధ్యర్థమై

"యోగేన చిత్తస్య పదేన వాచాం మలం శరీరస్య చ వైద్యకేన
యోపాకరోత్తం ప్రవరం మునీనాం పతంజలిం ప్రాంజలి రానతోస్మి॥"

అన్నట్లు యోగ శాస్త్రమును మానసిక శుద్ధికై వాక్శుద్ధికై వ్యాకరణ శాస్త్రమును, శరీర శుద్ధికై వైద్య శాస్త్రమును రచించిన

మహామునులు ఈ యోగ సూత్రములను శ్రద్ధచే నాలకించి అవగాహన మొనర్చుకొన్న ఇందు మూలమున ముముక్షువులకు నూతనమగు దివ్యమైన అభ్యాస బల తేజ స్సాహసము లేర్పడి పురోగమించి యథార్థ జ్ఞానమును బడయ శక్తులగుదురు ఇవి మొత్తము 195 సూత్రములు ఇందు మొదటిది సమాధి పాదము, ఇందులో 51 సూత్రములు గలవు. రెండవది సాధన పాదము, 55 సూత్రములు. మూడవపాదము, విభూతిపాదము, దీనిలో 56 సూత్రములు. నాలుగవది కైవల్యపాదము ఇందు 33 సూత్రములున్నవి. మొత్తము 195 సూత్రములచే 4అధ్యాయములు (పాదములు) గలదై యున్నది. ఈయోగ మతమునకు మూలము సాంఖ్య మతమని తెలియవలయును. ఇందు చిత్త నిశ్చలత. చిత్తముయొక్క పంచ భూమికలు, తద్వికారములు, తన్నివృత్త్యుపాయములు, ఓంకారము, తజ్జపము, ధ్యాన, ధారణ, సమాధిమున్నగు చిత్తాలంబన పూర్వకమైన ఆధ్యాత్మిక సాధనోపాయము లనేకములు మొదటిపాదమున వివరింపబడి యున్నవి.

రెండవదగు సాధన పాదము నందు తప స్స్వాధ్యాయ ఈశ్వర ప్రణిధానాది క్రియా యోగములను విస్పష్టముగ వర్ణించుచు తదభాస్యమును తెలిపి కామరాగ విద్వేషాదికారణ మజ్ఞానమనియు, దృక్ దృశ్య వివేక పూర్వకమగు ద్రష్ట జ్ఞానమున అతద్బుద్ధి వైదొలగుననియు, ఇట్టి అభ్యాస పాటవమున సాధకుడు సత్య ప్రతిష్ఠితుడగునను నిత్యాదిగా ఉత్తమ శీలమును గురించిన అనేక విషయములు తెలుపబడి యున్నవి.మూడవదగు విభూతి పాదమున చిత్తము ధ్యేయమగు ఏదోయొక పవిత్రాలంబనముచే నిలకడ నొంద యోగసిద్ధులు గలుగును. అను నీ మొదలగు విషయములు తెలుప బడి యున్నవి.

మరియు నాలుగవ పాదమున మంత్రౌషధులచే గాని, జన్మచే గాని, తపస్సుచే గాని సిద్ధులు కలుగును అను నీ మొదలగు చిత్త భూమి కలయందలి వైచిత్ర్యములను తెలుపుచు సమాధిచే జ్ఞానము

నొందగలడు అను నీ మున్నగు విషయములు చెప్పబడి యున్నవి..."

ఇందలి ప్రసంగములు చక్కని చిత్తశుద్ధికారణములై యున్నవి. అత్యంత ముఖ్యములయిన అభ్యాసాది యోగములను విని తెలిసికొని ఆచరింప దగినవై యున్నవని మొదటి దినము తెలిపి ఒక్కొక్క సూత్రమును క్రమముగా ప్రబోధించిరి.

గురు స్థానము నుండి శ్రీ స్వామివారు శ్రీ గీతా జయంతికి నంద్యాల శ్రీచాతుర్మాస్య మహావ్రతాశ్రమమునకు దయచేసిరి. ఆశ్రమమున యథారీతి తమ నిత్యనియమానుష్ఠానములచే అను దినముదయ సాయంకాలముల యందు విచారసాగర గ్రంథ ప్రవచనము జరుపుచు తక్కిన సమయమంతయు నవిశ్రాంతముగ ప్రస్థానత్రయ మహా గ్రంథ రచనయందు మగ్నులగు చుండిరి. గురు సాన్నిధ్యమున సంతతము నివసించు భాగ్యమును పడసిన విద్యావినయ సంపన్నులగు శ్రీ పి. సత్యనారాయణ, శ్రీ జి. వెంకటస్వామి చిత్తుప్రతిగ రచింప బడిన గురుస్వామి రచనలను శుద్ధప్రతిగ ఎత్తి వ్రాయుచు నియమము దప్పక అనుష్ఠానాధ్యయనాదులచే గురుకులవాస మొనర్చుచుండిరి.

మనస్వామి వారి యందు మొదటినుండియు అత్యంత ప్రేమగల సనాతన పురుషులు అనుభవజ్ఞానముగల రాయదుర్గము బ్రహ్మశ్రీ హనుమంతరావు డాక్టరుగారు 12-1-60 నంద్యాలకువచ్చి స్వామితో కలసి మహా సంతోషమునొందుచు "పూజ్యస్వామీ! తమను మేము చిన్నతనమునుండి చూచుచున్నాము. ఒకేవిధముగ నున్నారు. సంతత ఉపన్యాసాది మహాకార్యక్రమముల వలన అలసట యగునా యేమి యని మాకపుడపుడు అనిపించుచు తమదివ్యమంగళ మూర్తి స్మరణకు వచ్చుచుండును. సందర్శించి ఆనందమునొందితిమి. అయినను తమశక్తి శుద్ధసాత్విక మహా బలయుతమైనందున భద్రమై యున్నది. ఇప్పటికి 20సం॥ పైగా నయ్యెను. ఒకే రీతిగ నున్నారు. మొత్తము తమ వయస్సు 40 సంవత్సరము లయిపోయెను. అపూర్వమైన అవ్యక్త

మగు దైవశక్తి యుండి ఈపనులు చేయించుచున్నది. భయము లేదు. లోకకల్యాణార్థమైజన్మించిన తనకు అవిశ్రాంతమగు పూజానుష్ఠానాదులతో నిత్యప్రవచనాది కార్యములచే మీదేహమలసి పోకుండును గాక! పరమ విశ్రాంతిచే బహుకాలమువర్ధిల్లుగాక! యని పరమేశ్వరుని ప్రార్థించువాడను" అను నిత్యాది తమ ప్రేమ సంభరితమగు ఉత్తమ భావములను దెలిపిరి. శ్రీవారు 'మహాశయా! గురుదేవునికృప' యని వినమ్రభావమున పలికిరి.

పిదప కర్నూలు, హాలరివి, మరి చింతకుంట, సిరగాపురం, ఆలూరు, తదుపరి బెళగుప్ప, అనకనహాళు, గంగవరం, అనుమాపురం సల్లాపురం, నింబగల్లు మొలగవల్లి, కల్యాణదుర్గం దయచేసి కర్మభక్తి జ్ఞానవైరాగ్యప్రబోధలు జేయుచు ప్రశాంతముగ మహాశివరాత్రికి గంజిగుంట శ్రీమఠము చేరి నిష్ఠలోనుండిరి.

మోహకారణమగు అజ్ఞానము ఆత్మజ్ఞాన మాత్రమున నివృత్తి యగును. ఆత్మజ్ఞానము వాక్యార్థ ప్రబోధచే కలుగును. ఆ ప్రబోధ యన్నను కామ రాగ ద్వేషముల నిగ్రహాయత్తమైచిత్త శుద్ధివలన గలుగును. చిత్తశుద్ధియోకరణత్రయములచే అతడవలంబించు శీలము ననుసరించి అతనిని అధికారిగా జేయును. గురువేదాంత శాస్త్రములయందలి పూర్ణ వివేక విశ్వాసములే మానవుని బ్రహ్మవిద్యాధికారిగ జేయును. ఆత్మజ్ఞాన ప్రబోధ యగును.

మనః స్థైర్యము దప్ప జగజ్జీవనమున సుఖసాధనము వేరొక్కటి లేదు. కాని ఆ స్థైర్యము విధ్యుక్తమైనదై రాజస తామస గుణముల నుండి దూర ముండవలయును. సత్వ సంశుద్ధమగు స్థైర్యమును ఎదురించు బలముముల్లోకములయందును లేదు. కాంతా కనక వస్తువాహనాది విషయ భోగానుభవములే జీవిత సారసర్వస్వమని నమ్మిన వారి

ధైర్యము, వీర్యము, ప్రజ్ఞ, తేజస్సు, సుఖ, శాంతి, యశస్సులు నశించిపోవును. జీవితము దుఃఖ మయమగును.

తల్లి లేని పిల్లలను ఇతరులు ఏవిధముగా జూతురో కర్తృత్వము లేని ముముక్షువుల యొక్క సర్వ కార్యములను మాయోపాధికుడగు ఈశ్వరుడు జూచుకొనును. గురుడు జ్ఞాన మొసగును. ముముక్షువులు ధన్యులై పోవుదురు.

మనో నిగ్రహ మనగా మానసికములగు కోర్కె లుడుగు టే. బ్రహ్మచర్య మనునది సర్వాంగముల యందు ప్రతిష్ఠించబడియున్నది. కావున సర్వేంద్రియముల చేతను సత్యము నారాధించ వలయును. సత్యమే భంగవంతునకు రూపము. ధర్మమే అతని అంగాంగములు. ఇదే పురుషార్థము యొక్క మూలము. ధర్మ శ్రుతిని మీరిన నిన్ను ధర్మ దేవత నిర్దాక్షిణ్యముగా కొట్టును.

ఆత్మోత్సాహమును హీన మొనర్చు కుయుక్తులనుముముక్షువు వినరాదు. అవి పెడత్రోవ బట్టించును. నేనాత్మ, దృశ్యమగు జగత్తు విచారించినచో లేనిది, అసత్యమని తేలును. సత్య ధర్మ శీలములు నా శరీరమును సద్భావన యుండవలయును.

శ్రుతి గురువులు ఆవరణ భంగమొనర్తురు. అద్వయానంద రూపమగు బ్రహ్మమే నీవై యున్నావు. అందులకు తగు అధికారివై యుండుము, అంతే చాలును.

వస్తుతః నీకు ముక్తి వచ్చునది గాదు. బంధము పోవునదిగాదు నీవు నిత్య ముక్తుడవే. మనో దౌర్బల్యమును వీడుము. సద్గురు సచ్ఛాస్త్రముల శిక్షణ బొందుము. నీకు ముక్తి చిరసిద్ధమయ్యే యున్నది. బంధము నీయందు నిత్య నివృత్తమై యున్నది. అజ్ఞతచే అట్లనుకొను చుంటివి.

ఆత్మ జ్ఞానార్థమై జీవించుము. నీ సమస్త కార్యములను నేనే

చూచుకొందును. ఐహిక వాంఛా మధుపానమును మానుము. నీవు పుట్టక పూర్వమే సర్వము సిద్ధ పరచ బడియున్నది. ఓపిక బట్టి అసంగ బుద్ధిచే ఆత్మ సంభావన కలిగి యుండుము. నిత్య తృప్తి నొందుదువు.

"ఆత్మానుభవి (బ్రహ్మానుభవి) జీవితమును అనగా ప్రారబ్ధశేష మును చూచుకొనుటకై పంచ భూతములు వేచి యుండి సర్వవిధ ములనతని సేవించి ఋణవిముక్తి నొందును. ఆ మహాత్మునిచే ముముక్షు వులు ధన్యులగుదురు."

సమస్త క్షేత్రముల యందుండు క్షేత్రజ్ఞాత్మ (పరమాత్మ) ఏకము అద్వితీయము, కాని ఈ క్షేత్రాధ్యాస వలన ఏకమగు ఆత్మ అనేకమా యన్నట్లు భాస మగును. బాగుగా విచారించి క్షేత్రాధ్యాసనువీడుము. సర్వక్షేత్రాధివాసుడగు పరమాత్మ నీవే! ఇట్లుదెలిసి యానందించుము

సత్య పథమున ఎన్ని ఆటంకములు కలిగినను నిర్వైర బుద్ధిచే నీవు ముందంజ వేయుము. ఇది పరమ సిద్ధాంతము. ప్రారబ్ధ కర్మ క్షయార్థమై వచ్చు యిడుములు ఈశ ప్రసాదములని వాటిని పూజ్య బుద్ధిచే అనుభవించుము. అప్రతీకార బుద్ధిచే సేవించుము. సరకుగొన కుము. "మాభీః" "అమృతస్య పుత్రాః"

దేహాత్మ బుద్ధిని దూరీకరింప సంపూర్ణ గురు బలము మిమ్మ వజ్రకవచము వలె గాచి రక్షించును. శని మీ పొంతకు రాదు. శని యనునది సంశయ గ్రస్తమగు అనుమాన యుక్తమైన ఈశ్వర చింతన లేని మనస్సే దప్ప మరేమియు కాదు. మనః సాక్షిని, సర్వ సాక్షిని నేనను గురు బలముచే నుండుము. గడచిన దానిని గురించి చింతింప కుము రాబోవు దానిని గురించి విపరీతముగా నాలోచింపకుము. వర్త మానము ననాయాసముగ ఆత్మ దృష్టిచే గురుభక్తి గలిగి దృఢవిశ్వా సమున గడుపుము. నిత్య శాంతి యందుము.

శ్రీవారు ఆశ్రమమున నిష్ఠచే నుండు కొన్ని దినములకు పరమ భక్తాగ్రేసరులగు రామాయత్త చిత్తులయిన బ్రహ్మశ్రీ సేగుకృష్ణదాసు

గారినుండి లేఖ యొకటి వచ్చెను. మన ఆశ్రమమైన 'అగరం శ్రీని వాసాశ్రమంలో' 3-3-60 నుండి 9.3.60 వఱకు సప్తఋషి పూజ జరుగునట్లు నిశ్చయించి మహాత్ములగు గురువులను ఆహ్వానించి సప్త ఋషుల నామముచే పూజించ వలయునని మాసద్భావన గావునసప్త ఋషులలో తమ్ము ఒక ఋషీశ్వరులుగా భావించి యున్నాము. దయ చేయ ప్రార్థన" యని వ్రాయబడి యుండెను. అందుచేత శ్రీవారు ఆదవానికి దయచేసి అచటి భక్తాదులతో గలసి అగరం శ్రీనివాసా శ్రమం చేరిరి. విధ్యుక్తముగ సప్త ఋషుల పూజ,మరియుప్రబోధలు 7 దినములు అపూర్వముగ జరిగెను. భక్తాదులు వేలాదిగ కలిసి యుండిరి. అచ్చటినుండి అందరు కలసి మరల సుఖముగా ఆదవాని చేరిరి. ఇచ్చట శ్రీఉమామహేశ్వర పాఠశాల వార్షికోత్సవము వైభ వముగ నడచెను. తదుపరి శ్రీవారు గంజిగుంట శ్రీమఠము దయచేసి స్వరూపనిష్ఠ నుండుచు భక్తులు కోరిన శ్రీమన్నిజగుణ శివయోగుల గ్రంథమును శ్రవణము గావించిరి.

శ్రీమన్నిజగుణ శివయోగుల విరచితమగు కర్ణాటక భాషామయ మైన షట్ఛాస్త్రమను నీ మహాగ్రంథ మెంతయు ప్రమాణ భూత మయిన ఉపనిషత్సారము. సర్వ జనానందప్రదము. దీని మూలమున ముముక్షువులు బ్రహ్మానుభూతి నొంది ధన్యులగుదురు. ఇది పండితు లకు ప్రౌఢమగు వేదాంతగ్రంథమయి అభ్యాసకులకు అత్యంతోపా దేయమై యలరారు ప్రాసాదిక ప్రకరణ గ్రంథరాజమై యున్నది.

వీరు సంస్కృత కర్నాటక భాషలయందు అఖండ పాండిత్యము గల శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులయిన మహానుభావులని తెలియుచున్నది. నిజగుణి యను అన్వర్థ నామమున నొప్పు అవతార పురుషులే వీరు. ఇది ఆరు భాగములై యొప్పు మహాగ్రంథము. కైవల్యపద్ధతి, పర మానుభవబోధ, పరమార్థగీత, అనుభవసారము, వివేకచింతామణి,పర మార్థప్రకాశిక యని ఇట్లు షట్ప్రకరణములచే నొప్పుచున్నది. అందు

కైవల్యపద్ధతి యను ప్రకరణమున 5 భాగములు కలవు. ఇది గాన ప్రధానమై యొప్పు పద్యగ్రంథము. దీనిలో ముక్తిసోపాన పంక్తులై వెలయు శివకారుణ్య స్థలము, జీవసంబోధనస్థలము, నీతి క్రియాచార స్థలము, యోగ ప్రతిపాదన స్థలము, జ్ఞాన ప్రతిపాదన స్థలమని ఐదు భాగము లున్నవి.

(1) ఈశ కృపకు పాత్రమగుభక్తి ప్రబోధ (2) ఈశ్వరాను గ్రహము నొందిన వానికి నిత్యవస్తువగు పరమాత్మ యందలి ప్రేమ అనిత్యమగు అనాత్మ పదార్థములయందలి విరతి అను నిత్యాదివిషయ ప్రతిపాదన గలదై యున్నది. (3) ఇట్లు వివేక వైరాగ్య శమదమాది సాధన సంపద్విశిష్టుడగు మోక్షాపేక్షగల ముముక్షువున కనువగు సద్గురు దీక్షా మున్నగు విషయములు. (4) "యోగశ్చిత్తవృత్తి న్నిరోధః" అన్నట్లు జీవుల చిత్త చాంచల్య నివృత్యాత్మకమగు మంత్రాది పంచయోగము లిందు నిరూపింపబడి యున్నవి. (5) సచ్చిదానంద నిత్యపరిపూర్ణమైన చైతన్య పరమాత్మ నీవయి యున్నావను నీ మొదలగు జ్ఞానైకవిషయములచే, అజ్ఞాన తత్కార్య జన్మాధ్యాసాది మిథ్యా దృష్టిని బాపి, అపరోక్ష స్వరూపానుభవరూపమైన బ్రహ్మ జ్ఞానబోధ ఈ ఐదవ ప్రకరణమున అత్యంత విపులముగ ప్రతిపాదింపబడి యున్నది.

ఇక పరమానుభవబోధ యను 2 వ ప్రకరణము బృహదారణ్యకోపనిషత్ప్రసిద్ధమగు యాజ్ఞవల్క్య మైత్రేయి సంవాదాత్మకమైన అద్వైత సిద్ధాన్తము. ఇది కన్నడసూత్రముగను, మరియు పద్యరూపముగను రచింపబడి వేదాంత ప్రక్రియలచే నలరారుచు ముముక్షు జనోత్తారకమై వెలయుచున్నది.

శివ ప్రకరణము పరమార్థగీత శ్రీవశిష్ఠ మహర్షులు శ్రీరామ చంద్రునకు బోధించిన యోగవాశిష్ఠ ప్రక్రియలను చక్కని శ్రుతి స్మృత్యనుభవములచే నిచ్చట సంగ్రహించియున్నారు. విషయములతి

గంభీరములు సుసంగ్రాహ్యములు నయి యున్నవి.

4వ ప్రకరణము అనుభవసారము. నిజముగా ఈ ప్రకరణము చిన్నదియే యైనను విషయ మత్యంత ముపాదేయ మైనది. సర్వోపనిషత్సార భూతమగు సిద్ధాన్తము. చక్కని యుక్తి తర్కానుమానాది ప్రమాణములచే సిద్ధాన్తీకరించి, అనుభవసారమను నామమును సార్థకమొనర్చియున్నారు. అధికారులగు ముముక్షువులు ముఖ్యముగ నీ గ్రంథమును చక్కగ శ్రవణము చేయవలయును. ఇది కన్నడ త్రిపది యను ఛందస్సులో ప్రాసాదికమై వెలయుచున్నది.

5వ ప్రకరణము వివేకచింతామణి. ఇది గద్య రూపమైనసర్వ వేదాంతాది ప్రక్రియల పారిభాషిక మహాకోశమై యున్నది.

6వది పరమార్థప్రకాశిక. ఇది కేవలయోగసంబంధమగు ప్రక్రియలచే నొప్పుగద్యము. ఇందలి కొన్ని విషయములు కైవల్య పద్ధతి యోగ ప్రతిపాద స్థలమున చెప్పబడియే యున్నవి. అను నిత్యాదిగా గ్రంథ పరిచయమును సూక్ష్మముగ తెలియజేసి శ్రీవారు అనుభవ సారమగు ఒక ప్రక్రియను క్రమముగా నడపిరి.మరియొకసారి కైవల్య పద్ధతి యను భాగము నందలి జ్ఞాన ప్రతిపాదన స్థలము అను ప్రక్రియను ప్రియముగ శ్రుతి యుక్తి అనుభవములచే ప్రతిపాదించిరి.

ఇచటినుండి శ్రీవారు లత్తవరం శ్రీశంకర జయంతి మహాకార్యమునకు దయచేసి తదుపరి చిందుకూరు, ఫులమద్ది, పోలూరు అయిన పిదప శ్రీనిర్వాణ మఠమున 19.6.60 పరమ గురు పుణ్యారాధన విధ్యుక్తముగ జరిగి పూర్ణమాయెను. నంద్యాల శ్రీచాతుర్మాస్య మహా వ్రతాశ్రమమున 20.6.60 శ్రీవారి జయంత్యుత్సవము శివప్రదముగ జరిగెను. భక్తాదులు సద్భావనానుసారము గత సంవత్సమునలె ఈ సంవత్సరమును షోడశ శ్రీచాతుర్మాస్య మహావ్రతము నంద్యాల పట్టణమున శ్రీచాతుర్మాస్య మహావ్రతాశ్రమము నందే

జరుగవలెనని కోరుచు శ్రీసన్నిధి విన్నవించుకొని ఆజ్ఞ వడసీ కార్యము నిర్ధరించిరి.

## 16 వ శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1960 సం॥

శ్రీశార్వరి నామ సం॥రం ఆషాఢ శు॥౧౧ సోమవారము4.7.60 బ్రహ్మ ముహూర్తమున యథావిధి గత సంవత్సరముల యందు వలె వైదిక కార్యక్రమములన్నియు విధ్యుక్తముగ నడచెను. ఉదయము ఈశావాస్యోపనిషద్భాష్య ప్రవచన మారంభింపబడి మంత్ర పుష్పాదులచే కార్యము పూర్ణమాయెను. ఇక సాయంకాలము ప్రదోష పూజానంతరము 7గం. నుండి 8గం. వఱకు శ్రీమద్భగవద్గీతా భాష్య ప్రవచనము మహా మంగళము ఇటువలె అకుంఠితమై శ్రీగురుకరుణచే 4 7.60 మొదలు కార్తిక శు॥ ౧౨ సోమవారము 31.10.60 వఱకు నిత్యనియమ తపస్సంపన్నమై భాష్య శాంతితో వ్రత మహాకార్యము సాంగమంగళ మాయెను.

ఈమహావ్రతమున జరిగిన కార్యములు,ఈనాలుగు మాసములు నైమిత్తికముగి యావద్భక్తమండలివారు తప్పక తమ తమ గ్రామముల యందు వ్రతరూపమున శ్రీప్రణవ పంచాక్షర మహా మంత్రమును నియమ పూర్వకముగ ప్రతియొక్క రు 6 లక్షలు జపము చేయునట్లు ఆదేశించి ఆచరింప జేసిరి. మరియు వేదాంత పరిభాషాకోశమగు "జ్ఞాన దర్పణము" అను గ్రంథమును అందరు విధిగా పఠించ వలయునని నియమించి వందలాది జిజ్ఞాసువులచే పఠింపజేసి పరీక్షా రూపమున ప్రశ్నోత్తమురలను సలిపి ఉత్తీర్ణులైన వారికి ప్రమాణ పత్రములను ప్రసాదించిరి.గతసంవత్సరము శ్రీచాతుర్మాస్యమహావ్రతమునప్రారంభించిన "ప్రస్థాన త్రయము" సుధాఖ్య వ్యాఖ్యా సమేతము అను మహాగ్రంథ రచన పూర్ణమగుట. దీనికి మంగళాచరణాత్మకముగ అత్యంత భక్తితో శ్రీశంకర చరిత్రను రచించి మొదట ముద్రింప జేసిరి.శార్వరి సం॥ ఆశ్వీయుజ శుద్ధ ౧౦ విజయదశమి 30.9.60

గ్రంథావిష్కరణ మొనర్చి భక్తుల కొసగిరి.

జగద్గురు శ్రీశంకర చరిత్ర ముద్రణ అయాచితముగ నయ్యెను. గుణవంతులు భక్తులయిన గుంతకల్లు శ్రీపోలాబాలసుబ్బయ్యశ్రేష్ఠి, శ్రీ॥సౌ॥ సుబ్బలక్ష్మమ్మ యను పుణ్య దంపతులు గురుదేవా! జగద్గురు శ్రీశంకర చరిత్ర ముద్రణ మహా ప్రసాదము మాకే యొసగ ప్రార్థన యని ఎంతో భక్తితో విన్నవించు కొనిరి. తథాస్తు అని స్వామి అంగీకరించిరి. నిజముగా వీరి శక్తి చిన్నదైనను గ్రంథ ముద్రణ యావత్తు ఖర్చులను వీరే భరించిరి. "భక్తరత్న" యను శుభ నామమును ప్రసాదించిరి. జగద్గురు శ్రీశంకర చరిత్ర భక్తాదు లందరికి పంచిరి.

భక్తరత్న శ్రీపోలా బాలాసుబ్బయ్యశ్రేష్ఠిగారు జగద్గురు శ్రీ శంకర చరిత్రను పెద్దలకు పంపగా చరిత్రను గురించి వారికి వచ్చిన శుభ సందేశముల కొన్నింటిని ఇచ్చట కనబరచు చున్నాను.

అవ్వారి దత్తాత్రేయ శర్మ. బెల్లంకొండ గుంటూరు జిల్లా
తే॥ 28.1.61.

జగద్గురు శ్రీశంకర చరిత్ర యను గ్రంథమును సంపూర్ణముగా చూచితిని. మరల మరల చూడవలయు ననియే అనిపించు చున్నది. ఈ చరిత్ర తెలుగులో విపులముగా ఇంత చక్కగా రచించిన వారెవ్వరు లేరు. కొలది జ్ఞానముగల వారికి గూడ చక్కగా అర్థమగు నట్లువ్రాసినారు. అట్టి పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శంకరానందగిరిస్వామివారిని అపర శంకరాచార్యస్వామిగా దలంచి నమస్కరించు చున్నాను.

ఈ గ్రంథములను వ్యక్తులకు ఉచితముగా ఇచ్చుటకంటె పఠనాలయములకు, పాఠశాలలకు ఉచితముగా యిచ్చుట మంచిది ..."

సన్నిధానం లక్ష్మీనారాయణమూర్తి, 24-1-61
అవధాని, ప్రధానాధ్యాపకులు, చిట్టిపాపాయపాలెం,
గురుకులాశ్రమము. గుంటూరు జిల్లా.

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులగు శ్రీ శంకరానంద

గిరి స్వామివారిచే రచియింపబడిన శ్రీ జగద్గురు శంకరాచార్య చరిత్ర జిజ్ఞాసువులకు పఠనీయ గ్రంథము..."

శ్రీ కవిచక్రవర్తి-శతావధాని
విద్వాన్ దోమా వెంకటస్వామిగుప్త విజయవాడ, 3-3-61.

...పూజ్యశ్రీ శంకరానందగిరి స్వామివారు వ్రాసిన శ్రీశంకర గురు చరిత్ర చదివినాను. లలితమగు సులభ శైలిలో వ్రాయబడి సర్వ జనోపయోగ్యముగా నున్నది.

శ్రీ వి.వి. గిరి తే॥ 3-4-61
కేరళ గవర్నర్ కొజికోడ్-2

తాము శ్రీజగద్గురు శంకరచరిత్రను పంపినందులకు వందనములు. ఈపవిత్ర గ్రంథము పఠించుటకు ఆప్యాయమానముగాను మరియు దేశమునకు మహోపకారిగాను ఉన్నది.

మీ విశ్వసనీయుడు,
(సం) వి. వి.గిరి.

శ్రీ డి. సంజీవయ్య, హైదరాబాదు
ఛీఫ్ మినిష్టర్, ఆంధ్రప్రదేశ్. 9-4-61.

తాము పంపిన శ్రీజగద్గురు శంకర చరిత్ర చేరినది. ఈ పవిత్ర గ్రంథము వాస్తవముగాను, పఠన యోగ్యముగాను, విలువైనదిగాను మరియు అమూల్యమైనదిగా ఉన్నది.

మీ విశ్వసనీయుడు,
(సం) డి. సంజీవయ్య.

స్వామి నిర్వికల్పానంద. తే॥ 24-5-61
శ్రీరామకృష్ణమఠం, రాజమండ్రి.
స్వామిజీ!

ఓం నమో నారాయణాయ

శ్రీ శంకరాచార్య జీవిత గ్రంథమును చూచి సంతోషించినాను. ఇంత చక్కటి శైలితో గూడిన గొప్పగ్రంథములను విద్యాధికారులు పాఠశాలలో పఠనీయ మొనర్పరుగద!

డాక్టరు హనుమంతరావుగారు
రామదుర్గము. తే॥ 6-10-61.

పూజ్యపాద స్వాములవారి సన్నిధానమునకు,

శ్రీశంకరుల చరిత్ర నాతిదీర్ఘముగను, నాత్యల్పముగను ఉండక శంకర విజయమునందలివిషయములు సంగ్రహించి బహుసులభశైలిలో భక్తి, శ్రద్ధ, ఓపిక లేని యిక్కాలపు భక్తాదులకు సుబోధక మగునటుల శంకరచరిత్ర 5 ఘట్టములుగా లోకానుగ్రహము కొరకై ప్రకాశింప చేసినందున తాము అపర శంకరులని నేను హృదయ పూర్వకముగా విజ్ఞాపనము చేయుచున్నాను.

ఇత్యాదిగా జగద్గురు శ్రీ శంకర గురుచరిత్రను గురించిన ప్రశంసాపత్రము లనేకములు భక్తరత్న శ్రీ పోలా బాలసుబ్బయ్య శ్రేష్ఠిగారికి వచ్చెను. గీతావాణి, రామదర్శనము, ఆంధ్రజ్యోతి మున్నగు పత్రికలయందును ప్రకటింపబడెను.

శ్రీమాన్ రాజా పెద్ద సుబ్బరాయ శ్రేష్ఠిగారు భక్తిచే వచ్చి పూజ్యస్వామీ! గాయత్రీ మంత్రార్థ మేమి? దయతో తెలుప ప్రార్థన యని ప్రశ్నించిరి. అందులకు శ్రీవారు ఎంతో ప్రేమచే ఈవిధముగ సెలవిచ్చిరి. యజమానులూ! మొదటి మూడు వ్యాహృతులవా! బ్రహ్మ తపమాచరింప మొట్టమొదట అతని నుండి ఓంభూః ఓంభువః ఓంసువః అని జీవాహంకృతి వ్యవహారస్థానములు ఈమూడు

కలిగెనట. ఇవియే మూడు లోకములు. భూర్లోకము అనగా పృథ్వి సంబంధమయినది. భువర్లోకము-దీనికంటె సూక్ష్మమును స్థూల సంబంధమును గలదై యున్నది. స్వర్లోకము అనగా స్వర్గము. మరియు వీటికవ్వల మహర్లోకము, తపోలోకము, జనలోకము, సత్యలోకము అని నాలుగున్న వనియు అందురు. జీవుడు తన పుణ్య విశేషమున స్వేచ్ఛగ తత్తద్భోగముల ననుభవించు ననియు చెప్పబడును. ఈపైలోకములకు క్రింద పాతాళము, మహాతలము, రసాతలము, తలాతలము, సుతలము, వితలము, అతలము అను ఏడులోకములు. మొత్తము పదునాలుగనియు ఇందులో ఓం భూః, ఓంభువః. ఓంసువః, ఓంమహః, ఓంజనః, ఓం తపః, ఓంసత్యం, అను నీ ఏడును వ్యాహృతు లనబడును. గాయత్రి మంత్రమును ధ్యానించు నపుడు మొదటి మూడు వ్యాహృతులను చెప్పుదురు. ఇవియే జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థ లన్నియు వీటి కతీతమును ఆధారమునై యున్నదే ఆత్మ యనియు అర్థమును సూచించును ఇవి ప్రణవమున లయ మగును.

ప్రతి మంత్రమునకును ఋషి దేవత, ఛందస్సు, ధ్యానము అను నిత్యాది నియమములు గలవు. గావున గురి గలిగి తద్దేవతానుస్మరణాత్మకమగు దృష్టిచే భక్తితో మంత్రము ననుష్ఠించిన ఫలసిద్ధి యగును. ముముక్షువుల పాలిట మంత్రాధి దేవత శ్రీగురు పరమాత్మయే ! గతి బాయక అనుష్ఠించిన ఆత్మ గురు స్వరూపమే నని తెలిసి ఆవరణ నివృత్తి పూర్వకమగు అఖండానందము నొందును.

జపాద్యనుష్ఠాన ప్రసంగముల యందు కొందరు హోమములన్న దానము మున్నగు కార్యము లాచరించిన మంచిదే. వినిర్మల శ్రద్ధా భక్తులే ప్రధానములు. ముముక్షువులు పవిత్ర సంకల్పముచేనిష్కామముగ జపించు టొక్కటియే కర్తవ్యము.అందుకు చేయవలసినబాహ్య కర్మ లేవియును అంత ముఖ్యములు కావు. నాయనా ! మంత్రములు కొన్ని శ్లోక రూపముగను వచన రూపముగను గలవు చందోబద్ధముగ

శ్లోక రూపమున నున్న వాటిని ఋక్కు లందురు. వచనాత్మకమగు మంత్రములను యజుస్సు లందురు.

"గాయన్తం త్రాయతే ఇతి గాయత్రీ" ఏది తన్ను పురశ్చరణ చేయు వానిని కాపాడునో అది గాయత్రి యని చెప్పబడును. గాయత్రి మంత్రార్థము నెరిగి చక్కగా ననుష్ఠించిన యెడల అంతఃకరణమున గల సమస్త దోషములు నివృత్తము లగును. ఇది విశ్వాస మాత్రమేగాక స్వీయ అనుష్ఠానానుభము. సకామమగు బుద్ధితో గాక నిష్కామముగ ననుష్ఠించిన ఆవరణ నివృత్తి పూర్వక ఆత్మ జ్ఞానానుభవ సాధనమై యున్నది. ఈ మంత్రమును సావిత్రీ మంత్ర మనియు కూడా చెప్పుదురు, ఇది సవితృ దేవతార్పణమై యున్నందున దీని కీ నామము గలిగెను. ఈ మంత్రము సూర్య ప్రార్థనాత్మకమై యున్నది.సవితయనగా సూర్యభగవాను డని అర్థము. ఇచ్చట తత్త్వతః విచారించిన సూర్య చంద్రాగ్న్యాది మండలాంతర్వర్తి యగు చైతన్యాత్మ వ్యాపకబ్రహ్మ తత్త్వ మనియే తాత్పర్యార్థము. "యదాదిత్య గతం తేజో జగద్భాసయతేఽఖిలం యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధిమామకమ్" అని గీతయు తెలుపు చున్నది. ఈ మంత్రము గాయత్రీ ఛందస్సులో నున్నది ఈ ఛందస్సు మూడు పాదములు గలిగి ప్రతి పాదము ఎనిమిది అక్షరములతో నొప్పు చుండును.

ఓం తత్సవితుర్వరేణ్యం
భర్గో దేవస్య ధీమహి
ధియో యో నః ప్రచోదయాత్

ఇవియే మంత్రము నందలి మూడు పాదములు. ఇందు మొదటి పాదమున 7 అక్షరములే యున్నవన్న. అట్లు కాదు 'ణ్యం' అను శబ్దమును ణి, యం, అని తెలియ వలయు ననియు లేక ఓంకార యుక్తముగ గణించ వలయు ననియు చెప్పుదురు. శ్రీశంకర భగవత్పూజ్యపాదులు ఈ విషయమును బృహదారణ్యకోపనిషద్భాష్యమున 'ణ్యం' అను అక్షరమును ణి, యం అని విభజించి చెప్పిన తప్పు గాదనియు ఛందో

భంగము గాదనియు తెలిపి యున్నారు.

ఈ మంత్రమునకు ఋషి రాజర్షియను విశ్వామిత్రుడు. ఈ మంత్రము శుక్లయజుర్వేదమునను కష్ణ యజుర్వేదమునను గలదు. ఋగ్వేదములో మూడవ మండలమున 60వ సూత్రములో 10వ మంత్రమైయున్నది. దీనిని ఓంకార యుక్తముగ వ్యాహృతులతో గూడి నుచ్ఛరించవలెను. మరియు ఈ మంత్రమును ఓం భూర్భువస్స్వః ఓం తత్సవితుర్వరేణ్యం...అనియు కూడ రెండవ పాదమునకు ఓంకారము చేర్చి చెప్పవచ్చును లేదా విడిచి "తత్స వితుర్వరేణ్యం" ... అన్నను తప్పలేదు.

దీని సంక్షిప్తమగు అర్థ మేమన,

ఓం భూర్భువః సువః తత్సవితుర్వరేణ్యం
భర్గో దేవస్య ధీమహి
ధియో యోనః ప్రచోదయాత్॥

ఈ మంత్రమునకు మొదట ఓంకారమున్నది. ఓం అనునది పరమేశ్వరుని యొక్క సర్వోత్తమ మయిన నామము. ఆపరబ్రహ్మమునకు ఓంతత్ సత్ అనియు నామ నిర్దేశము గలదు. ఈ ఓంకారము అ.ఉ.మ. అను మూడక్షరములచే నొప్పుచు ఇదియే పరమేశ్వరుని అనేక నామములై వెలయు చున్నది. అ కారమే విరాట్టు ఉ కారమే హిరణ్యగర్భుడు, మ కారమే అవ్యాకృతుడు. ఈ మూడింటి లయాధిష్ఠానమే తురీయమగు బ్రహ్మము అనగా ఓంకారము పరమాత్మాభిధానమై యున్నది. "ఓమిత్యే తదక్షర ముద్గీథ ముపాసీత...(ఛాందోగ్యము)" "సర్వే వేదాయత్పద మామనన్తి... (కఠ)" ఇత్యాదిగా ఉపనిషత్తులు వర్ణించు చున్నవి. "భూః, భువః, స్వః" భూః అనగా ప్రాణవాచకమైన సర్వజీవనాధారమగు ప్రాణమున కంటెనుప్రియుడైన పరమేశ్వరునకు భూః యని నామము - భువః యనగా దుఃఖ రహితుడగు పరమేశ్వరుని సంబంధముచే సర్వ జీవుల దుఃఖ నివృత్తి యగును గాన అతనికి భువః యనియు పేరు. స్వః -యనగా సర్వ

ప్రపంచ కారణుడైన సమస్తైశ్వర్యముల నిచ్చువాడు గావున అతనికి స్వః యనియు నామము అట్టి, యః = ఏ పరమాత్మ గలడో అతగు నః = మా యొక్క, ధియః = బుద్ధీంద్రియాదులను, ప్రచోదయాత్ = ప్రేరణ మొనర్చుగాత ! ధీ సాక్షియగు చైతన్యాత్మ దృష్టి కలుగుగాక ! తత్ = అటువంటి, సవితుః = సర్వ జగత్సృష్టి కర్త యైన, దేవస్య = దేవుని యొక్క, వరేణ్యం = శ్రేష్ఠమయిన, భర్గః = దివ్య తేజస్సును, ధీమహి = ధ్యానము చేయు చున్నాము. లేక ధరింతుము. గాక ! యని అర్థము.

"సవితుర్దేవస్య తవ యదోం భూర్భువః స్వర్వ రేణ్యం భర్గోస్తి తద్వయం ధీమహి ధరేమహి ధ్యాయేమహి కస్మై ప్రయోజనాయేత్య త్రాహ హేభగవాన్! యః సవితా దేవః పరమేశ్వరో భవానస్మాకం ధియః ప్రచోదయాత్ స ఏవాస్మాకం పూజ్య ఉపాసనీయ యిష్టదేవో భవతు సత్వాన్యోభవత్తుల్య భవతోధికంచ కించిత్ కదాచిన్మన్యామహే॥ అను నిత్యాదిగా అర్థ మయి యున్నది.

యజమానులూ! సహజముగ చిత్తోపరమము గల ప్రాతస్సాయం సంధ్యా సమయము లందు చక్కగ నీమంత్రమును పురశ్చరణచేయుట పరమ పావనము. ఆత్మ బ్రహ్మమే అయి యున్నది అదే సూర్యుడు స్వయం ప్రకాశమగు చైతన్యాత్మ జ్ఞానము నొందుటే ఇందలి తత్వార్థము. పవిత్రమగు గాయత్రీ దీక్ష వల్లనే మానవుడు పునీతుడగును. ద్విజుడగును. వేద విదుడగు శ్రోత్రియ బ్రహ్మ నిష్ఠుడైన గురువుచే ఉపదేశింప బడిన అప్పుడతడమృతానుభవము నొందు చున్నాడు.

మరియు పూర్ణ గాయత్రి చతుష్పాద గాయత్రి యని అది స్వస్వరూపానుభవ రూపమున తత్త్వమసి మహావాక్యార్థ స్వరూపమై యున్నది. తైత్తిరీయఛాందోగ్య బృహదారణ్యకోపనిషత్తుల యందును బ్రహ్మసూత్రముల యందును ఈ విషయము వర్ణింప బడి యున్నది. "పరో రజసే సావదోం" "రజసే = అవిద్య కంటెను (రజస్సె

కంటెను) పరః = అతీతమైన,సః= ఆ పరమాత్మ అవతు=రక్షించు గాత। సర్వ ప్రకాశములకతీత మగు పరమ ప్రకాశ స్వరూపమైన వ్యాపక బ్రహ్మమే తానను అఖండాద్వితీయార్థ బోధకమై యతి సంధ్య యన నొప్పుచున్నది.

శ్రీ గురుముఖమున మంత్ర మాదేశింప బడినపుడు అది సజీవ మగును. చైతన్య వంతమునై అర్థ యుక్తముగ శిష్యుని యందు చైతన్యానుభవ స్ఫూర్తిని కలిగించును. అప్పడే అది మంత్ర మగును.అట్లు లేకున్న మంత్రము లన్నియు అనేకముగ శ్రుతులలో దొరకును. కాని సంప్రదాయకమగు గురి లేనందున అవి అనుభవ సాధనములుకావు.

అనుష్ఠాన మతి జాగ్రతతో నాచరింప వలయును. లేకున్నఅది ఉన్నట్టే ఉండి నిన్ను ఎచ్చటికో తీసుకొని వెళ్ళును. వాటినే సమాధి విఘ్నము లందురు. లయ, విక్షేప, కషాయ రసాస్వాదములు.

మరియు కొందరికి అనుష్ఠానము నుండి వృత్తి బహిర్గతమయి వచ్చిన పిదప కోప తాపాదులు తోచునట. ఇది అంతఃకరణమునందలి మలదోష ప్రభావము. దీనిని సాధకులు ప్రయత్న పూర్వకముగసావధానముగ వివేక యుక్తమగు సాత్విక నిష్ఠచే ఏతన్నివృత్తి నొంద వలయును.

"యజ్ఞానాం జప యజ్ఞోస్మి"యను భగవద్వచనానుసారముసావధానముగ జపించిన మానసిక నిర్మలత, ఆ మూలమున వస్తు తత్వావధారణ శక్తి కలుగును.

ప్ర. "స్వామీ! గురువులగు పెద్దలకు పాదములకే సమస్కారము చేయుదురు కదా దాని మహిమ ఏమి ?

ఉ. విషయ వాసనా విశిష్టమగు అహంకృతి అడగిన గాని శిరమువంచి పాదములకు నమస్కరించదు. ఆ క్షణకాలమైనను దేహమనోవృత్తు లడిగిననే గాని ఆ కార్యము జరుగదు. మరియు బ్రహ్మానుభవుడగు

గురుదేవుని చరణాంగుష్ఠమున ఫాలమును మోపుటచే అతని అపవిత్ర భావములు దూరమై గురుస్వామి పవిత్ర శక్తి అతని యందు ప్రవేశించును. శీల సంపద్విశిష్టమగు గురుశిష్య సంబంధమున పవిత్ర శక్తి స్పందనము యొక్క విషయ మపరోక్షము. పరీక్షితు శ్రీ శుకదేవుల చరణ కమలమున శిరము వంచి నమస్కరించి పూజించి ఆత్మ జ్ఞానముచే ధన్యుడయ్యెనని చెప్పబడి యున్నది. పాపుల సంస్పర్శచే మనస్సు క్షుబ్ధ మగునను నది తెలుసు గదా! అటువలె పవిత్రాత్మానుభవియగు గురుదేవుని పద స్పర్శ తురీయ పదానుభవ సాధనము ఇది ఉపనిషత్సంప్రదాయము.

"మహా మంత్రమును అర్థ సహితముగ చక్కగ జపించిన జన్మ రాహిత్యమగును. సమస్త వికారములు వైదొలగును. శాశ్వత నిజానంద మలవడును. వాక్యార్థ శ్రవణ జన్యమగు అపరోక్ష జ్ఞానానుభవమే ఈమహామంత్ర జపము. నిష్ఠ సావధానముగ నియమముతప్పక అనుష్ఠించిన అయ్యనుభవము మీకే కలుగును" అను నిత్యాదిగా అనేక విషయములు తెలిపిరి.

ప్రస్థానత్రయ మహా గ్రంథముద్రణ విషయమున భక్తాదులు తమకు తామే ప్రేమచే దానికి వలయు ధనము నిచ్చిరి. ముద్రణ విషయక మగు సర్వ కార్యముల నెరిగిన ఆధ్యాత్మిక తత్త్వవేత్తలయిన పండితులును, శబ్దార్థకల్పతరు ఇత్యాది మహాగ్రంథ సంస్కర్తలు నగు పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శుద్ధచైతన్య స్వాములవారికి ముద్రింప జేయుటకై ప్రస్థానత్రయ మహా గ్రంథవ్రాతప్రతిని శ్రీవారు పంపిరి ఇక గుంతకల్లు శ్రీరామకృష్ణ సుధీవరులే పేపరు తెప్పించుట మరియు ప్రెస్ వారికి డబ్బు పంపుట మున్నగు కార్యములన్నింటిని శ్రద్ధచే చూచుకొనిరి.

శ్రీవారు తమ గురువుల పుణ్యారాధనకు 9.1.60 నంద్యాల నుండి గంజిగుంట శ్రీమఠమునకు దయచేసిరి. పూజ్యపాద శ్రీశ్రీశ్రీ

శుద్ధచైతన్యస్వామి శ్రో॥బ్ర॥ బ్రహ్మశ్రీ శంకర శాస్త్రి స్వామి(సుర పురం) వారు మున్నగు మహాత్ములు వచ్చిరి. ప్రతి సంవత్సరమువలె విధ్యుక్తముగ నవంబరు 14,15,16 తేదులలో కార్యక్రమములు మంగళ ప్రదముగ నడచి పూర్ణమాయెను. అచట నుండి శ్రీవారు ఉరవకొండ దయచేసి శ్రీకన్యకాపరమేశ్వరి దేవాలయములో గీతాజయంతి కార్యక్రమము యథారీతి సాంగ మంగళముగావించిరి.

అనంతరము శ్రీవారు గుంతకల్లు వచ్చి శ్రీరామకృష్ణ సుధీవరుల మేడలో 10.12.60 మొదలు 4.1.61 వఱకు ప్రతిదినమురెండు వేళల శ్రీదక్షిణామూర్తి శ్లోకముల వ్యాఖ్య మరియు దశశ్లోకి (సిద్ధాన్త బిన్దు) అను గ్రంథ ప్రవచనము జేసిరి. ఇంతలో శ్రీవ్యాసాశ్రమము మహర్షి మలయాళ స్వాముల వారి సన్నిధి నుండి 10.12.60 లేఖ యొకటి వచ్చెను. "ప్రియమైన స్వామీ! వందనములు.తమచే రచింపబడిన 'జ్ఞానదర్పణము' అను గ్రంథము బ్రహ్మవిద్యలో మొదట ప్రవేశించు వారికి చాల ఉపయోగమని తలంపు గలిగినది. ఇది వ్యాసాశ్రమముతరపున ముద్రించినచో తర్వలోవ్యాపకము కాగలదని తలంపుగలిగినది. ఆలాగున ముద్రించుటకు మీకు సమ్మతమని తోచిన తెలిపేది...' అని వ్రాయబడి యుండెను. అందుకు శ్రీవారు సంతోషముగ అటులనే యగుగాక అభ్యంతరము లేదని తెలియ పఱచిరి. పిదప మహర్షి శ్రీ మళయాళస్వాములవారి సన్నిధి ఆశ్రమమునుండి (లేఖ) "లోకసేవాపరులగు మహాత్ములు త్యాగపరులై లోక క్షేమమే తమ జీవిత లక్ష్యముగా తలంతురు..." అను నీ ప్రకారముగ ప్రియమైన ప్రత్యుత్తరము వచ్చెను. అందరు సంతసించిరి.

శ్రీవారు ముముక్షువుల హితార్థమై శ్రీమద్భగవద్గీతా పరీక్షలనుపెట్టి 1.1.61 మొదలు ఒక సంవత్సరములో 18 అధ్యాయములను టీకా తాత్పర్యములతో అధ్యయనము గావింప జేసిరి. 21 కేంద్రములలో 140 మంది పాఠకులు ప్రథమ ద్వితీయ శ్రేణుల యందు త్తీర్ణ

లయిరి. ఈ విషయమున భక్తులకొఱకై శ్రీవారు చాల పరిశ్రమ వహించిరి. 16.2.61 శ్రీవారు ఆదవాని శ్రీయల్.మల్లేశప్పగారి ఉన్నత పాఠశాల ప్రారంభోత్సవమునకు దయచేసి అచటనే శ్రీఉమా మహేశ్వర పాఠశాల యందు 17.2.61 మొదలు 25.3.61 వఱకు అనుదినము నిత్య నియమశీలసంపన్నులయి పూజానుష్ఠానాది కార్యములచే ప్రాతః సంధ్యాసమయములందు ఉపనిషద్గీతా భాష్య పాఠ ప్రసంగములతో అనుభవైక గమ్యములగు నపూర్వ విషయముల నుపన్యసించిరి. మరియు శ్రీరామనవమి 25.3.61 రోజున శ్రీ ఉమామహేశ్వర పాఠశాల కమిటీవారు ఈపాఠశాల వార్షికోత్సవ మత్యంత వైభవముగ జరిపిరి. ఆనాటికార్యక్రమము : పూజ్యపాదశ్రీస్వాములవారి శుభాశంసనములచే ప్రారంభింపబడెను. శ్రీ టి.జి.యల్. తిమ్మయ్యశ్రేష్ఠి,యం.యల్. ఏ. గారు స్వాగతోపన్యాసము నిచ్చిరి. శ్రీశరభాచారి బి.ఏ. బి. యి. డి. డి.ఇ.ఒ. గారు అధ్యక్షతవహించిరి. అధ్యాపకునిచే పిల్లల పఠన పాఠనాదులు జరుపబడెను. శ్రీ జి. వి. చలపతిరావు బి. ఏ. బి. యల్., ఆర్.డి.ఓ గారిచే విద్యార్థులకు బహుమతు లొసగబడెను. వందన సమర్పణము మంగళము, ప్రసాద వినియోగములతో కార్యక్రమము పూర్ణమాయెను. తదుపరి శ్రీవారు బెళగుప్ప, హాలరివి, రామపురం వగైరా స్థానములకు దయచేసి శ్రీ శంకరజయంతి మహోత్సవమునకు ఉత్తవరం వేంచేసి బ్రహ్మసూత్రార్థముల వివరించిరి.

ఆ పిదప గంజిగుంట శ్రీమఠమునందు పరమవిశ్రాంతిగ 15 దినములుండి భక్తజనావళికి తమచే విరచితంబైన 'జ్ఞానసుధ' యను ఉత్తమగ్రంథము నిరుపూటలు చక్కగ వివరించుచు వ్యాఖ్య యొనర్చిరి. గూళపాళ్యం శ్రీ పాటీల్ రాచనగౌడుగారు వచ్చి స్వామిని భక్తితో తమగ్రామమునకు దోడ్కొని వెళ్ళి యథారీతి నిత్య నియమానుష్ఠానాదులచే శ్రీవారి ఉపన్యాస కార్యక్రమము లేర్పరచిరి. మరియు వీరి సోదరులగు పి. దొడ్డన్న గౌడు వి. యం. గారు

మున్నగు పురభక్తులెల్లరు భక్తిశ్రద్ధలచే వచ్చి శ్రవణము జేయుచు మహదానందము నొందిరి. ఇచటినుండి శ్రీవారు నంద్యాల శ్రీ చాతుర్మాస్య మహావ్రతాశ్రమమునకు దయచేసిరి.

29.6.61 గురువారం ప్రస్థానత్రయము (సుధాఖ్యవ్యాఖ్యా సమేతము) గ్రంథము ముద్రణపూర్ణ మయినట్టు పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శుద్ధచైతన్యస్వాములవారినుండి ఉత్తరమును మరి గ్రంథము వచ్చెను. శ్రీవారితో సహా భక్తాదులందరును చూచి ఆనందము నొందిరి. శ్రీ వెల్‌కమ్ ప్రెస్సు వారెంతటి సమర్థులు. అనతి కాలముననే ముద్రణ కార్యమును ముగించిరికదా ! యని మరిమరి సంతసించిరి.

పూజ్యశ్రీవారికి మహాత్మాగాంధీజీ వారి యందత్యంత పూజ్య బుద్ధి గలదు. శ్రీవారు చిన్నతనమున ఉరవకొండ హైస్కూలులో బాగుగ జూచి యుండిరి, పిదపవారి సాహిత్యమును చక్కగ పరిశీలించిన వారును మరియు తమ గురువులు మహాత్మాగాంధీగారిని గురించి తెలుపుచుండిరి. కనుక స్వామికి మహాత్మాగాంధీజీ యన్న మిక్కిలిభక్తి అందుచేత ప్రస్థానత్రయ మహాగ్రంథ రచన సమకాలమున లేఖిని నడచుచుండగా స్వామి అంతరంగమున మహాత్ముని విషయకమగు సుప్రసన్న వృత్తులు పుట్టుచుండెడివట. అందుచేత ఈ గ్రంథము పూర్ణ మయినవెంటనే మొట్టమొదట మహాత్మాగాంధీజీ సమాధిని సందర్శించి తాతా! ఇదో ప్రస్థానత్రయ మహాగ్రంథమును తెచ్చితిమని తెలిపి తదుపరి అందరికి ఇవ్వవలయును (గ్రంథావిష్కరణ చేయవలయును) అని నిశ్చయించుకొని యుండిరట. కావునశ్రీవారు గ్రంథ ముద్రణ పూర్ణమైనదను విషయము తెలిసి చూచిన పిదప ఢిల్లీ ప్రయాణము 13.7.61 నిశ్చయించిరి.

గురుభక్తులగు బెస్నేకంపెనీ ఏజంటు శ్రీ ఎ.జి. కేశవ రెడ్డిగారు మున్నగు భక్తులందరుకలసి మాటలాడుకొని మా పూజ్య గురుస్వామి వారు పవిత్రమైన ప్రస్థానత్రయ మహాగ్రంథమును గైకొని విమాన

మున పయనించి ఢిల్లీలో మహాత్మాగాంధీ సమాధిని సందర్శించి వచ్చె దరుగాక! యని దానికి వలయు అన్ని ఏర్పాటులనుగావించిరి. శ్రీవారి జయంత్యుత్సవముటున పిదప శ్రీవారు ప్రస్థానత్రయ మహా గ్రంథ మునుపూజించి అచటినుండి హైదరాబాదు వచ్చి విమానంలో ఢిల్లీ (హస్తినాపురం) దయచేసిరి.

ఢిల్లీ పాలం విమానాశ్రయంలో స్వామిభక్తులగు విద్యావినయ సంపన్నులయిన శ్రీ యన్. రామమూర్తి యం. ఎ. యం ఎస్. సి. కుIIసౌII నాగేశకుమారి పుణ్యదంపతులు స్వామికి భక్తితో స్వాగ తము చెప్పి తమ యింటికి దోడ్కొని వెళ్ళిరి. శ్రీ సత్యానందబ్రహ్మ చారి, శ్రీవెంకటస్వామి బ్రహ్మచారి మొదటనే అచట చేరియుండిరి. మరునటిదినము 15.7.61 ప్రాతఃకాలము పూజానుష్ఠానానంతరము అందరుభక్తిచే రాజ్‌ఘాట్ వెళ్ళి మహాత్మాగాంధీజీ మహాసమాధిని సందర్శించి పూజించి గుంతకల్ భక్తరత్న శ్రీపోలాబాలసుబ్బయ్య శ్రేష్ఠిశ్రీ డి. బసివిరెడ్డి గారు ఇచ్చిన ఖద్దరుగుడ్డలుధరించి "మహాత్మా! వచ్చితిమి. "ఇదో ప్రస్థానత్రయ మహాగ్రంథము తెచ్చితిమి, ఇచ్చి తిమి" అని భక్తిచే గ్రంథమును సమాధిపై సమర్పించి ప్రదక్షిణ నమ స్కారము లొనర్చిరి.

అచటబాపూజీ మహాసమాధి సందర్శనమైన పిదప భక్తాదు లకు ఈక్రింది విధముగ మహాత్ముని పలుకులచే నొప్పు లేఖలు అందరికి వ్రాసి పంపిరి.

సత్యమే దైవము (Truth is God) అది అమృతమును అవ్య యమును శాశ్వతమగు పరమధర్మమునయి నిర్మలాంతఃకరణులగుజ్ఞాను లకు స్వస్వరూపమై వెలయుచున్నది. సత్యమే ధర్మము. సత్యమే ఈశ్వరుడు.

నేను సత్య మార్గమున నడచుచున్నందు వలన భయంకరమగు భ్రమ ప్రమాదాది విషయములు నాకు క్షుద్రములై దోచును. అవి

నన్ను భయపెట్టలేవు.

నా జీవితమున రహస్య మనునదేదియును లేదు. నా జీవిత గ్రంథమునందలి ప్రతిపుటయును అందరు చదువుకొనవచ్చును.

ఒక పుటయందు సుఖము, మరొక పుటయందు దుఃఖము మొత్తము గ్రంథ మంతయు ఇంతే! ఈ రెండింటిని గాంచు తాను భగవత్స్వరూపుడని తెలిసి జీవించిన జన్మ ధన్యమగును.

కేవలము సత్యమే యున్నది. ఇంతకంటె అన్యమగు ద్వితీయ పదార్థము వేరొండు లేదని నా నిశ్చయము.

శిష్యుని యోగ్యత ననుసరించియే గురువు లభించు చుండును.

గురుదేవుని యందుగల భక్తియే భవబీజమును భస్మమొనర్చి దివ్యభవ్యమగు అలౌకిక జీవన సౌఖ్యము నొసగును.

నిజమగు మానవత్వముగల మనుజుల మాటలు సత్యముగను, మితముగను, మధురముగ నుండును.

ఏ మహా సుఖ సమాధి యందు శ్రీరామ నామముగూడ పాన కము నందలి పుడకవలె దోచునో అట్టి పూర్ణ సుఖ స్వాస్థ్యమగు సహజస్థితి ఎప్పుడా యని ఆ ముహూర్తము నెదురుచూచుచున్నాను.

మనో మాలిన్యము ఉపవాసాది కఠిన వ్రతములచే మాత్రము దూరమగునది కాదు. శుద్ధి యగునది కాదు. చక్కని విచారము వల్లను ఎడతెగని భగవచ్చింతనముచే నది బాయును.

నేను వచింపదలచిన విషయములను నిస్సందిగ్ధముగను నిష్కప టముగను ప్రకటింతును. చాకచక్యమునకు నా జీవితములో స్థానము లేదు.

సంపూర్ణమైన అహింస (ఆత్మదృష్టి) వజ్రములో సమమైన కఠిన హృదయమును గూడ ద్రవీ భూత మొనర్చును. ఈ అహింస (ఆత్మదృష్టి) యనునది సమస్త విపత్తు లనెడి నానావిధ తాపముల

తాకిడికి వజ్రమువలె మహాదృఢమై యుండి తాళ గలుగును.

నాపై నేరారోపణములను జేయుచు తొందరలను గలగించు చున్న నారిపై నేనెప్పుడును కోప తాపములచే నొచ్చుకొని వారి కప కారముచే హానిని గోర కుందును గాక ! ఈశ్వరుడు సర్వుల హృదయేశుడై యున్నాడను దివ్యమగు దృష్టి, తుష్టి, పుష్టి సమతాద్యాది సర్వశక్తుల నొసగు గాత ! ఓం.

శ్రీ యస్. రామమూర్తిగారు 17-7-61 శ్రీవారిని తోడ్కొని ప్రస్థానత్రయ మహా గ్రంథముతోసహ 11.30 గంటలకు రాజ భవనమునకు వెళ్ళిరి. ఆనాడు రాష్ట్రపతి శ్రీరాజేంద్రప్రసాద్ మహోదయులు ఆయాసము మరి పంటిబాధచే నున్నందున మాటలాడుట కవకాశము లేని స్థితియై యుండెను. అయిననేమి పండిన పంటయాయననొప్ప వయో వృద్ధులును జ్ఞాన వృద్ధులునగు రాష్ట్రపతి శ్రీ రాజేంద్రప్రసాద్ గారికి ప్రస్థానత్రయ మహాగ్రంథమును సమర్పించి సంతసించిరి. రాజదూత నొకరు వచ్చి రాజభవనము నందలి విశేషములను శ్రీవారికి చూపెట్టిరి.

19-7-61 శ్రీరామమూర్తి పుణ్యదంపతుల భక్తియుక్తమగు వీడ్కోలు నొంది విమానమెక్కి హైదరాబాదు విమానాశ్రయంలో దిగిరి. శ్రీ యం. లక్ష్మిరెడ్డిగారు స్వామిని తమ ఇంటికి తోడ్కొని వెళ్ళి పూజానుష్ఠానానంతరము అచటి సువిశాల భవనమునందు శ్రీవారి ఉపన్యాస కార్యక్రమము నేర్పరచి సభ గావించిరి. శ్రీవారు ధర్మము అను శీర్షికపై ఉపన్యసించిరి. మరుసటి దినము నంద్యాల శ్రీ చాతుర్మాస్య మహా వ్రతాశ్రమమునకు విచ్చేసిరి. భక్తాదులందరు శ్రీగురుదేవులను సందర్శించి ఆనందము నొందిరి.

## 17.వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము - 1961 సం॥

24-7-61 సప్తదశ శ్రీచాతుర్మాస్య మహావ్రతారంభమునందు మరియు ఆనాడే ప్రస్థానత్రయ మహా గ్రంథావిష్కరణము జరుగుసను

విషయము ఆహ్వాన పత్రికలు పంపబడి యుండెను. సకాలము అనేక స్థలముల నుండి భక్తాదులు వచ్చిరి. గుంతకల్లు, ఆదవాని మున్నగు చోటులనుండి ప్రస్థానత్రయ మహాగ్రంథ ముద్రణ దాతలు మొదలగు వారందరును వచ్చి చేరిరి. పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శుద్ధచైతన్య స్వాముల వారును దయచేసిరి. కాశీక్షేత్రము వెళ్ళిన బ్రహ్మచారు లును, గుంటూరునుండి ప్రస్థానత్రయ గ్రంథములతో సహా సకాలము నకు విచ్చేసిరి.

యథారీతి శ్రీప్లవనామ సంవత్సర ఆషాఢ శుద్ధ ౧౧ సోమ వారము 24-7-61 బ్రహ్మ ముహూర్తమున ప్రభాతసేవ యైనది. ప్రతిసంవత్సరమువలె విధ్యుక్తముగ కార్యక్రమములు ప్రారంభింపబడి ఉదయము ఉపనిషద్భాష్య శ్రవణముచే 9. గం.కు పూర్ణమాయెను. ఇక సాయంకాలము 6 గం నుండి 8.30గం. వఱకు గొప్ప సభ జరిగెను.

శ్రీవారును మరియు పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శుద్ధచైతన్య స్వామివారును సభాస్థలి వేదిక నలంకరించిరి. మంగళాచరణ పూర్వ కముగ సభ ప్రారంభింపబడెను. పూజ్యశ్రీ గురుస్వామివారు నేడే సప్తదశశ్రీచాతుర్మాస్యమహా వ్రతారంభమును, పూజ్యపాదశ్రీశ్రీశ్రీ శుద్ధచైతన్య స్వామివారి అమృత హస్తములచే ప్రస్థానత్రయ మహా గ్రంథావిష్కరణమును ఒక్కసారిగా రెండును కలసి వచ్చుటెంతయు అపూర్వము, ఆనందదాయకను అను నీ మాటలను పలికిరి. అంత పూజ్యశ్రీ శుద్ధచైతన్య స్వాములవారు పరమ సంతుష్టాంతరంగులై ఆ దివ్య భవమగు సమావేశమును గాంచి ఇది శ్రీమదుమామహేశ్వర గురుపీఠ పరంపరా మహాశక్తియై యున్నది. ఇది తపస్సంపన్నులును శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులగు పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శంకరానందగిరి గురుస్వాములవారి ద్వారాఅభివ్యక్తమగుచు ముముక్షుజనోత్తారకమై వెలయుచున్నది. సంప్రదాయములు ఎన్నో గలవు. అన్నిటిని మేము జూచితిమి. నిష్పాక్షికముగా జెప్పవలెన్న ఈ సంప్రదాయమున

శ్రీవారి ప్రబోధలెంతయు దివ్య శక్తి సంపద్విశిష్టములు. నాస్తికులను ఆస్తికులుగను ఆస్తికులగుభక్తులనుముముక్షువులుగను ముముక్షువులను ముక్తులుగ జేయు పరమాద్వైత సిద్ధాన్త ప్రతిపాదకములు. ప్రాయః ఎప్పుడో ఒకప్పుడు కొన్ని దినములు మాత్రమే ఇట్టి ఉత్తమ సత్యాద్వైత సిద్ధాన్త విషయములను మాటలాడు కొనుట యనునది గాక ఈ సంప్రదాయమున మన శ్రీవారు 365 దినములు సంతతము ఆ విషయములనే వివిధ ప్రకారములచే శిష్యులకు బోధించుచు తామిట్టి నిష్ఠాపరులై నిస్వార్థముగ పరిశ్రమించుచు శిష్యజనోద్ధరణార్థమైఅవతరించిన కారణాచార్యులే శ్రీస్వామివారు. ఇట్టి అద్వితీయార్థ బోధకమైన మాటలను విని దృష్టి గలిగి అటువలె వర్తించు ఉత్తములను శ్రీవారి శిష్యుల నెందరినో నేను జూచి చాల సంతసించు చున్నాను. విశిష్టమైన సంప్రదాయ మహాశక్తి మహా వైభవమని భావించు చున్నాను. ఇక శ్రీవారి రచనలెంతయు సుగమములు. సుందరమును అర్థగంభీరము నగు భాగవత భాషాశైలి. ఎన్నటికో కొన్ని సంవత్సరములకుగాని వంద ఫారములు గల ఈ ప్రస్థానత్రయ మహా గ్రంథ ముద్రణ ముగియునది కాదు గదా ! ఎన్నో అడ్డులు, ఆటంకములు ఉండును. ఈ కార్యమున నైవనూ, ఏతొందరయు లేక సకాలమునకు సాంగముగ పూర్ణమయి గ్రంథములు ముముక్షు జన కరకమలముల నలంకరించిన వన్నచో నిది మహత్తరమగు గురు శక్తియే. శ్రీవారి భద్రమగు శుద్ధ సంకల్ప శక్తియే! ఇందులకు కారణము. ఇక ఆనాడు శ్రీరామభద్రునకు ఒకే ఆంజనేయు డుండెనట. నేడు మన శ్రీవారికి అట్టి శక్తి సంపద్విశిష్టులగు ఇద్దరు ఆంజనేయులు గలరు. ఒకరు సత్తి, ఇంకొకరు జి. వి. స్వామి మరియు దాతల ఉదారమగు నిర్మల మనోభావములు, శ్రీ వెల్‌కమ్ ప్రెస్ వారి శ్రద్ధ, నా నిమిత్త మాత్రత, అను నిత్యాదిగా విశాల భావములచే నొప్పు అనేక విషయములను తెలిపి ప్రస్థానత్రయ శబ్దార్థమును చక్కగ నిర్వచించి, ఇంతవఱకు

ప్రస్థానత్రయమను ఒకే గ్రంథమును ఎవరు ప్రచురించలేదు అవి విడి విడిగా లభ్యమగుచున్నను భాష్యగ్రంథములందలి మూలార్థమునకు విరుద్ధము గాక సంగ్రహించి వాటిని ఒకచోట చేర్చి శ్రీస్వామివారు ముముక్షువులకు మహోపకార మొనర్చిరి.ఇది ప్రశంసనీయమని తెలుపుచు "వాఙ్మ మనసి ప్రతిష్ఠితా" యను శాంతి మంత్రోచ్చారణ పూర్వకముగ శ్రీ శుద్ధచైతన్య పూజ్యపాదులు చక్కగ నలంకరింపబడి మహా తేజస్వాంతమై వెలయు ప్రస్థానత్రయ మహా గ్రంథమును తమ హస్తములచే ఆవిష్కరించిరి. పట్టువస్త్రపు తెర దెరచి గ్రంథములను చూపిరి. ఆ వెను వెంటనే మంగళవాద్యములు ప్రయోగింపబడెను. పురుష సూక్తములను స్వస్తి వాచకములను చెప్పిరి. జయ జయ ధ్వనులచే పుష్పవృష్టి గురిసెను.

ఈ మహావ్రత సుసందర్భమున శ్రీరామతీర్థ సేవాశ్రమాధిపతులగు పూజ్యపాద శ్రీశ్రీశ్రీ కేశవతీర్థ స్వాములవారు పంపిన స్తవము

గీ. పరమ శివరూప ! కారుణ్య భవ్య భావ !
దివ్య వేదాంత గంగానదీ ప్రదాత !
శమిత తాపత్రయానల శాంతమూర్తి !
శంకరానందగిరి యతి చక్రవర్తి !

గీ. పరమ వైరాగ్య కైలాస పర్వతాగ్ర
వాస ! సంతతాశ్రిత జన ప్రమథయుక్త !
నిరత పర తత్త్వబోధక ! గురువతంస !
శంకరానందగిరి మహాస్వామి పాద !

(సం) స్వామి కేశవతీర్థ

ఈ సంవత్సరము శ్రీచాతుర్మాస్య మహావ్రతమున శ్రవణ గ్రంథముగ నిర్ధరింపబడిన ప్రస్థానత్రయ మహాగ్రంథము నందలి గీతా ప్రస్థానము నందొక శ్లోకార్థమును శ్రీవారు ప్రతిపాదించిరి. తదుపరి గ్రంథ ముద్రణ దాత లందరికి ఒకొక గ్రంథమును ప్రసాదించిరి.

మరియు "న్యాయ వేదాంత శిరోమణి" శ్రీమన్నారాయణ మూర్తి గారికిని యావత్తు ఆశ్రమ బ్రహ్మచారులకు తదితర పెద్దలకు ఒక్కొక్క గ్రంథము నొసగిరి. చివర మంత్రపుష్ప మహా మంగళముచే నాటి కార్యక్రమము పూర్ణమాయెను.

ఇట్లు ప్రతి నిత్యము సాయం ప్రాతః కాలముల యందు ప్రస్థాన త్రయ మహాగ్రంథ ప్రవచన పూర్వకముగ సమస్త వైదిక పద్ధతులచే 24-7-61 మొదలు 19-11-61 కార్తిక శు ౧౨ ద్వాదశి వఱకు— శ్రీచాతుర్మాస్య మహావ్రతము అవిచ్ఛిన్నముగ జరిగెను. కార్తిక శుద్ధ ఏకాదశి అఖండ షోడశ నామ భజన పూర్వకముగ 19-11-61 ద్వాదశ కలశోద్వాసనాది కార్యములచే యథారీతిపూర్ణమాయెను.

ఈ మహా వ్రతారంభ దినములలో రెండవ దినము తెలిపిన వాక్యములు.

శ్రీమదుమామహేశ్వరులకు, శ్రీఉమామహేశ్వరగురుపీఠమునకు సద్గురు వరేణ్యులకు వందనము లాచరించి శ్రీగురు స్మరణ పూర్వకముగ పవిత్రమగు ప్రస్థానత్రయ మహాగ్రంథమునందు, బ్రహ్మసూత్ర ప్రస్థానములో క్రమము ననుసరించి ప్రవేశింతము. నేడు దిగ్దర్శనాత్మకముగ బ్రహ్మసూత్రములను గురించి మాటలాడుకొని పిదప ప్రతి సూత్రమును చక్కగా విచారింతము.

ఈ బ్రహ్మసూత్రములను శ్రీవేదవ్యాస మహర్షి రచించిరి. వీనికి సర్వోపనిషత్సార భూతమై అద్వైత సిద్ధాన్తమును నిర్ధరించు న్యాయ ప్రస్థాన మనియు, వైయ్యాసికీ శారీరక మీమాంసా, బ్రహ్మ సూత్రములని పేరు సూత్ర మనగా అల్పాక్షరములు గలిగి అసందిగ్ధార్థ బోధకమై సారవంతమై శాస్త్రార్థము నందంతటను వర్తించునదియై, వ్యర్థ పద రహితముగను నిర్దోషమునై యొప్పు వాక్యమని అర్థము. ఇందు నాలుగు అధ్యాయములు గలవు. ప్రతి అధ్యాయమునకు నాలుగు పాదములు గలదై 192 అధికరణములచే నొప్పుచు 555 సూత్రములు

గలదై ఇది యొప్పుచున్నది. ఉపనిషన్ముఖీకరణమగు సద్వృత్తిగల ముముక్షువులెల్లరు ముఖ్యముగ బ్రహ్మసూత్రముల శ్రవణము జేసి సత్యాద్వైత సిద్ధాన్త మహిమ నెరిగి ధన్య ధన్యులగుట కర్తవ్యము. "శాస్త్రంశారీర మీమాంసా" అన్నట్లు అన్వర్థమగు నామముచే నొప్పు ఈ ప్రతి సూత్రార్థము నందును బ్రహ్మత్వము సంపుటీకరణమై యున్నది అత్యంతాపేక్షచే పరమ శ్రద్ధాళువులై విను శ్రోతకు ఏతదనుభవము దూరము గాదని మాదృఢవిశ్వాసము.

మొదటి అధ్యాయము నాలుగు పాదములయందు ప్రతిపాదింప బడిన సంక్షిప్తమగు తాత్పర్యార్థ మేమన : (1) జిజ్ఞాసాధికరణమున "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" యని సూత్ర మారంభింపబడి ముముక్షు వగు నధికారికి బ్రహ్మమే విచారార్హ మను పూర్వాపర సంబంధము లతో నొప్పు చతుస్సూత్రములచే సర్వార్థములును వివరింపబడును. ఈ నాలుగు సూత్రముల యొక్క విపులార్థమే తక్కిన 551 సూత్రము లన్న తప్పుగాదు. భద్రమగు శుద్ధ బుద్ధిచే బ్రహ్మసూత్రములను శ్రవణము జేయువలయును. లేకున్న శంకా సమాధానములచే యుక్తమగు బ్రహ్మసూత్రముల పూర్వాపరము లర్థములు గావు.

కింతు ఈ మొదటి అధ్యాయము మొదటి పాదములో ఉపనిషత్తు లన్నియును పరమ తాత్పర్య దృష్టితో బ్రహ్మ తత్వమునే బోధించునను విషయము గలదు. రెండవ పాదమున బ్రహ్మోపాసనా విషయకమగు వివరణము, మూడవ పాదమునందును బ్రహ్మాస్తిత్వ మును గురించిన ప్రసంగము, నాలుగవ పాదమునందు సర్వము బ్రహ్మ బోధకపరమైన వాక్యము లేమైనచో ఇక ప్రధానాది బోధక వాక్యము లేమియును లేవా ? అనిన లేవనియు చిత్తే జగదాశ్రయ మని చిద్వివర్తమే ఈ సమస్తము నని తెలుపు అనేక విషయములు గలవు.

రెండవ అధ్యాయము ప్రథమ పాదమున మత మతాంతరులకు తగు సమాధానములు. రెండవ పాదమున సాంఖ్యాది మతములుఖండ

నార్హ్యములనియు ప్రధానాదులు జగదుత్పత్తి కారణములు కావనియు విస్పష్టముగ హేతు దృష్టాంతములచే తెలుపుచు వేద బాహ్యమగు విమత మతముల నన్నిటిని ఖండించి వేదాంతము సత్య నిర్దుష్టమని నిరూపింప బడినది. మూడవ పాదమునందు వేద వాక్యముల యందుగల పరస్పర విరోధములను బాపి సిద్ధాన్తమును దృఢ మొనర్చుటమున్నగు విషయములు. నాలుగవ పాదమున సూక్ష్మ శరీర సంబంధమగు శ్రుతుల పరస్పర విరోధాభాసమును తెలుపుచు బ్రహ్మ తత్త్వ నిరూపణ మొనర్చుట ఇత్యాది విషయములు తెలుపబడి యున్నవి.

మూడవ అధ్యాయము మొదటి పాదమునందు లోక లోకాంతర ప్రాప్తిని కలుగజేయు సంసార తాదాత్మ్యమును బాపు జ్ఞానసాధనమైన వైరాగ్య బోధక మహావాక్యములు వివరింపబడి యున్నవి. రెండవ పాదమున తత్త్వం పదార్థముల విచారణ పూర్వకముగ జీవావస్థ లనిత్యములను నిత్యాది జీవేశ్వర విచారము వివరింపబడియున్నది మూడవ పాదమున సగుణ నిర్గుణ విద్యలను గురించిన విషయము, నాలుగవ పాదమున బ్రహ్మజ్ఞానము అసహాయ శూరునివలె మోక్షప్రదమనియు కర్మోపాసనాద్యంగము గాదనియు 'బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి' "తరతి శోక మాత్మవిత్" ఇత్యాది శ్రుతిసిద్ధమగు తత్త్వస్వరూపానుభవమే మోక్షమను నీ మొదలగు అనేక విషయములు నిరూపింపబడి యున్నవి.

నాలుగవ అధ్యాయమునందు మొదటి పాదమున జీవన్ముక్తి విషయము. రెండు మూడు పాదములయందు ఉత్తరాయణ దక్షిణాయన మార్గములను గురించిన విషయము. నాలుగవపాదమున సగుణోపాసకులకు బ్రహ్మలోకప్రాప్తి యనియు, నిర్గుణ బ్రహ్మానుభవులగు జ్ఞానులకు విదేహముక్తి యను నిత్యాది విషయములు వివరింపబడినవి. ......"

ఇట్లు శ్రీవారు మహదానందముగ బ్రహ్మసూత్రముల భావార్థ

మును కూలంకషముగ నాడుప్రవచించిరి. ఆపిదప క్రమముగా నాలుగు నెలలలో 555 సూత్రములను చక్కనివ్యాఖ్యతో వివరించుచు ముముక్షువులకు అర్థమగునంతవఱకు విడువక ఓపికతో చెప్పిన విషయమునే పునరపి వారికర్థమగునట్లు వ్యాఖ్యజేసి తెలిపిరి. ఇట్టి గురుస్వామికంటె పరమ దయాంబునిధి కృపామయమూర్తి మరెవ్వరుగలరు. "నగురో రధికం, నగురో రధికం, అహోశాస్త్ర మహోశాస్త్ర" మని భక్తులందరు భక్తిచే భావించిరి. మరియు ఈవ్రత మధ్యకాలమున ప్రస్థానత్రయ మహాగ్రంథమును గురించి ఉపరాష్ట్రపతి శ్రీ యస్. రాధాకృష్ణ మహోదయులు మున్నగు వారినుండి వచ్చిన శుభసందేశములు.

Vice-president
INDIA
New Delhi.
10th August 1961

*My dear Swamiji,*

Thank you very much for sending me a copy of your book Prasthana Trayam which I read with great interest. It will be of interest to students of Indian thought and I hope it will be a useful publication for our young people.

With best wishes

Yours Sincerely,
(Sd) S. Radha Krishnan.

భారత ఉపరాష్ట్రపతి
న్యూఢిల్లీ
10 ఆగష్టు 1961

సత్యమేవ జయతే

అత్యంత ప్రేమ స్వరూపులైన స్వామిజీ!

తాము రచించిన ప్రస్థానత్రయ గ్రంథ ప్రతి నొకటిపంపినందులకు నా హృదయపూర్వక అభివందనములు. నే నీ గ్రంథమును మిక్కిలి శ్రద్ధతో పరిశీలించితిని. భారతీయ ప్రాచీన ఋషీశ్వరుల సిద్ధాన్తమార్గము ననుసరించు ఆధ్యాత్మిక సంస్కారముగల విద్యార్థులకు అమూల్య

మగు గ్రంథరాజము ఆధ్యాత్మ విద్యాభ్యాసకులైన భారతీయుల కీ గ్రంథప్రచురణ మెంతయో ఉపయుక్తంబగునని యాశించుచున్నాను.

అనేక సుహృద్భావములతో

మీ కృతజ్ఞుడను,
(సం) యస్. రాధాకృష్ణన్.

Minister for Works,
Housing & Supply
INDIA
NEW DELHI
September 4—1961

పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శంకరానందగిరి స్వాములవారికి,

మీరు దయతో పంపిన "ప్రస్థానత్రయము" చేరినది. అచ్చటచ్చట తిలకించితిని. ఇట్టి ఉత్కృష్టగ్రంథమును రచించిన మీకు నా వందనములు.

ఇట్లు
భవదీయ
(సం) బి. గోపాలరెడ్డి

## శ్రీరామకృష్ణ ప్రభ

(సంపుటము 18, సంచిక 3, 1961 సెప్టెంబరు)

... ప్రస్తుత గ్రంథకర్త పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శంకరానందగిరి గురుస్వాములవారు సనాతన సంప్రదాయము ననుసరించియే ఈ గ్రంథమును రచించిరి వేదార్థముసెఱిగి, వేదాంతమును హృదయంగమ మొనర్చుకొని ప్రస్థానత్రయము వ్యాఖ్యానించిరి. ప్రస్థానత్రయములో ఆది విషయము భగవద్గీత, ప్రతిశ్లోక తాత్పర్యమును వీరు తేటతెల్లముగ వివరించిరి.

గ్రంథమున కొన్ని కొన్ని అధ్యాయముల ఆరంభ మందును,

తాత్పర్యము తెలుపునపుడు భావ బంధురములైన వ్యాఖ్యానములు సంక్షేపముగ తెలుపబడినవి.

...వేద వేదాంత వాఙ్మయమంతయు జ్యోతిర్మయమై సనాతన మతాశయ సందీపితమై వెలయుచున్నది. ఇది సంస్కృతమున నుండుటచే సామాన్యులకు సుబోధకము కాదు. ఈ వాఙ్మయ మహోదధి యందు గంధ సింధురమువలె నీదులాడి, అందు మునిగి రత్నములను శ్రీశ్రీశ్రీ శంకరానందగిరి స్వాములవారు వెలుపలికి దీసి ఈ గ్రంథమున వెదజల్లిరి. శ్రీవారును వారికి గంభీరమైన ఆధ్యాత్మిక వైదుష్యమును ప్రసాదించిన సద్గురువులు శ్రీశ్రీశ్రీ సదానంద స్వాములవారును పరమ గురువులు శ్రీశ్రీశ్రీ ప్రణవానంద సద్గురు స్వాములవారును ఎల్లర ప్రణతులను బడయగలరు.

— జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి.

**Deputy Minister**
**Community Development &**
**Cooperation. India**
**New Delhi 2–August 9, 1961**

ప్రియమైన స్వామిగారికి,

అమూల్యము, శాశ్వతము అయిన తమ వ్యాఖ్యానగ్రంథమును నాకు పంపినందులకు కృతజ్ఞుడను. బ్రహ్మసూత్రములు ఉపనిషత్తుల పై చక్కని వ్యాఖ్యాన గ్రంథముల రచన జరుగవలయు ననెడి చిరకాల వాంఛ మీవలన నేటికి నెరవేరినది. మీకు నా ప్రణామములు.

హృదయ పూర్వకమగు అభివందనములతో
మీ
B. S. మూర్తి

గీతావాణి :-

(పదునొకండవసంవత్సరము, ఏదవసంచిక 15 నవంబరు 1961.)
త్రిభువన బ్రహ్మాండ నాయకులను ఒకతొట్టిలో వేసి లాలించిన

అనసూయాదేవివలె విస్తారమగు ప్రస్థాన త్రయమును ఒకే గ్రంథమున గూర్చి తమస్వానుభూతి సుధాఖ్య వ్యాఖ్యానముతో జిజ్ఞాసు లోకమునకు అప్రమేయ మహోపకృతి నొనగూర్చిన శ్రీవారి ప్రతిభా ప్రకర్షలు ప్రశంసనీయములు. భగవద్గీత బ్రహ్మసూత్రములు ప్రసిద్ధములైన పది ఉపనిషత్తులు అనువాద వివరణ సహితముగ వరుసగ ఈ గ్రంథమున చేర్చబడినవి. బాలకృష్ణుని నోటిలో బ్రహ్మాండమును దర్శించినట్లు ప్రస్థానత్రయమును యీ ఒకే గ్రంథమున దర్శింపవచ్చును. వేదాంత పాఠకులకు ప్రచారకులకు జిజ్ఞాసువులకీ మహాగ్రంథము అమృత భాండము వంటిది. ఒక పుస్తకము చేతనున్న, ఒక లైబ్రరీ చేత నున్నట్లు.

యదార్థభారతి :-

(సంపుటి 35-సంచిక 8 అక్టోబరు 1961)

ప్రస్థానత్రయ మనగా మోక్షమునకు మూడు మార్గములని అర్థము. (1) శ్రుతి ప్రస్థానము (2) న్యాయప్రస్థానము (3) స్మృతి ప్రస్థానమని పేర్లు. శ్రుతి ప్రస్థానము దశోపనిషత్తులు. న్యాయప్రస్థానము బ్రహ్మసూత్రములు. స్మృతి ప్రస్థానము భగవద్గీత. ఈమూడింటికిని శ్రీశంకర భగవత్పాదాచార్యులు విపులమగు భాష్యము వ్రాసియున్నారు. ఇది పండితులు యెరింగిన విషయమే. అయితే ఈ మూడు గ్రంథములున్ను వేరు వేరుగా విపులార్థములతో కూడి యున్నవి. అందరికిన్నీ అవగాహనమగుట ప్రయాసము. శ్రీశంకరానందగిరి స్వాములవారుసూక్ష్మబుద్ధితో ఏకాగ్ర మనస్సుతోసంగ్రహముగా సామాన్య జనులకు గూడ అవగాహన మగునట్లు ఒకే గ్రంథముగ జేసియున్నారు ఈలాగున యీమూడింటిని ఎవరునూ ఒకే గ్రంథముగ చేసి యుండలేదు. ప్రస్థాన త్రయసారము గ్రహించి తరించగల వారికి ఇదిఎంతో అనుకూలపడును.

రామదర్శనం :-

(సంపుటి 12 సంచికలు 10.11 అక్టోబరు, నవంబరు 1961

...ఇటీవల ఆంధ్ర ప్రపంచ భాగ్య విశేషమున అవతరించిన విశిష్ట విమల గ్రంథములలో నిది యొకటి. దీనిని చూడగనే త్రిమూర్తి స్వరూపమైన దివ్యజ్ఞాన స్వరూపమైన దత్తాత్రేయ రూపము సాక్షాత్కరించి నట్లైనది. ఇందు దశోపనిషత్తులకు, బ్రహ్మసూత్రములకు, భగవద్గీత శ్రీశంకర భాష్యానుసారము మూలార్థమును వివరించుచు సార భూతమగు వ్యాఖ్యానము రచింపబడినది. తెలుగు వారికి ముఖ్యముగ సంస్కృతము రానివారికీ ప్రస్థానత్రయాధ్యయన శ్రీని ప్రసాదించుటకు ఈ ఉద్గ్రంథము మహోపయోగకరము. సనాతన ధర్మ గంగను భూమిపై నిట్లు పారింప సమకట్టిన పూజ్యశ్రీ స్వాములవారి వంటి భగీరథ మూర్తులు అభినందనీయులు, వందనీయులు.

ఆంధ్రపత్రిక :-

...సద్గురు సంప్రదాయమునకు చెందిన శ్రీశంకరానందగిరి గురు స్వాములవారు ప్రస్థాన త్రయమునకు సుధాఖ్య వ్యాఖ్యను వ్రాసి జిజ్ఞాసువుల కందించినారు. ఈ పుస్తకమును వ్రాయుటలో తమ యుద్దేశ్యము నిట్లు స్వాములవారు వ్యక్త పరచిరి.

"ప్రస్థాన త్రయము ఒకే గ్రంథముగ నుండిన పాఠకుల కనుకూలమని 108 ఉపనిషత్తు లందలి ముఖ్యములగు 10 ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత — ఈమూడింటిని ముచ్చటగా మూలార్థములను మాత్రము వివరించుచు వలయుచోట్ల సమన్వయార్థమై భాష్యము నందలి భావములను చేర్చి వ్రాసితిమి. విషయమును బట్టి యథోచితమగు అవతారికల నుంచితిమి. ఇక ఛాందోగ్య బృహదారణ్య కోపనిషత్తుల యందు మాత్రము ముముక్షువుల కత్యం తోపయుక్తములు గాని కొన్ని భాగములను విడిచి, వాటి సంక్షిప్తమగు సర్థ

మును మాత్రము తెలిపితమి. బ్రహ్మసూత్రములకు తాత్పర్యార్థమైన భాష్య సమ్మతమగు సంక్షిప్తార్థమును, భగవద్గీత మూలార్థము ను అన్వయ క్రమమున వ్రాసి తాత్పర్యార్థమగు భాష్యము నందలి భావ ములను అచ్చటచ్చట శ్రుతి సమ్మతముగ వివరించితిమి."

స్వాములవారు తమ యుద్దేశ్యమును సఫలము చేసికొన్నారు. భగవద్గీత నటుంచి చూచినచో సంస్కృత భాషరాని వారికి ఉపనిషత్తులయు బ్రహ్మసూత్రములయు నర్థము దురవగాహమనుటలో నెట్టి సందేహమును లేదు. సంస్కృతము నెరింగిన వారైనను పూర్వపక్ష సిద్ధాంతాదులతో గూడిన పై గ్రంథముల యర్థమును గుర్వపేక్ష లేకుండ గ్రహించుట సులభము కాదు. ఇట్టి స్థితిలో తెలుగుభాషా పరిజ్ఞానము మాత్రమె గల తత్త్వజిజ్ఞాసువుల కీ గ్రంథము అవశ్య పఠనార్హమై యొప్పుచున్నది. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, గీత అను వాని లోని పరమార్థమును కరతలామలక మొనర్చు సుదాఖ్య వ్యాఖ్యా సమేతమగు నీ ప్రస్థాన త్రయమును ఆంధ్ర లోకమున కందించిన శ్రీ స్వాములవారు తత్త్వ సారస్వతమునకు కొనియాడదగిన సేవచేసినారు.

ఈ గ్రంథమునందలి భాషకూడ సరళమై సద్వాలకు అందు బాటులో నుండుట గూడ ఒక విశేషమే. ఆంధ్రులకు వేదాంత జిజ్ఞాసువులు ఈ యుత్తమ గ్రంథమును పఠించి సత్ఫలితము నందగల రన వచ్చును.

—శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు.

పిదప శ్రీస్వామివారు 1-12-61 గంజిగుంట శ్రీమఠమునకు జేరి చివరి 12న నెల గీతాపరీక్షలు జరిపిరి. అన్ని కేంద్రముల నుండి ప్రశ్నోత్తరముల పత్రములు వచ్చెను.

తదుపరి డిశంబరు 3,4,5 తారీకులు యథారీతి ప్రతిసంవత్సరము వలె శ్రీగురు పుణ్యారాధన మహోత్సవము సాంగ మంగళముగ నడ చెను. పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శుద్ధచైతన్య స్వామి, పూజ్యపాద

సురపురం శ్రో॥బ్ర॥ శంకరశాస్త్రి స్వాములవారు, హుబ్బళ్ళి పూజ్య
పాద శ్రీశ్రీశ్రీ శివపుత్రస్వామి, బ్రహ్మశ్రీ శేషయ్యస్వామి ప్రభృ
తులు దయచేసి యుండిరి. చివరిదినము సభలో బ్రహ్మశ్రీ శంకరశాస్త్రి
సురపురం స్వాములవారు గాఢమగు ప్రేమచే మన పూజ్యపాద
శ్రీశ్రీశ్రీ శంకరానందగిరి గురుస్వాములవారికి "అభినవ శుకయోగి"
యను అన్వర్థనామమును ప్రసాదించిరి. ఇందులకు సర్వులు శ్రీవారికిది
సార్థక నామమని మహదానందము నొందుచు సంతోషద్యోతకముగ
కరతాళ మొనర్చిరి. తదుపరి గీతా పరీక్షలలో 12 మాసములుచక్కగ
పరిశ్రమించి 21 కేంద్రములలో 180 మంది ముముక్షువులు, స్త్రీ పురు
షు లత్యంత శ్రద్ధచే అధ్యయనముచేసి పరీక్షలలో పాల్గొని ప్రథమ
ద్వితీయ శ్రేణులందు ఉత్తీర్ణులైరి. వీరికి ఆ మహాసభయందు మహా
త్ముల అమృతహస్తములచే ప్రమాణ పత్రము లివ్వబడెను. అనంత
రము మహాత్ముల పూజా సత్కార సంసేవనాది కార్యములతో సర్వము
పూర్ణమాయెను.

అచటినుండి పూజ్యశ్రీవారు ఉరవకొండభక్తాదుల ప్రార్థనాను
సారము గీతా జయంతి నిమిత్తము 9.12.61 శ్రీ కన్యకాపరమేశ్వరి
ఆలయంలో ప్రతి సంవత్సరమువలె విధ్యుక్తముగ ప్రాతఃకాలము
ఛాందోగ్యోపనిషత్ప్రవచనము సాయంకాలము భగవద్గీత రెండవ
అధ్యాయమును 18-12-61 వఱకు జరిపి చివర గీతాచార్య ఉత్సవ
పూర్వకముగ భూరి అన్న సంతర్పణములచే కార్యక్రమమును
పూర్ణము గావించిరి.

మరల అచటినుండి ఉండబండ శ్రీవీరభద్రస్వామి క్షేత్రము
(ఆలయం)వెళ్ళి సందర్శన మొంది ఆ శివక్షేత్రమునందు ఉత్తమమగు
బ్రహ్మచర్య విషయకమైన రహస్యార్థములను బ్రహ్మచారులు మరియు
నుత్తమభక్తులందరికిని తెలిపిరి.నీతినియమ నిష్ఠలను తల్లివలె బోధించిరి.
ఉండబండ శ్రీ. హెచ్ బసవనగౌడు శ్రీమల్లనగౌడుగారి భక్తియుక్త

మగు సేవలందుకొని అచ్చటనే ఆలయముననుండుచు పూజానుష్ఠానాదులచే అచట దొరకు శ్రేష్ఠమగు బిల్వదళములతో అనుదినము శ్రీ చంద్రమౌళీశ్వరునకు సహస్ర బిల్వముల నర్చించి ఆనందము నొందిరి. శివతత్త్వోపన్యాసములుసలిపిరి. పిదప గంజిగుంట శ్రీమఠమునకు వచ్చి విశ్రాంతిగ బ్రహ్మనిష్ఠ నుండుచు హాలరివి దయచేసి యచట ముండకోపనిషత్ప్రవచనముల గావించిరి.

మేల్కాంచినవాడు స్వప్న కల్పితభోగములు నపేక్షింపనట్లు పరమమంగళమయ ఆత్మయే నేనని గురు ముఖమున విని నిజప్రజ్ఞ నొందినచో పిదప ఐహికమగు అనాత్మ పదార్థములు మోసపఱచవు. అన్యపదార్థములయందు నీకు రతి బుద్ధి జనించదు. జీవిత ముందు లోపలనే ఇట్టి పూర్ణానుభవము నొంది ధన్యుడవు గమ్ము. గ్రంథులు వీడును, సందియములు దీరును, అన్ని కర్మలు క్షయించును ధన్యుడ వపుదువు.

ప్రియమును బలుకుము. సంతత శీలము గలిగి వర్తించుము. అనుదినము ప్రాతఃకాలమున లేచి గురునిష్ఠ సలుపుము. మరల సర్వ కాలముల యందు నీ కీ పవిత్ర స్మృతి గలుగు చుండును. అదిఅక్షయ కవచమై నిన్ను రక్షించును.

ఆత్మ విషయము తప్ప తక్కిన ఎట్టి విషయములే యగుగాక వాటియందు అతిగ వర్తించవలదు. మితముగ నుండుము. బ్రహ్మ తత్త్వానుభవముతో సరితూగు పదార్థ మీాముల్లోకముల లేదని దెలిసి వర్తించుము.

గురువాక్యనిష్ఠయందలి పూజ్యమగుఆప్యాయత నీహృదయము నుండి వీడిపోకుండునుగాక. యథార్థము నెరిగిన అది ఇక ఎప్పుడును చెదరదు. అది నీకంటె అన్యమును గాదు. ఈ మహాసుకృతము మిమ్ము వరించును గాక !

నిష్కామ కర్మ, నిర్గుణోపాసన, తత్త్వమసి మహా వాక్యార్థ

శ్రవణమును వీడకుడి.

లోకమున మహాదరిద్రుడెవరు? అత్యాశ గలవాడే! కావున అత్యాశను వీడి ఈశ్వరుడిచ్చిన యథోచిత భోగములచే తృప్తి నొందుచు మితవర్తనుడవై ఆనంద రూపాత్మ నేననుజ్ఞప్తినుంచుకొనుడు.

ఉత్తమ గురు భక్తునకు గల ఒక మనస్సును గురుదేవున కత డర్పించెను. ఇక నా భక్తుని కడ నతని మనస్సు లేదాయె; అన్నపు డతని సర్వస్వ మెవరు? గురువే ఆత్మయే, అదే నిత్యానందము.

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరంబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః ॥

యను అర్థయుక్తమైన దృష్టి గలిగి అసంగుడవై నిత్యతృప్తి యందుము. సర్వము శివప్రదమై యొప్పును. ఓం.

మనస్సు విషయాపేక్షలచే పరువు లిడుచుండుటయే మనో మాలిన్యమునకు కారణము. మనస్సాక్షియగు చిదాత్మ నేనను సమ్యక్ దృష్టిచే హిత, మిత, పవిత్ర వర్తనుడై యుండుటే జ్ఞానము. ఇట్లు ఉత్తమ శీలము గలిగి వర్తించుట మేలు.

ఆపదలను బాపునది సుఖసంపదల నిచ్చునదియగు శ్రీ గురూప దిష్ట మంత్రము, తదర్థాను సంధానమున మీరందరు భద్రముగ నివ సింపుడు. సుఖము మీనుండి దూరమైనదెప్పుడును తోచదు. సుఖ రూపులే మీరు.

దుఃఖములు మనః కల్పితములు, కల్పనలు కలలవంటివి. తురీయ మగు స్వస్వరూపమున జాగ్రత కలిగియుండవలెను. అదే గురుదేవుని స్వరూపము.

అపూర్వమగు ఆత్మ తత్త్వమును తత్త్వానుభవిని లౌకికదృష్టిచే చూడకుము. పరమాత్మ దృష్టియందు లౌకికము కల్పన, గావున ఈ దృష్టిచే పరమాత్మ తత్త్వానుభవమును సరిజూడబోకుము. తోలనము

చేయవలదు. తల్లి హృదయము కుమారునికి అనుభవము కాదు. గురుని హృదయము శిష్యునికి తెలియదు. తల్లి ప్రేమ మమకార యుక్తము. గురుని ప్రేమ అవ్యాజము అజ్ఞానవిదారకము వ్యాపకమని ఎరుగుము.

నీవెట్లుండినను లౌకికులు దూషింతురు. అవహేళన జేతురు. వారిని మెప్పించి నడచుటకు నీవుద్యుక్తుడవు గావలదు. కుపథమును బట్టవలదు. నీ హృదయ మొప్పి శ్రుతి సత్యపథమున నడచుము.

ఎవనియొక్క దర్శన స్పర్శన శ్రవణ సంకీర్తన సంభాషణ సంపూజనములచే మనుష్యునకు మానవత్వము దోచి అజ్ఞానము బాసి ముక్తుడగునో అట్టి సద్గురుమూర్తికి అనేక వందనములు.

ఆత్మస్వరూపుడవగు నీయందు సంసారదశలో ద్వైత సంపర్క ముండి ఆపిదప విచారము ద్వారా ముక్తిదశయందు అది దూరమయి అద్వైత స్థితి యగునని భావించకు. తత్త్వతః ద్వైత మెప్పుడును నీ యందు లేదు. నీవసంగుడనని దృఢముగా తెలియుము. మేఘావృత మయినప్పుడును ఆకాశము నిత్యాసంగమయ్యే యుండినట్లు నీవు నిర్విశేష శుద్ధ చైతన్య స్వరూపుడగు పరమాత్మవని తెలిసి నిజ శాంతి నుండుము.

ఆత్మకు సాధనబలముచే బ్రహ్మత్వ మలవడునని తెలియరాదు. స్వరూపానందానుభవమునకు గల అడ్డునుమాత్ర మది తొలగించును. మీరు నిత్యానంద స్వరూపులగు బ్రహ్మమాత్రులే! యని బ్రహ్మను చింతనము చేయండి ఇది విధానము.

కాలత్రయముచే కట్టువడని, కార్య కారణ సంబంధము లేని, పుణ్యపాపములు లేని, పరమాత్మయే మీ ప్రత్యగాత్మయై యున్నది. సంశయించకుడి.

ఉపనిషద్వాక్యములు తాత్పర్య దృష్ట్యా విధి పరములుగావు. అతద్బుద్ధిని (అధ్యాసను) బాపునవియై యున్నవి. విధించునవి కర్మలు.

ఇక మోక్షము ఆత్మ స్వరూపమయి యున్నది. నిత్య ప్రాప్తమయి యున్నందున అది క్రియచే పొందబడునది కాదని తెలియవలెను.

3-5-62 కు శ్రీవారు శ్రీశంకర జయంతి మహోత్సవమునకై లత్తవరము దయచేసిరి. యథారీతిగ నిత్యనియమ సంపన్నమగు వైదికా చారములచే జయంతి మహోత్సవము వైభవముగ జరిగెను భగవద్గీత 15వ అధ్యాయము భాష్యపాఠములు నడచెను. శ్రీశంకర విజయ సార సంగ్రహమగు శ్రీవారి రచన శ్రీ జగద్గురు శంకర చరిత్ర పురాణ శ్రవణ మాయెను.

ప్ర. పూజ్యస్వామీ! తాము విరివిగా భాష్యము భాష్యపాఠము అని చెప్పుచుందురు కదా దాని అర్థమేమి?

ఉ. బాబూ! భాష్యమనగా మూలార్థమునకు విరుద్ధము కాని శ్రుతి షడ్లింగ తాత్పర్యార్థమును వివరించు స్వీయపదములచే నొప్పువ్యాఖ్య దానిని భాష్య మందురు. శ్రీశంకర భగవత్పూజ్యపాదులు ఉపనిషత్తు లకు, భగవద్గీతకు, బ్రహ్మ సూత్రములకు భాష్యము రచించియున్నారు మీరు అనుదినము సాయంకాలము వినునది భగవద్గీతా శాంకర భాష్యమే.

ప్ర. స్వామీ! అధికరణమని బ్రహ్మసూత్రములలో చెప్పుచుందురే దాని అర్థమేమి?

ఉ. అయ్యా! ఆ భాష్యమువందలి విషయము, సంశయము పూర్వ పక్ష, సిద్ధాన్త, సంగతులను నీ పంచావయవములచే నొప్పున్యాయమే అధికరణ మనబడును.

ప్ర. మరియు వ్యాఖ్యానము (ప్రవచనము) అనిన భావమేమి?

ఉ. ఆ మూల గ్రంథమున గల పదము, పదార్థము, వాక్యయోజన, ప్రశ్న, పరిహారములను నీ అయిదు వ్యాఖ్యాన లక్షణమన బడును. ఇక వాటియందు అన్వయ లక్షణ మేమన విశేషణ, విశేష్య. కర్తృ, కర్మ, క్రియల సంబంధమను నీ అయిదును అన్వయ లక్షణము.

ఆయాసందర్భములలో అవి నీమనసునకు వచ్చునట్లు గుర్తుగా చూపిం చెదము తెలియ జెప్పెదము.

ఆపిదప గుంతకల్లు నుండి 19-6-62 కు నంద్యాల శ్రీచాతుర్మాస్య మహావ్రతాశ్రమమున యథాక్రమముగ వాక్యార్థ శ్రవణ ప్రసంగములు గావించిరి. 28-6-62 శ్రీనిర్వాణ మఠములో పరమ గురు పుణ్యారాధన కార్యక్రమము జరిగెను. ఆశ్రమ ధర్మకర్త శ్రీ ఉదయగిరి వీరయ్య శ్రేష్ఠిగారు భక్తి శ్రద్ధలచే చక్కగ సేవచేసిరి. మునుపటివలె శ్రీవారి 43న సంవత్సర జయంతుత్సవము నంద్యాల శ్రీచాతుర్మాస్య మహా వ్రతాశ్రమములోనే జరిపిరి.

అనంతరము అష్టాదశ శ్రీచాతుర్మాస్య మహావ్రతాచరణకై గంజిగుంట శ్రీమఠమునకు, శ్రీసద్గురు ప్రణవానందాశ్రమమునకు దయచేసిరి. ఆనాడు భక్తాదులందరికి శ్రీవారిట్లు బోధించుచు సంత సించిరి.

"అయ్యలారా! శ్రీమద్భగవద్గీత 18 అధ్యాయములచేనొప్పు చున్నది. మహాభారతమును 18 పర్వములు గలదై యున్నది. యుద్ధ మును 18 దినములే నడచినట్లున్నది. బలమును 18 అక్షౌహిణులుగా గలదై యున్నది పురాణములును అష్టాదశములై యున్నవి. యజ్ఞ మును పదునెనమండ్రుగురిచే యుక్తమై యున్నది. వాశిష్ఠము నందలి శిఖధ్వజ మహారాజు అనగా చూడాల యను తత్త్వవేత్త్రి భర్త 18 వత్సరములే తపమాచరించి నట్లున్నది. శ్రీవాశిష్ఠ రామాయణమును వశిష్ఠ మహర్షులు 18 దినములే శ్రీరామచంద్రమూర్తికి బోధించి నట్లు న్నది. అందువలన ఈపదునెనిమిదవ సంఖ్యయే పూర్ణమైన ఒక విశిష్ట మగు ప్రాశస్త్యముచే నొప్పుచున్నట్లున్నది. మన శ్రీచాతుర్మాస్య మహావ్రతమును 18వదై యున్నది. పై పెచ్చు ఇమ్మహాకార్యము గురుస్థానమున జరుగుట అత్యంత ఆనంద ప్రదము. శ్రీగురుదేవుని కృపామయ ఛత్రమున వ్రతము సాంగమంగళ మగునుగాక! మీ

సదిచ్ఛ సఫలవంతమగును గాక!" అను నీ ప్రకారముగ ఆదేశించిరి.

## 18 వ శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1962సం॥

స్వస్తిశ్రీ శుభకృతు నామ సం॥ర ఆషాఢ శు॥ ౧౧ శుక్ర వారము (13-7-62) ప్రతి సంవత్సరమువలె బ్రహ్మముహూర్తమున వైదిక కార్యకలాపములచే కలశస్థాపన పూజానుష్ఠానములు శ్రీగురు దేవుల అధిష్ఠానమునందు మహాన్యాస పూర్వక శ్రీరుద్రాభిషేకము మొదలగు కార్యక్రమములు క్రమముగ నాచరింపబడి 8 గం.కుమంత్ర పుష్ప మహా మంగళములచే పూర్ణమాయెను. ఉదయము 9 గం. నుండి 10 గం.వఱకు ప్రస్థానత్రయ మహాగ్రంథ మూలమున భాష్య సమ్మతముగ బ్రహ్మసూత్రముల విపుల వ్యాఖ్య మరియు నైష్కర్మ్య సిద్ధి గ్రంథ (ప్రవచనము) మంగళము సాయంకాలము 4 గం. నుండి 5.30 గం. వఱకు శ్రీమద్భగవద్గీత శాంకర భాష్య ప్రవచనము మంగళము. సంధ్యా సమయమున 6 గం. నుండి 8.30 గం. వఱకు యథా రీతి ప్రదోషపూజ, భజన, నియమముగా అందరు అనుష్ఠానము, మహా మంగళము. ఈ ప్రకారముగ ప్రతిదిన కార్యక్రమములచే నొప్పచు అవిచ్ఛిన్నమై శ్రీగురు కరుణచే ఈ అష్టాదశ శ్రీచాతుర్మాస్య మహా వ్రతము కార్తిక శు॥ ౧౨ శుక్రవారము 9-11-62 కు కలశోద్వాసన మున్నగు కార్యములతో శివప్రదముగ ఉత్సవమయి సాంగ మంగళ మాయెను.

నైష్కర్మ్యసిద్ధి ఉత్తమోత్తమమగు వేదాంత ప్రకరణ గ్రంథము. నిష్క్రియాత్మానుభవ స్థితి నొసగు సర్వోపనిషత్సార సంగ్రహము.అధికారియగు నతనికి ఈ గ్రంథము గురు ముఖమున శ్రవణము కాగా అసహాయ శూరునివలె అజ్ఞాన నివృత్తి ద్వారా అహంబ్రహ్మాస్మీత్యాకార సహజ స్థితిని గలుగజేయును. బ్రహ్మాంశ సంభూతులును శ్రీమచ్ఛంకర భగవత్పూజ్యపాదుల శిష్యవర్యులగు శ్రీసురేశ్వరాచార్యులచే రచయింపబడిన గ్రంథము. తమ గురువులచే యాజ్ఞాపింపబడి

గురు నమస్కారరూప మంగళాచరణ పూర్వకముగ వ్రాయబడినదై సజ్జన సంసేవ్యమానమై ముముక్షు జన పరమ పాథేయమై యలరారు ఉద్గ్రంథము. వారు అపారమగు గురుభక్తి సూచకముగ గురు గ్రంథ మగు ఉపదేశసాహస్రి యందలి మహావాక్యములను ఇందు ప్రమాణ ముగ వ్రాసుచ్చి యున్నారు. ముముక్షువు లత్యంత శ్రద్ధచే వినిమనన మొనర్చి నిష్ఠ నొందవలయును. ఇందు నాలుగు ప్రకరణములున్నవి. విషయ మపూర్వము. అతిముఖ్యము నగుటచే పూర్వాధ్యాయము లందలి విషయములు పునరపి ఉత్తరాధ్యాయము లందును ఉత్తరా ధ్యాయ విషయములు పూర్వమునను అచ్చటచ్చట ప్రకారాంతర ముగ ప్రతిపాదింపబడి యున్నవి. ఇది పునరుక్తి యని తలంపక ముముక్షు జన సౌలభ్యము కొరకై యని గ్రహించ వలయును.

(1) మొదటి అధ్యాయమున అధికారి సంబంధ విషయప్రయో జనములను జూపి స్వయం సిద్ధమగు అద్వితీయాత్మ యందు అజ్ఞాన ముచే ఆధ్యాత్మికాది దుఃఖత్రయము కల్పింప బడినదనియు, ఆగంతుక ములగు ఉపాయములచే వీటి ఆత్యంతిక దుఃఖ నివృత్తి కాదనియు, ఆత్మ స్వరూపాజ్ఞానముచే ద్వైత ప్రపంచము, తన్మూలమున శుభా శుభాధ్యాస, తత్కారణము. రాగద్వేషములు, ఆమూలమున పుణ్య పాపములు, తద్వారా (జన్మ) దేహ గ్రహణము, అందుచే దుఃఖ ప్రతీతి అను నీ ప్రకారముగ నిత్య సుఖ స్వరూపమగు ఆత్మను సుఖ దుఃఖము లావరించు చున్నవి ఇదే అజ్ఞానము. ఇది ఆత్మజ్ఞానము వినా అన్యథా ఉపాయములచే నివృత్తి కాదనియు, అనర్థము అనర్థ కార ణము, పురుషార్థము పురుషార్థ సాధనము అను విషయములను ప్రతి పాదించుచు అనర్థము అహంకార మనియు అనర్థ కారణము అజ్ఞాన మనియు, సర్వానర్థ నివృత్తి పూర్వక శాశ్వతానంద లక్షణాత్మకమైన కైవల్యమే మోక్షమనియు ఇట్టి పురుషార్థ సాధనము జ్ఞానమే ననియు చెప్పగా, పురుషార్థ సాధన విషయమై కర్మయే ముక్తి సాధనమని,

కర్మాంగముగా గలది జ్ఞానమని, జ్ఞానాంగముగా గలది కర్మయని, కర్మ జ్ఞాన సముచ్చయమని ఇట్లు వివిధ రీతులచే నొప్పు కర్మ మీమాంసకుల పూర్వపక్ష సిద్ధాంతము లీ గ్రంథమందు తెలుపబడి యున్నవి. ఇందుపై ఆచార్యులకు క్రమ సముచ్చయ మంగీకార యోగ్యమేగాని ముక్తి సమకాలమున పై కర్మాదుల యొక్క అపేక్ష లేదు. కర్మ సమ్ముచ్చయము కాదు. జ్ఞానము వలననే అజ్ఞాన నివృత్తి అను నిత్యాదిగా మొదటి అధ్యాయము నందలి విషయములు.

(2) ఇక రెండవ అధ్యాయమున అన్వయ వ్యతిరేకములచే నొప్పు త్వం పదార్థ శోధన చెప్పబడినది. ముముక్షువులీ ప్రకరణమును శ్రద్ధగా నాలకించి విషయ విమర్శ నొంద దగును. ప్రత్యక్షాది ప్రమాణములు భౌతికమగు శబ్ద స్పర్శ రూప రస గంధాది విషయములను మాత్రము ప్రకాశ మొనర్చగలవు. ఆత్మ తత్త్వము (ప్రమేయ) విషయము గాదనియు, అది స్వయం సిద్ధమగు అనుభవమనియు తెలియవలయును. అవిచార సిద్ధమయిన ఈ అజ్ఞానము మహా వాక్యార్థ జన్యజ్ఞానముచే దప్ప అన్యథా స్మరణ ధ్యానాదులచే కలుగునది కాదని తెలిసికొన వలయును. ఇట్లు మహావాక్య శ్రవణము జేసినను కొందరికి జ్ఞానము గలుగక పోవుటకు కారణము చక్కగ త్వం పదార్థ శోధన చేయకుండుటయే. ఎవరికి త్వం పద శోధన చక్కగ నయినదో అనగా అహంకారాది దేహ పర్యంతమగు సర్వ సంఘాతమును నేను కాదు నాదియును కాదను నిర్దుష్టార్థము నెరిగి యుందురో వారికి నారె సారెకు వాక్య శ్రవణము గావలసిన పనిలేదు. సకృచ్ఛ్రవణ మాత్రమున అధికారి యగు నతనికి అహంబ్రహ్మాస్మి యను అనుభవము గలుగును. కాని ఇట్టి అనుభవ జ్ఞానము ఎవరికి కలుగలేదో అట్టివారు అన్వయ వ్యతిరేకములచే శ్రద్ధగా శ్రవణము చేయవలయును. అన్వయమనిన సర్వకాలసర్వావస్థల యందుండు ఏకమగు తాను (అనగా) చైతన్యము వ్యతిరేక మనగా అనియత ధర్మము గలిగి

దృష్టసష్టమగు అహంకారాది దేహ పర్యంతమైన యావద్దృశ్య పదార్థములు.

ఇట్లు అన్వయ వ్యతిరేక దృష్టిచే మొదట దేహమాత్మగాదని నిరూపించి ద్రష్టృ దృశ్య విభాగపూర్వకముగా ద్రష్ట యొక్క అన్వయము, దృశ్యవ్యతిరేకమును చూపి అహంకార మమకార ప్రయత్నేచ్ఛాది ధర్మములు సుషుప్త్యవస్థ యందుండవు గావున అనాత్మ యనియు, సాక్షి తానగుటవలన అంతఃకరణ వికారమగు అహంకార తద్ధర్మాదులు అవిచారముచే అధ్యాస వలన భ్రాంతి సిద్ధములై ఆత్మ యందు తోచుచున్నవి. కాబట్టి సాక్షియగు ఆత్మ అవికారి (కూటస్థుడు) అని తెలుపుచు సాంఖ్య వేదాంత సిద్ధాంతముల కుండిన వైలక్షణ్యమును అనగా ఆత్మ నానా యని సాంఖ్యుడు ఏకమని వేదాంతము కాబట్టి ఏకమగు ఆత్మయందు ఉపాధిమూలమున భానమగునానాత్వము వికారిత్వము కేశోండ్రములవలె కల్పన, సాక్షియగు ఆత్మ ఏకము అందుచే అద్వైత సిద్ధాన్తమునకు భంగము లేదనియు, ఇతరేతరాధ్యాస సిద్ధమైన ఈ ఆత్మానాత్మల సంబంధము యథార్థాత్మ జ్ఞానముచే నివృత్తియగునని ఇట్లుసర్వవిలక్షణాత్మ తానని తెలియుట వలన అహం యని మమ యని తోచు మిథ్యాజ్ఞానము అన్వయ వ్యతిరేకములచే దూరమగునని తెలుపుచు చివర స్వ్రపణవాను సంధానాత్మకమైన శ్లోకముచే నొప్పు అనేక విషయము లిచట ప్రతిపాదింపబడి యున్నవి.

(3) పిదప పద పదార్థజ్ఞానము గలవానికి వాక్యము స్వరూపాజ్ఞాన నివృత్తి ద్వారా అఖండాద్వితీయార్థబోధకమగు నను విషయము ఈ మూడవ అధ్యాయములో అతి విపులముగ ప్రమాణసమ్మతముగ నిరూపింపబడి యున్నది. అజ్ఞానము స్వాశ్రయము స్వవిషయము తన్నే ఆశ్రయించి విషయ మనగా తన్నే మూయుట అని అర్థము. ఇది వాక్యార్థ జ్ఞానముచే నివృత్తి యగునను విస్తృత వ్యాఖ్య గలదు. వాక్యార్థ జ్ఞానము గావలెనన్న తత్త్వం పదములకు గల సమానాధి

కరణ సంబంధమును జీవ పరమాత్మాది పదార్థములకు గల విశేషణ విశేష్య భావ సంబంధమును వాక్యమునకు లక్ష్యలక్షక భావ సంబధ మును విస్పష్టముగ తెలుపబడి యున్నది. అనగా తత్త్వమసి మహా వాక్యమునందు తత్త్వం పదములకు ఏక విభక్తి ప్రత్యయాత్మకమైన సమానాధి కరణ సంబంధము గలదు. అందుచే ఈ వాక్యమునందు "నీలముత్పలం" అన్నట్లు పదములచే పదార్థములకు విశేషణ విశేష్య భావసంబంధమును గలదు కావున త్వం పదార్థము తత్పదార్థ భిన్నమే నని అర్థము. అయితే అన్వయ వ్యతిరేకములచే ఆత్మ నేనను వివేక దృష్టి లేనివానికి నేను దుఃఖిననియు కించిజ్జ్ఞ డననియు అద్వితీయ మగు పరమాత్మ పరోక్షమనియు తోచును. కాని ఈ విశేష్యవిశేషణ భావ సంబంధముచే కించిజ్జ్ఞత్వ దుఃఖిత్వాదులనుపరమాత్మయందలి పరోక్ష త్వ అనాత్మత్వములు నివర్తించును. అప్పుడు తత్త్వం పదములయందలి విరుద్ధార్థములను విడిచి లక్ష్య లక్షక భావ సంబంధముచే అనగా జహదజహల్లక్షణ అనగా భాగత్యాగ లక్షణముచే అఖండాద్వితీ యార్థము విధించునని లక్ష్యలక్షణ భావ సంబంధమును విపులముగ నిరూపించియున్నారు. అజ్ఞానముచే అహంకారాత్మలకు సంబంధమున్న దానివలె నున్నది. కాని వస్తుతః లేదని పునరపి పూర్వాధ్యాయము నందలి అన్వయ వ్యతిరేక వివరణ పూర్వకముగ తత్త్వంపదములఅభే దార్థమును నిరూపించుచు త్వం పదమునందలి అహంకారమును తత్ప దమునందలి పరోక్షత్వము యొక్క మిథ్యాత్వమును చక్కగ తెలుప బడెను (ఈ మొదలగు విషయములు) ఆత్మయందజ్ఞానము భావ పదా ర్థమే యని అన్నను వస్తుతః లేనిదే అత్యంతాభావమే అని ప్రబోధిం చుచు అజ్ఞానమను నిద్రనుండి (అనగా విపరీత జ్ఞానమునుండి) వానిని శ్రుతి గురువులు మేలుకొలుపు చున్నారు తత్త్వమసి మహావాక్యము వినా అన్యప్రమాణముచే ఆత్మజ్ఞానముకాదు. ఇది ఉపాసనాపరము గాదు. ఇందు ప్రసంఖ్యానమును కుదరదు. ఒకవేళ ఇవి లేక జీవించ లేననినచో మాటి మాటికి వాక్య శ్రవణ మననాదులనే చేసికొనుచును

నిత్యాది అనంత విషయములు గలవు.

(4) నాలుగవఅధ్యాయమునఫలవర్ణన, పై మూడధ్యాయముల యందలి సంక్షిప్త విషయ ప్రతిపాదనయు గలదు. స్వప్నములోగాంచ బడిన వ్యాఘ్రాదుల గర్జన ఆ స్వప్న ప్రపంచము నుండి మేల్కొలిపి నట్లు మహావాక్యార్థ జన్య జ్ఞానాంతరము శాస్త్ర గురుశిష్యాది ఏభేద మును లేని అఖండాద్వితీయస్థితిచే తాను తానై యుండును. అతని వ్యవహారము బ్రహ్మాభిన్నమై యున్నందున అతడు క్రియా కారక ఫల రహితమగు పూర్ణస్థితితో నుండును. అతనియందు ప్రవృత్తికారణ మగు కామముదగ్ధమై యుండును. కాని ఇచట అలేఖకవాది మతము వలె యథేచ్ఛాచారము గలవాడై యుండునని అర్థము చేయరాదు. ఆ యర్థ ముకాదు. అపరోక్షజ్ఞానానుభవికి ధర్మాధర్మములు తాదాత్మ్య ములేని పూర్ణ మగు సహజస్థితి నుండును. అనునిత్యాదిగా శ్రీ గురు స్వామివారు గ్రంథముయొక్క సంక్షిప్తార్థమును దెలిపి క్రమముగా శ్రుతియుక్త్యనుభవములచే గ్రంథ ప్రతిపాదనము గావించిరి. ఓం.

చతుస్సముద్ర పరివేష్టిత భూమండలమంతయు దానముగపొంది నను, శ్రీసద్గురు దత్తమగు భూమవిద్యానుభవ తృప్తికి సాటిగావు. స్వామి ఋణము తీరుట కష్టము. అతనియొక్క మహోపదేశానుభవ నిష్ఠతో నుండుటయే గురు ఋణ విముక్తి. మన మిచ్చిన నేమివ్వ గలము. ఆబ్రహ్మాస్తంబ పర్యంతమగు నీ సమస్తమును అతని సన్నిధిలో స్వల్పమే యగును. అతడొక్కడే పరమ సత్యము, అతని ఆశయాను సారము వజ్రసన్నిభమగు సచ్ఛీలముచే వర్తించుటే నావ్రతము. ఇంత కంటెను వలయున దేమున్నది. నాస్వామికి త్రిభువనములలో సాటి యగు దృష్టాంతము లేదు. శ్రీ శంకరులంతటి మహానుభావులే "దృష్టాంతో నైవదృష్టః త్రిభువన జఠరే సద్గురో ర్జ్ఞానదాతుః..." అని పలికిరి. అందువలన ఆచార్యునిచే పొందబడినవిద్యయే సద్గతి నొస గునదై యున్నది. అట్లుగాకున్న విద్యసాధువుగాదు. అతడే దాటించు

వాడు 'నాన్యః పంథా విద్యతే యనాయ' అను నిత్యాదిగా గురు భక్తిని గురించి స్వామి తెలిపిరి.

ప్ర. పూజ్యస్వామీ! ఓంకార మంత్రార్థమేమి ?

ఉ. అయ్యా ! నీవే పరమాత్మవయి యున్నావని దీని అర్థము, "అయ మాత్మా బ్రహ్మ" చక్కగ ప్రణవమును నిష్కామమైన బ్రహ్మబుద్ధితో నుపాసించిన ఆత్మ వ్యాపకమగు పరబ్రహ్మమే నేనని అనుభవస్ఫూర్తి యగును. "అవతి బ్రహ్మ బుద్ధ్యాదృష్టః ద్రష్టూనితి ఓమ్" అను నీ మొదలగు ప్రణవార్థమును విపులముగ వివరించిరి.

ప్ర. "ఓం నమశ్శివాయ" యనిన అర్థమేమి ?

ఉ. ఇదియును తత్త్వమసి యను మహావాక్యార్థమునే తెలుపును. "నమ" యను వర్ణద్వయము జీవుని తెలుపును (త్వంపదము) "శివ" యను వర్ణ ద్వయము బ్రహ్మమును(తత్పదమును) తెలుపును. "య" అను అక్షరము జీవబ్రహ్మాభేదార్థము. శ్రీ గురు ముఖమున విధానము నరసి నిష్కామముగ ననుష్ఠించిన అభేదజ్ఞానము సిద్ధించును. సూతసంహిత యందును ఓంకార ప్రతిపాద్యమగు "శివాయ" పర బ్రహ్మము నేనయి యున్నాను. "నమ" జీవుడు నేను కాదను నిత్యాదిగా తెలుపబడి యున్నది. లేక శివునకు నమస్కారము అనియుకూడ అర్థము.

ఒకప్పుడు శ్రీవారు సిద్ధుల విషయము లెత్తుకొని ఇట్లు పలికిరి. అయ్యా సిద్ధుల నెందు కపేక్షించెదవు. జీవన పరమ లాభమగు బ్రహ్మాను భవ సిద్ధి తప్ప తక్కిన వెల్లయు మానసిక సంకల్పములే ! ప్రకారాంతరమున నీకవి దుఃఖము నొసగును. కావున నిర్మలుడవై గురువాక్య సంసేవనముచే అభయ స్థితి నొందుము. అమృత పదము నొందుము

... బాబూ! బలహీనునకు చక్కని బ్రహ్మమయ భావములు కలుగవు. అతని బుద్ధివికలమగుచుండును. గావున శరీరారోగ్యమును తగినంతలో బాగుగనుంచుకొమ్ము. హితమును మితమును పవిత్రమును

భగవన్మయ భావనాభావితమునగు దివ్య దృష్టిచే అన్నోదకములను స్వీకరించుము. బ్రహ్మచర్యమునతి జాగరూకతతో కాపాడు కొనుము. జీవనాధారశక్తి బ్రహ్మచర్యమే. నీయందలి దివ్యధాతు అన్యాకారము గాక బ్రహ్మమయ భావనలచే గురు సంసేవనా రూపముగ యాశక్తి వినియోగింపబడిన నీవు దివ్యబలోపేతుడ వౌదువు. అదియే ఆవరణ మును ధ్వంస మొనర్చుచు ఆత్మజ్ఞానమునకు తోడగును. "బ్రహ్మణి చరతీతి బ్రహ్మచారీ" వేయేల నాయనా! పవిత్రమగు పూర్ణ బ్రహ్మ చర్యమే ముక్తి యన్న తప్పుగాదు. అయ్యుత్తమ శీల సంపద నీలో అఖండముగ నుండిన నీకు ధైర్యము, ఓరిమి, నిత్యశాంతి,సంతోషము లుండును. లౌకిక విషయములు తృణ ప్రాయములై యుండును. నీ శాంతి భంగముకాదు. "నాయమాత్మా బలహీనేన లభ్యః" అనిగదా శ్రుతి. ఈ ఆత్మ విద్యా వైభవమును భద్రమగు బ్రహ్మచర్యములేని వాడు కనజాలడు. నీ సర్వేంద్రియముల యందుండు పవిత్ర బ్రహ్మ చర్యశక్తి (ధాతుశక్తి) ఇంద్రియ విషయముల యందు విషయాకార మగు మిథ్యా భావములచే ఖర్చు గాకూడదు. "యత్ర యత్ర మనో యాతి తత్ర తత్ర సమాధయః" అన్నట్లు గురుదేవు డొసగిన బోధ మయ ప్రజ్ఞచే అధిష్ఠానాత్మ స్మృతి గలిగి నిర్మోహమున చరించుచు నిత్య సుఖ స్వాంతుడ వగుము. అవిచ్యుతమగు గురుభక్తి నీ కన్ని శక్తులు నొసగును.

ఈవ్రత మధ్య కాలమున ఉత్తములగు భక్తు లొకరు శ్రద్ధా భక్తులచే పూజ్యస్వామీ! పురుష సూక్తము యొక్క అర్థమేమి? అందరు అధ్యయనము చేయ రాదనెదరు ఎందుకు? భక్తిచే అడుగు నా ప్రార్థనను మన్నించి నాకు దాని అర్థము తెలుపకోరుచున్నానని అడిగిరి.

శ్రీవారు వారి విశ్వాసమయ వాక్యములను విని దయతో సంక్షిప్తముగ ఇట్లు తెలియజెప్పిరి. అప్పా! అందరు పురుషసూక్త

మును చదువరాదు. అనుటలో అభిప్రాయ మేమన అవి వేద మంత్ర ములు, ఉదాత్త అనుదాత్త స్వరితములను స్వరములతో నొప్పును. వేదము స్వర ప్రధానమైనది. కాన ఉపనయనము నొంది గురు కుల మున స్వర యుక్తముగ వాటి నెరిగి విధ్యుక్తముగ నధ్యయనముచేయ వలయును. లేకున్న వేద గౌరవమును చెరచిన వారగుదురని వైదిక వాఙ్మయ నియమము అంతియే కాని ఆగ్రహమున చదువ కూడదని చెప్పుట కాదండీ! అలాటి ఉత్తమ సంస్కృతి నొంది భక్తిచే చది విన చదువ వచ్చును.

దాని అర్థ మేమన మీరు అనుదినము శ్రవణము చేయుచుండిన శ్రుత్యర్థమే ఉపనిషత్తుల అర్థమే అయి యున్నది. అవ్యక్తాక్షర శబ్ద వాచకమైన పరబ్రహ్మ తత్త్వము యొక్క రూపమై యున్నది. ఆపర మాత్మ సమిష్టి ప్రాణ రూపుడును బ్రహ్మాండమే దేహముగా గల విరాడ్రూపుడైన పురుషుడని పిలువబడును.అతడు వేలాదిగ శిరస్సులు కళ్ళు కాళ్ళు గలవాడై యున్నాడు. అర్థాత్ ఆ చైతన్యమే సర్వో పాధుల యందు ప్రాణుల రూపమున వెలయు చున్నందుచే "సహస్ర శీర్షా పురుషః" అను నిత్యాదిగ, అసంఖ్యాక మగు ఈ సమస్త బ్రహ్మాండమును అతడు వ్యాపించి లోవెలి నున్నాడని అర్థము. భూత భవిష్యద్వర్తమానాది కాలత్రయ మందుండిన జగత్తెల్లయు ఆ పర బ్రహ్మస్వరూపమే. అన్ని కాలముల యందనుస్యూతుడై యుండు ఆ పరమాత్మయే ఈ బ్రహ్మాండ స్వరూపుడు. ఇతడే మోక్ష ప్రదాత (మరియు) ప్రాణుల భోగ్య పదార్థముల నతిక్రమించినతడేయున్నాడు. భూత భవిష్య ద్వర్తమాన కాల రూపమగు ఈ జగత్తంతయు అతని మహిమయే! విభూతియే! ఈ సర్వము చతుష్పాదములచే నొప్పు అతని అంశమున ఒక పాదమై యున్నది. తక్కిన మూడు పాదములు నాశ రహితమగు స్వప్రకాశాత్మ స్వరూపమున నున్నది. కావున నీ జగత్తు స్వరూప సాపేక్షికముగ అత్యల్పమయి యున్నదని చెప్పబడు

చున్నది. త్రిపాత్పురుషుడగు ఆ పరమాత్మ ఈ సంసార స్పర్శ రహితుడై సర్వాతీతుడై యున్నాడు. ఇట్లుండు నతని అత్యల్ప భాగము ఈ జగత్తునకు సంబంధించి యున్నది. తాత్పర్యమేమన అతడే ఈ చేతనా చేతనాత్మకమగు ప్రపంచ కల్పనాధారుడై వ్యాపించి ఇచ్చట నున్నాడని అర్థము.

అయ్యాదిపురుషుని నుండి అనగా ఉపాధి ప్రవిష్టాత్మ నుండిఈ బ్రహ్మాండ ముత్పన్న మాయెను. అతడే జీవరూపమున నీ బ్రహ్మాండ మున ప్రవేశించి బ్రహ్మాండాధి దేవతయై యున్నాడు. అప్పుడు దేవతలు (ఆ) పురుష స్వరూపముననే మనస్సును హవిస్సుగా సంకల్పించి అధ్యారోప దృష్ట్యా మానస యజ్ఞమును జేసిరి. అప్పటికి బాహ్యపదార్థము లేవియు జనించనందున ఈ యజ్ఞమునకు వసంత ఋతువే ఆజ్యముగను, గ్రీష్మఋతువే సమిధలుగను, శరదృతువే హవిస్సుగ నయ్యెను. అనగా మొదట పురుష స్వరూపమగు హవిస్సు సామాన్యముగను పిదప వసంతాదులు విశేష స్వరూపముగను సంకల్పింపబడెను. అనంతరము యజ్ఞ సాధనభూతుడగు పురుషుని ఆసనమునందు కూర్చుండ జేసి పూజించిరి. అదెట్లన సర్వ సృష్టికి మొదటజనించిన ఆ పురుషరూపమైనపశువును దేవతలు ప్రజాపతి మొదలగు ముఖ్యస్థులు మరియు ఋషులుపూజించిరి. అర్థాత్ యజ్ఞముచేసిరి.

ఈ విధముగ దేవత లెప్పుడీ మానసిక యజ్ఞమును చేయువారై పురుషస్వరూపుడగు పశువును తెచ్చికట్టిరో, అప్పుడు గాయత్ర్యాది ఏడు ఛందస్సులు సప్తసముద్రములయ్యె, మరియు 12నెలలు, 6ఋతువులు, 3 లోకములు మొత్తము 21 సమిత్తులుగ చేయబడెను. ఈ విధముగ నందరిచే పూజింపబడిన యాపరమాత్మ నుండి పెరుగుతోకూడిన నేయి పుట్టెను. అనగా నేయి మొదలగు భోగ్యవస్తువులు కలిగెనని భావము. అనంతరము పరమాత్మవాయు దేవతాకములైన అడవుల యందు మృగాదులను, గ్రామములందు పశువులను సృష్టించెను. ఇట్లు

పూజింపబడిన యీ పురుషుని నుండి ఋగ్వేదము సామవేదముపుట్టెను. అటువలె గాయత్రి మొదలైన ఛందస్సులు మరియు యజుర్వేదము పుట్టెను. మఱియు నతనినుండి గుఱ్ఱములు, క్రింద మీదుగ పండ్లుగల ఇతర ప్రాణులు ఆవులు గొఱ్ఱెలు మొదలగునవి కలిగెను.

ఇట్లు పరమాత్మ నెప్పుడు దేవతలు తమ మానసిక యజ్ఞము నందు సంకల్పించిరో అప్పుడు అతనిని ఎన్ని విధములుగ వారు సంకల్పించిరి? అతని ముఖ మేదాయెను? అతని భుజము లేవాయెను? తొడలేవి? పాదములేవి ? అవి (ఇప్పుడు) చెప్పబడును.

ఆ పరమాత్మ యొక్క ముఖమునుండి బ్రాహ్మణులు జనించిరి. భుజముల నుండి క్షత్రియులు, తొడల నుండి వైశ్యులు, పాదముల నుండి శూద్రులు పుట్టిరి. అతని మనస్సు నుండి చంద్రుడు, కన్నుల నుండి సూర్యుడు, ముఖము నుండి ఇంద్రాగ్నులు, మరియు ప్రాణము నుండి వాయువును కలిగిరి. ఆ విరాట్పురుషుని యొక్క నాభి నుండి అంతరిక్షము శిరస్సునుండి ద్యులోకము, పాదములనుండి భూమియు, చెవులనుండి దిక్కులు పుట్టెను.

(ఇట్లు) సర్వప్రాణులను కలుగజేసి వాటికి పేరు పెట్టి వ్యవహరించునట్లు చేసెను. సూర్యునివలె ప్రకాశ రూపమై తమస్సునకతీతమై యున్న పరమాత్మను నే నెరుగుదునని పూర్వము బ్రహ్మ ఇంద్రునకు ఉపదేశము చేసెను. (తెలిపెను). ఇంద్రుడు ఆ పరమాత్మను చతుర్దిక్కులయందు ప్రచార మొనర్చెను. అట్టి పరమాత్మను ఈ లోకము నందు ఎవడు సాక్షాత్కార మొనర్చుకొనునో, తన స్వరూపముగ తెలుసుకొనునో, అతడు జనన మరణ రహితుడగును. అనగా సంసార బంధవిముక్తుడగును. అజ్ఞాన తత్కార్య జన్మజరామరణదోష నివృత్తికి పై జెప్పబడిన పరమాత్మ సాక్షాత్కార జ్ఞానము నొందుట, అనుభవేతర మార్గమున సాధ్యపడదు. వేలాదిగా కర్మల నాచరించినను ప్రయోజనము లేదు. ఎందుకన "న కర్మణా న ప్రజయా ధనేన"

యని శ్రుతి చెప్పుచున్నది. (ఇట్లు) దేవతలు పరమాత్మ యొక్క మానస పూజ చేసిరి. అందుచేత ఆ పుణ్యమయ కార్యములు జగత్తును ధరింప దగినవై ముఖ్యమగు నవియై యున్నవి. (ఇట్లు) ఆ పరమాత్మను తమ ఆత్మగా ఉపాసించు మహాత్ములు పూర్వము దేవతలు, ఋషులు, ఏ ముక్తిని పొందిరో, అట్టి ముక్తినే - అట్టి పరమ పదమునే పొందుదురు. ఇత్యాదిగా అనేక విషయములను ముఖ్యమగు తాత్పర్యార్థమును అనుభవ యుక్తమగు సూక్తులచే శ్రీగురుదేవులు సవిస్తరము మూడుదినములు బోధించిరి.

10-11-62 శ్రీవారు భక్తులతో గూడి దక్షిణకాశి యనబఱగు శ్రీహంపీ (పంపా) క్షేత్రమునకు దయచేసి 11-11-62 దీక్షావిరమణ మొనర్చి శ్రీవిరూపాక్షేశ్వరుని సందర్శించి మహాన్యాస పూర్వక ఏకాదశవార శ్రీరుద్రాభిషేక పూజాదులు గావింపజేసి సంతుష్టులయిరి. అచటినుండి గంజిగుంట శ్రీమఠమునకు వేంచేసి బ్రహ్మనిష్ఠచే విరాజమానులై యుండుచు తమ సద్గురువరేణ్యుల పుణ్యారాధన శుభకృతు నామ సంవత్సర కార్తిక॥ బ॥ దశమి, ఏకాదశి, ద్వాదశి మూడు దినములు విధ్యుక్తముగ నాచరించిరి. మహాత్ములే తెంచి యుండిరి. శ్రీగురుకృపచే సర్వము మంగళప్రదముగ నడచి పూర్ణమాయెను.

ఆ పిదప శ్రీవారు శ్రీగీతా జయంతి కార్యక్రమమునకు ఉరవకొండ శ్రీకన్యకాపరమేశ్వరి దేవస్థానమునకు దయచేసి అచట యథారీతి పూజానుష్ఠానాది కార్యములచే 10 దినములు జయంత్యుత్సవముల చేసిరి. భగవద్గీతా శాస్త్రార్థ ప్రవచనముల చేతను యోగవాసిష్ఠ మహాగ్రంథ ప్రవచనముల చేతను నిత్యానందముగ కార్యక్రమము జరిపిరి. అనంతరము గంజిగుంట శ్రీమఠమునకు దయచేసి సూతసంహిత ప్రస్థానత్రయ భాష్యముల నవలోకించుచు నిష్ఠనుండిరి.

## శ్రీమదుత్తరాయణ పుణ్యకాల సదాచరణ సమారంభము

### శివపంచాక్షరీ మంత్ర ప్రభావము

శ్రీమంతమగు శ్రీఉమామహేశ్వర గురుపీఠము గంజిగుంటశ్రీ మఠమునందు శ్రీసద్గురు ప్రణవానందాశ్రమమునశ్రీవారు శ్రీమదుత్త రాయణ పుణ్యకాలమున 14-1-1963 తమ గురుదేవుల అధిష్ఠాన ముతో శ్రీచంద్రమౌళీశ్వరునకు (శ్రీమదుమామహేశ్వరులకు) భక్తిచే మహాన్యాస పూర్వక శ్రీరుద్రాభిషేకాది సర్వోపచార పూజాదులు విధ్యుక్తముగ చేసిరి. భక్తాదులందరు తీర్థప్రసాదముల స్వీకరించి ధన్యులయిరి.

ఇట్టి శ్రీమదుత్తరాయణ పుణ్య కాలముననే శ్రీగురుదేవులు శాస్త్రోక్తముగ శ్రీగురు సంప్రదాయానుసారము వచ్చిన మహా మంత్రమును దీక్ష త్రయముచే మాకు గురుదేవు లనుగ్రహించిన పర్వ దినమని తెలుపుచు వివరించిరి. వేదదీక్ష, మంత్రదీక్ష,క్రియాదీక్షయని దీక్ష త్రివిధములు. అందులో వేధదీక్ష యన శ్రీగురువు శిష్యుని తన కృపా దృష్టిచే వీక్షించి వరద హస్తమును శిష్యుని మస్తకము నం దుంచి శివ స్వరూపునిగ చేయుట (అనుభవింప చేయుట) దీనిచేత శిష్యుని దేహత్రయము శుద్ధమగును. పూర్వజన్మ నివృత్తమగును. పునర్జాతుడగును. అనగా శ్రీగురు కరకమల సంజాతు డగును. శ్రీ గురుదేవుని కరుణా కటాక్ష వీక్షణములచే పవిత్రుడగును. శ్రీగురు దేవుని కృపామయ దృష్టి శిష్యుని నేత్రవృత్తి ద్వారా యాతనిభక్తి మయ మనోవీధుల (భావమునందు) వ్యాపించి కరణత్రయము కాంతి వంతమై వెలుగును. వేదార్థ స్వరూపుడగు చైతన్యాత్మవే నీవని బోధించుట, దీనినే వేధదీక్ష యని చెప్పుదురు.

సోహం అను మంత్ర స్వరూపుడైన యా శిష్యునకు పంచా క్షరమంత్రమును అనగా షడక్షర మహామంత్రము నుపదేశించుట మంత్రదీక్ష యనబడును. ఈశివ నామామృతమును గ్రోలి ఆతడమరు

డగు మహాభాగ్యము అందు గలదు.

శుభ ముహూర్తమున సుస్నాతుడైన శ్రీగురు సన్నిధికివచ్చి దండవత్ప్రణామము లాచరించి నిలిచియున్న ఆతనిని శ్రీగురు సన్నిధి కూర్చుండ బెట్టుకొనికలశోదకముచే సంప్రోక్షించి గురుపూజాదికార్యములు చేయించి పరిశుద్ధాంగుడగు నాతని దక్షిణ కర్ణమునందు ఓం నమశ్శివాయ యను మహామంత్రమును, అజపమును, యితరులకు వినబడకుండ నుపదేశించి మంత్రము యొక్క ఛందస్సు ఋషి దేవత బీజ, శక్తి కీలకమను షడంగములను న్యాస పద్ధతులను తెలుపు పవిత్ర పూజా మంటపము నందలి కార్యములు క్రియాదీక్ష యని చెప్పబడును. ఈ అర్థములనే మన పరమ గురుదేవులు "దీక్షా త్రయముచే ......అను నిత్యాదిగా కృతి యొకటిని మరియు మంత్ర మహిమను అర్థమును దెలుపు "పంచాక్షరీయ మంత్రం యెంచంగ శివజీవైక్యం ........." అను కృతిని, మంత్ర మహిమను తెలుపు "శివ నామ స్మరణ జేయండి మీలో భవమును బాయుటకు బహు సులభమండి" యనియు "హంసోహం బంసోహం బనరే..." అను మొదలుగా గల కృతులు (తత్త్వములు) మంత్ర మంత్రార్థ స్వరూపములను వివరించి యున్నారని శ్రీవారు అనన్యమగు భక్తిచే బోధించిరి.

శ్రీవారి పుణ్యమయ చరిత్ర యందలి ప్రసంగములు ఆయా స్థానములందు తాము ప్రవచించిన గ్రంథస్థ విషయములే కాక తదాధారమున ప్రాసంగికముగ బోధించిన అనేక విషయములు కూడ కలవని పాఠకులు గ్రహించ వలయును.

శ్రీశివ పంచాక్షరి లేక షడక్షరి "ఓంనమశ్శివాయ" యను మహామంత్రము అంగన్యాస కరన్యాస యుక్తముగ దేహేంద్రియాదులందు వినియోగింపబడుచు వ్యవహారికమునందు నమస్కార పూర్వకంబగు శివధ్యానమునందు ఉపయోగింప బడుచున్నది. కాని జ్ఞానైక విషయమునందు తన్ను పరమశివునిగా పరబ్రహ్మముగ గుర్తింపజేయుట

యందు ముఖ్యసాధన మని అన్వయ మగుచున్నది.

ఓం -అను ప్రణవ ప్రతిపాదకంబగు పరబ్రహ్మము శివాయ -పరమ శివుడు నేనై యున్నాను. మః-జీవుడను, న- కాను అనియు అర్థము. సోహంబను ఆత్మ మంత్రము అభ్యాస పూర్వకముగా ఆత్మ జ్ఞానమునకు పరంపరా సాధనము. షడక్షర మహామంత్రము సాక్షాత్తుగా పరశివ "పరబ్రహ్మమునే" తన్నుగా తెలియజేయు మహా మంత్రమై యున్నది. అందుచేత అహంబ్రహ్మాస్మి, శివోహం, సోహం, ఓం నమశ్శివాయ అనునవి అన్నియును పరమాత్మ (పరబ్రహ్మ) తత్త్వమునే సూచించు మహామంత్రములుగ వెలయుచున్నవి. ఓంకారోపాసన ప్రణవ రూప పరమాత్మ నెట్లు చేర్చుచున్నదో అటువలె అభ్యాస రూపమగు శివోహం, సోహం ఇత్యాది ఉపాసన లన్నియు క్రమముగ షడక్షర మంత్రమగు ఓం నమశ్శివాయ యను అనుసంధాన ఫలమునే ఇచ్చుచున్నవి. తన్ను శివ (పరబ్రహ్మ) స్వరూపునిగా అనుభవముచే గుర్తించి అటువలె నుండుటే సహజసమాధి యని చెప్పబడును.

ప్రణవ సహితంబగు పంచాక్షర మహామంత్రమును అర్థయుక్తముగా భక్తిచే జపించిన అధికారికి భవబంధ ముక్తి యగును. సర్వ మంత్రములకు ముఖ్యమైన ప్రణవము పరప్రణవమనియు,అపర ప్రణవ మనియు ద్వివిధము. పరప్రణవమే సత్య జ్ఞానాది లక్షణము గల పరబ్రహ్మమని చెప్పబడును. అపరప్రణవమే వాచకమైన శబ్ద రూపమగు బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివ సర్వాత్మకమని, సర్వ విద్యా బీజమని తేజోబీజమని, ముక్తిబీజమని, అక్షరమని, ముఖ్య స్వరమని వేదాంతమని నాద మంత్రమని ఆత్మ మంత్రమని పర్యాయ నామములచే చెప్పబడుచున్నది. మంత్రముల యందు మూల పంచాక్షర (షడక్షర) మహామంత్రము ముఖ్యమైనది. దీనిని మరి మరి శ్రీగురు ముఖమున అర్థ యుక్తముగ నెఱిగి నియమ పూర్వకముగ నిష్ఠతో

జపించిన జన్మతరించును. "నమ" యను వర్ణద్వయము జీవరూపము త్వంపదము. "శివ" యను వర్ణ ద్వయము శివ తత్త్వ స్వరూపము అనగా తత్ పదము, 'య' అనునది అభేద బోధకము అసి పదమని మన శ్రీ గురువులు తత్త్వము నందు తెలిపి యున్నారు.

సకృదుచ్చార మాత్రేణ పంచాక్షర మహా మనోః ।
సర్వేషామపి జంతూనాం సర్వ పాపక్షయో భవేత్॥
ఈశ మంత్ర మహా శక్తిః ఈశ్వర ప్రతిపాదికా।
సకృదుచ్చార మాత్రేణ సర్వసిద్ధి ప్రదా భవేత్॥
వశిష్ఠ వామదేవాద్యాః మునయో గౌత మాదయః ।
మంత్రేణాఽనేన సంసిద్దా మహా తేజస్వినోఽభవన్॥
బ్రహ్మాదీనాం చ దేవానాం జగత్సృష్ట్యాది కర్మణి।
మంత్రస్యాస్యైవ మాహాత్మ్యాత్ సామర్థ్య ముపజాయతే॥
పురా సానంద యోగీంద్రః శివధ్యాన పరాయణః।
పంచాక్షరీం సముచ్చార్య తతార నరకార్ణవమ్॥

"నమశ్శంకరాయ చ మయస్కరాయచ నమశ్శివాయ చ శివ తరాయ చ" అను నిత్యాదిగా శ్రీరుద్రమునందును మరియు సూతసంహిత యందును, విశేషముగా శ్రీషడక్షర మహామంత్రమును గురించి నందికేశ్వర సనత్కుమార సంవాదాత్మకముగ తన్మహిమ కనపడు చున్నది.

ఈ పంచాక్షరీ మహామంత్రము పరశివ పరబ్రహ్మ తత్త్వమును ప్రకాశింప జేయుచున్నది. శిష్యుని మనోరంగమున అతి ప్రకాశమును కలుగజేయును. ఇది యొక గొప్పవిద్య. విద్యలలో మర్మము కూడ. ఈ మంత్రజపము మానసికము, ఉపాంశు, వాచకము, అని మూడు విధములు. అందు మానసిక జపముత్తమోత్తమము. మంత్రము లసంఖ్యాకములు. వాటియందు పంచాక్షర మహామంత్రము పరమోత్తమము. ఈపరమార్థతత్త్వమునకు తుది మొదలు లేదు. శివతత్త్వమునకు సమమగునది మరొకటి లేదు. అట్టి శివతత్త్వమును బోధించు పంచాక్షర

మహామంత్రమహిమ అపూర్వము, పంచాక్షరమంత్రము నెరిగినపిదప నిక నెరుగవలసిన మంత్రములు లేవు. జగన్మూలమగు శివతత్త్వము నెరిగిన పిదప దైవ మన్యముగ నెరుగవలసిన పనిలేదు. సప్తకోటి మంత్రముల యందు పంచాక్షర (షడక్షర) మహామంత్రముగొప్పది. బ్రహ్మాదిదేవతల యందు శివుడు శ్రేష్ఠుడు. అతడె పరమాత్మ పరబ్రహ్మము. అతడే అఖిల జగత్కారణుడు. పంచాక్షరి ఆతని వాచకము. అదిసర్వ మంత్రములకు మూలము. అది పరశివాభిధానమై యుండి, అదియే అభిధేయమునై యున్నది.

ఈ మహా మంత్రమునందు 'నమః' పదము మొదట ఉచ్చరింపవలెను. 'శివాయ' పదము అనంతర ముచ్చరింపవలెను. అదే పంచాక్షరీ మంత్రము. అదే సర్వ శ్రుతి శిరోరత్నమై వెలయుచున్నది. పంచాక్షరి యందుండు శివశబ్దము సాకారమాత్రమేకాదు, పరబ్రహ్మ రూపమై యున్నది. దానికి మలత్రయ సంబంధము లేదు. అందుచే నది పరిశుద్ధమై యున్నది. సచ్చిదానంద స్వరూపమై యున్నది. అదే శివ యను నామమై యున్నది. ఈ శివ శబ్దమే పరబ్రహ్మ ప్రకాశకమై యున్నది. అసదృశమగు తేజస్సంపన్నమైన ఆ పరబ్రహ్మతత్త్వమునకు శివయను రెండక్షరములు సార్థకమై యొప్పి యున్నవి. ఈ శివశబ్దము గలదే పంచాక్షర మహామంత్రము. అందుచేత ముముక్షువులు పంచాక్షర మహామంత్రమును సదా జపించదగును. దీనిని జపించుటచే సంసార దుఃఖము నివృత్తి యగును. భవము బాయును. శాంతి యలవడును. సంపద చేకూరును. దారిద్ర్యము దూర మగును. సర్వరోగక్షయ మగును. తన్ను చుట్టుముట్టిన కష్టసిష్ఠురములు కాలిపోవును. కైవల్య మబ్బును.

ఈ పంచాక్షరములచే 5 భూతములు, 5 తన్మాత్రలు, 5 జ్ఞానేంద్రియములు, 5 కర్మేంద్రియములు, 5 బ్రహ్మలు, 5 కృత్యములు ఇట్లై దైదుగా గల సర్వమును పంచాక్షర స్వరూపమే యని అర్థము.

ఓంకారమును మొదలుగాగలిగిన ఉల్లేఖనఉచ్చారణలతోకూడినపంచాక్షరిని షడక్షర మంత్రమని, వేదాగమముల యందు చెప్పబడిన ఈ ప్రణవ పంచాక్షరియే షడక్షర మహామంత్రమని, దానినుపాసించుటచేత కేవల సచ్చిదానంద స్వరూపుడైన పరమేశ్వరుని పరబ్రహ్మతత్త్వసాక్షాత్కార మగును. (అనుభవమగును) సంశయము లేదు.

ఓంకార మహిమ అపారమైనది. కేవల ప్రణవ మాత్ర స్మరణము చేతనే పరబ్రహ్మసాక్షాత్కార మగును. రెండవది లేని అఖండాద్వితీయంబగు భవరహితంబైన శివుడే యా పరబ్రహ్మము. ఆ పరబ్రహ్మమే తాను అనగా (పరమాత్మ). ఆ పరమాత్మ సనాతనుడై సోహం రూపమున నున్నాడు. ప్రాకృతమైన ప్రాణాయామముచే హంసః అను బుద్ధి కలుగునట్లు వైకృత సూక్ష్మ ప్రాణాయామముచేత సోహం భావరూపముదయించును. ఈసోహం యను దాని యందుండు స్, హ ఈ వ్యంజనములు (హల్లులు) రెండు ఉపాధి భిన్నములైనవి. స్, హ రెంటిని తీసిన మిగులునదే ఓం లేక సకారోపరి ఓకారమును, హకారోపరి బిందువును, యోజనమొనర్చిన అదే మూల ప్రణవము. నిరుపాధిక నిష్ప్రపంచమగు నీ ప్రణవముచే బ్రహ్మ(శివ)తత్త్వప్రబోధ యగును. తక్కిన పంచాక్షరమంత్రముచే సర్వమును పంచముఖబ్రహ్మస్వరూపమగు శివతత్త్వమే యను బోధయగును. అర్థాత్ ఈ షడక్షర మంత్రముచే నిష్కల నిరుపమ పరబ్రహ్మతత్త్వ సాక్షాత్కార మగును. అనగా అనుభవ మగును.

శుచిర్భూతుడై పూర్వాభిముఖముగ నైనను ఉత్తరాభిముఖముగ నైనను కూర్చుండి దేవ దేవుడగు శ్రీచంద్రమౌళీశ్వరుని, అనగా శ్రీఉమామహేశ్వరులను ధ్యానించి, శ్రీసద్గురువునకు నమస్కరించి, చిత్తైకాగ్రత గలవాడై ఈ మహా మంత్రమును జపింపవలెను. ఇదియు వాచకము, ఉపాంశు, మానసికము యిట్లు మూడు ప్రకారములు. వర్ణ వ్యత్యాసము గాక, ఒరులకు వినబడునట్లుచక్కగ

ఉచ్చరించునదే వాచక జపము. క్రింది పెదవి కొద్దిగ కదలించుచు పరు లకు వినబడ కుండునట్లు జపించుట ఉపాంశు వనబడును. ఇక ఏ ప్రకార ముగా నాలుకను గదలించక శుద్ధమగు మనస్సునందు విస్పష్టముగనక్ష రముల నుచ్చరించి షడక్షరములను భావించి నిష్ఠ సలుపునదే మానసిక జప మనబడును. ఈ అన్నిటి యందును ఒకదానికంటె నొకటి తరతమ దృష్టిచే మానసిక జపము సర్వోత్కృష్టము. ఇది భవ భవాంతరముల నెల్లను కాల్చివేయును. కాని ఈ పై వాటియందు సద్భక్తుడు-శిష్యుడు నగు నాతడు ఏదైన ఒక దానిని గ్రహించి క్రమము దప్పక భావ భరి తుడై ఈ మహామంత్రము జపించిన చాలు: ధన్యుడగును. సర్వకాల సర్వావస్థల యందును ఈ మహామంత్రమును తమ మనస్సునందు లేక వాక్కు నందైనను ధరించుచు భావించవలెను. జ్ఞాన నిష్ఠా గరిష్ఠులగు సానందయోగీశ్వరులు శ్రీ శివ పంచాక్షర మహామంత్రము నొక్క సారి ఉచ్చరించి, నరకలోకము నందున్న వారి నందరిని ఉద్ధరించెను. ఉప మన్యు వను మహాయోగి పంచాక్షరమహామంత్రసిద్ధి నొంది సాక్షాత్ పరమ శివునినుండి సర్వ విద్యలు పొంది ఆచార్యత్వమును వడసెను. వశిష్ఠ, వామదేవాది మహామునులు ఈ మంత్రసిద్ధులై మహాతేజస్సు నొందిరి. ముక్తులైరి. బ్రహ్మాది దేవతలు సృష్టి స్థితి లయాది కార్య ములను చేయు సామర్థ్యమును ఈ మహామంత్రమునుండి పొందిరి అందుచేత శ్రీగురుదేవులు ప్రసాదించిన మహా మంత్రమును అనన్య మగు భక్తిచే జపించ వలెను. ధ్యానించ వలెను. నిష్ఠ సలుప వలెను. దురితములు దూరమగును. వికల్పములు వినాశ మొందును. అవిచ్యుత మగు ఆత్మ స్వరూపానందము కలుగును.

సంపద్విశిష్టులు కావలెనన్న, మోక్షమునొందవలెనన్న, తెలియ నశక్యమగు మాయామేయ ప్రపంచమునుండి దూరము గావలెనన్న, మన కాయు రారోగ్య భాగ్యములు ప్రాప్తించ వలెనన్న 'ఓంనమశ్శి వాయ' యను మహామంత్రమునొక్కటి జపించిన చాలు. పుణ్యక్షేత్ర

వాస సర్వ ఫలములకు కారణమైనది. పుణ్యప్రదమైనది. దేవమానవుల వర్ణన కతీతమైనది. ఓంనమశ్శివాయ యను మహామంత్రమొక్కటే దేవయజ్ఞ బ్రహ్మయజ్ఞ పితృయజ్ఞ భూతయజ్ఞ మనుష్య యజ్ఞముల యొక్కసత్కర్మ ఫలముల నిచ్చును. భక్తిచే ఈ ఓం నమశ్శివాయ యను మహామంత్రమును జపించుటచే సర్వ సిద్ధి కలుగును. అప్రస్తుత, అనాత్మవిషయములను వాక్కుచే నుచ్చరింపరాదు. శ్రీ గురుదైవ ప్రసాదమగు ఈ ఓం నమశ్శివాయ యను మంత్రోచ్చారణచే మహా శుభము కలుగును. సర్వ దుర్గములను కష్టనిష్ఠురములను ఎదిరించుటకు పవిత్రమగు ఈ మంత్రోచ్చారణయే పరమ సులభమయిన సాధనము సర్వలోక ప్రియత్వము, సమస్తశాస్త్ర పరిచయము, మృదువగు సుసంపన్నమైన వాక్కులు, మనకు సంప్రాప్తము కావలెనన్న ఓం నమశ్శివాయ యను శివ పంచాక్షర మహామంత్రమును జపించవలెను.

సత్త్వ రజస్తమోగుణముల చేష్టలు తొలగించి మనశ్శరీరముల నావరించిన వికల్పముల పరిహరించుట యందు, గురుప్రదత్తమగు ఓం నమశ్శివాయ యను మంత్రమొక్కటే సమర్థము. ఓం నమశ్శివాయ యను మంత్ర స్మరణచే మానసికమగు ధన వనితాది సర్వ విషయ చింతలు బాయును. మోహమును ద్రెంచి పుట్టుచావుల బాపి, కాముని కాల్చి, తెలియ నసాధ్యమగు ఆత్మతత్వము నరయ వలెనన్న ఈ మహామంత్ర మొక్కటే శరణ్యము. మానవుల వెన్నంటి చెఱచునట్టి అసత్యము, అనాచారము, పర వంచన ఇత్యాది దుర్గుణములను దూరీకరింపజేసి సద్గతిని ప్రాప్తింప జేయునది శ్రీగురుస్వామి ప్రసాదించినఓం నమశ్శివాయయను మహామంత్ర మొక్కటే. జన్మ జన్మముల నుండి మానవుల పీడించుచుండు కోపతాపాదులు దూరమగుటకు, తత్వచింతనచే జన్మ ధన్య మగుటకు ఓంనమశ్శివాయ యను మహామంత్రమే సాధనము. మాయామేయ పరిణామ శీలమైన మానవుడు జన్మ కర్మ, మల పాశ బంధములనుండి ముక్తుడై ఉత్తమ శక్తి నొంది తత్త్వము

నరయుటకు గురుదేవుడొసగిన ఓంనమశ్శివాయ యను మహామంత్రమే ఆశ్రయణీయము. వేదవేదాంగముల సార భూతమగు ఓంనమశ్శివాయ యను మహామంత్రము మనశ్చాంచల్యమును పంచ భ్రాంతులను అరిషడ్వర్గములను పారద్రోలి విముక్తి నొసగును.

మానవులకు అగ్ని భయము, ఆపద్భయము, తేలు పాము వగైరా ఇతర ప్రాణులనుండి కలుగు అన్నిభయములను బాపిఅభయ మొసగు నదియు ఈ మహామంత్రమే. ఓంనమశ్శివాయ యను మహామంత్రము అహంకారారణ్యమునకు కుఠారము. లౌకికాడంబరముల యందు తేలియాడుచు, దుర్వ్యవహారమున మునిగి యుండు వాని నిది తప్ప మరొకటి ఉద్ధరింపలేదు. పట్టుదలచే పఠించిన తరింప జేయునది ఓంనమశ్శివాయ యను మంత్రము. అష్ట మదములను బాపును, సదా సంతోషము నొసగును. ఓంనమశ్శివాయ యను మహామంత్రము, సంతాప కరములగు విలాసముల బారద్రోలి కాపాడును.

వేదాంతములైన ఉపనిషత్తులు సకల శాస్త్రములు సర్వ దర్శనములు పదునెనిమిది పురాణములు 28 ఆగమములు సనాతనములగు వేదమంత్రములు వీటి నన్నిటిని అధ్యయన మొనర్పగా గలుగుమహా శుభము. శ్రీగురు ప్రదత్తమైన ఓంనమశ్శివాయ యను మహామంత్ర జపముచే గలుగును. పరధన పరకాంతాసక్తములయిన విషయచింతలను దహించి ఈ మహామంత్రము దుష్ట బుద్ధులను సైతము సుబుద్ధుల జేయును. ఓంనమశ్శివాయ యను మహామంత్రము కామితార్థముల నొసగు కామధేనువు. చింతించు దాని నొసగు చింతామణి, సంకల్పించిన దాని నిచ్చు కల్పవృక్షము. చంద్రమౌళి యగు పరమేశ్వరుని, గౌరీకాంతుని అనగా సాంబుని ఉమామహేశుని సదా స్మరించి ఓంనమశ్శివాయ యని జపించి, అగస్త్య దధీచి భృగు సానందమార్కండేయ వశిష్ఠ దుర్వాస మొదలగు మహర్షులెల్లరు మహా మహిమ నొంది ధన్యులైరి. ఈమహామంత్రము వేదములకు మూలము. జ్ఞానము

నకు ఆశ్రయము. యతీశ్వరుల మనస్సునందు సంతతము ఆడునదియు, జన్మ కర్మల పరిహరించు నదియు నగు శ్రీగురుదేవు డొసగిన 'ఓం నమశ్శివాయ' యను మంత్రము సంతతము స్మరించుము. ఓంనమశ్శివాయ యను నీ మంత్రము దేవతలు, మనుజులు, దానవులు ఖేచరులు నాగులు మునీశ్వరులు మున్నగు వారిచేత గూడ సుకీర్తితము. వేదసార భూతమగు మంత్రమై యున్నది. ముముక్షువు లింను అత్యంత శ్రద్ధచే దృష్టినుంచి జపించవలెను. వీరి బ్రహ్మవిద్య కిది కేంద్రము. అందుచే దీనిని మంత్రరాజ మందురు. ఫాలమున ధరించు తిలకముల యందు భసిత మెట్లు శ్రేష్ఠమో, సత్ఫలముల యందు గురు కారుణ్య ఫల మనునది ఎట్లు శ్రేష్ఠమో, సత్కులముల యందు భక్తుడు, జ్ఞాని ఎట్లు శ్రేష్ఠుడో అట్లు మంత్రముల యందు 'ఓంనమశ్శివాయ' యను మహా మంత్రము శ్రేష్ఠము. కావున మనస్సునందు అన్యమును దలంపకుము. సంతతము ఓంనమశ్శివాయ యను మంత్రమును జపించుట ముముక్షువుల ముఖ్యకర్తవ్యము. అను ఇత్యాది భక్తి భావ పూరితములైన అనేక విషయములను శ్రీగురుదేవులు బోధించుచు శ్రీవారు గంజిగుంట శ్రీమఠమున కొంతకాలముండి గుంతకల్లు ఆశ్రమమునకు దయచేసిరి.

అనంతరము పూజ్య శ్రీవారు శ్రీకాళహస్తి శ్రీవిద్యాప్రకాశానంద స్వాములవారి శుకబ్రహ్మాశ్రమ మాక్త్రికోత్సవ కార్యక్రమమునకు ఆహూతులై దయచేసిరి. అచ్చట కార్యక్రమము అత్యంతవైభవోపేతమై శివప్రదముగ నుండెను. అచట శ్రీశుకబ్రహ్మాశ్రమాధిపతులగు పూజ్యశ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారిచే రచింపబడిన గీతామకరందము అను మహాగ్రంథమును పూజ్యశ్రీ చిరంతనానంద స్వాముల వారిచే ఆవిష్కరింప జేసిరి. వేదాంతభేరి మాసపత్రికను మన పూజ్యశ్రీ వారిచే ఆవిష్కరింప జేసిరి. అప్పటి యాసభ విరాడ్రూపమున విరాజిల్లుచు సర్వజనానంద ప్రదముగ నుండెను. మఱియు

పూజ్యశ్రీ విమలానందస్వాములవారు, పూజ్యశ్రీ విద్యానన్దస్వామి వారు, మున్నగు మహాత్ములా మహాసభకు దయచేసి యుండిరి. ఆధ్యాత్మిక తత్త్వ ప్రసంగము లెంతయు ముముక్షు జనోత్తారకములై మహదానందముగ నుండెను.

## శ్రీగురుదేవాశ్రమ స్థాపన

అనంతపురం జిల్లా గూళపాళ్యము శ్రీపాటీల్ రాచనగౌడు గారు తమ గ్రామమున శ్రీవారి శుభనామముచే నొక ఆశ్రమము స్థాపించవలెనని శ్రీసన్నిధి విన్నవించుకొనిరి. అందు శ్రీపాదులు శివ శివా! ఆశ్రమ మనిన దాని నిర్మాణ నిర్వహణాదు లెంతయు మహా కష్ట మప్పా ఈ ఉండు శరీరమను పుణ్యమయాశ్రమ మొకటే చాలు. దీని మూలమున శ్రమ నివారణాత్మకమగు క్షేత్రజ్ఞాత్మ జ్ఞానమునొంది ధన్యమయితే చాలు అని అనేక విషయములు తెలిపిరి. కాని వారు తమ పట్టువిడువక వివిధరీతుల శ్రీసన్నిధి ప్రార్థించి గ్రామమునకు దూరమును అంతసమీపమును గాని తమ ఉత్తమమగు పొలమునందు శ్రీశుభకృతునామ సంవత్సర మాఘ శుద్ధత్రయోదశి 6-2-1963 బుధ వారము విధ్యుక్తముగ శంకుస్థాపన గావించి ఆశ్రమమును నిర్మించిరి. అదే శ్రీగురుదేవాశ్రమ మని పిలుపబడును. కొనకొండ్ల భక్తులును గూళపాళ్యం భక్తులును గలసి అచట తగిన ఏర్పాటులు గావించి ఆశ్రమమున అనుదినము పూజానుష్ఠాన పారాయణ శాస్త్రప్రవచనాది కార్యములు జరుపుచు యథావిధి నిత్య నియమ సంపన్నమై శివప్రద ముగ నడచునట్లు యేర్పాటు గావించిరి. (మొదట పర్ణ కుటీరము నొకటి నిర్మించిరి).

శ్రీవారు ఆనాడు తెలిపిన పలుకులు మతమన మానవుని విశ్వస నీయమగు సద్భావన జన్మ సార్థకత కొఱకై ఏర్పరచుకొన్న దివ్య మార్గము. అట్టి నీతి నియమ నిష్ఠ తత్త్వవిచారణకు నిలయమై భక్తుల ముముక్షువుల మరి సామాన్య జనులను కూడ సన్మార్గ గాములనుగా

జేయుచు చిత్త సంస్కరణ నొసగి జప తపాదుల చేతను మనో వాక్కా యములచే నిష్కామమగు సేవచేతను "విద్యాతపోభ్యాం పూతాత్మా" అన్నట్లు నిజమగు విద్యా తపస్సులచేతను ఆధ్యాత్మిక విద్యను వడసి పునీతులగుటకు నిలయమైనదే ఆశ్రమము. శ్రీఉమామహేశ్వర గురు పీఠము.

ఒక స్థానమున అందరు చేరి నియమముగా భగవత్కార్యము లను సలుపు కొనుచు జన్మ ధన్యత నొందించుకొని లోకోపకార వర్త నులై మనుగడను మాన్యముగ నడపుకొనుటకు ఆశ్రమము గురుకులము గురుపీఠము మఠము అను నిత్యాది నామములచే మన భారతీయ దివ్య సంస్కృతి యందు ముఖ్య కేంద్రములై వెలయుచున్నవి. దైవీగుణ సంపత్తితో కూడి ఆధ్యాత్మిక తత్త్వ ప్రబోధలచే చిత్త సంస్కర ణము నొంది స్వరూప నిష్ఠతో నిజశాంతిని వడయుటకై సనాతనముగ ఇట్టి ఆశ్రమములు గురుకులములు గురుపీఠములని మన దేశమున ప్రసిద్ధ ములై యేర్పడియున్నవి. అట్టి ఆధ్యాత్మిక శాస్త్ర శ్రవణ మనన నిధి ధ్యాసనియమనిష్ఠాది మహాకార్యములు సలుపుకొనుటకై ఏర్పరుప బడినదే ఈ మన శ్రీఉమామహేశ్వర గురుపీఠము. అందు ఇది శ్రీగురు దేవాశ్రమమను శుభనామముచే వెలయుచు మీ యందరికి ఆధ్యా త్మిక దివ్య కృషి సల్పుకొనుటకు ఉత్తమమైన కేంద్రమై యున్నది.

సత్య శీల సంపన్నమగు నిత్య, నియమ, స్వాధ్యాయాధ్యయన, తపస్సులనునవి లేనిచో నా యాశ్రమములకు నిజమగు సత్తువ యుం డదు. చివర కవి స్వార్థ పరములై చెడిపోవును. అట్లు కాకుండ శ్రీ మదుమామహేశ్వరులు అందరికి సదా దివ్యమగు దైవీ గుణ ముల నిచ్చి బ్రోచుగాక! సదాచార సంపన్నులై శ్రీగురుపీఠ భక్తి గలిగి ఆశ్రమ కార్యములను నియమము దప్పక ఆచరించు కొనుచు వచ్చిన అందరు ధన్యులగుదురు. ఇట్టి గురుకులములు గురుపీఠములు ఆశ్రమములు మన దేశమున అనేకములు గలవు. త్రిమతాచార్యులగు

శ్రీశంకర, రామానుజ, మధ్వాచార్యులు మరి ఎందరో ఆచార్య ప్రభృతులు మహాత్ములు ఇట్టి ఆశ్రమములను స్థాపించిరి. తన్మూల మున ఎందరో నైతిక ధార్మిక ఆధ్యాత్మికాది అభివృద్ధి నొంది ధన్యు లగుచున్నారు. కాని క్రమము తప్పిన మంచిది కాదు భద్రము.

ఆశ్రమము స్థాపించుటే కాదు. గురు శాస్త్ర దైవభక్తి గలిగి విధ్యుక్తముగ నడచుకొనుచు తన్మూలమున అందరు ఆత్మజ్ఞాన సంప న్నులై ధన్యులు కావలెను. శ్రీఉమామహేశ్వర గురుపీఠ శ్రీగురు పరంపరాచార్యులు చల్లని చూపులచే తమ కృపామయ ఛత్రమున భక్తుల పాలింతురుగాక ! సర్వమును శ్రీగురుదేవుడే ! అను నిత్యా దిగా అత్యంతవిపులముగ ఆశ్రమములుసంస్థలు గురుపీఠములుఅననేమి? వాటి పద్ధతులు అవి క్రమము దప్పిన ఏమగు ననియు తెలుపుచు మీ రందరు భక్తిచే నట్లు కానీయక సంపూర్ణమగు గురుపీఠ విశ్వాసము కలిగి పట్టుదల శ్రద్ధ ఓపిక లౌకికులగు పరుల మాట మందలింపులకు బెదరక సత్య పథమును వీడక కుపథమును అనుసరింపక శ్రీగురుపీఠ భక్తి గలిగి వర్తించవలెను. అపుడాశ్రమము చాల బాగుండును. భక్తుల యొక్క పరమ భక్తి భావములే శ్రీగురుపీఠము యొక్క సం పద అని ఎంతో హృదయంగమమగు అనేక ముఖ్య విషయములను శ్రీ గురుదేవులు బోధించిరి.

ఆపిదప శ్రీవారు తాడిపత్రి, మరియు ప్రొద్దుటూరు తమపరి పత్రికొండ, తుగ్గలి మొదలగు స్థానములకు భక్తుల ప్రార్థనానుసారము దయచేసి తమపూజానుష్ఠానాది కార్యములచే ఇరుపూటల అత్యుత్తమ ఆధ్యాత్మిక తత్త్వ ప్రవచనములు సలిపిరి. శ్రీవారు శ్రీచాతుర్మాస్య మహావ్రతము ఈ ప్రాంతములలో జరుపవలెనని అచటి భక్తులు భక్తిచే మరిమరి గోరిరి కాని ఇంతకు మునుసే మహావ్రతకార్యక్రమము (ఆనాడే) గుంతకల్లు భక్తులచే నిర్ధరింపబడి (ఏర్పాటయి) నందున దానికి పూజ్యశ్రీవారు మీ సంకల్పము మంచిదే శుభము ముందెపు

డైన చూచెదము గాక యని సాంత్వన వాక్యములచే సంతృప్తి పఱచిరి.

స్వస్తిశ్రీ శోభకృతు నామ సంవత్సర వైశాఖ శుద్ధ తదియ శుక్రవారము 26-4-1963 అక్షతదియ లత్తవరమున శ్రీఉమామహేశ్వర గురుపీఠ భవనమును నిర్మించుటకుగాను శంకుస్థాపనాది విధ్యుక్త కార్యములు జరిగెను. 28-4-1963 శ్రీమజ్జగద్గురు శంకర జయంతి మహోత్సవము శివప్రదముగ నడచెను. 17-5-63 శ్రీవారి పరమ గురువుల ఆరాధన విధ్యుక్తముగ నయ్యెను. 19-5-63 శ్రీగురుదేవుల జయంత్యుత్సవము వైభవోపేతముగ పూర్ణమాయెను. "ఇదం తే నాత పస్కాయ నాభక్తాయ కదాచన, నచాశుశ్రూషవే వాచ్యం నచ మాం యోఽభ్యసూయతి" యను గీతా వాక్యరీతి స్వాతికార్తె వర్ష బిందువులు ఎఱ్ఱగ కాగిన ఇనుప ముద్దపై బడినచో అచట నీటి చిహ్నమగు తడికూడ ఎట్లుండదో అటువలె అనధికారి అసంస్కారియగు నాతనికి మనము మనః పూర్వకముగ బ్రహ్మ జ్ఞానమును బోధించినను ఆతని యందాజ్ఞానము యొక్క లవము కూడా నిలువదు. చెప్పబడిన ఆ యాత్మ తత్త్వవిషయము అతని హృదయమునందు ప్రవేశముకాదని తెలియవలెను. ఇట్టి వారిని లోకమున ఎందరినో చూచు చున్నాము గదా. ఇక మరొక తెగవారు మనము పరమ సంతోషముగ ఆత్మ స్వరూప విషయమును చక్కగ నిరూపించి తెలిపినను వారి యందది కొంత దడవు మాత్రముండి అడగి పోవును, స్వాతికార్తె వర్ష బిందువు కమల పత్రముపై ముత్యమువలె దోచి జారి పడిపోవు నట్లుండును. అటువలె మధ్య తరగతి వారికి బోధింపబడిన జ్ఞానము కొంచముసేపు 'ఆ' బాగున్నదని తెలిసినట్లయి మరల మాయమై పోవును. ఇక "విద్యా తపోభ్యాం పూతాత్మా" "శమాది సహిత స్తావదభ్యసే చ్ఛ్రవణాదికం" అన్నట్లు అధికారులగు ఉత్తముల యందది స్వాతికార్తెయందు స్వాతి వర్ష బిందువు ముత్యపుచిప్ప యందు బడి ముత్యె మయినట్లు,

సంశయ రహితమై "అహం బ్రహ్మాస్మి" ఇత్యాకారకమైన దృఢాపరోక్ష జ్ఞానము కలుగునని తెలిసి శ్రద్ధచే సర్వకార్యముల యందు శుచిర్భూతులై ముముక్షువులు వర్తించ వలయును. వృత్తి భేదముచే ఉపాధి భేదముచే ఒకే ఆనందము 8 ప్రకారములుగ వర్ణింప బడినది. నిజమును, బింబభూతమునగు నిత్యానంద స్వరూపమగు ఆత్మ ఒకటే యని అది తానేయైయున్నదని యెరుగవలెను. అందుచేత బ్రహ్మవిద్య, తపస్సు లేనివానికిని, తపస్సుండినను భక్తిలేని వానికిని, భక్తి తపస్సు లుండినను పూజ్యమగు సేవాబుద్ధి లేనివానికి సేవాబుద్ధి భక్తి తపస్సు లుండియు అసూయనొందు వాతనికి ఉపదేశింప దగదు. పై చెప్పబడిన గుణములు గల భక్తునకు ఈ తత్త్వమును తెలుపుటకంటె గొప్ప మరేమియు లేదు. అతడు నిస్సంశయముగ నన్ను తన్నుగా తెలియును. ధన్యుడగును. "శ్రద్ధేయ మాత్మ జ్ఞానమ్". అను నిత్యాదిగా అనేక తాత్విక విషయములను తెలిపిరి.

మరియు ఈశంకర జయంత్యుత్సవము మొదలు శ్రీగురుదేవుల జయంత్యుత్సవము వఱకును కేవలము అనుష్ఠాన సంపన్నమయినసాధకులకు మరియు ఉత్తమ సంస్కారవంతులకు వలయు యమ నియమాది అనుష్ఠాన విధానములు, మంత్ర మంత్రార్థములను వివరించి పరమ తాత్పర్యమగు వాక్యార్థ దృష్టి నొసగిరి. ప్రసాదించిరి. ప్రబోధించిరి. అనుగ్రహించిరి. భక్తాదు లా ఉత్తమ ప్రసంగముల విని ధన్య ధన్యమని సంతసిల్లిరి.

## 19. వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1963 సం॥

గుంతకల్లు శ్రీఉమామహేశ్వరాశ్రమము నందు స్వస్తిశ్రీ శోభకృతు నామ సం॥ర ఆషాఢ శుద్ధఏకాదశి మంగళవారం 2.7.1963 ప్రతి సం॥మువలె బ్రహ్మ ముహూర్తమున విధ్యుక్తముగ పూజానుష్ఠానాది కార్యములచే మహావ్రతము ప్రారంభమై ఉదయం 9గం.కు కేనోపనిషత్ప్రవచనపూర్వకముగ మహామంగళ మంత్రపుష్పములతో

పూర్ణమాయెను. సాయంకాలము ప్రదోష పూజానంతరము 7 నుండి 8 గం॥వఱకు భగవద్గీతా శాస్త్ర ప్రవచనము, ఈవిధముగా శ్రీగురు కరుణచే అఖండితమై 2-7-63 మొదలు కార్తిక శుద్ధ॥౧౨॥28-11-63 వఱకు జరిగి సాంగమంగళముగ సమాప్తి నొందెను భక్తాదులందరితో కలసి శ్రీతిరుపతి మహాక్షేత్రమునకు దయచేసి 30-11-63 పూర్ణిమ శనివారము అచ్చట దీక్షా విరమణ యొనర్చి శ్రీ వేంకటేశ్వరస్వామి పూజలు గావించిరి. సాయంకాలము తమ వసతి యందు వాక్యార్థ ప్రసంగములు సలిపిరి.

## ఆత్మ ప్రమాణ ప్రతిపాద్యము గాదు

ప్రత్యగభిన్న పరబ్రహ్మ తత్వము ప్రత్యక్షాది ప్రమాణగోచరము కాదు "అప్రమాణ మనాదించ హేతు దృష్టాంత వర్జితం" "అనాశినోఽప్రమేయస్య......" అను నిత్యాదిగా శ్రుతిస్మృతులు తెలుపుచున్నవి. హరిత పీత రక్తాది రూపరహితమైనందున ఆత్మ (బ్రహ్మము) ప్రత్యక్ష విషయముకాదు. ఇక నేగురుతులు లేనందున అనుమానప్రమాణమునకువేద్యుడగు వాడును కాదు. తనతో సమానమగు వేరొక వస్తువు లేనందున ఉపమానమునకు విషయము కాదు. అనుపపత్తి లేనందున ఉపపత్తి నొందించు అర్థాపత్తి ప్రమాణమునకు విషయుడు కాడు. భావరూపుడై ఉపలబ్ధుడైనందున అభావముచేత అనుపలబ్ధిప్రమాణమునకువిషయుడుకాడు. వాచ్యార్థముచే గోచరము కానందున శాబ్ది (శబ్ద) ప్రమాణమునకు విషయుడు కాడు. అందుచే షట్ప్రమాణాద్య విషయుడు. మరియు పాలు చెడి పెరుగైనట్లు పరిణామియును కాడు. నిర్వికారుడై యున్నాడు. ఈ కారణముచేత ఆధ్యాత్మికాది తాపత్రయములు పొందడు. నైయాయికుల మతానుసారము బుద్ధి, సుఖదుఃఖాది 9 గుణములు సోకనివాడు కావున నిర్గుణుడై యున్నాడు. ఈ 9 గుణములు అంతఃకరణ ధర్మములై యున్నవి ఇవి అంతఃకరణ విశిష్టమగు జీవ భావమునందు తోచునవియై యున్నవి.

సాక్షి యగు ప్రత్యగాత్మ యందు తోచవు. అట్టి సాక్షి అనుభవ స్వరూపమగు ఆత్మయే తానని తెలియవలెను. ప్రమాణములన్నియు కొంతవరకు పయనించి సెలవు గైకొనును. అందునను శ్రుతి సమ్మత మగు ఉపనిషత్ప్రమాణము ఆవరణభంగము (అధ్యాస నివృత్తివరకు) పనిచేయును. సిద్ధ వస్తువు ఆత్మ, అసంగము, నిత్యము అది తానని తెలియవలెను.... " ఇత్యాదిగా ...... స్వయం ప్రకాశ స్వరూప మగు ఆత్మ తెలిసికొంటిని తెలియదు అను వాటికి సాక్షియైయున్నాడు "విదితాదవిదితాదధి" యను శ్రుతి ప్రమాణము.

సాక్షి పరబ్రహ్మ స్వరూపమే నని తెలిసిన జ్ఞానానుభవి యగు నాతనికి అజ్ఞాన నివృత్తి యైనందున సంచిత కర్మల వలన జన్మాదుల నొందడు. ఆత్మ జ్ఞానముచే సంచిత కర్మరాశి నివృత్తమైనది." అనేక జన్మ సహస్ర సంచితమపి ధర్మాధర్మాది సమూలం కర్మ క్షణమాత్రా దేవ భస్మీ కరోతి ..." అన్నట్లు సంచిత కర్మరాశి దహనమై పోయి నది. (అనగా లేనిది భ్రాంతిచే తోచినది ఆగామిరూప పుణ్యాది కర్మల మూలమున, స్వర్గాది లోకములను పొందునదియు లేదు. నిరభి మానముచే నకర్తయై యున్నాడు. అందుచే ఆగామి కర్మ ఫల మివ్వ జాలదు. పూర్ణానుభవ స్థితి యైనందువలన, లోకాంతర జన్మాంతర గమనాగమనములు లేవు. ఇక వర్తమానమునందు ప్రారబ్ధ కర్మకు సాక్షియై అసంగుడై లీలామయముగ చిన్మయముగ సర్వమును గాంచుచు,వ్యవహరించుచు, దీనిని స్వప్నమువలె చూచును. ఇది అను భవ సంపన్నమగు జ్ఞాన నిష్ఠా విషయము. అచ్చట ఏమియును లేదు. ఇట్టి మహాక్షేత్రమున అట్టిపరాస్థితిని సంభావించండి, అదియేమీరయి యున్నారు. ఓం.

మోక్షాపేక్షగల సాధకుడైన ముముక్షువునకు నీవే నిత్య సత్య మగు పరబ్రహ్మ మని అనగా త్రికాలాబాధ్య స్వరూపుడగు స్వయం ప్రకాశాత్మయని, ఆత్మయే అధ్యాసచే అవస్థలుగా తోచినదని వేద

వాక్యములు ముక్తకంఠముచే తెలుపుచున్నందున ఇందుపూర్ణ విశ్వాస ముంచవలెను. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్" అని గీతావాక్యము నిదియే తెలుపుచున్నది. వేద గురు వాక్యములయందు పూర్ణ విశ్వాస ముండదగును. లేకున్న అంతయు నిరర్థకమే. అవిశ్వాసికి తన వ్యవహారములుకూడ జరుగవు కదా! గురుశాస్త్ర విశ్వాసమను దానికి సాదృశ్య మీ జగత్తులో నగపడదు. గురుభక్తున కది విదిత మగును. ప్రమాణ శూన్యమగు కేవలయుక్తి ప్రధానమగు మతములు శాంతిని నిజానుభవము నొసగవు. భద్రము. శాస్త్ర విహితములై యుండిన అన్నియు ఆదరణీయములే మంచిదేకాని, అన్నిటిని అనుసరించి అమ్ముకుపోయి ఆత్మ, బ్రహ్మచైతన్యము నేనను దృఢప్రజ్ఞ ను కోల్పోవరాదు. క్షోభ నొందరాదు. జాగ్రత అను మొదలగు ......విషయములు తెలిపిరి.

శ్లో॥ వాంఛా సజ్జన సంగతౌ । పరగుణే ప్రీతిః । గురౌ నమ్రతా।
విద్యాయాం వ్యసనం।స్వయోషితి రతిః। లోకాపవాదా ద్భయం। భక్తిః శూలిని।
శక్తి రాత్మ దమనే। సంసర్గ ముక్తిః ఖలైః
యేతే యేషు వసంతి నిర్మల గుణాః। తేభ్యో నమః కుర్మహే॥

శ్లో॥ భిక్షార్థీ క్వప్రయాతః? స నను బలిమఖే।
తాండవం క్వాద్య భద్రే? మన్యే బృందావనాంతే।
క్వను సమృగశిశుః ? కిం వరాహో నజానే।
బాలే కచ్చిన్నదృష్టో జరఠ వృషపతిః। గోప ఏవాస్య వేత్తా॥
లీలాసంలాప ఇత్థం శ్రీజలనిధి హిమవత్కన్యయో స్త్రాయతాం వః॥

శ్లో॥ దృష్టిపూతం న్యసేత్పాదం। వస్త్రపూతం జలం పిబేత్।
సత్యపూతాం వదేద్వాచమ్। మనఃపూతం సమాచరేత్.

Tel me your friend, I will tell about you

శ్లో॥ అపూజ్యా యత్ర పూజ్యంతే పూజ్యా యత్రావమానితాః।
తత్ర త్రయో భవిష్యంతి వ్యాధి దుర్భిక్ష తస్కరాః॥

అను నీతి క్రియాచార సంపన్నములు, కావ్యాలంకార సంశోభితంబు

లగు ఉత్తమ భావములని పై శ్లోకార్థములను బోధించిరి.

## శ్రీ రమణాశ్రమము

తిరుపతినుండి అందరు శ్రీ రమణాశ్రమమునకు వెళ్ళి సందర్శించిరి. ఆ పవిత్రమగు స్థానమునందు మాటలాడుకొన్న విషయములు.

బ్రహ్మ విషయము అధ్యాత్మ ప్రబోధకము. అనుభవస్వరూపము. సర్వ దేశ కాలాదుల యందును సర్వజనులు ఈ తత్వమును తెలుసుకొనవచ్చును. అద్వయమగు పరతత్త్వ వస్తువునే ఉపనిషత్తులన్నియు ఏక ముఖమున తెలుపుచున్నవి. అనుభవ సిద్ధమైన ఆత్మ తత్త్వమును చెప్పుటచేతనే, అనగా బ్రహ్మతత్త్వమును తెలుపుట వలననే ఉపనిషత్తులు ప్రమాణములై యున్నవి. ఏతదాధారమువలననే వేదమునందు కర్మోపాసనాదులకు కూడ అస్తిత్వము వచ్చియున్నది. ఉపనిషత్తుల యందు చెప్పబడియుండు సాధనములు జీవన పరమ సాధేయములై అత్యంతోపయుక్తములై యున్నవని తాత్పర్యము.

ఆచార్య ప్రభృతులు అద్వైత తత్త్వమును నూతనముగా సృష్టించ లేదు. ఆపరమ సత్యమునే వివిధ ముఖములచే బోధించిరి. ఉపనిషత్తులయందు నిత్యసిద్ధముగా తెలుపబడిన విషయమే అదిదై యున్నది. అన్ని మతముల వారికిని సమమై పరమ, వైదిక తత్వమై యున్నదని అర్థము. ఉపనిషత్ప్రోక్తమగు బ్రహ్మ తత్వము పరోక్షమైనది కాదు. అపరోక్షమును అనుభవ రూపమైయున్నది. అధికారికి శ్రవణ సమయ కాలముననే బ్రహ్మతత్వ బుద్ధిని కలిగించును. ఇక కర్మోపాసనల విషయము, అవి పరంపరా సాధనలై అధికారికి చిత్త శుద్ధిని కలుగజేయును.

సర్వశాస్త్రముల మూలమును సర్వ విజ్ఞానములకు ఆధారమగు వేదము పురుష నిర్మితము కాదు. అది అపౌరుషేయమని అర్థము. అది అట్లు ఒక వ్యక్తి రచనాత్మకమై యుండి యుండినచో మఱొకరు ఇంకొకటిగా దానిని రచించి యుండెడివారు. పరమఋషులు తపస్సం

పన్నులై సనాతనముగనుండు ఆ వేదమంత్రములకు ద్రష్టలైరి. కానికర్తలు కాలేదు. అందుచే వేదము అపౌరుషేయమని తెలియవలయును. బ్రహ్మసూత్ర భాష్యమున శ్రీశంకరులును ఇటువలెనే తెలిపియున్నారు. ఉపనిషత్తులయందును భగవదుచ్ఛ్వాస నిశ్వాస రూపములే వేదములని తెలుపబడినది. పరంపరగా ఋషులు తపస్సుచే నెఱిగి మంత్ర ద్రష్టలైరి. కాని రచించినది కాదు. నిత్యము, శాంతము, సుఖము, ఆనందము, బ్రహ్మము అను నిత్యాదులు ఏయొక యుగమునకు గాని, దేశ కాల వస్తు సంబంధము గలవిగా కాని పరిమితము కాలేదు, సర్వకాల సర్వయుగములందును అందరికి వలయునవియై, నిజ స్వరూపమును తెలుపునవియై యున్నవి. కావున వేదము ఒకరినుండి ఒకరికి పరంపరగా వినబడుచు వచ్చినందున, పరాపరవిద్య యనియు, శ్రుతి యనియు చెప్పబడెనే కాని రచనాత్మకము గాదు.

బ్రహ్మాత్మజ్ఞానము నొందుటకు ఒక రధికారులు ఒక రనధికారులు అనున దేమియును లేదు. వైదిక కర్మాచరణకు అట్టి నియమము లుండును. పరమసత్యమగు బ్రహ్మవిద్యకు ఈశ్వరానుగ్రహము శమ దమాది గుణ సంపత్తి, శీలము, బ్రహ్మచర్యము చక్కగ నుండిన చాలు. ఇవియును వైదికములే యని శ్రీ శంకరాచార్యులు తెలిపియున్నారు. మఱియు ఇట్టి బ్రహ్మ విద్యాధికారము ఈ జన్మయందే ఇపుడే పొంది అధికారియై బ్రహ్మస్థితిని పొంద వలయునను నియమమును లేదు. జన్మాంతర సాధనానుష్ఠాన తపఃఫలముచేత అధికారులై ఆత్మజ్ఞానమును పొందవచ్చు ననియును శ్రుతి చెప్పుచున్నది. అర్థాత్ జ్ఞానమును తగు యోగ్యతను శ్రద్ధచే అందఱు పొందుటకు అర్హులే యని భావము.

బ్రహ్మత్వము స్వయం సిద్ధమగు నిత్యప్రాప్తమే కాని సాధనాంతరములచే ప్రాప్తమగునది కాదు. అది మన నిజ స్వరూపమై యున్నదని ముముక్షువులు తెలియ వలయును. సాధన లెల్లయు చిత్తశుద్ధి

వఱకు అత్యంత ఉపయుక్తములు జ్ఞానోదయానంతరము అవి శెలవు గైకొనును. అనగా సహజ మగును. "శమాది సహిత స్తావదభ్యసే చ్ఛ్రవణాదికం" అనునట్లు శమదమాది సద్గుణాన్వితుడగు వానికి వేదాంత వాక్యశ్రవణము చేతనే తత్త్వజ్ఞానము కలుగును.

చిత్తశుద్ధి యగునంతవరకు స్వస్వరూప విషయకమగు జ్ఞానము కలుగదు. వేదవిహితమైన కర్మలను నిష్కామముగా అనుష్ఠించుచు, సద్గురు సన్నిధికి వచ్చిన వెంటనే తన స్వరూప బోధ యగును. కాబట్టి నిత్యానుష్ఠాన ధర్మములను ముముక్షువులు శ్రద్ధతో నాచరించ వలయు నని భావము. కామ, రాగ, ద్వేష, క్రోధాదులచే చిత్తమావృతమై నందున పరమాత్మ స్వరూపమే అగు ఆత్మ మరి ఏదియో అయినట్లు తోచు చుండును. అను నీ ప్రకారముగ నపూర్వ విషయములను బోధించిరి.

శోభకృతు నామ సం॥ర కార్తిక బహుళ దశమి మొదలు ద్వాదశి వఱకు 10-12-63 నుండి 12-12-63 వఱకు మూడుదినములు ప్రతి సం॥ వలె శ్రీవారి శ్రీగురుదేవుల పుణ్యారాధన మహోత్సవము జరిగెను. మహాత్ములందరు యథా సమయమునకు దయచేసి యుండిరి. సర్వమును సుసంపన్నముగ నడచెను. అనంతరము ఉరవకొండలో శ్రీ గీతా జయంత్యుత్సవము విధ్యుక్తముగ జరిపి పెన్నహోబిల క్షేత్రము సందర్శించి తదుపరి శ్రీవారు నంద్యాల శ్రీఉమామహేశ్వరాశ్రమము దయచేసి "సిద్ధాన్తబిందు" సూతసంహిత, యజ్ఞవైభవ ఖండము వాక్యార్థ ప్రవచనములచే బ్రహ్మనిష్ఠ నుండిరి. కొందరు సద్భక్తుల భావనానుసారము ఉత్తమవిషయములను ప్రత్యేకముగ విదితపఱచిరి.

సంకల్ప వికల్పాత్మకమగు మనోవృత్తులు వాగాది ఇంద్రియముల ద్వారా మాటలాడుట, కనుట వినుట మొదలగు పనుల నాచరించి నన్ను, ఆ ఇంద్రియ వృత్తులు చైతన్యవంతములు కావు. చేతనమే ఆ సర్వ వాగాది వృత్తుల ఉపాధి మూలమున గోచరించును. అట్టి యా

చైతన్యమే (పరబ్రహ్మమే) వేదశబ్దమునకు లక్ష్యార్థమైయుండి ఆత్మ స్వరూపము నిత్యమై యున్నది. తక్కినవి ఆత్మతత్త్వమును తెలుప జాలవు. వేదము ఆత్మ బ్రహ్మమే యని తెలుపుచు మూకీ భావము వహించును.

శ్రుతి యందు చెప్పబడు కొన్ని కథలు దేశకాలములకు సంబంధించినవి కదా, వేదోపనిషత్ తత్త్వ ప్రసంగముల యందు ఈ కథ లేమిటి యనిన, ఈ కథలయొక్క తాత్పర్యము ఆ యా సందర్భము తత్తద్విషయములను బోధించుట కొఱకై మంత్రము శ్రుతి ఇట్లు కల్పించినది కాని, వేద సత్య నిత్యమగు బ్రహ్మమునకు సంబంధించినవి కావు. ఇంత మాత్రమున వేదము ఒక దేశ కాలమునకు కట్టువడినది అని ముముక్షువులు గ్రహించరాదు. ఎట్లన భగవద్గీతా తత్త్వశాస్త్ర మునందలి విషయములు కేవల నిత్యసత్య సనాతనమైన బ్రహ్మ తత్త్వ ప్రతిపాదకములే కాని అది అప్పటి నూతన విషయమని గ్రహింప రాదు. గీత శ్రీకృష్ణార్జున సంవాదే అను నీ మొదలగు మహాభారత కథా సందర్భ పురస్కృతమై యుండి ఆయా పాత్రలను చూపును. మరియు ఉపనిషత్తుల యందు యాజ్ఞవల్క్య, మైత్రేయి, జనక, అశ్వ పతి, కేకయ, జైవలి ప్రవాహణ, సత్యకామ, శ్వేతకేతు, ఉద్దాలక, భృగు, వరుణ అను నిత్యాది కథలు నుదహరించి చెప్పుచున్నను, వస్తు తత్త్వము ఆదేశకాలమునకు సంబంధించినదని చెప్పరాదు. అది సనాత నము సుబోధార్థమై పరస్పరము ఆ యా రూపమున సంవాదమును చూపుచు నుల్లేఖింప బడినదని గ్రహించ వలెను.

స్వామీ ! వేదాధికారము లేనివారికి పరమార్థతత్త్వనిష్ఠ కలు గునా ? కలుగును-అట్టి వారెందరో యున్నారు. ఆత్మజ్ఞానము నెవ రైనను పొందవచ్చును. బ్రహ్మసూత్రముల యందు ఈ విషయము వివరింపబడి యున్నది. మరియు "స్త్రియో వైశ్యా స్తథా శూద్రా ..."అని గీత యందును చెప్పబడి యున్నది. శ్రుత్యర్థమును అత్యంత

శ్రద్ధాభక్తులచే మహనీయులగు పూజ్యుల ముఖమున ఇతిహాసపురాణ ముల ద్వారా శ్రవణ మొనర్చి ఆత్మానుభవము పొందవచ్చునని తెలియ వలయును.

వేదచోదితమగు కర్మోపాసనలు, కామ యుక్తులైన వారికి తత్ఫలములను చెప్పి, నిషిద్ధ కర్మలు సుతరాం త్యాజ్యమనియు శాస్త్రీయమగు సత్కర్మల నాచరింప జేయుచు చిత్తమును ఈశ్వరాభి ముఖ మొనర్చి నిష్కామ వంతులునుగా జేసి చిత్త పారిశుద్ధ్యమును ఏకాగ్రతను, ఆ మూలమున ఆత్మధ్యానమునకు నలయు అధికారము, వేద చోదితమగు, సత్కర్మానుష్ఠానముచే కలుగు ననుటయందు సందియము లేదు.

సన్న్యాసము తురీయాశ్రమము వేదసమ్మతమేనా కాదా యనిన ఇది వేద సమ్మతమే, సంస్కార హీనులకు ఆచార హీనులకు ఇది సాధ్యముకాదు. కలి బాహ్యము అని చెప్పబడినను ఆచార విచార సంపన్నులై ఆత్మజ్ఞానముచే సర్వాత్మభావము నొందినవారికి, బ్రహ్మాను సంధానముచే అజ్ఞాన తత్కార్యాధ్యాస నివృత్తి యగును. కాన జ్ఞానికి పారమహంస్యము పరమార్థ సన్న్యాసము విధ్యుక్తమే. ఇంద్రియ విషయ లాలసులకు మాత్రమిది సాధ్యము కాదనుమాట నిక్కము. జన్మాంతర తపఃఫలమును నేటి గురుదైవభక్తి ఆత్మజ్ఞానము శీలము గలవారై, ఈషణా త్యాగులై, లోక వ్యవహారదూరులై, జ్ఞాన నిష్ఠకై జీవనమును అంకిత మొనర్చిన ఆశ్రమ సన్న్యాసము, శ్రుతి సమ్మతమను మాటయందు సందియము లేదు. సుప్రసిద్ధము. ఇది అపూర్వము. మహానిష్కామ తపఃఫలము. ఈతని కుండు ఆనందము శాంతి అనునది లోక విలక్షణమును బ్రహ్మానుభవ సంపన్నము నైనపరాస్థితి ఇది అనుభవము. మఱియు గృహస్థులు కూడ ఆశ్రమస్వీకార మొన ర్చిన పుణ్యాత్ము లున్నారు. అది జ్ఞానప్రధానము, సంపూజ్యమే నని ఎఱుగ వలయును.

యోగమనగా గీతా శాస్త్రమునందు వివేక జ్ఞానమనియు, ఆత్మ జ్ఞాననిష్ఠ యనియు, నిష్కామ కర్మానుష్ఠాన మనియు అద్వితీయమగు పరమాత్మ అఘటన ఘటనా పటీయసి యగు తన మాయచే జగద్రూపమున తోచుట యనియు, ఇత్యాదిగా చెప్పబడి యున్నది. నిష్కామ కర్మ ధ్యాన యోగములు జ్ఞాననిష్ఠకు పరంపరా సాధనములైనందున దీనినికూడ యోగమనియే పిలుతురు. ఈధ్యాన యోగమే సమాధి యోగ మనియు, స్వస్వరూపానుభవముచే మనస్సుఅమనస్సయిపోవుట యను నీ అర్థములచే చెప్పబడియున్నది. మఱియు సమాధి యనగ బుద్ధియొక్క కృతనిశ్చయ మనియు, ఆత్మయనియు, ఆత్మజ్ఞాననిష్ఠ యనియు, ఆత్మస్వరూప మనియును కూడా అర్థము. విధ్యుక్తమగు ఆత్మానాత్మ విచార పద్ధతిని సాంఖ్య మందురు. అనుభవ మూలమున విచార క్రమమై యున్నదనియును తెలియవలెను.

అగపడు నదియును, అగపడనిదియు నగు ఈ (వ్యక్త అవ్యక్త) ప్రపంచము ఆత్మయందు అధ్యారోపింపబడినది. స్వతంత్రము కాదు. నిజముగా ఆత్మయందు లేదు. అనిర్వచనీయమైయున్నది. ఉపాధి వలననే ఆత్మకు ఈశ్వరుడని నామము వచ్చెను. ఆత్మచిద్రూపుడు, అసంగుడు. ఆత్మానాత్మల అన్యోన్యాధ్యాసయే బంధము. వివేకముచే మోక్షము అను నిత్యాది విషయములు శ్రుతి సమ్మతములు, ఇక ప్రకృతియే సత్యము, పురుషు లనేకులు, కర్మ సంపూర్ణ త్యాజ్యము అను నిత్యాదులు శ్రుతి సమ్మతములుగాని మంతాంతరుల పద్ధతులని యెరుగవలెను.

మిథ్యా జ్ఞానము బంధమునకు కారణమని తొమ్మిది తత్త్వముల యథార్థ జ్ఞానముచే మోక్షము వాటిల్లునని, న్యాయ వైశేషికుల మతము, మిథ్యా జ్ఞానము బంధ కారణమను నంతవఱకు మాత్రము ఆమోదనీయము. తక్కినది అప్రస్తుతము. జైన సిద్ధాంత మతము (అర్హాత మతము) ఏదొకటి నిర్ణయించి చెప్పదు కావున అట్లును కావ

చ్చును ఇట్లును కావచ్చును అని ద్వంద్వముగ చెప్పుచున్నందున ఈ అణుపరమాణు సంఘాత సంయోగాత్మక మగు మతము ముముక్షువులకు అవసరము లేదు. ఇక దేహమే ఆత్మ యనువారి మతము సంబంధమే లేదు. సమ్మతము కాదు.

ఒక స్థితియందు శాస్త్ర ప్రవచన రీతి శ్రద్ధా భావనలుండును. ప్రత్యగభిన్నాపరోక్ష జ్ఞాన స్థితియందు శాస్త్రాచార్యోపదేశరీతి అనుభవము నొందినపుడును సహజమగు శ్రద్ధా భక్తులుండును. స్వరూపము నందలి నిరతిశయ ప్రేమ, అనుసంధానమునే భక్తి యనియు కూడ బిలుతురు. శ్రుతి సమ్మతమగు అద్వైత తత్వ శాస్త్రము నందు నిష్కామ కర్మ, భక్తి, జ్ఞాన, వైరాగ్యములు ప్రత్యగాత్మ పరమాత్మయే యను నిత్య నిరతిశయమైన సత్య విషయములు- తత్త్వశాస్త్రముల యందు నిండుగ నుండును. ఆత్మజ్ఞానమనిన కేవలము మాటలు మాత్రమే కాదు. బుద్ధి కల్పితంబగు తర్కమును గాదు. "ఇంద్రియాణి పరాణ్యాహు, రింద్రియేభ్యః పరం మనః మనసస్తు పరాబుద్ధి, ర్యోబుద్ధేః పరతస్తు సః" అన్నట్లు బుద్ధి ఆగినచోటు నుండు పరాస్థితి, అది ఆలోచనా పూర్వకమైన తర్కమును, భావనా మాత్రమును కాదు. నిజమగు తాత్వికదృష్టితో కూడిన సహజస్థితి. సన్మాత్రమగు బ్రహ్మమే తానయియుండుట యని అర్థము.

వేద సమ్మతముగ దేవతలు సూక్ష్మ కార్య కారణములు గలవారు. వారు విగ్రహ రూపముల నుందురు. దేవతల యందు ఇంద్రాగ్న్యాది దేవతలు ఉత్తములు. పుణ్యాత్ములా చోటుకు వెళ్ళుదురని ఆచార్య ప్రభృతులు ఉపనిషత్తుల మూలమున బోధించి యున్నారు. సకాములై దేవతల నారాధించిన దృష్టాదృష్ట ఫలములనొసగుదురు. నిష్కాములై పొరబడక ముముక్షువులు దైవము నారాధింప, మోక్షము నొంద సమర్థంబగు శ్రద్ధాదులును, సద్గురు ప్రాప్తిని ఆదైవము తప్పక ప్రసాదించును. ఉపనిషత్తుల యందు ఈవిషయము స్పష

ముగ తెలుపబడి యున్నది. శ్రీశంకరులు భాష్యము నందును తెలిపి యున్నారు. వ్యవహార దృష్టిచే దైవాస్తిత్వము, స్వర్గ నరక వర్ణాశ్రమాద్యస్తిత్వమును అంగీకరింప వలసి వచ్చును. పుణ్యపాపాది కర్మలును, శాస్త్రరీతి అంగీకరించి ప్రజలను సన్మార్గ గాములనుగ జేయుట ఉద్దేశ్యమైయున్నది. ఇక వస్తు దృష్టిచే అనగా పరమార్థ దృష్టిచే ఇవన్నియు లేనివేయైనను, మఱొక దృష్టిచే లేదని మాత్రము చెప్పటకు రాదు. మానవులు దేవతలకు వశులై కర్మ క్రమము ననుసరించి ఋణగ్రస్తులై యున్నారని శాస్త్రము చెప్పుచున్నది. అనగా నేత్రాది ఇంద్రియములచే విషయముల ననుభవించు ఆసక్తిపరులై యున్నారని అర్థము. కాబట్టి ఇట్టి వీరు బ్రహ్మవిద్యను పొందినచో ఆత్మానుభవము నొంది ధన్యులై పోవుదురు. కావున ఈ కారణమును బట్టి మానవుడు బ్రహ్మవిద్య నొందవలయు ననిన, ఇంద్రాది దేవతలు విఘ్న మొనర్తురు అను మాటయు ప్రమాణ యుక్తమే. కాబట్టి ఇంద్రియ సంయమము. ఉత్తమమగు గురుదైవ భక్తి గలవారై ప్రత్యగాత్మ పరమాత్మయే యను ధీరోదారమైన బుద్ధిచే ఆత్మజ్ఞానార్థమై యత్నించిన అతనికిక ఇంద్రాది దేవతలు విఘ్నము చేయలేరు. వారికిని ఇతడే ఆత్మ. కావున నేమిచేయరు. అర్థాత్ నిష్కామ బుద్ధి, నిర్గుణోపాసన, తత్త్వమసి మహా వాక్యార్థ శ్రవణము ఉన్నచో వారికడకు ఏవిఘ్నములు, ఏవిఘ్నేశ్వరులు ఏ దేవతలు అడ్డురారు. తన పరిశుద్ధమగు విచార సంజనితమగు బుద్ధిచే బ్రహ్మమే నేనను అనుభవము కలుగును. బ్రహ్మము సాధకుని ఆత్మయేయై యున్నది. బ్రహ్మవిద్యా ఫలమనిన బ్రహ్మానుభవమే. బ్రహ్మవిద్యా ప్రాప్తేచ్ఛ గల ముముక్షువు దేవతాభక్తి భావనలతో నున్నచో ఈ దేవతల యొక్క యెట్టి ప్రతిబంధములును లేక తత్వమును తెలియ నర్హుడగును. ఇవియును శ్రుతి ప్రోక్తములయిన విషయములని తెలియ వలయును.

"న హి జ్ఞానేన సదృశం" అన్నట్లు జ్ఞానమునకు సమానమైన

వస్తువు లోకము నందెచ్చటను దొరకుదు. శాస్త్రములను గాలించినను దొరకదు. అది నిష్కామ కర్మ, తద్వారా అంతఃకరణ శుద్ధి నొందిన అధికారుల అనుభవ రూపమగు ప్రత్యగభిన్న పరమాత్మయై విరాజిల్లును, లోకమునందు జ్ఞానమున కంటె పవిత్ర మొసర్చు పదార్థము మరొకటి లేదు. కాని "న సాంపరాయః ప్రతిభాతి బాలం" అనునట్లు విషయాసక్తులకు వేద్యము కానిది. విషయ వినిర్ముక్తుల వారికి నిత్య ప్రాప్తమయి యున్నది. ఏ ప్రాయశ్చిత్తాది కర్మలచేతను తన యజ్ఞానము దూరముకాదు. తత్వజ్ఞాన మాత్రమునసే అది లేనిదగును.జ్ఞానమన్న వెంటనే మనస్సు వికసించును. బుద్ధి విశాలమగును. శీలము అనునది గోచరించును. శాంతి భానమగును. ఆత్మజ్ఞానమే సర్వశక్తుల కేంద్రస్థానము. యశో నిదానము, ఆత్మజ్ఞానముచే కాని కార్యమేదియును లేదు. దొరకని వస్తువుండదు. అందుచే జ్ఞానికి ఏ కొఅతయు ఉండదు. ఇది అనుభవ సిద్ధము ఇక దీనికి వ్యతిరేకమగు అజ్ఞానమన్న దుఃఖముల పుట్టినిల్లు, అశాంతికి ఆదరమగు నిలయము, దౌర్బల్యమునకు దుస్సహవాసములకు కారణము, అపజయమునకు దరిద్రతకు స్థానము, భయములకు కేంద్రము. అందుచేత అజ్ఞానమును, అతత్త్వబుద్ధిని ముముక్షువులు దరిచేరనీయక ఆత్మానుసంధాన సంపన్నులై యుండవలయును. ధైర్యము జన్మ సిద్ధమగు హక్కు, భయభ్రాంతులు కాదు. శాంతియే నీ నిజమగు సంపద. చంచలత్వము లేని నిశ్చల స్థితిచే నిష్ఠనుండుము. శ్రుతి వేయి తల్లిదండ్రులంతటి, పరమ వాత్సల్యముచే నీకు బోధించు చున్నది. నిజము నెరిగి ధన్యుడవగుము.

స్వార్థత్యాగ యుక్తమైన సేవ, భక్తి భావోపేతమైన అర్చన మనోనిశ్చలత, చిత్తైకాగ్రతచే చేయు ధ్యానము నిజ వికాసమునకు బ్రహ్మజ్ఞానము నొందుటకు ముఖ్యమగు సాధనములు. నేను దేహ మనోబుద్ధి ఇంద్రియాదులు కాను, నామరూప రహిత జన్మ జరా మరణవ్యాధి రహిత నిత్య శుద్ధ బుద్ధవస్తువగు తత్పద లక్ష్యమైన

బ్రహ్మమేనని తెలియుడి. గురువాక్కుడే శరణ్యమని అతడే తల్లియు తండ్రియుదైవమని మనస్సు నియమించి, కామ్య దృష్టి లేక మోక్ష మార్గమున నడచిన కృతకృత్యు లగుదురు.

నీవు మాటలాడుటకు వాడుచున్న భాష భాషకాదు. దాని కంటె పరమైన భాష ఉన్నది. దానిని పరాభాష యందురు. అదే సూత్రధారి తెరచాటున నుండి పాత్రల నభినయింప జేసినట్లు సర్వము నకు విలక్షణమై, సర్వప్రకాశకమై అనుస్యూతమై వెలయుసాక్షి, పర మాత్మ యని తెలియవలయును.

27-1-64 శ్రీగురుదేవాశ్రమము వార్షికోత్సవమునకుశ్రీవారు గూళపాళ్యం దయచేసిరి. కార్యక్రమము ఆనందముగ జరిగెను. ఆత్మ బ్రహ్మము అను విషయమున కొందరు భక్తులు చక్కగనుపన్యసించిరి శ్రీగురుదేవాశ్రమమున శ్రీవారు నిష్ఠచేనుండుచు శ్రీశంకరాచార్యుల కృతి శ్రీసద్గురు పాదుకాస్తవమును శ్రీదక్షిణామూర్తి స్తోత్రమును, శాస్తిమంత్రములను ఆంధ్రమున ననువదించిరి. శ్రీగురుపాదుకాస్తవ మును గురించి అనుదినము విపులమగు ప్రవచనము గావించిరి.

ఈశ్వర ప్రణిధానాత్మకమగు భక్తి, శ్రుతిసమ్మతమే. భగవం తుడే అందరి ఆత్మరూపమున నున్నాడనునదియును విహితమే క్రమ ముగా ఈ భావములచేత అద్వైతానుభవమును పొందవచ్చును. నేను సహిత సర్వము నారాయణ మయమే అని ప్రహ్లాదు డన్నట్లు ఇదొక భక్తి. మాయామేయమగు ఈ ప్రపంచ మనునది లయమును కాదు. ధ్వంసమును కాదు. నాశమును కాదు అట్లుచేయుట కొఱకై యత్నించు ఆతని స్వరూపమే అయియున్నది. పరబ్రహ్మము. కాబట్టి ప్రపంచ మవిద్యాకల్పితము. కావున యథార్థ జ్ఞానముచేతనే ఇది బాధితమగును. అనగా అతద్బుద్ధి తొలగి జ్ఞానమగును. ప్రపంచ విల యము, నాశనమను నిత్యాదులు శ్రుతి సమ్మతములు కావు. ఇది బాధితాను వృత్తి ద్వారా లేనిదని ఎఱుగవలయును. అనగా అప

రోక్ష మిథ్యానిశ్చయము, తత్వజ్ఞాన, వాసనాక్షయము మనోనాశము లనునవి ఒకటియే అనగా జ్ఞానమైన వెంటనే మనోనాశ, వాసనాక్షయము లైనవని తెలియవలయును.

ఆత్మజ్ఞాన మయిన వెంటనే అనాత్మత్వము లేనిదై పోవును. సహజముగ ఆత్మ (తాను) బ్రహ్మమే యను నిష్ఠ గలుగ కర్తృత్వమే లేనపుడు "ఆవృత్తి రసకృపదేశాత్" అను ప్రసంఖ్యాన ప్రక్రియ సారె సారెకు ఆవృత్తి చేయవలయు ననునది, మందాధికారులగు ముముక్షువులకు ఒక్కసారిగా ప్రత్యగభిన్న పరమాత్మ నేనను జ్ఞానముదృఢముగా అనుభవము కలుగనిచో మఱల మఱల దానినే శ్రవణముచేయుమని, ఆవృత్తిరూప ప్రసంఖ్యానము చెప్పబడినదే కాని జ్ఞానానుభవికి కాదు. ఇచట ప్రసంఖ్యానమన ఇతరమగు కర్మోపాసనయని అర్థము కాదు. మరల మరల మహావాక్యోపదేశ శ్రవణ మననాద్యనుష్ఠానములేకాని, అన్యము కాదని తెలియవలెను.

"మోక్ష సాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అను వివేకచూడామణి వాక్యరీతి, భక్తి శ్రద్ధలచే కూడి శాస్త్ర సమ్మతమును, పూజ్యములునగు విషయముల ననుసంధించుచు ఏకాగ్ర చిత్తముచే ప్రత్యగాత్మ పరమాత్మయే యను అత్యుత్తమ భావన,స్వస్వరూపానుసంధానము భక్తి యనబఱగును. భక్తి పరాకాష్ఠ జ్ఞానమే ననియు, వివేకప్రజ్ఞ యనియు, పరాభక్తి యనియు కూడ బ్రహ్మసూత్రముల యందు, భగవద్గీత యందు ప్రతిపాదింప బడినది. ముముక్షువులు అనన్యమైన ఈ ఉత్తమ భక్తి గలిగి అనుసంధానము జేయుచుండ వలయును. శ్రద్ధలేనిచో జ్ఞానము కలుగదు. జ్ఞానము లేనిచో నిజమగు శ్రద్ధయు ఉదయించదు. అందుచేత నిచట భక్తి శ్రద్ధా భావనలుఎంతయును అత్యంతావశ్యకములు.

శ్రీశోభకృతు నామ సం॥ర మహాశివరాత్రి పర్వ దినమునకు, గుంతకల్లు శ్రీ ఉమామహేశ్వరాశ్రమమునకు దయచేసి శ్రీవారు

రచించిన (అనువదించిన) మహోపనిషత్తు గ్రంథమును పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శుద్ధచైతన్య స్వాములవారిచే ఆవిష్కరింప జేసిరి. శ్రీ ఉమామహేశ్వరులకు, శ్రీచంద్రమౌళీశ్వరునకు శ్రీరుద్రాభిషేక పూజలు జరిపిరి. శ్రీశివపంచాక్షరీ మహా మంత్రార్థమును దెలుపుచు మహోపనిషత్ప్రవచనములను క్రమముగ జరుపుచు నైమిత్తికముగ గురునిష్ఠా గరిష్ఠులై. శాస్త్రప్రవచన సమయముల దప్ప ఇతరసమయ ములందు సంపూర్ణముగ మౌనము. అపక్వాహార వ్రతమును తమ సహజనిష్ఠచే నాచరించిరి. 30-3-64 ఈ మహావ్రతము (శ్రీగురు వ్రతము) పూర్ణమాయెను. ఓం.

8-4-64 గుత్తి డి.వి. నాగమాణిక్యంగారు, మొదలగు భక్తుల ప్రార్థనానుసారము శ్రీవారు గుత్తి శ్రీకన్యకాపరమేశ్వరి ఆలయము నకు దయచేసి విధ్యుక్తముగ తమ పూజానుష్ఠానములచే రెండు పూటలు ఉపనిషద్ గీతా ప్రవచనములు జేసిరి.

"నాన్యః పంథా విద్యతేయనాయ" యన్నట్లు పరబ్రహ్మ స్వరూపమును తెలియుటకు వేఱు మార్గములేదు. శ్రుతి గురువుల నాశ్రయించియే తెలియవలెను.

నిత్యానిత్య వస్తు వివేక మనగా :- నిత్యమగు ఆత్మ స్వరూపమును, అనిత్యమగు అనాత్మ వెలుపలి విషయ స్వరూపములను చక్కగ విచ రించి తెలుసుకొనుట. ఈ మూలమున ఆత్మసత్యమనియు, అనాత్మ అసత్యమనియు గోచరమగును.

ఇహాముత్రార్థ ఫలభోగ విరాగ మనగా :- ఈలోకము మఱియుపర లోక సుఖముల యందు ఆసక్తి లేక యుండుట, ఆత్మ నిత్యత్వమున అభిరతి.

శమాది షట్క సంపత్తి అనగా :- అందులో శమము మనోనిగ్ర హము, (అంతరింద్రియ నిగ్రహము). దమమన జ్ఞాన కర్మేంద్రియ బాహ్యేంద్రియ నిగ్రహము.

ఉపరతి యనగా :- లౌకిక కర్మకలాపముల యొక్క గడిబిడి లేక శాంతుడై నిష్కామముగ నుండుట.

తితిక్ష యనగా :- సుఖ దుఃఖాది ద్వంద్వములను సమబుద్ధితో సహించుట. (అసంగముగ నుండుట).

శ్రద్ధ యనగా :- గురు వేదాంత శాస్త్రముల యందు అత్యంతాదర యుక్తమైన విశ్వాసము.

సమాధాన మనగా :- మనస్సు తల్లట మొందక సమాహితమై యుండుట.

ముముక్షుత్వ మనగా :- మోక్ష విషయకమగు ఉత్కంఠేచ్ఛ. ఇట్టి నాలుగు సత్యమగు గుణసంపద గలవారికి నిజమగు చిత్తశుద్ధియై తత్వమును యథార్థముగ నెఱుగు శక్తి కలుగును. ఇవన్నియును గురు వేదాంత శాస్త్రముల యందుండు పరమ శ్రద్ధయందు అంతర్గతములై యున్నవనిన అతిశయోక్తి కాదు.

"పుట్టని చావని త్రోవ వెదకుట దొడ్డబుద్ధియన్నట్లు" ఎటులనో పుట్టుక యనునది జరిగినది. ఇక మఱల పుట్టుట జచ్చుట యనునది ఉండని ఆత్మవిద్యను ఇదే జన్మయందు పొందవలెను. నిజమునకు చచ్చునది దేహమే కాని ఆత్మకాదు. జ్ఞానోదయము కాగా మృత్యుభయము లేదు, మరణించుటయు లేదు. కావున పుట్టుకయును లేదు. జ్ఞానియొక్క ప్రాణములు (అసువులు) ఇచటనే కరిగిపోవును. ఉత్క్రమణ మొందదు.

"ఆత్మవిత్ చ్ఛోకం తరతి" ఆత్మనెరిగిన అతడు శోకమునొందడు. జ్ఞానముచే మోక్షము నొందును. బ్రహ్మము మేయ పదార్థము కాదు. ప్రత్యగాత్మ యనబడు సాక్షి చైతన్యాత్మత్వము తన స్వరూప మే! తానే!

తత్త్వమసి యను మహావాక్యము నీవా పరమాత్మవైయున్నావని వర్తమాన కాలమును చక్కగ తెలుపుచున్నది. ఒక్క వర్త

మానమే భూత భవిష్యత్తు లయినవి. అందుచే నిత్యాపరోక్షమగు ఈ సాక్షివ్యాపకమగు పరమాత్మయే యనుట యందు సంశయము లేదు.

కన్ను రూపమును గాంచును. దానిని గాంచునది మనస్సు. మనస్సుకంటెను బుద్ధి, దానికి లోపల వెళ్ళి విచారించిన సాక్షిచైతన్యము దృక్కై యున్నది. ఆ దృక్కునకు మరొక దృక్కు లేదు. అదియే ఈ సమస్తమై భాసిల్లునని ఎఱుగవలయును. "యో బుద్ధేః పరతస్తు సః"

సర్వము బ్రహ్మమే అయినను అనగా పరమాత్మయే అయినను, సజ్జనులగు సాధకులకు బహిః ప్రవృత్తి అధికమైనచో అనర్థము వాటిల్లును. కావున వెలుపలి దృష్టిని తక్కువగ జేసికొని ప్రాకృత జన సంసర్గమును వీడి ఇంద్రియ వ్యవహారములను నియమించినచో శాంతి కలుగును.

భక్తిచే తన్నెవరు జపింతురో వారిని త్రాణనము చేయునది గాయత్రి అనగా వేదమాత ఉద్ధరించునది గాయత్రి. మాతృస్థానము నందుండునని వేదములలో చెప్పబడినది. కాని ఆ పవిత్ర మంత్రశక్తి క్రుంగిపోవనట్లు మనోవాక్కాయములు పరిశుద్ధముగ నుంచుకొనవలయునని తాత్పర్యము. అశుద్ధపదార్థముల సేవనము చేతను, అశుద్ధ సంకల్పముచేతను ఉత్తమ శక్తి సన్నగిలి నట్లగును.అందుచే పూర్వీకులు ఇప్పుడునుకూడ ఆచారము, స్నాన, సంధ్య, జపతపాదులు, మడుగు, శీలము మొదలగు వాటిని పాటించుచున్నారు. ఆత్మజ్ఞానము సచ్ఛీల సంభరితమగు అనుష్ఠానము లేనిచో శోభిల్లదు శాంతినివ్వదు. త్రికాలములయందైనను నియమముగా నుపాసించుట చాల మంచిది. ఈ గాయత్రి, సావిత్రి సరస్వతి యను రూపములతో నున్నది. ఉదయము విష్ణు ప్రధానము, మధ్యాహ్నము బ్రహ్మప్రధానము. సాయంకాలము శివ ప్రధానము. అందువలన త్రిసంధ్య చేయుట మంచిది. ముఖ్యముగ గాయత్రి యన ప్రత్యగాత్మ యగు పరబ్రహ్మమే.

భారతావనియందు పూజ్యమహిళలు సీత, సావిత్రి అనసూయ దమయంతి, బృంద, ఇత్యాది పూజ్యనామములచే దనరుచు, జగద్ధిత మహాకార్యములయందు లజ్జాభరణభూషితలై తత్కీర్తిగడించిన మహా తల్లులు నేటికిని ఉన్నారు. అట్టివారి చలువచే నేటికిని ఇంకను కొంచ ముగ భారతభూమి యందు సత్యము మిగిలియున్నది. స్త్రీలు తమ భర్తలను మైనీడవలె అనుసరించ వలెనని యున్నది. పతియే పరమేశ్వ రుడను భావన యుండవలెను. అవివాహిత సమయమున పరమాత్మయే భర్తయని భావించి, తల్లిదండ్రుల మరి పెద్దలగు వారి యధీనమున నుండి, విద్యా వినయ శీల సంపన్నులై యుండవలెను. "వైరాగ్య నిధి శ్రీ అక్క మహాదేవి యను బ్రహ్మచారిణి" "సావిల్లద గండనన్ను మదువెయాద నవ్వా" యని పలికి, పరమేశ్వరునేభర్తగ తన స్వామిగ తెలిసి భజించి ధన్యురాలయినది. అటువలె వివాహి తలు భర్తకంటె భగవంతుడు లేడని తెలిసివర్తించుట భారతీయ సంస్కృతి యొక్క పవిత్రసందేశము. స్కాందపురాణము నందుశ్రీ శివరాత్రి మహిమను వర్ణించు కథలో (పశు) జంతువుల మూలమున మహిళల మాన్యత సదాచారములు తెలుపబడి యున్నవి. మనుస్మృ తిని ప్రమాణముగ గైకొని "మాన్యమహిళలు" అను నీ ఉత్తమ విష యములను చక్కగ వివరించిరి.

పూర్ణానుభవి యగు నాతనికి అశాంతి అలజడులు కలుగవు. బ్రహ్మజ్ఞులు తమ ప్రసన్నతను కోల్పోరు. అనాత్మ విషయలంపట అంతశ్శక్తిని నశింపజేయును.

శ్రీవారు గుత్తినుండి గుంతకల్లు శ్రీఉమామహేశ్వరాశ్రమము దయచేసి 24-4-64 కు లత్తవరం శ్రీఉమామహేశ్వరాశ్రమమునకు శ్రీశంకరజయంతి కార్యక్రమమునకై వేంచేసిరి. ఇచ్చట "జ్ఞానసుధ" యను ప్రకరణ గ్రంథార్థములను శ్రవణముగావించిరి. శ్రీక్రోధినామ సం॥ర వైశాఖ శుద్ధ పాడ్యమి మొదలైన, శ్రీజగద్గురుశంకరజయంతి

మహోత్సవమున శ్రీశాంకర గీతాభాష్య శ్రవణము శ్రీజగద్గురు శంకరచరిత్రను సాంగముగ నియమ వ్రతముచే నడపుచు 16-5-64 శ్రీశంకరజయంతి ఉత్సవము విశేషమగు పూజానుష్ఠానములచే జరిపి ఇచ్చటనే ప్రశాంతముగ నిజనిష్ఠ నుండుచు ప్రాతః సంధ్యాకాలముల యందు పై జెప్పబడిన గ్రంథ ప్రసంగములను శ్రవణము గావించిరి. ప్రత్యేకముగ మనుధర్మశాస్త్ర ప్రసంగములను సలిపిరి.

శివ స్మరణ సంపన్నులు అగ్నియందు దహనమైన శేషముగ మిగిలిన విభూతిని ఐశ్వర్యముగ భావించి ధరించవలెను. రుద్రాక్ష ధారణ మొనర్చవలెను. రుద్రాక్షయన శివుని మూడవకన్ను. సర్వ దేవతలలో ఫాలమున నేత్ర ముండువాడు పరమేశ్వరు డొక్కడే. పంచాక్షర మహామంత్ర జపము దీక్షా పూర్వకముగ ఉపదేశములేని వారు శివ శివ యని జపించినను చాలు. బిల్వదళములచే పూజించుట ముఖ్యము. ఓం బిల్వదళ నిలయాయై నమః అని లక్ష్మి అష్టోత్తర శతనామావళి యందు చెప్పబడి యున్నది. శ్రీలక్ష్మి ముఖ్యముగా నుండు స్థలములు బిల్వదళము యొక్క తుద, గోవుపుచ్చము. పతివ్రతల పాపట, ఏనుగు మస్తకము, పద్మము నివాస స్థానము. అందుచేత లక్ష్మిప్రదమైన బిల్వదళములచే పూజింపబడు పూజ అత్యధికము. సదా శివస్మరణ యుండిన మానవుడు ధన్యుడగును. సాయంకాల సమయమును ప్రదోషమని యనెదరు. ప్రదోష కాలమున శివస్మరణముఖ్యముగ చేయవలెను. శివ యన మంగళమని, శ్వశ్రేయస్సని, భద్రమని శుభమని ఇత్యాదిగా అమరము నందును చెప్పబడినది. శివుడు మంగళ స్వరూపుడు. అట్టి శివుని ద్వేషించి దక్షుడు ధ్వంస మైనట్టుపురాణము చెప్పుచున్నది. కావున సర్వశ్రేయ స్సంపన్నులగు శ్రీఉమామహేశ్వరులను పూజించి భావించి తమ నిజస్వరూప మెరిగి ధన్యులు కావలయును. సర్వ పాపములను పోగొట్టి సమస్త శుభముల నిచ్చునది, ఒక్క మాటలో చెప్పవలెనన్న "శివ ఇత్యక్షర ద్వయం" శివ యను రెండ

క్షరముల జపము లేక ధ్యానము చాలు. ఎవరయినను దీనిని స్మరించ వచ్చును. శివుడన ప్రణవ ప్రతిపాద్యమగు పరబ్రహ్మమే యనిఅర్థము "సర్వే వేదాయత్పద మామనంతి" అన్నట్లు అన్ని వేదములు ఓంకారమును చెప్పుచున్నవి. ఆ ఓంకార ప్రతిపాద్యమగు వస్తువే పరబ్రహ్మము. అనగా ఈశ్వరుడని అర్థము. దేవతలందరు శివ సందర్శనార్థమై ప్రదోష సమయమున శివాలయము వచ్చెదరు. ఇట్టి సద్భావముచే ఈశ్వరానుసంధానము చేయవలెను. "శాస్త్రం శారీర మీమాంసా, దేవః శ్రీచంద్రశేఖరః, గురుః శ్రీశంకరాచార్యః సంతు మే జన్మ జన్మని" అని భక్తుని ప్రార్థన నేను ఎన్ని జన్మలెత్తినా చంద్రమౌళీశ్వరుడే స్వామి. శంకరాచార్యులే గురువు. శారీరకమీమాంసయే శాస్త్రము (బహ్మసూత్రములు) ఇట్లు సర్వత్ర శివనామ స్మరణయే నిత్య శాంతిప్రదమని తెలియవలెను.

మానవుని కోరికలను దాహమును మరుమరీచికా జలము ఎప్పుడును తీర్పలేదు. కావున గురుసన్నిధి వాక్యశ్రవణ మననాదులచే ప్రత్యగభిన్న పరమాత్మ స్వరూపుడే నేనని ఎరుగుము. ఓ జీవుడా! ఎందులకు పరితపించెదవు. ఐహిక విషయవాంఛా మధుపాన మనునది బుద్ధిని మాదక మొనర్చి, సిద్ధవస్తు స్మరణను సడలించి సత్యమును మరుగుపరచును.జాగ్రతవహించి సత్య నిత్యమగు సాక్షి పరమాత్మయే నీవని విచారించి తెలియుము.

25-6-64 నంద్యాల శ్రీ ఉమామహేశ్వరాశ్రమము దయచేసి అచట భక్తుల ప్రార్థనానుసారము శకునాల గ్రామము వెళ్ళి, పిదప బుక్కాపురము శ్రీనిర్వాణ మఠమునందు జ్యేష్ఠ బహుళ ఏకాదశి (ఆశ్రమమున) తమ పరమగురువుల పుణ్యారాధన సలుపుకొనిరి. 7-7-64 నంద్యాల ఆశ్రమములో శ్రీవారి జయంత్యుత్సవము శివప్రదముగ నడచెను. భక్తాదులందరు భక్తిచే ఉత్సాహపరులైనను త్తమ తత్త్వవిషయముల నుపన్యసించిరి.

## 20.వ. శ్రీచాతుర్మాస్యమహావ్రతము -1964 సం॥

నంద్యాల శ్రీ త్యాగరాజస్వామి ఆలయము విశాలమగు కల్యాణభవనమున స్వస్తి శ్రీ క్రోధినామ సం॥ర ఆషాఢశుద్ధ ఏకాదశి సోమవారం 20-7-64 విధ్యుక్తముగ సర్వవాద్య విశేషములచే పూర్ణ కుంభమును, వేదమంత్రములచే గైకొని వచ్చి. కలశస్థాపన మున్నగు వైదిక కార్యములతో మంత్రపూతముగ, మహావ్రతము నిత్యపూజాను ష్ఠానాదులతోను, శ్రీవ్యాసపూజాదికములచేతను కార్యము శివప్రదమై ప్రారంభింపబడి, ప్రాతఃకాలము మాండూక్యోపనిషద్ భాష్యప్రవచ నము, సాయంకాలము శ్రీమద్భగవద్గీతా భాష్యప్రవచనములు అవి చ్ఛిన్నముగ, శ్రీ మదుమామహేశ్వరుల కృపచే 20-7-64 మొదలు, కార్తిక శుద్ధ ద్వాదశి సోమవారం 16-11-64 వఱకు జరిగి పూర్ణ మాయెను. అసంఖ్యాకముగ భక్తాదులు రెండువేళలయందు పూజ, శాస్త్రశ్రవణాది కార్యములకు శ్రద్ధచే వచ్చుచుండిరి. ప్రవచనములు మహాప్రసాదవంతములై యుండెనని భక్తజనావళి పరస్పరముచెప్పు కొనుచు మహదానందము నొందిరి. శ్రీ మహానంది సుక్షేత్రమునందు దీక్షా విరమణ మయ్యెను.

ముక్తియన ఆత్మస్వరూపానుభవమే. ఈ శరీరముండు నపుడే మరణములేని స్థితి నెఱుగవలయును. మోక్ష మెక్కడినుండియో మొలచి వచ్చునది గాదు. ఆత్మజ్ఞానమే మోక్షము. భాష్యకారులు "తదేతదశరీరత్వం మోక్షం" అని అన్నారు. పారిశేష న్యాయమున శరీరమునుండి, ఆత్మను విభజించి అనగా వేరుచేసి తెలియవలెను. కాని ఆత్మను దృశ్యస్థానము నందుంచి చూచుట యని అర్థము కాదు. అది దృక్స్వరూపమేయని భాష్యకారులు బ్రహ్మసూత్రభాష్యములో ఇట్లు తెలిపి యున్నారు. "గౌణ మిథ్యాత్మనోఽసత్త్వే పుత్ర దేహాది బంధ నాత్ సద్బ్రహ్మాత్మా; ఇత్యేవం బోధే కార్యంకథం భవేత్." గౌణాత్మ మిథ్యాత్మ, ముఖ్యాత్మ అని యాత్మ త్రివిధము. పుత్రమిత్రాదుల

సంబంధము కల్పించుకొని వారికి కలుగు సుఖదుఃఖాదులు నావే యని భావించుట గౌణాత్మ, గౌణ మనగా అప్రధానము. ఔపకారికము, పుత్రమిత్రాదులు వేరు మనము వేరని తెలిసియును మనము మనము అని అభిమానించుటయే గౌణము అని అర్థము. శరీరమే నేనని అభిమానించుట మిథ్యాత్మ. సద్రూపమగు బ్రహ్మమే నేననునది బ్రహ్మాత్మ యని తెలుపబడినది.

బ్రహ్మనిష్ఠా సంపన్నులగు మహాత్ముల వదనారవిందమున, సచ్చిదానందాత్మానుభవరూప మధుర స్మృతుల స్ఫురణ ద్యోతకమగుచుండును. సంతతాత్మానుసంధానముచేనుండు మాజీవన నిత్యవిధానములే ఒక యుత్తమ ప్రస్థానము. పూజ, అనుష్ఠానము, మితభాషణము శాస్త్రార్థ విచారము మొదలగు గురుకార్యములచే ఇతర అవకాశము లేక ఆత్మ తత్త్వానుసంధాన పరాయణులమై శివ స్వరూపులమై యుందుము. ప్రాయశః అట్టి మమ్ము మా తత్త్వమును చూచు వారరుదు. మాకు నిందాస్తుతులు సమములు. ఇతరులెంత తీవ్రముగ కోప తాపములచే మాపై బడి వచ్చినను మాసహజమగు ప్రసాదగుణమును స్వాస్థ్యమును వీడము. ఇది శ్రీ గురుదైవదత్తమగు మహాసంపద. బోధించునది బ్రహ్మాత్మ విషయమగు అద్వైత తత్త్వము. అదే మాదృష్టి. అనుష్ఠించునది నిర్గుణమగు ఉపాసన, చేయునది సదా శ్రీ గురుదైవములైన శ్రీ ఉమామహేశ్వరుల పూజాభిషేకములు. ఇదే మా జీవన విధానము పరమ భాగ్యము.

ద్వైతాద్వైతములనునవి రెండు, మూడు, నాలుగుగా నుండి ఒకటిగా చేయుట అని అర్థము కాదు. ఆ యా భిన్న దేశ కాలముల యందు ఒకే తత్త్వము భిన్న భిన్నములుగా చెప్పబడి యుండవచ్చును తాత్త్వికదృష్టిచే శ్రుతిసమ్మతముగ విచారించి, అనుభవముచే తెలియ ఒక్క అద్వితీయ పరబ్రహ్మమే యున్నదనియు, అదే తాననియు అర్థము.

అన్ని వేదములు ఏతత్త్వమును గమ్యముగ తెలిపి మాకీ

భావము నొందునో అది నీవై యున్నావు. కేవల వైదికకర్మలుమాత్రమే బ్రహ్మతత్త్వము నెఱుగ సమర్థములు కావు. సాక్షియగు ప్రత్యగాత్మ వ్యాపకమగు పరబ్రహ్మమే నని మహావాక్యార్థ జన్య జ్ఞానదృష్టిచే తెలిసిన పిదప, వేదములు, దేవతలు బ్రాహ్మణులు అందరును తదంత ర్గతమేయని, బృహదారణ్యకాది ఉపనిషత్తులు చెప్పుచున్నవి. ఈ తత్త్వము నెఱుగుట కొఱకై య్యే మానవజన్మ అది తెలియక మర ణించినవాడు కృపణుడని చెప్పబడును. శ్రుతి చోదితమగు ఆ పర మార్థ తత్త్వము నెఱుగ వలయునని ముఖ్యతాత్పర్యము. ఈశ్వరునకు 5 ముఖములు 4 ముఖములందు 4 వేదములు పరమేశ్వరుని శ్వాసగా నున్నవి. ఊర్ధ్వముఖము, సుప్రణవ నాదోద్గారమై యున్నది. పర మార్థ తత్త్వమును గురించి ప్రారంభించునపుడు ఓం అని అందురు. అ, ఉ, మ త్ర్యక్షరాత్మకం ప్రణవం (ఓంకారము) కేనోపనిషత్తులో చెప్ప బడినట్లు అనుగ్రహ సమయమునందు ఉకార, మకార అకారములుగా చెప్పుదురు. "ఉమాం ఓం ఇత్యుమేతి" అని ప్రణవస్వరూపిణిగ వర్ణింపబడినది. "ప్రాణాన్ సర్వాన్ పరమాత్మని ప్రణామయతీతి ప్రణవః చతుర్థావస్థిత ఇతి సర్వదేవ వేదయోనిః సర్వవాచ్య వస్తు ప్రణవాత్మకం" అనగా సకల ప్రాణములను ప్రపంచము నంతయును పరమాత్మయందు చేర్చుటవలన ప్రణవమనబడును. నాలుగు పాదము లతో కూడి యుండుటవలన, బ్రహ్మవిష్ణు రుద్రాది సమస్తదేవతల కును, నాలుగు వేదములకును, మూలస్థానమైయున్నది. సకల వస్తు వాచ్యజాలమెల్లయు ప్రణవాత్మకమై యున్నదని అర్థము. "సకృదు చ్చరిత మాత్ర ఊర్ధ్వ మున్నామ యతీత్యోంకారః" ఒక్కమారు ఓం కారము నుచ్చరించిన, నది శ్రేష్ఠమగు పరమపదము జేర్చును గాన ఓంకార మనబడును. ఓం తత్సత్ .

ఇదే కార్తిక బహుళ ఏకాదశి శనివారము శ్రీవారి గురుదేవుల పుణ్యారాధన మహోత్సవము మహదానందప్రదముగ జరిగెను4.12.64

నుండి 16.12.64 వఱకు ఉరవకొండ శ్రీకన్యాకాపరమేశ్వరి దేవాలయము నందు శ్రీగీతాజయంత్యుత్సవములు యథారీతి ప్రతి సం॥ వలె ఆనందముగ జరిగెను.

1-1-65 గూళపాళ్యం శ్రీగురుదేవాశ్రమము నందు శ్రీగురుదేవులు పూజానుష్ఠాన శాస్త్ర శ్రవణాదులచే బ్రహ్మనిష్ఠ నుండుచు 14-2-65 క్రోధి సం॥ర మాఘశుద్ధ ॥౧౩॥ పవిత్రదినము 6 కోట్లు శ్రీశివపంచాక్షర (షడక్షరీ) మహామంత్ర లేఖన పుస్తకములను ఆశ్రమమున స్థాపించి,పంచాయతన పూజాప్రతిష్ఠాపనాది కార్యములు విధ్యుక్తముగ జరిపిరి. పూజ్యశ్రీ శంకరశాస్త్రి స్వాములవారు దయ చేసియుండిరి. శ్రీ శుద్ధచైతన్య స్వాములవారిచే ఆశ్రమ ప్రవేశోత్సవము జరుపబడెను. కార్యక్రమములు మూడు దినములు వేదోక్తముగ శ్రీచంద్రమౌళీశ్వర శ్రీసద్గురుపూజా శాస్త్ర ప్రవచనాదులెంతయు వైభవముగ ప్రశాంతముగ జరిగెను.వేలాదిభక్తులుభక్తిచే వచ్చి కార్యముల యందు పాల్గొని వాక్య శ్రవణాదులుచేసిరి.మండల పూజానుష్ఠానములు మాండూక్యోపనిషచ్ఛ్రవణము శివప్రదముగ జరిగెను. మహాశివరాత్రి కార్యక్రమము అఖండ భగవన్నామ భజనాదులచే ఆనందముగ నడచెను.

ఉపనిషదర్థములు భగవన్నిష్ఠా గరిష్ఠులగు సంయమీంద్రులైన తత్త్వవిదులకు చక్కగ అవిరుద్ధమై ఆచార్యప్రభృతుల భాష్యసమ్మతముగా ఉపనిషన్మాత తన హృదయమును విప్పిచూపును. అనుభవముచే నాతడు తెలిసి శాంతి నొందుట కనువగును. ఇవి బుద్ధిప్రధానములు కావు. తపస్సంపన్నమగు తాత్త్వికదృష్టికి వేద్యమగునవి. శిక్షనొందని ప్రాకృత బుద్ధిచే వర్తించు జనులయందు ప్రాయశః స్వమత ద్వేషము, పరమతాభిరుచి, వేదశాస్త్రములయందశ్రద్ధ,అవిశ్వాసము, అవతారముల యందును దైవము నందును అపనమ్మకము, మహాపురుషుల వాక్యమునందు హాస్యాస్పదమగు భావము, స్వమాతాపితరుల

యందే విరోధము, స్వవర్ణాశ్రయములయందు అసహ్యబుద్ధి, గుణతారతమ్యముచే మాయావివశులై స్వేచ్ఛగ నుండు జనులకు పరమార్థ విషయ మబ్బుట బహుకష్టము. బహిర్ముఖ చిత్తవృత్తి గలవారియందు మహాత్ముల యొక్క కృప ఫలించదు. సద్ధర్మ సదాచార, సన్నిష్ఠాపరులైన సజ్జనుల యందు సద్గురు సచ్ఛాస్త్రములయొక్క అర్థము స్ఫురించును. దైవము అందరికి మంచిని చేయుగాక !

ఆత్మజ్ఞాన ప్రభానముచే ప్రపంచమునే తృణకణముగ నెంచు ధీరులగు తత్త్వవిదులు లోకము యొక్క పోకడను గమనించక తమ దివ్యమగు బ్రహ్మమయదృష్టిచే (సమన్వయ దృష్టిచే) శేష ప్రారబ్ధమును గడపుచు ముక్తి నొందుదురు. ఈప్రపంచ మెల్లను గుణమయమైనందున గుణములు మాయా స్వరూపమగుటచే ఇట్టి మాయాశక్తి యుక్తుడైన పరమేశ్వరుడు బహురూపములచే ప్రకాశించు ఈ జగత్తంతయు రూపకాలంకారముచే నొప్పు తత్త్వస్వరూపమేయనిమహాత్ముల యొక్క హృదయము. బ్రహ్మజ్ఞానసంపన్నులగువారు పుణ్య కర్మలచే సుఖరూప వృద్ధిని, పాపకర్మలచే దుఃఖరూపమైన నికృష్టతనుపొందుట లేదు. సుఖదుఃఖాది ద్వంద్వములు వారికి లేవు. కామ కారణమగు అజ్ఞానము ఆత్మజ్ఞానముచే నివృత్తమై యుండును. జగచ్చక్షువగు సూర్యుడు నేత్రేంద్రియములకు విషయములగు వెలుపలి దోషములచే ఎట్లు స్పృశింపబడడో, ఏకమేవాద్వితీయ స్వరూపానుభవము గల తత్త్వవిదుడు ఈలోక ద్వంద్వములచే లిప్తుడు గాడు.

ఆత్మజ్ఞానము కలిగిన, నేను నాది అను అధ్యాస నివృత్తియగును, అధ్యాస నివృత్తిచే రాగద్వేషము లడగిపోవును. రాగ ద్వేష నివృత్తిచే కర్తృత్వభోక్తృత్వము లుండవు. అంచుచే ఆత్మజ్ఞానమే సర్వానర్థ నివృత్తి కారణమని సర్వభక్తులును యెరుగదగును.

25, 26, 27.6.65 వరకు శ్రీవారి పరమ గురువుల ఆరాధన శ్రీవారి జయంత్యుత్సవము గుంతకల్లు శ్రీఉమామహేశ్వరాశ్రమమున

విధ్యుక్తముగ జరిగెను.

ఉరవకొండ భక్తుల పరమ భక్తి భావనానుసారము 21. వ శ్రీచాతుర్మాస్య మహావ్రతము ఉరవకొండ శ్రీ కన్యకాపరమేశ్వరి ఆలయమునందు జరుప నిర్ధరింపబడెను. భక్తులు శ్రీకల్లూరుసి. వెంకటప్ప, జానప్ప, కాశిపతప్ప, భద్రప్ప, యన్. రామలింగయ్య, దొడ్డప్ప, నరసింహప్ప మొదలగు వారందరు వచ్చి శ్రీసన్నిధి ఫలమంత్రాక్షతలను వడసిరి.

## 21.వ శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1965 సం॥

శ్రీ విశ్వావసు నామ సం॥ర ఆషాఢ శుద్ధ॥ ౧౧ శుక్రవారము 9.7.65 ఉషఃకాలమున యథారీతి శాస్త్రీయముగ మహావ్రతము శ్రీ చంద్రమౌళీశ్వర, శ్రీగురుపూజానుష్ఠానములు, శ్రీవ్యాసపూజ మొదలగు క్రమములచే ప్రారంభమయి ఉదయము కఠోపనిషచ్ఛ్రవణము జరిగి 9 గం.కు ప్రాతఃకాల కార్యక్రమము పూర్ణమాయెను. సాయంకాలము ప్రదోష పూజానుష్ఠానములు తరువాత 7 గం.నుండి 8.30 గం. వరకు శ్రీమద్భగవద్గీతా శాంకరభాష్యప్రవచనములు అత్యంత సంపూజ్యములై అవిచ్ఛిన్నముగ 9.7.65 నుండి కార్తిక శు॥ ౧౨॥ 6.11.65 వరకు శివప్రదమై ఈ మహాకార్యము జరిగెను. అనేకగ్రామ గ్రామాంతరముల నుండి మరియు పట్టణముల నుండి భక్తులు వచ్చి శ్రవణాదులు చేయుచు సంతసించిరి. కార్తిక శుద్ధ పూర్ణిమకు ఉరవకొండ శ్రీమల్లికార్జునస్వామి ఆలయమునందు దీక్షావిరమణమయ్యెను. సంతర్పణలు జరిగెను. పిదప 19.11.65 యథారీతి తమ గురుదేవుల పుణ్యారాధన జరిగెను. ఈసుసంధి యందు మఠొకవిషయము తెలియదగినది.

శ్రీగురుపీఠ సమారోహణ మనిన ఆచార్యత్వ మనిన ఆశ్రమము లనిన చాల సులభము, సుఖమని భావించరాదు. అది కంటకావృత ప్రదేశమున నగ్నపాదులై నడచుటవంటిది. కావున చాలజాగ్రతతో

నడువ వలయును. మనస్సాక్షిగా సంతత ఆచార విచార శీల సంపద్వి శిష్టులయి ఎంతచక్కగ దైవదత్తమైన దివ్యశక్తిచే వర్తించినను అని మిత్ర శత్రువుల బారి తప్పదు. మంచి చెప్పినను వినరు. ఇది లోకము యొక్క పోకడ. శ్రీవారు శ్రీగురుపీఠ సమారోహణానంతరము అనేక ద్వంద్వములను, కష్టనిష్ఠురములను చూచిరి. అయినను శ్రీగురు కరుణచే సమమగు బ్రహ్మదృష్టితో శ్రీ గురుదేవుని లీలలని గాంచిరి. ఈ పీఠాధిపత్యము, మఠాధిపత్యము వలన వివిధ సంస్కారములు గల వారిని చూచిరి. శాస్త్రీయ పద్ధతులతో సంస్కరించిరి. కాని శ్రుతి సమ్మతము గానివాటిని యిది పద్ధతి కాదని దయతో మరల మరల విహితమగు రీతిని తెలిపిరి.

సంతత శ్రీగురుపాద పద్మారాధకులై బ్రహ్మనిష్ఠచే ప్రశాంత ముగ నుండినను మహాత్ములు సద్గురువులు నగు వారివద్దకు నిర్నిమిత్త ముగ ఏవో ద్వంద్వములు అపుడపుడు వచ్చిపోవుచుండును. నిజముగా ప్రారబ్ధ మనిన ఆత్మజ్ఞానివద్దకు వచ్చిన కష్ట నిష్ఠురములనే ప్రారబ్ధమన వలెనని ఈ విషయమును శ్రీవారి గురుదేవులు శ్రీ సదానంద సద్గురు పూజ్యపాదులు తమ శిష్యులగు మన శ్రీవారితో చెప్పుచుండిరట. "ద్వంద్వముల నుండియే మహాత్ములు బయలుదేరి వచ్చి రప్పా!" "ఆ ద్వంద్వములకు తాళుటమాత్రమునుచాలదు! వస్తుతః అవి లేనివని, నిజనిష్ఠచే నెరుగ వలయునని తెలుపుచుండెడి వారట,"

శ్రీగురుస్థానమునందుండి ఈ పరిదృశ్య మానమగు జగత్తు యొక్క అనిత్యతను దానియొక్క పోకడను వైచిత్ర్యమునుచూచుచు బ్రహ్మానుభవ స్థితి మాత్రులయి శివలీలగ గాంచిరి. వివిధ సంస్కార ములు గలవారందరు ఒకభక్తుడు వచ్చి నిస్పృహులగు శ్రీవారిసన్నిధి యేదో ఒకవస్తువో పదార్థమునో సమర్పించి భక్తిచే నిలిచియుండును. అంతలో యింకొకడు వచ్చి స్వామీ! అది నాకు ప్రసాదింప ప్రార్థన యని అడుగును. అపుడది గురువు లాతనికి కిచ్చిన నది చూచి

అయ్యో "నేనెంత భక్తిచే ప్రయాసతో తెచ్చి స్వామికిచ్చిన దానిని మరల యెవరికో యిచ్చిరి గదా" యని తలచి మొదటి భక్తుడు (ఆమనిషి) నొచ్చుకొనును. యిక యివ్వకపోయినచో అడిగిన యా రెండవభక్తుడు స్వాములవారికి నాపై దయలేనందున నే నడిగిన యివ్వ లేదే అను నిత్యాదిగా యెన్నో ద్వంద్వములు ఆ మూలమున దూష ణలు బయలుదేరును. ఇట్టివి శ్రీవారు చిన్నవి పెద్దవి యెన్నో చూచిరి. గురుదేవులు జన్మతః కర్మతః పరిశుద్ధులు జ్ఞాననిష్ఠులు కావున గొప్ప దగు గురుశక్తిచే బ్రహ్మాభిముఖులై తమ ప్రసాద గుణమును విడచి కదలరు. బ్రహ్మస్వరూపులై యుందురు, గురుతత్వమను ఈవిషయమును శ్రీవారనేక సారులు తెలుపుచుండిరి.

మరల ఉరవకొండలో గీతాజయంతి యథారీతి ముగించుకొని, నంద్యాల శ్రీ ఉమామహేశ్వరాశ్రమమునకు దయచేసిరి. అచ్చట 2.12.65 శ్రీశృంగేరి జగద్గురు శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వాముల వారు విజయం చేసియుండిరి. శ్రీమహాసన్నిధికి శ్రీవారు భక్తిచే వెళ్ళి సందర్శించిరి. కుశలప్రశ్నలచే ఆదరించి ఆశీఃపూర్వకముగ శ్రీ జగ ద్గురువులు మన శ్రీవారికి వివేకచూడామణి యను మహాగ్రంథమును ప్రసాదించిరి. శ్రీవారు తమ రచనలగు ప్రస్థానత్రయ మహాగ్రంథము మరియు శ్రీజగద్గురు శంకర చరిత్రను భక్తితో శ్రీసన్నిధి సమర్పించు కొనిరి. చూచి సంతసించుచు "ఈ శంకరచరిత్ర ఎంత బాగున్నది స్వామీ! భక్తిచే గట్టిగ పట్టుపట్టి చదివిన ఒక దినముననే పూర్ణ మగును. మీరు ఈ గ్రంథములను ఉచితముగ అందరికి ఇచ్చుచున్నా మనుచున్నారే! అట్లెందుకు సంస్థానమున కిచ్చిన వెలకు ఇవి అనతి కాలముననే అమ్మకమగునని పలుకుచు సంతసించిరి." అందులకు విన యముగ భక్తిచే గురుదేవా దీనికి వెల వలదు. భక్తులు భక్తిచే చదివి గ్రహించి ఆనందించుటే చాలని మన శ్రీవారు వినయముగ విన్నవించు కొనిరి. శ్రీజగద్గురు మహాస్వాములు నవ్వుచు "హౌను! హౌను!

బహుళ సంతోష బహుళ సంతోష" అనుచు సంతోష మొందిరి. అనంతరము ఫల మంత్రాక్షతలచే నాశీర్వదించిరి.

శ్రీవారు నంద్యాల ఆశ్రమమునుండి శ్రీగురుదైవ భక్తులగు శ్రీ శెట్టి ఓబులపతిగారు శ్రీ కె. శంకరయ్యగారు మరి బ్రహ్మచారి బృందము వగైరా పరివారముతో గూడి అందరు శ్రీశైల మహా క్షేత్రము వెళ్ళి శ్రీ మల్లికార్జున జ్యోతిర్లింగమునకు మహాన్యాస పూర్వక, ఏకాదశవార శ్రీ రుద్రాభిషేకపూజాదుల జేసి, ఒకవారము వరకు పూజానుష్ఠానాది తమ నిత్యనియమములచే ప్రశాంతముగ నచ టనే తపస్సంపన్నులై యుండిరి. ఇచ్చట "శ్రీశైలప్రభ" మాసపత్రిక సంపాదకులగు బ్రహ్మశ్రీ యన్. వేరరాజు పండిత మహోదయులు శ్రీవారికి తమ అనుష్ఠానాది సర్వకార్యములకు వలయు చక్కనివ్యవస్థ గావించిరి. శ్రీవారి రచనలు శ్రీ జగద్గురు శంకరచరిత్ర, మరియు మహోపనిషత్తును సంపూర్ణముగ "శ్రీశైలప్రభ" మాసపత్రికయందు క్రమముగ ప్రచురించిరి. తమ రచనలు ఆనందరామాయణము, తులసీ రామాయణము మున్నగు గ్రంథములను శ్రీవారికి సమర్పించిరి.

1966వ సంవత్సరము శ్రీరామనవమి మహోత్సవములు హాల రివి శ్రీ ఉమామహేశ్వరాశ్రమమునందు శ్రీ తులసీరామాయణము విపుల వ్యాఖ్యచే సర్వ జనానంద ప్రదముగ 15 దినములు జరిపిరి. ఆ గ్రామవాసు లెల్లరు పరమ సంతోష మొందిరి.

25.4.66 లత్తవరము శ్రీ ఉమామహేశ్వరాశ్రమము నందు శ్రీశంకరజయంతి ఉత్సవములు శివప్రదముగ జరిగెను. శ్రీ జగద్గురు శంకరచరిత్ర శ్రవణము మరియు బృహదారణ్యకోపనిషత్పఠన శ్రవ ణాదులు విపులముగ ముఖ్యఘట్టములు జరిగెను.

తమ పరమ గురువుల ఆరాధన కార్యక్రమము ఆనందముగ నడపిరి. తరువాత శ్రీవారి జయంత్యుత్సవమును జ్యేష్ఠబహుళ త్రయో దశి గురువారం విధ్యుక్తముగ జరిగెను. మరల గుంతకల్లు పుర భక్తు

ప్రార్థనను మన్నించి శ్రీవారు గుంతకల్లు శ్రీఉమామహేశ్వరాశ్రమమునకు వెళ్ళి అచ్చట 22 వ శ్రీ చాతుర్మాస్య మహావ్రతము చేసిరి.

## 22. వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1966 సం॥

స్వస్తిశ్రీ పరాభవ నామ సం॥రము ఆషాఢ శుద్ధ ఏకాదశి మంగళవారము 28.6.66 బ్రహ్మముహూర్తమున యథాప్రకారము ప్రతిసంవత్సరమువలె కలశ స్థాపన శ్రీచంద్రమౌళీశ్వర (శ్రీ ఉమామహేశ్వరుల) శ్రీవ్యాసపూజాది సర్వ వైదిక కార్యములు జరిగి బ్రహ్మసూత్ర భాష్య శ్రవణారంభమై మంగళ మంత్రపుష్పముచే ప్రాతఃకాల కార్యక్రమము పూర్ణమాయెను. సాయంకాలముశ్రీగీతా భాష్య ప్రవచనములు. ఇట్లు క్రమముగా కార్తిక శుద్ధ ద్వాదశి గురువారము 24.11.66 వరకు మంగళమయముగ జరిగెను. కార్తిక శుద్ధ పూర్ణిమకు హంపి క్షేత్రము నందు దీక్షా విరమణ మయ్యెను.

ఈమహావ్రతమున గుంతకల్లు ఆశ్రమమునకు ఆళ్ళగడ్డ పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శంకరానంద స్వాములు, శ్రీశ్రీశ్రీ రామకృష్ణానంద స్వామి ప్రభృతులు దయచేసి యుండిరి. వాక్యార్థప్రసంగములెంతయు ముముక్షు జనోత్తారకములై యుండెను. ఈ కాలముననే శ్రీవారు ఆశ్రమ వాసులగు బ్రహ్మచారులకు సంస్కృతపాఠములను చెప్పుటకు సంస్కృతపండితులగు అధ్యాపకుని ఏర్పరచి నియమముగ పాఠములను గరపింప జేసిరి. శ్రీవారి సద్గురు దేవుల 13 వ పుణ్యారాధన 6.12.66 ఆనందముగ గడచెను.

ఏముముక్షువులైతే మనశ్శాంతిని శారీరకమగు పవిత్రతను జ్ఞాపకశక్తి యను మేధను ఆత్మజ్ఞానమును, సత్య సంపన్నమగు ధర్మాచరణ గలిగి జీవించవలెనని ఇచ్ఛ యింతురో వారు బ్రహ్మచర్యమును చక్కగా పాటించవలెను. అది జీవన జ్యోతి. యత్నశీలునకు తప్పక సాధ్యమగును. ఖనన క్రియచేత అనగా భూమిని త్రవ్వుటచే జలము పొందబడునట్లు అనన్యమైన గురుదైవము యొక్క సేవచే ముముక్షువు

ఉత్తమమగు బ్రహ్మవిద్యను పొందును. ధన్యుడగును. సంశయము లేదు పావన గంగచే దేహ శుద్ధియును సత్యవ్రతముచే మనశ్శుద్ధియును, ఆత్మజ్ఞానముచే చిత్త సంస్కృతియు కల్గును. ధన్యుడగును. తపస్సుచే పావనుడై పోవును. "విద్యా తపోభ్యాం పూతాత్మా" ఇది లేక ఆచరింపబడు ముముక్షు జన వ్యవహారము ఫిరంగి యందు మందు కూర్చకనే ప్రేల్చినట్లుండును. అనగా గురిని ఛేదింప జాలదు. శక్తి లేదు. భక్తిమయమగు విద్యా తపస్సులు ముఖ్యముగ నుండవలయును.

కొన్ని మాటలతో ఉత్తమమగు అపూర్వ విషయమును ప్రకటించి శ్రోతలకు బ్రహ్మాకార వృత్తిని కలుగ జేయువారు జ్ఞాన సంపన్నులగు సద్గురువులు. అట్టి సద్గురువుల సన్నిధి సద్భక్తులు ఆడంబరమును, అధికత్వమును చూపరాదు. దైవీశక్తిని పొందుట కనువగు శీలము ఈశ్వరనిష్ఠ ఉండవలయును. సద్గురువుల సన్నిధి పీఠమునందు కూర్చొనుటకాని, స్వేచ్ఛగ సంభాషించుటకాని మంచిదికాదు. భక్తుడును, సఖుడునై శ్రీసన్నిధి వినమ్రమముగ మెలిగిన విద్యా తపస్సులనతి కాలమున యాతని కలవడి ధన్యుడగును.

ఐహిక సుఖము నిచ్ఛయించు వానికి నిజమగు బ్రహ్మవిద్య యలవడదు. గురువిద్య కొఱకై శ్రమించు నాతనికి సుఖము దుఃఖము నను నది అగపడదు. పూజ్య మహాత్ములను వినోదముగ తూలనాడుచు నిందించు ప్రాకృత జనుల వాక్కులను సద్భక్తు లాలకించరాదు. అచటి నుండి దూరమై పోవలెను. అట్లులేకున్న పరమార్థ సత్యము నవి మరపింప జేయును. దొడ్డవారి సాంగత్యముచే పొందు సుఖము ప్రాకృత జనులు ఎఱుగలేరు. వారు సంకల్పించి స్మరించి బోధించి దృష్టిని సారించి భవభయమును బాపి భక్తి మూలమున ఆత్మజ్ఞానశక్తిని ప్రసాదించెదరు. మహావాక్య వ్యాఖ్యచే వివేకమును మనకు కలిగింతురు. పదచ్ఛేదము పదార్థ విమర్శనమును మరి మరి వివరించి తెల్పుచు, వాక్యసంయోజన నిర్మాణ నైపుణ్యమును, పూర్వపక్ష సిద్ధాంతము

లచే బుద్ధియందుండు భ్రమలను దూరీకరింతురు.

శ్లో॥ "సంసార విష వృక్షస్య ద్వేఫలే అమృతోపమే
కావ్యామృత రసాస్వాదః సంగమ సజ్జనై స్సహ"

అని హితోపదేశములో తెలిపిన ప్రకారము, ద్వంద్వ భూయిష్ఠమగు ఈ సంసారమను వృక్షమునందు రెండు అమృతోపమములైన ఫలములుగలవు. ఒకటి కావ్యామృత రసపానము (వాక్యశ్రవణము) మహాత్ముల సత్పురుషుల సన్నిధి సహవాసము రెండవది. ఇవి లేకున్న అన్నియు సున్నయే అనగా దుఃఖమే, భేదమే, ద్వంద్వమే తోచుచుండును. అనాత్మ విషయ సంసర్గము సంయోగ వియోగాత్మకమైనది. ఆత్మనిత్యమైనదని తెలియవలెను.

సజ్జనులు మహాత్ములగు సద్గురువులు "పరగుణ పరమాణూన్ పర్వతీ కృత్య నిత్యం నిజహృది వికసంతః సంతి సంతః కియంతః" పరులయందలి మంచిని గోరంత కొండంతగ భావించి సంతసింతురు. మరియు భర్తృహరి చెప్పినట్లు సత్యపథమునందునడచువారి యందు "విఘ్నము కలుగునను భయముచే దేనియందును ప్రవృత్తి లేని వాడొకడు, కొంత కాల మారంభించి విఘ్నము కలిగిన వెంటనే విడుచువాడు వీడుమధ్యముడు, ఎన్ని విఘ్నములు గలిగినను విడువక సత్యము నాచరించి స్థితి నొందువాడు ఉత్తముడు" అని మూడు తెగలుందురు, "కార్యం వా సాధయామి- దేహం వా పాతయామి ......"యని శ్రీవివేకానంద స్వాములవారు తెలిపిరి. రామ కార్యమున రాయిరప్పలు, పశు పక్ష్యాదులు సహకరించి సేవ యొనర్చినట్లు, గురు మార్గమున (సత్యపథమున) మనశ్శుద్ధి పూర్వకముగ వర్తించు వానికి సర్వులును సహకరింతురు. వేయేల పంచభూతములును కూడ సహకరించును.

మహాత్ములు, సద్గురువులు నగు పెద్దలు నొచ్చు కొనరాదు. వారినుండి అశ్రుపాతముగాని రక్తపాతముగాని కారాదు. అది లోకమునకు మంచిది కాదు. కఱువు, కాటకములు పాతకములుఏర్పడును.

విరాటపర్వమునందు ధర్మరాజు విరటుని యింట పాచికల నాడు ప్రసంగమునందలి సంఘటన మరియు గాంధీ మహాత్మునకు బిర్లా భవనము వద్ద జరిగిన పరిస్థితి అను సంధేయము.

వేద ప్రోక్తమును స్మృతుల యందు చెప్పబడినవియును సజ్జనుల సదాచారములచే నొప్పు నదియును, ఆత్మవిద్య కనువయి నదియునగు చర్య, ధర్మ మన బడును. "ధ్రియతే అనేనేతి ధర్మః" దేనిచే సర్వము ధరింప బడునో అది ధర్మము. అనగా భగవత్స్వరూపము. "ధర్మ ఏవ హతో హంతి, ధర్మో రక్షతి రక్షితః" ధర్మము దప్పి వర్తించిన అది మనలను బాధించును. ధర్మరక్షణ అనగా సదాచారము. అది మనకు రక్ష యగునని తెలియ వలయును. జన్మాంతరమున దానము చేయ సందువలన దారిద్ర్యము దరిద్రదోషమున పాపాచరణము, పాపముచే నరకలోకము, దానిచే మఱల దారిద్ర్యము, మఱల పా పా చ ర ణ కలుగును కావున హెచ్చరికతో పాప కార్యము నెప్పుడును చేయ రాదని ఎరుగవలయు ను.

శ్లో॥ "న దేవాంశో దదాత్యన్నం, నా రుద్రో రుద్ర మర్చయేత్,
నా వృషిః కురుతే కావ్యం నా విష్ణుః పృథివీ పతిః"

అనగా దైవాంశము లేనియెడల అన్నదానము నొనర్పజాలడు. రుద్రాంశము లేనివాడు శ్రీరుద్రుని అర్చింపలేడు. ఋషిగాని యెడల కావ్యమును రచించలేడు. విష్ణ్వంశము లేనివాడు రాజ్యపాలన యొనర్ప లేడనిమనువు జెప్పెను. "స్థాన భ్రష్టా న శోభంతే దంతాః కేశా నఖా నరాః ఇతివిజ్ఞాయ మతిమాన్, స్వస్థానం న పరిత్యజేత్" పళ్ళు, వెంట్రుకలు, గోళ్ళు మనుష్యుని నుండి స్వస్థాన భ్రంశము లైనచో శోభించవు. అటువలె గుణవంతుడు స్వస్థానమును అనగా దైవస్మృతిని, నిష్ఠను వీడరాదు. ఇట్టి ఉపమాలంకారములతో కూడిన సూక్తులు గల రసవత్తరములైన కావ్యరచనలు మానవుల కెంతయు మహోపకారకములై, గుణ కర్మ ధర్మాదులను తెలుపుచు, మోక్ష

మార్గమును చూపును. మహాకవి కాళిదాసు యొక్క ప్రయోగము లలో ఉదాహరణలు, భారవియను కవిలోగల అర్థగౌరవము, దండి యొక్క పద గుంభనము (లాలిత్యము) గుర్తింపగలము.

భక్తుల ప్రార్థనానుసారము బెళగుప్ప, కల్యాణదుర్గమునకు వేంచేసి అపూర్వమగు ముండకోపనిష దర్థములను, భాగవత భక్తి మయ ఘట్టములను ప్రతిపాదించిరి. అందరికి అనుష్ఠాన సంపన్నమగు నియమిత పవిత్రవర్తనను శీలసంపద అనునీ విషయములను ప్రత్యేక ముగ జ్ఞానైక విషయములను బోధించిరి.

అనాత్మ భావమును పరిత్యజింపుము. జగద్విషయమున నిర్వి కారుడై యుండుము. అంతర్ముఖుడై అనన్య నిష్ఠతో కేవల సంవిద్రూ పాత్మవై యుండుము, ఎండమావుల యందు భ్రమచే ప్రతీతియగు జలమంతయు మరుభూమియే (చవిటినేలయే) యైనట్లు, జాగ్రత్స్వప్న సుషుప్త్యాత్మకంబైన ఈజగత్తు ఆత్మదృష్ట్యా చిన్మాత్రమేయై యున్నది లక్ష్యమనిగాని, అలక్ష్యమనిగాని ఈ ద్వంద్వము లేమియు లేక కేవ లము ఆత్మ మాత్రుడై స్వరూప స్థితిచే సాక్షాత్ పరమ శివుడే నీవని తలంచుము. ఏ ద్వంద్వము లేని పరాస్థితి శివత్వము,బ్రహ్మత్వము అని చెప్పబడును.

అవిద్య లేనిదే అయినను ఎవరు ఆత్మజ్ఞాన హీనులో వారి యందే ఇది కన్పట్టుచున్నది. పేరునకు మాత్రమే ఉన్నదగు ఈ అవిద్య (నామమాత్రా స్తిత్వము) ఉన్నది. సమ్యక్ ప్రజ్ఞ గలవాని యందు ఎట్లుండ గలుగును ? ఉండజాలదు. లేదు. సమ్యక్ ప్రజ్ఞ యనగా శాస్త్రాచార్యోపదేశాదులచే సంస్కరింపబడిన బుద్ధి, ఈ అ విద్య, పరమగు తత్త్వము నవలోకించిన మాత్రమున స్వరూప నాశ మొందును."మాయా కార్యం జగన్నాస్తి మాయానాస్తి భయంనహి" అని స్మృతి చెప్పుచున్నది. ఈమూడు లోకములందు ఏదియును పుట్టు టయు లేదు. చచ్చుటయులేదు. ఏషడ్భావ వికారము లగుపడు

చున్నవో ఏ ప్రకారముగను వాటికి నిజమగు అస్తిత్వములేదు. "న జాయతే మ్రియతేవా" శ్రీగౌడపాదాచార్యులు దీనిని అజాత సిద్ధాంతమని తెల్పిరి. నేను బ్రహ్మతత్వ స్వరూపుడను కాదను అనాత్మ విషయ సంకల్పముచే మనస్సు వృథా బంధమున పడును. శ్రీగురు కరుణచే నిర్మలులై పవిత్ర వర్తనులై సర్వము బ్రహ్మమే నను దృఢ నిశ్చయనుతో నున్నచో మనస్సు ముక్తమగును.మహాదేవుడవే నీవు. నేను శక్తి హీనుడను,దుర్బలుడను,దుఃఖిని కర చరణాద్యవయవములు గలవాడను, అట్టి వాడను, ఇట్టి వాడను అను నీ మొదలగు అనాత్మ భావ పరంపరలను నీయందు ఎప్పడును చేరనివ్వక శివోహం అను బ్రహ్మమయ భావన యుండుగాక ! మరియు వస్తుతః బ్రహ్మము భావనా పరముగాదు అది స్థితి మాత్రమే యని మీాకే అనుభవమగును.

ఈ అవిద్య యనగా అధ్యాస అది కాని దాని యందది యను బుద్ధిచే అనాత్మయగు ఉపాధి యందు ఆత్మ భావన చేయుటచే జగద్ధర్మమునకు బద్ధుడవై తివి.కావున ఇది కల్పనా మాత్రము ఉత్తమమగు పురుష ప్రయత్నము నాశ్రయించి చక్కని అభ్యాస వైరాగ్యములచే సిద్ధించెడి పరిశుద్ధమగు ధీవృత్తి, ఆత్మస్థితి కలవాడవై విష యేచ్ఛలను వీడి నిర్వికల్ప నిష్ఠ నుండుటే నిజస్థితి. ఇదేమి ఆశ్చర్య మో తామరకాడ యందలి దారముచే పర్వతములను బంధించినట్లయినది. అనగా లేని ఈ యవిద్యచే ఈవిశ్వము ప్రాణి సముదాయము భిన్నాభిన్నమై హాహాహా యనునట్లు చేయు చున్నదిగదా ! అఘటన ఘటన పటీయసీమమ మాయా......అన్నట్లు, అవిద్యా ప్రభావము వలన యింత కథమైనది. గడ్డిపోచ మేరు పర్వతమై యున్నట్లున్నది.

బ్రహ్మనిష్ఠుడగు మహాత్ముని చిత్తము సర్వకాల సర్వావస్థల యందును, బ్రహ్మాతిరిక్తమైన బాహ్య విషయములను ఇంచుకైనను గమనింపదు. ఒకవేళ బహిర్ముఖులై వారేమి జెప్పినను అది లోక

శివంకరమగు మహా శుభమని ఎఱుగవలెను. సంతత మాత్మ నిష్ఠచే దడసిన పరమ శుభమగు బ్రహ్మాకార వృత్తియందు మరేమియు నుండదని తెలియవలెను. మరియు వారిని తెలుసుకొను వారును అపూర్వమే అట్టివారు ఒకరిద్దరే! అవిద్య శూన్య రూపిణియే వస్తుతః లేనిదే యగుటచేత విమర్శించి చూడ ఈ అవిద్య బ్రహ్మము నాశ్రయింపదు అనిన ఎంత అర్థమో! అది బ్రహ్మము నాశ్రయించి యుండును అనినను అంతియే. విచార దృష్టిచే లేనిదగు నిది ఒక దానిని ఆశ్రయించుచుండును, ఆశ్రయింపదు అను నీ రెండును వ్యవహార మాత్రములే, వంధ్యా పుత్రునకు కుందేటి కొమ్ముతో చేయబడిన ధనస్సు గలదు, అతడు ఎందరిని సంహరించునో యను మాట ఎవరికిని ఏ హానియు నెట్లుకాదో, మాయ కలదు అనినను హాని లేదు. ఇది స్వరూపము నావరించుటయును అంతే. జ్ఞానము నొందిన యథార్థము తెలియును. ఇది గురూపదిష్టంబగు రాజమార్గమై యున్నది. శ్రీగురు కరుణ యను అమృత సేచనముచేత సంక్షోభ రహితమైన, నిరుపమానమైన సర్వాధిక మగు నిజస్థితి తప్పక కలుగును.

ఆత్మయందు పరమాత్మ నిష్ఠ కలుగ ఎంతటి మహా దుఃఖములు వాటిల్లినను, ఎంతటి సుఖములు గలిగినను హర్ష విషాదములచే చిత్తము కలుషితముగాదు. ఇబ్బందులు గలిగినను ప్రతీకార బుద్ధి పుట్టదు. కారణమేమన ఆత్మ అసంగము, నిత్యము, వ్యాపకము అది నేనను గురు కృపాలబ్ధిచే నొందబడిన ధృడమగు స్థితి. కావున నీడవలె దోచు ఈ ద్వంద్వములు కదలించవని భావము. ప్రారబ్ధ క్షయ పర్యంతము ఏది ఎట్లొచ్చినను ప్రమాదము లేదు.

పరాభవ నామ సంవత్సర శ్రీమదుత్తరాయణ పుణ్య కాలమయిన పిదప గుంతకల్లు ఆశ్రమమునకు దయచేసి అటనుండి కర్నూలు మీదుగా ఆదవాని శ్రీవాసవీ మందిరమున కొంతకాలము బ్రహ్మవిద్య అను శీర్షికపై బ్రహ్మసూత్రార్థ ప్రసంగములను జరిపిరి. సర్వులు

అపూర్వమును, జటిలమునగు ఈ ప్రసంగముల నాలకించి జీవనచరమ లక్ష్యమగు ఆత్మ పరమాత్మయేయని తెలిసి ధన్య మగుటయే ఈమానవత్వమని, అందులకై ప్రబోధింప బడిన అత్యుత్తమ ప్రసంగము లివియని భక్తులు పరస్పరము "తచ్చింతనం తత్కథనం" అన్నట్లు సంభాషించు కొనుచుండిరి.

శ్రీవారు 25.2.1967 నంద్యాల శ్రీఉమామహేశ్వరాశ్రమమునకు దయచేసి, మహానంది క్షేత్రమునకు వెళ్ళి శ్రీజగద్గురు కంచికామకోటి పీఠాధీశ్వరులగు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాముల వారిని సందర్శించి మన శ్రీవారి రచనలగు ప్రస్థానత్రయాది గ్రంథములను శ్రీజగద్గురు మహాసన్నిధి సమర్పించిరి. అప్పుడు శ్రీజగద్గురువు పలికిన అమృత వాక్కులు "నారాయణ" "నారాయణ" యనుచు మీరు అధ్యాత్మవిద్యా ప్రచారము చేయుదురా? నారాయణ నారాయణ యనుచు సంతసిల్లి సౌమ్యమముగ సంభాషించుచు శ్రీవారి ముందుంచ బడిన గ్రంథములలో, శ్రీజగద్గురు శంకరచరిత్రను జగద్గురు స్వాములుచేత గైకొని తమ కళ్ళ కద్దుకొని, శిరము నందుంచుకొని గ్రంథమును తీసి చూచిరి. ఆనందము నొందుచు తమ హస్తము నందుండు పెద్ద భూతద్దముచే మరిమరి చూచిరి ......"

మరియు మన శ్రీవారు శ్రీజగద్గురు శంకర శ్రీచంద్రమౌళీశ్వరాది ప్రతిష్ఠాపన మహాకార్యములు లత్తవరము శ్రీ ఉమామహేశ్వరాశ్రమమునందు జరుగు విధివిధానములను వినయముగ భక్తిచే విన్నవించు కొనిరి. అందులకు శ్రీ జగద్గురువులు మహదానందముగ మందస్మిత వదనారవిందులై, జ్ఞాననిష్ఠా సంపన్నమగు తమ చల్లని మెల్లని చూపులచే "ఆ ఆ మనఃపూర్వకముగ అనుజ్ఞ యిచ్చుటయైనది" యను అమృతంపు పలుకులు పలుకుచు తూష్ణీం స్థితులైరి. ఆ పల్లకి (తిర్యగాందోలిక) చిన్నతలుపులు మూయబడెను. అనంతరము క్రొత్తస్వాములవారిని శ్రీ జయేంద్ర సరస్వతీస్వాములవారిని

సందర్శించి సంభాషించి సంతోషమున శ్రీ మహానందీశ్వరునకు అభిషేక పూజాదులు గావించుకొని శ్రీవారు శ్రీ ఉమామహేశ్వరాశ్రమమునకు దయచేసిరి.

అచటినుండి గుంతకల్లు ఆశ్రమమునకు వేంచేసి లత్తవరము శ్రీ ఉమామహేశ్వరాశ్రమమున శ్రీచంద్రమౌళీశ్వర, శ్రీజగద్గురు శంకర మొదలగు ప్రతిష్ఠామూర్తులు తత్సంబంధమగు కొన్ని సాలగ్రామ శివ లింగాది పూజ్యవస్తువులు తీసుకొని శ్రీ కాశీక్షేత్రము నందలి పండితులు జ్ఞానులగు మహనీయులను కలుసుకొని, కొన్ని దినములచటనే తప మాచరించుచుండి రావలెనని శ్రీవారు 3.3.1967 గుంతకల్లుభక్తాదుల వీడ్కోలు నొంది ఈశానుస్మరణ పూర్వకముగ జయపూర్‌కు వెళ్ళి మూర్తులను పరిశీలించిరి. అచ్చట సువిశాలమగుదివ్యభవనము శ్రీమహేశ్వరి సదనములో నాలుగు దినములు పూజానుష్ఠానాదులచే సన్నిధి (మకాం) చేసిరి. అచ్చట భక్తులగు శ్రీరామ్‌కృపాల్ గారు సర్వవిధముల శ్రీవారి సేవ అత్యంత భక్తి ప్రపత్తులచే నొనర్చిరి.

13.3.67కు శ్రీకాశీక్షేత్రము జగద్గురు శ్రీ విశ్వారాధ్య గురుకులము(శ్రీజంగమవాడిమఠము) చేరిరి. పరమ పావని యగు గంగ యందు స్నాన మాచరించి శ్రీసాక్షిగణపతి సన్నిధి దర్శించి శ్రీవిశ్వేశ్వరునకు, శ్రీవిశాలాక్షికి, శ్రీ అన్నపూర్ణేశ్వరికి యథావిధి పూజలు గావింప జేసి ధన్యులై జ్ఞాన సింహాసనము శ్రీవిశ్వారాధ్యగురుకులము (మఠమునకు) వచ్చి తమ మొదటి వసతియందు నియమనిష్ఠలచే నుండుచు, తదుపరి తమకు తెలిసిన పండిత మహోదయులు, పూజ్య స్వాములను, విశ్వవిద్యాలయము,విక్టోరియా కాలేజ్, సన్యాసికాలేజ్ సనత్కుమార కాలేజ్ మొదలగు స్థానములకు వెళ్ళి అధ్యాపకులు మరి తదితరులను తెలిసిన విద్యార్థులను కలుసుకొనిరి. అందరి వద్ద పరస్పరము విధ్యుక్తమగు అన్ని విషయములను సంప్రదించి సంతసించిరి.

అనుదినము శ్రీ జగద్గురు మఠమున తమ నిత్య నియమానుష్ఠాన

పూజాదులను సలుపుకొనుచు అపుడపుడు శ్రీగీతామందిరము, శ్రీదక్షిణా మూర్తి ఆశ్రమము వగైరా స్థానములకు వెళ్ళి అచట పూజ్యులు మరి పండితులుబోధించుబ్రహ్మవిద్యా(వాక్యార్థము)ప్రసంగములను, భాష్య పాఠములను శ్రద్ధచే నాలకించుచు మహదానందముగ శ్రీకాశీక్షేత్రము నందు కామదహనము (హోలీ పండుగ) పూర్ణమగునంతవరకు ఉండిరి. ఇంతలో శ్రీవారి వెంబడి వచ్చినవారు ఆ యా స్థానములకు వెళ్ళి చూచి వచ్చిరి.

## శ్రీక్షేత్రి ఉమామహేశ్వరాశ్రమము
## శ్రీ జగద్గురు శంకర. శ్రీ చంద్రమౌళీశ్వర ప్రతిష్ఠ

ఉత్తరమున శ్రీ ఉమామహేశ్వరాశ్రమ ప్రతిష్ఠా మహోత్సవ మునకు వలయు పూజ్య వస్తువులు శ్రేష్ఠమైన నర్మదాబాణ శివ లింగము మొదలగు వాటిని తీసుకొని కాశీ గంగా పూర్ణకుంభమును గైకొని 13.4.67 కు ఉత్తరమున శ్రీ ఉమామహేశ్వరాశ్రమమునకు విజయంచేసిరి. ఇచట ప్రతిష్ఠా మహోత్సవ బృహత్కార్యక్రమములు జరుగుటకు వ్యవస్థా బద్ధముగ సర్వమును దివ్యభవ్యముగ సమలంకరింప బడెను. 8.5.67 కు ఆహూతులైన వైదిక బ్రాహ్మణులు, భూసురు లేతెంచిరి. పూజ్యులగు మహాత్ములు దయచేసిరి. ప్రతిష్ఠామహోత్సవ కార్యము వేదోక్తముగ మంటపప్రవేశము, మహాగణపతిపూజ, స్వస్తి పుణ్యాహవాచనము, నాంది ఋత్విగ్వరణము మొదలగు వైదిక కార్యములచే ప్రారంభింపబడెను. తీర్థప్రజలవలె ఈ పుణ్య స్థలము నకు అనేక పట్టణములు గ్రామములు పల్లెలనుండి భక్తాదులు సమయ మునకు విచ్చేసిరి. 12.5.67 వరకు అయిదు దినములు ఈ మహా కార్యము జరిగెను.

ఈ పవిత్ర స్థలమునందు వర్షపాతమైనచో నైసర్గికముగ యా గంగ (జలము) పశ్చిమ వాహినియై ప్రవహించును. తూర్పున ఈ శాన్యదిశలో (ఆశ్రమ ముందు భాగమున) చిన్నదొక పర్వతముండు

టచే రమ్యమగు పుణ్య క్షేత్రమై వెలయుచున్నది.ల త్తవరము శ్రీరత్న గిరియే. ఇట్టి ఈ ఆశ్రమ స్థలమును చూచి, వచ్చిన వైదిక బ్రాహ్మణులు, పూజ్య స్వాములు, ఇతర భక్తాదులందరు పరస్పరము మాటలాడు కొనుచు సహజముగ నిట గంగ పశ్చిమ వాహినియై దొరులును గాన ఇదొక మహాక్షేత్రమని సంతసించిరి. మరి సాక్షాత్ శ్రీఉమా మహేశ్వరులు, శ్రీజగద్గురువులు,శ్రీచక్రయంత్రరాజాది ప్రతిష్ఠా మహా కార్యములచేత ఈస్థానము ఇక మీదట "శ్రీక్షేత్ర" మనబడునని వచ్చిన మహాత్ములు వైదిక బ్రాహ్మణులు ముక్త కంఠముచే పలికిరి. నాటినుండి ఇది శ్రీక్షేత్రము శ్రీఉమామహేశ్వరాశ్రమమని పిలువ బడుచున్నది.

స్వస్తిశ్రీ ప్లవంగ నామ సం॥ర వైశాఖ శుద్ధ అక్షతదియ శుక్ర వారము 12.5.1967 శుభముహూర్తమున శ్రీరత్నగర్భగణపతి, శ్రీ చంద్రమౌళీశ్వర మహాలింగము, శ్రీనందీశ్వర, శ్రీశారద, శ్రీజగద్గురు శంకరాచార్యస్వామి మూర్తి (ప్రతిమ) ప్రతిష్ఠలు తదుపరి శ్రీసాక్షి గణపతి, శ్రీఉమామహేశ్వరి( పార్వతీ),శ్రీచక్ర యంత్రరాజము,ధ్వజ ప్రతిష్ఠలు వేదోక్తముగ జరిగెను. విశేషముగ పుష్పవృష్టి గురిసెను. బ్రాహ్మణులు వేదఘోష చేయుచుండ వివిధ మంగళ నాద్యములు మిన్నుముట్టుచుండెను. పూర్ణాహుతి ఆజ్యావలోకన మరి మహాకార్యముల కేతెంచిన యతీశ్వరుల పూజ, విధ్యుక్తముగ జరిగెను. ఈ 5దినములు ఉదయ సాయంకాలముల యందు పూజ్యపాదులగు శ్రీశ్రీశ్రీ శుద్ధచైతన్య స్వాములవారు, శ్రీశ్రీశ్రీ రామకృష్ణానంద స్వాముల వారు, శ్రీశ్రీశ్రీ భూమానంద స్వాములవారు శ్రీశ్రీశ్రీ శివప్రకాశా నందస్వాములవారు, బ్రహ్మశ్రీ యన్. పేరరాజు పండిత మహోదయులు విచ్చేసి ఉపన్యసించిరి. యజమానులు గీతాగానసుధా సమితి వారిచే గీతా బుర్రకథ గానము చేయబడెను.ఆదవాని గౌరా శ్రీకృష్ణమూర్తిగారి మనుమలు శ్రీఎ. ఆనందంగారి కూతురు ఈచిన్ని

బిడ్డలు చక్కగ మహాసభయందు సంగీత కచ్చేరిచేసిరి. మరి కొందరు పండితులు కవుల ఉపన్యాసముల చేతను వేలాది (అసంఖ్యాక) భక్తులచే గూడి పూజ్య శ్రీవారి ఆధ్వర్యమున ఈ మహాకార్యము శివప్రదముగ సాంగ మంగళమాయెను. అందరు దైవ దర్శనము నొందిరి. తదుపరి శ్రీఉమామహేశ్వరుల, శ్రీజగద్గురు శంకరాచార్యుల, తిర్యగాందోలిక పల్లకి మహోత్సవములు వైభవముగజరిగెను.భూరి అన్నసంతర్పణ మాయెను. ఈ మహాక్షేత ఆశ్రమనిర్మాణాది సర్వ కార్యములకు ఆదోని శ్రీమాన్ యలె. మల్లేశప్పగారి సతీమణి శ్రీయలె. పార్వతమ్మగారి సద్భక్తి భావనలే కారణము, మరియు ఆగ్రామము వారందరు భక్తిచే సేవ యొనర్చిరి. సంస్తుత్యము.

శ్రీవారిచటనే తపస్సంపన్నులయి పూజానుష్ఠాన భాష్యప్రవచనములచే నిత్య సుఖ ముండిరి. 14.5.67 శ్రీశంకర జయంతి మహోత్సవము విధ్యుక్తముగ జరిగెను. శ్రీప్లవంగ నామ సం॥ర జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమ గురువారం 22.6.67 తేది చంద్రమౌళీశ్వరరాది ప్రతిష్ఠామండల మహాపూజ మహాన్యాస పూర్వక ఏకాదశవార శ్రీరుద్రాభిషేకము సహస్ర కుంభాభిషేకము లక్షబిల్వార్చన శ్రీచక్రమునందు లక్ష కుంకుమార్చన శ్రీరుద్ర స్వాహాకారాది కార్యములు యథా శాస్త్రము సాంగోపాంగముగ జరిగి మహామంగళ మంత్ర పుష్పమాయెను. ఓం.

సచ్చిదానంద స్వరూపులై శ్రీమజ్జగద్గురు శ్రీశంకరాచార్య శ్రీచంద్రమౌళీశ్వరుల ప్రతిష్ఠా మహోత్సవ మైనది. దేవదేవుడైన శ్రీమదాచార్య స్వాముల వారి పాద పద్మములకు భక్తిచే సాష్టాంగ ప్రణామములు. బ్రహ్మానందము నొసగు శ్రీశంకరులకు, శ్రీఉమామహేశ్వరులకు "నమః పురస్తాదథ పృష్ఠతస్తే, నమోఽస్తుతే సర్వత ఏవ సర్వ, అనంత వీర్యామిత విక్రమస్త్వం, సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః" అను భగవద్గీతా వాక్యరీతి సర్వత్ర అనంత ప్రణా

మములు సమర్పించు చున్నాము. మందస్మిత వదనారవింద సుందర స్వరూపులు శ్రీచంద్రమౌళీశ్వర పూజా దురంధరులు,లోకానుగ్రహార్థము అవతరించి వచ్చిన, సాక్షాత్పరమ శివుడే శ్రీఉమామహేశ్వరులే శ్రీ శంకరులు. భక్తుల భవమునుబాపు దేవదేవుడగు శ్రీశంకరులకు మరి మరి ప్రణామములు. భూమాతకంటెను గొప్ప ఓర్పు గలవాడును, సంతత శివపూజా దురంధరుడు, బ్రహ్మవిద్యా ప్రబోధకుడును, అమృతమును మించిన మృదుమధుర సంభాషణలచే నొప్పు శ్రీశంకర జగద్గురువరేణ్యులకు వారం వార ప్రణుతి శతములు.

అజ్ఞాన మను తిమిరమును బాప నవతరించిన సహస్ర సూర్య ప్రకాశమా! అనునట్లు, వాక్యార్థ ప్రబోధలచే హృదయము నాశ్రయించి యున్న అజ్ఞానమను చిజ్జడగ్రంథి బాపి పరమశివ స్వరూపుడవే నీవని శారీరక మీమాంసాసూత్రభాష్యములచే తెలుపు దేవదేవుడైన శ్రీశంకరులు సాక్షా చ్ఛ్రీమదుమామహేశ్వరులే, పరమశివుడే, అట్టి స్వామికి అనంతమగు నమస్కృతులు. భస్మ త్రిపుండ్రాంకిత ఫాల భాగము కలిగి నట్టివాడును, రుద్రాక్ష కంఠమాలా ధరుడును, విశాల వక్ష స్థలము గలిగినవాడును, ప్రకాశించెడి కాంచన చేలమునుధరించిన వాడును, పరబ్రహ్మజ్ఞానముచే నిత్యతృప్తుడై లోకమునకు బ్రహ్మ తత్త్వము నందజేయ నవతరించి వచ్చిన శ్రీదక్షిణామూర్తియే పరమ శివుడే శ్రీశంకరాచార్య జగద్గురువరేణ్యులై లత్తవరం శ్రీక్షేత్రమున విజయంచేసి యున్నాడు. అట్టి దేవదేవునకు అన్ని దిక్కుల నుండి మరిమరి ప్రణామములు.

యావద్భారతావని మూడుసారులు పాదచారులై పర్యటించి, విమతములను దూరీకరించి, షణ్మతములను స్థాపించి, సత్య మద్వైతం బను జ్ఞాన ప్రబోధ సలిపి ప్రస్థానత్రయమునకు భాష్యము రచించి అజ్ఞానమును భగ్న మొనర్చి అధికారులకు ఆత్మబ్రహ్మమే దృఢ యను నిష్ఠను ప్రసాదించిన శ్రీజగద్గురుశంకరాచార్యుల కనంతప్రణామములు.

భక్తుల భవమును బాపి బ్రహ్మమే నీవని తెలుపుచు, అంతర్ముఖులై సదా శ్రీచంద్రమౌళీశ్వర పూజాతత్పరులై లోకమున కాదర్శముగ జగదాచార్యులై వెలసి కర్మభక్తిజ్ఞాన వైరాగ్యములను బోధించుచు పరమలక్ష్య మాత్మజ్ఞానమే "బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః" యను తత్వార్థమును బోధించిన జగద్గురు వరేణ్యులు నేడు శ్రీఉమామహేశ్వర గురుపీఠమున విజయం చేసి పరమ శివుడై, జగద్గురుడై మనల నుద్ధరించు స్వామియై వెలసి యుండు శ్రీశంకరాచార్య స్వామి భగవత్పాదులకు పరమ భక్తిచే ప్రణమిల్లుచున్నాము...... అను నిత్యాదిగా శ్రీవారు విశేషించి శ్రీజగద్గురువుల అవతార విశేషములచే నొప్పు చరిత్రను మహోపకారములను గురించి ప్రబోధించిరి.

"బ్రహ్మైవాచార్య రూపేణావతిష్ఠతే" "ఆచార్యవాన్ పురుషో వేద" "ఆచార్యదేవా విద్యావిదితా సాధిష్ఠం ప్రాప్నోతు" అన్నట్లు ఉపనిషత్తుల యందు ప్రధానముగ శ్రీగురు సన్నిధి తెలియదగిన ఆరు లింగముల ప్రతిపాదన యుండును. వేదప్రోక్తములై యుండు అనేక వాక్యములు ఈ ఆరులింగముల యందంతర్గతములై యుండును. "ఉపక్రమోపసంహారోఽభ్యాసో ఽపూర్వ్వఫల అర్థవాదోపపత్తీచ లింగ తాత్పర్య నిర్ణయే" అని అన్ని వేదవాక్యముల తాత్పర్యమును నిర్ణయించుటకు గాను ఇట్లు ఉపక్రమ, ఉపసంహార మని రెండునుచేరి ఒక లింగము. అభ్యాస, అపూర్వత, ఫలము, అర్థవాదము, ఉపపత్తియని చెప్పబడును.

ఛాందోగ్యోపనిషత్తునందు ఈ సృష్టికంటె మొదట "సదేవ సౌమ్యేద మగ్ర మాసీదేక మేవాద్వితీయం బ్రహ్మ" స్వగతాది భేద రహితమై, అఖండైక రసమగు సద్రూప బ్రహ్మమొకటియేయుండెనని చెప్పుటే ఉపక్రమ మనబడును. ప్రకరణ సమాప్తియందు ఆత్మైవేదం సర్వమ్" ఈ పరిదృశ్యమానమై తోచు నామ రూపాత్మకంబగు జగత్తెల్లయు బ్రహ్మమే నని బాధ సమానాధి కరణముచే నామ రూపము

లను బాధించి, ఇదంతయు బ్రహ్మమే నని చెప్పుటే ఉపసంహార మన బడును. ఈ రెండును కలసి ఒక లింగము.

అనంతరము ప్రకరణ మధ్యస్థముగ పునః పునః "సఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి" ఓ శ్వేతకేతూ ఆ సద్రూప బ్రహ్మమే నీవై యున్నావని 9 పర్యాయములు 9 దృష్టాంతములనిచ్చి చెప్పియున్నారు. తాత్పర్య మేమన సాక్షి ప్రత్యగాత్మ యగు తాను పరబ్రహ్మస్వరూప మేమై యున్నాడని అర్థము. ఇట్లు సారెసారెకు చెప్పి యున్నందున అభ్యాస లింగమని చెప్పబడును.

ఇక బ్రహ్మాభిన్న ప్రత్యగాత్మ స్వరూపము ప్రత్యక్షాది ఆరు ప్రమాణముల చేతను విషయీకరింపబడదు అది స్వతః ప్రమాణ మని చెప్పుటయే అపూర్వతా లింగమన బడును. "ఏక విజ్ఞానేన సర్వం విజ్ఞాతం" ఒక్కటగు బ్రహ్మ తత్త్వమును తెలియుట వలన సర్వము తెలిసినట్లే అని బోధించునదే ఫల లింగము. కారణ మగు మృత్తు నెరిగిన కార్యమగు ఘట శరావాదు లన్నియును తెలిసి నట్లయ్యెను. సువర్ణ మొక్క దానిని ఎఱిగిన కార్యమగు ఆభరణము లన్నియును తెలిసినట్లాయెను. ఇటువలె జగత్కారణ మగుసద్రూప బ్రహ్మ మొక్కటి దెలిసిన సర్వమును తెలిసినట్లే యగునని ఈవిధముగ తెలుపు నదే ఫలలింగ మనబడును.

పిదప ప్రత్యగాత్మ స్వరూపమైన నిర్వికార పరబ్రహ్మమేసృష్టి (ఉత్పత్తి) స్థితి సంహార నియమనము ప్రవేశములను పంచకృత్యములను చేసెనని కర్తృత్వమును చెప్పుటే అర్థవాద లింగము. "స్థితస్య గతిశ్చింతనీయా" అను న్యాయరీతి వుండిన ఒక సద్రూప బ్రహ్మమే యేమైనను జేయవచ్చును అర్థాత్ లేని దేమియును చేయదని తెలియవలెను. ఉండిన సద్వస్తువే అట్లు తోచెనని భావము. లేక అద్వైత తత్త్వమును నుతించుచు ద్వైతమును నిందించు వాక్యములు అర్థవాద లింగమే యని అని పించును. ఘటమునకు మృత్తిక: తంతు జాలమునకు

సాలెపురుగు ఉపాదాన కారణ మైనట్లు బ్రహ్మమే జగత్తునకు అభిన్నో పాదానమని చెప్పుటే ఉపపత్తి యను లింగము. ఇట్లు ఆరు విధలింగ ముల అర్థమును విచారించి చూడగ జీవ పరమాత్మాభేదమగు అద్వైతమే పరమ తాత్పర్యమని సిద్ధించు చున్నది. ఈఅర్థమును క్రమముగ నెఱుగుట ఉత్తమోత్తమము. ఇదే శ్రవణార్హమగు ప్రసంగమై యున్నది. అను నిత్యాదిగా తెలుపుచు మనన నిదిధ్యాసాది విషయములను బోధించిరి..." అసంభావన లేక అభేదాను సంధానముచే భేద బాధక మొనర్చి తెలియుట మనన మనబడును. విపరీత బుద్ధిలేక యుండుట నిదిధ్యాస యనబడును" — అను నిత్యాదిగా వివరించిరి.

ఈజ్యేష్ఠ శుద్ధ పూర్ణిమ నుండి శ్రీవారు శ్రీఉమామహేశ్వర గురుపీఠ మహాయంత్ర ప్రతిష్ఠ,శ్రీఉమామహేశ్వరుల (ప్రతిమ) ప్రతిష్ఠాది కార్యములు యథాశాస్త్రముగ విధ్యుక్తమై ఇచట ముందు నడచుటకుగాను సంపూజ్యమగు నియమ నిష్ఠలచే శ్రీగురుమహా మంత్ర కోటిజపానుష్ఠానసంయమ వ్రతశీలురై ప్రారంభించి నియమము దప్పక జపము సాగించిరి. జీవితమున ఇదొక అపూర్వమును, శ్రీగురుకరుణా పూర్ణమైన పరమ పావనంబగు దివ్యఘట్టము, శ్రీవారు శ్రీజయనామ సం॥ర జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమ బుధవారము 16-6-1954 పవిత్ర ముహూర్తమునందు విధ్యుక్తముగ శ్రీమదుమామహేశ్వర గురుపీఠ సమారోహణ జరిగిన పర్వదినము కూడ జ్యేష్ఠశుద్ధ పూర్ణిమయై యుండెను.

శ్రీవారు "ఈవైదిక దైవ ప్రతిష్ఠా మహాకార్యములు మరియును శ్రీవారి చరిత్ర యందు సారె సారెకు 'తమ నిత్య పూజానుష్ఠానము' అను వాక్యములు విరివిగా వచ్చుచుండును.శ్రీవారుజన్మతః గురుకుల సంజాతులు తదుపరి శ్రీఉమామహేశ్వర గురు పీఠాచార్యులయి యున్నారు. గావున ఆచార్య సంప్రదాయానుసారముగ పూజాద్యనుష్ఠానము లనునవి సహజము."సహజ సమాధి స్థితియే మాపూజానుష్ఠానములు" అని శ్రీవారు తెలుపుచుందురు. నిష్కామమును బ్రహ్మ

జ్ఞాన సంపన్నమగు ఆధ్యాత్మిక దృక్కోణముచే సంప్రదాయ సిద్ధములు ముముక్షు జన సంసేవ్యములగు పద్ధతులు వీరివి. శ్రీవారుమాతృ గర్భమునుండి జనించినది మొదలు నేటి వరకు పుట్టినవారు పుట్టినట్లే యున్నారు. ఇది శ్రీవారి పుట్టుక యందలి అపూర్వత, అలౌకికమగు కారణ జన్మయని మహనీయులు సంతసింతురు. శ్రీవారి వాక్యముల నెన్నో పర్యాయములు తెలుపుచుందురు."శ్రీవారి గురుదేవులు శ్రీ సదానంద సద్గురు స్వాములవారు మన శ్రీవారిని సర్వ విధముల పరీక్షించి పరిశీలించి "నీజన్మ సనక సనందనాదుల వలె నున్నదప్పా" యని పలుకుచు ఈ గురుపీఠమునకు దక్షిణ దిశనుండి స్వామి వచ్చునని మాగురువులు శ్రీప్రణవానంద స్వాములవారు చెప్పచుండిరి. నీ పుట్టుక, నీవిచటికి వచ్చినది దక్షిణ దిశ నుండియే స్వామీ ! కావున నీయందు మాకొక దృష్టి కలదు ......నీవు సహజముగ స్వామియే స్వామియైయుండప్పా ! అను చుండెడి వారట."

3.7.67 కు శ్రీవారి పరమ గురువులు పూజ్యాభిపూజ్య శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్యులైన శ్రీమత్పూజ్యపాద శ్రీశ్రీశ్రీ ప్రణవానంద సద్గురు మహాస్వాములవారి పుణ్యారాధన మహోత్సవమును శ్రీవారు యథావిధి భక్తిచే నాచరించు కొనిరి. ఆనాడుపరమ గురువుల చరిత్రను వారి ప్రబోధలను తమ గురుదేవులు మనశ్రీవారికి చెప్పచుండిన విషయములను స్వామివారు చక్కగ ప్రతిపాదించుచు విశద పఱచిరి. 5.7.67 తేది యందు మన శ్రీగురుదేవుల జయంతి (జన్మ దినోత్సవము) విధ్యుక్తముగ భక్తాదు లందరు గలసి చేసిరి.

శ్రీజగద్గురు శంకర, శ్రీచంద్రమౌళీశ్వర ప్రతిష్ఠా మహోత్సవ సమయమునందు గుత్తిపట్టణము భక్తాదులు వచ్చి పూజ్యగురుదేవులు ఈ సంవత్సరము శ్రీచాతుర్మాస్య మహావ్రతము గుత్తి శ్రీకన్యకా పరమేశ్వరి దేవస్థానమునందు జరిపి మమ్మందరిని ఆనంద పరచవలెను ధన్యుల జేయవలెనని ప్రార్థించి 23వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము

గుత్తియందే జరుగునట్లుగ నిర్ధరింప జేసుకొని ఫలమంత్రాక్షతల నందు కొని వెళ్ళియుండిరి. కావున ఆమహాకార్యమునకై శ్రీవారిని ఇచటి నుండి 16 7.67 గుత్తి భక్తాదులు వచ్చి శ్రీకన్యకాపరమేశ్వరి ఆల యమునకు దోడ్కొని వెళ్ళిరి.

## 23.వ. శ్రీచాతుర్మాస్యమహావ్రతము-1967 సం॥

స్వస్తిశ్రీ ప్లవంగనామ సం॥ర ఆషాఢ శుద్ధ॥ ౧౧॥సోమవారం 17.7.67 బ్రహ్మముహూర్తమున మంగళవాద్యములు మ్రోగుచుండ సద్బ్రాహ్మణులచే వేదఘోషలు జరుపబడుచుండ, గంగా కలశమును దెచ్చి యథావిధి శ్రీచంద్రమౌళీశ్వర పూజానుష్ఠానాదులచే శ్రీవ్యాస పూజ వగైరా కార్యములతో మహావ్రతము విధ్యుక్తముగ ప్రారంభ మాయెను. 18 అధ్యాయములు గీతా పారాయణము అయిన పిదప శ్రీగురుదైవ స్మరణచే కఠోపనిషద్ భాష్యపాఠము (ప్రవచనము) శాంతి మంత్రములచే ప్రారంభ మయినది.9.30 గం.లకుమహామంగళ మంత్రపుష్పముతో ప్రాతఃకాల కార్యక్రమము పూర్ణ మాయెను. సాయంకాలము ప్రదోష పూజానుష్ఠానాదులు జరిగిన పిదప7గం॥నుండి 8.30 గం॥ వఱకు శ్రీమద్భగవద్గీతా భాష్య శ్రవణము గావింప బడి నది. వేలాది భక్తులచే యుక్తమై 17.7.67 మొదలు కార్తిక శుద్ధ॥ ౧౨॥ సోమవారం 13 11.67 వఱకు శ్రీగురు కరుణచే అఖండముగ కార్యక్రమములు జరిగి,శ్రీఉమామహేశ్వరులకృపతోపూర్ణమాయెను. గుత్తి పట్టణవాసులగు అనేక సుహృజ్జనులు భక్తులు దేవస్థానము కమిటివారు మొదలగు సర్వులు అత్యంత శ్రద్ధాభక్తులతో ఈ మహా కార్యమునందు పాల్గొని సంస్తుత్యమగు సేవ చేసిరి. ఈ మహా వ్రతము నందు పూజ్యపాద శ్రీ శుద్ధచైతన్య స్వాములు, బ్రహ్మశ్రీ శంకరశాస్త్రి స్వాములు, శ్రీ రామకృష్ణానందస్వామి ప్రభృతులు దయచేసి యుండిరి. గీతాగానసుధా సమితి వారు గీతా బుర్రకథ సర్వజనానంద ప్రదముగ సలిపిరి.

అనంతరము భక్తాదులందరితో కలసి శ్రీరామేశ్వర క్షేత్రమునకు దీక్షా విమరణమునకై భక్తుల సద్భావనానుసారముగ అంగీకరించి ప్రయాణమైరి. భక్తులగు బ్రహ్మశ్రీ ఆర్. రంగస్వామయ్యంగారు తమ బస్సులో అందరిని పిలుచుకొని శ్రీరామేశ్వర క్షేత్ర యాత్రసుఖముగ గావించిరి. రామేశ్వరమునకు వెళ్ళునపుడు అనంతపురము భక్తులు ప్రాతవూరు శ్రీకన్యకాపరమేశ్వరి ఆలయము నందు పూజ్యశ్రీ స్వాముల వారికి ఘనమైన స్వాగతము నొసగిరి. పిదప యాత్ర ముందునడచి శ్రీరామేశ్వర క్షేత్రము చేరెను. 17.11.67 శ్రీరామేశ్వర మహాక్షేత్రమునందు యథావిధి దీక్షా విరమణ కార్య మొనర్చి, పిదప సముద్రస్నాన మాచరించి శ్రీరామేశ్వర జ్యోతిర్లింగమునకు మహాన్యాస పూర్వక శ్రీరుద్రాభిషేకము గావింప జేసిరి. శ్రీవారు సహజ సమాధి స్వరూపానందానుభవము నొందుచు ఆనందించిరి. వచ్చిన అందరు భక్తులును మరి మరి తృప్తి నొందుచు శ్రీ సన్నిధి పూజానుష్ఠాన, శాస్త్రశ్రవణాదులచే సంతుష్టు లయిరి.

అచటి నుండి సాక్షాత్పరశివుడగు శ్రీశంకర భగవత్పాదులవతరించిన జన్మ స్థలమగు శ్రీకాలడి (అగ్రహారము) క్షేత్రమునకు వెళ్ళి పూర్ణానదీ తోయముల తనివిదీర పరమ భక్తిచే అందరు గ్రుంకులిడి స్నానమాచరించి అచటి శ్రీకృష్ణపరమాత్మను సందర్శించి పరమశివుడే శ్రీశంకర యను నామమున భూలోకమున అవతరించి భూమిని సోకిన పవిత్ర స్థలమగు శ్రీశంకరుల మందిరమును మఠమును సందర్శించి శ్రీ శంకర శారదా చంద్రమౌళీశ్వరులకు విధ్యుక్తముగ పూజలు గావింపజేసిరి. శ్రీశంకరుల తల్లి శ్రీ మదార్యాంబ అధిష్ఠానము (బృందావనమును) దర్శించి అందరు ప్రదక్షిణ నమస్కారములచే తుష్టులయి, శ్రీ జగద్గురు నాజ్ఞ నడసి అచటినుండి సుఖముగా బయలుదేరిరి. ఆసన్నివేశము యాత్ర శివప్రదమైయొప్పుచు పూర్ణమాయెను.

28.11.67 శ్రీవారు తమ గురుదేవుల పుణ్యారాధన విధ్యుక్త

ముగ నాచరించుకొనిరి, అనంతరము బెళగుప్ప వగైరా స్థానములకు దయచేసి బ్రహ్మవిద్యా ప్రబోధ మొనర్చుచు ఉత్తరాయణ పుణ్య కాలమునకు గుంతకల్లు శ్రీ ఉమామహేశ్వరాశ్రమమునకు దయచేసి శ్రీవివేక చూడామణి ప్రకరణగ్రంథప్రసంగమును మంగళ ప్రదముగ జరిపిరి.

ఉత్తరము శ్రీక్షేత్రఉమామహేశ్వరాశ్రమమునకు శ్రీ జగద్గురుశృంగేరీ శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వాములవారి శుభాగ మనము.

15-1-68 ప్లవంగనామ సంవత్సర పుష్యశుద్ధ పూర్ణిమ సోమ వారము సాయంకాలము 6 గంటలకు దయచేసి ఆశ్రమమును తిలకించి జగద్గురు శ్రీశంకర శారదా చంద్రమౌళీశ్వర శ్రీరత్నగర్భ గణపతిని దర్శించి,

"ఆ, యెష్టు ప్రశస్తవాగిదె శృంగేరియల్లి శ్రీశారదా శంకర చంద్రమౌళీశ్వర రత్నగర్భగణపతి-ఇల్లియూ హాగే యిదె యేనువ్య త్యాసవిల్ల-ఇదు ఉమామహేశ్వర గురుపీఠవా! బహళ సంతోష బహళసంతోష శివశంకర!" యనుచు తమ అమృతహస్తములచే మంగళ మయమగు శ్రీ శంకరాచార్యస్వామిమూర్తికి పుష్పమాలను ధరించి తామే స్వయముగ నారికేళఫలమును గొట్టి మంగళమొసగి మంత్రా క్షతి పూర్వకముగ రెండు రూప్యముల నచట ఉంచి సంతసించిరి.

ఆ మహాప్రసాదము భక్తిచే సదా పూజింపబడుచు భద్రముగ ఆశ్రమమున నుంచబడినది. శ్రీ జగద్గురు మహాసన్నిధివారి సందర్శన ముచే సర్వులు ధన్యులయిరి.

22.4.68 సంవత్సరము శుభముహూర్తము నందు నంద్యాల భక్తులందరి సదిచ్ఛచే అచట శ్రీఉమామహేశ్వర గురుపీఠ,శ్రీ ఉమా మహేశ్వరాశ్రమ నిర్మాణమునకుగాను తీసియుంచిన నంద్యాల సంజీవ

నగర్ ఆశ్రమస్థలంలో విధ్యుక్తముగ శంకుస్థాపన కార్యము జరిగినది. శ్రీవారు ఆశ్రమములు వాటి ఉద్దేశములు మొదలగు అనేక ఆర్షధర్మ ప్రతిపాదకంబులైన దివ్య సందేశము నొసగిరి. వేలాదిగ భక్తజనావళి చేరియుండి కార్యము శివప్రదమ్మై జరిగెను. అచటనే శ్రీ ఉమామహేశ్వర కుటీర స్థాపన మయ్యెను.

శ్రీకీలక నామ సం॥ర వైశాఖ శుద్ధ పంచమి గురువారము 2.5.68 శ్రీజగద్గురు శంకర జయంతి మహోత్సవము లత్తవరము శ్రీక్షేత్రము నందు యథాప్రకారము మహదానందముగ జరిగెను. ఆ సమయమునకు అనంతపురము భక్తులు వచ్చియుండిరి. గుత్తిలో 23వ శ్రీచాతుర్మాస్య మహావ్రత సుసమయమునందు అనంతపురము భక్తామలసేకులు వచ్చి శ్రీసన్నిధి సందర్శించి వాక్యార్థ శ్రవణపూజానుష్ఠానాది కార్యములను తిలకించి 2,3 దినము లచటనే యుండి వెళ్ళుచుండిరి. అందులో మాన్యశ్రీ మేడా సుబ్బయ్య శ్రేష్ఠి యమ్.యల్.సి. గారు వారిసతీమణి కుం॥సౌ॥ పార్వతమ్మగారు, శ్రీమేడారామయ్య శ్రేష్ఠి దంపతులు బ్రహ్మశ్రీ యన్. రామారావుగారు, శ్రీ ఉదయగిరి కొండయ్యశ్రేష్ఠి దంపతులు మున్నగువారు వచ్చియుండిరి. వచ్చిన భక్తాదులందరును శ్రీ గురుస్వాములవారిని మన పట్టణమునకు ఆహ్వానపఱచి అచటనే వచ్చే సం॥ 24వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము జరుగునట్లు ఏర్పాటు గావించిన బాగుండునని శుభ సంకల్పము జేసి శ్రీసన్నిధి విన్నవించుకొనిరి.

2.5.68 శ్రీశంకరజయంతికి లత్తవరము శ్రీక్షేత్ర ఉమామహేశ్వరాశ్రమునకు అనంతపురమునుండి శ్రీ ఉదయగిరి కొండయ్యగారు, శ్రీ కె.సి. వెంకట సుబ్బయ్యగారు భక్తిచే వచ్చియుండిరి. నాటి మహాసభయందు శ్రీజగద్గురు శంకరాచార్యస్వామి చరిత్ర ప్రసంగమయిన పిదప 24వ శ్రీ చాతుర్మాస్య మహావ్రతము భక్తుల ప్రార్థనానుసారము ఈసంవత్సరము అనంతపుర పట్టణం శ్రీపార్వతీ నిలయం

శ్రీమేడా సుబ్బయ్యగారి బంగ్లాలో (భవనంలో) విధ్యుక్తముగ గురు కరుణచే జరుగునట్లు నిర్ధరింపబడినదని శ్రీవారు తమ అమృతహస్తము లచే ఆ వచ్చిన వారికి ఫల మంత్రాక్షతలను ప్రసాదించిరి.

21-6-68 బుక్కాపురం శ్రీనిర్వాణాశ్రమము (శ్రీమఠం) నందు శ్రీవారి పరమ గురువుల పుణ్యారాధన చక్కగ నడచెను. 23-6-68 శ్రీగురుదేవుల జయంత్యుత్సవము శివప్రదముగ జరిగెను. భక్తాదులు భక్త్యావేశపూరితులై తమ భక్తి ప్రపత్త్యుద్గారములను తెలిపిరి.

అనంతపురము భక్తులు వచ్చి శ్రీవారిని 5.7.68 తేది అనంత పురము పట్టణమునకు దోడ్కొని వెళ్ళి శ్రీరాజేంద్రహైస్కూల్ ఆవరణములో బహిరంగసభ జరిపి అచ్చటి నుండి పూర్ణ కుంభముచే వేదమంత్రముల పఠనచే శ్రీమేడా సుబ్బయ్యగారి బంగ్లా శ్రీపార్వతీ నిలయమునకు మంగళ వాద్యములతో బిలుచుకొని వెళ్ళిరి.ఆభవనము మహావ్రతాచరణకు వలయు అన్ని వసతులచే నొప్పుచు ఉత్తమోత్త మమై యుండెను. 24వ శ్రీచాతుర్మాస్య మహావ్రత వ్యవస్థాపకులగు భక్తమండలి కమిటి సదస్యులందరు ఎంతో శ్రద్ధచే పనిచేయుచు శ్రీ పార్వతీనిలయము బయలు స్థలమున నిండుగ పెద్దపెండాలు వేయించి సువ్యవస్థచే సాలంకారముగ సభా మంటపమును గావించి యుండిరి.

## 24.వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1968 సం॥

స్వస్తిశ్రీ కీలక నామ సం॥ర ఆషాఢ శుద్ధ ॥౧౧॥ 6-7-1968 బ్రహ్మముహూర్తమున ప్రభాతసేవ నడచిన పిదప మంగళ వాద్యముల చేతను,సద్బ్రాహ్మణుల వేదఘోష చేతను పూర్ణకలశముదెచ్చి యథా రీతిశ్రీఉమామహేశ్వర గురుపీఠ సంప్రదాయకముగశ్రీఉమామహేశ్వ రుల (శ్రీచంద్రమౌళీశ్వర) పూజానుష్ఠానములు శ్రీవ్యాసపూజ, శ్రీ గురుపూజ మొదలగు మహావ్రతనియమాంగములతో విధ్యుక్తముగ

నారంభింపబడి ప్రాతఃకాలము ఈశావాస్యోపనిషత్ప్రవచనము,మహా మంగళ మంత్ర పుష్పాదులచే 9 గంటలకు ఉదయము కార్యక్రమము పూర్ణమాయెను. సాయంకాలము ప్రదోష పూజాద్యనుష్ఠానానంతరము 7గం॥ నుండి 8.30 గం॥ వఱకు శ్రీమద్భగవద్గీతా భాష్య ప్రవచనము మహాప్రసన్నముగ జరుపబడుచు అందరికి నిత్యానంద ప్రదమైయుండెను. ఇట్లు 6.7.68 మొదలు కార్తిక శుద్ధ ॥౧౨॥ 2.11.68 వఱకు మహావైభవముగ మంగళమయమై జరిగెను.

అనుదిన శాస్త్రప్రవచనాదుల చేతను, ప్రత్యేకముగ ముముక్షువులకు వలయు పాఠములచేతను, మరియు ఈమహావ్రత మధ్యకాలమున ఆహూతులై దయచేసిన మహాత్ములఉపన్యాసములచేతను పరమ శివంకరమై యుండెను. ఇచటికి విజయము చేసిన మహాత్ములు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులు సురపురం శ్రీశంకరశాస్త్రి స్వాములవారు, పూజ్యపాద శ్రీరామకృష్ణానందస్వాములవారు, శ్రీ శుద్ధ చైతన్య స్వాములవారు, శ్రీ నిత్యానంద స్వాములవారు, శ్రీశివప్రకాశానంద స్వాములవారు, శ్రీ ఆత్మానంద స్వాములు మున్నగువారు. వారందరి ప్రవచనములను మరియు నైమిత్తికంబులగు విశేషకార్యములచేతను, వేలాది (అసంఖ్యాక) భక్తుల సమావేశము చేతను అనేక పట్టణముల నుండి గ్రామముల నుండి వచ్చిన శ్రోతలు ఈమహాకార్యమున పాల్గొని శ్రవణ పూజానుష్ఠానాదులచే తృప్తులయిరి. శ్రీ నాగానందాశ్రమ భక్తులెంతయు గొప్పగ సేవచేసిరి. "ఆపట్టణవాసులు అమితమగు ఆనందము నొందుచు ఇంతవరకు ఇట్లు 120 దినములు అఖండముగ నొకటే విధముగ ఇంత చక్కగ దీర్ఘ సత్రయాగమై అనంతపురమున ఏకార్యమును జరిగి యుండ లేదు. ఇది శ్రీవారి తపఃప్రభావము మాయందరి మహద్భాగ్యమని సర్వులు మరిమరి సంతసించుచు అఖండ భగవన్నామ భజనలు సలిపిరి" విశేషముగ అన్నదానము చేసిరి. గొప్ప ప్రశాంతమై యొప్ప సర్వలాంఛనములచే ఉత్సవము జరిగెను.

మరియు 24వ శ్రీచాతుర్మాస్య మహావ్రత పూర్ణ సభ వైభవముగ జరిపిరి. మంగళాచరణ పూర్వకముగ శ్రీవారి ప్రారంభోపన్యాసము, శ్రీమేడా సుబ్బయ్య యమ్. యల్. సి. గారిచే అనంతపురము భక్త మండలివారి భక్తి పూర్వకమగు సన్మానపత్ర సమర్పణము, కార్యదర్శి నివేదిక, శ్రీమేడా సుబ్బయ్య గారికి "సుగుణ భూషణ" యను మెరిట్ పత్రమును ఆశీర్వదించుట,కవులు పండితులు మొదలగు వారు భక్తిచే శ్రీవారికి మరల సన్మానస్తుతి పత్రములు సమర్పించుటయు జరిగినది. శ్రీగురు దైవ భక్తి సేవాధురంధరులగు బ్రహ్మశ్రీ యన్. రామారావుగారు చక్కగ ఉపన్యసించిరి. శ్రీఆర్. బాలరాజు పండితులు, కన్నడ లెక్చరర్ బ్రహ్మశ్రీ హెచ్. రామచంద్రరావుగారు, బ్రహ్మశ్రీ డి.డి. శ్రీనివాసరావుగారు (అడ్వకేట్) బ్రహ్మశ్రీ బి. గురురాజరావుగారు (అడ్వకేట్), శ్రీ ఎ.జి. నాగిరెడ్డిగారు (అడ్వకేట్), శ్రీ పి. పట్టాభిరాములుగారు, శ్రీ జె. చలపతిగారు, కుమారి శ్రీ ఎన్. లక్ష్మిదేవమ్మగారు, శ్రీ ఆర్. తిప్పయ్య గుప్తగారు, శ్రీ కె.సి. వెంకటసుబ్బయ్యగారు మరికొందరు సభలో చాల చక్కగ ఈ 4 మాసములు జరిగిన మహావ్రత విశేషములు ఆధ్యాత్మిక తత్త్వ ప్రసంగములను గురించి ఉపన్యసించిరి. విజయ క్లాత్ హౌస్ బసణ్ణగారిచే వస్త్ర సమర్పణము, పిదప వందన సమర్పణము శ్రీవారి శుభాశీస్సులు. ఇట్లు మహాసభ ఆనందముగ 5 గంటల సేపు జరిగి మహామంగళముచే పూర్ణ మాయెను, మంగళవాద్యములు ప్రమోగింప బడెను.

చిత్తశుద్ధి లేక శ్రవణము చేయుట చేత నిజమగు శాంతి దొరకక పోవుచున్నది.చిత్తమును స్వస్థముగ నుంచుకొని నాజన్మ చరితార్థము కావలెనను గాఢ విశ్వాసము భక్తి గలిగి బ్రహ్మతత్త్వమును శ్రవణము చేసిన, అది హృదయ గ్రంథిని, శిథిల మొనర్చి స్వస్వరూపానుభవ నిష్ఠను తప్పక కలిగించును. గురుభక్తి, దైవభక్తి అవిచ్యుతమైయుండ

వలెను. గురుభక్తి గల సజ్జనునకు శాంతి సులభముగ లభ్యమగును. సద్గురువుల సన్నిధానమున నుండినను, చదివినను, విన్నను. మనశ్శుద్ధి గల యాతనికి వృత్తి అంతర్ముఖమై తత్త్వము నెరుగుట యందు శక్తి వంతమగును. జీవ పరమాత్మల స్వరూపము దృష్టి గోచరము కాదు. శుద్ధాంతఃకరుణులకు వివేక సూతై్రక గోచరము, నిత్యాపరోక్షము. అద్వైత తత్త్వము బుద్ధితో గ్రహించుటకు సాధ్యము కాదు. పూర్ణ మగు ఈశ్వరానుగ్రహ ముండవలెను. "ఈశ్వరానుగ్రహాదేవ పుంసా మద్వైత వాసనా" యని అవధూత గీత యందు చెప్పబడినట్లు అది బ్రహ్మ నిష్టచే లభ్యమగును.

ఉపనయనాది సమావర్తన పర్యంతము ఉండునదే బ్రహ్మ చర్యము. సమావర్తన మనిన గురుకులము నందు సుసంస్కృతులై మరల తిరిగి వచ్చుట. అదే బ్రహ్మచర్యము. ఈ బ్రహ్మ పదమునకు వేదమనియు, విష్ణువనియు, పరమశివుడనియు, బ్రాహ్మణజాతి యనియు, తపస్సు పరమాత్మస్వరూపమనియు అర్థములు. బ్రహ్మ అని దీర్ఘముగ నుచ్చరించిన చతుర్ముఖ బ్రహ్మ యగును. ఇచట బ్రహ్మచర్యము అను శబ్దమునకు వేదమని అర్థము.

జీవితమున సత్య సంభాషణకు ఉత్తమోత్తమమైన ప్రయోజ నము మనోనిగ్రహము, దాని ఫలము వాకుద్ధి. ఇట్లు సత్య నియమ నిష్ఠా వ్రతుని యొక్క వాక్కు కూడా ప్రాయశః రిత్తకాదు (తప్పదు) దైవీస్ఫూర్తి యుండిన హృదయమున శాంతి శమ దమాదులు నివసించియుండును.

వేదాంగములలో "శిక్ష" యనునవి వేద స్వరూపుడగు భగ వంతునకు ఘ్రాణేంద్రియ స్థాన మట. వ్యాకరణము ముఖ మనియు లేక వాక్కనియు చెప్పుదురు. వ్యాకరణములందు పాణినీయ వ్యాకరణము ప్రధానము. నటరాజ రూపముచే ప్రత్యక్షమైన శివుని పాద విన్యాస

ముచే సంప్రాప్తమైనఆవ్యాకరణమునకు ఆది శేషావతారుడగు పతంజలి భాష్యమును రచించెను.వీరు రచించిన గ్రంథమునకు మహాభాష్యమనిపేరు తక్కినవి మహాభాష్యములుకావు. పాణినీయ సూత్రములకు వరరుచియను వారు వార్తికమును రచించినారు.ఈవ్యాకరణములేనిచో భాష బాగుండదు. కావున అభ్యాసకులగు పాఠకులు వ్యాకరణ సూత్రములతో సహా కొంతవఱకు సంస్కృత జ్ఞానము కలిగి యుండుట నుంచిది. అక్షర సమామ్నాయము వ్యాకరణము. వేదములు పరమేశ్వరుని నిశ్వాసలు. ఈశ్వరుని చేతియందలి డమరుక నాదమే శబ్దానుశాసనము భగవంతుడు చేయినాడించుటచే సూత్రము లేర్పడినవి.

"సర్వం ఖల్విదం బ్రహ్మ" "ఏకమేవాద్వితీయం బ్రహ్మ"అను నిత్యాదిగా శ్రుత్యర్థములను బోధించుచు పరమాత్మ ఒక్కడే " ఇదగ్ం సర్వం యదయ మాత్మా" సర్వము ఆపరమాత్మ స్వరూపమేనని బోధించిన మహానుభావులు శ్రీజగద్గురు శంకరాచార్యులు.చార్వాకులైననో ఈ దృశ్య ప్రపంచమే సత్యమని యందురు, దీనికి వేఱుగా బ్రహ్మము,పరమాత్మ యనునది లేదని చెప్పుదురు.ద్వైతులువైయ్యాయికులు బ్రహ్మము ప్రపంచము రెండును నిజమే యని చెప్పుదురు. బౌద్ధులు ఈ రెండింటిని కాదందురు.ఆచార్యులు మాత్రము "బ్రహ్మ సత్యం,అద్వితీయం"అనుచు ప్రపంచమునకు ప్రత్యేకమైన అస్తిత్వము లేదు కావున దాని వాస్తవ స్వరూపము బ్రహ్మమే యని బోధించిరి.

ఋగ్యజుస్సామ అథర్వణమను నాలుగు వేదములు పరమాత్మ జ్ఞానార్థమై వెలయుచున్నవి. వేదవాక్యములు పరబ్రహ్మస్వరూపమును ప్రతిపాదించుట యందే ముఖ్య తాత్పర్యము గలిగి యున్నవి. "తత్తు సమన్వయాత్" అను బ్రహ్మసూత్ర భాష్యమునందు భాష్యకారులు చక్కగ వివరించి యున్నారు."సర్వే వేదా యత్పద మామనంతి" అని అన్ని వేదములను దేనిని మననము గావించు చున్నవో, అని శ్రుతియును గలదు అందుచేత వేదములెల్లయు జగత్కారణమగు

పరబ్రహ్మమును తెలియ పరచుట యందే ప్రవృత్తములై యున్నవి మరియు వేదార్థములను మనన మొనర్చిన శుక వామదేవ వశిష్టాది మునులెల్లరు తమ హృదయమున పరబ్రహ్మమును భావించువారై యున్నారు. అనగా తదనుభవ సంపన్నులయి యున్నారు. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" అను శ్రుతి బ్రహ్మ తత్వము మనో వాక్కుల కగోచరమని చెప్పెను. "నైషాతర్కేణమతి రాపనేయా" అని తర్క బుద్ధిచే నూహింప నలవి కాదు. ఈ జగత్తు పుట్టినను, నాశనమైనను సాక్షియగు పరమాత్మ దానితో కూడక యున్నది, అనగా ఉత్పత్తి నాశ రహితమని అర్థము. "ఆత్మలాభాత్ పరం లాభో నవిద్యతే తమేవైకం జానథ, అన్యా వాచో విముంచథ" అన్యమగు మాటలను విడువుము. నిన్ను నీవు దెలియుట యందు తత్పరుడవు కమ్మని శ్రుతి తెలుపుచున్నది.

వెలుపలి దృశ్యములగు ఘటాది విషయములను తెలియునట్లు బ్రహ్మ స్వరూపమును తెలియుటకు వెలుపల వెళ్ళిన యదిఅగపడదు. ఎంత చూచినను అది తెలియక చింతయే అధిక మగును. అందుచేత బ్రహ్మపరోక్ష జ్ఞానము కావలెనన్న మొదట,నే నెవరని తన్ను తాను తెలుసుకొనవలెను. "అయమాత్మా బ్రహ్మ" ఈ అపరోక్షమైన దేహము నందుండు ఆత్మయే బ్రహ్మము. కావున తన జ్ఞాన మైనచో బ్రహ్మజ్ఞాన మగును. బ్రహ్మపరోక్షస్థానము తానెయై యున్నాడు. "యత్సాక్షాదపరోక్షాద్ బ్రహ్మ" అను శ్రుతి బ్రహ్మము అపరో క్షమై యున్నదని చెప్పుచున్నది. అపరోక్షమగు బ్రహ్మము పరోక్ష ముగ నెన్నటికిని గోచరము కాదు. అందుచేత తన్ను తాను తెలియ తానే ప్రత్యగభిన్న పరమాత్మ యని అనుభవ మగును.

కొంతకాలము వరకు గొప్పగ జరుగు యాగమునకు సత్రమని పేరు. నైమిశారణ్యమున నొకయాగమును సూతర్షి,సనక సనందనాది మునులతోకూడి వేయి సంవత్సరము లకుంఠితముగ జరిపెను. దీర్ఘ

కాలముగ వ్రతరూపమున నియమమును పాలించుచు శాస్త్రార్థ ప్రసంగములచే, నియమ నిష్ఠలచే సలుపు కార్య విశేషముగాన దీనిని కూడ సత్రమని యనిరి.

ఎట్టి దుఃఖ సమయము లందును, మనశ్చలనము లేక ఆత్మ మాత్రుడై యుండుట గొప్పతనము. కౌసల్యాదేవి శ్రీరామచంద్రునకు అడవికి వెళ్ళునపుడు ధైర్యముగ నిట్లు తెలిపెను."యం పాలయసీ ధర్మం త్వం, ధృత్వా చ నియమేన, చ స వై రాఘవ శార్దూల,ధర్మ స్త్వామభిరక్షతు" రాఘవా శ్రీరామా నీవు ఏధర్మమును ధైర్యముచే నియమముతో నాచరింతువో ఆధర్మమే నిన్ను రక్షించుగాక సుఖముగా వెడలి రమ్ము రామా ! యని కౌసల్య ఆశీర్వదించినట్లున్నది.సత్యశీల సంపద్విశిష్టులయిన వారిని కూడా లోకు లేమియో పరిహాసముచేయుచుందురు. ముముక్షువులు వాటిని లెక్కించక తమ సత్య పథమున వెడలవలెను. వేదము అనాది, అనంతము, పరబ్రహ్మము నదియే.అట్టి వస్తు తత్త్వ జ్ఞానముగల యాతడు చింతా చలనములు లేక నిత్యసుఖ స్వరూపుడై యుండును, "గురుణాపి దుఃఖేన విచాల్యతే."

4.11.68 శ్రీవారు భక్తాదులతో గూడి హంపీ క్షేత్రమునకు దయచేసి అచట తుంగభద్రా నదీ తీరమున దీక్షా విరమణ మొనర్చి శ్రీవిరూపాక్షేశ్వరునకు, శ్రీరుద్రాభిషేకాది సర్వోపచార పూజలు చేయించిరి. అందరు ఆనందముగ ఆలయ ప్రాంగణమున మహాసభ యొనర్చి గురు, దైవ, ఆత్మ యను నీవిషయమును ఉపన్యసించిరి. శ్రీవారి అపూర్వమగు సందేశము అందరికి మహదానందమునొసగెను.

16.11.68 తమ గురుదేవుల పుణ్యారాధన మూడుదినములు శివప్రదముగ నడచెను. అనంతరము అనంతపురము శ్రీపార్వతీ నిలయమునకు దయచేసి ఉపనిషత్తుల పరీక్షలను ఏర్పఱచిరి. 30 కేంద్రముల యందు 200 మంది భక్తులు ఒక సం॥ము ప్రస్థానత్రయ గ్రంథ మందలి 10 ఉపనిషత్తులు అధ్యయనము చేయుచు యథాశక్తి యథామతి

నేర్చుకొనిరి. తరువాత నియమిత సమయములో అందరు పరీక్షలు వ్రాసిరి, ఉత్తీర్ణులయిన వారికి శ్రీవారు ప్రమాణ పత్రములను ప్రసాదించిరి. (నంద్యాల శ్రీఉమామహేశ్వరాశ్రమ కేంద్రము నుండియు అనంతపురము శ్రీపార్వతీ నిలయ కేంద్రము నుండియు పరీక్ష పత్రములు అన్ని స్థలములకు పంపబడెను.)

31.1.69 గుంతకల్లు తిలక్‌నగర్‌లో శ్రీఉమామహేశ్వర గురుపీఠము, శ్రీఉమామహేశ్వరాశ్రమ ప్రత్యేక భవనంలో యథారీతి పూజానుష్ఠానాధ్యయన శాస్త్ర శ్రవణాదులు గావించుచు ఆశ్రమ మనగా నేమి యను ఉత్తమ ప్రసంగములను బోధించిరి.

## కాశీ క్షేత్రవాసము, పండితుల మహాత్ముల సాంగత్యము

నంద్యాల శ్రీఉమామహేశ్వర గురుపీఠము శ్రీఉమామహేశ్వరాశ్రమ ప్రతిష్ఠాది కార్యములకుగాను వలయు పూజ్య వస్తువులను గైకొని, శ్రీకాశీ క్షేత్రమునందు పండితులు మహాస్వాముల సాంగత్యమున కొన్ని దినములుండి తపమాచరించి రావలెనని, శ్రీవారు కీలక సం॥ర ఫాల్గుణ శుద్ధ ॥౧౦॥ బుధవారము 26.2.69 శ్రీకాశీ క్షేత్రమునకు బయలుదేరి 28.2.69 శుక్రవారము శ్రీక్షేత్రం కాశీ శ్రీజగద్గురు విశ్వారాధ్య జ్ఞాన సింహాసన మఠం (గురుకులము) చేరిరి. అచటగంగా స్నానము శ్రీవిశ్వేశ్వర సందర్శన, సంపూజనాదులచే ధన్యులై తమ నిత్య నియమానుష్ఠాన తత్పరులై పరమ విశ్రాంతిగ ఆ గురుకులమున తాము మొదటినుండి నివసించుచుండిన, కైలాసమంటప పై భాగమున నుండు ప్రత్యేకమగు గది యందు ఏకాంతముగ నిత్య సుఖముండిరి. ప్రతిదినము ఆ యా సమయముల యందు పండితవరులు, పూజ్య స్వామి వర్యుల సంభాషణలు, ఉత్తమమగు ప్రస్థాన త్రయ భాష్య ప్రసంగములను ఇంకను అనేక ప్రకారములచే వెలయు వివిధ మతముల వారి విధి విధానములను గాంచి సంతసించు చుండిరి. గంగాతీరమున విజనముగ ప్రశాంతమై ఉండునపుడు అచ్చటికి వెళ్ళి గంటల

తరబడి బ్రహ్మనిష్ఠ నుండుచుండిరి. సాక్షాత్ కైలాస వాసమయి యుండెను. ఏకాంతమున నిజనిష్ఠ పరమ తృప్తి ననుభవించుచు భాష్య పాఠములను తిలకించిరి. శ్రీకాశీ క్షేత్రమునుండి ఈ క్రింది ఉపదేశ వాక్యములను ఆ యా భక్తుల సంస్కారానుసారముగ శ్రీముఖముల వ్రాసి పంపిరి.

ఎట్టి విపత్కాలమే యగుగాక సత్యము నుండి జారకుము. సత్యము యొక్క స్వాదును రుచిని చక్కగ ననుభవించుము. వినోదార్థమైనను సత్య వ్యతిరిక్తమగు వాక్కుల వాడకుము.

కోపము వచ్చిన నీయందు కలిగిన ఆకోపముపై కోప పడుట నేర్చుకొనుము.

ఎట్టి వ్యాకులమును పొందకుము. చాపల్యమును వీడుము. యత్న పూర్వకముగ శాంత మనస్కుడవు కమ్ము.

జీవిత పర్యంతము ఆధ్యాత్మిక దివ్య దృష్టి సంపన్నుడవయి యుండుము. ఊరకుండిన బ్రహ్మమయ్యే యుండుము. మాటలాడిన బ్రహ్మ అనగా చైతన్య సాగరమునందు చిదనుభవరూప తరంగమై యుండుము. బ్రహ్మ స్వరూప సాగరమే అయి యుండి పొమ్ము.

మనస్సనునది నిజముగ మర్కటము గావున దీనిచే సంతతము ఆత్మవిషయకమగు పనిచేయించుము. చరమావస్థ యగు బ్రహ్మీస్థితి నొందు నంతవఱకును బ్రహ్మ సంబంధమైన పనులే యుండు గాక. జాగ్రత్త !

నీమాటల యందు ప్రవాహ పతితమై ఎట్టి సమయమునందే యగుగాక లౌకికము, వ్యక్తిగత భావములచే నొప్పు మాటల నాడకుము. ప్రవచన సమయమునందును ఏయొక ఉద్దేశ్యము లౌకికమును, మనసు నందుంచుకొని మాటలాడకుము. నిన్నది బహిర్ముఖునిగా చేయును. హితము, మితము, పవిత్రము నైన శ్రుతి సమ్మతమగు సం

భాషణయే చాలు.

మూసిన కండ్లు సారె సారెకు తీయ వలదు. రెప్పలు వ్రాల్చ కుము. అది బహిర్ముఖ మొనర్చును. బ్రహ్మము సర్వవ్యాపకము గావున అచ్చటనే యుండుము.

నీ యాధ్యాత్మిక సాధనల యందును తన్నిష్ఠ యందు దప్ప ప్రాణ ప్రియములయినను, ప్రియాతి ప్రియములయినను ఏ ఇతర వస్తువునందును అతి స్నేహము నుంచకుము. "అతి పరిచయాదవజ్ఞా" అన్నట్లు ఒక బ్రహ్మ తత్వమునందు తప్ప తక్కిన వెల్లయు లోకమున అరుచి అమర్యాదలే! అతియే పరమాసహ్యము. "అతి సర్వత్ర వర్జ యేత్ నతు భగవద్విషయే."

సాధన సమయము నందలి, సంకల్ప వికల్పాత్మకమగు ప్రతి బంధముల నుండి దృఢముగ బ్రహ్మాత్మ బుద్ధిచే మేల్కొనవలయును.

ఎవరైన మాటలాడిన అదేమియని అచ్చెరువుచే దానిని విను నిచ్చ నీయందు ఉండ కుండును గాక, అట్టి మాటలు నీకు మరొక నూతనమైన సంస్కారమును కలిగించి విడిచి పోవును.

మౌనముగ గ్రంథావలోకన ఏతన్మధ్యస్థముగ తదర్థ దృష్టిచే జ్ఞాన నిష్ఠను పొందుచుండవలెను. సమాధి సహజ స్థిత్యనుభవము నొందుము గ్రంథమునకు వేరుగ నుండకుము. గ్రంథమే నీవై పొమ్ము గ్రంథము గురు స్వరూపము, కూనరాగములు తీయుట యందు నీమన స్సును పోనీయకుము. అది నీ బహిర్ముఖమునకు హేతువు, మౌనము మానసిక జపము. సంతత ముండవలెను.

నీయందు వచ్చు ఆంతరంగిక భావములను, అందరి వద్ద పిచ్చి పిచ్చిగ చెప్పు దురభ్యాసమును విడువుము. ఎవరును ఏమి చేయరు. నిన్ను నీవే ఉద్ధరించు కొనవలెను. గురువు దైవము, శాస్త్రమే నీ జీవిత ధ్యేయము. నీమొర నాలకించు పూజ్య స్థానములు.

గట్టిగ మాటలాడు స్వభావమును విడిచిపెట్టుము. సౌమ్యముగ మితముగ, మాటలు మృదువై యుండునుగాక. సుసూక్ష్మమగుపర తత్వమును అరయుదువు. సంజ్ఞ చే దెలుప సాధ్యమయిన అంతేచాలు అట్లు సాధ్యము కానిచో పది మాటలలో సంభాషించు విషయమును 4,5 మాటలలో ముగించునది నేర్చుకొనుము. మోక్షమునకు వాఙ్నియమము మొదటి ద్వారమని శ్రీజగద్గురు శంకరులు తెలిపి యున్నారు కదా! గమనించి వర్తించ వలయును.

ఇంద్రియ నిగ్రహము మోక్ష ద్వారమును తెరచు ఉత్తమము లగు అమృత హస్తములని తెలియ వలెను.

ఏవిధమైన ఎట్టి స్థితియందైనను వృత్తి తరంగములు బయలు దేరిన, అవి కొంత తడవు మాత్రమే వుండి వెళ్ళిపోవును. కావున వాటికి లొంగక గురుని స్మరించి దైవమును భావించి సచ్చిదానందాత్మ నేనై యున్నానని దృఢముగ నుండుము. అవి నిన్ను కదిలించవు.

సంతతము ఆత్మావలంబన పరుడవై యుండుము. ఆత్మ నిత్య సుఖ స్వరూపము. అది నేనను అనుభవము నొందుము. ప్రాకృతజనుల సంసర్గ మేమాత్రము వలదు. సంభాషణల గొడవ అంతకు వలదు. అనివార్యమైన శ్రీహరిని గురుని పరమ శివుని స్మరించి తిన్నగ రెండు మాటలాడి వూరకుండుము.

హాస్యముగ వినోదముగ నుండు వాక్ప్రలాపముల నెప్పుడును చేయరాదు. అది క్రమముగ అశాంతికి కారణ మగును. సరళమగు సంభాషణలచే నీ మాటలుండుచు మహాదేవుని శ్రీమదుమామహేశ్వరుని స్మరింపుము.

నీకు సహనము, లౌకిక విషయముల యందౌదాసీన్యము, ఆత్మ దృష్టిచే నొప్పు నిజ శాంతి ఇవన్నియును అమూల్యమగు భాగ్యరాశి యని తెలియుము. శివ కేశవుల యందు భేదము లేదు. ఎవడు శివుడో

నాతడే శ్రీహరి యాతడే శ్రీగురుదేవుడు. అదియే నేను నీవు సర్వము తానైయున్నదని తెలిసి అనుభవముచే నిత్య సుఖముండుము.

ఆహార నియమము, కృతినియమము, వాఙ్నియమము ఎప్పుడును వీడకుము. నియమ నిష్ఠా రహితులకు ఏదియు లభింపదు. శుభము చేకూరదు. తెలిసి వర్తించ వలెను.

నిన్నెవరైన దండించి కోపించిన తప్పేదియో యున్నందునభగవంతుడు సద్గురు దేవు డీరూపమున నన్ను సంస్కరించెనని భావించి ఆత్మదృష్టిచే అప్రతీకార బుద్ధిచే దానిని సంపూర్ణముగ మఱచిపోవలయును, శ్రీగురునిష్ఠ నుండవలెను.

ఉత్తమమగు ప్రబోధ మనిన నీపవిత్రమగు హృదయమే. పరమ పావనుడగు గురుదేవుడన్న బ్రహ్మానుసంధాన సంపన్నమైన కాలమే మంచి గ్రంథము అనిన ఈ ప్రపంచమే శ్రీగురుదేవుడే నీకు తల్లి తండ్రి దైవము నీయాత్మ యని పూర్ణుడ వగుము.

లౌకికుల జన సమ్మర్దమున చేర నిచ్ఛయించకుము. దానిని విడచి నీ ఏకాంతిక స్థానమునకు నెడలుము. నియమముగ నిత్యము మూడు వేళలయందు కనీసము రెండు వేళల యందైనను, ఒకొక గంటసేపు ఊరకుండుము. దేవుడై యుండుము. పూజానుష్ఠానముల యందుయే మాత్ర మశ్రద్ధ చూపకుము.

సంతత ప్రాణ సంయమనము అనగా ప్రాణ ప్రత్యవేక్షణ నెమ్మదియును నియమితమును నగు శ్వాసోచ్ఛ్వాసము కలిగి యుండుము. అందుచే సాక్షి చైతన్యరూపుడగు నీవు వ్యాపకమగు పరమాత్మయే యను అనుభవము నొంద సమర్థుడ వగుదువు.

సర్వ సంకల్పముల సంపూర్ణ నాశనమే సర్వదా ఆనందానుభవము. ప్రభూ గురుదేవా శ్రీఉమామహేశ్వరా ఈరథ సారథ్యము యొక్క పగ్గములు నీచేతి యందున్నవి. నీయిచ్ఛ చొప్పున నిరపాయముగ నడపించి గమ్యస్థానమును చేర్చుము. నే నసంగుడను నిత్యుడను

నాకు శరణ్యము,గతియు స్థితియు మతియు స్వామీ! గురుదేవా !నీవే.

ఎవని శీల మెల్లప్పుడును మహనీయమై యుండునో అతడు ఎట్టి పరిస్థితులలో నున్నను ఒకే విధముగా నుండును. ఆతడే నిజముగా మహనీయుడు. మహాపురుషుడు అట్టి స్థితిని సంతతము నా కొసగుము దేవా! ఓంనమశ్శివాయ అను నిత్యాది గుణ గణ శీలసంపదచే అందరు ప్రశాంతముగ నుండుచు చైతన్యాత్మ నేనను స్థిరమతి సుఖముందురు గాక ! ఓమిత్యాశిషః.

108 శ్రీశ్రీశ్రీ హరిహరానంద మండలేశ్వరులు, పూజ్య శ్రీశ్రీశ్రీ విద్యానంద మహరాజ్ మహామండలేశ్వరుల శ్రీరామ కృష్ణమఠమునందలి యతీశ్వరులను, మరి నుద్దండ పండితుల పాండిత్య ప్రకర్షచే నొప్పు సభలు సంభాషణలను గాంచుచు వినుచు మరి మరి తనివిచెందుచుండిరి. విద్యాపీఠము శ్రీసరస్వతీ నిలయమే కాశీక్షేత్రము కాని అట్టి దృష్టి గలిగి ఎచట జూచినను విద్వాంసుల విద్వత్ ప్రపూర్ణత, మహాత్ముల ఉత్తమములగు వ్యాకార్థ ప్రసంగములు, పురాణములు అంమనను తులసీ రామాయణము. అధికము దుర్గాస ప్తశతియు నుండును. వేదపాఠ, ప్రవచనములు, సామగాన మొనర్చు విద్యార్థులు, విద్వాంసులే అగపడుచుందురు. అట్టి భావన, మరియా తాత్విక దృష్టి లేక శ్రీకాశీక్షేత్రము దిరిగిన, పైవారెవరును సామాన్యముగ నగపడరు. మామూలు జగత్తే అగపడును. సుసంపన్నమగు గుణము, విరక్తి, ఈశ్వరభక్తి, జ్ఞాన దృష్టి యుండిన శ్రీక్షేత్రమగు కాశి నిజముగ ముక్తిపురియే. ఎచట చూచినను శివుడే ! శ్రీగురుదేవుడే అగపడును.

ఇట్లు ఆనందముగ శ్రీవారు శ్రీకాశీ క్షేత్రమున నుండుచు నంద్యాల ఆశ్రమమునకు వలయు పూజ్య వస్తువులు శ్రీశివలింగము కలశము శ్రేష్ఠమగు సాలగ్రామములు, తత్తద్దేవతా యంత్రములు, మరకత గణపతి, మరకత లింగము, దర్భాసనములు, రుద్రాక్షలు,

జపమాలలు పవిత్రమగు సైకతము పావనగంగా కలశము మొదలగు నవి తీసుకొని 11.4.69 వారణాసి నుండి బయలుదేరి 14.4.69 గుంత కల్లు ఆశ్రమము సందర్శించి, ఉత్తవరము శ్రీక్షేత్రము శ్రీఉమామ హేశ్వరాశ్రమమున, శ్రీజగద్గురు శంకర జయంత్యుత్సవమునకు దయ చేసిరి. కాశినుండి తెచ్చిన పూజ్య వస్తువులను ఇచటనే సంస్కరణ, పూజాదుల యందుంచిరి.

విధ్యుక్తముగ నాచరింపబడు సత్కార్యము మంగళ ప్రదము సంతత ఈశ్వరారాధన జీవన మూలకందము. భక్తి సంభరితమగు స్వామి సంసేవనము సమస్తైశ్వర్యముల నొసగును. గోవులను, బ్రాహ్మ ణులను, వృద్ధులను, పూజ్య మహనీయులను భక్తిచే సేవించిన భవ తరణ మగును. నియమము దప్పని నిష్ఠ సర్వార్థముల నొసగును. నియ మముచే చేయబడు జపము సర్వ పాపముల బాసి శాంతి నొసగును. దుఃఖమనిన పాపఫలమే యని అర్థము. నిన్ను పోషించునది. నీప్రారబ్ధ కర్మమే యని ఎఱుగుము మక్కవోని సచ్ఛీలముచే అష్ట విధ బ్రహ్మచర్యములను పాలించుచు పవిత్రుడై ఈజన్మను సద్గురు దేవు నకు సమర్పించువాడు ధన్యుడు. భవార్ణవమును దాటించువాడు సద్గు రుడే. శ్రీమదుమానాథుండగు పరమ శివుడే జగద్గురుడు. ఆత్మయొక్క అజ్ఞానమే తమో రూపమగు నిద్ర. స్వరూపాజ్ఞానమే శోచనీయమగు జీవనము. ఆత్మ విషయ జ్ఞప్తి లేమియే అనర్థము. గర్వ రహితమగు జ్ఞాననిష్ఠయే సద్యోముక్తి. ఈ ప్రపంచమున కంటె నింద్రజాలము మరి యొకటున్నదని తెలియుము అద్వైతానుభవనిష్ఠయే పారమార్థిక మని తెలియ వలయును. వస్తుతః నిష్కామముగ నాచరింపబడు సగుణోపాసనల ఫలమే నిర్గుణ బ్రహ్మానుభవమన్న అతిశయోక్తి కాదు. బ్రహ్మసూత్రముల యందీవిషయము వివరింపబడి యున్నది. సంతతము శివాయత్త చిత్తులై యుండవలెను. ఓంతత్సత్. ఓం నమశ్శివాయ.

శ్రీసౌమ్య నామ సం॥ర వైశాఖ శుద్ధ పంచమి సోమవారము 21.4.69 శ్రీజగద్గురు శంకర జయంతి మహోత్సవము యథాప్రకారము విధ్యుక్తముగ జరిగెను. ప్రస్థానత్రయ భాష్య పారాయణము, శ్రీశంకర విజయ పురాణమును గావించిరి. ప్రతిదినము ప్రాతఃకాలము శుచిర్భూతులై ఈగ్రామము వారును మరియు ఇతర ప్రదేశముల నుండి వచ్చిన ఉత్తమ జిజ్ఞాసువులకు ప్రత్యేకించి శ్రీగురుదేవులు భాష్య పాఠములను బోధించుచుండిరి. అందరును చక్కగ జపానుష్ఠానాధ్యయనాదుల యందు శ్రద్ధా భక్తులచే పాల్గొనిరి. నైమిశారణ్యము నందలి మునులవలె అందరు తనివిదీర ఆత్మానుసంధాన పరులై వెలసిరి.

జీవన్ముక్తి విదేహముక్తి యనునవి తాత్విక దృష్టిచే విచారించిన లేవు. బంధ మోక్షము లనునవియును పండితుడగు విద్వాంసుని దృష్టిలో లేవు. అజ్ఞజనుల దృష్టి యందున్నవి. జ్ఞాని ప్రాణములు ధరించి యుండగనే అతడు ముక్తుడై యున్నాడు. దేహము విడిచిన పిదప పొందబడునదే విదేహముక్తి యందురు. జీవిత దశలో సత్త్వాది గుణములుదాటి, సాక్షి తత్వమును తానని తెలిసి సహజస్థితినుండుట, బ్రహ్మవిద, విద్వర, విద్వరీయ, విద్వరిష్ఠ యని భూమికా వ్యత్యాస మాత్రమే కాని ఈ నలువురు నిత్య ముక్తులే యని అర్థము.

సర్వజ్ఞుడు సర్వ శక్తి యుక్తుడై జగత్తును నడిపించుచు ఈశ్వరుడు మూలకర్తయై యున్నాడు. ఇచట ఈశ్వరుడనగా బ్రహ్మమనియే అర్థము. శ్రీశంకర భాష్య సమ్మతము, ఇట్టి అఖండమగు ఆ బ్రహ్మ తత్వమే ప్రకృతి ఒకానొక అవస్థ అనిపించుకొను అహంకారము నాశ్రయించి జీవాత్మయని చెప్పబడును. ఆ బ్రహ్మమే కర్తృత్వ భోక్తృత్వాది గుణములుగల అహంకారముతో చేరి దానినే తాననుకొనుట వలన జీవుడని చెప్పబడును. జీవుడు తన ప్రాకృత కర్మలను అనుభవించునపుడు సర్వ భూతములచే నుత్పత్తి యగు సమస్త పదార్థములు,

ఆతని నావరించి తోచునదే జగత్తనబడును. సర్వజీవులకు అజ్ఞాన మూలమున విపరీత బుద్ధియే ఈ ప్రతీతిని కలుగజేసి అది ఇది పరోక్షము అపరోక్షము అను నిత్యాది భావములను పుట్టించి రాగ ద్వేషాద్యనేక వృత్తుల కాశ్రయమై తానే ఇదంతయునై తోచుచుండును. ఇట్లు జీవేశ్వర జగత్తులు తోచుచున్నవి. ముముక్షువులు దీనిని చక్కగా నెఱుగ వలయును. ఈ జీవేశ్వరులు దేహము నందొక భాగమగు, హృదయ కమల కర్ణిక పై భాగమునందుగాని, లేక ఏదొక దళమునందుగాని సదా కూడియుందురు. ఇట్లు ఉపనిషదాధారమున చెప్పుదురు. వేరుకాని భేదము లేని ఈ జీవేశ్వరులు విభిన్నులై ఒక చోట చేరుట అనునది ఎట్లు పొసగును అని శంకింపరాదు. జల భరితఘటము నందును, మరి సరోవరము నందును ఆకాశము మొదటనే వుండి యున్నది, అట్లుండు ఆకాశము నందగపడు మేఘ నక్షత్రాదులు, ఘట జల సరోవరము లందును అగుపడును. (ఘటజలము, సరోవర జలము అనునది ఉదాహరణములు) పూర్ణమగు ఆకాశము మొదటనే సిద్ధమయియుండి జలమునందు ప్రతిఫలించి అగపడునట్లు అఖండమగు బ్రహ్మమే ఉపాధివలన మాయ అహంకారము వలన ఈశ జీవులనిపించు కొని హృదయకమలమున గోచరింతురు. ప్రాయశః లోకమునందు ఒక సంఖ్యనుపెట్టి దానిముందు 1,2,3 సున్నలు జేర్చిన ఆ ఒకటియే పది, వంద, వేయి అని చెప్పబడు విధమున బ్రహ్మమునకు ఉపాధివశమున వేనవేలు (అసంఖ్యాకమగు) ఆకృతులయి నట్లాయెను. ఇట్లు ప్రకృతి మాయోపాధిచే ఈశ్వరుడును, అహంకారము వలన జీవుడును, పృథివి మొదలగు భూతములచే ప్రపంచముగను మారినదని తెలియవలయును (అధ్యారోపము)

ఈజగదనాత్మ విషయముల అధిక దర్శన శ్రవణాదులచే అంతఃకరణము నందు ఒక విధమగు రాగ మేర్పడును. అది క్రమముగా ముముక్షువైన వానికి బ్రహ్మవిద్యకు ప్రతిబంధక మగును. దానిని నెరిగి శుద్ధ బుద్ధిచే దూరీకరించ వలెను.

10.6.69 శ్రీవారి పరమ గురువుల ఆరాధన ఆనందముగ జరిగెను 12.6.69 శ్రీవారి జయంత్యుత్సవము యథా శాస్త్రీయముగ శివదమై నడచెను. శ్రీవారు శాంతమగు అంతర్ముఖతచే నిత్య తృప్తిగ ఇచటనే నిష్ఠ నుండిరి.

## రజతోత్సవము

## 25.వ. శ్రీచాతుర్మాస్యమహావ్రతము -1969 సం॥

## శ్రీక్షేత్ర ఉమామహేశ్వరాశ్రమము లత్తవరము

స్వస్తిశ్రీ సౌమ్యనామ సం॥ర ఆషాఢ శుద్ధ ॥౧౧॥ శుక్ర వారము 25.7.69 యథారీతి ప్రభాతభేరి యైన పిదప మంగళ వాద్యములు నినదింపబడెను. పూర్ణ కుంభముచే గంగా కలశమును దెచ్చుట శ్రీచంద్రమౌళీశ్వర-శ్రీఉమామహేశ్వరుల పూజాదులు, శ్రీవ్యాసపూజ, శ్రీగురుపూజ శ్రీరజతోత్సవ ప్రతీకావిష్కరణము, (రజతఫలకము) ప్రస్థానత్రయ పారాయణము, శివ సహస్రనామ బిల్వార్చన, సహస్ర నామ కుంకుమార్చన మొదలగు కార్యములచే, ఉదయము 9 గం॥లకు మాండూక్యోపనిషద్భాష్య ప్రవచనముచే మహామంగళ మంత్ర పుష్పాదులతో ప్రాతఃకాల కార్యక్రమము పూర్ణమాయెను. సాయం కాలము 4 గం॥నుండి 5.30 గం.వఱకు శ్రీమద్భగవద్గీతా భాష్య ప్రవచనము 7 గం. నుండి 9 గం. వరకు ప్రదోషపూజ, మహామంగళము. 10 గం.లకు భజన, ఈ విధముగ శ్రీగురుకృపచే 25.7.69 నుండి కార్తిక శుద్ధ ॥౧౨॥ 20.11.69 వఱకు మంగళప్రదముగ ఈరజతోత్సవ మహాకార్యక్రమము జరిగి సాంగమంగళ మాయెను. ఈ మహావ్రత మున అనేక మహాత్ముల శుభాగమనము, అనేక స్థలముల నుండి భక్తాదులు వచ్చి కార్యక్రమమున పాల్గొని జప తపానుష్ఠాన పూజా పారాయణ ప్రస్థానత్రయ శ్రవణాదులను శ్రద్ధాభక్తులతో చేసిరి, అఖండ భగవన్నామ భజనలు జరిపిరి. అందరు గలసి 1108 సార్లు గీతా పుర

శ్చరణ, శ్రీ ప్రణవ పంచాక్షర (షడక్షర) మహామంత్ర లేఖన పుస్తక ముల సేకరణ సంపూజనములు జరిగెను. వైదిక సద్బ్రాహ్మణుల వేద ఘోష, అపుడపుడు విశేషముగ శ్రీరుద్ర స్వాహాకారములును జరుప బడినవి. శ్రీవారు శ్రీచాతుర్మాస్య మహావ్రత పద్ధతులు వ్యాసపూజా విధానాది విషయములను తెలియ జేసిరి.

మరియు శ్రీవిష్ణు ధర్మోత్తర దాల్భ్య పులస్త్య సంవాదాత్మ కమై యుండు ఇతిహాసమునందు వివరింపబడి యున్నదని తెలియజేసిరి.

ఈ మహావ్రత మధ్యమున అనేక మహాత్ములు పండితులేతెంచి ఉపన్యసించిరి. శ్రీ ఉమామహేశ్వర గురుపీఠ మహాపుణ్య క్షేత్రమున ఇట్టి అనేకమహాకార్యములు జరుగుటకు సర్వవిధముల ఆశ్రమక్షేత్రా భివృద్ధికిని ఆదనాని శ్రీయలే. మల్లేశప్పగారి సతీమణి మాతృశ్రీ పార్వ తమ్మగారి త్యాగపూర్వకమైన భక్తిశ్రద్ధలే కారణము. మరియు శ్రీ కె. శరణమ్మగారి అనన్యమగు భక్తిశ్రద్ధలు సంస్తుత్యములు. ఆశ్రమవాసి యగు శ్రీ శివానందస్వామి ప్రశంసనీయముగ అన్ని పనులు భక్తిచే బాగుగ చూచుకొనిరి. ఈ గ్రామ వాసులగు ఆశ్రమభక్తులు మొదః గు వారందరును తమ తమ శక్తి ననుసరించి సేవయొనరించిన పుణ్యా త్ములు.

కార్తిక శుద్ధ॥ ౧౨॥ అనగా 20.11.69 పూర్ణ మహాసభయందు వేలాది భక్తులు సమావేశమై శ్రీ చాతుర్మాస్య మహావ్రతము అందు సను ఇది రజతోత్సవము అను విశేషమును, మరియు శ్రీ ఉమా మహేశ్వర గురుపీఠము శ్రీ క్షేత్ర ఉమా మహేశ్వరాశ్రమము, తత్త్వమసి మహావాక్యార్థ ప్రబోధలు, శ్రీవారిసన్నిధి భక్తి జ్ఞాన వైరాగ్య సాధనములు; అను నీ విషయములపై పూజ్యపాద శ్రీశుద్ధచైతన్యస్వాములవారు, శ్రీ రామకృష్ణానంద స్వాములవారు, శ్రీ నిత్యానంద స్వాములవారు ఉపన్యసించిరి. మరియు పండిత శ్రీ నారాయణమూర్తిగారి సంస్కృతపద్య సమర్పణ జరిగెను. అనత

పురము శ్రీమేడా సుబ్బయ్య శ్రేష్ఠి యమ్. యల్. సి గారు, గురు సేవా ధురంధరులగు బ్రహ్మశ్రీ యన్. రామారావుగారు (మునిసిపల్ కౌన్సిలర్, పత్రికావిలేఖరి, ఉపన్యసించిరి. వీరు అనంతపురము భక్తుల తరపున రజతోత్సవ 'భక్తికుసుమములు' అనుపత్ర సమర్పణచేసిరి. శ్రీమదుమామహేశ్వరుల ఉత్సవ మూర్తులతో, వచ్చిన మహాత్ము లందరితో సహా ఉత్సవము మంగళవాద్య విశేషములచే వైభవముగ జరిగెను. పురజనులెల్లరు తండోపతండములుగా పూజ్యగురువర్యులు వెంటనుండ, శ్రీ ఉమామహేశ్వరులను సందర్శించిరి. రజతోత్సవాలం కృతమగు వైభవమును కన్నులపండువుగ నందరు చూచి ఆనందించిరి.

కార్తీక శుద్ధ పూర్ణిమకు భక్తాదులతో గూడి శ్రీగోకర్ణ మహా క్షేత్రమునకు జేరి 23 11.69 శ్రీవారు కోటితీర్థమున దీక్షావిరమణ మొనర్చి మఱల సముద్రస్నాన మాచరించి మహాగణపతిని సందర్శించి శ్రీగోకర్ణేశ్వరు (మహాబలేశ్వరు) నకు మహన్యాస పూర్వకముగ శ్రీ రుద్రాభిషేకాది పూజలుజేసి నాటిరాత్రి కైలాసపూజ సలిపి లక్ష దీపార్చనాలంకారమును తిలకించి అందరు ధన్యులైరి.

అనంతరము శృంగేరి శారదాపీఠము శ్రీమజ్జగద్గురు శంకర మఠ మునకు వెళ్ళి తుంగానదీ స్నానమాచరించి శ్రీశారదాంబకు లక్షకుంకు మార్చన గావించి రజతోత్సవ పూజలను చేయించిరి. నృసింహ వన మున శ్రీమజ్జగద్గురు అభినవ విద్యాతీర్థ మహాస్వాములవారిని సందర్శించి మహాసన్నిధి భక్తిశ్రద్ధలచే సంతోషముగ సంభాషించి శ్రీ చంద్రమౌళీశ్వర (స్ఫాటికలింగ) పూజలు శ్రీమజ్జగద్గురువులు సలుపు చుండగా అందరుచూచి ఆశీస్సులు వడసిరి. కరుణామయులగు శ్రీజగ ద్గురు స్వాములు శ్రీశివగీతాభాష్యమును, శ్రీ గురువంశావళి అను గ్రంథములతోసహా కుంభాభిషేక సమయమునందలి శ్రీజగద్గురుచంద్ర శేఖర భారతీస్వాములవారి చిత్ర యుక్తమగు రజతఫలకమును ఫల మంత్రాక్షతలతో శ్రీవారికి ప్రసాదించిరి. మహా ప్రసాదమని స్వీక

రించి తమ విడిదికి విచ్చేసి యథారీతి పూజానుష్ఠానాది కార్యముల 10.30 గం.వఱకు జరిపిరి. మరుదినము ఉడిపి మున్నగు స్థలములకువచ్చి అనంతరము నంజనగూడులో శ్రీవారు శ్రీచాతుర్మాస్య మహా వ్రత మును సల్పిన జీర్ణ శివాలయ సందర్శనము నందరు జేసికొనిరి. కపిలా నదీ పావన తోయములను స్పృశించి ఆనందించిరి. తదుపరి ఆ యా స్థలములను చూచుచు నేరుగా కార్తిక బహుళ నవమి బుధవారము 3.12.69 లత్తవరము శ్రీక్షేత్ర ఉమామహేశ్వరాశ్రమమునకు సుఖ ముగా చేరి గురుదైవ పూజానుష్ఠానములు సలుపుకొనిరి.

5.12.69 శ్రీవారి గురుదేవుల పుణ్యారాధన కార్యక్రమము తమ పరమ గురువుల అధిష్ఠానముగల శ్రీనిర్వాణ మఠము నందు విధ్యుక్తముగ జరిగెను. సురపురం బ్రహ్మశ్రీ శంకరశాస్త్రి స్వామి వారు, శ్రీ శుద్ధచైతన్య స్వాములవారు శ్రీ శివప్రకాశానంద స్వాములవారు పండిత శ్రీ నారాయణమూర్తిగారు దయచేసి యుం డిరి. పరమభక్తిచే ఆధ్యాత్మిక తతోపన్యాసములచే సర్వము శివ ప్రదముగ నడచెను. విద్యా వివేక సంపన్నులగు గురుదైవభక్తి పరా యణులైన శ్రీ శెట్టి ఓబులపతి (అడ్వకేటు)గారు ఆశ్రమ ఫిట్‌పర్సన్ (యజమానులు)గా నుండి సర్వకార్యములను చక్కగా చూచుకొనిరి. 3 దినము లచట కార్యక్రమము లయిన పిదప అందరు నంద్యాల శ్రీ ఉమామహేశ్వరాశ్రమమునకు విచ్చేసిరి. శ్రీవారు నంద్యాల నుండి ఉరవకొండ గీతాజయంతికి దయచేసిరి.

అచ్చట యథారీతి ప్రతిసంవత్సరము వలె గీతాజయంతికార్య క్రమము జరిగెను. తదుపరి లత్తవరం శ్రీక్షేత్ర ఉమామహేశ్వరా శ్రమమునుండి దక్షిణకాశి యనబఱగు శ్రీరామలింగేశ్వర క్షేత్రము నకు భక్తాదులందరితో వెళ్ళి అచట పూజానుష్ఠాన శాస్త్ర ప్రవచ నాదులచే 3 దినములు నియమ నిష్ఠలతో ఆ పుణ్యక్షేత్రము నందుం డిరి. ఇది చాల రమ్యమగు వనారణ్యము. గిరి గహ్వరములు సుదీర్ఘ

మగు జల ప్రవంతిగల ఉత్తమ క్షేత్రము. పిదప వరప్రదుడగు శ్రీ ఉండబండ వీరభద్రస్వామి క్షేత్రమునకు వెళ్ళి బ్రహ్మాత్మనా సంస్థితి యననొప్పు వరమునే మాకు వరముగా ప్రసాదించుమని ప్రార్థించి బ్రహ్మసూత్రములను పఠించుచు తత్సంభాషణలనుగావించుచు తమ పూజానుష్ఠానములచే మహోపనిషచ్ఛాస్త్ర శ్రవణము గావించిరి. అచ్చట నుండు పవిత్రమును అచ్ఛిద్రమునగు బిల్వమును గైకొని శ్రీ చంద్రమౌళీశ్వరునకు సహస్రనామ బిల్వార్చన యొనర్చిరి. డిశంబరు నెల ఆఖరు వరకు అచటనే తపస్సంపన్నులై యుండిరి.

1.1.1970 గుంతకల్లు శ్రీఉమామహేశ్వరాశ్రమములో యథా రీతి పూజానుష్ఠానాదులచే ప్రతిదినము రెండు పూటలు శ్రీశంకరా నందీ భగవద్గీతా ప్రవచనము జేసిరి. మకరసంక్రాంతి (ఉత్తరాయణ పుణ్యకాలము) వఱకు అచటనే వుండుచు వివరించిరి.తరువాత ఆదవాని శ్రీవాసవీ కల్యాణ మందిరమునకు భక్తుల ప్రార్థనను మన్నించి అచ టికి దయచేసి శ్రీశంకరాచార్యుల కృతి "తత్త్వోపదేశః" అను ప్రక రణ గ్రంథమును మరియు మధుసూదనసరస్వతి భగద్గీతా గూఢార్థ దీపిక వ్యాఖ్య నియమ నిష్ఠా సంపన్నమైన సంయమ వ్రతము చే చక్కగ తత్త్వార్థమును భక్తులకు ముముక్షువులకు ఆప్యాయతతో అర్థమగునట్లు బోధించిరి. ఓం.

రత్నము ఇచ్ఛా రహితమై యున్నను దానినుండి వెలుగు ప్రక టమైనట్లు, పరబ్రహ్మ తత్వము సత్తా మాత్రమై యున్నను దానిచే ఈజగత్తంతయు గోచర మగుచున్నది. అది అసంగము. సమమగు బ్రహ్మస్థితిని పొందిన రాత్రియందు బంగారు కమలముల వలె ఏవిప త్తుల యందును కుమిలిపోడు. బ్రహ్మానుభవ మనిన యది అనుభవిం చిన బ్రహ్మనిష్ఠులకు మాత్రమే గోచర మగును. కాని అది సర్వులకు స్వరూప స్థితమై యున్నది. బహిర్ముఖ చిత్తముచే నది అర్థము కాలే దని తెలియవలయును. అది పరమ సుఖ నిలయము, అదియే, ఈ సమ

స్త్రము, దాని కమ్మదనము, స్వాదు, తృప్తి మరి ఎచ్చటను లేదు. స్వభావముగనే అది మైత్రి కరుణ ఇత్యాది సుగుణములచే సంశోభితమై యుండును.

ముముక్షువులు అకార్యముల నెప్పుడును జేయరాదు. అనార్యులతో అనగా పెద్దలు కాని వారితో కలిసి యుండరాదు. గురువాక్యముచే (ఉపదేశముచే) ఏర్పడిన శుభ సంస్కారము మొదలగు వాని చేత పరిశుద్ధమైన బుద్ధితో నిరంతరాభ్యాసము చేయుటవలన చక్కగా బ్రహ్మానుభూతి నొందుదురు. ఆత్మజ్ఞానముచే జగత్తు లేదని తెలుసుకొనిన పిదప కూడ జగత్తు కనబడుచునే యుండును. ఇది నాశమో, లయమో ధ్వంసమో గాదు, బాధింపబడి పోవును. అనగా అపరోక్షమిథ్యా నిశ్చయ మేర్పడును. ఎండమావుల యందు జలము లేదని తెలిసికొనినను అగపడుచునే యుండును కదా. దీనినే బాధితానువృత్తి యందురు. ఎచ్చటి నుండి వాక్కులు వెనుదిరిగి వచ్చునో ఏతత్త్వమును తత్వవిదులైన ముక్తు లెరుగుదురో దానికే ఆత్మ అనుఇత్యాది సంజ్ఞలు బోధ సౌకర్యార్థమై ఏర్పరుప బడెను. ఇట్లు తన నిజ స్వరూప జ్ఞానముచే చిదనుభవముచే స్థితి నొందినచో అచ్చట సౌందర్యము, ఔదార్యము, వైరాగ్యము అను వీనిచే నొప్పుచు స్వరూపానందము విజృంభించును. అదయే సమాధి యనియు కూడ చెప్పబడును.

రాగ ద్వేషాది దూషితమైన చిత్తమే సంసారము. ఈచిత్తమెప్పుడు దోష రహిత మయ్యెనో అపుడు సంసారము లేదు, మోక్షము. దురాచారము, దుష్ప్రవర్తన పీడనివాడు, శాంతుడు కానివాడు, సమాధానము లేనివాడు, మనస్సు ఉపశమింపనివాడు, కేవలము ప్రజ్ఞ, బుద్ధిబలములచే ఆత్మ తత్త్వానుభవ స్థితి నొందజాలడు. శాస్త్రాచార్యోపదేశములచే సుసంస్కృతి నొందిన శ్రద్ధాళువునకు తత్స్వరూపము కరతలామలకము.

జడ చేతనాత్మకమగు చరాచరమైన జగత్తంతయు జీవేశ్వరాది

రూపమున విలసిల్లు చున్నది. జడ మంతయు మాయా స్వరూపము. పరిచ్ఛిన్న జ్ఞానము జీవ స్వరూపము. అపరిచ్ఛిన్న జ్ఞానము ఈశ్వర స్వరూపము. ఈక్షణాది ప్రవేశాంతమైన సృష్టి యంతయు ఈశ్వర కల్పిత మైనది. జాగ్రదవస్థ మొదలు మోక్ష పర్యంతమునగు సంసార మెల్లయు జీవ కల్పితము. త్రిణాచికేతాగ్ని మొదలు యోగమువరకు గల మతములు ఈశ్వర భ్రాంతి నాశ్రయించియున్నవి. లోకాయతులు అనగా చార్వాక మతము మొదలు సాంఖ్యము వఱకుగల మతము లన్నియు జీవభ్రాంతి నాశ్రయించి యున్నవి.అనగా జీవేశ్వర స్వరూప నిర్ణయమున ఏకీ భావము లేక యున్నవని అర్థము.అందుచేత పరిశుద్ధులగు ముముక్షువులు ఈ జీవేశ్వర సంబంధమైన వివాదములను బుద్ధియందు చొరగ నివ్వరాదు. నిశ్చలము, నిర్మలమునగు బుద్ధిచే అద్వితీయమగు బ్రహ్మ తత్త్వమును మాత్రము చక్కగా విచారింపదగును ఇద మిత్థమని జీవేశ్వర స్వరూప నిర్ణయము చేయుటకు యత్నించ వలసిన అగత్యము లేదు. ఎవడు సదా సర్వత్ర చిత్తుయొక్క అన్వయమును, అనాత్మ యొక్క వ్యతిరేకతను కనిపెట్టి సమస్తమును నిర్విశేష చిన్మాత్రముగ చూచునో అతడే అపరోక్ష జ్ఞాన సిద్ధిగలవాడు. అతడే సాక్షాత్ శివుడు. అతడే బ్రహ్మ అతడే విష్ణువు.

శ్రీగురుకృప లేనిచో విషయ త్యాగము దుర్లభము. తత్త్వ జ్ఞానము అనగా సమ్యగ్దృష్టి దుర్లభము. సహజావస్థ సంప్రాప్త మగుటయు దుర్లభము. అర్థాత్ విరక్తిగాని,జ్ఞానముగాని అద్దాని ఫలమగు సహజస్థితి, నిత్య శాంతి, తృప్తి. ముక్తి, గురుకృప లేనిదే లభింపవని తెలియవలెను. సద్గురుడనగా శ్రోత్రియుడైన బ్రహ్మనిష్ఠుడు (సదాచార సంపత్తి) గల వాడని అర్థము. బ్రహ్మభిన్నమైన అనాత్మాకార వృత్తులు కలిగిన వెంటనే వృథా అభూత కల్పనాత్మకము లయిన భయము, భ్రాంతి, సందియములు కలుగును. కావున బుద్ధిమంతుడు సద్భక్తుడగు గురుపుత్త్రుడు గురువాక్యమును సదా స్మరించు చుండిన, మననము చేయుచుండిన, ఇట్టివి అంతరించి పోవును. సచ్చిదానంద

స్వరూపమగు పరమాత్మ సర్వ వ్యాపకుడైనను జ్ఞానదృష్టికే గోచరిమగును. ఎట్లనిన ప్రకాశించుచునే యున్నను సూర్యుని అంధుడు చూడలేనట్లు,వివేకమగు జ్ఞాననేత్రము లేనివాడు స్వరూప భూతమగు పరమాత్మను చూడజాలడు. పరావర స్వరూపమగు పరబ్రహ్మము యొక్క సాక్షాత్కారమైన పిదప ఆతని యొక్క గ్రంథులు (ముళ్ళు) వీడును. సంశయము లన్నియు దూరమగును. సర్వ కర్మలు క్షయించి పోవును. అర్థాత్ పరబ్రహ్మము కరణోపాధిని బట్టి పరుడును (శ్రేష్ఠుడును) కార్యోపాధిని బట్టి అవరుడునై యున్నట్లు భాసిల్లును.

ఓం నమోభగవతే శ్రీమదుమామహేశ్వరాయ

శివశివ యని సదా చింతించు శంకరా
నందగిరీంద్ర మావందనములు
సంతత్త్వమును సదా భావించు పరమాత్మ।
దివ్యప్రకాశ యతీంద్ర శరణు।
వేదాంతసారంబు విశదంబుగా దెల్పు
వైదికాచార్య జోహారు మీకు!
శరణన్న ప్రతివారిఁ గరుణతో రక్షించు
గురురాజ తిలక శంకర వినంతి!

శుద్ధబుద్ధస్వరూప సుబుద్ధి శరణు।
మమ్ము కరుణించి మా హృదయమ్ము నందు
మీదు పదపంకజమ్ముల పాదుకొల్పి
బ్రహ్మతత్త్వంబు, దెల్పవే పరమపురుష!

ప్రత్యక్షముగ సదా బ్రహ్మంబుఁగనుచుండి
ప్రజలకుఁ జూపింపఁ బాటుపడెదు
నిత్యముక్తినిఁ గాంచి నిజభక్తవరులకు
జాలినందింప నుత్సాహపడెదు
తరుగని యానంద ధామంబునందుండి
పలువుర నందులో నిలుపఁ దలఁతు

వాత్మస్వరూపిపై యాసత్యమందఱ
కెఱిఁగింపఁగాఁ సదా ముఱియుచుందు!
వెంత యని మీదు దయను వర్ణింతు దహహ!
మనసు, వాక్కును దృష్టియుఁ గనఁగలేని
ప్రత్యగాత్మ స్వరూపంబు భక్తకోటి
కేమి సొగసుగఁ దెల్పె దోహోమహాత్మ!

ధన్యము భారత దేశము
ధన్యము మా యాదవాని ధన్యము కలియున్
ధన్యుల మైతిమి మేమును
ధన్యులరౌ మీరు దివ్య దర్శన మాత్రిన్!

సహస్రాధిక సాష్టాంగ ప్రణామములతో

భక్త పరమాణువు
యన్. శ్రీరాములు

శ్రీస్వామివారు ఆదవాని నుండి గుత్తి, కర్నూలు, ద్రోణాచలం, పత్తికొండ మొదలగు స్థలములందు భక్తుల భావనానుసారము అచ్చటచ్చట 'వాక్యసుధ' వేదాంత డిండిమ, ఆత్మపురాణము ఈ ప్రకరణ గ్రంథములను గీతాప్రవచనములను చేయుచు, ఆ యా జనులకు ఆచార, విచార సంపన్నమయిన, ఆధ్యాత్మిక సంస్కారమును కలుగజేసిరి. శ్రీక్షేత్రమున శ్రీశంకరజయంతి మహోత్సవము విధ్యుక్తముగ జరిగెను. ఛాందోగ్యోపనిషత్తు 'శ్రుతిసారము' అను గ్రంథమును బోధించిరి. పిదప తమ పరమగురువుల పూజా కార్యక్రమమును మంగళ ప్రదముగ నడిపిరి. అనంతరము పూజ్యశ్రీవారి జయంత్యుత్సవము జయప్రదముగ భక్తులు జరిపిరి.

గురుదైవకార్యక్రమమునకై నంద్యాల శ్రీ ఉమామహేశ్వరాశ్రమము దయచేసి, అనుదినము 'సూత సంహిత' విషయములను చెప్పుచు సప్తజ్ఞానభూమికల వివరమును వివరించిరి.

మలిన చలన నైర్మల్యాది గుణముతో కూడిన జలము యొక్క

పరిణామమైన కదలికచే ఒక సూర్యుడు వేరువేరుగనగుపడినను ఒక్కడే యైనట్లు, శబ్దమే గుణముగా గల ఆకాశము తంబుర, వీణ మొదలగు నానాప్రకారములైనట్లు, బుద్ధ్యుపాధులచే ఒక్కడగు ఆత్మ అనేకముగ తోచును. ఘటాది వస్తువులందు ప్రకాశించు దీపము కుంభగతదీపము, గృహగత దీపము అను నీ మొదలగు విభిన్న నామములను బొంది నట్లు, జ్ఞాన మొక్కటే భ్రమ, స్మృతి, సందేహమను నామాంతరము లచే విభిన్నముగ తోచవచ్చును. జలమొకటే ఉప్పు, పులుసు మొద లగు వస్తువులతో కూడి వివిధ రుచుల నొందునట్లు ఏకమగు ఆత్మ అనేకముగనున్నట్లు తోచినను ఏకత్వమునకు భంగము లేదు. దేహము నందు ఆత్మ ఒకటియే యైనను నేత్రాది ఇంద్రియ వృత్త్యనుభవము లచే వివిధాకృతులుగ తోచును. అటువలె రాగద్వేషాది భావముల చేతను, జీవులు పలువిధములుండినను ఆత్మ ఒకటేనని అర్థము. వస్తుతః ఆత్మయందనేకత్వ ప్రతీతి అసత్యమైనది ఔపాధికము. ఉపాధి రహిత మగు సంవిద్రూపాత్మ యందు ఏదియును లేదు. అద్వితీయమని ఎఱుగ వలెను.

జ్ఞాన భూమికలను గుఱించి మహాత్ములగు తత్త్వజ్ఞులు బహు ప్రకారముగ చెప్పుదురు. అందులో ఇవి సమ్మతములు శుభదాయక ములు నయి యున్నవి కావున వాటిని గుఱించి సంక్షిప్తముగు వివరణ చెప్పుకొనెదము. జ్ఞాన భూమికలను ఈ ఏడింటిలో మొదటిది శుభేచ్ఛ విచారణ, తనుమానసి, సత్త్వాపత్తి, అసంసక్తి, పదార్థాభావన, ఏడవది తుర్యగ అని యందురు. మొదటిది అజ్ఞుడనై యున్నానే నేనింకను ఎందుకు శాస్త్ర సజ్జన సంసర్గాదులచే తత్వము యొక్క యదార్థము నెరుగకుంటిని. ఇక యథార్థమగు ఆత్మ తత్వము నెరిగెదను గాక! యని వైరాగ్య పూర్వకముగ కలుగు నిజ మైన మోక్షవిషయకమగు ఇచ్ఛనే బుధులుశుభేచ్ఛ యని చెప్పెదరు. ఇక శాస్త్రము, సజ్జనసాంగత్యము అనగా వాక్యార్థ విచారరూపమగు

సద్గురువుల సాన్నిధ్యమున నుండుచు వైరాగ్యము అభ్యాసము అను వీనితో గూడిన సదాచార సన్నిష్ఠ ఏది కలదో అనగా వాక్యార్థ విచార రూపమగు దానినే సువిచారణ యను రెండవ భూమిక. శుభేచ్ఛ విచారణ యను ఈరెండు భూమికల అభ్యాసబలమున శబ్దాది విషయముల యందు ఆసక్తి వీడి, మనస్సు చిన్నగిల్లుట, (సూక్ష్మ మగుట) దేహము నేను కాదను భావన యేర్పడుట తనుమానస యన బడును. (మరియు ఇది సూక్ష్మమగు వృత్తిభేదముచే నాలుగు విధ ములు) ఇట్లు ఈ మూడుభూమికల అభ్యాసముచే ఉత్తమమగు వైరాగ్య మేర్పడి, చిత్తము శుద్ధ సత్త్వ స్థితినొంది తత్త్వమసి మహావాక్యార్ధమగు (ఆత్మయందు తనయందు, స్వస్వరూపమునందు) నిలుకడ నొందుటను సత్త్వాపత్తి యని యందురు. ఈనాలుగుభూమికల అభ్యాస బలముచే ప్రకాశ మాత్రమగు సత్త్వారూఢమగు బ్రాహ్మిస్థితినొంది అవిద్యా తత్కార్య సంబంధ రహితమై అసంగస్థితి నుండుటయే అసంసక్తి భూమిక యనబడును.

ఈవిధమగు ఐదు భూమికల అభ్యాసబలముచే లోవెలి అను (బాహ్యాభ్యంతర)దృశ్యపదార్థభావనారహితుడై స్థితినొందియుండుట. సంతతము ఆత్మరతి ఆత్మతృప్తి నుండుచు అత్యంతప్రయత్న పూర్వకముగ వ్యుత్థానము నొందింపబడు స్థితి పదార్థభావన యను 6 వ భూమికయగును. ఇట్లు ఈ 6భూమికల చిరకాలాభ్యాసవశమునభేదము తోచక సహజముగ నుండెడి అద్వితీయాత్మ నిష్ఠ ఏది గలదో అది తుర్యగ అనబడును. ఈ తురీయావస్థయే జీవన్ముక్తుల యందుండు పరాస్థితి. ఆపిదప తురీయాతీత మనబడునది విదేహ ముక్తి విషయమైనదని తెలియవలెను. ఇందులో మొదటి మూడు అభ్యాస భూమికలు, 4వది జ్ఞానభూమిక, 5,6,7 భూమికలు ఫలభూమికలు. మొదటి మూడు ప్రయత్న సాధ్యములు. తక్కినవి స్థితి. ఈస్థితియందునున్న వారిని బ్రహ్మవిద, విద్వర, విద్వర్య, విద్వరిష్ఠ యందురు. వీరు నిత్య

ముక్తులు.

## శ్రీ ఉమామహేశ్వరాశ్రమము-నంద్యాల

శ్రీసాధారణ నామ సం॥ము జ్యేష్ఠ శుద్ధపాడ్యమి శుక్రవారము మొదలు పంచమి సోమవారము వఱకు నంద్యాల పట్టణము శ్రీఉమా మహేశ్వరగురుపీఠము, శ్రీఉమామహేశ్వరాశ్రమము సంజీవనగర్‌లో పూజ్యశ్రీస్వాములవారి ఆధ్వర్యమున శ్రీకైలాసశివ, శ్రీ రత్నగర్భ గణపతి, శ్రీచంద్రమౌళీశ్వర మహాలింగము శ్రీపార్వతి శ్రీచక్రరాజ మహాయంత్రము, శ్రీనంది, శ్రీదక్షిణామూర్తి, ధ్వజప్రతిష్ఠలు పిదప నవగ్రహ ప్రతిష్ఠలు శ్రీ ఉమామహేశ్వర గురుపీఠ పరంపరా శిలాఫలక స్థాపనాది మహోత్సవ కార్యక్రమములు వేదోక్త విధులచే విద్యానిధులైన వైదికాచార సంపన్నులగు బ్రాహ్మణోత్తములు బ్రహ్మశ్రీ వెల్లాల చిదంబరశాస్త్రిలు (వ్యాకరణశిరోమణి) బ్రహ్మశ్రీ యమ్. బాలవిశ్వనాథ శర్మగారు (సాహిత్య శిరోమణి యమ్. ఎ) బ్రహ్మశ్రీ దుర్భాక సుబ్బరామశాస్త్రిలు, బ్రహ్మశ్రీ పి. వెంకట రామశాస్త్రిలు గోకర్ణ క్షేత్రం శ్రీసీతారామభట్టుగారు, బ్రహ్మశ్రీ శ్రీరామచంద్రమూర్తి (సాహిత్య శిరోమణి, వేదాంత శిరోమణి) బ్రహ్మశ్రీ శేషప్పస్వామి మొదలగు భూసురవర్యులచే విధ్యుక్తముగ మహాకార్యము మంటప ప్రవేశము, మహాగణపతి పూజ, స్వస్తి పుణ్యాహవాచనము, నాంది, ఋత్విగ్ వరణాది కార్యములతో వేద ఘోష ప్రారంభింపబడెను. సర్వమంగళ వాద్యములు జయజయ ధ్వానములచే కార్యము కన్నుల పండుగయై వీనులవిందై వినబడు బ్రాహ్మణోత్తముల వేద మంత్ర పఠనములు సుశ్రావ్యముగ నుండు చుండ సాంగోపాంగముగ సర్వకార్యములు జరిగెను.

ఆశ్రమ ప్రాంగణమున సువిశాలమగు గొప్పదైన సభా మంట పము నిర్మింపబడి సర్వాలంకారసంశోభితమై యొప్పుచుండెను. ఆహూతులై ఈమహాకార్యమునకు దయచేసిన పూజ్యమహాత్ములు శ్రీరామ

కృష్ణానంద స్వాములవారు, మాతృశ్రీ నిరంజనానందగిరి అమ్మవారు, శ్రీ నిత్యానందస్వాములవారు, శ్రీ సిద్ధేశ్వరానంద స్వాములవారు, శ్రీ శివప్రకాశానంద స్వాములవారు, బ్రహ్మశ్రీ రామచంద్రమూర్తి గారు (సాహిత్యశిరోమణి, వేదాంత శిరోమణి) బ్రహ్మశ్రీ నివర్తి వెంకటసుబ్బయ్యగారు యమ్. యల్. సి. మొదలగు ఉపన్యాసక మహోదయు లందరు వచ్చియుండిరి. ఆశ్రమప్రాంగణమున సిద్ధపఱచ బడిన సభామంటపమునకు మంగళవాద్యములచే బ్రాహ్మణుల వేద మంత్ర ఘోషతో పూర్ణకుంభముచే మహాత్ములను స్వాగతపఱచి సభావేదికల నలంకరింపజేసిరి. ఇట్లు శ్రీవారి ఆధ్వర్యమున ౫ దినములు ఈ మహాసభ మహాత్ముల ఉపన్యాసముల చేతను, కవుల, పండితుల ప్రవచనముల చేతను ఆ సమయమునకు దయచేసిన మఱికొందరి ఉప న్యాసముల చేతను వేలాది భక్తజనావళి చేరియుండ యాసన్నివేశము కైలాసమై యొప్పెను. హరి, శివ కథలు, సంగీత కచేరీ జరిగెను. అనేక ప్రాంతములనుండి వేలాదిభక్తులు చేరియుండిరి. ఇట్లు శ్రీసాధా రణ సం॥ జ్యేష్ఠ శుద్ధపంచమి సోమవారం 8.6.1970 ప్రతిష్ఠా మహో త్సవము సాంగముగ పూర్ణమాయెను. సర్వులు గురుదైవ దర్శన మందిరి. శ్రీమదుమామహేశ్వరుల ఉత్సవము జరిగెను. విశేషముగ అన్న సంతర్పణలయ్యెను. నంద్యాల పట్టణ భక్తాదులు మరియు ఆ పరిసర ప్రాంతములవారు అత్యంత శ్రద్ధాభక్తులచే శ్రీగురుపీఠ భక్తి భావనలచే సర్వకార్యములను చేసి శ్రీ ఉమామహేశ్వరుల కృపకు పాత్రులైరి.

విశేషించి ఈ కార్యమున కార్యదర్శులై శ్రీ కుమ్మిత శంక రయ్య శ్రేష్ఠిగారును, శ్రీ శెట్టి ఓబులపతి గారు, శ్రీమాఘంపుల్లయ్య గారు, శ్రీయస్. మోహనరావుగారు, శ్రీ జ్ఞానానంద స్వామి శ్రీ ఆచార్య స్వామి, విశేషముగ పరిశ్రమించి భక్తాదులందరి తలపున అన్ని కార్యములను భక్తిశ్రద్ధలచే నాచరించిన పుణ్యాత్ములు.

జీవనమున భక్తియే బలము. వీర్యమే ధైర్యము కావున అఖండ బ్రహ్మచర్య నిష్ఠులై ఒక్క క్షణమైనను విషయాకార వృత్తి లేన ట్లుగ సంతతము శ్రీగురుదైవమును ప్రత్యగాత్మ స్వరూపముగ నారాధించుచుండవలెను. ఉత్తమమగు శుద్ధి లేనివారి జీవనమున బ్రహ్మచర్యాదినియమములు అనుసవినామమాత్రములు. పిచ్చివాని చేతి యందు ఒసగబడిన రాళ్ళు, ఆయుధ విశేషములవలె అనర్థ దాయకములు. నిజమగు చిత్తశుద్ధి, ఆత్మానాత్మ విచారము గురుభక్తి యుండినచో కలుగును. ఆశీలప్రభావముచే ఆరోగ్యము ఆనందము సదా ఉండును. అట్టి ఉత్తములు సంయమ శీలురు గావున కుడి నాశిక నుండియే శ్వాస వచ్చుచుండును. (అనగా సూర్యనాడి) ఎడమనాసిక (చంద్రనాడి) నుండి శ్వాస వచ్చిన కోపము, రోగము, దుఃఖ భయాదులుకలుగును. అని నాడీ శాస్త్రవేత్తలు కూడ చెప్పుదురు. కావున సాధకులగు ముముక్షువులు సంతతము శివస్మరణ, గురుస్మరణ గలిగి బ్రహ్మాత్మ బుద్ధిచే నుండవలయును. అలసట, అజాగ్రత్తకు కొద్ది యవకాశము నిచ్చినను పూర్ణమగు సోమరితనము వచ్చిచేరును. జాగ్రత. మేటియైనది బ్రహ్మవిద్య అది కేవలము బుద్ధి వాదము మాత్రము కాదు. అనుభవ విద్య.

ఏవిషయము నందైనను చక్కగా మధ్య బోధింప బడునది చాల గొప్ప దందురు. ఋగ్యజుస్సామములలో యజుర్వేదము మధ్య నున్నది. ఇది ఏడు కాండములు ఈ ఏడింటికి మధ్య నాలుగవ కాండము. ఆ నాల్గవ కాండ మధ్యస్థలముగ పంచాక్షర మహామంత్ర మున్నది. ఈ మంత్రము నందు శివ అను అక్షరములు అతి ముఖ్యములు. శివ ఇత్యక్షరద్వయం అని మన మనుదినము ప్రాతః సంధ్యల యందు స్తోత్రము జేయుచుందుము కదా! అందుచే వేద శిరస్సగు ఓంకారమును, వేద మధ్యమున నుండు శివ శబ్దము పరబ్రహ్మమును తెలుపును. ఏకమును ఓంకార ప్రతిపాద్యమునగు పరబ్రహ్మమునకే

శంభువని మనము ధ్యాన పూజాదు లొనర్తుము. ఆ తత్త్వమే ఆపాతాళ నభః స్థలాంత... ... ..." అను నిత్యాదిగా పూజానుష్ఠానముల గ్రహించు పరమ శివుడే శంభుడనియు, శంకరు డనియు తెలియవలెను.అనుదినము శంభవే మయోభవే శంకరాయ మయస్కరాయ అని ఆ పరబ్రహ్మమును గూర్చియే చెప్పుదుము. అదే శాంతము శివము అద్వైతమని ఉపనిషత్తులు వర్ణించుచున్నవి. "శం కరోతీతి శంకరః" సుఖమును కలిగించు వాడు కావున శంకరుడని చెప్ప బడును.

"ఆచార్య శాస్త్రాది రూపేణ మోక్ష సుఖం కరోతి ఇతిమయస్కరః" మయస్సనగా నిత్య సుఖము. ఈనిత్య సుఖము నొసగువాడు కావున మయోభువు "యద్వై శివం తన్మయః" అని యజుర్వేదము శాంతం శివం అద్వైతం అని ఇవన్నియు ఆ పరబ్రహ్మమునే బోధించు నవై యున్నవి.'శాంతం పద్మాసనస్థం' అనునట్లు శాంతియే స్వరూపుడును నేత్రోన్మీలనమే చేయని పరమ శివుని యందు భక్తి నుంచి భజించిన భవము బాసిపోవును. అట్లు శాంతిచే పరిపక్వ మొందబడిన మనస్సునకు గుఱుతు బహిర్ముఖ వృత్తి రహితమై శాంతినొందియుండును. శాంతియే మోక్షము. అతనికి జన్మలేదు. "తమేవం విద్వానమృత ఇహాభవతి" ఈ లోకమునందు ఈ జీవితముననే అతడు ముక్తి నొందును. "శక్నోతీహైవ యస్సోఢుం"అన్నట్లు ఇపుడే జీవితమున బ్రహ్మజ్ఞానము నొంది ధన్యులు గావలయును. సహన సందీప్తవంతమగు సాధనానుష్ఠానములు మరువరాదు. దేనికైనను సద్గురు అనుగ్రహము, సచ్ఛిష్యుని అభ్యాస పాటవము ముఖ్యములు. శివుని యందెంతటి భక్తియో, సద్గురువు నందదే భక్తి యుండవలయును. "యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురౌ"

జ్ఞానియొక్క భక్తి యనిన అద్వైత నిష్ఠయే అని గ్రహించవలయును. విద్యా వినయ సంపన్నత సహజమై యుండును. చిత్తశుద్ధి యున్నదా లేదా అనుటకు తన చిత్త వృత్తియే సాక్ష్యము. ఏవృత్తు

లును లేని నిద్రయును కాని కలనొందని జాగ్రద్రూపమగు వ్యవహార మును పొందని తురీయమగు ఆ పరాస్థితి స్వతంత్రమై అభ్యాసపాటవ ముచే తనదియై తానై క్షణ మాత్రమున స్మృతి మాత్రమున ఆస్థితి నుండగలడు. ఓం.

వేదోపనిషత్తుల యందు చెప్పబడిన విషయము లెల్లయు స్మృతుల యందుండవు. అవి స్మృతి మాత్రములే. మహర్షుల జ్ఞాపక మున్నంత వరకు వారి స్మృతి మేరకు వ్రాయబడినవి. శ్రుతి అడుగు జాడల యందు స్మృతి నడచును. దిలీప చక్రవర్తి వశిష్ఠాశ్రమము నం దుండి నందినీ ధేనువును దోలుకొని వెళ్ళునపుడును అతని సతీమణి సుదక్షిణ కొంత దూరము భర్త వెనుక నందినీ ధేనువెంట వెళ్ళి అటుపై తిరిగి వచ్చెడిదని రఘువంశ కావ్యమున వర్ణింప బడినది.

"తస్యాః ఖురన్యాస పవిత్ర పాంసు మపాం సులానాం ధురికీర్తనీయా
మార్గం మనుష్యేశ్వర ధర్మపత్నీ శ్రుతే రివార్థం స్మృతి రన్వగచ్ఛత్"

అనగా శ్రుతర్థ్యము ననుసరించి స్మృతులు కొంతదూరము వెళ్ళునని తాత్పర్యము.

సదాచార సంపన్నమైన మతము భక్తులు సంఘము అనునవి దివ్య గుణోపేతమై సచ్ఛీల సంపన్నమై. శ్రద్ధా భక్తి యుక్తమై పెద్ద చిన్న యను ఇంగిత జ్ఞానము కలవారై భక్తి యుక్తులై యున్నంత వఱకు చాల బాగుండును. మాయోపాధికుడగు పరమేశ్వరుడు దీనిని చక్కగ బ్రోచును.

మన మతమును వైదిక మతమని అందురు. "అనంతా వై వేదాః" వేదములు అనంతములు. వ్యాస భగవంతుడు వాటిని 4భాగ ములుగ విభజించిరి. వేద మంత్రములనిన అవి పౌరుషేయములై వ్రాయబడినవి కావు. వాక్కుద్వారా ఒకరి నుండి ఒకరికి బోధింప బడినవి. అందువలననే వీటికి శ్రుతులని పేరు. శ్రుతి యన వినబడున దని అర్థము. శ్రోత్రేంద్రియమును ప్రసాద లింగమందురు. చెప్పబడు

వాగింద్రియమును గురులింగ మందురు. ఋషులు మంత్రద్రష్టలు, తపస్సుచే వారు మంత్రములను దర్శించిరి.అంతియే కాని వారు రచించిరని అర్థము కాదు. ఈలోకమున బ్రహ్మానుభవియగు నాత డొక్కడే సుఖ స్వరూపుడు. అది నిత్యసిద్ధమై యుండియును సదాచార సంపద్విశిష్టమైన బ్రహ్మాకార వృత్త్యైక గోచరము అనుభవము. గురు శాస్త్రముల యందు పరాభక్తి యుండవలెను. గురువు ప్రాప్తి కానంతవరకు దైవము. ఆపిదప గురుభక్తి గుఱుతఱమైనదని తెలియవలెను.ఈశ్వర భక్తికి గురుభక్తి అవసరము. గురుభక్తి లేనందుచేతనే, దైవభక్తి చక్కగ కుదురుట లేదు. ఇవి రెండును ఇట్లుండ ఆత్మ నేననుయథార్థ జ్ఞానము కలుగదు. అందుచేత గురువు, దైవము, శాస్త్రము, నీఆత్మ ఒకటియే యని తెలిసి నెమ్మదిగా నియమ నిష్ఠ నుండవలెను. ఆత్మ బ్రహ్మమే !

ముముక్షువు లెప్పుడును వృథా సంభాషణము చేయరాదు. అట్లు చేయుట కిచ్ఛయించినచో తిన్నగ నది ఇతరులను దూషించుటకు ప్రారంభ మగును.దాని సంతానముగ కామాకార వృత్తు లేర్పడును తద్ద్వారా క్రోధము మొదలగు చెడు తలంపులకు మూల మగును. కాబట్టి వీటి నుండి దూరము కావలెన్న, దుస్సాంగత్యమును వీడి నిర్మలులై ఈశ్వర చింతనము, సద్గ్రంథ పఠనము గురుభక్తి భావనలు గలిగి వర్తించిన అవి మటుమాయమై పోవును. అతడు మహాత్ముడైనచో ఒక చెడు తలంపైనను అచట నుదయింపదు. ఇది గుర్తింపవలెను.

బహిర్ముఖత నొందుట మానవునకు బహు సులభము. అంతర్ముఖత మహాకష్టము. సంతత ఈశ స్మరణ దానికి సాధన. ధ్యానానుష్ఠానముల కెంత ప్రాధాన్యత ఇచ్చిన అంత సహజస్థితి ఏర్పడును. ఇతర పనులను చాలించి ఈశస్మరణ అత్యధికముగ చేసినచో సమస్త శుభములు చేకూరును. అనగా ధ్యాన సాధ్యము బ్రహ్మతత్త్వానుభవమని

కాదు. అది సహజము. సాధకులకు సాధన పూర్వకముగా నని అర్థము గ్రహించవలెను ఓంతత్సత్.

29.6.70 శ్రీవారి పరమ గురువుల ఆరాధన కార్యక్రమము మంగళ మయముగ జరిగెను. 1.7.70 శ్రీగురుదేవుల జయంత్యుత్స వము ఆనందముగ నడచెను. అనంతరము ఆ యా స్థానముల నుండి వచ్చిన అనేక భక్తులు మరి యాపుర ప్రజలు పూజ్య గురుదేవుల సన్నిధియందు "ఇక మీదట దయచేసి శ్రీవారు శ్రీచాతుర్మాస్య మహా వ్రతమును 4 మాసములు ఒకేచోట నుండి ఆచరించుట కంటెను బహు జనులకు శ్రీవారి ప్రబోధలు అందుకొనుటకు అవకాశముగ నుండు నట్లుండిన బాగుండునని విన్నవించు కొనిరి. 2 మాసములు లేక 1 మాసమైనను విశేషించి భక్తులు కోరిన 15 దినములు మాత్రమై నను సరే ! వివిధ స్థలములలో జరుప గోరిరి. ఇంతవరకు మహా జ్ఞాన సంపద యన బరగు శ్రీచాతుర్మాస్య మహావ్రతములు అకుంఠిత ములై అనేక స్థలముల యందు నాలుగు నాలుగు మాసము లుండుచు 25 శ్రీచాతుర్మాస్య మహా వ్రతములు పూర్ణమయ్యెను. 25వమహా వ్రత రజతోత్సవము కూడ విధ్యుక్తముగ జరుపబడెను. కావున భక్త లగు మాయందరి యందు దయయుంచి ఇక మీదట తమ మహావ్రత నియమమును నియమిత సంఖ్య 120 దినము లుండినను మా ప్రార్థనలు మన్నించి కారణజన్ములును పూర్ణులగు తాము ఆ యా స్థానములకు దయచేసి ప్రబోధించుచు మమ్ము కృతార్థులను జేయవలసినదిగా మేమం దరము ఏక కంఠమున శ్రీసన్నిధి విన్నవించు కొనుచున్నామని తెలుపు కొనిరి." అందులకు శ్రీగురుదేవులు భక్తుల భక్తి భావములను చూచి "ఓంనమో భగవతే శ్రీమదుమామహేశ్వరాయ" అని తమ గురువు లను గురుపీఠమును స్మరించుచు మీ యందరి సదిచ్ఛ ఫలవంతమగును గాక ! తథాస్తు" అను నాశీస్సులచే ఆశ్వాసన మొనర్చిరి.

## శ్రీఉమామహేశ్వరాశ్రమము - నంద్యాల
## 26.వ. శ్రీచాతుర్మాస్యమహావ్రతము-1970 సం॥

శ్రీసాధారణ నామ సం॥ర ఆషాఢ శుద్ధ ॥౧౧॥ బుధవారము 15.7.70 విధ్యుక్తముగ బ్రహ్మ ముహూర్తమున వెనుక శ్రీచాతుర్మాస్య మహావ్రత ప్రారంభముల యందువలె యథా శాస్త్రముగ శ్రీగురు, శ్రీచంద్రమౌళీశ్వర (శ్రీఉమామహేశ్వర) శ్రీవ్యాసపూజ వగైరా కార్యములు ప్రారంభమై ప్రాతఃకాలము ముండకోపనిషత్ప్రవచనము జరిగెను. మంగళము మంత్రపుష్పము. సాయంకాలము ప్రదోష పూజానంతరము 7 గం॥ నుండి 8 గం॥ వఱకు శ్రీమద్భగవద్గీతా భాష్య శ్రవణము మంగళము. ఆశ్రమ దైవ ప్రతిష్ఠా మండల మహాపూజ ఆషాఢ శుద్ధ పూర్ణిమ 18.7.70 విధ్యుక్తముగ సర్వోపచారములచే జరుపబడెను. 15.7.70 మొదలు 11.9.70 వఱకు రెండు మాసములు ఆశ్రమమున సమస్త వైదికాచార సంపన్నమై పర్వ దినముల యందు ఇతోధికమైన విశేష కార్యములచే ఆత్మ తత్త్వ ప్రబోధ రూపమగు బ్రహ్మయజ్ఞము (మహావ్రతము) ఉత్తమోత్తమముగ నడచి పూర్ణమయ్యెను.

మఱల గుంతకల్లు శ్రీఉమామహేశ్వరాశ్రమము నందు ఇదే ప్రకారముగ దేదీప్యమానమై శ్రోతృ జనానంద ప్రదమై ప్రస్థాన త్రయ భాష్య పాఠములు ప్రశాంతముగ నడచి 10.11.76 కార్తిక శుద్ధ ॥౧౨॥ 26వ శ్రీచాతుర్మాస్య మహావ్రతము పూర్ణమాయెను. హంపి మహా క్షేత్రమున దీక్షా విరమణమై సర్వము సంపూర్ణమాయెను. ఈ మహావ్రతమునందు బ్రహ్మసూత్ర పాఠములు అనేక వ్యాఖ్యలు, భాష్యములు, రచనలు ఆధారముగ గైకొని విపులముగ వివరించిరి. ఉత్తమ ముముక్షువులు మహదానందము నొందిరి.

శ్రీవారు 24.11.70 తమ గురుదేవుల పుణ్యారాధన నంద్యాల శ్రీఉమామహేశ్వరాశ్రమము నందు సుఖముగా జరిపిరి.

కర్నూలు ఉళిందకొండ గ్రామం ఎ. లక్ష్మణస్వామి మొదలగు వారి భక్తి భావనల మన్నించి శ్రీవారు అచటికి దయచేసి శ్రీ రామాలయమున సన్నిధి చేసిరి. పూజానుష్ఠానాదులచే రామాయణము, భగవద్గీతార్థములను బోధించిరి. అటనుండి కోడుమూరు గ్రామం భక్తుల ప్రార్థనానుసారము అచటికి దయచేసి శ్రీగురుపీఠ పూజానుష్ఠానాదులచే బ్రహ్మవిద్యా, తత్సాధనము, గుణసంపత్తి అను విషయములపై ప్రవచించిరి. భక్తాదులందరు మహా తృప్తి నొందిరి.

(వేదాధ్యయన సామర్థ్యము లేకున్న భగవద్గీత, ఉపనిషత్తులు భాగవత, రామాయణాది పవిత్ర గ్రంథములు చదువుట కూడా మంచిదే అదే అధ్యయన మనియు తెలియ వలయును.) అందులో శాస్త్రమునందు తెలుప బడిన సత్కర్మలను చక్కగ నాచరింపుము. ఇదియే పరమేశ్వర పూజ యగును. కామ్య కర్మలను మాత్రము ఆచరింపకుము. పాప కర్మలనుండి దూరుడవగుము. అనగా పోగొట్టు కొనుము. అనిత్యమగు సంసార సుఖముల యందు దోషముల నెఱుగుము. ఆత్మజ్ఞాన విషయకమగు నిజేచ్ఛ నధిక మొందించు కొనుము. సత్వరముగ (మమకార స్థానమగు) యిల్లు విడచి దూరముండుము. సజ్జనులతో కలసి మెలసి వినమ్రుడై వర్తించుము. పరమేశ్వరుని యందు అవిచ్యుతమగు దృఢభక్తి కలిగి యుండుము. శాంత్యాది గుణములను సంపాదింపుము. కామ్య కర్మలను దరిజేర నివ్వకుము. ఉత్తముడగు పండితుని అనగా సద్గురువు నాశ్రయించుము (వారి చరణ కమలముల సేవింపుము) అనగా వారి పాదుకలను సేవింపుము. బ్రహ్మవిద్యకు మూలమగు ఏకాక్షరమైన సుప్రణవమును అను సంధానము చేయుము (దానిని తెలుప బ్రార్థించుము) శ్రుతి శిరస్సు లనబడు ఉపనిషద్వాక్యములను ఆలకింపుము.

"తత్త్వమస్యాది" మహా వాక్యార్థమును విచారించుము వేదాంతము ఉపనిషచ్ఛాస్త్రమును శరణు బొందుము. సమ్మతము కాని కుత

ర్కమును విడిచిపెట్టుము. శ్రుతిసమ్మతమైన తర్కమును గ్రహించ వలెను. నేను బ్రహ్మమే నని సంతతము. భావించుము-గర్వాహంకారము లను విడనాడుము. శరీరాత్మ బుద్ధిని విడిచిపెట్టుము. పెద్దలతో వాదము లను పెట్టు కొనకుము. ఆకలి దప్పులను వ్యాధికి ఔషధము భిక్షాన్న మును (ప్రసాదమును) స్వీకరించుము. రుచ్యములగు భోజన పదార్థము లనుయాచింపకుము. అనగా (దైవవశమున లభించిన దానితో తృప్తి నొందుము) శీతోష్ణసుఖ దుఃఖాది ద్వంద్వములను (అసంగ బుద్ధిచే, సహించుము. వ్యర్థమగు మాటల నాడకుము. (వృథా వాక్ప్రలాపము విడిచి పెట్టుము) ఉదాసీన స్థితి యందుండుము. అనగా దేని యందును అత్యాసక్తి నుంచకుము. లౌకికులతో నిష్ఠురముగ వర్తించవలదు. అర్థాత్ జనులపై దయగాని, నిష్ఠురత్వము గాని ఉంచవలదు.

ఏకాంత స్థానమున స్వస్థముగ కూర్చుండుము. పరబ్రహ్మము నందు చిత్తము నుంచవలెను. దృశ్యమగు నీజగత్తు పూర్ణ బ్రహ్మ వస్తుతత్త్వమే నని చూడుము వస్తుతః అది లేనిదే యని అది నీయందు లీనమైనట్లు తెలియుము. అనగా బాధితానువృత్తిచే జగత్తు లేనిదే యని తెలిసి బ్రహ్మమాత్రాత్మదర్శి వగుము. వెనుకటి కర్మలను, నాశ మొనర్చుము. జ్ఞానముచే సంచిత కర్మ నివృత్తి యగును. జ్ఞాన నిష్ఠు డవై జ్ఞానము నాశ్రయించి భావి అనగా రాబోవు ఆగామి కర్మల యందు ఆసక్తి నుంచకుము. అనివార్యమగు ప్రారబ్ధము ననుభవించుచు బ్రహ్మాత్మత్వ స్థితి గలవాడవై యుండుము. జీవన పరమ లాభము పరాస్థితి, బ్రహ్మజ్ఞానము ఈ క్రమము ననుసరించి వర్తించిన జన్మ ధన్యమగును. అను నీసాధన పంచక మూలమున విపులముగ వ్యాఖ్య యొనర్చిరి ప్రసంగము సర్వ జనానంద ప్రదమై యుండును.

అచటినుండి ఆదవాని దయచేసి ఉత్తమమగు శారీరక మీ మాంసా బ్రహ్మసూత్ర భాష్యమున మొదటి అధ్యాయము మొదటి సూత్ర వివరణము ఎంతో ఆప్యాయముగ శ్రుతి సమ్మతమగు అర్థము

లచే బోధించుచు కొన్ని సూత్రార్థములను వివరించిరి. సాయంకాలము గీతాశాస్త్ర ప్రవచనము జరుపబడెను. ఆపిదప హాలరివి శ్రీ ఉమా మహేశ్వరాశ్రమ గురుదైవ ప్రతిష్ఠా కార్యక్రమము సమీపించు చున్నందున 11.1.71 తేది కర్నూలుజిల్లా హాలరివి శ్రీ ఉమామహేశ్వ రాశ్రమమునకు దయచేసిరి.

ఇచ్చట శ్రీవారు తమ యథారీతి నియమ నిష్ఠ పూజాదులచే ప్రతిష్ఠా విషయకమగు సర్వ కార్యములను సువ్యవస్థగా చూచు కొనిరి. పుణ్యదంపతులు, శ్రీమాన్ హెచ్. నారాయణరెడ్డిగారు, వీరి సతీమణి కుం॥సౌ॥ శ్రీరాజమ్మగారు భక్తిచే తమ ఆదరాభిమానము లను చూపుచు నిర్మలముగ త్యాగపూరితులై ఈ మహాకార్యమును చేసిరి. శ్రీమాన్ హెచ్. సంజీవరెడ్డిగారును, శివారెడ్డి, శ్రీభాగమ్మ, బసవనగౌడు, శ్రీయం. ఓబన్న, మున్నగు యావత్తు భక్త మండలి వారు మరియు చింతకుంట శ్రీ కె.గాదిలింగప్ప, శ్రీఆర్. క్రిష్టప్ప భక్తాదులు ఈ దైవ ప్రతిష్ఠామహాకార్యమున ఎంతో భక్తితో సేవ యొనర్చిరి. ఆశ్రమ వాసులగు వృద్ధులైన శ్రీశాంతానంద స్వామివారి సేవ, పరిశ్రమ అమోఘము. ఆశ్రమవాసి శ్రీరామప్పస్వామి యను వారు వీరే. ముందు శ్రీ నిర్మలానంద స్వామియని తురీయాశ్రమ శుభనాములు. అనుదిన ఆశ్రమసేవాకైంకర్యముల యందు ఎంతో శ్రద్ధాభక్తులచే వర్తించువారు.

## శ్రీ ఉమామహేశ్వరాశ్రమము - హాలరివి

స్వస్తి శ్రీ సాధారణ నామసం॥ర మాఘ శుద్ధ షష్ఠి 1-2-71 మొదలు 5.2.71 దశమి వఱకు హాలరివి శ్రీ ఉమామహేశ్వరాశ్ర మము దైవప్రతిష్ఠామహోత్సవము శ్రీకైలాసశివ, శ్రీ చంద్రమౌళీ శ్వర, శ్రీపార్వతి, శ్రీచక్రరాజ మహాయంత్రము, శ్రీరత్నగర్భ గణ పతి, శ్రీ నందీశ్వర ధ్వజప్రతిష్ఠలు, అనంతరము నవగ్రహ ప్రతిష్ఠ, శ్రీఉమామహేశ్వర గురుపీఠ పరంపరా శిలాఫలక స్థాపన మహోత్సవ

కార్యక్రమములు పూజ్యశ్రీ గురుదేవుల నేతృత్వమున వేదోక్తముగ భూసురులగు బ్రాహ్మణులు అనగా వెనుక ప్రతిష్ఠామహోత్సవమునకు వేంచేసినవారందరును యథాసమయమునకు వచ్చిరి. విశేషముగ మంగళ వాద్యములు మ్రోయుచుండ భూసురులు తమ వసతినుండి శ్రీ ఉమా మహేశ్వరాశ్రమమునకు వచ్చి మంటపప్రవేశము, మహాగణపతిపూజ స్వస్తి వాచనము, నాంది, ఋత్విగ్వరణము మొదలగు కార్యములు క్రమముగ ప్రారంభించిరి.

ఆహ్వానింపబడిన పూజ్య మహాత్ములు శ్రీ రామకృష్ణానంద స్వాములు, శ్రీశుద్ధచైతన్యస్వాములు, శ్రీసురపురంశంకరశాస్త్రిలు(శంకరానంద స్వాములు) శివప్రకాశానందస్వాములు మొదలగు మహాత్ములందఱు సకాలమునకు దయచేయ, వారిని వైదిక సర్వలాంఛనములచే మంగళవాద్యములతో శ్రీ ఉమా మహేశ్వరాశ్రమమునకు స్వాగత పఱచి, మఱల యథారీతి సభామంటపమున సుఖాసీనులను గావింప జేసి పూజ్య శ్రీవారి ఆధ్వర్యమున సర్వకార్యములు శివప్రదముగ జరుపబడెను. ఉదయము 9 గం॥ నుండి 12 గం వఱకు సాయంకాలము 4 గం॥ నుండి 8 గం॥ వఱకు ఉపన్యాసములు జరుగునట్లు నిర్ధరింపబడి మంగళాచరణ పూర్వకముగా సభ ప్రారంభమయ్యెను. వేలాది భక్తజనులచే గూడి సభాస్థలి క్రిక్కిరిసి యుండ గంభీరమును ప్రసన్నమునగు మహాత్ముల ఉపన్యాసావళిని సర్వులు నిశ్శబ్దముగ విని ఆనందించిరి.

ఈమహాకార్యము అత్యంతవైభవమును వైదిక సుసంపన్నము నయి సర్వజనానంద ప్రదముగ దైవప్రతిష్ఠా కార్యము మాఘశుద్ధ దశమి శుక్రవారము 5.2.71 తేది ఉదయం 9.35 నుండి 9.41 నిముష ముల వరకు గల మీనలగ్న శుభ పుష్కరాంశయందు, సమస్త సన్మంగళములచే నొప్పుచు శివప్రదముగ జరిగి పూర్ణమాయెను. జయజయ ధ్వానములు, మంగళ వాద్యములు మిన్నుముట్టుచుండ సర్వులు శ్రీ

కైలాస శివాదిదైవములను సందర్శించి ధన్యులైరి. విశేషముగ అన్న సంతర్పణలు శ్రీఉమామహేశ్వరుల ఉత్సవము వైభవముగ జరిగెను. అనేకపట్టణములు మరియు గ్రామాంతరముల నుండి భక్తాదు లేతెంచి యుండిరి. శ్రీగురుకరుణచే సర్వము సాంగమంగళమాయెను. ఓం

'శంభో సుస్వాగతం' రచయితలు మహామేధావి అప్పయ్య దీక్షితులు ఇట్లు పలికిరి :

"హిమగిరి తనయా హిమాంశు లేఖా సరిదతి శీతల వాహినీ సురాణాం,
త్రిభిరేతైరపి వేపితోసి శంభో! మమ హృది విపిశ త్రితాప యుక్తే॥"

శంభో ! నీకు అన్నియు చలువయే. చంద్రకళ చలువ, గంగయు చలువ, ఉండుకొండయు చలువ ఈ చలిచే నెందుకు బాధపడెదవు. నాహృదయమున వచ్చిచేరుము. ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములను మూడు అగ్నులు గలవు. దానినుండి నీకు వెచ్చనగును. నాకు చలువ యగును. ఇరువురును కలిసి యుందము. రారమ్ము, స్వాగత మిదే ... అని భావార్థము. సదా ఈశస్మరణ, ఈశ్వరుడు నా హృదయమున నుండుగాక యని ప్రార్థన.

తడిబట్టను భుజముపై వేసుకొని కాని లేక కట్టుకొని కాని శ్రీ ఉమామహేశ్వరుని పరమ శివుని సద్గురుని పూజాద్యనుష్ఠానములు సలుపరాదు, ఈ తడిబట్టయందు సమస్తమైన అమంగళము లుండునని వైదిక శాస్త్రము చెప్పుచున్నది. బాగుగాఉతికి తడి ఆరిపోయినవస్త్రములను ధరించుకొని పూజాద్యనుష్ఠానములను ముముక్షువులు సలుపుకొనవలెను. "నగ్నాశ్చార్ద్రాపటస్మృతః" అనగా తడిబట్టను ధరించువాడు దిగంబరునితో సముడని శాస్త్రము చెప్పుచున్నది. పూజానుష్ఠాన సమయమునందు కోపగించుట కాని, మాటలాడుట కాని తగదు. ఇతర ఏ సంభాషణలు ఆసమయము నందు ఉండరాదు. మౌనమనగా పరాస్థితి సంభావనా భావితులై వుండి ఆచరించవలెను. ధూప దీప గంగా జల పాత్రగాని, తక్కిన ఏ పూజాద్రవ్యములనుగాని లింగపీఠముపై

నుంచరాదు. పార్వతీ పరమేశ్వరులు అనగా ఉమా మహేశ్వరులు సాక్షాత్ తల్లిదండ్రులుగురుదైవస్వరూపులనిభావించిపూజించవలెను. విభూతి అనగా పంచ మలములు కాల్చబడి శేషించినది భస్మము, అనగా శేషవస్తువు పరమాత్మయను ప్రతీకమై యున్నది. సర్వకల్మష ములనుబాపును. అది సంపత్స్వరూపము, అది రాక్షసాదులనుండి రక్షించును. భస్మస్నానము అంగన్యాస కరన్యాసములు కూడ గలవు. ఆ యాస్థానముల యందు తత్తన్నామ స్మరణపూర్వకముగ భస్మమును త్రిపుండ్ర రేఖావళిగా ధరించవలెను. అగ్ని, జలము, వేదములు సూర్యచంద్రులు, కాశ్యాది పుణ్యక్షేత్ర తీర్థములు పవిత్రమగు ఆ పూజానుష్ఠానఫలము దక్షిణ కర్ణమున వసించుచుండును. ప్రాయశః కారణాంతరమున మౌనభంగమైనచో ఆచమన మొనర్చి దక్షిణ కర్ణ మును స్పృశింపవలెను. ఆద్యంతములయందు ముఖ్యముగ ఘంటానాద ము చేయవలెను. 'తచ్ఛం యోరావృణీమహే...'

భక్తులు శ్రీచంద్రమౌళీశ్వరునకు (శ్రీఉమామహేశ్వరునకు) ప్రదక్షిణ చేయునపుడు నెమ్మదిగ నడువవలెను. అభిషేక పూజాదుల యందు గురుదైవ సన్నిధి అందరును భక్తితో, భక్తిజ్ఞానవైరాగ్య పూర్వక బ్రహ్మాత్మైక్యరూప అభేద జ్ఞాన సిద్ధ్యర్థం నిత్య నిర్వికారా సంగ అద్వితీయ సచ్చిదానంద చిదేకరస బ్రహ్మానుభవ సిద్ధ్యర్థం "ప్రజ్ఞానంబ్రహ్మ" "అహంబ్రహ్మాస్మి," "తత్త్వమసి," "అయమాత్మా బ్రహ్మేతి" వాక్యార్థ జ్ఞాన సిద్ధ్యర్థం శ్రీమదుమా మహేశ్వర ప్రసాద సిద్ధ్యర్థం శ్రీరుద్రాభిషేకం కరిష్యే అని మోక్షాపేక్షచే నొప్పుముము క్షువులగు మీరు మరి సర్వులు నిష్కామమగు నిట్టి పవిత్ర సంకల్ప పూర్వకముగ పూజాద్యనుష్ఠానములు సలుపవలెను. సర్వ శుభములు చేకూరును.

సర్వవ్యాపియగు ఈశ్వరుడు ఏకము ఒక్కడే. అతడే సగుణ నిర్గుణ రూపుడునై అద్వితీయముగ నున్నాడని ఎవరెఱుగుదురో వారు ధన్యులు. "ఏకోదేవస్సర్వభూతేషు గూఢః" హాకారము బిందువుతో

కూడినదై యున్నది. ఇదే వర్ణవ్యత్యయముగా నుపాసింప, అజప మహామంత్రమని చెప్పబడును. ఇది కల్పతరువువలె ముముక్షువులకు ఫలము నొసగును. సాధకునికి జపము చేయకుండగనే జపము జరుగు చుండును. పవిత్రమగు బుద్ధితో హంసను ఎదురుచూచు చుండుటయే అనగా ప్రాణప్రత్యవేక్షణ మొనర్చిన అది అక్షయమగు యథార్థ జ్ఞానము నొసగును. మోక్షప్రదము. ఎవరు భక్తిచే అజపమును లేక ఓం నమశ్శివాయ యను మహామంత్రమును నిత్యము శ్రీగురుదేవులు తెలిపిన ప్రకారము 12000 జపము చేయుదురో వారు సర్వ ద్వంద్వ విముక్తులై మోక్షమును అనగా అబాధితమగు నిజ జ్ఞానము (నిష్ఠ) నొందుదురు. ఇందు సందియము లేదు. పరమేశ్వరునకు సంసారము (భేదము, ద్వంద్వము) లేదు. ఆ పరమేశ్వరుడే సాక్షి చైతన్య స్వరూపుడగు నీవై యున్నావు. ఆ సాక్షి చైతన్యమే వ్యాపకమగు పరబ్రహ్మము. గురూపదిష్టమగు తత్వము నెరుగుటయే, ఈ నిజనిష్ట ముక్తి. ఇట్లు సూతసంహిత తెలుపు చున్నది. సప్తకోటి మహా మంత్రము లెల్లయు సద్యోజాతాది పంచముఖముల నుండి ఉద్భవమైన వని తెలియవలెను. (సూతసంహిత).

సాలగ్రామము నందు, నర్మదా బాణలింగము నందును, ప్రతిష్ఠితములైన లింగము లందును. ఆవాహన విసర్జనలు చేయరాదు. అవి స్థిరములు స్వయంభువులని ఎఱుగ వలయును.

"రుద్రాక్ష మూలం తద్బ్రహ్మా తన్నాళం విష్ణురుచ్యతే, తన్ముఖం రుద్ర ఇత్యాహుః, తద్బిందు స్సర్వదేవతాః॥" అనగా రుద్రాక్ష యొక్క మూలము బ్రహ్మ, రుద్రాక్ష యొక్క రంధ్రము విష్ణువు, రుద్రాక్షయొక్క ముఖమే రుద్రుడు, రుద్రాక్ష యందుండు బిందువులే (చుక్కలే) సమస్త దేవతా స్వరూపమని మహాత్ములు చెప్పుదురు.

విష్ణువును అక్షతలతోను, విఘ్నేశ్వరుని తులసితోను పూజించ రాదు. బిల్వదళములు సర్వదా పూజార్హములు. ఒకసారి పూజింప

బడినను మఱిల వాడుకొన వచ్చును. పరమేశ్వరునకు నైవేద్యము సద్యోజాతాది ముఖములందే అర్పణ చేయవలయును. ప్రాణాదు లందుగాదు. ప్రాణాయ స్వాహాదులు ఈశ్వర సన్నిధియందు అవ సరములేదు. నిత్యతృప్తుడైన పరమేశ్వరునకు నైవేద్య మనగా (బ్రాహ్మీస్థితి) బ్రహ్మానందానుభవ మని భావము. గర్భాలయమున శివునకు ప్రదక్షిణము చేయరాదు. తురీయ స్థితియే నమస్కారమని చెప్పబడును. "తురీయాఽవస్థా నమస్కారః" శివాభిషేకానంతరము తీర్థ ప్రసాదములను భక్తిచే తప్పక గైకొనవలెను. శివ నిర్మాల్య మనగా నిర్మలత్వమును ప్రసాదించునదని భావము. స్వయం ప్రకాశ మానమగు లింగము నందును, బాణలింగము నందును, స్వయంభూ లింగము నందును, జ్ఞానసిద్ధులచే ప్రతిష్ఠితములైన శివలింగము నందును చండాధి కారము లేదు. అనగా చండీశ్వరునకు సమర్పించవలసిన అవసరము లేదు. బాణలింగమనగా స్వయంభూ (లింగము) అనిఅర్థము. శైలలింగమునందు సమర్పించిన పత్ర పుష్ప ఫలాదులుమాత్రమే చండీశ్వరునకు సమర్పించ వలయును. ఓం

ఈ ఆశ్రమ దేవతా ప్రతిష్ఠా మహోత్సవ మండల పూజ **17.3.71** సర్వోపచారములచే విధ్యుక్తముగ జరుపబడి లక్ష బిల్వా ర్చన, లక్ష కుంకుమార్చనలు అన్న సంతర్పణమై శ్రీఉమామహేశ్వ రుల ఉత్సవము జరిగెను. శ్రీవారు వేదప్రోక్తమగు శ్రీరుద్రము శివ సహస్రనామము వాటియొక్క పవిత్రతను దొడ్డతనమును గుఱించి కొన్ని దినములు బోధించిరి. శ్రీశివపంచాక్షర మహామంత్రార్థము తెలియజేసిరి. తదుపరి ప్రొద్దుటూరు శ్రీకృష్ణగీతాశ్రమమున కొన్ని దినములు ఆధ్యాత్మిక తత్వోపన్యాసములు సలిపిరి. సర్వులు మహదా నందమునొందిరి. శ్రీమాన్ ఎరుకలయ్యగారి కార్యములు సంస్తుత్య ములు.

తదుపరి అనంతపురము, నంద్యాల ఆశ్రమము భక్తాదులప్రార్థ

నానుసారము మొదట అనంతపురము శ్రీపార్వతీనిలయమునకు దయ చేసి క్రమముగా సాంఖ్యము పాతంజలి సూత్రములను గురించిన ప్రసంగములను పాఠములను ప్రత్యేకముగ తెలుపుచు యథారీతి పూజానుష్ఠాదులచే "నైష్కర్మ్యసిద్ధి మరియు ఉపనిషద్భాష్య పాఠములను" ఉత్తమరీతి వివరించుచు శ్రోతలకు శ్రుత పఱచిరి. అనంత రము సంధ్యాల ఆశ్రమమునకు దయచేసి శ్రీదక్షిణామూర్తి స్తోత్రము నకు శ్రీసురేశ్వరాచార్యుల కృతియగు మానసోల్లాసమను వ్యాఖ్యను శ్రవణము గావించిరి.

దక్షిణామూర్తి యనగా తెలియ నశక్యమగు పరబ్రహ్మతత్త్వ మును సమర్థతతో తెలియ పఱచిన దేవదేవుడు. జీవుడు వేరు దేవుడు వేరను భేద బుద్ధిని బాపు చిన్ముద్రను ధరించి, పూర్ణ వస్తుస్వరూపు డవు నీవని అంగుష్ఠ పరిమాణమగు ఆత్మయే వ్యాపకమగు పరబ్రహ్మ మను అనుభవము నొసగిన పరమ శివుడే శ్రీదక్షిణామూర్తి, ఏ కొఱ తలులేని వస్తువే అందరి కొఱతలు దీర్చును. కావున పూర్ణుడగు యా స్వామి శ్రీఉమామహేశ్వరుడు వటవృక్ష చ్ఛాయయందు దక్షిణా మూర్తియై కూర్చుండి, సనక సనందన సనత్కుమారాది ఋషులకు కలిగిన స్వరూప విషయకమగు సందేహమును బాపి నిజనిష్ఠా పూర్ణు లను గావించిరి. ఆసద్గురు శ్రీదక్షిణామూర్తియే మన ఈఆశ్రమ పై భాగమున దక్షిణాభిముఖుడై వేదమంత్రములచే ప్రతిష్ఠింపబడి వెలయు చున్నాడు కదా! యని సంబోధించుచు శ్రీవారు శ్లోకార్థములను వివ రించిరి.

ఆత్మ లాభమున కంటెను అధికమగు లాభము వేరొకటి లేదని మునులు తెలిపిరి. ఆత్మ లాభార్థమై కవి తన ఆత్మస్వరూప భూతమగు పరమాత్మను నుతించును. ఎవడు తన ఇచ్ఛచే సృష్టిని రచించి తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్" అన్నట్లు మనస్సునందు ప్రవేశించి యున్నాడో అట్టి పరబ్రహ్మ తత్త్వమే ఈస్తోత్రముచే స్తుతింపబడుచున్నది. మరియు

లోకము నందుండునదియు అగపడునదియు నదియే. అనగా ఉనికియు ప్రకాశము (ఆనందము) ఆ పరవస్తువై యున్నది. తన్మూలము ననే ఈ సర్వ పదార్థ జాలము ప్రపంచమంతయు ప్రకాశించుచున్నది లేక ఈ సమస్తము సర్వాత్ముడగు ఏ ఈశ్వరుని యందున్నవో! ఈశ్వరత్వ, జీవిత్వ, సర్వాత్మత్వ మను నివి ఎట్లున్నవి, వాటిని జీవుడెట్లు ఎరుగ వలెను, తెలియుటకు సాధనమేది, ఫలమేమి, ఏకమగు అద్వితీయ జ్ఞానము ఎట్లగును. ఆత్మ సర్వజ్ఞుడు సర్వకర్త అనునది ఎట్లు? అను నిత్యాది విషయముల యొక్క తాత్పర్యమిందు జెప్పబడును.

ఈ యగపడు 14 భువనములు (లోకములు) తనయందున్నవి. ఈ నామ రూపాత్మకమైన జగత్తు తన లోపలనే యున్నది,ఇట్లుండియు మాయచే వెలుపల నున్నట్లు దోచుచున్నది.ఎట్లన తన శరీరముఅద్దము నందగపడినను, అద్దమున కావల యుండిన పగిది ఎట్లగపడునో, అటువలె ఈ జగత్తు తన యందుండినను తన్ను విడిచి తనకంటె అన్యముగ వెలుపల నున్నట్లు అగపడు చున్నది.మఱియు స్వప్నము నందుస్వప్న ప్రపంచము తన యందుండినను ఏవిధముగ తనకంటె వేఱై యున్నట్లు తోచుచున్నదో, నటువలె జాగ్రత్కాలమునందు జాగ్రత్ప్రపంచము తన నిజ స్వరూపమున నున్నను తన్ను విడిచి వెలుపల నున్నట్లు అగపడును. ఇక స్వప్నము నందలి పదార్థములకు ద్రష్టయగు తన ఉనికియే ఆ వస్తువుల యొక్క అస్తిత్వమై యున్నది, కాని వేరుకాదు. ఇది ఎటులనో అటువలె ఈ జాగ్రత్కాల మందలి జడ, నాశవంతమగు పదార్థములకు ఆత్మాస్తిత్వము కంటె వేఱగు సత్తలేదు. ఈ జాగ్రత్తైనను దృశ్యమై నాశ శీలమైనందున సమమే యైయున్నది. స్వప్న గతమైన వస్తువులు స్వప్రకాశుడగు తన ప్రకాశము వలననే నవి ప్రకాశించు చున్నవి. కాని వేరొండు గాదు. అటువలె జాగ్రతయందు అగపడు ప్రపంచము తన ప్రకాశముచే ప్రకాశింప బడు చున్నదని జ్ఞానుల నిశ్చయము.

మఱియు మేల్కాంచిన వాడు స్వప్న కల్పిత పదార్థములనెట్లు జూచుట లేదో, అటువలె సమ్యక్ జ్ఞానోదయానంతరము జగత్తగపడదు. (బాధింపబడును) అందువలన ఈ జీవుడు అనాది మాయ యను నిద్రచే పరుండి యున్నాడు. ఎప్పుడు మేల్కాంచునో జన్మ నిద్ర స్వప్న ద్వైతములచే రహితమగు అద్వైతరూపాత్మ తత్త్వము నెరుగును. అట్లైన నిక ఈ జీవునకు ఎప్పుడు జ్ఞానోదయ మగునని అడిగిన యోగాభ్యాశవశము చేతను, శ్రుత్యాచార్య ప్రసాదము వలనను, ఈశ్వరానుగ్రహము చేతను ఈజీవునకు తన నిజ స్వరూపముయొక్క మెలకువ యగును. స్వరూప జ్ఞానోదయానంతరము (తనచే భుజింపబడిన అన్నము తనకంటె వేరుగ నుండక స్వరూపమై గాంచునట్లు) యోగి అనగా జ్ఞాని ఈ జగత్తును అహంబ్రహ్మాస్మి యను పూర్ణాహంకార ముఖముచే మ్రింగివేయును కాబట్టి తన స్వరూపమయ్యే చూచును. (తాను తానై యుండును.)

ఈ విధమగు యథార్థ జ్ఞానము లేనందున జీవుడు భ్రామికుడై యున్నాడు. ఒకడు స్వప్నమునందు రాజై ఇచ్ఛయించిన భోగముల ననుభవించి చతురంగ సైన్యయుక్తుడై రణరంగమున వైరులజయించి తానెవరి చేతను జయింపబడని వాడై వనమునకు వెళ్ళి తపశ్చర్య గావించుచు ఒక ముహూర్త మాత్ర జీవియైనను తన్నుకల్ప పర్యంతము గ జీవించిన వానివలె ఎట్లు తెలియుచున్నాడో, అటువలె ఈజాగ్రత్కాల మందైనను జీవుడు కాలమను నదీ ప్రవాహ వేగముచే, తన ఆయుస్సు క్షీణమగు చుండినను తాను మాత్రము బహుకాలముజీవించి యుండు వాడనని తెలుసుకొని యున్నాడు. మరియు మేఘములచే నావృతుడైన చంద్రుని భంగి మాయచే అధికముగ మోహితుడైన పరమాత్మయే కించిత్కర్త కించిజ్ఞుడని లక్షింప బడుచున్నాడు. ఎచ్చటెచ్చట విశేషమగు క్రియాశక్తి, జ్ఞానశక్తులు తోచునో అచ్చటచ్చట పరమాత్మయే రాజనియు,విద్వాంసుడనియుచెప్పబడుచున్నాడు.

ఈ జ్ఞాన క్రియాశక్తులు రెండు పరమశివునితో కూడుకొని యున్నవి. అపి పిపీలికాది బ్రహ్మపర్యంతము సర్వ ప్రాణుల యందు ఉండుట వలన సర్వ జీవులకును ఈశ్వరత్వము సిద్ధమై యున్నది.

తన యొక్క జ్ఞానము సూర్యప్రభవలె ఇది ఘటము ఇది పటము అని తెలియునట్లు నానా వస్తు ప్రతీతి యందు స్వయం ప్రకాశమానమైయున్నది. స్వయం సిద్ధమగు జ్ఞానము లేనిచో జగత్తు అంధకారమయమగును. జ్ఞానము లేని పట్లయత్కించిత్ క్రియారూపవ్యవహారము ఎట్లు జరుగును,జరుగదు. ఎందుకన చలనాత్మకమగు పరిణామము గలది క్రియయై యున్నది. మొదట వెలుపల జ్ఞానము మొలస్వరూపకెత్తిన పిదప ఆక్రియయు అంకురమువలె ఉదయించును.అనగా క్రియోత్పత్తికి జ్ఞానమే కారణమని అర్థము. కాబట్టి ఉత్పత్తి ప్రాప్తి సంస్కార్య వికార్యములను నాలుగు విధములైన క్రియలై యున్నవి. చేయుచున్నాడు,పోవుచున్నాడు, పోగొట్టుచున్నాడు,చెఱచుచున్నాడు అను నిత్యాది ప్రతీతు లేర్పడును. జ్ఞాన స్వరూపుడగు పరమశివుడు బ్రహ్మాది దేహోపాధుల యందు సర్వజ్ఞుడని అగపడుచున్నాడు. మరి దేవ తిర్యక్ మనుష్య శరీరముల యందు జ్ఞానము న్యూనాధికమై (ఎక్కువ, తక్కువ) అగపడు చున్నది. జరాయుజముల కంటె అండజముల యందు జ్ఞానము తక్కువ, వాటికంటెను స్వేదజముల యందు మరీ తక్కువ. ఉద్భిజ్జముల యందు ఇంకను తక్కువయై యున్నది. ఇట్లు ఒకదాని కంటె నొకదాని యందు జ్ఞానము తక్కువ యగుచు వచ్చుచున్నది. అట్టి జ్ఞానానంద స్వరూపుడును పరిపూర్ణుడునైన పరబ్రహ్మమే నేనని సాక్షాత్కారమైన అనగా అనుభవమైన ఆతనికి బ్రహ్మాది స్తంభ పర్యంతమగు సమస్త సృష్టియు స్వప్న సమమై కల్పితమైయుండును. అందు వలన శ్రీరుద్రోపనిషత్తు అణువుకు అణువై మహత్తునకు మహత్తై యున్నాడని సర్వాత్మకుడగు శివుని స్తుతి చేయుచున్నది. మఱియు ఈశ్వరుడని గురువని ఇట్లు రెండు

మూర్తులు భేదముగ తోచినను ఆకాశము వలె వ్యాపక దేహము గల దక్షిణామూర్తి కొరకు నమస్కారము అని యిట్లు మొదటి శ్లోకము యొక్క వ్యాఖ్య.

రెండవ శ్లోకము జడములైన పరమాణు ప్రకృతి అను వీటి చేతనే ఈజగత్తు కలిగినదని న్యాయ.వైశేషిక.సాంఖ్యులు చెప్పుదురు. ఇట్లు వీరు జెప్పునది సరికాదు. ఎందుకన ప్రతియొక పదార్థమునందు ఉనికి సద్రూపత్వము ఉండుటవలన జగత్తునకు సచ్చిద్రూపమగు బ్రహ్మమే కారణమై యున్నదనియు అట్టి సచ్చిద్రూప స్వరూపమగు బ్రహ్మము నుండియే సృష్టి స్వతంత్రముగ మహాయోగివలె నిర్మింప బడియున్నదను విషయము ఈ ముందు శ్లోకముచే వివరింప బడును. "బీజస్యాంత రివాంకురో......" అను నీ మొదలగు అన్ని శ్లోకముల వ్యాఖ్యను క్రమముగ విపులముగ శ్రవణము గావించిరి.

అచటి నుండి గుంతకల్లు శ్రీఉమామహేశ్వరాశ్రమమునకు దయచేసిరి. నంద్యాల గుంతకల్లు అనంతపురము మొదలగు భక్తాదులందరి భక్తిభావనచే శ్రీవారు ఈసం॥ము సంపూర్ణ యాత్రకు దయ చేయవలెనని వారం వారం విన్నవించు కొనిరి. అందుచేత పూజ్య శ్రీవారు అనివార్యముగ భక్తులందరి సద్భావనానుసారము శివసంకల్ప పూర్వకముగ శ్రీకేదార్, బదరీ, నేపాల్, పశుపతినాథ్ శ్రీకాశివిశ్వనాథ్ జ్యోతిర్లింగ దర్శనమునకు పయనమై వందమంది భక్తులతో గూడి 23.4.1971 శుక్రవారము ఉత్తరయాత్ర జయట్రావెల్ సర్వీస్ బ్రహ్మశ్రీ ఆర్.రంగస్వామయ్యంగారి బండిలో దయచేసిరి.

శ్రీవారు పూజానుష్ఠాన ఆధ్యాత్మిక ప్రసంగములకు అనుకూలముగ నుండునట్లు బండియందు ఫస్ట్‌క్లాసు పెట్టె నొకటి ఏర్పాటు చెసిరి. ఆపెట్టె శ్రీవారి గురుదైవ సంపుటి పూజాది వస్తులచే దైవ నిలయమాయెను.

75 దినములు ఈయాత్ర అందరు ఆధ్యాత్మిక సంస్కారముగల వారై నందున మహదానందముగ జరుగుచు సాక్షాత్ గురుదైవముల తోడు నీడ గలదియై అనుదినము పూజానుష్ఠాన పారాయణ శాస్త్ర శ్రవణ ప్రసంగములచేతను తత్తద్దేవతా దర్శనములు క్షేత్ర విశేష ములు తెలియుచు ఈ యాత్ర మహా వ్రత రూపముగ నడచెను. యాత్రకు వెళ్ళినవారు పాత్రను గైకొని రావలయునను లోక రూఢిని బట్టి అందరును సంతసముమీర గురుదైవ సందర్శనాదులచే జరుగు మా ఈయాత్రలో హృదయ పరిశుద్ధి యను పాత్రగొంటిమి. మహా వాక్యములను వింటిమి అనుచుండిరి. ఇట్లు యాత్రలో మొదట భద్రా ధీశుని (శ్రీసీతారాములను)

"ప్రణవ నిలయ మంత్రం, ప్రాణనిర్వాణ మంత్రమ్
ప్రకృతి పురుష మంత్రం, బ్రహ్మరుద్రేంద్ర మంత్రమ్ ॥
"ప్రకట దురిత రాగద్వేష నిర్నాశ మంత్రమ్
రఘుపతి నిజ మంత్రం. రామ రామేతి మంత్రమ్ ॥
"సంసార సాగర భయాపహ విశ్వ మంత్రమ్
సాక్షన్ముముక్షు జన సేవిత సిద్ధ మంత్రమ్ ॥"

అని శ్రీవారు శ్రీసీతారాముల సన్నిధి ఈ శ్లోకార్థములను వివరించిరి. "ఓం రామాయ రామభద్రాయ..."

విశేషాంశమును అధిష్ఠానమనియు, సామాన్యాంశమును ఆధార మనియు అందురు. జ్ఞానకాలము నందు తోచునది విశేష మనియు, జ్ఞానాజ్ఞాన ఉభయ కాలములందు తోచునది సామాన్యమనియు చెప్ప బడును..."

శ్రీకేదారనాథ జ్యోతిర్లింగము శ్రీబదరీనాథ పశుపతినాథ సంద ర్శనములు ఆయా స్థానములందు పూజానుష్ఠాన ప్రస్థానత్రయ పారా యణ ప్రవచనాదులు యథారీతి అనుదినము ఆశ్రమములో జరుగు చుండినట్లే శ్రీగురు కరుణచే బండియందే పూజానుష్ఠానములు జరి

గెను. అనేక క్షేత్రములు పవిత్రమగు నదుల యందు స్నాన పూజా దులు విధ్యుక్తముగ నయ్యెను. ఈయాత్రలో శ్రీ గురుదేవులకు అత్యంతభక్తిచే మాతృశ్రీ యలే. పార్వతమ్మమ్మ శ్రీ కె. శరణమ్మమ్మ గారు పరిశుద్ధముగ మడుగుచే ప్రసాదము చప్పటికట్టు, అన్నము చేసి శ్రీవారి ఆహార నియమమును చూచుకొనిరి.

శ్రీకాశీక్షేత్రమునందు శ్రీవారు గుంతకల్లు శ్రీఉమామహేశ్వ రాశ్రమ దైవప్రతిష్ఠా మహోత్సవమునకు యావత్తుపూజ్య వస్తువు లను కలశములు (శిఖరములు) సాలగ్రామ నర్మదాబాణ (శివ) లింగ ములు మరియు గుంతకల్లు ఆశ్రమమున హరిహరాభేదమును సూచించు శివకేశవుల ప్రతిష్ఠ గావింపవలెనను సద్భావముగల పూజ్య శ్రీగురు దేవులు చతుర్భుజములచే నొప్పు శ్రీ గీతామూర్తి గొప్ప వెలగల అమృతప్రతిమ (మూర్తి) నాలుగడుగుల ఎత్తుగల స్వామిని (బిలుచు కొని) తీసుకొని తమ యాత్రా బండియందే భద్రపఱచిరి. అటువలె గూళపాళ్యం శ్రీగురుదేవాశ్రమమునకు వలయు పూజ్యవస్తువులను బండిలో భద్రపరచుకొని తెచ్చిరి. ఇట్లు ఏ కొఱతయు లేక యాత్ర మంగళమయముగ నడచి 7.7.1971 నిర్విఘ్నముగ బండి గుంతకల్లు స్టేషన్ వచ్చి చేరెను.

7.7.1971 గుంతకల్లు స్టేషన్‌లో భక్తులందరి సమక్షమున జయ ట్రావెల్ సర్వీసు బ్రహ్మశ్రీ రంగస్వామయ్యంగారికి 'సర్వసమర్థ' అను బిరుదమును, సువర్ణాంగుళిని శ్రీవారు ప్రసాదించి ఫలమంత్రాక్ష తల నొసగిరి.

ఆనాడు రాత్రి యాత్రికులందరికి గుంతకల్లు శ్రీకన్యకాపర మేశ్వరి దేవస్థానము నందు, ఆదేవస్థానము యజమానులు పరిసదస్యు లందరు ఎంతో భక్తి గౌరవములచే అచటనే వసతి నొసగిరి. 8.7.71 ఉదయము 8 గం.లకు శ్రీకాశీక్షేత్రమునుండి వచ్చిన గీతామూర్తి,

శ్రీచంద్రమౌళీశ్వర మహాలింగ, మహోత్సవ మూరేగింపు మహదానందముగ జరిగెను. 10 గంటలకు శ్రీఉమామహేశ్వరాశ్రమమునందు వేంచేయించిరి. ఆనాడే శ్రీవారి 27వ శ్రీచాతుర్మాస్య మహావ్రతము ప్రారంభమాయెను.

## 27.వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1971 సం॥

శ్రీవిరోధికృతు నామసం॥ర ఆషాఢ శుద్ధ పూర్ణిమ గురువారం 8.7.71 ఉదయము యథావిధి పూజానుష్ఠానాదులచే విధ్యుక్తముగ ప్రారంభింపబడి గుంతకల్లు శ్రీఉమామహేశ్వరాశ్రమంలో, ఆదవాని శ్రీవాసవీ కల్యాణమందిరంలో, అనంతపురము శ్రీపార్వతీ నిలయంలో హాలరివి శ్రీఉమామహేశ్వరాశ్రమములో, నంద్యాల శ్రీఉమామహేశ్వరాశ్రమములో ఆ యా నియమిత కాలముల యందు శ్రీవారు సన్నిధి చేసి గంగా పూజాదులచే ఉదయ సాయంకాలముల యందు ప్రస్థానత్రయ భాష్య ప్రవచనములు మరియు "ఉపదేశసాహస్రి, తత్త్వాను సంధానము, వేదాంతపంచదశి" యను ప్రకరణ గ్రంథములను ప్రత్యేక పాఠములుగ తెలుపుచు చక్కని వివరణలచే ముముక్షుజనుల సంతృప్తి పఱచిరి.

8.7.71 ప్రారంభమైన ఈమహావ్రతము శ్రీగురుకృపచే కార్తిక శుద్ధ పూర్ణిమ 2.11.71 వరకు శివప్రదముగ జరిగి నంద్యాల శ్రీఉమామహేశ్వరాశ్రమమున, అఖండ భగవన్నామ భజనానుష్ఠానముచే పూర్ణమాయెను. ప్రథమనంది యందు దీక్షావిరమణమై సంపూర్ణమాయెను. 13.11.71 శ్రీవారి గురుదేవుల పుణ్యారాధన యథారీతి ఆనందముగ జరిగెను.

## శ్రీఉమామహేశ్వరాశ్రమము - గుంతకల్లు

శ్రీవారు శ్రీగీతాజయంతికి గుంతకల్లు శ్రీఉమామహేశ్వరాశ్రమము దయచేసిరి. ఇచ్చట ఆశ్రమ దైవ ప్రతిష్ఠా మహాకార్య

మున్నందున ఇచటనే పూజాద్యనుష్ఠాన సంపన్నులై భాగవతము, రామాయణము, మహావాక్య దర్పణము, భగవద్గీతా భాష్యమును శ్రవణము గావించుచు తపస్సంపన్నులై యుండిరి.

పుణ్యాత్ములగు "సుధీవర" శ్రీనంకదారు రామకృష్ణయ్యగారు ఆశ్రమమున శ్రీరామకృష్ణ గీతాసదనము అను నామముచే దివ్యభవనమును (హాలు) కట్టించిరి. ఉదారమతులగు ఆదవాని గారా శ్రీ రామయ్యశ్రేష్ఠిగారు ఈభవనమున శ్రీగీతాచార్యమూర్తి శ్రీచంద్రమౌళీశ్వరాది దేవతా ప్రతిష్ఠకు నలయు ఉత్తమమగు చక్కని ఆలయములను, గోపురములను కట్టించిరి. మరియు నల్లకొండ శ్రీరామ సుబ్బయ్యశ్రేష్ఠి కుం॥సౌ॥శ్రీలక్ష్మీదేవమ్మ పుణ్యదంపతులు ఘనమైన సేవజేసిరి. ఇంతే కాదు గుంతకల్లు పురవాసులగు అనేక భక్తులును శ్రద్ధాభక్తులతో ఆశ్రమ దైవప్రతిష్ఠాది కార్యములకు అత్యుత్తమ త్యాగపూర్వకముగ సేవజేసిరి. శ్రీవెంకట సుబ్బయ్యస్వామి, ఆశ్రమ వాసి, మరియు యన్.యం. శంకరయ్య మొదలగు అనేక భక్తులు భాగము వహించి సేవచేసిరి. సంస్తుత్యము

వెనుక ప్రతిష్ఠా మహోత్సవముల కేతించిన భూసురులగు సద్బ్రాహ్మణులందరు సమయమునకు గుంతకల్లు శ్రీఉమామహేశ్వరాశ్రమములకు విచ్చేసిరి. శ్రీవిరోధికృతు నామ సం॥ర మాఘ శుద్ధ పాడ్యమి సోమవారం 17.1.1972 మొదలు శుద్ధపంచమి 21.1.72 వఱకు శ్రీగీతాచార్యస్వామి, శ్రీచంద్రమౌళీశ్వర మహాలింగ, శ్రీ ప్రసన్న గణపతి, శ్రీపార్వతి, శ్రీచక్ర మహా యంత్రరాజము, శ్రీ నందీశ్వర. ధ్వజ, శ్రీఉమామహేశ్వర గురుపీఠ పరంపరా శిలాశాసన ప్రతిష్ఠా మహోత్సవము వేదోక్త విధులచే జరిగెను.

మంటప ప్రవేశము, శ్రీమహాగణపతి పూజ,స్వస్తి పుణ్యాహవాచనము, నాంది ఋత్విగ్వరుణము మొదలగు కార్యములు నడచి వేదఘోషచే క్రమముగ అన్ని వైదిక కార్యములు ప్రారంభ

మాయెను. ఇక ఆహూతులై ఈ మహాకార్యమునకు దయచేసిన మహాత్ములు పూజ్యశ్రీ రామకృష్ణానంద స్వాములు, శ్రీ కేశవతీర్థ స్వాములు, మాతృశ్రీ నిరంజనానంద గిరివారు, శ్రీ నిత్యానంద స్వాములు, శ్రీ శివప్రకాశానంద స్వాములు మొదలగు మహాత్ముల నందరిని పూర్ణకుంభముతో వేదమంత్ర పఠనలచే స్వాగత పలిచి దివ్యముగ నలంకరింప బడియుండు సభాస్థలి నాసీనుల గావించిరి. పూజ్యశ్రీవారి ఆధ్వర్యమున మంగళాచరణ పూర్వకముగ మహనీయుల ఉపన్యాస కార్యక్రమములు ప్రారంభింపబడెను.

ఆపట్టణవాసులు మరి అనేక స్థలములనుండి వచ్చిన వేలాది భక్తులచే సభా మంటపము నిండి నిబిడీ కృత మాయెను. పూజ్య స్వాములు బోధించు ఆధ్యాత్మిక తత్త్వోపన్యాసములను 5 దినములు చక్కగ రెండు వేళల యందు వచ్చి ఘంటల తరబడి నిశ్శబ్దముగ నిర్మలముగ వినుచు ధన్యులైరి. సభాస్థలి వ్యవస్థలెంతయు చాల చక్కగ నుండెను. చూచిన స్వాములు భూసురు లందఱు మహా సంతోషము నొందిరి. వాద్యవిశేషములు నినదింప బడెను. అన్న సంతర్పణ అయ్యెను. శ్రీ గీతామూర్తి, శ్రీఉమామహేశ్వరుల ఉత్సవము జరిగెను, శ్రీవారిచటనే నిష్ఠచే నుండుచు దశోపనిషత్తులు క్రమముగా శ్రవణము గావించిరి.

1.3.72 బుధవారము ఈప్రతిష్ఠా మహోత్సవ మండలపూజ మహాన్యాసపూర్వక శ్రీరుద్రాభిషేకాది సర్వోపచారములచే లక్ష కుంకుమార్చన జరిగెను.

జీవన్ముక్తులు సుఖదుఃఖాద్యనుభవములయందు మగ్నులుకారు. సందర్భానుసారముగ ప్రాప్తములయిన యోగ్యకర్మలనుమాత్రమాచరింతురు. అదియును తమ దృష్టిచే ఏమియు చేయనివారే అగుదురు. నిద్రనుండి మేల్కొలుప బడిన వానివలె సహజస్థితినుండు మహాత్ములు సనాతనముగ అనాది పరంపరచే రాబడిన పూర్వీకులగు పెద్దల ఆచా

రము ననుసరించి సంప్రదాయ పోషణార్థమై ఆచరించు చుందురు.

నిరంతరము వేదాంత విచారముచేసి చిత్తవృత్తులు దూరమై పోయినస్థితి నతిక్రమించి (బ్రహ్మస్థితి) ప్రసన్నముగ బ్రహ్మస్వరూప మాత్రులై యుందురు. "యదా సర్వే ప్రముచ్యంతే హృదయస్యేహ గ్రంథయః" అను శ్రుతియు "ఇహైవ తైర్జిత సర్గః అను" స్మృతియు కలదు. ఇచట నేను లేదు అన్యమును లేదు. నిరామయము నిరుప ద్రవము అను బ్రహ్మమే నేనై యున్నాను. అని ఇట్లు సదసత్తులమధ్య సత్తామాత్రమగు స్థితి నెవరెరిగియుందురో వారే తెలిసినవారు. సద సత్తులనగా స్థూల ప్రకృతియగు జగత్తు, మూలప్రకృతియగుమాయ లేనిది. మాటిమాటికి తలంపకున్నను మార్గమునుబట్టి నడచుచుండు పథికులకు, అనగా బాటసారులకు గమ్యస్థానము సహజముగ లభించు నట్లు సాధకులగు సజ్జనులకు ముక్తి తప్పక గలుగును. చక్కని సాధ నానుష్ఠానములచే మెలగ వలయునని భావము.

కర్మ నాచరించు జ్ఞానికి విహితమగు ఏ ఇచ్ఛగలదో అది ఇచ్ఛ యనియు కూడ చెప్పబడదు. అది కేవలము లోకానుగ్రహార్థమైన పావన మహాకార్యమే యగును. స్వీయమగు కర్తృత్వమక్కడ లేదు. "కుర్యా ద్విద్వాం స్తథాసక్త శ్చికీర్షు ర్లోక సంగ్రహమ్" అని అను సంధేయము.

అధ్యాస యనగా అది కాని వస్తువు నందు అదియను జ్ఞానము కలుగుట అధ్యాస. ముత్యపు జిప్పను చూచి వెండి యని భ్రమసి నట్లు, స్థాణువును జూచి పురుషుడని భ్రమించినట్లును, ఆత్మయందు జడ మైన అహంకారాది గుణములు చేరి నిజమా యన్నట్లు తోచును. పరి శుద్ధమైన అద్దమందు ఏనుగు, చెఱువునందు చెట్టు, ప్రతిబింబ రూప మున గానబడినట్లు ఆత్మయందు అహంకారాది ప్రపంచము నగపడును ఈ ప్రకారము ఆత్మను ఉపాధి సంబంధమగు సంసారము, పరమ సజ్జ నునకు దుష్టుని సహవాసము వలె దుఃఖదాయకమై తోచును.

'అస్యజీవత్వం' మొదలగు ఉపనిషద్వాక్యములు అమృతప్రాయమై యుండుటచే ఆత్మయగు నీయందు ఈసంసారము ఆరోపితమైయున్నదే గాని, నిజముగా లేదు. ఈప్రకారము ఆత్మ యందు సంసారము వృథా దోచుచుండుట వలన యథార్థమగు ఉపనిషదభ్యాసము అనగా శ్రుతి గురువుల ఉపదేశము చేత అహంకారము నివృత్తమైనచో ఆత్మ నిత్య ముక్తమగును. ఆ ఆత్మయే తానను జ్ఞానము కలుగును. "ముక్తశ్చ ముచ్యతే జంతుః" అని శ్రుతి తెలుపు చున్నది.

కర్మ ఆగామి, సంచిత, ప్రారబ్ధములని మూడు విధములై యున్నది. అందులో పూర్వము అనేక జన్మల యందు చేసిన కర్మ సంచితమను పేర అహంకారముతో గూడి అనేక దేహముల నిచ్చుటకు మూలమై యున్నది. ఈ సంచితకర్మ తన్ను ఆత్మ స్వరూపునిగా జ్ఞానముచే నెరిగిన తోడనే స్వప్నమునందు కలిగిన దుఃఖము నిద్ర నుండి మేల్కాంచిన పిదప నివృత్తి యగునట్లు నష్టమై పోవును. సంచితమను ఏకర్మచే ఈదేహము కలిగెనో అది తీరిన పిదప నాశమగును. ప్రారబ్ధమనునది వర్తమానమున జీవించుచు నిలిచి యుండును. రజ్జువు నందగపడిన సర్పసంబంధమగు భయముమఱల రజ్జువని తెలిసినను విడువక తోచుపగిది జీవన్ముక్తునకు వెనుకటి యా సంస్కారముండి ప్రారబ్ధ మనిపించును. ఈ ప్రారబ్ధకర్మ అనుభవించక తీరదు. ఇది యును ఇచ్ఛ పరేచ్ఛ స్వేచ్ఛ యని మూడు ప్రకారములై (కల్పనాత్మకమై) యుండి సుఖ దుఃఖములను కలుగజేయు చుండును. ఈ ప్రారబ్ధము మానవునకు ఆ యా దేహము నాశమైన వెంటనే ముగిసి పోవును. దేవతలకైనను ఈ అధికార వాసన (సంస్కారము) పది ప్రళయములు గడచిన గాని విడువదని గమనించవలెను. జ్ఞాన ప్రాప్త్యనంతరము కర్తృత్వము లేక సంస్కార వశమున సంప్రాప్తమైనకర్మ అహంకార సంబంధము లేనందువలన ముందు ఫలము నివ్వజాలక ఈమధ్యనే భర్జిత బీజమువలె (వేయించిన విత్తువలె) అనుభవముచే వ్యర్థమై (తీఱి)

పోవును. అజ్ఞాన నివృత్తి యైనందున కర్తృత్వబుద్ధిలేదు. తానుసాక్షి యగు పరబ్రహ్మమేయని తెలిసి యున్నందున క్రియమాణ కర్మ అనగా ఆగామి (ముందు రాబోవు కర్మ) వచ్చి ఇచ్చట చేరుట కవకాశము లేదు. కాబట్టి జ్ఞానముచే ఆగామి సంచితములు రెండును నివృత్తియై ప్రారబ్ధము మాత్రము దేహావసాన పర్యంత ముండును. ఇట్లని వేదాంత శాస్త్ర సిద్ధాంతము.

సంచితాగాములు నివృత్తి చేసుకొని దేహాభిమానము లేక ప్రారబ్ధ కర్మానుభవముతో నుండుటే ముక్తి యని చెప్పుదురు. వస్తుతః కర్మపోయిన వెనుక కర్మ త్రయము మరి లేదనే తాత్పర్యము. అయినను ప్రారబ్ధము పరదృష్టి గోచర మగుచుండునని భావము. ఈ ప్రకారము దేహమును ధరించి యుండుటే జీవన్ముక్తి యనియు, దేహపాతానంతరము కలుగునదే విదేహముక్తి యనియు తెలియవలెను. 'తస్య తావ దేవచరం' అని వేదవాక్యము నియమజీవనము గలిగి గురుస్థానము నందు తపస్సంపన్నులై యుండుట గురుకుల వాసము అనునిత్యాదిగా......

శ్రీపరీధావి సం॥ శ్రీరామ నవమికి హాలరివి శ్రీఉమామహేశ్వరాశ్రమమునకు దయచేసి యథారీతి పూజానుష్ఠానాదులచే శ్రీ రామచరిత మానసమను తులసీ రామాయణ గ్రంథమును ప్రాతః కాలము శ్వేతాశ్వతరోపనిష త్ప్రవచనము గావించిరి.

9.4.72 లగాయతు శ్రీక్షేత్ర ఉమామహేశ్వరాశ్రమము దయచేసి పూజానుష్ఠానాదులచే నైష్కర్మ్యసిద్ధి మహాగ్రంథ శ్రవణము గావించుచు, నిజవైశాఖ శుద్ధ పంచమి 17.5.72 శ్రీశంకరజయంత్యుత్సవము విధ్యుక్తముగ జరిపి శ్రీశంకర విజయము, మహాభారత, భాగవత పురాణ ప్రసంగములు సర్వజనానంద ప్రదముగ సలిపిరి.

అనంతరము శ్రీవారు నంద్యాల శ్రీ శెట్టి ఓబులపతిగారి ప్రార్థనానుసారము వారి స్వగ్రామమగు ఆళ్ళగడ్డ తాలూకా ఆలమూరు

గ్రామమునకు దయచేసిరి. అచ్చట ఉండు పురాతన శివాలయమును శ్రీఓబులపతిగారు సంస్కరింపజేసి అందుండు చంద్రరేఖాంకితమగు కేవల శ్రీచంద్రమౌళీశ్వర శివలింగ సన్నిధి ఆలయమున శ్రీ గణపతి శ్రీపార్వతి (ఉమ) శ్రీనంది, శ్రీ ఆంజనేయస్వామి బృహద్మూర్తి, ధ్వజ ప్రతిష్ఠలు శ్రీగురుదేవుల ఆధ్వర్యమున వేదోక్తముగ మూడు దినములు జరుపబడి 3.7.1972 శ్రీపరీధావి సం॥ జ్యేష్ఠబహుళ తదియ సోమవారము ప్రతిష్ఠామహాకార్యము సాంగముగ పూర్ణమాయెను. ఈ కార్యమునకు భూసురులు, మహాత్ములు కవులు అనేక భక్తులు వచ్చియుండిరి. చక్కగ శాస్త్రార్థ ప్రవచనములు జరిగి పూర్ణమాయెను. శ్రీ గురుభక్తులు ఆత్మానాత్మ విచార పరులగు శ్రీశెట్టి ఓబులపతిగారి త్యాగము ప్రశంసనీయము. శుభము.

అచటినుండి పూజ్యశ్రీ గురుదేవులు లత్తవరం శ్రీక్షేత్రమునకు దయచేసిరి. అచ్చట 7.7.1972 శ్రీవారి పరమగురువుల ఆరాధన ఆనందముగ జరిపిరి. 8.7.1972 శ్రీవారి జయంత్యుత్సవము విధ్యుక్తముగ పూజానుష్ఠానాది వైదిక కార్య విశేషములచేతను మహాత్ముల మరియు పండితుల కవుల శాస్త్రీయమగు ప్రసంగములచేతను జరుపబడి అన్న సంతర్పణలతో శివప్రదముగ సాంగమంగళ మాయెను.

శ్రీమదుమామహేశ్వరో విజయతే
శ్రీశ్రీశ్రీ మదుమామహేశ్వరపీఠాధిపతి. పరమహంసపరివ్రాజకాచార్యవర్య

## శ్రీ శంకరానందగిరి స్వామినాం జన్మదినోత్సవ సందర్భే సమర్పిత భక్తి కుసుమాంజలిః

శ్రీమద్భారతభూతల ప్రథిత సత్పీఠాధిపా ధీయుతా
వేదోక్తోత్తమధర్మకర్మనిరతా స్సచ్ఛాస్త్ర పారంగతా
విద్వచ్ఛేఖరసంస్తుత ప్రతివరా స్సద్వందనీయా భవ
దృక్తా భక్తియుతా వయం హి సతతం కుర్మోభవద్భ్యో నతీః

భక్తా న్సముద్ధర్తు మిహాంధ్రదేశే
సదా భవంతః కృపయా చరన్తి
జ్ఞానం లభంతే హి జనాశ్చ సర్వే
పీత్వా భవద్వాగమృతం చ దివ్యమ్ ॥

అద్వైతం ఖలు తత్త్వసారమితి తత్సిద్ధాంత మేవాఽనిశమ్
లోకేబోధయితుం ప్రవృత్తగురవో యూయం దయాశాలిన
స్సత్యం సత్యమశేష భక్తజనతా ధన్యాఽభవ త్స్వామినః
కిం బ్రూమోభవదీయ దివ్య మహిమాప్రాశ స్త్య మత్యద్భుతమ్

శ్రీ చంద్రమౌళీశ్వరపూజనం చ
గీతోపదేశోహి మహాజనేభ్యో
భవ్యం తపః పండితపోషణం చ
ముదా క్రియంతే గురుభి ర్భవద్భిః ।

పూజ్యా జన్మదినోత్సవోహి భవతాం శాస్త్రోక్త రీత్యా మహా
భక్తానాం చ సదిచ్ఛయా ప్రచలతీత్యద్యాగతా స్సాధవ
శ్శ్రీ మన్తో వణిజ స్తథేతరజనాః ప్రీత్యామహత్యాఽఽదరాత్
యోగీంద్రా వితర న్తు సత్కరుణయా తేషాముపర్యాశిషః॥

రచయితా : జోయిస్ దక్షిణామూర్తిః
తెలుగు పండితః,
వై. యం. కే. ఉన్నత పాఠశాలా
ఆదోనిపురమ్. 8.7. 1972

ఇత్థమ్
భక్తబృందమ్
లత్తవరమ్.

## 28. వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1972 సం॥

శ్రీ పరీధావి నామ సం॥రం భక్తుల ప్రార్థనానుసారము మొదట ఆషాఢ శుద్ధ ఏకాదశి వ్రతము 22.7.72 గూళపాళ్యం శ్రీగురుదేవా శ్రమంలో యథారీతి పూజానుష్ఠానాదివిధ్యుక్తకార్యములచే ప్రారంభ మయి ఒకనెల అత్యుత్తమరీతి ఉపనిషద్భగవద్గీతా శాస్త్ర ప్రవచన ములు నిత్యానంద ప్రదముగ జరిగెను. ఇటువలె రెండవ నెల గుత్తి

శ్రీకన్యకాపరమేశ్వరి ఆలయమునందు మరియొక నెల గుంతకల్లు శ్రీఉమామహేశ్వరాశ్రమమునందు, చివరినెల నంద్యాల శ్రీఉమా మహేశ్వరాశ్రమమునందు చక్కగా ప్రస్థానత్రయ ప్రవచన పూర్వకముగ నడచి కార్తికశుద్ధ ద్వాదశి 18-11-72కు మహావ్రతము పూర్ణమాయెను.

జీవన్ముక్తునకు మరి ఏకర్మలు లేవా యని శంకించు కొనిన అతనికి ఏకర్మత్రయమును లేదు. నిత్యశుద్ధ బుద్ధముక్త మగు పరమ వైదికమైన, పరబ్రహ్మ స్థితి యందుండు నాతడు కాబట్టి అతనికి ఏకర్మ ప్రతి బంధమును లేదని అర్థము. జ్ఞానమను పుత్రుడు కలిగి, అజ్ఞానమను మాత గతించి నందువలన సూతక ద్వయము సంప్రాప్తమై యుండు అద్వయానుభవి యగు జ్ఞానికి కర్మ విధి లేదు. "మృతామోహమయీమాతా, జాతో బోధమయ స్సుతః। సూతక ద్వయ సంప్రాప్తౌ కథం సంధ్యా ముపాస్మహే॥" అనగా పరమగు బ్రహ్మనిష్ఠచే నొప్పు నాతని యందు ఇవి చెల్లవు. జ్ఞానసూర్యుడు ఉదయాస్తమయములు లేక ప్రకాశించుచుండ అతనికి వేరొక కర్మవిధి లేదు. అని ఉపనిషత్తు చెప్పుచున్నది. ముక్తుడు ఏదాని నంగీకరించిన అదే పూజ ఏదానిని చూచిన అదే లక్ష్యము. దేనితో గూడిన అదే యోగమై యుండును. జీవన్ముక్తునకు వేరొక నియమ ముండదు. అతడు నిత్యముక్తుడు. మహానుభావుడగు నాతడు నడచునదే పావనమగు తీర్థయాత్ర. అతడు నిలిచిన స్థానమే కాశీక్షేత్రము. అతని పవిత్రదృష్టియే ఉత్తమమగు మతము అమ్మహాత్ముడాడిన మాటలేమంత్రములు, వేదవాక్కులు. అతనికి జన్మయే లేనందున మరేమియు నుండదు. జ్ఞానము లేక అన్యత్ర దైవబుద్ధి, దేహము నేనను భావము జగత్తు సత్యమని భావించు నాతడు పునర్జన్మ నొందును. "యోన్యాందేవతాము పాస్తే ......" అని శ్రుతివాక్యము. ఉదాహరణ "ధ్యాయతీవ లీలాయతీవ" అను వేదవాక్య ముండుటచే తత్వవిదుడగు జీవన్ముక్తుడు ఆత్మే

తరమును గాంచక తన్ను బ్రహ్మ స్వరూపముగ తెలిసి తన్నిష్ఠ నుం డును. మోక్షము కర్మలచే ప్రాప్తముకాదు.అది నిత్య సిద్ధమని ఎఱుగ వలెను. ఉత్పత్తి, ప్రాప్తి, వికార్య, సంస్కార్యములను కర్మ ఫలము లచట పొసగవు.

చెట్టుయందు అగ్ని యుండినను కాలదు. అగ్నియందు మానుం డిన కాలిపోవును. అటువలె జ్ఞానియై జగత్తున శేషప్రారబ్ధము ననుభ వించు చుండినను అతని యందు ఈ జగద్వంద్వములు నిలువ జాలవు. చీకటిని ప్రకాశమును ఆకాశము వహించినను దాని నైర్మల్యత చెడని యట్లు జ్ఞానియగు నాతనికి ఏ సంబంధము లేదని తాత్పర్యము.అగ్నిచే నావృతంబైన పర్వతమును మృగ ఖగాదులు ప్రవేశింప ఇచ్ఛయించ నట్లు ఆత్మ నిష్ఠుని యందు కర్మజాల ముండదు. అతనిని స్పృశింపలేవు. "నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే" 'జ్ఞానాగ్ని స్సర్వ కర్మాణి భస్మసాత్కురుతే తథా" యని ప్రమాణము. జ్ఞానియొక్క దేహత్యాగమునకు ఉత్తరాయణ దక్షిణాయనాది కాల నియమము లును లేవు. అతడు పరబ్రహ్మ స్వరూపుడే యైనందున పునర్జన్మయే లేదు. "విముక్తశ్చ విముచ్యతే" నిత్య ముక్తుకు అణిమాది అష్ట సిద్ధులేనైన అతనివద్ద యుండునా యనిన వాటితో నాతనికి అగత్యము లేదు. అవి జడములు మానసిక కల్పనా సిద్ధులని తెలిసి యుండును.

మరియు "తత్త్వమసి" మహావాక్యము నీవే (తానే)అద్వితీయ మగు పరబ్రహ్మమై యున్నావని చెప్పినది. అర్థప్రాశస్త్యముకొరకై చెప్పిన అర్థవాదముగాదు.ఒక మానవుని నీవు దేవేంద్రుడవని వర్ణించు నట్లు ఆ పరంజ్యోతి స్వరూపమగు బ్రహ్మమే నీవని చెప్పు మహా వాక్యము స్తుతిపరమును గాదు. సేవకుని నీవు దొరవయ్యా అని ప్రోత్స హించినట్లు వేదవచనములు నీవు పరబ్రహ్మమని ఔపచారికముగ చెప్పినదికాదు. పరోక్షముగ దైవమున్నది. దానిని భావించి ఉపాసిం చుము అని చెప్పినట్లు జీవుని బ్రహ్మమని చెప్పు మహావాక్యము

ఔపాసనాపరముకాదు."అగ్నిర్మాణవకః" అన్నట్లు అనగా ఈబ్రహ్మ చారి అగ్ని అని చెప్పిన విధముగా నీవే పరబ్రహ్మమని చెప్పు మహా వాక్యము సాదృశ్య పరముగాదు. ఘటము మృత్తు కంటెను వేరు కానట్లు మహావాక్యార్థము కార్యకారణ సంబంధము గాదు. నీలో త్పల మన్నట్లు మహావాక్యము గుణి గుణమును తెలుపునది కాదు. "గో సదృశో గవయ మృగః" అన్నట్లు నీవే చిద్రూపమగు బ్రహ్మ మని తెలుపు "తత్త్వమసి" మహావాక్యము జాతివ్యక్తి పరమైనది గాదు. ఘటాకాశము ఆకాశముయొక్క భాగమని గాని, దాని వికార మనిగాని కానియట్లు నీవే పరబ్రహ్మ స్వరూపమై యున్నావు అని శ్రుతి గురువులు సాక్షాత్తుగ తెలిపిరి. ఈవిషయము నందు "అనేన జీవాత్మనాను ప్రవిశేత్" అను శ్రుత్యర్థమును తెలియుము. ఈ కార ణములచేత నీవే ప్రత్యగభిన్న పరమాత్మవై యున్నావనుటకు ఏ ఇతర భేద వాదులయొక్క బాధగాని విరోధము గాని అనుమానము గాని లేనందువలన నిత్యానంద స్వరూపమగు సాక్షి పరబ్రహ్మమే నని తెలియుము. సందేహము లేదు. అను నిత్యాది ఉపనిషదర్థము లను బోధించిరి.

భగవత్తత్త్వమును ప్రేమించుట, భజించుట, తన్నుగా తెలి యుట అనునవి మరువరాదు. ఇదియే ముముక్షు కర్తవ్యమై యుండ వలెను. లౌకికుల మాటలు వారి పోకడలను అనుసరింపకుము. నారద భక్తిసూత్రముల యందు అన్నిటి కంటెను భక్తి అధికతరమని వర్ణింప బడినది."సాతు కర్మ జ్ఞాన యోగేభ్యోప్యధికతరా" అని చెప్పబడినది కావున ఆధ్యాత్మికానుష్ఠానారంభమునందు అధికమగు భక్తి భావన లుండినచో ప్రగతి నొందుదురు. సమస్త మోహములను, ఐహికవిష యములను గురుదైవ శరణాగత బుద్ధిచే యోగ క్షేమముల ఆకాంక్ష లేక విడిచిపెట్టుము రక్షణ తప్పక కలుగును. క్రమముగా జ్ఞాన సంప న్నమగు సుయోగ మబ్బును, శివలింగముపై నుంచు ధారాపాత్ర

యందలి అవిచ్ఛిన్నమైన ధారవలె సదాశివ, శివయను స్మరణ యుం డును గాక !

ఏతత్త్వము నెఱుగక మఱచి భిన్నులమై అది ఎచటనో వెలుపల నున్నట్లుగా భ్రమించి అన్యత్ర దైవబుద్ధిచే చూతుమో! అది నాయ నలారా! మన ఆత్మయే యని అద్వితీయమగు భగవత్తత్త్వము అదియే యని తెలుసుకొన వలయును. జీవితమున కలుగు ఒడుదుడుకులను సహించినంత మాత్రముననే కాదు. అసంగ బుద్ధిచే దైవాత్మ నిష్ఠతో సహనముండిన చాలమేలు. జీవనమున కేవలము మాటల కం టెను పవిత్రభావ యుక్తమైన ఉత్తమ హృదయముండుట ఆవశ్య కము.అది తొందరగ మానవుని పవిత్రుని జేయును. మన నిత్యజీవన సదాచార సచ్ఛీలములను నియమ నిష్ఠలే ఆస్థితి నందజేయును. ఉత్తమ వర్తనశీలునకు జ్ఞానమను మాటయు కూడ సాపేక్షికమే. నేను దైవాత్మ స్వరూపుడనే అనగా దైవమై యుండ నచ్చును కాని దైవమును తెలుసుకొన లేము. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని గురించి నీహరి ఎచట నున్నాడురా? యని అన్యత్ర వెతుకుచు తెలుసు కొనలేక పోయెను. తనయందు, సర్వత్ర భగవంతుని దర్శించు చూపుగల ప్రహ్లాదునకు శ్రీహరి తన రూపమునను తన తండ్రి రూపమునను అంతట నిండి కన బడెను. మనశ్శుద్ధి కలిగి యుండిన దైవము తానె కాని తనకంటె అన్యముగ తెలియ బడునదని (దృశ్యమని) అర్థము కాదు.

అలాతమును అనగా కొరివిని గిరగిర త్రిప్పినచో హస్తసంచల నముచే ఋజు వక్రాది భావము లందగపడును. వస్తుతః కొరివి యం దవిలేవు. అదేవిధముగ సాక్షియగు తన్ను తా తెలిసిన ఈ అన్య భ్రమలేవియు నుండవు. జీవితమున కలుగు ద్వంద్వములను సీతికోవిదు డును, సదాచార పరుడును అగు వివేకి తాళుకొనుటయే అతని ఘనత యని తెలియదగును. "చెల్లియుండియు సైరణ సేయ వలయు" అన్నట్లు. అన్ని శక్తులుండినను అప్రతీకారబుద్ధి, ఉండిన అపుడది

పూజ్యమగు దొడ్డగుణ మనిపించుకొనును. ఇట్టి గుణ సంపదను శ్రీ మదుమామహేశ్వరులు అందరికి అనుగ్రహింతురు గాక.

భక్తాదులతో కూడి శ్రీశైల మహా క్షేత్రమునందు పాతాళ గంగా తీరమున 28వ శ్రీచాతుర్మాస్య మహావ్రత దీక్షా విరమణము 20.11.72 పూర్ణము గావించిరి. శ్రీశైల మల్లికార్జున, భ్రమరాంబా దేవికి భక్తిచే విశేషపూజ లాచరింపజేసి "యోగతారావళి" యను శ్రీశంకరకృతి ప్రకరణార్థమును చక్కగా శ్రుత పఱచిరి. అందరు భక్తిచే మహామంత్ర జపాద్యనుష్ఠానములను సలుపుకొనిరి. మూడు దినము లచటనే యుండి పిదప శ్రీనిర్వాణ మఠమునకు వేంచేసి 1.12.72 శ్రీవారి సద్గురు దేవుల పుణ్యారాధన ఆనందముగ సలుపు కొని అచ్చట నిష్ఠచేనుండి 15.12.72కుగుంతకల్లు ఆశ్రమమునకు దయ చేసి 16వ తారీకున శ్రీగీతాజయంత్యుత్సవము విధ్యుక్తముగ జరిపిరి. భక్తాదు లందరు నాడు గీతోపన్యాసములు సలిపిరి. శ్రీగీతామూర్త్యు త్సవము జరిగెను.

మౌనమగు నిష్ఠ అభ్యాసికి చాల మంచిది. మౌనముచే ఆధ్యా త్మికశక్తి అధిక మగును. చిత్తమును సంకల్ప వికల్పాత్మకమగు స్ఫూర్తులను పొందనీయకుము. మాలిన్యము, దోష మనునది దరిజేర్చ నీయకుము. ఏదెట్లైనను చిత్తము శివాభిముఖమై యుండుగాక. ఎంత తక్కువగ మాట్లాడిన అంత మంచిది. ఇష్టానుసారమగు నిష్ఠా రహిత మైన లౌకికాభిమానగ్రస్తమైన ఊహలు చేయకుము. అది నీ ఆధ్యా త్మిక శక్తిని శిథిల మొనర్చును. ప్రపంచమును, మరి అందరిని సరిచేయ వలయునను భావము మంచిదే కాని త్రిగుణాత్మకమయిన ఈ జగత్తు నందు అది సాధ్యము కానిది. ఏకొద్ది మందికో లభ్యము కావచ్చును. బంధ మోక్షప్రాప్తియు వలదు. పుణ్యపాపముల ద్వంద్వమునువలదు. అనన్యమగు ఈశ్వరనిష్ఠ, గురునిష్ఠ, సంతతము జపము. సద్గ్రంథ పఠ నము ఇవి యుండిన చాలు. తత్వజ్ఞానమును బడయుదువు. తర్కమెపు

డు చేయరాదు. ఒకవేళ సతర్కమైయుండిన తొందఅ లేదు.

నీటిబిందువు నీరే యగు సముద్రమున పడిన నీరేయగును. అది సముద్రము నుండి బయటపడిన పనికి రాక ఎండిపోవును. కావున గంగా కణము గంగానది యందే జేరి పూర్ణ మగునట్లు. బ్రహ్మమయ్యేయుండి నీవు బ్రహ్మానుభవము పొందగలవేగాని అన్యత్ర కాదు. నీతివర్తనుడై యుండినను కష్టనిష్ఠురము లనునవి జీవితమున అనుభవించుట చాల మంచిగి. ఈ ద్వంద్వముల నుండియే మహాత్ముల మాహాత్మ్యము అభి వ్యక్తమగును. హృదయ పరితాపము గలిగిన యత్నపూర్వకముగ చీకాకును బరిమార్చి శివుని చింతింపుము. గురుని స్మరింపుము. ఓం తత్సత్ శివోహంబని భావించుము. అనతి కాలమున శుభముచేకూరును. దైవాత్మ బుద్ధిచే నొప్పు ఓరిమియే విజయమునకు ముఖ్య సాధనము. అచంచలమగు దీక్షబూని ఈజన్మ కృతార్థమగునట్లు ఆశీర్వదింపుమని గురుని ప్రార్థించుము. పరుల దొసగుల నెంచుబుద్ధిని ఎప్పుడును దరిజేర నీయరాదు.ముముక్షువులగు సజ్జనులుఅనాత్మవిషయకములగు వాదోప వాదములను వాటి యందలి లాలసత్వమును సంపూర్ణ ముగవిడిచిదూర ముండవలెను. నిజమగు విశ్వాసము అద్వితీయాత్మజ్ఞానమునకు తరుణో పాయము. దుర్గమములైన సర్వదుఃఖ పరంపరలను ఎదిరించి నిజశాంతి నొందుటకు దైవదత్తమగు త్రికరణముల యందలి పవిత్రమగు శీలమే ముఖ్యకారణమని ఎఱిగి అతి జాగరూకతతో వర్తించవలెను. లోక మున కామినీ కాంచనముల యందలి వాసనను వీడి కామారి కంసారి యను చింతనచేసుండుట ముఖ్యకర్తవ్యము. ఇది సర్వులకును అన్వయ మైన మహాప్రసాద కబళమని భావించవలెను. శీలము నిర్మలత్వము, సత్యసంధత నిర్వక్రమగు బుద్ధి అను నిత్యాది మంచి భావనలు జీవన పరమ పాథేయములని, మహా సంపదయని ఐకాంతికముగ సేవించుచు ధృఢత్వమునొంది బ్రహ్మజ్ఞానులై శేష ప్రారబ్ధమును అసంగబుద్ధిచే అనుభవించుచు మనుగడను మాన్య మొనర్చవలెను. వేమేల నిజమగు

ఆత్మ వికాసమునకు అనన్యమగు గురుభక్తియే మూలకంద మనునది మఱువరాదు. ఇది అనుభవ గమ్యము.

శైవసాహిత్యమున మనస్సుతో సహ పంచజ్ఞానేంద్రియములను లింగమని చెప్పుదురు. మనస్సు మహాలింగ మనియు, శ్రోత్రమును ప్రసాదలింగ మనియు, త్వగింద్రియమును జంగమలింగ మనియు, నేత్రమును శివలింగ మనియు, జిహ్వను గురులింగ మనియు, ఘ్రాణమును, ఆచార లింగమనియు చెప్పుదురు. మూలాధార, స్వాధిష్ఠ, మణిపూరక అనాహత, విశుద్ధ, ఆగ్నేయ, సహస్రారములను ఈ షట్చక్రములను గురించి వీటికి ఆ యా స్థానములు అనగా పృథివ్యాది భూతములు వర్ణములు, తన్మాత్రలు, అక్షరములు, దళములు, అధిదేవత మొదలగు విశేషములచే నొప్పు అనుష్ఠాన సంబంధమగు సాధన ప్రక్రియలై యున్నవి. అనునిత్యాదిగా ఆవిషయముల నన్నిటిని చక్కగ వివరించి బోధించిరి.

## బ్రహ్మచర్య వ్రతము

ఇంద్రియముల నిగ్రహము నభ్యసించు జీవితము బహుజనులకు కష్టప్రదమైనదే. కాని ఈశ్వరకృపాపాత్రులై దృఢనిశ్చయము, ఓర్పు, పట్టుదల గలవారికి అదిసాధ్యమే యగును. బ్రహ్మచర్యము అనిన భావము నందును, వాక్కునందును, కర్మయందునుఅనగా మనోవాక్కాయములచే శాస్త్ర సమ్మతముగ మనస్సాక్షిగ పరిశుద్ధముగా నుండుట. "బ్రహ్మచర్యేణ తపసా దేవ మృత్యు ముపఘ్నతా" బ్రహ్మచర్యము అనునది పవిత్రమైన దీక్ష, ఆ వ్రతము చక్కగ శీలింప బడవలెనన్న ఆహార నియమము, కృతి నియమము, వ్యవహార నియమము, మనస్సంయమము, గురుదైవముల యందు అనన్యమగు భక్తి, శ్రద్ధ మొదలగునవి ఉండవలెను. బహు జాగ్రతతో ఈజన్మను పరమేశ్వరుడగు నీకు అప్పగించితినని హృదయ పూర్వకమైన శివ దృష్టి గలిగి వర్తించిన సాధ్య మగును. బ్రహ్మము, చర్యము అను నీ రెండు కలియుటచేత

బ్రహ్మ చర్యమను శబ్దము జనించెను. బ్రహ్మ శబ్దార్థ మేమన పర బ్రహ్మము, వేదము, వీర్యము, వేదసూక్తము. ఓంకారము, జ్ఞానము, తపస్సు, పవిత్రత, మోక్షము, ధర్మము, బ్రాహ్మణము, సూర్యుడు, సత్యము, స్వతంత్రత, పవిత్రమైన మంత్రరాజము, గురువు, ఆత్మపర మాత్మ, అన్నము, జలము, సాధన యని అర్థము, ఇక చర్య శబ్దార్థ మేమనగా, చింతించుట, అధ్యయనము చేయుట, రక్షణచేయుట, వివేచనము, సేవ, నియమము, ఉపాయము, హితము, ధ్యేయము, ప్రగతి ప్రసారము, సంయమనము, సాధన, కార్యము అను నిత్యాది అర్థములు గలవు: "తదేవ శుక్రం తద్బ్రహ్మ. తదేవాఽమృతముచ్యతే" (కఠో పనిషత్) అదియే వీర్యము, అదియే బ్రహ్మము, అదే అమృత మన బడు చున్నది. అదియే ఈశ్వరుడు, అదియే జీవనము అదియే సృష్టి కర్తయు, బ్రహ్మ మనగా వేదము తదధ్యయనార్థంబైన వ్రతమును బ్రహ్మము, దానియందు చరించువాడు, దాని నాచరించువాడు బ్రహ్మ చారి యనబడును. వేదము బ్రహ్మతత్వము తెలుసుకొను నిమిత్తమై చేయబడు వ్రతమునకు బ్రహ్మచర్యమని పేరు. శీల సంపద్విశిష్టమైన బ్రహ్మచర్య వ్రతమే నిజమైన తపస్సు. అదియే జీవనాధారము. బ్రహ్మ చర్యవ్రత పాలన చేతనే మహాత్ము లగుదురు. పూర్ణు లగుదురు. ఇది సర్వోత్తమమైన తపస్సు, బహు నిష్కామ పుణ్యరాశి కలసి యుండిన యాతడు మాత్రము గురుదైవ కృపచే పూర్ణ బ్రహ్మచర్యమును పాలించి ధన్యుడగును. పరమ పూజ్యమగు దివ్యసంపద.

సజ్జన సహవాసము, పవిత్ర గ్రంథాధ్యయనము, ధ్యానము, మానవుని మహాదేవునిగ చేయును, దుస్సహవాసము ఈశ్వరుని నుండి దూరముచేయును. జాగ్రత్తగా ఏకాంతము సద్గురుని నిష్ఠ, గురుసేవా బుద్ధియు, ఆత్మానుసంధానము కలిగి వర్తించవలెను.

## శ్రీ ఉమామహేశ్వర ప్రతిష్ఠ

శ్రీ గురుకృపతో ప్రమాదీచనామ సం. జ్యేష్ఠ॥ శు॥ పూర్ణిమకు

శ్రీవారు ప్రత్యేకముగ సనాతనమగు శ్రీఉమామహేశ్వర గురుపీఠ ప్రతీక స్థాపనార్థమై చేయవలసిన అనుష్ఠానమును (చేసి) అనుష్ఠించి కోటి మహామంత్ర జపమును పూర్ణమొనర్చిరి.

సనాతనంబగు శ్రీమదుమామహేశ్వర గురుపీఠమూర్తి, మహా మంత్ర ప్రతిష్ఠ 14.6.73 మొదలు 18.6.73 వరకు శ్రీక్షేత్ర ఉమా మహేశ్వరాశ్రమము లత్తవరము (రత్నగిరి) నందు స్వస్తిశ్రీ ప్రమాదీచ నామ॥ సం॥ జ్యేష్ఠ బహుళ తదియ కన్యాలగ్న శుభపుష్కరాంశయందు వేదోక్తముగ మొదటివలె సద్బ్రాహ్మణోత్తములచే శ్రీమదుమామహేశ్వర గురుపీఠమూర్తి మహామంత్ర ప్రతిష్ఠ శ్రీ ఉమామహేశ్వర దివ్యమంగళ మయమూర్తి ప్రతిష్ఠ, నవగ్రహ ప్రతిష్ఠ, పరమేష్ఠి గురు, పరమగురు, శ్రీగురుమూర్తి ప్రతిష్ఠ, గురుపీఠశాసనస్తుతి శిలాఫలకస్థాపనాది మహాకార్యములు పూజ్యశ్రీ గురుదేవుల ఆధ్వర్యమున నడచెను. జయజయధ్వనులచే సర్వవాద్య విశేషములతో పుష్పవృష్టి గురిసెను. యతీశ్వరుల పూజ, ఋత్విక్కుల సన్మాన, సంతర్పణాదులునడచి ఉమామహేశ్వరుల ఉత్సవము ఆనందముగ నడచెను.

పూజ్యశ్రీ రామకృష్ణానంద స్వాములవారు, శ్రీశుద్ధ చైతన్య స్వాములవారు, శ్రీసిద్ధేశ్వరానందస్వామి మొదలగు మహాత్ములు, బ్రహ్మశ్రీ యం. బాలవిశ్వనాథశర్మ పండితులు బ్రహ్మశ్రీ యన్. పేరరాజు పండిత మహోదయులు గంధర్వాంశ సంభూతులగు శ్రీ జోళదరాసి దొడ్డనగౌడు పండితులు, కవులు ఆగమించివుండిరి. 5 దినములు సాలంకృత సువిశాల సభామంటపమందు అత్యంత ఆనంద ప్రదముగ ఉపన్యాసములు నడెచెను.

ఈసమయమునందు శ్రీమాన్ డి. పుల్లయ్య, యం.పి. గారు భక్తి పూర్వకముగ ఆశ్రమమునకు ఊరుబావినుండి పైపులు వేయించి నీటి సౌకర్యమును జేసిరి. మరొక శ్రేష్ఠమైన గంగ గల బోరు వెల్

నొకటి శ్రీఉమామహేశ్వరుల కృపచే భక్తులు వేయించిరి. అందరు భక్తులు అఖండముగ సేవచేసిరి. వీరిసేవ, భక్తి సంస్తుత్యములైనవి.

శ్రీఉమామహేశ్వర గురుపీఠం,గురుదేవుల ప్రతిష్ఠామహోత్సవ మండల పూజాదులు విధ్యుక్తముగ జరిగెను.

## శ్రీ సద్గురుస్తుతి

భో గురుదేవా! ఆనంద స్వరూపుడవైన ఓభగవంతుడా నా యందు కృపజూపి భగవచ్చరణార విందమును నాశిరముపై నుంచినన్ను కాపాడుము. సంతతము గురు స్మరణ శివ స్మరణ ననుగ్రహించుము. షడ్గుణైశ్వర్య సంపన్నుడవగు ఓదేవా! బ్రహ్మవిద్యా సంపద్యుక్తు డైన ఓస్వామీ! సముద్రుడు అలలను ప్రసరించునట్లు నిత్యానంద సుఖ స్వరూపమగు అలలను నాయందు దుదయింప జేయు నీయొక్క కృపాదృష్టి సర్వులకు సంతోషమును సదా కలుగ జేయునుగాక. సర్వ భువన బ్రహ్మాండములకు ఆదియును, వేదశిరస్సులగు ఉపనిషత్తులచే తెలియబడు వాడవును, పరాత్పరుడవునగు శ్రీమదుమామహేశా! సద్గురుదేవా! సంతతము నాకు స్వరూప భూతమైన బ్రహ్మానంద స్థితిని ప్రసాదించుము. నీకంటె అన్యమింకేమియును లేదు. నీవే నా సర్వ స్వము. కాలత్రయము నందు ఏ నిన్ను భజించి సర్వభక్తులు జ్ఞానులు సర్వానర్థ నివృత్తి పూర్వక శాశ్వతానంద లక్షణాత్మకమగు కైవల్య సుఖమునను భవింతురో అట్టి స్థితిని నా చిత్తము నందు ఆవిర్భవింప జేయుము. సంతతము ఆస్థితి నాయందు ఇట్లుగా గలిగి యుండునట్లు ఆశీర్వదింపుము. ఆత్మలాభమున కంటెను వేఱొక మహాలాభము జగ త్తున లేదు కదా. అట్టి గొప్పదగు పరాస్థితిని నా కనుగ్రహింపుము. సంతతము ఆస్మృతి నాయందుండును గాక !

అగణిత గుణగణ సంపత్స్వరూపుడును, సద్గుణ గణరాశికి సాగ రమువలె నుండు ఓగురుదేవా ! ఉమామహేశ్వరా ! నిన్ను భజించు భక్తుల యిష్టార్థముల నీడేర్చుస్వామీ ! భక్తిచే నమస్కరించు

చున్నాను. కరుణించుము. భవానలమున దారి దప్పి దృశ్యమగు ద్వైత భేద విస్తారమైన సంసారార్ణవమున దిరిగి దిరిగి ఆయాస మొందు చుండు నాకు నీచరణార విందముల యందు అవిచ్యుతమగు భక్తి నొసగి జ్ఞానమును ప్రసాదించుము. గురుదేవా ! నాస్వామీ ! నా అయ్యా! అంజలి బద్ధుడనై ప్రార్థించు నాప్రార్థనలను మన్నించి జగ జ్జీవ నాత్మకంబగు ఈద్వంద్వ వ్యవహారములనుండి దూరీకరించి నన్ను నిన్నుగా నీయందు జేర్చుకొనుమయ్యా, చాలిక వివిధ రీతులచే తోచు ఈజగత్తు వస్తుతః లేదు. లేదను దృఢనిష్ఠ నొసగితివి. సంతతము నిష్ఠ నుండు వరమును ప్రసాదించు దేవా !

నాకు ఈవిచారము ప్రచారము లోకము యొక్క గొడవయే లేని పరాస్థితిని ప్రసాదించుము స్వామీ నీకృపా వీక్షణము నాపై ప్రసరింపబడిన పరదృష్టి గోచరమగు ఈప్రారబ్ధమును దుడిచి వేయుట నీకొక లెక్కయా! కరుణించుము. గురుదేవా ! ఈ ఆశ్రమములు ఈ దేవతలు ఈబ్రహ్మజ్ఞానము నీవే దప్ప మరేమియును గాదు.పరాస్థితిని వెంటనే ప్రసాదించుము. చాలిక చాలు నీవే నీదే సర్వస్వము. పరాభక్తి నొసగి పరిరక్షించు గురుదేవా! దేవతాబృందములచే నమ స్కరింప బడువాడగు ఓఉమామహేశ్వరా ! గురుదేవా! వేదములచే నావృతమై, వేదస్వరూపుడైన స్వామీ ! కొందరిని నీకృపామయ దృష్టి మాత్రముననే, మరి కొందరిని నీఅమృతంపు పలుకులచే మరి కొందరిని మీదివ్యమగు స్పర్శచే దైవాత్మ స్వరూపులుగ జేయునట్టి సర్వశక్తి సంపన్నుడవు. సర్వజ్ఞుడవైన ఓగురు పరమాత్మా నన్ను రక్షించుము. నీవే నాసర్వస్వము. నాకేమియు తెలియదు. నన్నేల ఈ క్రియా రంగమున నాటక మాడించెదవు. సూత్రధారివి నీవు ఈ పాత్రను పరిసమాప్తము మొనర్చి నిన్ను తన్నుగా తెలిసి నిష్ఠనుండ కరుణ జూపుము. నీకృపామయ ఛత్రమున పాలించుము.

జ్ఞానానంద స్వరూపుడగు ఓగురుదేవా! సమస్త దేవత లెల్లరు ఎవరి దేహమునందు వసించుచున్నారో,అట్టిదేవదేవుడవైన స్వామివి

నీవు. నీచరణాబ్జముల యందు శిరము నుంచి నమస్కరించిన సర్వతీర్థ స్నాన పుణ్యఫలము, సమస్త దేవతారాధన మహాభాగ్యము, మన శ్శుద్ధికల్గును. ఆత్మజ్ఞాన సంపద పూజ్యచరణ సన్నిధియందు నివసించును. అట్టి వాటిని ప్రసాదించి నన్ననుగ్రహించుము. నీవే నా జీవన సర్వస్వము. నా కింకేమియును వలదు చాలుచాలు నిజ సుఖానుభవ నిష్ఠ నుంచుము.

భో గురుస్వామీ! నీమాటయే వేదవాక్యము, దయాసముద్రుడవైన నీకటాక్షమే నాసంతత సుప్రణవానుసంధానపూర్వకమైనఉపాసన, నీసందర్శన భాగ్యమే జయశీలమగు బ్రహ్మవిద్య యని నమస్కరింతును. నన్నుద్ధరింపుము. ప్రారబ్ధ వ్యవహారమును కూడ నీదృష్టిచే తొలగించుము. నిజముగ నాయందది లేకపోయినను నీకృప లేనిది ఎరుగ జాలను. నేను దానిని విదిలించు కొనలేను. నీదే నీవే. ఆ నీవే నేనను నిష్ఠను ప్రసాదించుము.

"గురుడె తల్లియు తండ్రి దైవము గురుడె సర్వము గురుడె ఆత్మయనుచు సుస్థిరభక్తిసల్పుము" అని ఏ నాగురుదేవుడు తత్స్వరచన యొనర్చి నాచే బాడించెనో అట్టి నాస్వామి సర్వస్సై నన్ను బాలించును గాక, నన్ను తనయందు లీనమొనర్చుకొనుగాక. ఓం నమశ్శివాయ.

సనక సనందన స్వాయంభువాది మునులు వశిష్ఠాది ఋషీశ్వరులు దేని నెరిగి సర్వలోకమునకు చాటి సంప్రదాయాచార్యులై వర్థిల్లిరో అట్టి పరమ ఋషివర్యులగు శ్రీ ఉమామహేశ్వర గురుపీఠాచార్యులైన అస్మద్గురు వరేణ్యులు నన్నుద్ధరింతురుగాక.నాప్రణుతి శతముల నందుకొనుగాక యని ప్రార్థించు చున్నాను.

ప్రస్థానత్రయ వేద్యుడును, అవస్థాత్రయ సాక్షియును అనుభవ స్వరూపమునై ముంగిట శ్రీసద్గురు స్వరూపమున వెలసి నా అజ్ఞతను బాపి నన్ను ధన్యుని జేయ నవతరించి వచ్చిన ఓస్వామీ! నీకీలోక

మున బనిలేదు. నాకొఱకై వచ్చిన నాతండ్రీ! నన్ను ధన్యునిజేయుము. సద్గురుదేవా ! ఏపాశములులేని అడ్డులేని పరబ్రహ్మతత్త్వమును నా స్వరూపముగ నెఱిగి ధన్యుడగు శక్తిని ప్రసాదింపుము. శ్రీమదుమా మహేశ్వర గురుపీఠమున, గురుపీఠ పరంపరాచార్యులై వెలిసి భక్తులకు కామధేనువై, భవమును బాయుటకు వలయు జ్ఞాన ప్రబోధలను జేసితిరి. ఎవరిచేతను బాప నశక్యమైన నాహృదయము నాశ్రయించుకొని యున్న చిజ్జడగ్రంధిని అవిద్యను, అజ్ఞానమును బాపి కరుణించితిరి. ఇకచాలు, స్వరూపస్థితి నుండ నను గ్రహించుము. నీకిదే అనంత ప్రణామములు.

"నమః పురస్తాదథ పృష్ఠతస్తే, నమోఽస్తుతే సర్వత ఏవసర్వ అనంత వీర్యామిత విక్రమస్త్వం, సర్వసమాప్నోషి తతోఽసి సర్వః" అను గీతాశ్లోక రీతి నీకు సర్వత్ర నానమస్కృతులు. ఓంనమశ్శివాయ అను నిత్యాదిగ పరవశులై ఉమామహేశులను గురుదేవులను గురుపీఠమును పూజ్యశ్రీవారు అనన్య భక్తిచే నుతించుచు సహజస్థితి నొందిరి.

## ఉత్తరాధికారవిధి

శ్రీగుర్వనుగ్రహకార్యమునకు శుభ సమయమున తిథి వార నక్షత్ర యోగ కరణ ఇత్యాది ముహూర్తముచేయుట విధ్యుక్తము. కారణాంతరముచేత గురుకృపాపాత్రులగుటకు ఒకానొకప్పుడు శ్రీగురుదేవుల శుద్ధమనస్సుకు ప్రియమైన స్థాన దేశకాలములు కూడ శుభమైనవే యని ఆగమములయందు పరమేశ్వరుని అనుజ్ఞకలదని చెప్పబడినది. ఇదియును గుర్వనుగ్రహపాత్ర మగుటకు పూజ్య సమయమే అని తెలియ వలయును. ప్రాయశః శ్రీవారు ఉత్తమ ముహూర్తము నిర్ణయించియే ఇట్టి పవిత్రకార్యముల నాచరించు చుందురు. బ్రహ్మచారి అనగా గుర్వనుగ్రహమునకు పాత్రుడై సుసంస్కృతుడై వేదాధ్యయనము జేయువాడని అర్థము. విధ్యుక్తముగ ఉపనీతుడై ఇట్టి

నియమ నిష్ఠలచే గురుసేవ, ఆశ్రమసేవా వగైరా కార్యముల నాచరించుచు శ్రద్ధచే అధ్యయన తత్పరుడై వర్తించు నాతడే బ్రహ్మచారి యనియు, శిష్యుడనియు చెప్పబడును.

ఉత్తముడును సద్భక్తుడగు సచ్ఛిష్యునకు ఉత్తరాధికారము ప్రసాదించు సమయమున ఆపవిత్ర భవనము లేక మందిరమున పూర్వ భాగమున గోమయముచే నలికి మండలమును రచించి అందు వివిధ రంగులచే నలంకరించి, దానిపై భద్రాసనము నుంచి దానికి వేదోక్త పూజాదుల నాచరించి, ఆ సభ కేతెంచిన సజ్జనులగు సద్భక్తుల అనుమతిచే అంగీకారముచే యథాశక్తి ఫల పుష్ప మంత్రాక్షతల ప్రసాదించి ఆపిదప పావనగంగచే పూర్ణమయిన సువర్ణ కలశమునో లేక రజత కలశమునో అట్లు లేనిచో మృణ్మయ కలశమును గాని నాలుగు దిక్కుల యందును మరియు కోణముల యందును మంత్రపూతముగ స్థాపించి కలశములను పత్రపుష్పగంధమాల్య వస్త్రాదులచే అలంకరించి ఆ కలశోదకమునందు శతౌషధి మూలమును (వేఱును) రత్నములను, బంగారమును, సద్బీజములను, పంచ పల్లవములను వుంచి ఆపై 5 స్థానములందు మృత్తు, ఏనుగుదంతము; గోరోజనము, కమలము, చందనము, కుంకుమ కేసరి, తెల్లఆవాలు, తేనె, దేవదారు మొదలగునవి వేయవలెను. అనంతరము దైవస్వతమను మంత్రముచే ఆయుష్యపుష్టి కీర్తుల నభివృద్ధిచేయు నటువంటి వరుణ దేవతాకమైన వేదమంత్రములచే శుభలగ్న శుభాంశయందు భద్రాసనోపవిష్టులగు సద్గురు దేవులచే అభిషించనము కావింపజేసి పంచబ్రహ్మ స్వ రూ ప ము లు గ పూజింపబడిన పంచ కలశముల ఉదకముచే శ్రీగురువులు మఱియు ఋత్విజులు వేదమంత్రములు జెప్పుచుండ, వటువును కూర్చముచే సంప్రోక్షించవలయును. తరువాత శిష్యుడు తన గురుదేవుని పంచామృత, రసపంచక ఫలపంచక మొదలైన వాటిచే సంప్రదాయానుసారముగ గురుపరంపరానుక్రమముచే పూజింప వలయును. సద్గురు

వపుడు శ్వేత వస్త్రధారకుడైన ఆవటువును పూలమాల ధరింపచేసి శిష్యుని తన సమ్ముఖమునందు కూర్చుండ బెట్టుకొని, తను అమృత హస్తములచే సువర్ణమయమగు పట్టమును శిష్యుని మస్తకమునకు ధరింప చేయవలెను. మంత్రపూతమగు కాషాయాంబరములను కాంచన చేలము నొసగి ఉత్తరాధికార యోగపట్టము తమ గురుదైవములను అనగా శ్రీఉమామహేశ్వర గురుపీఠ పరంపరా సంస్మరణ పూర్వకముగ ప్రసాదించుట జరుగవలెను. అనంతరము సర్వవిధ మంగళవాద్య విశేషములు మ్రోగుచుండగ ఋత్విజుల వేదమంత్రఘోష జరుగుచుండ ఉత్తరాధికారి యగు నావటువును దర్భకూర్చచే పావన గంగా తోయములతో సంప్రోక్షణ చేయుచు శ్రీరుద్రమంత్రములను చెప్పుచు, భస్మరుద్రాక్షలను ధరింపజేసి సర్వవిధోపచారములచే ఉత్తరాధికారమును శాస్త్రీయముగ సమర్పించుట ... ఓం అను నిత్యాదిగా వివరించిరి.

అపుడతడు గురుస్థానము నలంకరించిన వాడగును, సంతతము మహామంత్రమును జపించుచు ధ్యానానుష్ఠాన తపస్సంపన్నుడై గురు సంప్రదాయమున పరమభక్తి విశ్వాసము గలవాడై పూజాది వైదికాచార సంపన్నుడై శాస్త్రార్థముల నెరిగినవాడై ప్రస్థానత్రయ భాష్యశ్రవణ మననాదులచే యుక్తుడై శాస్త్రీయముగ తదాచార విచార సంపత్తిని సద్భక్తులును, సచ్ఛిష్యులునగు వారికి ప్రసాదించవలెను. ఇట్టి ఉత్తమ ఉత్తరాధికారమునకు రోగులు, కుంటి, గ్రుడ్డి, అత్యంత కాముకులు, విశ్వాసహీనులు, దురహంకారులు, దుష్టస్వభావులు, రహస్య పరస్త్రీ, పరద్రవ్యాసక్తి మొదలగు చెడ్డగుణములు కలవారు ఏప్రకారముగను అర్హులు కారు. అట్టివారిని వారిగుణములే వారిని వెలుపల బడవైచును. ఇది ధర్మసూత్రము దీనిని గమనించి ఉత్తములగు వారికి అధికారమును ప్రసాదించుట విధ్యుక్తము, కాబట్టి సదాచారియు, అహంకృతి లేనివాడును, సత్య సంభాషణుడును శుద్ధ

మనస్సంపన్నుడును, బ్రహ్మజ్ఞాన శాస్త్రార్థ సంపన్నుడును, ఆ తత్వ మును బోధించు సామర్థ్యము గలవాడును, సంప్రదాయబద్ధమగు సద్భ క్తితో నుండువానికి ఈ గురుపీఠ సమారోహణము సమస్త సన్మంగళ ముల నొసగి, లోకానుగ్రహ, భక్తానుగ్రహ, శిష్యానుగ్రహ కారక మగును. సహబుద్ధియును, బ్రహ్మాత్మత్వ దృష్టిచే నొప్పు నిజ నిష్ఠగల యాతడు సనాతనముగ వచ్చిన గురుసంప్రదాయమును రక్షింపగలడు సద్గురు దేవుడను శుభనామముచే సత్కీర్తిని పొంది తదనుయాయులగు సద్భక్తులకు ముముక్షువులకు, సచ్ఛిష్యులకు సర్వులకు భక్తి జ్ఞాన వైరాగ్యాదులచే యథార్థజ్ఞానమును కలుగజేయగలడు. ఇది గురుసంప్ర దాయకమైన విధ్యుక్త పద్ధతి ఓం తత్సత్.

## శ్రీరుద్రాధ్యాయపరిశస్తి

అనుదినము ఆశ్రమముల యందు శ్రీగురు, దైవ పూజా సమ యమున శ్రీరుద్రమును చెప్పుదుము కదా! శ్రీరుద్రుడన తేజస్వంతు డగు మహాదేవుడు, ఆయన శివుడనియు, శంకరుడనియు, పశుపతి యనియు ఉమామహేశ్వరు డనియు, భవుడనియు నీ మొదలగు అసంఖ్యాకమైన అన్వర్థనామములతో నొప్పును. శ్రీరుద్రుడు కరుణాసాగరుడు, సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు, సర్వాంతర్యామి సంతత ముపాసింపదగిన మనోహర నిర్వికార స్వరూపుడునగు మహాదేవుడు. అనుదినము ఆశ్రమమున శ్రీరుద్రార్చన అను నీ వైదిక కార్యమును సదా భక్తిచే జరుపు చుండుటయే ముఖ్య కర్తవ్యము. ఇది ముక్తికి పరమైక సాధనము. శాంతికి నిలయమనుటకు సందియము లేదు.

శ్రీరుద్రాధ్యయన మనగా నమక చమకములుగల రుద్రుని ప్రకరణము. ఇది కృష్ణయజుర్వేద తైత్తిరీయ సంహిత యందు చతుర్థ కాండమున, పంచమ ప్రపాఠమందు నమకము "నమస్తే రుద్రమ న్యవ": అని ప్రారంభమై జమ్భేదధామి" అని పూర్ణమగుచును 11 అనువాకములచే నలరారు చున్నది. చమకము సప్తమ ప్రపాఠకము

నందు గలదు. ఇందు ఏకాదశానువాకములు గలవు. "రుద్రస్యేదం రుద్రీయం" రుద్రునకు సంబంధమైనది కావున రుద్రీయ మనబడును. దీనియందు అనేక రుద్రనామములు ఉన్నందున దీనికి శత రుద్రీయ మను పేరు కలిగెను.

"ఋతం (దం)సంసార దుఃఖం ద్రావయతీతి రుద్రః" అనగా సంసార దుఃఖమును నాశనము చేయువాడు శ్రీరుద్రుడని అర్థము. "ఋతౌ నాదాంతే ద్రవతి ద్రావయతీతి రుద్రః" అనగా నాదము యొక్క చివర ద్రవించువాడు కావున రుద్రుడని నామము."ఋత్యా వేదరూపయా ధర్మాదీ నవలోకయతి ప్రాపయతీతి రుద్రః" ప్రణవ రూపమున (ఓంకారరూపమున) తన్ను పొందింప జేయువాడుకావున రుద్రుడని అర్థము. "రుద్రో రౌతీతి సత్యేరోరూపమాణో ద్రవతి ప్రవిశతి మర్త్యానితిరుద్రః" అనిన సత్య స్వరూపమున మానవులను ప్రవేశించువాడు రుద్రుడు"ఋతిం శబ్దం వేదాత్మానంబ్రహ్మణేదదాతి కల్పాదావితి రుద్రః" కల్పాదియందు బ్రహ్మమునకు వేదములు నిచ్చిన వాడు రుద్రుడు. "శత మనంతాని రుద్ర నామధేయాని యస్మిన్ తచ్ఛతరుద్రీయం," ఇందు శతమనగా అసంఖ్యాకమని, శ్రీరుద్రనామ ధేయ ప్రశంస కలదు కావున నిది శతరుద్రీయ మనబడును. "శతే శాఖాసు పఠ్యతే రుద్రీయం శతరుద్రీయం" అనగా యజుర్వేద శత శాఖలందు పఠింపబడుటచే దీనిని శతరుద్ర మందురు.

శ్రీరుద్రము ఉత్తమోత్తమమైనది. శ్రుతి స్మృతి పురాణేతి హాస ప్రసిద్ధము, ఉపనిషత్తులు మోక్ష సాధనములని చెప్పబడినవి. అందు శతరుద్రీయము సర్వోత్తమ మని నిర్ధరింపబడి యున్నది."సర్వోపనిషదాం సారో రుద్రాధ్యాయః" అనగా ఉపనిషత్తుల సారసర్వస్వమే శ్రీరుద్రాధ్యాయము.పంచమ వేదమనదగు మహాభారతమున ద్రోణపర్వమునందు, అనుశాసనిక పర్వములందు ఈశతరుద్రీయోత్తమత్వము వర్ణింపబడి యున్నది."నమకం చమకంచైవ పౌరుషంసూక్త

మేవచ, నిత్యం త్రయం ప్రయుంజానో బ్రహ్మలోకే మహీయతే" అనగా నమక చమక పురుషసూక్తములను నిత్యము పారాయణము చేయుచు (శివాభిషేక మొనర్చు నాతడు) బ్రహ్మలోకమును అనగా బ్రహ్మత్వమును పొందును. "సతతం రుద్ర జాప్యోఽసౌ పరాంముక్తి మవాప్స్యతి" అనగా నిరంతరము శ్రీరుద్రాధ్యాయమును పఠించు జపించు మానవుడు ముక్తినొందునని స్మృతుల యందు జెప్పబడినది.

ఈ శ్రీరుద్రమును మహాన్యాస పూర్వకముగ పదునొకండు అనువాకములుగల నమకమును చెప్పి, చమకము నందలి మొదటి అనువాకమును చెప్పి షోడశోపచార పూజల నాచరించిన ఇది యొక ఆవృత్తి యనబడును. ఇట్లు పదునొకండు ఆవృత్తులుచమకము నందలిఒక్కొక్క అనువాకముతో సహా అధ్యయనము జేతురు. ఈవిధానముచే అభిషేక పూజ, పారాయణము చేయవలయును. దీనినే ఏకాదశవార రుద్రాభిషేకమని యందురు. "ఏకపాఠో నమ స్తస్య హ్యానువాకః పరస్యచ" ఇట్లని చెప్పుటయందు ఇది ప్రమాణమై యున్నది. పైవిధముగా కేవల శ్రీరుద్రములను పదునొకండు పఠించినచో అది లఘు రుద్రమనబడును దీనికే శ్రీరుద్రమని పేరు. "త్రైరేకాదశభీ రుద్రైః లఘురుద్రః ప్రకీర్తితః" అను నిత్యాదిగా ఈవిషయమున అనేక ముఖ్యప్రసంగము లను శ్రీగురుదేవులు వివరించిరి.

శ్రీరుద్రము సప్తమానువాకము నందు సాయణాచార్య భాష్య రీతి ధ్యానశ్లోకము ఒకటి కలదు. "జటాభిర్లంబమానాభి ర్నృత్యంతమభయప్రదం, దేవం శుచిస్మితం ధ్యాయే, ద్వ్యాఘ్రచర్మ పరిష్కృతం" దీని భావమేమన వ్రేలాడుతున్న జడలతో నృత్యముచేయువాడును, అభయము నిచ్చువాడును, శుద్ధమగు నవ్వుకలవాడును, పులి దోలు నలంకారముగ గలవాడగు శివుని అనగా నటరాజును ధ్యానింతును. ఈనటరాజు రూపముననే శివుడు (సనకాది సిద్ధులను పాణిన్యాద్యా చార్యులను, ఉద్ధరించినట్లు ఈక్రింది శ్లోకము వర్ణించుచున్నది. అనగా నటరాజు రూపమున నుండు శివుని స్తోత్రము.

"నృత్తావసానే నటరాజ రాజో ననాద ఢక్కాం నవపంచ వారం.
ఉద్ధర్తు కామః సనకాది సిద్ధాన్, యేతద్విమర్శే శివసూత్రజాలమ్॥"

అఇఉణ్ (౧) ఋఌక్ (౨) ఏఓఙ్ (౩) ఐఔచ్ (౪) హయవరట్ (౫) లణ్ (౬) ఞమఙణనమ్ (౭) ఝభఞ్ (౮) ఘఢధష్ (౯) జబగడదశ్ (౧౦) ఖఫఛఠథచటతవ్ (౧౧) కపయ్ (౧౨) శషసర్ (౧౩) హల్) (౧౪)

ఇతి మాహేశ్వరాణి సూత్రాణి అణ్, అక్ ఇత్యాది సంజ్ఞాథాన్ని ॥అను నిత్యాదిగా నటరాజ రూపమున నున్న రుద్రుని విశేషములు కూడ గలవు.)

నమకము 8వ అనువాకము నందు సమస్త లోకములును ఉపాసింప దగిన కారణములచే నొప్పు, ధర్మముల యందంతట అంతర్యామిత్వమున వ్యాపించి యుండు చైతన్య స్వరూపుడగు శ్రీరుద్ర భగవంతునియొక్క నమస్కారములు చెప్పబడినవి. ముఖ్యముగ శ్రీశివ పంచాక్షర మహామంత్రము ఈఅనువాకమున గర్భితమై యుండుటచే నిది శ్రీరుద్రాధ్యాయ మనెడి మణిహారమున నాయకమణియై యొప్పుచున్నది. పరమేశ్వరుడగు శ్రీరుద్రుడు మోక్షము నొసగు వాడగుటచే ముముక్షువులకు ఈరుద్రాధ్యాయము ముఖ్యముగ నుపాసింప దగినదని ఇందు తెలుపబడినది. "ఓంనమస్సోమాయచ రుద్రాయచ" ఇచట సోమాయ నమః ప్రణవార్థము అనగా ఓం అఉమ్ మఱియు ఉమ్ అ అని వ్యత్యస్తముగ వ్రాసిన,నుచ్చరించిన ఉమ యనిఅగును. పరాశక్తి పరబ్రహ్మము. వేదాంత విద్యాధిదేవత, చిచ్ఛక్తి, పరమేశ్వరియునగు ఉమ అనగ శ్రీపార్వతీ హైమవతీ సహితుడగు పరమేశ్వరునకు శ్రీరుద్రునకు నమస్కారమని తెలుపబడినది, ఇటువలె కేనోపనిషత్తు, శివపురాణము లందును ఉమాసహితుడగు ఈశ్వరుడు, శ్రీఉమామహేశ్వరుడే సర్వశక్తి వంతుడనియును, సంసారదుఃఖమును బాపు దేవదేవుడు శ్రీరుద్రుడనియు, మోక్షము నిచ్చుదైవ మనియు

జగద్గురుడనియు చెప్పబడుచున్నాడు.

"విద్యాసు శ్రుతి రుత్కృష్టా రుద్రైకాదశినీ శ్రుతౌ
తత్ర పంచాక్షరీ తస్యాం శివ మిత్యక్షర ద్వయమ్॥"

## 29. వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1973 సం॥

శ్రీక్షేత్ర ఉమామహేశ్వరాశ్రమము లత్తవరమునందు ప్రమాదీచనామ సం.ఆషాఢ శుద్ధ ఏకాదశి 10.7.73 విధ్యుక్తముగ వెనుకటి మహావ్రత కార్యక్రమములవలె 29వ శ్రీచాతుర్మాస్య మహావ్రతము ప్రారంభ మాయెను. 27.7.73 తారీకున శ్రీమదుమామహేశ్వర గురుపీఠ ప్రతిష్ఠ, మండల మహాపూజ యథాశాస్త్రముగ గురుపీఠము నందు ఏకాదశవార శ్రీరుద్రాభిషేకసర్వోపచారపూజలచే కార్యము శివప్రదమై నడచెను.

శ్రీవారు 29వ శ్రీచాతుర్మాస్య మహావ్రతము 10.7.73 మొదలు 28.7.73 వఱకు లత్తవరం శ్రీక్షేత్ర ఉమామహేశ్వరాశ్రమమునందు తరువాత నంద్యాల శ్రీఉమామహేశ్వరాశ్రమము నందు, పిదప కర్నూలుజిల్లా హాలరివి శ్రీఉమామహేశ్వరాశ్రమము నందు, గుంతకల్లు శ్రీఉమామహేశ్వరాశ్రమము, చివఱకు అనంతపురము జిల్లా నింబగల్లు గ్రామం శ్రీఆదప్పస్వాములవారి మఠమునందు యథారీతి పూజానుష్ఠాన శాస్త్రశ్రవణాది కార్యములచే నిర్ధరింపబడి ఆ యా స్థానములను పూజ్యశ్రీస్వాములవారు దయచేసి ప్రస్థానత్రయ శ్రవణాదులు గావించి ప్రత్యేకముగముముక్షువులకు అనుసంధానాత్మకంబులగు అనేక విషయములను విదిత పఱచిరి. సర్వులు మహదానందము నొందిరి.

అపరోక్షముగ నెఱుగు జ్ఞానస్వరూపుడైన తానుపరబ్రహ్మమే యైయున్నాడు. పరోక్షముగ కొన్ని శ్రుతులు పరబ్రహ్మము జగత్కారణమని చెప్పుచున్నవి. ఆబ్రహ్మమే ఈశరీరమున అపరోక్షముగనుండు పరమాత్మ. "ప్రజ్ఞానంబ్రహ్మ" యను మహావాక్యము జ్ఞానమే బ్రహ్మ

మని చెప్పుచున్నది. అట్టి పరమాత్మ పిపీలికాది బ్రహ్మపర్యంతముసర్వ శరీరముల యందు అనుస్యూతమై యున్నది. వ్యాపక జ్ఞాన స్వరూప మగు బ్రహ్మమును తన్నుగా తెలిసినవాడు ధన్యుడు. "సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" అను శ్రుతి ఆత్మకు జ్ఞానమే స్వరూపమని చెప్పు చున్నది. నైయాయికులు జ్ఞానము గుణమని చెప్పుదురు.అది సరికాదు. శ్రుతి విరుద్ధము.

గురు ఈశ్వర వేదములు మూడును స్వయం ప్రత్యగాత్మస్వరూ పములై యున్నవని తెలియవలెను. ఇట్లు దెలిసిన యాతడే గురుదైవ శాస్త్రములను ఎఱిగినవాడు. తన ప్రత్యగాత్మ స్వరూపమున కంటె వేఱుగ నెరిగినవాడు తెలిసిన వాడు కాదు! లేక సోఽహంరూపప్రత్య గాత్మ (సాక్షి) అనుసంధాన అనుభవముచే వేద గురు దైవములను ధ్యానించినట్లే పూర్ణమగును. ఈజ్ఞానమే శ్రేష్ఠమగుముక్తిస్వరూపమై యున్నది. "స్వస్వరూపావస్థితిః ముక్తిరిత్యభిధీయతే" తనస్వరూపమే ముక్తియై యున్నది కాని వేరు కాదు అని శ్రీ శంకరాచార్యులు తెలిపిరి.

జాగ్రదవస్థ యందు శబ్ద స్పర్శ రూప రస గంధములను పంచ విషయములు, శ్రోత్ర, త్వక్కు, చక్షు, జిహ్వా, ఘ్రాణములను పంచ జ్ఞానేంద్రియములచే గోచరము లగుచున్నవి.రూపము లనేకములైనను చూచు కన్ను ఒకటే, ఐదు విషయములు, ఐదు ఇంద్రియములు, వేరువేరైనను తానుమాత్రము ఏకమే. కంటిచే రూపమును గన్న యాతడే చెవిచే శబ్దమును, నాసికచే గంధమును,నాలుకచేరుచియును, తెలిసికొనుచున్నాడు. కంటికొక జ్ఞానము, చెవికొక జ్ఞానమని లేదు. ఏకమగు తానే సర్వత్ర మానసేంద్రియముల ద్వారా జీవుడనియు, ఈజీవులకు సాక్షిరూపముచే బింబమై యున్నందున తురీయుడనియు ప్రత్యగాత్మయనియు చెప్పబడును.తానే అనగా జ్ఞానమేమాయోపాధి యందు ప్రతిబింబించి నందున ఈశ్వరుడనియు, ఈశ్వరునకు బింబమై

నందున సాక్షి పరబ్రహ్మమనియు చెప్పబడును. అనగా త్వంపద వాచ్యుడు జీవుడనియు, తత్పద వాచ్యుడు ఈశ్వరుడనియు, తత్పద లక్ష్యము బ్రహ్మమనియు ఇట్లు సాక్షి ప్రత్యగాత్మయగు తానే ఉపాధి భేదమున వేరుగ చెప్పబడు చున్నాడు, ఉపాధిని బాధింప నిరుపాధిక అఖండ స్వరూపమును సర్వోపాధి వినిర్ముక్తమగు తత్త్వమే తాను. జీవభావము బాధింపబడి బ్రహ్మ భావము వచ్చుట బహుజన్మ నిష్కామతపఃఫలము బహుపుణ్యరాశి యని చెప్పబడును. "బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే" ఈ మొదలగు ఆత్మ తత్త్వ విషయములను యెంతో హృదయంగమముగ సర్వ జనానంద ప్రదమగునట్లు బోధించిరి.

అచటి నుండి శ్రీవారు భక్తులతో హాలరివి శ్రీఉమామహేశ్వ రాశ్రమము దయచేసి సమీపమున నుండు వరప్రదుడగు బాపురమఠం బసవేశ్వరాలయమున తుంగభద్రానదీ శాఖ తీరమునందు 10.11.73 దీక్షావిరమణ మొనర్చి సుస్నాతులై శ్రీబసవేశ్వరునకు శ్రీ రుద్రాభి షేకాది సర్వోపచార పూజలు గావింపజేసిరి. అచటభక్తులు తండోప తండములుగ వచ్చి శ్రీసన్నిధి దర్శించిరి. భక్తి తత్త్వమును గురించి శ్రీవారుపన్యసించి మరల హాలరివి శ్రీఉమామహేశ్వరాశ్రమమునకు దయచేసి తమ నిత్య నియమానుష్ఠానముల యందుండిరి.

29.11.73 తమ గురువుల ఆరాధన కార్యక్రమము నంద్యాల శ్రీఉమామహేశ్వరాశ్రమ క్షేత్రమున విధ్యుక్తముగ నిర్వర్తించిరి. అచటనే బ్రహ్మనిష్ఠ నుండుచు "నైష్కర్మ్యసిద్ధి" మహాగ్రంథప్రవచన ముచే పూజానుష్ఠానాదిగురుకార్యములయందు నిమగ్నులయిఅపూర్వ విషయములు వ్యాపకమగు పరబ్రహ్మమే నీవయి యున్నావను దృష్టి భక్తులకు కలుగజేయుచు అనుభవసిద్ధంబగు నిజ తత్త్వార్థములను వివిధ రీతులచే బోధించిరి. సర్వులు మహదానందము నొందిరి. విషయము కరతలా మలకమువలె భక్తులు ముముక్షువులగు వారి శుద్ధ మనఃఫలక

మున భాసిలు చుండెను. శ్రీవారెంతయు సంతసించిరి. ఓం.

కర్నూలు భక్తులగు గుణవంతులయిన బ్రహ్మశ్రీ తాండ్ర కృష్ణమూర్తిగారు. శ్రీ విసనకర్ర శేషప్ప, శ్రీ కంబాలపాడు సత్య నారాయణ వీరు అవన్యమగు భక్తిచే వచ్చి శ్రీవారు కర్నూలు పురాణకాలక్షేప సంఘము యినకాల సత్రమునకు దయచేసి ఒకమండ లము, లేక చివఱకు ఒక నెలదైనను అచట పూజ్యశ్రీవారు సన్నిధిచేసి (దయచేసి) ప్రవచనములు జరుపవలెనని విన్నవించుకొనిరి. భక్తిభావ ములచే నొప్పవారి ప్రార్థనలను మన్నించి అంగీకరించిరి. 26.12.73 కర్నూలువారు వచ్చి యినకాల సత్రమునకు శ్రీవారిని దోడ్కొని వెళ్ళిరి.

అచట ప్రేమసంఘము శ్రీవాసవీ గీతామందిరమున బ్రహ్మశ్రీ తాండ్ర క్రిష్ణమూర్తిగారు వసతియొనర్చి దివ్యమగు నా భవనము నందు, శ్రీస్వామివారు తమ పూజానుష్ఠానాదులచే ప్రాతఃకాలము అచటనే ఉపనిషత్ప్రవచనము సాయంకాలము యినకాలవారి సత్ర ములో గీతాభాష్య ప్రవచనము జేసిరి. వేలాది అసంఖ్యాకముగ భక్తులు వచ్చి ఎంతో శ్రద్ధగ విని ఆనందించిరి.

శ్రీగీతామందిరము అధ్యక్షులు శ్రీ పి. పుల్లయ్యశెట్టిగారు, శ్రీ కె. శంకరయ్యశెట్టిగారు, శ్రీ సి. వీరణ్ణశెట్టి, పాపయ్యశెట్టి మొద లగు ఆ సంఘ సదస్యులందరు భక్తితో చూచుకొనిరి. శ్రీయినకాల సత్రము పురాణ కాలక్షేప సంఘము వారందరు అత్యంత ఆదర భక్తి భావములతో అన్ని వ్యవస్థలను జేసి కార్యక్రమము శివప్రదముగ నడపిరి.

ఈమధ్య యినకాల వారి సత్రములో శ్రీమదుత్తరాయణ పుణ్యకాలము సంక్రాంతిపండుగ పర్వదినము 14.1.1974 తేదిన విశ్వ కల్యాణ దినమని, శ్రీవిశ్వ హిందూ పరిషత్ సదస్యులు బ్రహ్మశ్రీ

నారాయణాచార్యులు. శ్రీ శ్రీరాములు అడ్వకేటు యం. ఎ. గారు పరిషత్ అధ్యక్షులు మొదలగువారు గొప్ప సభ వేర్పఱచిరి. శ్రీవారు ఆనాడు హైందవ సంస్కృతిని గుఱించి 2 గం॥ సేపు సంతోషముగ ఉపన్యసించిరి. బాల బాలికలకు పారితోషములు శ్రీసన్నిధి నుండి ప్రసాదింపబడెను. మరి కొందరుపన్యసించిరి. వందన సమర్పణముతో మంగళమై పూర్ణమాయెను. సభ యెంతయును సంపూజ్యమై ఉత్తమ విషయ ప్రతిపాదన యుక్తంబై సర్వ జనానందముగ నుండెను. ఈ నెల రోజులు కార్యక్రమమునకు చుట్టుప్రక్కల గ్రామములు పట్టణముల నుండి భక్తులు వచ్చి శ్రవణాది కార్యములయందు పాల్గొనిరి. పండితులు జిజ్ఞాసువులు భక్తిభావములచే అనుదినము సభకు వచ్చుచు సంతోషముగ భాష్య శ్రవణము చేయుచుండిరి. 25.1.74 శ్రీవారు కర్నూలు భక్తుల వీడ్కోలు నొంది నంద్యాల శ్రీఉమామహేశ్వరాశ్రమమునకు దయచేసిరి.

30.1.74 రథసప్తమి పర్వదినమునందు శ్రీగురుదైవ పూజానుష్ఠానానంతరము భక్తాదులందరికి "జయ గంగే" యని శ్రీఉమామహేశ్వరుల కభిషేక మొనర్చిన గంగాతీర్థమొసగి.

"గాంగంవారి మనోహారి, మురారి చరణచ్యుతం,
త్రిపురారి శిరశ్చారి, పాపహారి పునాతు మామ్॥"

"పాపాపహారి దురితారి తరంగధారి శైలప్రచారి గిరిరాజ గుహా విదారి,
ఝుంకారకారి హరిపాదరజోఽపహారి గాంగం పునాతు సతతం శుభకారివారి"

అను నీ శ్లోకములను గురించి సర్వులు సంతసింప పావన గంగాభివర్ణన వ్యాఖ్య యొనర్చిరి.

తరువాత గుంతకల్లు ఆశ్రమము వచ్చి లత్తవరము శ్రీక్షేత్ర ఉమామహేశ్వరాశ్రమము, శ్రీఉమామహేశ్వరగురుపీఠసన్నిధికి దయచేసి జప తపాద్యనుష్ఠాన నిష్ఠా గరిష్ఠులై కేవల వాక్యార్థ ప్రసంగములతో శ్రీశంకరజయంతి మహోత్సవమును 27.4.74 కు విధ్యుక్త

ముగ నాచరించిరి. 16.6.74 శ్రీవారి పరమ గురువుల ఆరాధన 18.6.74 పూజ్యశ్రీ గురుదేవుల జయంత్యుత్సవము జరిగెను.

## 30.వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1974 సం॥

భక్తుల భక్తి భావనానుసారము శ్రీవారు ఆనందనామ సం॥ర ఆషాఢ శుద్ధ ఏకాదశి 30.6.1974 మొదలు కార్తిక శుద్ధ ద్వాదశి 26.11.74 వరకు క్రిందకనబరచిన ఆ యా స్థానముల యందు మును పటివలె తమ నిత్య నియమానుష్ఠాన నైమిత్తిక విశేష పూజాద్యా చారవిచార సంపన్నులై సుప్రసన్నముగ మహావ్రతము జరిపి పూర్ణ మొనర్చిరి.

మొదట 30.6.74 నుండి 29.7.74 వరకు హాలరివి శ్రీ ఉమా మహేశ్వరాశ్రమమునందు తరువాత లత్తవరం శ్రీక్షేత్రఉమామహే శ్వరాశ్రమమునందు, ఆమీదట గూళపాళ్యం శ్రీగురుదేవాశ్రమము నందు, గుత్తి శ్రీకన్యకాపరమేశ్వరి ఆలయమునందు, గుంతకల్లు శ్రీఉమామహేశ్వరాశ్రమమునందు చివఱ నంద్యాల శ్రీఉమామహే శ్వరాశ్రమమునందు ఇట్లు సర్వ భక్త జనులకు సంతృప్తి కరముగ ఆ యా స్థానములందు భాష్యపాఠములు, ఉత్తమమగు వేదాంత ప్రక్రి యలు, కర్మ భక్తి జ్ఞానములను తెలుపు తాత్త్విక ప్రవచనములు జేసిరి. అందరు మహదానందము నొందుచు శ్రీవారి ఈమహాకార్య ములు గ్రామ వాసులకు, పట్టణ వాసులకు అందరికి మహోపకార మాయెను గదా ! ఇది చాల బాగున్నదని పరస్పరము సంప్రదించు కొనుచు ఆనదించిరి.

"అద్యన్తస్య కుతః సత్వం, అసతస్తు కుతో జనిః
అజాతస్య కుతో మృత్యుః, ప్రారబ్ధ మసతః కుతః॥"

"అహం హి సర్వం నకించిదన్యత్॥" "ఆత్మానం విద్ధి బ్రహ్మాస్మీతి...." "సచ్చిదానంద మాత్మాన మద్వితీయం బ్రహ్మ భావయేత్ః" "అహంబ్రహ్మాస్మీత్యను సంధానం కుర్యాత్॥" "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః॥" "ఏక స్తథా సర్వ భూతాంత

రాత్మా॥" "ఏకోదేవః సర్వభూతేషు గూఢః॥" "అవికారీవాఽయమాత్మా॥" "మన సైవేద మాప్తవ్యం నేహ నానాస్తి కించన॥" "అంగుష్ఠమాత్రః పురుషోన్తరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః॥" "సబాహ్యాభ్యన్తరో హ్యజః॥" ఈమొదలగు ఉపనిషద్వాక్యములను వివరించిరి.

భక్తాదులతో కూడి ఈ సంవత్సరము శ్రీగోకర్ణ మహాక్షేత్రములో దీక్షావిరమణ కావలెననియు, అటులనే సంపూర్ణ దక్షిణ యాత్ర శ్రీసేతు రామేశ్వరయాత్ర శ్రీసన్నిధివారి నుండియే కావలెనని భక్తులు పట్టుపట్టి, శ్రీరామేశ్వర యాత్రగావించిరి.

15.12.74 సముద్ర స్నానము శ్రీరామేశ్వర జ్యోతిర్లింగ సందర్శనము, శ్రీరుద్రాభిషేక పూజాది కార్యములు సాంగమంగళముగ వైదికవిధులచే సర్వోపచార పూజలు గావింపబడెను. అనంతరము ఆయా స్థానములు, క్షేత్రములు సందర్శించుచు మధురలో శ్రీవారి గురుదేవుల ఆరాధన కార్యక్రమము జరుపుకొని 24.12.74 నంద్యాల శ్రీఉమామహేశ్వరాశ్రమమునకు సుఖముగా వచ్చి అందరు చేరి శ్రీఉమామహేశ్వరులను పూజించి ధన్యులైరి.

కర్నాటకరాష్ట్రములో బీరూరు అజ్జంపూరువద్ద నుండి శ్రీగిరి క్షేత్రము హొంగరేఖాన్‌గిరి (బాబాబుడన్‌గిరి) యనబడు ఆ పర్వత శ్రేణి యందుండు స్థలము అజ్జంపూర్ శ్రీశివానందాశ్రమముస్వామి, శ్రీశంకరానంద ట్రస్ట్‌వారు బహుకాలము నుండి అజ్జంపూరు, మరి శ్రీగిరిక్షేత్రమునకు శ్రీవారు దయచేయ వలెనని భక్తితో కోరుచుండిరి. కాన శ్రీవారు అజ్జంపూరులో పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శంకరానందస్వాములవారి పుణ్యారాధనకు అచటి భక్తుల ప్రార్థనానుసారము 4.4.75 గుంతకల్లు ఆశ్రమము నుండి దయచేసి శ్రీ గిరిక్షేత్రమును సందర్శించి ఆరాధన కార్యక్రమమును చూచుకొని 27-4-75 లత్తవరం శ్రీక్షేత్ర ఉమామహేశ్వరాశ్రమమునకు దయచేసిరి.

16.5.75 శ్రీశంకర జయంతి మహోత్సవము ప్రతి సం॥వలె

శివంకరముగ నడచెను. 5.7.75 శ్రీవారి పరమ గురువుల ఆరాధన 7.7.75 పూజ్య శ్రీవారి జయంత్యుత్సవము ఆనందముగ జరిగెను. ఉపనిషద్భాష్యార్థములను ప్రవచించిరి.

## 31.వ. శ్రీచాతుర్మాస్యమహావ్రతము-1975 సం॥

అనంతపురము శ్రీపార్వతీనిలయములో శ్రీరాక్షస నామ సం॥ ఆషాఢశుద్ధ॥౧౧॥ 19.7.75 ప్రతి సం॥వలె విధ్యుక్తముగ పూజానుష్ఠానాదులచే కార్యక్రమములు జరిగి శివసంకల్పముచే మహావ్రతము ప్రారంభింపబడి ఉదయము ఉపనిషద్భాష్య శ్రవణము, సాయంకాలము గీతాభాష్య శ్రవణము గావింపబడెను. కార్యక్రమము మహావైభవముగ సుసంపన్నమై శ్రీపార్వతీ నిలయమునందు జరిగెను. వేలాదిగ భక్తులు వచ్చుచు నిర్మలముగ వాక్యార్థ శ్రవణము చేసిరి. మరియు అనేక పండితులు శ్రీపార్వతీ నిలయము శ్రీసన్నిధి ఉపన్యసించిరి. బ్రహ్మశ్రీ కోరాడ మహదేవశాస్త్రిగారు, బ్రహ్మశ్రీ బాలవిశ్వనాథ శర్మగారు, బ్రహ్మశ్రీ యన్. రామారావుగారు, బ్రహ్మశ్రీ దేవరాయ కులకర్ణిగారు (బెంగుళూరు), పండిత శ్రీఆర్. బాలరాజుగారు చక్కగ నుపన్యసించిరి. 'త్యాగశీల' మేడారామయ్యగారి సేవ సంస్తుత్యము. శ్రీమేడా సుబ్బయ్యగారు పరమ భక్తితో అన్ని చూచుకొనిరి. ఇటువలె అనంతపురం యావత్తు భక్తమండలి వారి భక్తి విశ్వాసములు ఈశ్వరప్రీతికరములు సంస్తుత్యములు.

ఇటువలె కర్నూలు శ్రీగీతామందిరములోను, అనంతపురము ఉరవకొండ శ్రీకన్యకాపరమేశ్వరి ఆలయములోను, గుంతకల్లు శ్రీ ఉమామహేశ్వరాశ్రమము నందును, గుత్తి శ్రీకన్యకాపరమేశ్వరి దేవస్థానమునందును నంద్యాల శ్రీఉమామహేశ్వరాశ్రమమునను చివఱ చిందుకూరు శ్రీనందీశ్వర నిలయములోను విధ్యుక్తముగ మహదానంద ప్రదమై ప్రవచనాదు లాచరింపబడినవి. పశ్చిమవాహిని చిందు

కూరు కుందునదీ తీరమున యథావిధి దీక్షావిసమణ కార్యక్రమము జరిగెను. ఆగ్రామమున సనాతనముగ ఈగురుపీఠపరంపరా భక్తు లనేకు లున్నారు. అనన్యమగు వారి భక్తి ప్రపత్తులు ప్రశంసనీయములు, మంచివారు. ఇచ్చట ఉత్తమమగు బ్రహ్మతత్త్వ ప్రతిపాదనలు చాల చక్కగ జరిగెను. పరిసర ప్రాంతములు గడిగ రేవుల, రాయమల పూరు, నంది కొట్టుకూరు, గడివేముల భక్తాదులు వచ్చి కార్యక్రమమున పాల్గొనుచుండిరి. సర్వమును మంగళప్రదము. 29.11.75 శ్రీవారి గురుదేవుల పుణ్యారాధన ఆనందముగ జరిగెను.

అనంతరము శ్రీవారు గుంతకల్లు శ్రీఉమామహేశ్వరాశ్రమమునందు యథా నియమముగ వాక్యవృత్తి వాక్యసుధ, బ్రహ్మసూత్రవృత్తి, అను నీగ్రంథముల ప్రవచనము గావించుచు నిత్యసుఖస్వాంతులై యుండిరి.

డివైన్‌లైఫ్ సొసైటి కార్యకర్తలగు శ్రీ పి. వెంకణ్ణశ్రేష్ఠి, బ్రహ్మశ్రీ క్రిష్ణశాస్త్రి, బ్రహ్మశ్రీ వాసుదేవశాస్త్రిగారు వచ్చి శ్రీవారిని బళ్ళారి శ్రీవాసవీ భవనమునకు దయచేసి శ్రీగురుదేవులు ఆధ్యాత్మిక ప్రబోధలచే మమ్ము ఆనంద పరచ వలెనని భక్తిచే విన్న వించు కొనిరి. శ్రీవారు వారి పవిత్ర భావనానుసారము అంగీకరించిరి 15.12.75 బళ్ళారి శ్రీవాసవీభవనమునకు శ్రీవారిని దోడ్కొనివెళ్ళిరి.

అచట దివ్యభవనంలో శ్రీవారు యథారీతి తమ పూజానుష్ఠానములచే, అచటివారు కోరిన ప్రకారము ఉదయము తెనుగుభాషయందు, శ్రీశంకర కృతియగు ఆత్మబోధ ప్రకరణమును, సాయంకాలము ప్రదోష పూజానుష్ఠానానంతరము 7 గం॥ నుండి 8.30 గం॥ వరకు శ్రీమద్భగవద్గీతా భాష్యమును కర్నాటక భాషయందు ప్రవచించిరి. వేలాది భక్తులు భక్తిశ్రద్ధలచే వచ్చి శ్రీవారి ప్రబోధల నాలకించి ఆనందించిరి.

భక్తులగు శ్రీరామకృష్ణ ట్రేడర్స్ నందిపి నారాయణప్ప సోదరులు మొదలగు వారందరు ఎంతో భక్తిశ్రద్ధలతో శ్రీసన్నిధి అన్ని కార్యములందు పాల్గొని సేవయొనర్చిరి.

డివైన్ లైన్ సొసైటియావత్తు సంఘమువారు అనన్యభక్తితో సేవచేయుచు చివర భక్తాదులందరికి, ఉత్తమరీతి, విందు గావించి శ్రీవారికి వీడ్కోలొసగిరి. సంస్మరణార్థమైన సమావేశము.

అనంతరము ఉత్తమ భక్తులగు ఉస్మాన్‌గంజ్ హైదరాబాద్ కటకం నరసింహారావు సహోదరులు మరియు వారి సోదరులగు దాచేపల్లి లక్ష్మీనరసింహారావు, కర్నూలు వి. శేషప్ప అనన్యమైన భక్తిచే శ్రీవారిని తమ పరివారముతో సహ 25.12.75కు హైదరాబాదు దోడ్కొని వెళ్ళి వారి పవిత్ర గృహమున పూజానుష్ఠానములకు అన్ని విధముల చక్కని వసతి నొసగి పట్టణమున శ్రీవారి శుభాగమనమును తెలుపుచు, బహిరంగసభ నేర్పఱచిరి. అధ్యాత్మ విద్యయను శీర్షికపై శ్రీవారుపన్యసించిరి. పిదప ఫీల్‌ఖానాలో అమ్మవారి శాలయందు కూడా భగవద్గీతా ప్రవచనములు గావింపజేసి శ్రీగురుకృపకు పాత్రులయిరి. ఈసమావేశము లెంతయు వైభవోపేతమై ఆనందప్రదముగ నుండెను.

బ్రహ్మవిద్యయే మేటివిద్య జీవనమున మానవుని పరిశుద్ధమొనర్చుటయందు బ్రహ్మజ్ఞానముకంటె వేరొకటి సమర్థమైనదిలేదు. "నహి జ్ఞానేన సదృశం" "జ్ఞానాగ్ని స్సర్వ కర్మాణి" అన్నట్లు "అనేక జన్మ సహస్ర సంచితమపి ధర్మాధర్మాది సమూలం కర్మ క్షణమాత్రాదేవ భస్మీ కరోతి" అని గీతాభాష్య పాఠము కలదు. భయము నొందక ఇదే జన్మయందు బ్రహ్మజ్ఞానమును భక్తి శ్రద్ధాదులచే పొందవచ్చును పరిదృశ్యమానమగు క్షేత్రము క్షేత్రాధ్యాసను వివేకముచే వదలి, యిది తానుగాదనియు దీని నెఱుగు దృక్కు, ఆత్మస్వరూపుడని తెలిసి ఈక్షేత్రజ్ఞుడగు చైతన్యాత్మ అసంసారియగు సాక్షాత్ పరమేశ్వరుడే

యని, పరబ్రహ్మమే నని ఎఱుగవలెను. క్షేత్రజ్ఞుడనగా ఆత్మ, అన్వయ స్వరూపమై బ్రహ్మమొదలు పిపీలిక పర్యంతము తృణము మొదలు మేరుపర్యంతము అనేకోపాధుల యందు, ఏకమైన తాను విభిన్నముగ దోచుచుండినను, ఏ ఉపాధి విశేషములు లేని, నిర్విశేష పరబ్రహ్మ స్వరూపుడే ఈ క్షేత్రజ్ఞాత్మ యని తెలియవలెను. ఒకటి బాధసమానాధికరణదృష్టి, ఇంకొకటి ముఖ్య సమానాధికరణదృష్టి యను నిత్యాదిగా విపుల వివరణ మొనర్చిరి......"

హైదరాబాదు నుండి భక్తుల వీడ్కోలు నొంది ఆదవాని శ్రీ వాసవీ కల్యాణమందిరమునకు దయచేసి కొన్ని దినములు తైత్తిరీయోప నిషత్ప్రవచనము చేసిరి. అందలి పూర్వార్థ ఉత్తరార్థము లెంతయు ముముక్షుజన శ్లాఘ్యములు. మననానుష్ఠాన సంపన్నములు 17.1.76 కు గూళపాళ్యం శ్రీగురుదేవాశ్రమము గురుదైవ ప్రతిష్ఠా కార్యక్రమమునకు దయచేసిరి.

## శ్రీగురుదేవాశ్రమము - గురుదైవప్రతిష్ఠ

గూళపాళ్యం శ్రీగురుదేవాశ్రమము భక్తులు శ్రీ కూన్ పి. రాచనగౌడుగారు గొప్పగ సేవచేసిరి. మరియు శ్రీ పి. దొడ్డనగౌడు వి. యమ్. శ్రీ పి. నాగనగౌడు శ్రీ సి. మల్లనగౌడు శ్రీ వీరభద్ర గౌడు వి. యమ్. (కొనకొండ్ల) మరియు కొనకొండ్ల శ్రీ హెచ్. విరుపాక్షగౌడుగారు అత్యంత త్యాగపూర్వకముగ భక్తిగౌరవములచే నూతనముగ నవగ్రహ మంటపము కట్టించుట, నవగ్రహ మూర్తులను తెప్పించుట వగైరా కార్యములందు గొప్పగ సేవ చేసిరి. శ్రీ కె. గోవిందప్పగారు భక్తిచే శ్రీగురుదేవుల మూర్తిని తెప్పించిరి. కొనకొండ్ల గూళపాళ్యం యావత్తు భక్తులు అత్యంతభక్తి శ్రద్ధలతో సేవచేసిరి. మరియు శ్రీరామానందస్వామి, శ్రీఆచారిస్వామి, ఆశ్రమ సర్వకార్యములు భక్తితో చూచుకొనిరి. భక్తాదులందరు యిచట వలసిన అన్ని వ్యవస్థలు గావించిరి.

మొదటి ప్రతిష్ఠా మహోత్సవములకు ఏతెంచు చుండిన భూసు రులగు బ్రాహ్మణోత్తములు సకాలమునకు విచ్చేసిరి. శ్రీరాక్షసనామ సం॥ మాఘ శుద్ధ విదియ సోమవారం 2-2-1976 యథారీతి వేదోక్త ముగ శ్రీగురు, శ్రీచంద్రమౌళీశ్వర, శ్రీరత్నగర్భ గణపతి, శ్రీపార్వతి, శ్రీనందీశ్వర, నవగ్రహ ఉమామహేశ్వర గురుపీఠ పరంపర శాసనస్తుతి శిలాఫలక, ధ్వజ ప్రతిష్ఠా మహాకార్యక్రమములు వేదఘోషతో ప్రారంభమై మంటపప్రవేశము, మహాగణపతి పూజ, స్వస్తివాచనము నాంది ఋత్విగ్వరణాది సమస్త వైదిక కార్యములు పూజ్య శ్రీవారి ఆధ్వర్యమున క్రమముగా 5-2-76 గురువారము వఱకు జరిగి మాఘ శుద్ధపంచమి దేవతా ప్రతిష్ఠలయ్యెను. పుష్పవృష్టి వెలసెను. అనేక భక్తాదులు శ్రీగురుదేవుని, శ్రీచంద్రమౌళీశ్వర, శ్రీపార్వతిని (ఉమా మహేశ్వరులను) సందర్శించి ధన్యులైరి. జయజయ ధ్వనులచే తుముల ముగ మంగళవాద్యము లయ్యెను.

ఈమహా కార్యక్రమమునకు అనేక మహాత్ములు, కవులు, పండి తులేతెంచియుండిరి. గురుదేవుల ఆధ్వర్యమున మహాకార్యము మంగళ ప్రదముగ నడచెను. పిదప ప్రతిష్ఠా మండల మహాపూజయును, అన్న సంతర్పణ ఉత్సవాదులాయెను.

"శ్రోత్రియో బ్రహ్మనిష్ఠో యః ప్రశాన్త స్సమదర్శినః నిర్మమో నిరహంకారో నిర్ద్వంద్వో నిష్పరిగ్రహః అనపేక్షః శుచిః దక్షః కరుణామృతసాగరః ఏవం లక్షణ సంపన్నః సగురుర్బ్రహ్మవిత్తమః ఉపసాద్యః ప్రయత్నేన జిజ్ఞాసోః సాధ్యసిద్ధయే॥" ఈవాక్య మూలమున శ్రీవారు శ్రీగురుదేవుని లక్షణమును స్వరూప ప్రతిపాదకంబగు తాత్పర్యార్థమును చక్కగ ప్రతిపాదించుచు బోధించిరి.

ఈశ్వరుడు, సర్వజ్ఞుడు, పరమగురువునైన నన్ను తన్నుగా ఎవ రెరుగుదురో వారు ధన్యులు. ఇచట ఈశ్వరుడనగ పరబ్రహ్మ మనియే అర్థము. ఆత్మయందు గుణాద్యారోపము అనునది అవిద్యా కల్పిత

మగు దృష్టిచే ప్రకృతి తన్ను బంధించిన వానివలె, గుణమయునిగా నున్నవానివలె తోపింప జేయుట అధ్యాసయేకాని నిజము కాదని ముముక్షువు లెరుగవలెను గుణసాక్షి తాను వివేక దర్శన దృష్టిచే చలించరాదు. ప్రియాప్రియముల యందు హర్ష విషాదముల నొందరాదు. మానావమానము లందాదరముచే పరితాపము నొందరాదు. ప్రత్యగభిన్న పరమాత్మ దృష్టిచే గుణసాక్షియై యున్నానని తెలియవలయును. వ్యాపకమగు పరబ్రహ్మమే ప్రత్యగాత్మరూపమున సాక్షి చైతన్యమై, నిత్యమై. పరమానందమయమై యున్నదని యథార్థ జ్ఞానముచే నెరిగి ధన్యులు కావలెను.

సచ్చిదానందాద్వయ పరబ్రహ్మ స్వరూపుడవైన నీయందు, ఈ దృశ్యజాత మెల్లయు భ్రాంతిచే కర్తృత్వ భోక్తృత్వాది రూపేణ స్వప్నమువలె తోచుచు పారమార్థిక దృష్టిచే లేనిదై యున్నదనుట యందుసందియము లేదు. "తత్కేన కంపశ్యేత్" దానిని దేనితో చూడనగును. అది ప్రత్యక్షాదిప్రమాణ వేద్యము కాదు. "తత్త్వమసి" అది నీవై యున్నావు. ఈ ప్రసంగమున శాస్త్రము అవిద్యా కల్పితమైన భేదమును బాపుటయందు తాత్పర్యము కలదై యున్నదే కాని, శాస్త్రము బ్రహ్మతత్త్వమును ఇదే అని చూపించుట కాదు. అట్లు తెలుపుటకును రాలేదు. మరేమన మన స్వరూప భూతమగు ఆత్మయేయైయున్నందున అది విషయము గాదని తెలిపి, అవిద్యా కల్పిత వేద్యత్వము, వేత్తృత్వము, వేదన అనగా జ్ఞాతృ, జ్ఞాన,జ్ఞేయ ములను త్రిపుటిని (భేధమును) బాపునని తెలియవలెను. "నను ఆత్మా అహం ప్రత్యయ విషయత్వాత్ ఉపనిషత్స్వేవ విజ్ఞాయత ఇతి అను పపన్నం,న, తత్సాక్షి త్వేన ప్రత్యుక్తత్వాత్ నహి,అహంప్రత్యయ విషయకర్తృ వ్యతిరేకేణ తత్సాక్షీ సర్వ భూతస్థః సమః ఏకః కూటస్థః నిత్యః......" అనగా కర్తకాక సాక్షియై సర్వభూతములయందు వుండువాడై సముడై ఒక్కడై కూటస్థ నిత్యుడై యుండు పరమా

త్మయే సర్వుల ఆత్మ. అది ఏకము అది నీవను నిత్యాదిగా భాష్యార్థ ప్రసంగములను బోధించిరి.

శ్రీవారు శ్రీక్షేత్రమునందు త్రికాల పూజానుష్ఠాన శాస్త్ర శ్రవణాది గురుకార్యములచే గురునిష్ఠ నుండుచు 4.5.76 శ్రీజగద్గురు శంకరజయంతి మహోత్సవము యథా శాస్త్రముగ జరిపి ప్రస్థానత్రయ పారాయణ ప్రవచనాదులు సలిపిరి. 23.6.76 శ్రీవారి పరమగురువుల పుణ్యారాధన జరిగెను. 25.6 76 పూజ్య శ్రీవారి 57వ. జయంత్యు త్సవము విధ్యుక్తముగ నడచెను.

## 32,వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము_1976 సం॥

7.7.76 నుండి 3.11. 976 వరకు భక్తుల ప్రార్థనానుసారము మొదట 7.7.76 నుండి 9.8.76 వరకు లత్తవరము శ్రీక్షేత్ర ఉమామహేశ్వరాశ్రమము నందు, అనంతరము హాలరివి శ్రీఉమామహేశ్వరాశ్రమమున విధ్యుక్తముగ 32వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము నిత్య పూజానుష్ఠానాది వైదిక కార్యవిశేషములతో ఉపనిషద్గీతాభాష్యశ్రవణాదులు చక్కగ జరుపబడినవి. బ్రహ్మశ్రీ దేవరావు కులకర్ణి స్వామి వారు దయచేసి యుండిరి. 23.8.76 సుముహూర్తమున కుమారి శ్రీకె గాయత్రమ్మకు 'శ్రీమాత' యను తురీయాశ్రమ శుభనామమును ప్రసాదించిరి.

తదుపరి చింతకుంట మరి గూళపాళ్యం శ్రీగురుదేవాశ్రమము దయచేసి మహావ్రత నియమ నిష్ఠానుష్ఠానాదులచే వాక్యార్థ శ్రవణ ప్రసంగములను సర్వభక్త జనానంద ప్రదముగ ఉత్తమ తాత్వికవిషయములను శ్రుతపఱచిరి. ఇదే సుసమయమున ఆశ్రమ వాసులగు బ్రహ్మచారులు రామానందస్వామి, ఆచారిస్వామికి ఉత్తరాశ్రమము ననుగ్రహించి రామానందస్వామికి శ్రీపరమేశ్వరానందస్వామి యనియు, ఆచారిస్వామికి శ్రీదేవానందస్వామి యను శుభనామము

లచే తురీ యాశ్రమమును ప్రసాదించిరి.

తదుపరి శ్రీపరమగురు స్థానము బుక్కాపురం శ్రీ నిర్వాణ మఠము (ఆశ్రమము) నందు యథారీతి నిత్య నియమానుష్ఠానశాస్త్ర శ్రవణాది కార్యములచే మహావ్రతము శివప్రదముగ నడచెను. ఇచట ఈమహావ్రత మధ్యకాలమున యథాశాస్త్రముగ వైదిక విధులచే శ్రీవారి పరమగురువుల అధిష్ఠానమునందు శ్రీనళనామ సం॥ర ఆశ్వయుజ బ॥ ౫॥ బుధవారము 13.10.1976 ఉదయం 8.54 గం. లకు రోహిణీ నక్షత్ర యుక్త వృశ్చిక లగ్న శుభపుష్కరాంశయందు శ్రీ మహా గణపతి, శ్రీ ఉమామహేశ్వర శివలింగము, శ్రీపార్వతి, శ్రీ నంది, శ్రీఉమా మహేశ్వర గురుపీఠాచార్యులగు పరమగురు శ్రీశ్రీశ్రీ ప్రణవానంద సద్గురు మహాస్వాములవారి మూర్తి, ధ్వజప్రతిష్ఠలు 1976 అక్టోబర్ 11,12,13 దినములు శ్రీవారిఆధ్వర్యమున ప్రతిష్ఠా మహాకార్యము మహాత్ముల ఉపన్యాసములు భూసురుల వేదఘోషచే విధ్యుక్తముగ సాంగ మంగళముగజరిగినది. శ్రీనిర్వాణమఠము శ్రీశెట్టి ఓబులపతిగారు ఫిట్‌పర్సన్ అన్నివిధముల భక్తి ప్రపత్తులచే మహా కార్యమున పాల్గొని సేవచేసిరి. నంద్యాల మరి ఆయాపరిసర ప్రాంతముల నుండి వచ్చిన సర్వభక్తమండలివారు మహాకార్యమున పాల్గొని మహదానందము నొందిరి.

అనంతరము శ్రీవారు నంద్యాల శ్రీఉమామహేశ్వరాశ్రమమునకు దయచేసి యథారీతి తమ పూజానుష్ఠాన ఉపనిషద్బ్రహ్మ సూత్ర గీతాభాష్య ప్రవచనాదులచే నిత్యానందముగ నుండుచుతమకు తాము భాష్యమునందలి అనన్య భక్తిచే శ్రీమద్భగవద్గీతా శాంకర భాష్యము ఆంధ్రానువాదము చేయవలయునని గురునాజ్ఞగా భావించుకొనిరి.

3౭ వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము కార్తిక శుద్ధ ద్వాదశి బుధవారము 3.11.76కు శివప్రదముగ పూర్ణమాయెను. 6.11.76

నంద్యాల శ్రీఉమామహేశ్వర గురుక్షేత్రమున దీక్షావిరమణ,పూజా నుష్ఠానాన్న సంతర్పణాది కార్యములతో సర్వము సంపూర్ణమాయెను. 17.11.76 శ్రీవారి సద్గురువరేణ్యులు శ్రీమత్పూజ్యపాద శ్రీశ్రీశ్రీ సదానందసద్గురు స్వాములవారి పుణ్యారాధన మహోత్సవమువిధ్యుక్త ముగ జరిగెను.అనంతరము శ్రీగురుదేవులు కర్నూలు దయచేసి అచటి నుండి హాలరివి శ్రీఉమామహేశ్వరాశ్రమములో శ్రీమత్సూత సం హిత యజ్ఞవైభవఖండ తత్త్వప్రసంగములను శ్రవణము గావించిరి. పిదప గుంతకల్లు శ్రీఉమామహేశ్వరాశ్రమమున శ్రీగీతాజయంత్యు త్సవమునకు దయచేసిరి. అచట కొంతకాలము భగవద్గీతోపనిషద్భా ష్య శ్రవణములు చాలచక్కగ జరుపబడెను. తదుపరి హిందూపురం భక్తుల ప్రార్థనానుసారము శ్రీనరహరి ఆశ్రమమునకు దయచేసిఅచటి గురుకార్యం చూచుకొని వచ్చిరి.

అనంతరము కర్నాటక రాష్ట్రమున వేణీవీరాపురము శ్రీఉమా మహేశ్వరాశ్రమమునందు శ్రీఉమామహేశ్వరులు, శ్రీసీతారాముల ప్రతిష్ఠా మహోత్సవమునకు పుష్యమాసంలో దయచేసిరి. అచట సర్వము సంసిద్ధ మాయెను.యథారీతి శ్రీవారి ఆధ్వర్యమున స్వస్తిశ్రీ నళనామ సం॥ మాఘశుద్ధ విదియ 21.1.77 శుక్రవారము మొదలు 24.1.77 సోమవారము వరకు 4 దినములు వేదోక్తముగ శ్రీమహా గణపతి, శ్రీచంద్రమౌళీశ్వర మహాలింగము, శ్రీపార్వతి, శ్రీనందీ శ్వర, శ్రీసీతారామ లక్ష్మణాంజనేయ,ధ్వజప్రతిష్ఠ 24.1.77ఉదయం 9.15 గం॥కు కుంభలగ్న శుభపుష్కరాంశయందు విధ్యుక్తముగ జరిగెను. ఉదయసాయంకాలముల యందు ఆధ్యాత్మిక తత్త్వప్రవచన ములు ఉత్తమరీతి వెలసెను. అనేక పట్టణములు గ్రామములనుండి భక్తాదులందరు భక్తిచే నేతెంచి మహాకార్యమును వీక్షించి గురుదైవ దర్శనము నొంది ధన్యులయిరి. పూజ్యశ్రీ గురుదేవులు అచటనుండి భక్తుల ప్రార్థనానుసారము, ఉరవకొండ శ్రీకన్యకాపరమేశ్వరి ఆలయ

మునకు వేంచేసి అచట యథారీతి శాస్త్ర ప్రవచనాదులు సలిపి అనంతరము శ్రీమద్భగవద్గీతా భాష్యాంధ్రానువాద మహా కార్యార్థము హాలరివి శ్రీ ఉమామహేశ్వరాశ్రమమునకు దయచేసి శ్రీనళనామసం॥ మాఘ శు॥ ౧౩॥ బుధవారము కలశస్థాపన యొనర్చి, దీక్ష చే భాష్యాంధ్రానువాద కార్య నిమగ్నులైరి. మహాశివరాత్రి ఇచటనే జరిగెను. శ్రీగురుకరుణచే సంపూర్ణముగ శ్రీశాంకర గీతాభాష్యాంధ్రానువాద మహాకార్యము ఫాల్గుణ శుద్ధత్రయోదశి 3 3.1977 గురువారము పూర్ణమాయెను. 4.3.77 కు వేణీవీరాపురము శ్రీ ఉమామహేశ్వరాశ్రమమునకు దయచేసి అచట 5.3.77 ఫాల్గుణ శుద్ధపూర్ణిమ, ఇచ్చట ప్రతిష్ఠామహోత్సవ మండల మహాపూజ యథాశాస్త్రము విధ్యుక్తముగ జరిపిరి. సర్వులు భక్తిశ్రద్ధలచే కార్యమున పాల్గొని అన్నదాన ఉత్సవాది కార్యములు చేసిరి.

పిదప శ్రీవారు డోణేకల్లుకు దయచేసి 10 దినములు ఉపనిషద్గీతా ప్రవచనములు చేసి సర్వభక్తులకు చక్కని నైతిక ధార్మికాది ప్రబోధ యొనర్చిరి. తరువాత గుంతకల్లు శ్రీఉమామహేశ్వరాశ్రమము వేంచేసి 10 దినములు అఖండ పూజాద్యనుష్ఠానములతో 'నైష్కర్మ్యసిద్ధి' మహాగ్రంథార్థములను బోధించిరి. శ్రీరామనవమికి హాలరివి శ్రీఉమామహేశ్వరాశ్రమమునకు దయచేసి, భగవద్గీతకు ప్రతిపదార్థ (టీక) రచనయందు నిమగ్నులయి అనుదినము పూజానుష్ఠానాది కార్యములయిన పిదప ఉదయము తత్త్వమసి మహావాక్యార్థము సాయంసమయమున అధ్యాత్మ రామాయణ ప్రవచనములు. గావించిరి. అనంతరము నంద్యాల శ్రీ ఉమామహేశ్వరాశ్రమము దయచేసి అచట యమనియమాద్యనుష్ఠాన బోధకమగు ఉత్తమ విషయములచే, బ్రహ్మసూత్రభాష్య పాఠములను భక్తులకు శ్రుతిపరచిరి.

ఆ పిదప ఉత్తరము (శ్రీరత్నగిరి) శ్రీక్షేత్ర ఉమామహేశ్వ

రా[శమమునందు [శీజగద్గురు శంకరజయంతి మహోత్సవమున కేతెం చిరి. శ్రీగురుపీఠమున శ్రీజగద్గురు జయంతి 23.4.77 విధ్యుక్తముగ భాష్యశాంతిచే జరిగెను. ప్రతిదినము నిత్యనియమానుష్ఠాన సంపన్న మయి యిరుపూటలు మహావాక్యార్థ శ్రవణ ప్రసంగములు నడచెను. 12.6.77 శ్రీవారి పరమగురువుల పుణ్యారాధన మంగళ ప్రదముగ నయ్యెను. 14.6.1977 పూజ్యశ్రీచరణుల 58వ. జయంత్యుత్సవము విధ్యుక్తముగ యథారీతి శ్రీరుద్రస్వాహాకారాది విశేషవైదిక కార్య క్రమముల చేతను తత్త్వజ్ఞులగు పండితుల ప్రవచనములచేతను శ్రీగురు కరుణచే వైభవోపేతమై సర్వముశివప్రదముగనడచి పూర్ణమాయెను.

## 33. వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము-1977 సం॥

యథారీతి పూజ్యశ్రీ గురుదేవులు స్వస్తిశ్రీ పింగళ నామ సంవత్సర ఆషాఢశుద్ధ ఏకాదశి సోమవారము 27.6.1977 మొదలు కార్తిక శుద్ధద్వాదశి మంగళవారము 22.11.1977 వఱకు ఈనాలుగు మాసములు అనగా అధిక శ్రావణము కూడి 5 మాసములు భక్తుల పరమ భక్తిమయ ప్రార్థనలను మన్నించి డోణేకల్లు శ్రీవిద్యార్థి నిల యము, నంద్యాల శ్రీఉమామహేశ్వరాశ్రమము, గుంతకల్లు శ్రీఉమా మహేశ్వరాశ్రమము గూళపాళ్యము శ్రీగురుదేవాశ్రమము, లత్త వరము శ్రీక్షేత్రఉమామహేశ్వరాశ్రమము, కుందనగుర్తి శ్రీశివలింగా శ్రమము, గుత్తి శ్రీకన్యకాపరమేశ్వరి దేవస్థానము,నెల్లూరు శ్రీభగవ ద్గీతాభవనము, వేణీవీరాపురము శ్రీఉమామహేశ్వరాశ్రమము(కర్నా టకము), హాలరివి శ్రీఉమా మహేశ్వరాశ్రమము నందు శ్రీవారు ఒకొక స్థలమున ఒకొక పక్షము సన్నిధి చేయుచు (ఉండుచు) పూజానుష్ఠాన శాస్త్ర ప్రవచనాదులచే ఈ మహాకార్యమును సాంగ మంగళ మొనర్చిరి.

అస్తు : ఈ మహావ్రతమే ఒక అపూర్వముగ జరుపబడెను. శ్రీవారు సదా బ్రహ్మాత్మనాసంస్థితి నుండుచుండెడివారు. "ఇది మాకు

అప్రయత్నముగ సహజస్థితి యగుచున్నదప్పా! శ్రీగురుకృప" యను చుండిరి. మాటలే తక్కువైపోయెను. ఏకొద్దిగనో వస్తువిషయమున మాటలాడు వారైరి. 3వ.వ. శ్రీ చాతుర్మాస్యమహావ్రతము పరమ మంగళప్రదముగ పూర్ణమాయెను. "వైరాగ్యస్య ఫలం బోధో బోధ స్యోపరతిః ఫలమ్, స్వానన్దానుభవాచ్ఛాన్తి రేషైవోపరతేః ఫలమ్" అను శ్రీమదాచార్యోక్తి రీతి పూజ్యశ్రీ గురుదేవులు సంతతము తురీయస్థితి బ్రహ్మనిష్ఠచే నిత్యతృప్తి రాజిల్లుచున్నారు. ఓం తత్సత్.

శ్రీవారు తమపూజ్య గురుదేవుల పుణ్యారాధన కార్యక్రమ మును 3 దినములు విధ్యుక్తముగ జరిపిరి. మరియు శ్రీ గీతాజయంతి మహోత్సవము ఉరవకొండ శ్రీ కన్యకాపరమేశ్వరీ ఆలయమందు 10 దినములు విధ్యుక్తముగ గీతార్థప్రతిపాదన పూర్వకముగ శివప్రదమై నడచెను. ఆ పిదప శ్రీమదుత్తరాయణ పుణ్యకాలమున శ్రీగురు పూజాది కార్యక్రమములు నడచెను.

శ్రీ నిర్వాణమఠమునందు మహాశివరాత్రి కార్యక్రమమును శివపురాణ కథాశ్రవణ మహాశివరాత్రి మాహాత్మ్య ప్రబోధ అభిషేక పూజాదులు నడచి లక్షబిల్వార్చన యాయెను.

వైశాఖ శుద్ధపంచమి శ్రీశంకర జయంతి (12.5.78) విధ్యుక్త ముగ కార్యక్రమము నడచెను. ఈదినమే ఉరవకొండ శ్రీ కె.జానప్ప శ్రేష్ఠిగారు ముద్రణగావించిన శ్రీజగద్గురు శంకరచరిత్ర ద్వితీయావృత్తి పవిత్ర గ్రంథావిష్కరణమాయెను. జ్యేష్ఠ శుద్ధపూర్ణిమ మన పూజ్య గురువులు శ్రీ ఉమామహేశ్వర గురుపీఠ సమారోహణ రజతోత్స వము మంగళప్రదముగ పూజాదికార్యములచే యథాశాస్త్రము నడ చెను. అనేక మహనీయుల ఉపన్యాసములు జరిగెను. పరమేష్ఠి గురు వుల విశేషపూజాదులు శ్రీనిర్వాణమఠమునసడచెను. పిదప శ్రీ గురు దేవుల జయంత్యుత్సవము విధ్యుక్తముగ జరిగి మంగళ మాయెను.

## 34వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము 1978 సం॥

స్వస్తిశ్రీ కాళయుక్తి నామ సం॥ ఆషాఢశుద్ధ ఏకాదశి నుండి కార్తిక శుద్ధ॥ ౧౨॥ వరకు ఈ నాలుగుమాసములు యథారీతి యథాశాస్త్రముగ ఆ యా స్థానములందు మహావ్రతము శ్రీ ఉషా మహేశ్వర గురుపీఠాచార్యులు శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమత్పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శంకరానంద గిరిగురుస్వాముల వారిచే విధ్యుక్తముగ ఆచరింపబడెను. వ్రతమహాకార్యాంగము లెల్లయు శివప్రదముగ నడచి సాంగమంగళ మాయెను.

శ్రీకాళయుక్తి నామ సం॥ కార్తిక బహుళ దశమి, ఏకాదశి ద్వాదశి శ్రీవారి అధ్యక్షతన శ్రీవారి గురుదేవుల 25వ. పుణ్యారారాధన రజతోత్సవము గూళపాళ్యం శ్రీ గురుదేవాశ్రమమందు వైదిక పూజా కార్యక్రమాదులచే మహాత్ముల మహోపన్యాసములతో గురు మహాకార్యము శివప్రదముగ నడచి పూర్ణమాయెను.

ఈ మహాకార్యమునకు పూజ్యశ్రీ రామకృష్ణానందస్వాములు దయచేసి వారి పవిత్రహస్తములచే ఆశ్రమ నూతనభవన ప్రవేశోత్సవము, మరియు హృషికేశం శ్రీదేవానంద సద్గురు స్వామివారి పావన హస్తములతో పూజ్యపాద శ్రీసదానంద సద్గురుస్వామివారి రజత దివ్యమూర్తి ఆవిష్కరణ మహోత్సవము విధ్యుక్తముగ నడచెను. శ్రీపూర్ణానందస్వామి ప్రభృతులు దయచేసి యుండిరి. బ్రహ్మశ్రీ బాలవిశ్వనాథశర్మ పండితులు వైదికకార్యక్రమములు నిర్వర్తించిరి. సర్వజనానందప్రదముగ నడచెను. భక్తులు భక్తితో ఆచరించిన జప నియమ నిష్ఠ విధానములను శ్రీసన్నిధి విన్నవించి అర్పించిరి. ఆగ్రామము వారు మరియు చుట్టుముట్టు గ్రామముల భక్తాదులు కార్యక్రమమునందు భాగము వహించి సేవజేసిరి. ప్రశంసనీయము.

# బ్రహ్మసభాభవన ప్రవేశోత్సవము

1.2.79 మొదలు 3.2.79 వరకు నంద్యాల శ్రీఉమామహేశ్వరాశ్రమమునందు పూజ్యశ్రీవారి ఆధ్వర్యమున శాస్త్రోక్తముగ నూతన బ్రహ్మసభాభవన ప్రవేశోత్సవము మరియు శ్రీ ఉమామహేశ్వర గురుపీఠపరంపరాచార్యులు శ్రీ శ్రీ శ్రీ ప్రణవానంద సద్గురు మహాస్వామి శ్రీపాదుల అమృతశిలామూర్తి ఆవిష్కరణోత్సవ కార్యక్రమము నిత్యానంద ప్రదముగ నడచెను.

పూజ్యశ్రీ బోధానందపురిస్వామి మహారాజ్ (విశ్వనాథమఠ్ పశ్చిమగోదావరి) వీరి అమృతహస్తములచే బ్రహ్మసభాభవన ప్రవేశోత్సవము శ్రీ పరమేష్ఠిగురు అమృతశిలామూర్తి ఆవిష్కరణోత్సవము జరుపబడెను. పిదప ప్రస్తుత శ్రీ ఉమామహేశ్వర గురుపీఠాచార్యులగు పూజ్యశ్రీ గురువుల గురుపీఠ సమారోహణ రజతోత్సవ మహాసభ మంగళాచరణముగ ప్రారంభమై శ్రీ భద్రిశెట్టి శంకరప్ప బి.ఏ; శ్రీ యస్. మోహనరావ్ వీరిచే స్వాగతోపన్యాసము లాయెను. అడ్వకేట్ శ్రీ యస్. ఓబులపతి గారిచే పరిచయవాక్యములు చెప్పబడెను.

ఈమహాసభకుదయచేసినపూజశ్రీ రామకృష్ణానందస్వాములు, శ్రీబోధానందపురి స్వాములు, శ్రీపూర్ణానంద స్వాములు (నెల్లూరు) శ్రీసిద్ధేశ్వరానందస్వాములు మొదలగు మహనీయులు బ్రహ్మశ్రీ రామచంద్రమూర్తి పండితులు వీరందరు అపూర్వమగు తమ ఆధ్యాత్మికోపన్యాసములు సలిపిరి. మహదానందప్రదముగ కార్యక్రమము నడచెను. ఈమహాకార్యక్రమ నిర్వాహకసదస్యులు మరియు సర్వభక్తులు అనన్య శ్రద్ధాభక్తులచే సేవయొనర్చి ధన్యులయిరి.

శ్రీక్షేత్రమునందు శ్రీశంకర జయంతి మహోత్సవము విధ్యుక్తముగ నడచెను. పరమేష్ఠి గురువుల పూజ, శ్రీగురుదేవుల జయంత్యుత్సవములు శివప్రదమై జరిగెను.

## 35వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము 1979 సం॥
## శ్రీక్షేత్ర (రత్నగిరి) లత్తవరము-ఉరవకొండ

స్వస్తిశ్రీ సిద్ధార్థి నామ సం॥ ఆషాఢ శుద్ధ ఏకాదశి మొదలు కార్తిక శుద్ధ ద్వాదశి వరకు ఈ నాలుగు మాసములు యథారీతి విధ్యుక్తముగ త్రికాల పూజానుష్ఠాన శాస్త్రశ్రవణాదులతో సాంగోపాంగముగ నడచెను.

అనుదినము వైదిక పూజానుష్ఠానములచే కోటి బిల్వార్చన నియమము, ప్రస్థానత్రయ పారాయణము రెండు వేళలయందు విచారసాగరగ్రంథము మరియు గీతాశాస్త్రశ్రవణము రెండు మాసములు అపూర్వముగ నడచెను.

ఈ మహావ్రత మధ్య స్కాందపురాణాంతర్గత శివమహాపురాణము ప్రత్యేకముగ ఒక సమయమున ప్రవచనము జరుపబడుచు 1.9.79 తేది శాస్త్రోక్తముగ శ్రీచంద్రమౌళీశ్వరునకు సహస్రఘటాభిషేకము కోటి బిల్వార్చన జరిగి రాజోపచారాదులచే మహామంగళమాయెను.

ఈసుసమయమున శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర ౧౦౦౮ శ్రీ మజ్జగద్గురు వాగీశ పండితారాధ్య శివాచార్య మహాస్వామివారి దివ్యసన్నిధినుండి 18.8.79 తేది ఆశీః పూర్వకమగు శ్రీముఖమొకటి ప్రసాదింపబడెను. "ఆత్మీయులు శ్రీక్షేత్ర ఉమామహేశ్వరాశ్రమ అధ్యక్షులగు "బ్రహ్మర్షి" శ్రీశ్రీశ్రీ శంకరానందగిరి స్వామివారికి అనంత శుభాశీర్వాదములు తపోనుష్ఠానములచే జగత్కల్యాణమునకై ఆయుస్సునే ధారవోసి యుండు మీ 35వ. శ్రీచాతుర్మాస్య పూజానుష్ఠానాదులు,కోటిబిల్వార్చనచే 1.9.79 సాంగమగుచున్నది. వేద్యమై పరమానందమాయెను......"

ఇత్యాశిషః

ఇదే విధముగ అవ్యాజ కృపావిశేషమున శ్రీక్షేత్ర కాశీజ్ఞాన

సింహాసనాధీశ్వర శ్రీమజ్జగద్గురు ౧౦౦౦౦ విశ్వేశ్వర శివాచార్య మహా స్వాములవారి సన్నిధినుండి శుభాశీః పూర్వకమయిన శ్రీముఖము వచ్చెను. మరియు శ్రీ శ్రీ శ్రీ జగద్గురు శంకరాచార్య మహాసంస్థాన దక్షిణామ్నాయ శ్రీశారదా పీఠాధీశ్వర శృంగేరి ౧౦౦౦౦ జగద్గురు శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వామివారి సన్నిధినుండియు శుభాశీః పూర్వకంబగు శ్రీముఖమువచ్చెను. ఈకార్యములందు శ్రీజగద్గురువుల కృపాశీర్వాదరూప శ్రీముఖములు అందరికి మహదానందమును కలుగజేసెను.

ఉత్తరం శ్రీక్షేత్రఉమామహేశ్వరాశ్రమమునందు 27.1.80 మొదలు 31.1.80 వరకు 5దినములు బ్రహ్మజ్ఞాన సత్రమహోత్సవము మరియు మన శ్రీగురుదేవుల షష్ట్యబ్ది మహోత్సవము భక్తాదులచే అనన్య భక్త్యుత్సాహములతో బృహద్రూపముగ జరుపబడెను.

ఈమహాకార్యమునకు "కావ్యతీర్థ" 'సాహిత్యాచార్య' 'వేదాంతాచార్య' వరకవీశ్వరులు శ్రీశైల సింహాసనాధీశ్వర ౧౦౦౦౦ శ్రీమజ్జగద్గురు వాగీశ పండితారాధ్య శివాచార్య మహాస్వాముల వారు దయతో 30.1.80 తేదీన శ్రీక్షేత్రమునకు దయచేసి అనుగ్రహ భాషణ మొనర్చి మహదానందమును కలుగజేసిరి.

ఈకార్యమునకు శ్రీబోధానందపురి స్వాములవారు, శ్రీరామకృష్ణానందస్వాములవారు, శ్రీపూర్ణానందస్వాములవారు శ్రీయోగిని మాత (విశ్వనాథమఠం) శ్రీసదానందస్వామి, శ్రీత్రివిక్రమానంద స్వామి, శ్రీభూమానందస్వాములవారు, శ్రీసోమనాథానంద స్వాముల వారు (సురపురము) శ్రీదేవరాయ కులకర్ణిస్వాములవారు మొదలగు మహనీయులు దయచేసి అవ్యాజ ప్రేమతో తమ అపూర్వమైన ఆధ్యాత్మికోపన్యాసములు జేసి సర్వులకు నిత్యానందమును గలుగ జేసిరి. ఆశ్రమవాసులైన శ్రీశివానందస్వామివారి సేవ అనంతమైనది. ఈమహాకార్యమునందు ఆదవాని శ్రీయలే మల్లేశప్పగారి కుటుంబం

వారందరు మరియు లత్తవరం, ఉరవకొండ అంతేకాదు, అనేక పట్టణ ములు పల్లెలు మొదలైన పరిసరప్రాంతముల భక్తాదులందరు అపూర్వమగు సేవయొనర్చి గురుకృపాపాత్రులయిరి. అనంతపురం బ్రహ్మశ్రీయం. బాలవిశ్వనాథశర్మ పండితులు తనుపరివారముతో వైదిక కార్యములు నిర్వర్తించిరి.

ఈ మహోత్సవ కార్యనిర్వాహక సంఘ అధ్యక్షులు గుంతకల్లు సుధీవర శ్రీవంకదారు రామకృష్ణయ్యగారు స్వాగతోపన్యాసము చేసిరి.

బహిర్ముఖ వృత్తియే బంధము. గురుతత్త్వము ఆత్మయేయను అంతుర్ముఖ వృత్తియే ముక్తి.

వేదములు త్రిగుణాత్మకమైన కార్యప్రపంచమునే చెప్పచున్నవి. బ్రహ్మతత్త్వము అవాఙ్మానస గోచరము. వేదములు ఈ కర్మానుష్ఠానములు నిన్ను దాటించువరకు ఉండును. అర్థాత్ భ్రాంతి దూరమగునంత పర్యంతము ఉపయోగమై విరామమొందును.' అభయం వై జనక ప్రాప్తోసి' ఓ జనక సార్వభౌమా ! నీవు అభయత్వమును పొందిన వాడవైతివి. అని బృహదారణ్యకోపనిషత్తునందు ప్రయోగింపబడిన అభయ శబ్దమునకు బ్రహ్మమని అర్థము చెప్పకొనవలెను.

బ్రహ్మజ్ఞాని బ్రహ్మమే కావున ఆతనికి జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలులేవు. బ్రహ్మానుభవ స్వరూపమే ఆతని స్థితి.

సుషుప్త్యావస్థయందు అజ్ఞానమున్నదని కొందరు లేదు అని కొందరు చెప్పదురు. కాని లేని అజ్ఞానము వున్నదన్న ఎంతర్థమో లేదన్న అంతే అర్థము. ఉండునది బ్రహ్మమే అది అద్వితీయమను దృష్టిలేనందున అవస్థలుగా దోచెను. అంతే నిద్ర యందుండునది బ్రహ్మమే మెలకువ నందును స్వప్నమునందును, అదే.

"యశ్యత్వస్య సర్వమాత్మైవా భూత్తత్కేనకం పశ్యేత్" అన్నట్లు సర్వము తానెయను (ఆత్మేయగు) తాను దేనిని దేనిచే చూచును. సాధ్యసాధనములు లేవు. కన్నుమూసినను తెరచినను అస్తి భాతిప్రియ స్వరూపమగు తన్నే చూచును. "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" బ్రహ్మము నెరిగిన యతడు బ్రహ్మమేయగును.

ఒకే చిత్తు చలమై అచలమయ్యును అగపడుచున్నది. ధ్యానానుష్ఠానములచే చిత్తము అంతర్ధానము కాగా చిద్రూపుడైన బ్రహ్మమే నీవు 'ప్రజ్ఞానం బ్రహ్మ' నీచిత్తము సంకల్పాకార వృత్తిగాకున్న నీవు పరమాత్మయే నీ ఆలోచనలు నిన్ను మూయుచున్నవి. అహం వృత్తి నిశ్చలమగుటయే బ్రహ్మత్వము.

శ్రీక్షేత్రమునందు శ్రీశంకర జయంతి మహోత్సవము విధ్యుక్తముగ నడచెను. పరమేష్ఠి గురువుల పుణ్యారాధనపూజ, శ్రీగురుదేవుల జయంత్యుత్సవములు మంగళప్రదముగ జరిగెను.

భీమప్ప అను వటువునకు శ్రీమహేశ్వరానందస్వామియను తురీయాశ్రమ శుభనామమును ప్రసాదించిరి.

## 36.వ. శ్రీచాతుర్మాస్యమహావ్రతము- బళ్లారి-1980 సం॥

స్వస్తిశ్రీ రౌద్రినామ సం॥ ఆషాఢ శుద్ధ ఏకాదశి 23.7.80 బుధవారము మొదలు కార్తిక శుద్ధ ద్వాదశి బుధవారము 19.11.80 వరకు ఈ నాలుగు మాసములు-3పట్టములు 12 x 3=36 అనగా 12+12+12 సంవత్సరములు ఇట్లు 36 సంవత్సరములయినందున ఈ సంవత్సరము శ్రీచాతుర్మాస్య మహావ్రతము నాలుగు మాసములు శ్రీవారు ఒకేచోటునందుండుచు విధ్యుక్తముగ జరిపిరి. బళ్ళారి తేరు బజారు శ్రీరామానుజ నివాస్ ధర్మనిలయమునందు త్రికాల పూజానుష్ఠానాదులచే శాస్త్రోక్తముగ మహావ్రతము ప్రారంభింపబడి సాంగమంగళముగ నడచెను.

ప్రాతఃకాలము ఉపనిషద్భాష్య ప్రవచనము సాయం సమయమున 7గం॥నుండి 8 గంటలవరకు శ్రీబాలాంజనేయస్వామి దేవస్థానమునందు గీతాభాష్య ప్రవచనము జరుపబడెను. ఈ మహాప్రవత మధ్యకాలమున శ్రీచంద్రమౌళీశ్వరునకు సహస్ర ఘటాభిషేక సర్వోపచారాది విశేషపూజలు నడచెను.

17.11.80 సోమవారం మహాన్యాస పూర్వక ఏకాదశవారశ్రీరుద్రాభిషేకము రుద్ర త్రిశతినామ పూజ లక్షరుద్ర స్వాహాకార,నవగ్రహ శాంతిహోమ, పూర్ణాహుతి మొదలగు కార్యక్రమములు విధ్యుక్తముగ నడచెను.

17.11.80 సాయంకాలము శ్రీబాలాంజనేయస్వామి ఆలయమునందు పూజ్యశ్రీ వారిచే ఆంధ్రీకరింపబడిన శ్రీమద్భగవద్గీతా శాంకర భాష్య మహాగ్రంథావిష్కరణము, శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమత్పూజ్యపాద హృషీకేశం శ్రీశివానందాశ్రమము శ్రీ దేవానందస్వాములవారి అమృతహస్తములచే విధ్యుక్తముగ జరుపబడెను.

ఆమహాసభయందు బ్రహ్మశ్రీ యం. బాలవిశ్వనాథశర్మ పండితులు బ్రహ్మశ్రీనీలకంఠశాస్త్రిలు,బ్రహ్మశ్రీ భాస్కర సిద్ధాంతి పండితులు షడ్బ్రహ్మశ్రీ శి.వ. చన్నబసవేశ్వరస్వామి పండితులు మొదలయినవారు తమ అపూర్వమగు ధార్మిక, ఆధ్యాత్మికాది విషయములు మరియు భాష్యవిషయముల ఉపన్యాసములుజేసిరి. కొందరు పండితులు, కవులు, తమతమ కవనములచే సంస్కృత, కర్నాటక పద్యములు జదివి శ్రీసన్నిధి సమర్పించిరి.శ్రీవారి అధ్యక్షతన ఈమహాసభ ఎంతో ఆనందదాయకముగ నడచెను.

బళ్ళారి శ్రీ యన్. నారాయణప్పగారు ఈ కార్యమునకు దయచేసిన మహాత్ములకు పండితులకు సన్మాన మొనర్చిరి. డివైన్

లైఫ్ సంస్థ శ్రీ టి. వెంకయ్యశ్రేష్ఠిగారు అనన్యయగు భక్తిచే సేవ యొనర్చిరి. బళ్ళారి పట్టణమున అనేకభక్తులు నాలుగు మాసములు అఖండముగ సేవయొనర్చుచు అవ్యాహతమగు పూజానుష్ఠాన శాస్త్ర శ్రవణాదులచే అందరు సంతృప్తులైరి. భూరి అన్నదాన మొనర్చిరి. వారందరు ఎంతో మహాపుణ్యాత్ములు. అనంతపురం జిల్లా రాయదుర్గం తాలూకా పులకుర్తి గ్రామంలో శ్రీఉమామహేశ్వరాశ్రమ స్థాపన విధ్యుక్తముగ జరిగెను. శ్రీ డి. వీరభద్రగౌడు పుణ్యదంపతులసేవ.

గుంతకల్లు శ్రీఉమామహేశ్వరాశ్రమమునందు 2.12.80 మొదలు 3 దినములు శ్రీవారిగురువుల పుణ్యారాధన మహోత్సవము విధ్యుక్తముగ అత్యంత వైభవోపేతమై సర్వజనానందముగ నడచెను. శ్రీ పూర్ణానందస్వామివారు, శ్రీ దేవానందస్వామివారు శ్రీశారదాప్రియానందస్వామివారిని (చిన్మయమిషన్) శ్రీ అడివి స్వాములు శ్రీ యమ్. బాలవిశ్వనాథ శర్మ, శ్రీ యన్. రామారావు మొదలగు మహనీయుల పండితుల ఉపన్యాసములు చక్కగ నడచెను. బృహద్రూపమగుయా సభ చూచుటకును వినుటకును శివసభయై వెలుగొందెను.

శ్రీదుర్ముఖి నామ సం॥ వైశాఖ శుద్ధపంచమి శ్రీశంకరజయంతి మహోత్సవము శ్రీక్షేత్రమున శివప్రదముగ ఆయెను మరియు శ్రీవారి పరమ గురువుల పుణ్యారాధన శ్రీ నిర్వాణపురమున మంగళప్రదముగ నడచెను. అనంతరము 1981 సం॥ మన శ్రీగురుదేవుల జయంత్యుత్సవము జయప్రదముగ జరిగెను.

సర్వసాధారణముగ మానవుల అనుభవము నందుండు ఆనంద మేది గలదో అది నిజమగు ఆనందము గాదు. ఈవిషయము బుద్ధిమంతులగు వారికి అర్ధముగాక యుండదు. ఎట్లనిన అదే పూర్ణమయిన ఆనందమైయుండిన పక్షమున ఆతనియందు అసంతృప్తి. అసూయకు అవకాశముండుట అసంభవము. అందువలన అది నిజమగు ఆనందము గాదు. నిజానందమనునది ఉండునది పోవునది కాదు. అది సహజస్థితి.

అవిద్య యనునది తత్త్వతః లేనిదే యైనందున ఈవిషయమున అవిద్య బ్రహ్మాశ్రయమై యున్నదన్నను సరే, లేదన్నను సరే. లేని పదార్థము ఒకదాని నాశ్రయించి ఉన్నదను లేక లేదను వ్యవహారము వస్తుతః సమంజసము కాదు. బ్రహ్మస్వరూపమునందు ఏ సంబంధ మును లేదని ముముక్షువులు తెలియవలెను 'అహమజ్ఞః' అను వ్యావ హారిక అనుభవము ఆధ్యాసిక బుద్ధిచే నయినది. కావున లేనిదని అర్థము. మాయయనునది తద్వారా సుఖదుఃఖ సంసారమనునది తప్ప తెలివిచే తమయందున్నట్లు భానమగును. జ్ఞానోదయానంతరము అది అగపడదు. ఎట్టి దుఃఖముగాని ఆత్మకుపరితాపము నివ్వజాలదు. ఛాయామాత్రముగ నగుపడినను బంధము కలుగజేయదు.

## 37.వ. శ్రీ చాతుర్మాస్య మహావ్రతము-కణేకల్లు నంద్యాల, గూళపాళ్యము. _ 1981 సం॥

స్వస్తి శ్రీ దుర్ముఖ నామ సం॥ ఆషాఢ శుద్ధ ఏకాదశి 12.7.81 మొదలు కార్తిక శుద్ధ ద్వాదశి 9.10.81 వరకు ఈ నాలుగు మాస ములు మహావ్రతము విధ్యుక్తముగ ప్రారంభింపబడి మంగళాంతమా యెను. కణేకల్లు స్వయంభూ ఈశ్వరాలయమునందు శ్రీవారి పూజా ప్రవచనాది కార్యములు మహదానందముగ నడచెను. పండిత మహో దయులు, భక్తులు, అత్యంతప్రియముగ శ్రీసన్నిధియందు కార్యక్రమ మున పాల్గొని వాక్యార్థశ్రవణములు జేసిరి. చివరిదినము ఉత్తమరీతి పండితులు ఉపన్యసించిరి. గుణవంతులు గురుభక్తులైన బ్రహ్మచారి శ్రీ ప్రణవానంద తెలుగుపండితులు, మరియు యన్. క్రిష్ణయ్యశెట్టి శ్రీ ఆర్. రామచంద్రయ్య, శ్రీవిశ్వనాథ్ మొదలైనవారు భక్తితో చూచుకొనిరి. కార్తిక శుద్ధపూర్ణిమకు శ్రీక్షేత్రమున దీక్షావిరమణ, పూజ, లక్షదీపార్చన కార్యములు నడచెను.

శ్రీవారి గురువుల పుణ్యారాధన గుంతకల్లు ఆశ్రమమున

అత్యంతవైభవముగ జరిగెను. మొదటివలె మహాత్ములు ఆగమించి యుండిరి.

బ్రహ్మానుభవము గలుగ-నిజనిష్ఠ దృఢమైన పిదప ఏ సంబంధమును ఉండదు. సాక్షియగు తాను బ్రహ్మమే కర్తృత్వాభిమానము లేనపుడు ఆతనిని పుణ్యపాపములు స్పృశించుటకు అచట తావుండదు శివుడే తాను.

## 38వ శ్రీ చాతుర్మాస్య మహావ్రతము శ్రీశైలమహాక్షేత్రము శ్రీవాసవీ సత్రము - 1982 సం॥

స్వస్తి శ్రీ దుందుభి నామ సం॥ ఆషాఢ శుద్ధ ఏకాదశి 1.7.82 మొదలు భాద్రపద శుద్ధ ద్వాదశి 31.8.82 వరకు 2 మాసములు శ్రీశైల శ్రీమల్లిఖార్జున జ్యోతిర్లింగ మహాసన్నిధియందు శ్రీవాసవీ సత్ర పవిత్రస్థానములో విధ్యుక్తముగ త్రికాల పూజానుష్ఠాన ప్రస్థాన త్రయ భాష్య ప్రవచనాదులచే ఈ మహావ్రతము కైలాసప్రదమై నడచెను.

శ్రీవాసవి సత్రము పుణ్యాత్ములైన యజమానులు మరియు ఆ పరివారము ఎల్లజనులు శ్రీ గురువులను అత్యంత భక్తిశ్రద్ధలతో చూచుకొనిరి. వారికి శ్రీవారు 'పుణ్యధనులు' అను మెరిట్ ప్రసాదించిరి. శ్రీభ్రమరాంబా సహిత శ్రీ మల్లిఖార్జునస్వామి దేవాలయం ఛేర్మన్-డా॥ పైడిలక్ష్మయ్యగారు ఎంతో ప్రేమచే శ్రీవారు వ్రతమాచరించు సత్రమునకు వచ్చి సందర్శించి, తాము ఉపన్యసించి 'పూజ్యస్వామీ ! ఈసంవత్సరమంతేకాదు. ఇకముందు రెండు సంవత్సరములు ఈ శ్రీశైలమహాక్షేత్రమునందే తాము చాతుర్మాస్య మహావ్రతము సలుపవలెను. దానికి వలయు సేవలెల్లయు మేమే చేసెదము మహాప్రసాదము అని ప్రేమాదరమున తెలుపుచు గురుకానుకను సమర్పించి "శీతాంశోరమృతార్పణమ్మను క్రియన్ జేకొమ్ము

ప్రజ్ఞానిధీ!" అనుచు భక్తితో బలికిరి. సభయందున్న సర్వులు సంత సించిరి. ఈ మహావ్రతము శ్రీశైల మహాక్షేత్రమునందు శ్రీవారు జరుపుట ఒక అపూర్వము. అసంఖ్యాక భక్తాదులు శ్రీశైలక్షేత్ర మున శ్రీసన్నిధికి వచ్చి వెళ్ళుచు శ్రవణ పూజాదులచే మహాపర్వ ముగ భావించి ఆనందించుచుండిరి.

ఇచ్చట శ్రీగిరి మల్లినాథుని కృపచే రెండుమాసములు నియమ నిష్ఠలతో వ్రతము అవిచ్ఛిన్నముగ నడచి చివర శ్రీమల్లినాథ భ్రమ రాంబలకు పూజాదులు జేసి విశేష అన్నదానాదులతో మహావ్రతము సాంగమంగళమాయెను. అనంతరము అధికమాసముతో సహా తక్కిన మూడు నెలలు వ్రతము ఆయాస్థానము లందు విధ్యుక్తముగ జరిగి సమాప్తమయ్యెను. శ్రీ క్షేత్ర ఆశ్రమమునందు దీక్షా విరమణమై పూజాదికార్యక్రమము మంగళప్రదముగ జరిగెను. శ్రీవారి అధ్యక్షతన తమ గురుదేవుల పుణ్యారాధన గుంతకల్లు శ్రీఉమామహేశ్వ ఆశ్రమ మున విధ్యుక్తముగ నడచెను. విశాలప్రాంగణ సభామంటపమునందు ఆగమించిన మహాత్ములను పూర్ణకుంభముచే స్వాగతపరచి సభాకార్య క్రమము యథారీతి 3 దినములు మహాత్ముల దివ్యోపన్యాసములచే అపూర్వముగ జరిగి పూర్ణమాయెను. ముందు ప్రతి సంవత్సరము వలె జయంత్యుత్సవాదులు మంగళప్రదముగ నయ్యెను.

సువివేక సంపన్నులు శ్రీ ఎ. శాంతారామ్ మొదలగు పట్టణ భక్తాదులు పూజ్యశ్రీవారిని గుంటూరు పట్టణమునకు ఆహ్వానమొనర్చి తేది. 19.1.1983 పట్టాభిపురం శ్రీ హరిహర దివ్యక్షేత్రమునందు శ్రీవారి ఆధ్యాత్మికోపన్యాస కార్యక్రమమును ఏర్పరచి వారము రోజులు గొప్పదగు మహాసభను గావింపజేసి అందఱును మహదా నందము నొందిరి

వెల్‌కమ్ ప్రెస్ యజమానులు బ్రహ్మశ్రీ పి. రామకృష్ణ మూర్తి గారు శ్రీవారి స్వాగతవాక్యములు వ్రాసి సమర్పించిరి.

తెలుగు పండితులు శ్రీప్రణవానంద బ్రహ్మచారి పరిచయవాక్యములు పలికిరి.

## 39.వ. శ్రీచాతుర్మాస్య మహావ్రతము–1983 సం॥
## వేణీవీరాపురము ఆశ్రమము-కర్నాటక
## నిర్వాణమఠము

స్వస్తిశ్రీ రుధిరోద్గారి నామ సం॥ ఆషాఢ శు॥ ॥౧౧॥20.7.83 మొదలు కార్తిక శుద్ధ ద్వాదశి 17.11.83 వరకు యథాశాస్త్రముగ నాలుగు మాసములు మహదానంద ప్రదమై ముముక్షు జనోత్తారక మైన సాధన, సిద్ధావస్థ విషకంబగు బ్రహ్మతత్త్వ ప్రబోధ త్రికాల పూజానుష్ఠానములు మరియు జీవన్ముక్తి ప్రకాశిక గ్రంథప్రవచనము, గీతాశాస్త్ర శ్రవణాదుల చేతను మంగళప్రదముగ నడచి పూర్ణ మాయెను.

ఈ వ్రతమధ్యకాలమందు వేణీవీరాపురం శ్రీఉమామహేశ్వరాశ్రమములో శ్రీచక్ర, నవగ్రహాది, ప్రతిష్ఠలు వేదోక్తముగ జరిగెను. బళ్ళారి శ్రీలింగారెడ్డిగారు వీరి సతీమణి శ్రీమతి సువేణమ్మగారు ఈమహాకార్యమును త్యాగపూర్వకముగభక్తిభావములచే శ్రీగురుపరమాత్మ సేవగ యొనర్చిరి. తక్కిన సర్వభక్తులును అత్యుత్తమరీతి సహకరించి సేవజేసిరి. ఉత్తవరము శ్రీ క్షేత్రమున కార్తికశుద్ధపూర్ణిమకు దీక్షావిరమణ కార్యక్రమము నడచి పూజాది కార్యములచే లక్షబిల్వార్చన దీపార్చనలు జరిగెను. శ్రీవారి గురు దేవుల పుణ్యారాధన పూజాకార్యక్రమము మహాత్ముల ఉపన్యాసములు యథావిధి 3 దినములు గంజిగుంట శ్రీమఠమున అపూర్వముగ నడచెను.

## 40 వ శ్రీ చాతుర్మాస్య మహావ్రతము - 1984 సం॥
## గంజిగుంట శ్రీమఠము - నంద్యాల

స్వస్తిశ్రీ రక్తాక్షి నామ సం॥ ఆషాఢ శుద్ధ॥ ౧౧ మొదలు 9 7.84 కార్తిక శుద్ధ॥ ౧౨॥ 5.11.84 వరకు ఈనాలుగు మాసములు పూర్వ మహావ్రతముల వలె విధ్యుక్తముగ ప్రారంభింపబడి త్రికాల పూజానుష్ఠాన ప్రస్థానత్రయ శాస్త్రప్రవచములచే మహదానందముగ నడచెను. ఇదే విధముగ ఆ యా స్థానములందును కార్యక్రమము శివ ప్రదముగ నడచి మహావ్రతము సమాప్తమాయెను.

శ్రీ ఉమామహేశ్వర గురుపీఠము శ్రీనిర్వాణమఠము నందు పరమేష్ఠి గురువులచే విరచితంబైనకైవల్యనవనీతసారసంగ్రహమనుగ్రంథమును పరిశీలించి మూడవ ముద్రణకుసిద్ధపరచి ముద్రింపించిరి.మరియు 'శ్రీ శివకవచము' అను గ్రంథమునకు ఆంధ్రతాత్పర్యభావార్థములను రచించి ముద్రణ గావింపజేసిరి.

శ్రీ ఉమామహేశ్వరగురుపీఠం గంజిగుంట శ్రీమఠము శ్రీసద్గురు ప్రణవానందాశ్రమమున శ్రీవారి గురుదేవుల పుణ్యారాధన మహోత్సవము శ్రీవారి ఆధ్వర్యమున ఆనందప్రదముగ నడచెను. పూజ్యశ్రీ రామకృష్ణానందస్వామివారు, శ్రీపూర్ణానందస్వామివారు, ఋషీకేశం శ్రీదేవానందస్వామివారు, తెనాలి నిర్మలానంద స్వామివారు, శ్రీరమణానంద స్వామివారు హైదరాబాదు మొదలగు మహాత్ములు దయచేసి ఉత్తమకీర్తి ఉపన్యసించిరి. కార్యక్రమము అమోఘమై జరిగెను. అనంతరము శ్రీగీతాజయంతి మహోత్సవము గుంతకల్లు శ్రీ ఉమామహేశ్వరాశ్రమమున శ్రీగీతామూర్తి సన్నిధియందు శివప్రదముగ నడచెను.

శ్రీవారు నంద్యాల ఆశ్రమము దయచేసిరి. ఇచ్చట భక్తుడగు శ్రీసదాశివ (బి. యస్‌సి.) అనుబ్రహ్మచారికి సుముహూర్తమున

విధ్యుక్తముగ శ్రీ సదానందస్వామి యను తురీయాశ్రమ శుభనామ మును ప్రసాదించిరి.

17.2.84 రుధిరోద్గారి మాఘ శుద్ధ పూర్ణిమ శుక్రవారము మొదలు బహుళ తదియ వరకు నంద్యాల పట్టణము శ్రీ ఉమామహే శ్వర ఆశ్రమము బ్రహ్మసభామంటపములో పూజ్యశ్రీస్వామివారిచే రచింపబడిన ప్రస్థానత్రయ మహాగ్రంథ ద్వితీయముద్రణ బ్రహ్మశ్రీ యం. బాలవిశ్వనాథశర్మ పండితులచే ఆవిష్కరణ మహోత్సవము విధ్యుక్తముగ నడచెను. మహాత్ములుపూజ్యశ్రీపూర్ణానందస్వాములు, శ్రీవిద్యానంద స్వాములు, శ్రీదేవానందస్వాములు, శ్రీకులకర్ణిస్వామి (బెంగుళూరు) శ్రీరామచంద్రమూర్తి సంస్కృతపండితులు (ఆదోని) శ్రీయన్.రామారావు కార్యక్రమమునకు ఆగమించి యుండిరి.

పురప్రముఖులు భక్తులు మరి సర్వులు భక్తి శ్రద్ధలతో మహా సభకు వచ్చి ఉత్తమహనీయుల బ్రహ్మవిద్యోపదేశకాత్మకమైన మహోపన్యాసములను శ్రవణముజేసి తృప్తులైరి. శ్రీవారి సమక్షమున సర్వకార్యములు శివప్రదముగ నడచెను.ప్రస్థానత్రయ గ్రంథములను అనేక పండితులకు భక్తులకు యిచ్చుట ఆయెను.

19.2.84 ఆదవాని పాడాగల్లు గిరెప్పశెట్టిగారి కుమారుడు గుణవంతుడు శ్రీ పి. సత్యనారాయణ బ్రహ్మచారికి శ్రీచంద్రశేఖరా నందస్వామియను తురీయాశ్రమ శుభనామము ప్రసాదింపబడెను, వీరి సోదరులు మొదలగు వారి కుటుంబము వారందరును భక్తి శ్రద్ధలతో ఈ కార్యక్రమమునకు గొప్పగా ఖర్చుచేసిన పుణ్యాత్ములు ఈకార్య క్రమం పూర్వాంగమగు కర్మకలాపములు కల్పోక్తముగ భూసురోత్త ములగు పండితులచే నిర్వహింపబడెను.

అనంతరము లత్తవరము శ్రీక్షేత్రమునందు శ్రీశంకరజయంతి, శ్రీ నిర్వాణమఠమునందు పరమగురువుల పూజ మరి శ్రీగురుదేవుల జయంత్యుత్సవము మంగళప్రదముగ నడచెను.

ఆళ్ళగడ్డ తాలూక ఆలమూరు శ్రీ ఉమామహేశ్వర గురుపీఠ శ్రీ ఉమామహేశ్వర ఆశ్రమమునందు 27.4.85 శ్రీ సద్గురు కుటీర ప్రవేశ కార్యక్రమము జరిగెను. మరియు క్రోధన నామ సం॥ వైశాఖ ॥శు॥౯॥ 29.4.85 మొదలు ఏకాదశి 1.5.85 వరకు యథా శాస్త్రముగ శ్రీవారి ఆధ్వర్యమున వైదికులచే వేదోక్తరీతి శ్రీచంద్రమౌళీశ్వర సుహాలింగ, కైలాసశివ, నవగ్రహప్రతిష్ఠ మహోత్సవము మంగళప్రదముగనడచెను. మహాత్ముల ఉపన్యాసకార్యక్రమములు జరిగెను. శ్రీ శెట్టి ఓబులపతిగారు గురుదైవ భక్తి భావనములచే ఈ మహాకార్యమును చేయించిరి. భక్తులందరును సహకరించిరి. నిత్య పూజానుష్ఠానాదులచే సర్వము సుసంపన్నమై వెలయుచున్నది.

## 41. వ శ్రీ చాతుర్మాస్య మహావ్రతము - 1985 సం॥ గంజిగుంట-రాయదుర్గము-ఆలమూరు-గుంతకల్లు

స్వస్తిశ్రీ క్రోధననామ సంవత్సర ఆషాఢ శుద్ధ ఏకాదశి ౨౮.౬.85 మొదలు కార్తిక శుద్ధ ద్వాదశి 24.11.85 వరకు అధిక శ్రావణముతో కూడ 5 మాసములు యథా శాస్త్రముగ మహావ్రతము ప్రారంభింపబడి త్రికాల పూజానుష్ఠానాదులచే ప్రస్థాన త్రయ ప్రవచన కార్యములు శుభప్రదముగ నడచి పూర్ణమాయెను.

గంజిగుంట శ్రీమఠమున పరమేష్ఠి గురు శ్రీ ప్రణవానంద సద్గురు మహాస్వాముల వారిచే విరచితంబైన కైవల్య నవనీతసార సంగ్రహమను గ్రంథప్రవచనము అపూర్వముగ నడచెను.

గుణవంతులగు రాయదుర్గం పేర్మితిమ్మప్ప మొదలగు ఎల్ల భక్తులు మరియు రాయదుర్గం వాసవీ కల్యాణ మందిరము ఆర్యవైశ్య సంఘము వారును కల్యాణమంటపమున కార్యక్రమ మేర్పరచి శ్రవణ పూజాద్యనుష్ఠానములందు పాల్గొని ధన్యులైరి. ఉపనిషద్గీతా శాస్త్ర ప్రవచనములు భాష్యసమ్మతిగ విపుల వివరణచే నడచినది. అందరు

మహదానందము నొందిరి.

గంజికుంట శ్రీమఠమునందు శ్రీవారి గురుదేవుల పుణ్యారాధన కార్యక్రమము మొదటివలె యథావిధి శుభప్రదముగ నడచెను. మహాత్ములేతెంచి యుండిరి. అనంతరము గీతాజయంతి మొదలగు కార్యక్రమములు మంగళప్రదముగ నడచెను.

ఈసంవత్సరము శ్రీవారు మార్గశీర్షమున శ్రీ గీతా జయంతి అయిన పిదప పూర్ణిమకు కృష్ణానదీ తీరము శ్రీఅమరావతీక్షేత్రమున విధ్యుక్తముగ విరమణ మొనర్చిరి. శ్రీఅమరావతీశ్వరుని యథాశాస్త్రముగ పూజించిరి.

గుంటూరు 'భక్తరత్న' శ్రీ ఎ. శాంతారాం దంపతులు భక్తిచే గుంటూరు తమపవిత్ర గృహం శ్రీసద్గురు సదనంలో శ్రీవారి శుభాగమమునకు వలయు అన్ని ఏర్పాట్లుజేసి బ్రహ్మచారులు మరి భక్తాదులందరితో కూడి అచట పూజాశ్రవణాదులు గావింపజేసిరి. పవిత్రమైన శ్రీశివకవచ గ్రంథ ద్వితీయ ముద్రణ చేయించిరి. బ్రహ్మశ్రీ పి. రామకృష్ణమూర్తి వెల్‌కంప్రెస్‌వారు గ్రంథావిష్కరణ మొనర్చిరి. పూజ్యశ్రీ గురుదేవులు గ్రంథములసందరికి నిచ్చిరి. కార్యక్రమము మహాశివప్రదముగ నడచెను.

పూర్వమహర్షులు భూత భవిష్యద్వర్తమాన కాలముల నెరుగుచుండిరను మాట అదివారి తపః ప్రభావమేగాని అది ఆత్మజ్ఞాన సంబంధమని ముముక్షువులు తెలియరాదు. ఈ సర్వమునకు స్వరూపము ఆత్మయే బ్రహ్మమే పరమాత్మయే.

సర్వత్ర వ్యాపకమైయుండు ఏకము బ్రహ్మమే దేహమునందు బుద్ధివృత్తి సాక్షియై చూచుచు నడుచుచు ప్రకాశించుచు నేను నేను అను పదముచే చెప్పబడును. అందువలన నేను నేను అనగా నిలిచి చూచినచో తత్త్వతః అది బ్రహ్మమే దేహాదులు కాదు

'ప్రజ్ఞానం బ్రహ్మ'

## 42. వ శ్రీచాతుర్మాస్య మహావ్రతము - 1986 సం॥

## గుంటూరు - పత్తికొండ ఆదవాని - కర్నూలు

స్వస్తిశ్రీ అక్షయ నామ సం॥ ఆషాఢ శుద్ధ ఏకాదశి17.7.86 మొదలు కార్తిక శుద్ధ ద్వాదశి 13.11.86 వరకు నాలుగుమాసములు మహావ్రతము పద్ధతి ప్రకారము విధ్యుక్తముగ ప్రారంభింపబడి ఉత్తమోత్తమరీతి శ్రీఉమామహేశ్వరుల కృపావిశేషమున సాంగమంగళమాయెను.

శ్రీవారు గుంటూరునకు శ్రీ శివానందస్వామి, మొదలగు బ్రహ్మచారులతో గూడి సుగుణ సంపన్నులగు 'భక్తరత్న' శ్రీ ఎ శాంతారాం ఇంజనీర్ కుం॥సౌ॥ సూర్యకుమారి పుణ్యదంపతుల పవిత్రగృహము శ్రీ సద్గురు సదనమునకు దయచేసిరి. పుణ్యాత్ములు మరియు వారి సహోదరులు శ్రీ జి. కోటేశ్వరరావు కుం॥సౌ॥ రాజ్యలక్ష్మమ్మ అందరు సర్వవిధముల శ్రీవారి పూజానుష్ఠాన శాస్త్రప్రవచనాది మహావ్రత కార్యాచరణకు వలయు అనుకూలమగు వ్యవస్థ లొనర్చి చూచుకొనిరి. వీరి భక్తిప్రపత్తు లెంతయు సంస్తుత్యములు

శ్రీ కె యస్.టి వి చైతన్య కుం॥సౌ॥ వసుంధరాదేవి ఉత్తమ దంపతుల "శ్రీసద్గురు గురుకృప" అనువీరి నూతనగృహప్రవేశ కార్యము సుముహూర్తమున నడచెను. శ్రీవారు ఇచటనే శ్రీగురుపీఠ పూజానుష్ఠాన శాస్త్రప్రవచనాదులు జరిపిరి.

విశేషముగ ఈనూతన గృహమునందు ఉమామహేశ్వరులకు-శ్రీచంద్రమౌళీశ్వరులకు లక్షబిల్వార్చన పూజాదులు నడచెను.

గుంటూరు భక్తులు భక్తితో శ్రీ వారి రచనయగు శ్రీజగద్గురు శంకరచరిత్ర మూడవ ముద్రణ గావింపజేసి యిదే సుముహూర్తమున గ్రంథావిష్కరణ గావింపజేసి భక్తాదులకు నొసగిరి.

ప్రస్థానత్రయ ప్రవచన కార్యము చాల చక్కగా జరుప బడెను. శ్రోత లెల్లరు పరమ సంతోషము నొందుచు ఇది అనుష్ఠాన సంపన్నమగు భాష్య శ్రవణమైయున్నది. మేమాదరము ధన్యులము. అని మరి మరి సంతసించిరి.

గుంటూరు కార్యక్రమము పూర్ణమైన పిదప పత్తికొండ శ్రీ జడే కుమారస్వామి భక్తి ప్రేమాతిశయముచే వారి పవిత్ర గృహ మున ప్రత్యేక భవనమునందు పూజానుష్ఠానములు, ప్రాతఃకాలపు శాస్త్రశ్రవణములు, అచటనే నడచెను. సాయంకాలము శ్రీవాసవీ కన్యకాపరమేశ్వరి దేవాలయమందు గీతాశాస్త్ర ప్రవచనము శివ ప్రదముగ నడచెను. భక్తాదులు పరమ సంతోషమొందిరి. పత్తికొండ అనేక భక్తులు అత్యుత్తమరీతి ఈ కార్యమునందు భాగము వహించి శ్రవణ పూజాది కార్యములందు పాల్గొని సేవజేసిరి.

ఇక ఆదవాని శ్రీగురు నిలయమునందు పట్టణ భక్తులు పరమ భక్తితో పూజానుష్ఠాన శాస్త్రశ్రవణాదులందు భాగము వహించి ధన్యులైరి. శ్రీ ఎల్. మల్లేశప్పగారి కుటుంబము వారందరు శ్రీ పార్వ తమ్మమ్మ మరియు శరణమ్మమ్మ మొదలగువారు అనన్యభక్తి శ్రద్ధ లతో ఈ బ్రహ్మ యజ్ఞమును శ్రీగురు నిలయమున జరిపిరి. వీరందరి భక్తిభావము లెంతయు సంపూజ్యములు.

మరియు కర్నూలు పట్టణము శ్రీసీతారాం నగరమందు అయితా శ్రీవెంకటశేషయ్యశ్రేష్ఠి, గుండా శ్రీకృష్ణమూర్తి శ్రీనారా యణశెట్టి. శ్రీ వి. శేషయ్యశెట్టి, శ్రీ విజ్ఞాన మందిర భక్తులు భక్తితో ఇచట పూజానుష్ఠాన ప్రవచనాది మహా కార్యములను వలయు సర్వ వ్యవస్థలనుజేసి, ఇవియొక గొప్ప పర్వదినములుగ భావించుచు ఆనంద ముతో కార్యమును సాంగమంగళ మొనర్చిరి. కుందనగుర్తి మహే శ్వర బ్రహ్మచారికి శ్రీప్రణవానందముని యను తురీయాశ్రమ శుభ నామము ప్రసాదింపబడెను. దీక్షావిరమణ కార్యమునందు ఉత్తరము

శ్రీ క్షేత్రము శ్రీ ఉమామహేశ్వరాశ్రమమునందు విధ్యుక్తముగ లక్ష బిల్వార్చన దీపార్చనాది కార్యములచే సాంగమంగళమై నడచెను.

'ధారణాద్ధర్మః' ధారణ పోషణ చేయునట్టిదే దర్మమము 'ధర్మో రక్షతి రక్షితః' ధర్మమును రక్షించిన అనగా దానిని విని తెలుసుకొని ఆచరణ శీలురై నడచినచో ఆధర్మము మనలను రక్షించును. ధర్మస్వ రూపమేమనగ ఆనందము, ఆనందము చేతనే ధారణ 'ఆనందేన జాతానిజీవంతి' ఆనందమే జనుల జీవనము ఆమూలముననే జీవించు చున్నది 'ఆనందో(బ్రహ్మ' ఆనందమే బ్రహ్మవస్తువు కావున ధర్మ స్వరూపమనగా ఆనందమే.

'ఏకమేవా ద్వితీయం బ్రహ్మ'యని శ్రుతిజెప్పుచున్నది. బ్రహ్మ వస్తువు (పరమాత్మ) సజాతీయ విజాతీయ స్వగతభేద రహితమైన ఒకే వస్తు బ్రహ్మస్వరూపము. 'యత్ర నాన్యః పశ్యతి నాన్యః శ్రుణోతి నాన్యః ద్విజానాతి భూమా' భూమైవ సుఖం ఎచ్చట అన్యము చూడబడదో, వినబడదో, తెలియబడదో, మరొకటి వేరుగ లేదో త్రిపుటి రహితమైన ఆస్థితియే భూమ. ఈ భూమా స్వరూపమే సుఖము. అట్టి బ్రహ్మ వివర్తయే యీ సమస్త జగత్తు. జగత్తె తోచున దెల్లయు ఆతడే. ఘటమని చెప్పబడినది మృత్తే. మృత్తుకు వినా ఘటము లేనట్లు 'ఇదగ్ం సర్వం యదయ మాత్మ' అని శ్రుతి. అందువలన నిర్మోహమైన బ్రహ్మ బుద్ధిచే అర్థాత్ దైవ

బుద్ధిచే నెరిగి వర్తించుటయే నిజధర్మ మనబడును. 'తత్త్వమసి' నీవు అదియై యున్నావు. అని వేదవాక్యము తెలుపు చున్నది.

'స్వనా ఆతనోతీతి సనాతనః' శాశ్వతమగు పరమాత్మస్వరూప విచార ప్రచార, ఆచారమును తెలిపి మానవుల జీవనమును ధన్యులుగ జేయునదే ధర్మమనిచెప్పబడును.మరియు'త్యజధర్మమధర్మంచ' అనిచెప్పి నపుడు యిచట స్వరూప నిష్ఠయని అర్థము. నైతిక, ధార్మిక, సామాజిక నీతి నియమముల నిచ్చి నిన్ను పరబ్రహ్మ స్వరూపినిగ చేయును. తదనుభవమును కలిగించును. అదే నీవును నేను సర్వము నైయున్నది.

ఈ మహావ్రత పూర్ణానంతరము శ్రీవారు తమ గురువుల పుణ్యారాధన పూజాకార్యక్రమములను గంజిగుంట శ్రీమఠమునందు శివప్రదముగ జరిపిరి. మహాత్ములందరు దయచేసియుండిరి 3 దినములు ఉపన్యాస కార్యక్రమములు అపూర్వముగ జరిగి మహామంగళ మాయెను. అనంతరము శ్రీ గీతాజయంతి మహోత్సవము గుంతకల్లు శ్రీ ఉమామహేశ్వరాశ్రమమునందు శివప్రదముగ నడచెను.

మహాశివరాత్రికార్యక్రమము శ్రీనిర్వాణమఠమునందు మంగళముగ జరిగెను.

ప్రభవ నామ సం॥ వైశాఖ శుద్ధ పంచమి లత్తరము శ్రీ క్షేత్ర ఉమామహేశ్వరాశ్రమమునందు శ్రీశంకర జయంతి మహోత్సవము యథారీతి వైభవోపేతమై ఆనందముగ నడచెను.

జ్యేష్ఠ బహుళ ఏకాదశి పరమేష్ఠి గురువుల పూజా ఆరాధన ద్వాదశి పరమగురువులపూజ, త్రయోదశి పూజ్యశ్రీ గురుదేవుల 68 వ జయంత్యుత్సవము శుభప్రదముగజరిగెను. 3 దినములు కార్యక్రమము విధ్యుక్తముగ వైభవోపేతముగ నడచెను. అనేక మహాత్ములు దయచేసి యుండి అపూర్వమగు ఆధ్యాత్మికోపన్యాసములు సలిపిరి. శ్రీమద్గిరిరాజ సూర్యసింహాసనాధీశ్వర ౧౦౦౮ శ్రీమజ్జగద్గురు ఉమాపతి పండితారాధ్య శివాచార్య మహాస్వాములవారు కృపతో దయచేసి అనుగ్రహ భాషణ మొనర్చి ఆనందింపజేసిరి.

## 43వ శ్రీ చాతుర్మాస్య మహావ్రతము - 1987 సం॥
## గంజిగుంట-గుంతకల్లు-నంద్యాల శ్రీనిర్వాణమఠము

స్వస్తిశ్రీ ప్రభవనామ సంవత్సర ఆషాఢశుద్ధ ఏకాదశి మంగళవారము ది. 7.7.87 మొదలు కార్తిక శుద్ధ ద్వాదశి సోమవారము 2.11.87 వరకు విధ్యుక్తముగ ఈ మహావ్రతము ఆయాస్థానములందు సాంగమంగళముగ నడచెను.

గంజిగుంట శ్రీమఠం శ్రీసద్గురు ప్రణవానందాశ్రమమునందు యథారీతి త్రికాల పూజానుష్ఠాన ప్రస్థానత్రయ శాస్త్రశ్రవణాదులు జరిగినవి. అటువలె గుంతకల్లు శ్రీ ఉమామహేశ్వరాశ్రమము, నంద్యాల శ్రీ ఉమామహేశ్వరాశ్రమము మున్నగు స్థలములయందు అత్యంత వైభవోపేతమై విధ్యుక్తముగ నడచెను.

శ్రీ ప్రభవనామ సంవత్సర ఆశ్వయుజ శుద్ధ విజయదశమి శుక్ర వారము 2.10.87 శుభముహూర్తమున లత్తవరం శ్రీక్షేత్ర ఉమా మహేశ్వరాశ్రమమునందు మహాద్వార నిర్మాణముసకు గాను శ్రీ గురుదేవులచే శంకుస్థాపన, శాస్త్రోక్తముగ జరిగెను. ఆశ్రమవాసు లగు గురు సేవానిరతులు శ్రీ శివానందస్వామివారు పూజాది వైదిక కార్యముల నిర్వర్తించిరి; మరికొందరు వైదికులు వచ్చియుండిరి.

బుక్కాపురము శ్రీ నిర్వాణమఠమున ఈమహావ్రత పూజాను ష్ఠాన శాస్త్ర శ్రవణాదులు నడచి ప్రభవకార్తిక శుద్ధ పూర్ణిమవ్రత దీక్షా విరమణ కార్యక్రమము యథారీతి విధ్యుక్తముగ జరిగి సాంగ మంగళమాయెను.

అనంతరము స్వస్తిశ్రీ ప్రభవనామ సం॥ కార్తిక బహుళ॥ ౧౦ సోమవారము 16.11.87 మొదలు కార్తిక బహుళ ద్వాదశి 18.11.87 బుధవారము వరకు 3 దినములు గంజిగుంట శ్రీమఠంలో మంగళప్రదముగ శ్రీవారి గురుదేవుల పుణ్యారాధన మహోత్సవము నడచెను. మహాత్ములందరు వేంచేసియుండిరి.

శ్రీ గీతాజయంతి మహోత్సవము గీతామూర్తి సన్నిధి గుంత కల్లు శ్రీ ఉమామహేశ్వరాశ్రమమునందు శివప్రదముగ నడచినది. శ్రీవారు బ్రహ్మనిష్ఠులై విరాజిల్లుచున్నారు ... ...

॥ శాసన స్తుతిః ॥

శ్రీమత్కైలాసనసంస్థా స్థిరతర పరమానంద సామ్రాజ్యప్రోద్య న్నందిస్కంద (సనత్కుమార) ప్రముఖ ప్రమథాచార్య వంశక్రమా త్సద్భక్తానీకావనేచ్ఛా ప్రవిమలతరబోధ స్వస్వవిజ్ఞాన సంపద్దీవ్యత్పీఠ ముఖ్యామహేశ్వర యుతం రారాజతే భారతే॥ సద్గురు పరంపరాయాం వేంకటరంగాభిదాన దేశికవరస్య సత్కృపయా పరిపూర్ణః ప్రణవా నందాఖ్య సంయమీ తిలకః తత్కరాంభోజ సంజాతో యోగివర్యః కృపామతిః సదానందయతీంద్రశ్చ బ్రహ్మణ్యాసక్తమానసః॥ సదానంద కరాంభో జసంజాతస్సర్వ శాస్త్రవిత్ బ్రహ్మనిష్ఠాగరిష్ఠశ్చ విద్వజ్జనము దావహః॥ శంకరానందగిర్యాఖ్యమానీంద్రస్సద్గురూత్తమః విరాజతేఽ ద్య పీఠేఽ స్మిన్భక్తానుగ్రహ కాంక్షయా॥

---

